# విషయసూచిక.



విషయము. | పుట.

## విరాటపర్వము

విషయము. ... పుట.

విషయము

శ్రీ ర స్తు.

# శ్రీమదాంధ్ర
# వచనమహాభారతము

## విరాటపర్వము

శ్లో. "నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమమ్,
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయముదీరయేత్."

### కథాప్రారంభము

జనమేజయనరేంద్రుఁడు వైశంపాయనమునీంద్రుని కిట్లనియె. "ఓమునీశ్వరా! మత్పూర్వపితామహులగు పాండవులు తమ్ము దుర్యోధనుఁ డెఱుఁగకుండ నెట్లు విరాటనగరమ్మున నజ్ఞాతవాసమ్ము గావించిరి? పతివ్రతయు నతిసుకుమారియు సంతతభగవచ్చింతనాధిరతయు నగు పాంచాలి దుఃఖభూయిష్ఠమగు నజ్ఞాతవాసక్లేశంబు నెట్లు నిస్తరింపం గలిగె?" అని ప్రశ్నింప నామునిసార్వభౌముండు "జననాయకా! నీదు ముత్తాతలగుపాండవులు విరాటనగరంబునఁ జల్పినయజ్ఞాతచర్యాప్రకారంబు సవిస్తరంబుగఁ దెల్పెద నాకర్ణింపు" మని యిట్లు చెప్పందొడంగె.

ధర్మాత్ముం డగు ధర్మనందనుఁడు తొల్లి చెప్పినరీతిని ధర్మదేవత వలన వరంబులు గైకొని, తనయాశ్రమంబు ప్రవేశించి, యచ్చటిబ్రాహ్మణులకుఁ దాను వరము లొందినవిధము సకలము నెఱింగించి, యరణిని విప్రున కొసంగి యాబ్రాహ్మణులవలన శుభాశీర్వాదంబులం బొందె. మఱియుఁ దనమనంబున నజ్ఞాతవాసకాలం బాసన్నంబగుట తెలిసి, తన తమ్ముల నొక్కచోఁ జేరంబిలిచి యిట్లనియె. "అర్జునా! రాజ్యముం బాసి

పండ్రెండుసంవత్సరము లడవులం గడపితిమి. దుస్సహంబగు నజ్ఞాతవాస మిప్పుడు సమీపించినది. నిందుగఁ బండ్రెండునెలలు పరులకుఁ దెలియ రాకుండ నుండునుపాయ మాలోచింపుము. పదియుమూఁడవయేఁడు నెవ్వఁ డే దేశమున వసించి కడముట్టింప నగునగునో యట్టి మంచిదేశము నొక్కదానిని జెప్పుమ" ని యనిన నంత నర్జునుండు "రాజోత్తమా! మనకు ధర్మదేవత యజ్ఞాతవాసంబు సుఖంబుగఁ జరించునట్లు వరము ననుగ్రహించెగదా? ఆవరప్రభావంబునం జేసి పరులకే కా దేవరులకును వాస్తవచరితం బెఱుకపడకుండ నజ్ఞాతవాసంబు గావింపంగలము. ఇంతకు సంశయింపం బనిలేదు. ఐనను మీ రానతిచ్చినట్లు మనోహరమ్ములు మంచిరక్షణము గలవియునగు కొన్ని దేశములం జెప్పెదను. కురుదేశములకుఁ బ్రాంతమ్ములందుఁ బాడిపంటలచేఁ గొఱలేని పాంచాల, చేది, మత్స్య, శూరసేన, పటచ్చర, దశార్ణ, నవరాష్ట్ర, మల్ల, సాల్వ, యుగంధర, కుంతి, సురాష్ట్రదేశంబులు నవంతిదేశమునుం గలవుకదా? ఈదేశములం దొక్కదానియందు వసించి యీయేఁడు కడపఁగలము. ఏదేశమ్మున వసించిన మన కధికసౌఖ్య ముండునో మీరే నిర్దేశింపుఁ" డని వచించె. అది విని ధర్మనందనుండు "వత్సా! నీవాక్యంబు లాలించితి. సర్వభూతేశ్వరుండగు ధర్మదేవుం డానతిచ్చినది యట్లే యగుం గాని వేఱువిధంబున గానేరదు. ఏయపాయములు వాటిల్లనుండ వసించుట కుం దగిన రమణీయంబగు దేశము మన మెల్లర మేకముఖమున నిర్ణయించు కొనవలయును. మత్స్యదేశాధీశ్వరుఁడగు విరాటుఁడు బలపరాక్రమ సంపన్నుఁడు, ధర్మశీలుఁడు, వదాన్యుఁడు, విద్యావయోవృద్ధుఁడు. ఎల్లవేళల మనకు మేలుగోరువాఁడు. కావున నీసంవత్సరమం దాతనికడ నుచితకార్యములు సల్పుచుఁ గాలము గడపుదము. అని వచించి వారల నెల్లఁ గలయం గనుంగొని "విరటునికడ మీర లెవ్వరేయేకార్యంబులు గావింప నొడంబడుదురో యాయాకార్యముల దెలియం గావింపుఁ" డని పలికె.

అంత నింద్రనందనుండు 'రాజకులాగ్రణీ! మృదుశీలుఁడవు, వదాన్యుఁడవు, శ్రీమంతుఁడవు, సంతతధర్మాభిరతుఁడవు, సత్యవచనుండ వగు నీ విట్టిఘోరం బగు నాపదలపాలు గావలసివచ్చెఁగదా! పరులవలనఁ బనిగొనుటయే కాని యెన్నఁడు నొక్కకార్యంబు గావించి

యెఱుంగవు. అట్టి నీవు విరాటనగరంబున నేపనులు చేయఁగలవు ? ఏవృత్తిచే జీవయాత్ర కడపెదవు? రాజాధిరాజులచే నూడిగంబులఁ గొను సార్వభౌముఁడ వగు నీవుకూడఁ బ్రాకృతపురుషునిమాడ్కి నొరులకుఁ బనులుసేయుటకంటె దుఃఖతర మేది కలదు ? నీ వీయాపద నెట్లు తరింపఁగలవో యని మామానసంబు తహతహనొందుచున్న' దని పల్కె. అదివిని ధర్మనందనుండు కంకుఁ డనుపేర బ్రాహ్మణవేషంబున నావిరాటునికి సభాస్తారుండ నయ్యెద. సువర్ణము వైడూర్యము దంతము మొదలగువానిచే నిర్మింపఁబడినపాచికలను, కృష్ణాక్షములు లోహితాక్షములును గొని ద్యూతక్రీడచే మంత్రిసామంత బంధుపరివృతుఁ డగు విరాటునిమానసంబు రంజింపఁజేయుదును. అట్టివేషంబున నున్న నాస్థితి నొరులెవ్వరు నెఱుంగఁజాలరు. విరాటుండు నాపూర్వవృత్త మడిగెనేని నేనింతకుమున్ను ధర్మాత్మజునకుఁ బ్రాణాధికంబగుమిత్రమనై యుంటినని వచించెద” ననిపలికి భీమసేను నవలోకించి 'నీవేకర్మచే విరాటు నారాధింపఁగలవో తెలుపు' మని పలికెను.

అప్పుడు వాయుదేవతాత్మజుండు “ రాజేంద్రా! నాకు సూదవృత్తిలో నధికతరంబగు ప్రజ్ఞ కలదు. వల్లవుఁడనుపేర వంటలవాఁడనై విరాటుని సేవించెద. అంతకుము న్నాతఁ డనుభవించిన చతుర్విధాన్నంబుల కంటె నధికరుచ్యంబులగువంటకములు గావించి యాతనిమనం బలరించెద. మిక్కిలి దృఢములగుకట్టియలంగూడ నశ్రమంబున నాయుధం బపేక్షింపకయే విఱిచెదను మహాభారంబులగు కట్టెలమోపుల ననాయాసంబుగ మోసి తెచ్చెద. అతిమానుషము లగు సాహసకార్యముల కచ్చెరువంది యానరపాలుండు విపులములగుకార్యముల నియోగించు తెఱంగున మెలంగెద. విరాట సేవకులు నన్నొకరాజుగాఁ దలంచువిధమున నన్నపానంబులయెడ నాధిపత్యంబు నెఱపుదును. రాజాజ్ఞ నంది మదోద్ధతంబులగు బలీవర్దంబులంగాని, కొమ్ముటేనుంగులంగాని, తలఁపడి యశ్రమంబున శిక్షించెద. మల్లవిద్యానైపుణి మెఱయ పేరెన్నికగన్న గన్నమల్లుర నవలీలఁ బరాజితులఁ గావించి, వారియుసురులం గొనక విడిచి రాజాదరమునకుఁ బాత్రుండనై మెలంగెద. ఆరాజు నన్ను ‘ నీ వెవ్వండ వింతకుము న్నెందుండినవాఁడ” వని ప్రశ్నించెనేని ధర్మనందనుని బానిసీఁడను. బాహాబలమున యుధిష్ఠిరుని మన్నన లందిన

వాఁడ నని నుడివెదను. నిగూఢముగా [illegible] నాకై మీరు కొందలమందం బనిలేదని పలికెను.

భీమసేనువాక్యములకుఁ బరమానంద మొంది కుంతీసుతాగ్రజుం డర్జును నాలోకించి' "కటకటా! మహాభావలుఁడవు, మహాబలుఁడవు, కురువంశనిస్తారకుండు నగు నీధనంజయుఁ డెట్లు దాస్యము నెఱపం గలఁడు? తొల్లి యగ్ని దేవుఁడు ఖాండవవనార్థియై స్వయముగ విప్రవేషమున నేతెంచి కృష్ణసహితుండ వగు నీతని నర్థించె. మహాస్త్రప్రార్థనంబు గాదనక యీమహాబలుఁ డొక్కరుండె [illegible]లను నసంఖ్యముగ బరిమార్చి యగ్ని దేవునిఁ దృప్తునిం గావించె. నాగకుల రాజగువాసుకిచెలియ లులూచికను గూఁతుర యగుపత్నిగాఁ బరిగ్రహించి యుత్తమకీర్తి వెలుంగుచుండె. ప్రతాపవంతుల సూర్యుండు, మనుజుల బ్రాహ్మణుండు, సర్పంబుల నాశీవిషంబు, తేజోవంతుల నగ్ని, ఆయుధముల వజ్రాయుధంబు, గోగణంబుల మహోక్షంబు, వృష్టిప్రదాతలఁ బర్జన్యుండు, నాగకులంబున ధృతరాష్ట్రుండు, మదగజంబుల నైరావతంబు, ప్రేమపాత్రులఁ బుత్త్రుండు, మిత్త్రులందు భార్య, పర్వతంబుల హిమవంతుండు, నదులను సముద్రుండు, దేవగణంబుల శతక్రతుండు, వసువులలో నగ్ని, మృగములలోఁ బుండరీకంబు, పక్షులలో గరుత్మంతుఁడు నెట్లు లధికులో యట్ల ధనుర్ధరుల కెల్ల నర్జునుం డధికుండు. వృకోదరా! యీతఁ డింద్రునకు సాటివాఁడు. వాసుదేవునికంటె నధిక తేజశ్శాలి. ఇట్టివాఁ డేకార్యము లెట్లు చేయఁగలఁడు? సురనగరమ్మున నైదేండ్లు వసించి దేవరూపుం డగు నీమహానుభావుండు సమస్తశాస్త్రాస్త్ర సంచయంబు సంపాదించె. ఈతఁడు పండ్రెండవవాఁ డగు రుద్రుండును, బదుమూఁడవవాఁ డగు నాదిత్యుఁడును, దొమ్మిదవవాఁ డగు వసువును, బదియవగ్రహము నన నొప్పును. సమములై దీర్ఘములగు బాహువులు జ్యాఘాతకిణాంకితములై వెలుంగొందు నీతండు ప్రచ్ఛన్నవృత్తి నెట్లుండఁగలఁడు?" అని విచారించు నగ్రజుం గనుంగొని కుంతీసుతమధ్యముండగు పార్థుండు "రాజోత్తమా! నావిషయమై మీరింతగా విచారింపఁబని లేదు. నాకనుకూలంబును సుకరంబునునగు నుపాయం బొండు కలదు. షండరూపముదాల్చి విరాటునావాసమ్మున మెలంగెద. ముంజేతుల నున్న వింటినారిదెబ్బలవలన జనించిన కిణములను గంకణములచే

నాచ్ఛాదించి మఱుఁగుపఱిచెద. హంతాశసశిఖాభంబులగు నీమణి మయకుండలమ్ములం దీసివైచి శంఖవలలమ్ములచేఁ గర్ణము లాచ్ఛాదించెద. ఏపంబున వేణిదాల్చి బృహన్నల యనుపేరఁ జరించెద. నారీజన యోగ్యమ్మగు నృత్తగీతవాదిత్రాదివిద్యాపారమ్మున నానరపాలుని, నాతని యంతఃపురస్త్రీజనమ్మును మిగులఁ బ్రియముపఱిచెద. రాజాంతఃపురాంగనలకు లెస్సగా సంగీతకము శిక్షించెద. బహుకర్మకృతం బగు ప్రజా సముదాచారం బెఱుంగుచు మాయచే నొరులు నన్నెఱుంగని చందంబున మెలంగెద. నరేంద్రుఁడు నన్ను నీవెక్కడిదాన వని యడుగుచో ధర్మనందనుమందిరమ్మున ద్రుపదరాజాత్మజకుఁ బరిచర్య లొనరించుచుఁ జిరకాల ముంటి నని నుడివెద. పూర్వకాలంబున నలసార్వభౌముండు రూపాంతరమ్మునఁ జరించినట్లు మాయచే విహరించు నన్నొరు లెఱుంగంజాల" రని పలికె.

పిదపఁ గుంతీసుతాగ్రజుండు నకులుం గనుంగొని 'వత్సా! నీవు మిక్కిలి సుకుమారుండవు, శూరుండవు, సుఖోపభోగయోగ్యుండవు. నీ వేనియోగంబున నారాజు నసువర్తింపఁగలవో యెఱింగింపు'మనియె. అది విని నకులుండు "పార్థివాగ్రణీ! నేను విరాటనగరమున నశ్వశిక్షావిద్యా పారమునఁ జరింతును. దామగ్రంథి యనుపేర వర్తించుచు నాతనితురంగంబుల కనామయంబు కాఁ జికిత్ససేయుచు శిక్షకుఁడవుచు మెలంగెద. నీకుంబోలె నాకును నశ్వంబులందుఁ బ్రీతి మెండుగా నుండు. నాకశ్వ వైద్యకమునం దధికనైపుణి కలదుగదా? దానంజేసి విరాటు ననుగ్రహంబు నడసి హయశాలాధికారినై యజ్ఞాతవాసవత్సరంబు గడపఁగలవాఁడ. నన్నెవ్వరే నెక్కడివాఁడ వనియడుగునెడలఁ గుంతీతనయుని నిశాంతమ్మున నశ్వాధికారినై యుండెడివాఁడ నని చెప్పి యొరుల కెఱుకపడకుండఁ జరింతు నని చెప్పెద" నని వచించెను.

తదనంతరము పాండవాగ్రజుఁడుసహదేవు నవలోకించి 'ప్రియానుజా! నీ వెట్లు లావిరాటు నారాధించి యజ్ఞాతవాసం బొనరింపఁగల'వని యడిగెను. దానికిఁ గుంతీసుతావరజుండు "రాజాగ్రణీ! నేను గవాధ్యక్షుండనై యానరపాలు సేవింపఁగలను. ఆలకదుపులపాలుపిదుకుట యందు నాకధికముగ నేర్పు గలదు. తంత్రీపాలుఁ డనుపేరఁ బరానభిజ్ఞాతంబుగ మెలంగెద. దీనికై మీరు వగవం బనిలేదు. మున్ను భవ

వసుజ్ఞాతుండనై గోరక్షణము గావించియుంటినిగదా! సకాలమునంద నాకు గోవులలక్షణంబులెల్లఁ దెల్లమైనవి. గోవులమంగళచరితములు లక్షణములు సకలముగ నెఱింగితి. ఏ బలివర్దంబులమూత్రము మూర్కొనినం నంతనే గొడ్డుటావులు సైతము చూలాలు తాల్చునో యట్టిపుణ్యలక్షణ ములుగల యాఁబోతులజాడ లెఱుంగుదును. నాకెల్లకాలంబు గోవుల నరయుటయం దధికప్రీతియుండు. ఆవృత్తి నాలంబించి తంత్రీపాలుం డనునామువేర విరాటుసేవించు నన్నితరు లెఱుంగ సమర్థులుగా" రని చెప్పెను.

అంత శమననందనుండు ద్రుపదరాజపుత్త్రి నాలోకించి, "యీ ద్రౌపది మనకుఁ బ్రాణాధిక ప్రీతిపాత్రమగుభార్య. దీనిని దల్లివలెఁ బాలింపవలయును. అక్కవలెఁ బూజింపవలయు. పుత్త్రినిమాడ్కి లాలింప వలయును. లోకమందలి యితరకాంతలవలె నిది యేపనులును జేయ నెఱుంగదు. అత్యంతసుకుమారి బాల, మహారాజకుమారి, పతివ్రతయు నగు నీద్రుపదాత్మజ యేపనులచే విరాటు సేవింపఁగలదు! పూలమాలి కలు కలపంబులు భూషణములు వివిధంబులగువస్త్రంబులు దక్క నితర వస్తువు లెట్టివో యెఱుంగదు. కటకటా! యిట్టి ఆదిగర్భేశ్వరి యొరుల సేవింపవలసివచ్చెఁగదా?" యని శోకాక్రాంతుఁడై యుండె. అపుడు యాజ్ఞసేని ధర్మనందను నూరడించి "రాజేంద్రా! నన్నుఁ దలంచి మీ రింతచింతింపనేల? లోకమ్మున దాస్యమ్ము నెఱపువారైనను సైరంధ్రులు నీచకార్యమ్ము పొంతలంబోక పవిత్రతం గాపాడుకొందురని వినుచున్నాముగదా? ఇతరదాసీవనితలు సైరంధ్రులవలె మానరక్షణ మం దసమర్థలనుట లోకప్రసిద్ధము. నేను తలదువ్వి ముడుచుటయందు నేర్పు ప్రకటించి యితరాజ్ఞాతంబుగ మెలంగెద. యుధిష్ఠిరునిరాణి ద్రౌపదికిఁ బరిచర్యసేయుచుండెడిదాన నని వచించి రాజానుమతివడసి యాతని దేవేరి యగు సుధేష్ణను సేవింతును. రహస్య మొరు లెఱుంగకుండు లాగున నాత్మరక్షణము గావించికొందును. విరాటునిమహిషిసుధేష్ణ నన్నెల్లవిధములం గాపాడును. కావున మన్నిమిత్తంబుగ జనించిన దుఃఖము విడువు" మని పలికెను. ఆపలుకుల కలరి యుధిష్ఠిరుండు "బాలా! నీవు జనించినయుత్తమరాజర్షికులమ్మున కనురూపమ్ములగు మంగళవచ నములు పలికితివి. సంతతము సన్మార్గమునఁ జరించుచుఁ బాపకర్మమ్మున

నెట్టిదియో యెఱుంగకున్న దానవు. పాపస్వభావు లగు మనవిరోధుల యాశల కెడమీయక ప్రవర్తింపవలయును. పరు లెంత ప్రయత్నించి నను వారి కీసుమంతయే నెఱుఁగఁబడకుండ వర్తింపుము" అనిపలికి వారలనెల్లఁ గలయ నీక్షించి "దైవయోగంబునం జేసి నాబుద్ధి నిశ్చయమున కనుగుణమ్ముగురీతిని మీ రెల్లరు నుచితకార్యములు సేయ నిశ్చయించితిరి. మహాత్ముండు పూజ్యుండు నగు మన పురోహితుండు ధౌమ్యుండు సూతపౌరోగవులందోడ్కొని ద్రుపదనగరంబున కేఁగి యందగ్నులరక్షించుచుండెనుగాక. ఇంద్రసేనాది మంత్రులు కేవలశూన్యమ్ములగు రథంబులం గొనిపోయి ద్వారవతీనగరంబునకుఁ ద్వరితంబుగ నేఁగునది. ద్రౌపదినిఁ గొల్చుపరిచారికాజనమెల్లఁ బాంచాలనగరమ్మున కేఁగునది. వీ రెల్లరుంగూడఁ బాండవులు మా కెఱుకపడకుండఁ గను బ్రామి ద్వైతవనమ్మునుండి యెటకో వెడలిపోయిరి. ప్రయత్నించియు వారలం గానక మేము తిరిగివచ్చితి మని ప్రకటింపవలయును." అని వారివారందఱకు వేర్వేఱ బోధించి వారివారిని యోగంబుల నెఱింగించెను.

అనంతరము పాండవులెల్లరు ధౌమ్యునకు నమస్కరించి ప్రాంజలులై సెలవందుకొనునంతట నాబ్రాహ్మణోత్తముండు పాండవులహితంబు గోరువాఁడగుట వారికి మున్ముందు కార్యంబులు నెఱపుసమయంబునఁ బ్రవర్తించునెడ నుపయోగించువాక్యంబు లిట్లుపదేశించెను. "ధర్మనందనా! బ్రాహ్మణులకు మిత్రులకుం జేయఁదగుసత్కారంబు లాచరించితిని. వాహనంబులకు నాయుధంబులకు నగ్నులకును మంగళాలంభనములుఁ గావించితిని. నీవు నర్జునుండు నెల్లవేళల నెల్లభంగుల నేమరుపాటులేక యీద్రుపదాత్మజను రక్షింపవలయును. మీరు లోకవృత్తమ్ము నశేషముగ నెఱుంగుదురు. మిత్రులగువారు స్నేహాతిరేకంబున విదితపూర్వంబులగు విషయంబులైనను మరలమరల బోధింతురు. దానివలన ధర్మార్థకామంబులు సుఖప్రాప్యంబులగును. కావున మీయెడ నత్యంతానురాగంబు గలనేనును ముందు మీరొనరింపవలసియున్న రాజసేవ నుద్దేశించి కొంచెము తెలిపెదను. నాయుపదేశంబు ననుసరించిచరించిన మిమ్మాపదలుం బొరయఁజాల" నని పలికి వారికి రాజసేవాధర్మంబు లెఱింగింపం దొడంగె.

### ధౌమ్యుండు పాండవులకు రాజసేవాధర్మంబులు చెప్పుట

బిడ్డలారా! రాచనగరవసించుట మిగులఁ గష్టకార్యము. మీరు
మానావమానములగణింపక పరులకెఱుఁగ రాకుండ నొక్కయేఁడు వసిం
చితిరేని, మీ రొనరించిన ప్రతిజ్ఞ సంతరించితిరేనిఁ, బిదపఁ బదునాలుగవ
యేట సుఖంబుగఁ జరింతురు. సేవకుండు మొదటఁ దన రాక నరపాలు
నకుఁ బ్రతీహారులచేత నెఱింగించి రాజానుమతిం గొని సభాప్రవేశంబు
సేయవలయును. రహస్యవిషయములందు విశ్వసింపం జనదు. పరులెవ్వరు
నాసపడని యాసనంబున నుపవేశింపవలయు. తాను రాజమన్నన నంతగాఁ
గడించినను నరపాలుం డెక్కువాహనం బెక్కరాదు. అతనిపర్యంకంబున
బండుకొనరాదు. ఒడయనిపీఠంబునఁ గూర్చుండఁదగదు. రాజు సేనుంగు
నారోహింపవలదు. జననాయకు నరదం బధిష్ఠింపం జనదు. ఇట్లు మెలఁకువ
తోఁ బ్రవర్తించువానికి రాజసేవ సుకరంబై యుండును. ఎచ్చోటఁ
గూర్చుండిన దుష్టచారులు శంకింతురో యాతావున నుపవేశింపఁ గూడదు.
ఎప్పుడును రాజు ననుశాసింపరాదు. సమయము ననుసరించి యాతనిఁ
బూజించుచుండవలయును. నరపతు లసత్యవచనములు పలుకుజనుల
నసూయచే భంగపఱుతురు. మంత్రుల ననృతమాడువారినిఁ దప్పక
యవమానింతురు. ప్రాజ్ఞుఁ డెన్నండును రాజుభార్యలతోడి చనవుగలిగి
యుండఁగూడదు. అంతఃపురాంగనలతోడను, దన్ను ద్వేషించుజనుల
తోడను జెలిమిసేయఁజనదు. కొంచెపుఁగార్యములైనను రాజున కెఱిం
గింపక స్వతంత్రించి చేయఁగూడదు. ఏకార్యమైనను రాజునకుఁ దెల్పి
యే చేయవలయును. ఈసరణి ననువర్తించువానికి రాజనగరమున హాని
సంభవింపకుండును. తా నెంతటియున్నతోద్యోగము నొందియున్నను
దన్నడుగనిచోఁ, నియోగింపనిచోఁ, దన్ను బుట్టుగ్రుడ్డివానివలె భావించు
కొని మిన్నకుండవలయునే కాని తాను స్వతంత్రించి యేకార్యమునను
బ్రవర్తింపరాదు. ఇది రాజమర్యాదగా నెఱుంగునది. రాజులు మర్యాద
మీఱినకుమారునైనను మనుమనినైనను సోదరునైనను నవమా
నింతురు. భూపాలుని దేవతనుబోలె నగ్నినివలె మహాప్రయత్నంబున
నుపచరింపవలయు. అతఁ డపకారుల నగ్నివలె దహించును. ఉచితరీతి
సేవించువారిని దేవతవలెఁ గాంచును. అసత్యమార్గమున రాజు నుప
చరించువాఁడు రాజాగ్రహంబునకు గుఱియై వధింపఁబడును. కావునఁ

కోపము, ప్రమాదము, గర్వము, జాడ్యము మొదలగుదుర్గుణంబులు వీడి
సన్న్యాసమున రాజును సేవింపవలయును. ఏలిక యేయేకార్యంబుల నాజ్ఞా
పించునో వానినెల్లఁ గనుభక్తమై శ్రద్ధతో నాచరింపవలయును. ఏదైన
నొక్కవిషయము రాజున కెఱింగింప సమకట్టినచో నాతనికిఁ బ్రియంబు
హితంబునగుదానినే తెలుపవలయును. ఒక్కొక్కతఱిఁ బ్రియంబు కంటెను
హితంబే యెఱింగింపఁజెల్లును. ఎల్లకార్యములందును నధిపతికిని
సాఫల్యంబు సంపాదింపవలయును. ఎన్నండు నప్రియంబు నహితంబు
నగువిషయము నుడువం జనదు. ఎన్నండును నేను రాజునకుఁ బ్రీతి
పాత్రుండనైతి నని తలంపందగదు. సంతతంబును బరాకువీడి యేలిన
వానికి హితంబుఁ బ్రియంబు నాచరింపఁదగును. రాజున కనిష్టంబు
లగు కార్యంబు లెన్నండు నాచరింపఁగూడదు. రాజవిరోధులంగూడి
యొకప్పుడును జరింపరాదు. సభయందుఁ దనస్థానంబు నెన్నఁ
డును వీడరాదు. భూపాలకుని కుడిప్రక్కనుగాని యెడమప్రక్కను
గాని యుపవేశింపఁదగును. రాజునకుఁ గట్టెదుటఁ గూర్చుండఁగూడదు.
పిఱుందిభాగము శస్త్రధారులగు రాజభటులకు నిర్ణీతమగుటం జేసి
యచ్చోటఁ గూర్చుండఁజెల్లదు. రాజదర్శనావసరమ్మున నొక్కింతయుఁ
బ్రవృత్తి తెలుపరాదు. దరిద్రుల కప్రియంబులగువార్త లెన్నఁడును
బలుకఁగూడదు. నరపాలుఁ డితరులవిషయమునఁ బలికిన ప్రియాప్రియం
బుల నెవ్వరును బ్రకటింపఁగూడదు. అసత్యవాదులగు మానవులను
రాజులు ద్వేషింతురు. పండితమ్మన్యుల నవమానింతురు. తాను శూరుం
డనియేని బుద్ధిమంతుండనియేని నెవ్వండును గర్వింపఁజెల్లదు. ఎప్పుడును
రాజునకుఁ బ్రియంబులగు కార్యంబులనే యాచరించుచోఁ దానును
రాజభోగంబు లనుభవింపంగల్గును. రాజునకుఁ బ్రీతిపాత్రమై దుర్లభ
మగునైశ్వర్యము పొందియును నరపాలునియాప్తజనంబులందును రాజ
హితులందును నప్రమత్తుండై యుండఁదగును. భూపాలునకుఁ గోప
మొదవించెనేని మహాబాధలం గలిగించును. మహీపాలున కనుగ్రహంబు
వొడమెనేని మిక్కుటంబులగుఫలంబుల నొడఁగూర్చును. కావున
నెవ్వండును వసుమతీశ్వరున కప్రియంబు లాచరింపక హితకార్యంబులే
చేయుచుండవలయును. రాజునెదుటఁ బెదవుల విఱువరాదు. భుజములఁ
జాపఁగూడదు. మోకాళ్లు నిక్కింపఁదగదు. పొరపాటుమాట లనఁ

### ధౌమ్యుండు పాండవులకు రాజసేవాధర్మంబులు చెప్పుట

బిడ్డలారా! రాచనగరవసించుట మిగులఁ గష్టకార్యము. మీరు
మానావమానములఁగణింపక పగలురేయుఁగ రాకుండ నొక్కయేఁడు వసిం
చితిరేని, మీ రొనరించిన ప్రతిజ్ఞ సంతరించితిరేనిఁ, బిదపఁ బదునాలుగవ
యేఁట సుఖంబుగఁ జరింతురు. సేవకుండు మొదటఁ దనరాక నరపాలు
నకుఁ బ్రతీహారివలన నెఱింగించి రాజానుమతింగొని సభాప్రవేశంబు
సేయవలయును. రహస్యవిషయములందు విశ్వసింపం జనదు. పరులెవ్వరు
నాసపడని యాసనంబున నుపవేశింపవలయు. తాను రాజుమన్నన నెంతేని
గడించినను నరపాలుం డెక్కువాహనం బెక్కరాదు. అతనిపర్యంకంబును
బండుకొనరాదు. ఒడయనిపీఠంబునఁ గూర్చుండఁదగదు. రాజు నేయేనుఁగు
నారోహింపవలదు. జననాయకు నగరం బధిష్ఠింపం జనదు. ఇట్లు మెలఁకు
వతోఁ బ్రవర్తించువానికి రాజసేవ సుకరంబైయుండును. ఎచ్చోటఁ
గూర్చుండిన దుష్టచారులు శంకింతురో యాతావున నుపవేశింపఁ గూడదు.
ఎప్పుడును రాజు ననుశాసింపరాదు. సమయము ననుసరించి యాతనిఁ
బూజించుచుండవలయును. నరపతు లసత్యవచనములు పలుకుజనుల
నసూయచే భంగపఱుతురు. మంత్రుల ననృతమాడువారినిఁ దప్పక
యవమానింతురు. ప్రాజ్ఞుఁ డెన్నండును రాజుభార్యలతోడి చనవుగలిగి
యుండఁగూడదు. అంతఃపురాంగనలతోడను, దన్ను ద్వేషించుజనుల
తోడను జెలిమిసేయఁజనదు. కొంచెపుఁగార్యములైనను రాజున కెఱిం
గింపక స్వతంత్రించి చేయఁగూడదు. ఏకార్యమైనను రాజునకుఁ దెలి
పియే చేయవలయును. ఈసరణి ననువర్తించువానికి రాజనగరమున హాని
సంభవింపకుండును. తా నెంతటియున్నతోద్యోగము నొందియున్నను
దన్నడుగనిచో, నియోగింపనిచోఁ, దన్ను బుట్టుగ్రుడ్డివానివలె భావించు
కొని మిన్నకుండవలయునేకాని తాను స్వతంత్రించి యేకార్యమునను
బ్రవర్తింపరాదు. ఇది రాజమర్యాదగా నెఱుంగునది. రాజులు మర్యాద
మీఱినకుమారునైనను మనుమనినైనను సోదరునైనను నవమా
నింతురు. భూపాలుని దేవతనుబోలె నగ్నినివలె మహాప్రయత్నంబున
నుపచరింపవలయు. ఆతఁ డపరాధుల నగ్నివలె దహించును. ఉచితరీతి
సేవించువారిని దేవతవలెఁ గాంచును. అసత్యమార్గమున రాజు నుప
చరించువాఁడు రాజాగ్రహంబునకు గుఱియై వధింపఁబడును. కావునఁ

గోపము, ప్రమాదము, గర్వము, జాడ్యము మొదలగు దుర్గుణంబులు వీడి సన్నాహమున రాజును సేవింపవలయును. ఏలిక యేయే కార్యంబుల నాజ్ఞాపించునో వానినెల్లఁ గనుభక్తిమై శ్రద్ధతో నాచరింపవలయును. ఏదైన నొక్క విషయము రాజున కెఱింగింప సమకట్టినచో నాతనికిఁ బ్రియంబు హితంబునగు దానినే తెలుపవలయును. ఒక్కొక్కతఱిఁ బ్రియంబు కంటెను హితంబే యెఱింగింపఁ జెల్లును. ఎల్ల కార్యములందును నధిపతి యానుకూల్యంబు సంపాదింపవలయును. ఎన్నండు నప్రియంబు నహితంబు నగు విషయము నుడువం జనదు. ఎవ్వండును నేను రాజునకుఁ బ్రీతిపాత్రంబనైతి నని తలంపఁదగదు. సంతతంబును బరాకు వీడి యేలిన వానికి హితంబుఁ బ్రియంబు నాచరింపఁదగును. రాజున కనిష్టంబులగు కార్యంబు లెన్నండు నాచరింపఁగూడదు. రాజవిరోధులం గూడి యెకప్పుడును జరింపరాదు. సభయందుఁ దనస్థానంబు నెన్నఁడును వీడరాదు. భూపాలకుని కుడిప్రక్కనుగాని యెడమప్రక్కనుగాని యుపవేశింపఁదగును. రాజునకుఁ గట్టెదుటఁ గూర్చుండఁగూడదు. వెనుకటిభాగము శస్త్రధారులగు రాజభటులకు నిర్ణీతమగుటం జేసి యచ్చోటఁ గూర్చుండఁ జెల్లదు. రాజదర్శనావసరమ్మున నొక్కింతయుఁ బ్రవృత్తి తెలుపరాదు. దరిద్రుల కప్రియంబులగు వార్త లెన్నఁడును బలుకఁగూడదు. నరపాలుఁ డితరులవిషయమునఁ బలికిన ప్రియాప్రియంబుల నెప్పుడును బ్రకటింపఁగూడదు. అసత్యవాదులగు మానవులను రాజులు ద్వేషింతురు. పండితమ్మన్యుల నవమానింతురు. తాను శూరుండని యేని బుద్ధిమంతుండని యేని నెవ్వండును గర్వింపఁ జెల్లదు. ఎప్పుడును రాజునకుఁ బ్రియంబులగు కార్యంబులనే యాచరించుచోఁ దానును రాజభోగంబు లనుభవింపంగల్గును. రాజునకుఁ బ్రీతిపాత్రమై దుర్లభమగు నైశ్వర్యము నొందియును నరపాలుని యాప్తజనంబులందును రాజహితులందును నప్రమత్తుండై యుండఁదగును. భూపాలునకుఁ గోపముదయించెనేని మహాబాధలం గలిగించును. మహీపాలున కనుగ్రహంబు వొడమెనేని మిక్కుటంబులగు ఫలంబుల నొడఁగూర్చును. కావున నెవ్వండును వసుమతీశ్వరున కప్రియంబు లాచరింపక హితకార్యంబులే చేయుచుండవలయును. రాజు నెదుటఁ బెదవుల విఱువరాదు. భుజములఁ జాపఁగూడదు. మోకాళ్లు నిక్కింపఁదగదు. పొరపాటుమాట లనఁ

జెల్లదు. ఊపిరివిడుచుట మాటలాడుట మొదలగునవి యితరులకు వినఁబడ
కుండ తెలియకుండున మెల్లగ నాచరింపవలయును. ఎంతటిసామర్థ్యకారణంబు
లున్నను విగ్గఱగా నవ్వఁగూడదు. వెఱ్ఱివానివలెఁ బకపక నవ్వఁదగదు.
తానెంతధీయుక్తుఁడైన నతిస్థైర్యము ప్రకటింపవలదు. ఇట్లు రాజును సేవించు
వాఁడు రాజాదరమునకుఁ బాత్రుండై రాజగౌరవంబునొంది రాజ
భోగంబులు చిరకాల మనుభవించును. ప్రమాదంబు నొందక యెల్లప్పు
డును మోమునఁ జిఱునగవు ప్రకటింపవలయు. దుర్లభవస్తులాభంబునం
దైన గాఢంబుగఁ బ్రహర్షింపఁజనదు. దుర్భరావమానము సంభవ
టిల్లినప్పుడైనను దుఃఖింపఁగూడదు. ఎన్నఁడును మర్మస్థానము నవలం
బింపఁదగదు. ఇట్లు చరించువాఁడు రాజసేవ చిరకాలమొనరించుచు
సుఖింపఁగల్గును. రాజును రాజపుత్రులు నెల్లవేళలమెచ్చునట్టిహితుఁడు
చిరకాలము మంత్రిపదవి నధిష్ఠించి రాజసత్కారములు వడయఁగాంచును.
ఎవ్వఁడు నరపాలునిచే ననుగ్రహింపఁబడినను నిగ్రహింపఁబడినను నిర్భర
సంతోషనిర్వేదంబు లొందఁడో యాతఁడు చిరతరసంపదల నొందును.
రాజసేవకులును రాష్ట్రవాసిజనంబులు నెల్లపుడు ప్రత్యక్షమందును
బరోక్షమందునుగూడ నరపాలునిసుగుణంబులే ప్రస్తుతించుచుండవల
యును. బలాత్కారముగా నెవ్వఁడు రాజభోగంబు లనుభవింపఁ
గోరునో వాఁడు చిరకాలము తనపదవియందుండఁజాలఁడు. మఱియును
నాతఁడు ప్రాణహానిం గూడఁ బొందును. రాజునకు హితమైనను నేర్పు
మెయి నెఱింగింపవలయునే కాని యొక్కవిషయమునందైన యాతనితోఁ
బెద్దకాలంబు వివాదంబుసేయందగదు. యోగ్యస్థలంబుల రాజు నెల్ల
పుడుఁ గొలిచియుండవలయునే కాని యెడఁగలుగఁ దొలఁగి యుండ
రాదు. పనిగలిగినయెడల బడలిక విడిచి బలమును శౌర్యము ప్రకటించి
నీడవలె రాజును వీడకుండుట శ్రేయస్కరము. శాంతుండై మార్దవముం
బూని యెల్లవేళ సత్యమునే వచియింపఁదగును. అట్టివాఁడు రాజు
మన్ననలు గడించును. ఏదేనొక్కపనికై యితరుల నంపుచున్నను దానే
యాకార్యము సేయుదునని యెవ్వఁడాయత్తపడునో వాఁడు రాజ
సత్కారములు వడయును. రాజాజ్ఞప్తకార్య మెట్టిదైనను బాహ్యాం
భ్యంతరముల నిర్వికారుండై యాచరింపఁజెల్లును. రాజకార్యంబునకై
ప్రవాసక్లేశ మనుభవింపవలసివచ్చినను దనదారపుత్రాదిచింత మనం

బునఁ జొఱనీక నిర్దిష్టకార్యంబు నెఱవేర్పవలయును. దుఃఖాకరమగు రాజసేవనలను సౌఖ్యమే లభించునని యెవ్వఁ డాశించునో వాఁడు రాజసభాంతరమునఁ జిరకాలము గౌరవింపఁబడును. రాజమందిరమునకు సమానమగురీతినిగాని యధికమగురీతినిగాని యత్యున్నతముగాఁగాని తనయిల్లు కట్టరాదు. రాజప్రాసాదంబునకు సమీపంబునఁ దనయిల్లు కట్టుట యుచితంబుగాదు. రాజసమీపంబున బిగ్గఱగా నవ్వఁగూడదు. రాజరహస్యము నేకాంతముగా నుంచవలయునే కాని పలువురకుఁ బ్రకటింపరాదు. అధికారమందు నియోగింపఁబడినవాఁ డయ్యు రాజధనము నించుకంతైనఁ దాఁకరాదు. రాజధన మపహరించినవాఁడు కారాగారక్లేశంబునేని వధంబునేనిఁ బొందును. రాజదత్తంబులగు వాహనంబులలంకారంబులు వస్త్రంబులు నింక నేవే నితరవస్తువులు నున్నచో వానినే యెల్లప్పుడు నుపయోగింపవలయును. దానం జేసి నరపాలుండు మిగులఁ బ్రీతుఁడగును. ఇవ్విధంబున మీమానసంబుల బాగుగా వశమున నుంచుకొని యీవత్సరమును గడపుఁడు. పిదప మీరాజ్యముఁబొంది మీయిచ్చవచ్చినట్లు మెలంగెదరుగాక." అని యిట్లు ధౌమ్యుం డమ్మహానీయులకు సేవాధర్మంబెఱింగింప దానినంతయు సావధానుఁడై యాకర్ణించి ధర్మనందనుఁడు 'మహాత్మా! ఇట్టి నీతివాక్యములను మాయెడఁ బ్రసన్నులగు తామును, మాజననియగు కుంతియును, మాయెడ నవ్యాజానురాగముగల విదురుఁడునుదక్క నొరు లెవ్వరును వచింపఁబూనరు. ఇట్టి దుస్తరములగునాపదల నుత్తరించి జయంబు చేకొన ననువైన కార్యజాతమును మాకెఱిఁగింపవలయును' అని సవినయముగఁ బ్రశ్నించెను. అంత నాధౌమ్యుండు ప్రస్థానమంగళకార్యజాతమునంతయును నెఱవి యగ్నుల వ్రేల్చెను. ద్రౌపదితోఁ గూడి మీతాత లేవురును విజయలాభములఁ గోరుచు నాయగ్నులకును, మునులకును, బ్రాహ్మణోత్తములకును బ్రదక్షిణముల నాచరించి బయలువెడలిరి. ఇట్లు పాంచాలీసహితులగుపాండవు లజ్ఞాతవాసమునకై కదలఁగా, ధౌమ్యుఁ డగ్నులఁ బరిగ్రహించి పాంచాలదేశమునకుఁ జనియెను. ఇంద్రసేనాదులును ద్వారకానగరంబునకుఁ బోయి రథాశ్వాదుల రక్షించుచు సుఖంబుండిరి.

పాండవులు వైరాటనగరంబు చేరుట

తనుత్రాణశిరస్త్రాణాది పరికరములు ధరియించి ధనుర్ధరులై యస్త్రమహానీకములు వనదుర్గముల నిరుచుక విశ్రమించి సేవఁజేయుచు, మృగయావినోదంబుల నుల్లసిల్లుచు ఫలమూలాదులచే శరీరయాత్ర నిర్వహించుచు పయనంబు సాగించి, దశార్ణదేశంబుల కుత్తరంబునను, పాంచాలదేశంబునకు దక్షిణంబునను, శూరసేనదేశంబులకు మధ్యంబునను మత్స్యదేశంబు సొచ్చిరి.

అంత ద్రౌపది ధర్మజుం గాంచి "బహువిధములగుమార్గములును ఫలపూర్ణములగు కేదారములును గానవచ్చుచున్నయవి. విరాటనగరము దూరముగా నుండునోపు. నే మార్గాయాసమునఁ గడుం బడలితిని. కావున నిచ్చట నీరాత్రిగడపుదము" అన ధర్మనందనుఁ డర్జునుం గాంచి 'యీయడవి దాటునంతకు నామెను మోచికొనిర'మ్మని నియోగింప గంధగజంబువోలె నర్జునుం డయ్యిభరాజగమనను వనంబు దాటించి విరటనగరిసమీపంబున డించె. పిమ్మటధర్మజుం డర్జునుంగాంచి "పాండవమధ్యమా! మన మీయాయుధంబులతోడనే పురంబు ప్రవేశించిన జను లెల్లరును శంకాకులితు లగుదురు. మిక్కిలి మేటియగు నీగాండీవంబు జనులకెల్లరకును సువిదితంబై యుండుఁ గాన దానిచే మనల గుర్తింపనేర్తురు. అట్లు వారు గుర్తించి 'రేని 'మాలోనొక్కని నేని గుర్తింపఁగలిగిన మరలఁబండ్రెండువత్సరంబులువనవాసంబును, నొక్కయేఁ డజ్ఞాతవాసంబును జేయంగలవార' మని దుర్యోధనుని కిచ్చినబాసంబట్టి మనము గ్రమ్మఱ వనవాసాజ్ఞాతవాస క్లేశముల భరింపవలసివచ్చును. గావున నట్టిదేదియు సంఘటిల్లకుండ నిచ్చట నిమ్మైనచోట నీయాయుధముల నిక్షిప్తములఁ గావింపవలయును కావున ననువగు తావు పరికింపు మని యానవెట్టెను. అంత నర్జునుండు నలుకెలంకులు పరిశీలించి యొకజమ్మి మ్రానిం గాంచి "ధర్మాత్మజా! ఇయ్యది మనుష్యసంచారయోగ్యంబుకాని శ్మశానభూభాగంబు. ఇదిగో! ఇచ్చట మిగుల కలయఁబర్విన శాఖాసమూహములచే సూర్యకిరణములకేని చొరరాక గాఢాంధకారమునకు నిలయమై యగమ్యమగుశమీతరువు. దీనిపై మనయాయుధంబుల భద్రపఱతుమేని యవి యన్యుల కక్షిగోచరములు కాకయుండును. ఇప్పు డిచ్చట నెవ్వరును లేకుండుటయే కాక మృగవ్యాళనిషేవితంబును

శ్మశానభూభాగసంజాతంబగుట నీ వృక్షంబుపజ్జకెట్టునైఁగూడ నెవ్వ
రును రాఁజాలరు. కావున నీ చెట్టున మనయాయుధముల నిక్షేపముల
గావింతు మని యెఱింగించె.

అంత నాయుధముల నిక్షేపింపఁ దలచి, యద్వితీయుఁడై దేవ
మనుష్యాదిమహావీరుల నెద్దానిసాహాయ్యమున ననాయాసముగా
జయించెనో యట్టి శత్రుబలములరూపుమాపు గాండీవంబుగుణం బెడ
లించెను. ధర్మజుఁడును గురుక్షేత్రమును గాపాడి వాసిగాంచిన తన
విల్లెక్కుడించెను. పాంచాలుర జయించి, దిగ్విజయంబు చేకొని సైంధ
వుని పరాభవించి,యశనిపాతము పర్వతములకుఁబోలె శాత్రవుల కయ్యెడ
కాలికి బుద్ధిసెప్పు బుద్ధిగలిగించునో యట్టి యలంతి బాణాసనంబునుండి
భీమసేనుండును నారి సడలించెను. నకులుఁడును పడమటి దిక్కు
నెద్దాని సహకారమున జయించి కీర్తి వడసెనో యట్టి వింటిని జ్యారహి
తము గావించెను. సహదేవుండును దక్షిణాశావిజయ కార్యసాధన
మగు చాపమునల్లెత్రాటిని సడల్చెను. మఱియు హాస ప్రజ్వరిల్లు
చున్న యగ్నులవలె భాసిల్లు ధారాగ్రములు గల తమతమమండలా
గ్రములను గూడ నేలపై నుంచిరి. ధర్మజుండు నకులుం గాంచి "వీరా
గ్రేసరా! ఈజమ్మి నారోహించి యియ్యాయుధంబుల నిక్షిప్తంబులఁ
గావింపు" మని యానతీయ నాతఁ డమ్మహీరుహంబు నారోహించి వర్ష
జలంబులు సైతము మీఁదినుండి రావీలులేక మిక్కిలిసాంద్రముగానున్న
శాఖామధ్యంబున నయ్యాయుధంబుల సునిక్షిప్తంబులఁ గావించె. అంతే
సమీపంబున నున్న యొకశవశరీరంబును దెచ్చి దానిగంధంబును వికృ
తాకారమును గాంచి మానవులు దరిఁ జేరరని తలంచి తమయాయుధం
బులపైఁ గప్పివైచిరి. అచ్చట కొంతదూరమునఁ జరించుగొల్లలకు నూట
యెనుబదేండ్లు జీవించిన తమతల్లి మృతినొందఁగా కులాచారము ననుస
రించి యట్లు వృక్షనిక్షిప్త గావించితిమని తెలియఁబలుకుచు నగర
సమీపంబుఁ జేరిరి. ధర్మనందనుండు తమయేవురకు క్రమముగా జయ
జయంత విజయ జయత్సేన జయద్బలులను గూఢనామముల నిర్మించెను.

విరాటనగరంబు చేరంజనుచు యమతనయుండు దివ్యాంబర
ధారిణియును, ఖడ్గకుంతాద్యాయుధహస్తయును, నందగోపకులసంజాత
యును, నారాయణప్రియయు, సకలక్లేశనిర్మోచనియు నగు దుర్గను

దర్శింప నాకాంక్షించి వివిధమంత్రరాజముల జపించుచు "సకలలోక మాతా! దివ్యరూపధరియిత్రీ! పూర్ణచంద్రాననా! చతుర్భుజాయుధ కృష్ణవిశాలయుధా! మహిషాసురప్రళయంకరీ! వింధ్యాచలనివాసినీ! జగన్మాత! కాళి యనునామంబులను ధరియించి కామచారిణివై నీవెల్ల యెడల విహరించు చుందువు. భక్తిమై నిన్గొలిచినమానవులకు ధనధాన్యాదిసంపదలు పుత్త్రజననాద్యలభ్యకామ్యంబు లీడేరకున్నే? మహావిపన్నగ్నులగు మానవు లొక్కపరి నిన్ను భజింపి రేని వారికి సుఖంబులు బొంద నగునగును. బంధనాశ వ్యాధిరూపంబులగు నాపదల దూరముచేయుదువు. రాజ్యభ్రష్టుండనై యన్నదమ్ములంగూడి పల్లాము లొందుచున్న నేను నిన్నే శరణంబు వేడుచుంటి. ప్రణతుండనగు నన్నుం గైకొని నాయాపదల బాపుము." అని వివిధభంగుల నుతియించె. ఇట్టి యాతనిపరమస్తోత్రంబుల కలరి, యాదేవి దివ్యరూపధారిణియై ప్రత్యక్షమై "రాజేంద్రా! నీ కచిరకాలంబుననే సంగ్రామరంగంబున జయంబు లభియింపఁగలయది. నాయనుగ్రహంబున కౌరవసేనాసము ద్రంబు దఱియ నీది రాజ్యంబు నిష్కంటకంబుగాఁ బరిపాలింపఁగల వాఁడవు. ఎట్టిసంకటపాబులందేని నన్నుం గొలిచినవారికి సౌఖ్యం బాపా దింతు. వారిక్లేశంబుల నణఁగద్రొక్కెదను. కావున మద్భక్తుండ వగు నిన్ను నీసోదరులను విరాటనగరంబున నజ్ఞాతవాసంబు నడపుచుండఁ గౌరవులు గాని విరాటనగరంబు వారలుగాని యెఱుంగఁజాల" రని పా వారి నాపదలుపొందకుండ రక్షఁగావించి తిరోహిత యయ్యె.

### ధర్మనందనుండు విరాటునికడ కరుగుట

ధర్మజుండు పుణ్యసలిలయగునదియం దుపస్పర్శం బాచరించి ధర్మ దేవతం దలంచి ప్రాఙ్ముఖుండై "ఓయయ్యా! మున్ను యక్షునిచే నీ దర్శనంబు చేయుభాగ్యంబునొంది యీవలువునప్రాణంబుల నిలిపి కొని, ధర్మనీతివర్తనంబులు వరంబులుగా గొనియుంటినిగదా! తత్కా లంబున నీవు నా కీఁగడంగినవరంబును నేఁ డీవలయు నని ప్రార్థించి నిమీలితనేత్రుండై కరకమలంబులు మొగిడ్చియుండ నెల్లవార లద్భుతా క్రాంతులుగా నాతనికిఁ గాషాయకమండల్వాది యతిపరికరంబులు తమ యంతన సుసిద్ధంబులయ్యె. తక్కుఁగలవారికి వలయుపరికరంబు సమీప

ఘంబులుగా వారలు వానినెల్ల నత్యాశ్చర్యసంభ్రమంబులు పెనం గొనఁ గైకొని వికృతవేషులై భస్మచ్ఛన్నహుతవహప్రాయులై తమ తమతేజంబుల నడంచియుండిరి. పాండవాగ్రజుండు కాంచనమయంబు లగు వివిధాక్షంబుల తనయుత్తరీయంబు కొనఁగట్టి చంకనిడికొని, పౌరా మాత్యభృత్యవర్గంబుతోఁ గొలువుదీరియున్న విరాటుం జేరంబోయెను. ఆహా! రాజసూయాధ్వరంబున సకలక్షాత్రకులంబు జయించి వారిచే బలుగొని యున్నతుఁడగు నయ్యమతనయుఁ డిట్లొరులఁగొలువవచ్చుట దైవదుర్విలాసము కాక మఱియేమి? విరాటుండును మబ్బులోడాగియున్న సహుఁడుంబోలె వికృతవేషావృతుఁడై యున్నను నైసర్గిక తేజస్విత్వాది మహారాజలక్షణంబులచే నాతని సామాన్యమానవుగాఁ దలపోయక మహానుభావుండని యూహించి పరిసరవర్తులగు చతుర్వర్ణంబులవారి నాతఁ డెవ్వండని ప్రశ్నించి 'యీతఁడు బ్రాహ్మణుఁడు గానోపఁడు. పృథి వీమండలరక్షాపరుండగు సార్వభౌముండై యుండు. ఐన నీతనివెంట పరిజనంబులుగాని రథగజాశ్వాదులుకాని రావేలకో! శరీరలక్షణంబు లీతండు నృపోత్తముండని నిర్ణయించుచున్నవిగదా' యని వితర్కించు చుండ నాతనిని గంధేభంబు పద్మాకరంబుంబోలెఁ జేరంజని "రాజేంద్రా! సర్వసంపదలు నశియింప జీవనార్థినై వచ్చుచున్నవానినిగా నన్నుఁ దెలిసి కొనుము. స్వతంత్రుఁడనై యేను గొన్నిదినంబులు నీకడ నసువర్తింపఁ గుతూహలుండ" ననియె. విరటుం డాతనిగుశలం బడిగి తనకడ నిడికొని "ద్విజశ్రేష్ఠుఁడా! నీ వేరాజుదేశంబున నింతకునుమున్ను నివసించి యుంటివి? నీ వేగోత్రంబువాఁడవు. నీపే రెయ్యది? నీచే సాధింపఁబడిన శిల్పం బెయ్యది?' అని ప్రశ్నించెను. "దేవా! నేను తొల్లి యుధిష్ఠిరు నితో మైత్రినొంది, యాతనికొలువున నమరియుంటిని. వైయాఘ్రపద గోత్రజుండ. కంకుఁడనువాఁడ. అక్షక్రీడయందు నేర్పుగల" దని ద్విజుం డుత్తరంబిచ్చిన, నీ వీరాజ్యంబు గైకొని నన్ను బంధుమిత్రా దులతో భరియించి పనిగొనునది. దేవసముండవగు నీవు రాజ్యమేల నర్హుండవు. నన్ను గింకరునిగాఁ గైకొమ్మని విరటుండు ప్రార్థించె. ధర్మ జుఁడు దానికి కరం బలరి ధనహీనుండఁగాన నే నెన్నఁడేని జూదంబున నోడిన ధనంబు నిమ్మని నిర్బంధింపకుండుసది. ఇదియే నీయనుగ్రహంబున నేఁ బొందఁగూడినవరంబు. దీనిం దయసేయు" మన విరటుండు 'మదీయ

పరిజనంబుల నెవ్వండేని నీకప్రియంబు సలిపిన వాని దండింతుఁ. నన్నె
వ్వారేని ధనధాన్యాదుల యాచించిన నిత్తు నని వాక్రుచ్చి, నా కంగీకరిం
పుము. నేను వారికన్నియు నొడఁగూర్తు నని పలికి పరిజనులం జేరి
"యింతనుండి యీపూజ్యుని మమ్ముంబోలె సభ్యసహోదరుల గౌర
వించునది. ఆతనియెడ ననాదరంబు చూపినవారలు రాజదండనంబునకుఁ
బాత్రులగుదు" రని కట్టడిచేసి ధర్మజుం బూజించె. ఇట్లు ధర్మరాజు
డాతనికొలువున మాఱువేసం బూనియుండె. ఆతనియున్నరీతి పరివారము
నెఱుంగఁజాలరైరి.

భీముఁడు వంటలవాఁడై విరాటునికడ కేతెంచుట

వంటలవానివేషము బూని నల్లనివస్త్రమ్ముల పరిధానముగాఁ గావించు
కొని, యొకచేత గఱిటెయు చట్టువమును బూని, మఱియొకచేతఁ ఖడ్గమును
బూని కాంతిచే దివాకరునింబోలె లోకమును బ్రకాశింపఁజేయుచు
భీమసేనుఁడు రాజసన్నిధి కేతెంచెను. సమీపమున కేతెంచిన యాతనిని
గాంచి సింగంబుంబోలి నెగుభుజంబులుగల యీయువకుఁ డెవ్వఁడై
యుండనోపు? ఈతఁడు గంధర్వరాజో! త్రిలోకాధిపతియో యై
యుండనోపు. ఈతఁడు మద్దర్శనాపేక్షఁగా వచ్చినచో నచిరకాలమున నే
యాతనిమనోరథంబును సఫలంబు గావింతునని మత్స్యమహీపాలుండు
పలుక రాజభటులు త్వరితగతిం జని యాతనికి తమయేలిక చెప్పినంత
యును దెలియఁజెప్పిరి. భీముండు నాతని సరిసి గంభీరభాషణంబుల
"రాజేంద్రా! నే వంటలవాఁడ. వల్లవుం డనువాఁడ. చిత్రవిచిత్రంబులగు
వ్యంజనంబుల నాయత్తపఱుపఁగలను. నన్ను సేవకునిగా నేలుము" మని
వాక్రుచ్చె. అమ్మాటలు శ్రుతిపుటంబులు సోఁకినంత విరటుఁ డబ్బుర
పడి "వల్లవా! నీవు పాచకుండవని నమ్మ వలంతి గాకుంటి. రూపవిక్ర
మాదుల సహస్రాక్షునకు సాటివన నొప్పు. నీవేడ! సూదవృత్తి యేడ!"
అని నవ్వురామి వెలిఁబుచ్చ వృకోదరుండు "రాజా! నేను కేవలము పాచకుఁ
డనై పాకవిశేషంబుల నెఱుంగుటయే కాక మదీయపాకక్రియాదక్ష
త్వమున యుధిష్ఠిరుని దనియఁజేసితిని. బలపరాక్రమంబున నాకు సరియ
గువా రెవ్వరు నుండఁబోరు. యుద్ధములు సేయుటయన్న నాకు మిగుల
కౌతుకంబు. గజసింహాదులతోఁ బోరుసల్పుచు నీకుఁ బ్రియంబు పుట్టిం

షు సని వినిపించెను. సకలభూమండలంబు వారింపశక్తుండవగు నీకు మహీమండలాధిపత్యము నీఁ దలంచితిని. కాని నీకోర్కెనుబట్టి నిన్ను నేఁడే మదీయపాకశాలాధికారిగా నియమించితిని. నీవు పాకశాలలోని వారిచేఁ గార్యంబులు గొనుచు నాకొలువున నుండుమనది యని యానతిచ్చె. ఇట్లు భీముండు విరటుని వంటయింటఁ బాచకవృత్తిమై మఱువు పడియె. ఆతనిజాడ యొరుల కెవ్వరకును దెలియరాదయ్యె.

## ద్రౌపది సుధేష్ణకడ కేతెంచుట

ద్రుపదరాజపుత్రి వికీర్ణదీర్ఘకుంతలయై మలినాంబరంబు గట్టి సైరంధ్రీవేషంబునఁ బురంబునఁ గ్రుమ్మరుచుండఁ బౌరు లవ్వా! నీవెవ్వతెవు? నీ వేపనిచేయ వలంతివని యడుగఁదొడంగిరి. పాంచాలియు "నేను సైరంధ్రిని. సన్నేలినవారికడ నుచితముగ నూడిగముచేయనేర్తు" నని ప్రతివచనం బిచ్చుచుండె. పౌరు లామెపలుకులు తథ్యములుగా విశ్వసింపఁ జాలక యట్టిరూపమున కిది యననురూప మని తలఁపంజొచ్చిరి. ప్రాసాదోపరిభాగమున విహరించువిరాటరాజమహిషి యేకవస్త్రయగు నామెను బరికించి పిలువ నంపి యామెం దనకడ నిడుకొని, నీ వెవ్వతెవు? ఏకార్యంబుల చేయనేర్తు వని ప్రశ్నించెను. దాని కామె పౌరులకుఁ జెప్పినట్లే యుత్తరం బిచ్చె. పూర్ణచంద్రునింబోలు నెమ్మోమును, బద్మంబుల వంటినయనంబులును, నేర్చిన ట్లఖిలావయవ సన్నివేశముగల నీవు దాసివై యుండుట యసంభవము. నాగయక్షదేవాంగనాదులలో నీ వెద్దానవో నిక్కంబు వచింపుము. చంద్రుని విడిచివచ్చిన రోహిణివో, యింద్రునిపై నలుకఁ జెంది భూలోకమున కవతరించిన యింద్రాణివో, పద్మాసనునిపై నలుకఁ జెందిన వాగ్వధూటివో నా కెఱింగింపుము. అని యాసుధేష్ణ మిగుల నొత్తి యడిగెను. "దేవీ! నీవు పేర్కొనినవారిలో నెవ్వతెను నేనుగాను. నేను నిక్కముగా సైరంధ్రిని. చికురముల బాగుగా దువ్వి ముడువను, గంధాద్యనులేపనంబుల సమకట్టను, చంపకాదికుసుమ విసరంబులఁ గీల్జడల దుఱుమను, జిత్రమాలికల నేకరింపను నేర్చియుందు. తొల్లి శ్రీకృష్ణమహిషియగు సత్యభామను, బాండవధర్మపత్నియగు పాంచాలరాజతనయను సేవించి ప్రహృష్టచిత్తలఁ గావించితిని. ఇట్లొరుల సేవించుచు వారిచ్చుపరిధానంబుల ధరించుచు వారువెట్టు మధురాన్నం

బుల నాహరించి చరించుచుండు. పాంచాలియే నాకు మాలిని యను నామంబు నేర్పఱచె.” అని మిక్కిలి వినయముతోఁ దెలియఁజెప్పెను. మత్స్యమహీపాలమహిషియు “మహీపాలుండు నీరూపవిభ్రమంబుల విమోహితుండు గాకుండునేని నిన్నాదల ధరియింపనోపుదును. నీ రమణీయాకృతిఁ గాంచి మద్గృహంబునఁగల యువిదలునైతము సాహూతవిలోకనంబుల నిన్ను నిరీక్షించుచున్నవారు. ఇచ్చటనున్న యీతరులతాదులెల్ల నీయాకృతినని మేషనయనంబులఁ గ్రోలుచున్నట్లున్న యవి. ఇట్టి సౌందర్యశాలినివగు నీవు కుటిలవిలోకనంబున నెవ్వాని మత్తునిగాఁ జేయఁజాలవు? మాభూరమణుం డొకపరి నిన్నువీక్షించెనేని నీరూపసంపదకులోనై నామీఁది మక్కువఁ దొఱంగును. కుళీరంబు గర్భంబు ధరియించి దానిచే హతంబగుభంగి నిన్నంతిపురమున నిడుకొని యాత్మహానికి గుఱి కావలసినదాన నగుదు”నని వక్కాణించెను. దాని విని యమ్మానినీమణి “మహారాజ్ఞీ! విరాటజనపాలుండుగాని మఱియొరుఁడుగాని నన్నుఁ జెనకఁజాలరు. బలశాలురును గంధర్వరాజపుత్త్రులునగు మత్పతులేవురు నన్ననవరతము కాచికొనియుందురు. నాచేఁ బాదంబులు గడిగించుకొనకయు, నాకుచ్ఛిష్టంబులు భుజింపనీకయు, నన్నేలువారియెడఁ బ్రియము పాటింతురు. ప్రాకృతాంగనఁబోలె నన్నెవ్వరేనిఁ జెనకఁజూచిన వారి నారాత్రియే మడియింతురు. కాన నేనెవ్వరికిని లోనుగాను.” అని యుత్తరంబిచ్చె. అట్లైన నీవు నాయింట నుండుము. పాదధావనంబును నుచ్ఛిష్టభక్షణంబును బరపురుషదర్శనంబును బరిహరించుకొని యుండు మని యాసుధేష్ణ యానతిచ్చె. ఇట్లు ద్రౌపది విరాటరాజమహిషిపాల సైరంధ్రిగా నుండి పాతివ్రత్యమును నెఱపుచుండె. ఆమె నెవ్వరును దెలియఁజాలరైరి.

### అర్జునుఁడు విరాటునికడకు వచ్చుట

అనంతరము షండవేషమండితుండును, గృష్ణరక్తాంబరధారియు, దీర్ఘబాహుండును, గ్రహగ్రస్తుఁడగు రోహిణీకాంతునివలె ననతిసందర్శనీయుండునగు నింద్రనందనుండు ధీరోత్తరగమనంబున భూమండలంబు నదల్చుచు సభాస్థలిఁ బ్రవేశించె. విరాటుం డమ్మాననీయుని విలోకించి పార్శ్వవర్తులఁ బరిపరివిధంబులఁ బ్రశ్నించియు నుత్తరంబు

గానక "పీనాంసుండును, గజరాజగతియు, సింహమధ్యముండును నియ్యన ఘుండు జయంత నలకూబర కార్తికేయాదులలో నొక్కరుండుగావల యు నని యూహించె. ఇంతలోఁ బాండవమధ్యముండు సభాసదుల నతిక్రమించి రాజుం జేరి "నేను బృహన్నల యనువాఁడను. నాట్యకళా నైపుణ్యమున నాకొరులు సరిరారు. జడయల్లుటయందును బూవుల దుఱుముటయందును నేర్పుగలవాఁడను. బాలవృద్ధషండాదులకేని శిక్షగఱపఁ గౌశలముగలదు" అని విజ్ఞాపించి మిన్నకుండెను. మత్స్యమానవపతియును "నోయీ! నీరూపంబునకు నింపుమగంటిమి యనురూపంబుగాని యీక్లీబత్వంబుగాదు. నీ యీయాజానుభుజంబులు బాణాసనంబులఁబూనిన శోభావంతములు గానోపును. ధనుర్ధరుండవై నీ కభీష్టంబగు దేశంబును బాలింపుము. నీషండత్వమును బరిగణింపక నిన్ను నే పుత్రప్రాయునిఁగాఁ బరిగ్రహింతును. నేను వృద్ధుండ నగుట నారాజ్యంబునంతయుఁ జేకొని పరిపాలింపుము" అనిపల్కి బలవంతములును గుణయుక్తంబులునగు బాణాసనంబులఁ దెప్పించి యాతం డేమిచేయునో యెఱుంగఁగోరి యాతనిముందుఁ బెట్టించె. ధనంజయుండును మిక్కిలి పౌరుషహీన్యంబుగా నే నెన్నఁడును ధనువుఁ జేపట్టియెఱుఁగను. ఇట్టిధనువుల నెన్నఁడేనిం గనియు నెఱుంగను. మముఁబోటు లెచ్చటను ధనుర్ధరులుగా నున్నట్లుగూడ నెఱుంగను. నాట్యంబు నెఱపుటయు, గానంబు వెల్లివిరియఁజేయుటయును, వీణామృదంగాదుల మ్రోయించుటయు నాకు నలవడియుండు. కావున దేవరదయ నాపైఁగలదేని తమదుహితకుత్తరకు నాట్యంబు గఱపఁబూనుదు" నని ప్రార్థింప నరపాలుఁ డాతనిప్రార్థనంబునంగీకరించి, తనతనయను స్వయముగా రప్పించి "తల్లీ! బృహన్నలయనునీపె యింక నీకుఁ జెలియు నాట్యోపాధ్యాయియు నగుగాక. రూపము పరికించిన నీమె నీచకులసంజాతగాఁ గానరాదు." అని వచియించి యామె నంతిపురికిఁ బంపి మంత్రులఁగూడి బృహన్నల పేడియగుట నిక్కముగా నెఱింగి యంతిపురికిఁ బోవ ననుజ్ఞ యిచ్చెను. ఇట్లర్జునుండును పేడిరూపుదాల్చి విరాటపుత్రికి నృత్తగీతవాద్యములఁ గఱపుచుఁ బ్రచ్ఛన్నుండై యుండె.

నకులుండు విరటునికడకు వచ్చుట

అంతఁ గొండొకతడవునకు విరాటభూపాలుండు తురంగమములఁ వీక్షించుతఱి నకులుండు రాజుం జేరఁ జనుదెంచె. మఱియు నాతని యశ్వంబుల సాకూతంబుగ వీక్షించుచుండె. ఆతనిఁ గాంచి విరటభూనాయకుండు "కన్నులపండువు గల్గించు నీవప్పురుషునిఁ గూర్చి యెవరే నెఱింగినవారు గలరేనిఁ దెల్పుండు. ఈతఁడు నాదివ్యాశ్వంబులఁ బ్రేమపూర్వంబునఁ జూచుచున్నవాఁడు. దాన నీతం డశ్వలక్షణాభిజ్ఞుండు గానోపును. ఆతని నాయొద్దకు సత్వరంబుగఁ గొనిరండని యానతిచ్చునంతకు మున్నె సభాప్రవేశంబు గావించి నకులుం డారాజేంద్రున కిట్లనియె. "భూపాలా! జీవిక నపేక్షించి నీపురంబు చొచ్చితిని. నను హయాధిపతిఁ గావించి యేలుకొమ్ము." విరటుండును "నీకు వాంఛితంబులగు ధనముల వేతనములుగా నీఁగలుగుదుఁగాని నీ వశ్వసూతుండవు గారాదు. మున్ను నీ వెవ్వరికడ నుంటివి? నేఁ డిచ్చటి కెట్లు వచ్చితివి? నీ వేపనులు నేర్చియుందువు? దీని నంతయు నా కెఱిఁగింపు మన నకులుండు "పాండవాగ్రజుం డగు యుధిష్ఠిరునికడ నశ్వాధికారిగా నుంటిని. దుష్టాశ్వంబుల సాధింపను, రోగగ్రస్తాశ్వములఁ జికిత్సింపను నెఱుంగుటయే కాక యశ్వహృదయంబు నరయనోపుదును. అశ్వారోహణంబు నాకు భయహేతువు గాఁజాలదు. దేవపతికి మాతలివోలె, దశరథునకు సుమంత్రుని విధంబునఁ, బరశురామునకు సుముహునివలె నీయశ్వంబుల శిక్షింప నేర్తు. పాండవాగ్రజుండు గ్రంథికుఁ డని నన్ను వ్యవహరించుచుండె. అయ్యుధిష్ఠిరాజ్ఞచే వేనవేలుగుఱ్ఱంబుల రక్షించుచుందు." అని విన్నవించె. అంతమత్స్యనాథుండు "నీ కియ్యది యే యభీష్టంబగువరం బేని నేఁటినుండి నాయశ్వంబులును సారథులును నశ్వసైనికులును నెల్లరును నీయధీనంబున నుందురుగాక. నిక్కువముగా నీరూపున కియ్యది యనసురూపంబ. ఐనను నిన్నుఁ జూచుచుండుటచే నిజముగ పాండవాగ్రజునిఁ గాంచినట్లానందము గల్గుచున్నది. పరివారమాన్యుఁడై యామహామహుఁ డెట్లడవులనిడుమలఁ గుందుచుండెనో గదా!" యని పలవించె. నకులుండును నట్లశ్వపాలకుండై యొరుల కెఱుకరాక వర్తిల్లుచుండె.

## సహదేవుండు విరటునికడ కేతెంచుట

సహదేవుండు మఱికొంతసడికి సూర్యునివలెఁ బ్రకాశించుచు విరటునిగొలువు గలయం జనుదెంచె. సభాసదులును భూపాలుండును సతనిసచిరకాలంబున నే పరికించిరి. పొడవైన వేణుదండంబును బుస్సదామంబులను రజ్జుబంధనంబును ధరియించి, గొల్లవానివలెనుండె రాజుం జేరి "మహీపాలా! నన్ను భవదీయగోపాలకునిఁగా నియోగింపుము. తస్కరభయంబును, రోగశంకయును, క్రూరమృగములబాధను, ఎఱింగి నీగోవర్గంబు మదీయాధిపత్యంబున సుఖంబుగా మెలంగుఁగాత. మఱియు నట్టిగోగావ్యరిష్టంబులు వాసిపోవుటచే బహుక్షీరములనొసంగు." అని వాక్రుచ్చె. భూకాంతుండును దానికిం బ్రీతుండై "నీరూపుచూడ ధైర్యంబు నాలోకింప గోపాలునిఁబోలెఁ బొడకట్టవు. కౌరవవంశసంజాతుండగు క్షత్రియుండవు గానోపుదువు. మఱియు రాజ్యంబుగైకొని మద్బలంబుల వశముగావించికొని యీఖడ్గంబు ధరియించి యేలుకొనుము" అని పలికినంత నమ్మహీనాథు నౌదార్యంబునకు మెచ్చి "నేబాలుండ. నీచకుల సంజాతుండను. నాకు రాజ్యతంత్రంబు నడుపు సామర్థ్య ముండునే? మేము మాజాతికర్మంబువలననే ప్రీతులమై యుందుము. అరిష్టనేమి యనువైశ్యుండ. పూర్వము పాండవులగోపాలనంబు సలుపుచుంటి. రాజ్యభ్రష్టులై యమ్మహాత్ములు వనభూములఁబట్ట నేనును నిన్నాశ్రయింపవచ్చితిని. భవదన్యుండగు రాజేంద్రు సేవింప నొల్ల" నని మాద్రిముద్దులబిడ్డ పలికినంత "భూమండలిం బాలింపఁగల తేజంబుగల నీవు బ్రాహ్మణుండవో, క్షత్త్రియకులుండవో గానోపుదువు గాని గోపాలకుండవు గాఁజాలవు. నీ వేరాజేంద్రు కడనుండి యిట కరుదెంచితివో, నీనేర్చినశిల్పం బెయ్యదియో, మాకొలువున నీనిలుచునపుడు గోరువేతన మేమియో తెలియఁజెప్పు"మని విరాటుండు ప్రశ్నించె. దానికి నకులుండు "ఏలికా! ధర్మజుండు కోటిసంఖ్యలగు తనమొదవుల నావశంబున నుంచె. నన్నుఁ దంత్రీపాలుండని జనులు వ్యవహరింతురు. గోగణంబునెడ ముక్కాలంబు నేమిజరుగునదియు నే నెరయనేర్తును. దశయోజనపరిమాణంబుగల భూభాగంబున నే నెఱుఁగనియది యుండఁజాలదు. పాండవాగ్రజునిసుగుణంబుల నేను, మదీయకౌశలమున నాతండును దృప్తింబూనియుందుము. నేగోవులయెడ శ్రద్ధంబూనియుండ

నయ్యవి యచిరకాలమున నయుతసంఖ్యలుగ వృద్ధిఁబొందుటయే కాక రోగళంకావిహీనంబులై బహుక్షీరంబుల నిచ్చుచుండు. గొడ్డుటావులు సైతము మాత్రంబు మూఁజూచి చూలుకొనంగల యాలఁబోతులఁ గూడ నేర్పఱుపఁగలను” అని యెఱింగించె. మత్స్యమానవపతియు “నిం తటికౌశలంబుగల యీకర్మ నీచకర్మ యనంజనదు. నిక్కంబుగ భూమం డలంబేలఁ జేవగలవాఁడవు. నీకు గోరక్షణంబే యభీప్సితంబేని మదీయ గోవులును గోరక్షకులును నీకు వశపడియుందురు. నానావర్ణంబులుగల నాయాలమందల నారయుచుండు” మని యాతని నియోగించె. ఇట్లు నకులుం డమ్మేదినీకాంతునికడ గోపాలకుండై మెలఁకువగలిగి యొరుల కెఱుఁగరాక మెలంగుచుండె. ఈజాడ పాండవులెల్లరును విరట భూకాం తునికడ నజ్ఞాతచర్యను నేర్పుమై సాగించుచుండిరి.

జీమూతవధ

ఇట్లు మత్స్యనగరంబునఁ బ్రచ్ఛన్నులైయుండి మహావీరు లగు మత్పితామహు లటుమీఁద నేమిచేయుచు నెట్లెఱుంగున వర్తించిరో తెలియఁజెప్పు మని జనమేజయనరేంద్రుండు ప్రార్థింప నవ్వైళంపా యనుం డిట్లనియె. పాండవు లెట్లెఱుంగున నజ్ఞాతచర్యను నిస్తరించిరో వివరింతు సావధానుండవై యవధరింపుము. తృణబిందుధర్మదేవతల ప్రసాదంబున నొరుల కెఱుఁగఁబడక యజ్ఞాతవాసచర్యను సాగించుచు యుధిష్ఠిరుండు మాత్స్యరాజసభ్యుల కెల్లఁ బ్రేమపాత్రుఁడయ్యెను. విరట నరపతియు నాతనియెడ గౌరవంబుపాటించు. అక్షహృదయజ్ఞుండగు నమ్మ హానీయుండు తనయిచ్ఛకు మెచ్చి యపారధనంబుల గెల్చి తమ్ముల కిచ్చు చుండు. భీముండును మహానసంబున నత్యధికముగా సంపాదించిన భక్ష్య మాంసముల సోదరుల కిచ్చుచుండు. ఇంద్రతనయుండును నంతిపురిలో లభించిన జీర్ణవస్త్రంబుల నెల్లరు పాండవులకు నిచ్చుచుండు. సహదేవుం డును గోపవేషధారియై పాలు పెరుగు నేయి మున్నగువానిని సమర్పిం చుచుండు. నకులుండు వాజిరక్షణము గావించుచు రాజును మెప్పించి యాతనిచే లబ్ధంబులగు ధనసంచయంబులఁ బంపువెట్టు. ఇట్లు మాఱువడి యున్న పతులఁ బరికించుచు ద్రోవదియును నొరుల కెఱుఁగరాక మెలఁగు చుండె. ఇట్లన్యోన్యోపయుక్తకార్యంబుల నుపయుక్తులగుచు నమ్మాన్య

లచ్చట దుర్యోధనునికిఁ దమగుట్టు తెలియునేమో యని శంకాకులితులగుచు మెలఁగుచుండిరి.

ఇట్లు మాసచతుష్టయంబు గతింప మత్స్యదేశంబున బ్రహ్మోత్సవం బొండు జరుపఁబడుచుండె. అయ్యుత్సవంబునకు మహాబలపరాక్రములును యుద్ధకుశలులు నగు మల్లురు నానాదిగంతములనుండియు విచ్చేయుచుండిరి. మల్లయుద్ధవిశారదుం డగు మత్స్యమహీనాథుండు మల్లవీరుల నుచితప్రకారంబునఁ బూజించుచుండె. మల్లురు నొకళ్లొకరితోఁ బోరుచుఁ దమతమకౌశలముల రాజునకుఁ జూపుచుండిరి. అట్టిమల్లురలో బలదర్పితుం డగు జీమూతుం డను పేరుగలమల్లుం డొకం డితరమల్లురఁ దనతోఁ బోరఁ బిలుచుచుండు. అతండు రంగంబున నిలిచి భుజాస్ఫాలనంబు చేయ నాతని గాంచి భీతిపడి యొరు లెవ్వరును జేరంజనరు. మత్స్యనరపతి యిదియంతయుం గాంచి మహానసాధికృతుండగు పవనతనయు నాతనితోఁ బోర నియోగించె. రాజు తానై నియోగించుటం జేసి యాతనిమాట కెదురాడనోడి యెట్టకేలకుం బవనతనయుం డాతనితోఁ బోర నంగీకరించె. అంత నమ్మహావీరుండు నరపతిం బూజించి శార్దూలంబుంబోలె రంగంబు ప్రవేశించె. బద్ధపరికరుండై జీమూతుం డని వాసికెక్కినమల్లుని బిలువఁబంచెను. మత్తద్విపంబులుంబోలె మహాబలపరాక్రమవంతులగు నయ్యిరువురు పరస్పరజయకాంక్షలచే వరాహంబులుఁబోలె ఘుర్ఘురధ్వనులగావించుచు, బాహువు లప్పళించుచు, కరంబులం బొడుచుచు, పాదంబులం దన్నుచు, గోళ్లం జీరుచు, నెదిరికి ప్రతిక్రియల నెఱపుచు, జానువుల మర్దించుచు, నొదల గ్రుద్దుచు, మహాఘోరంబుగ పోరుసలుపుచుండిరి. అట్టివారిద్వంద్వయుద్ధముం గాంచిన యుత్సవముగాన వచ్చుజనసమూహంబెల్ల సంతుష్టంబయ్యె. అంత నవ్వీరయుగము కర్షాపకర్షంబుల జానుఘాతంబుల పిడికిటిపోటున నొండొరులఁ జదియనేయుచు బాహుయుద్ధంబు సేసిరి. అంత భీముండు తనభుజంబులతో నామల్లునిబట్టిలాగి యొక్కుమ్మడి చుట్టునుం ద్రిప్ప వీక్షించుమల్లురును మాత్స్యులు నాశ్చర్యంబునొందిరి. అట్లాతనిం ద్రిప్ప చైతన్యంబు సడల పుడమిపై వైచి పొడిగావించె. ఇట్లు ప్రఖ్యాతుండగు జీమూతుం జంపి జయంబుచేకొన్న భీముం గాంచి విరటుండు మిగులఁ బ్రీతుండై కుబేరుడుంబోలె ధనంబు నమితముగా నొసంగెను. ఇట్లు భీమసేనుండు

మహాబలశాలురగు మల్లురవిఱచుచు మానవపతి ప్రీతిఁ జూఱఁగొని యుండెను. అవ్విరాటనగరంబున వృకోదరునకు సాటియగు మేటిలేకుం డుటం జేసి ద్విరదసింహశార్దూలాదులతో నాతనికిఁ బోరుకలిగించుచు నంతిపురిలోనివారలకుఁ జూపుచు, మానవనాథుండు వినోదించు చుండు.

విప్లవచ్ఛుండును నృత్తగీతంబుల నంతిపురింగల యంగనలను విరట భూపాలునిం దనుపుచుండు. కళ్యాలబదిలంబులుగాని యున్నత్తాశ్వంబుల సాధించి వినీతంబులఁగావించి రాజునకుం జూపుచు, నతని సంతుష్టుం గావించి నకులుండు బహుధనంబు నొందె. సహదేవుండును కాల నేల ద్రవ్వుచు అంకెల జంకించునాలఁబోతుల సాధులఁ గావించి, రాజునకుం జూపి మెప్పుకొని ధనం బార్జించె. ఇట్లు వివిధభంగుల క్లేశంబు లొంది యిడుమలు గుడుచు నమ్మహారథులను బలమును వీక్షించి ద్రుపద రాజ పుత్రిమనంబు వగలఁబొగుల నిట్టూర్పులవెచ్చ నూర్చుచుండు. ఇట్లు ప్రచ్ఛన్నులై విరటునికార్యంబుల నిర్వర్తించుచుఁ బాండవులవ్వీట నిలిచి యుండిరి.

### కీచకుండు ద్రౌపదిఁ గామించుట

ఇవ్విధంబునఁ బాండవులు విరటనగరంబున నజ్ఞాతవాసంబు నిర్వ హించుచుండ నల్లనఁ బదిమాసంబులు గతించె. పాంచాలియు సుధే ష్ణను సేవించుచు, నూడిగంబులు సలుపుచు నామెను దక్కుంగల యంతః పురాంగనలను సంతుష్టచిత్తలఁ గావించుచుండెను. ఇవ్విధంబున నించు మించుగ నావత్సరంబు పరిసమాప్తంబుగా నుండ విరటసేనానాయ కుండును, మహాబలశాలియునగు కీచకుం డామెం గామించెను. ఇట్లు వీక్షించి యామె యద్భుతరూపలావణ్యంబుల కచ్చెరువడి యామెయెడ మనంబునిలిపి, మదనబాణప్రపీడితుండై సుధేష్ణాగృహంబుం జేరి నవ్వుచు నీతీరునఁ బలుకం దొడంగె. 'విరటరాజు నంతిపురంబున నీమెను నేనెన్నఁ డును గాంచియుండను. మదిరాంగనవలె నిరుపమాన రూపవైభవము నన్ను మోహపరవశుని గావించుచున్నది. అప్సరాంగనలుంబోలె సురూ పముగలయీామె యెవ్వతెయో, యెచ్చటనుండి వచ్చినదో నాకెఱుంగఁ జెప్పవలయును. ఈమె మదీయమానసంబును మథించి వశపఱచుకొను

చున్నయది. నీవి కొండెమును నౌషధంబుం గానను. నాకుం జూడఁ గ్రొత్తగావచ్చిన పరిచారికగాఁ దోఁచుచున్నయది. ఇంతటిరూపసంపద గలయీమె యూడిగంబులు చేయుట ప్రశస్తంబుగాఁ దోఁపదు. ఈమె నన్నుం జేరి రథగజవాజిశోభితంబగు మదీయగృహంబు మెట్టి శోభిల్లఁ జేయుచు నన్నేలుకొని పనిగొను గాక" ఇట్లు సుదేష్ణం బలికి యా మె[illegible] నెలవంటి పాంచాలరాజపుత్రిం జేరి సృగాలంబు సింహశాబకంబునుబోలె ననునయింప మొదలిడెను. "ఓకల్యాణి! నీ వెవ్వతెవు? నీ వేదేశంబు నుండివచ్చియుంటివి? ఇది యంతయును నా కెఱింగింపుము. ఉత్తమంబగు రూపంబును, గాంతియు, ననమానంబగు సౌకుమార్యంబును, పద్మపత్రములఁబోలు నేత్రములును, పరభృతఘోషంబుఁబోలు పల్కులును గల నినుబోలువరాంగనల నేనెన్నఁడే నీమహీతలంబునఁ గాంచియెఱుఁగను. చంద్రునిఁబోలు నెమ్మోముగల నీవు పద్మపత్రనిలయయగు లక్ష్మివో? కాంతివో? తెల్పుము. నీమోము చందురునీక్షించి యీజగతిలో నెవ్వారను కామపరవశులు కాకుందురు? సువృత్తంబగు నీపయోధరయుగంబు నామనంబు నాకర్షించుచున్నది. పిడికిటి నిముడు నీపేదకౌను స్తనభారంబున నమ్రమై యొప్పుచున్నది. నదీసైకతమువోలె విశాలమైన నీజఘనభాగముఁజూడ మన్మథవ్యాధి యసాధ్యమై నన్నుఁ గాఱించుచున్నది. మదనుఁడు సదయుఁడుగాక యగ్నింబోలె మండుచున్నవాఁడు. నీసంగమంబు కోరుటచే నమ్మకరధ్వజుఁడు మఱియుఁ బెంపొంది నన్నుఁ బలుబాముల పాల్పఱచుచుండు. సంభోగమను మేఘజాలమునఁగలిగిన నాత్మప్రదానమను వర్షముచేఁ బ్రజ్వరిల్లుమదనాగ్నిని శాంతింపఁజేయుము. భవత్సంగమాశచే మిగులఁ దీవ్రంబులైన మదనబాణములు నామనమున కున్మాదము గలిగించుచున్నయవి. నాహృదయమును విదారణము గావించి మదనసాయకములం దెట్లు చొచ్చియున్నవో పరికింపుము. చిత్రములగు పూవులను వస్త్రములను కైసేసి నాతో సుఖింపుము. నీ విట్లు సుఖము లేకయుండుట మేలుగాఁ దోఁపదు. నన్నుం గూడి వివిధసుఖములఁ గని యుచు, వివిధపేయభోజ్యములఁ గుడుచుచు నుత్తమభోగంబు లనుభవింపుము. ఇంతట నీసౌందర్య మాదలధరింపని పూమాలఁబోలె నిరర్థకముగాఁ దోఁచుచున్నది. నాభార్య లెల్లరును నీ యూడిగంబులు సలు

ఫుచు సేవలు చేయువారు. నేనును నీకు దాసునివలె నుందును. నీయిచ్చ వచ్చినట్లు నన్నేలుకొనుము.

## ద్రౌపది కీచకుని నిరాకరించుట

ఇవ్విధంబునఁ దన్ను గామించు నయ్యధముం గాంచి యప్పరమ పతివ్రతయగు ద్రౌపది "ఓయీ! ఇట్టియనుచిత వాక్యంబులు పలుకకుము. పరదారనగు నన్నుఁ గామించుట నీకు మంగళము గానేరదు. ఆత్మదారల మన్నించుచుఁ బరదారలనుదుష్కార్యములను బరిహరించుటయు సత్పురుషుల కర్తవ్యములై యొప్పు. అట్లుగాక పాపాత్ముఁడై మోహాక్రాంతుఁడై పరదారలఁ గామించుమానవాధముఁడు మహాభయమునేనియు, నపయశస్సునేనియుఁ బొందఁ బాల్పడియుండును." అని యాతని నుచిత రీతి మందలించెను. అయ్యుత్తమవాక్యంబుల వినియుఁ, బరదారలఁగామించు నెడఁ బ్రాణహారంబులును జననిందితంబులు నగుదోషంబులఁ దనంత యెఱింగి యుండియు, నింద్రియవశంగతుఁడై, "పరమకళ్యాణి! ఈరీతి నన్ను నీవు విముఖుని గావింపరాదు. కామవశంగతుఁడనై త్వత్సంగమాభిలాషినై ప్రియవచనములు నెఱపు నన్నిపుడు ప్రతిషేధించి యవ్వల నీయొనర్చిన యిక్కార్యమునకుఁ బశ్చాత్తాపము నొందఁగలవు. నిక్కముగ నీరాజ్యమున నేను నాభుజబలమున నీరాజపుంగవునిఁ బ్రతిష్ఠించి యుంటిని. భోగ్యభాగ్యంబులందును, రూపయౌవనంబులందును, నాకీడగుమానవు నీవసుంధరయందుఁ గాన. ఇట్టి నన్నుఁ జేపట్టి మదీయ రాజ్యంబును వివిధభోగంబుల ననుభవించుచు నాకు నేలికవై యుండక యేల యీదాస్యంబున నభిరుచి నడంపకుందువు?" అనిపల్కినయాకీచకుని పల్కుల చాలించి యాంపలుకులు ములుకులై నాట, మేరకుమీఱినయేవగింపునఁగుడ "సూతపుత్త్రా! నాయెడ మోహంబు విడిచి ప్రాణరక్షగావించికొనుము. ఏవురుగంధర్వులు నాపతులు. వారెల్లవేళల నన్ను రక్షించుచుందురు గాననే నీ కెన్నఁడును జేఁజిక్కుదానను గాను. నాపతుల కీవార్త తెలియవచ్చెనేని వారు నిన్నుఁ జంపక విడువరు. ఏల ముగ్ధుఁడగు బాలుఁడు కాలమునదుమికి యవ్వలియొడ్డుచేరఁబోయినట్లు ప్రయత్నించి యూరక యాత్మనాశమును జేరఁబిల్చుకొందువు. మత్పతులు కామచారులగు గంధర్వులగుటఁ జేసి నీవు భూమధ్యమున డాఁగినను

జలరాశి చొచ్చినసుఁ జేపట్టకవిడువదు. ఆతురుఁడు కాన రాత్రి నాహ్వా నించుపగిది, తల్లియుత్సంగమున శయనించుబాలుఁడు చంద్రబింబమును జేపట్టయత్నించినట్లును నన్నేలఁ గామింతువు? గంధర్వులభార్యనగు నన్నుఁ గామించునిన్ను భూదివంబుల నెవ్వరును గాపాడఁజాలరు.

ఇవ్విధంబున నమ్మానినీమణిచేఁ బ్రత్యాఖ్యాతుండై కీచకుండు మోహ మంతకంత కగ్గలమ్ము కాఁగా నంతిపురిఁజేరి సుధేష్ణం గాంచి, యనంతమదనబాధ వేధించుచుండ నొదలఁ జేతులఁజేర్చి యామెపాద యుగళము చేతులనొత్తిపట్టి వాయువశమున క్షోభనొందినసముద్రముఁ బోలె సంచలించుచు, సుదుఃఖితుఁడై యిట్లు విన్నవించెను. "సామదానా ద్యుపాయములచే నెట్టులైనను నీసైరంధ్రిం గూడునట్లు ఘటింపవల యును. కాదేని నాప్రాణంబు లిచ్చటనే విడిచిపుత్తు. నే నెన్నిభంగులఁ బ్రార్థించిన నామె కామింపకుండె. నిక్కముగ నే నిచ్చట నుంటినేకాని మన్ననంబుమాత్రము యమలోకమున కేఁగి యమయాతన ననుభవించి నచ్చుచుండె" నని యిట్లు సోదరుం డధీరుండై వలుక మిగుల జాలిఁగొని యాతనిప్రాణముల నెట్టైన నిలుపఁగోరి, సుధేష్ణ యిట్లు పలుకఁదొడఁగె. "సోదరా! ఈయమనాకు శరణాగతురాలు. ఈమెయాచారములరక్షిం చుట కేను బాసచేసియుంటి. పాపమతు లేరైన నీమెం జెనకఁజాలరు. మహాబలశాలురగు గంధర్వులేవురు తనకుఁ బతులనియు, వారెల్ల వేళలఁ దన్నుం గాపాడుచుందు రనియు నీమె మొదట నన్నుఁ జేరునప్పుడే సత్యమును వచించె. ఒకసమయంబున మానవేశ్వరుండు నీ సురూపం గాంచి మోహాక్రాంతుఁడుగా నే నతని కీతత్త్వము నెఱిఁగించి యనుపన యించితిని. అంతటనుండి యాతం డామెరూపలావణ్యముల మానసము ననే హర్షించుఁగాని వెలికిఁ బేర్కొనఁడు. అయ్యేవురుగంధర్వులు నిక్క ముగా నలిగిరేని ముజ్జగంబులరూపుమాపవలంతులు. నీ కీరహస్యంబును భ్రాతృవాత్సల్యంబున నెఱిఁగించుచుంటిని. నీకు నిక్కముగఁ బ్రాణంబు లీపైన నాయెలనాగపై కామంబు విడువుము." అని యివ్విధంబున సోదరి యనునయింప "గంధర్వుల వేవురనైనను, బలువురనైన నే నొక్కఁ డనే వధింపఁగలవాఁడ. అట్టి నన్నేవురుగంధర్వు లేమిచేయఁగలరు? పుత్త్రుఁడైనసోదరుఁడైన పౌత్త్రుఁడైనరమణీయముగనున్న పతివ్రతలయ్యు ను సతులు మారవికారగోచరలగుదురను రహస్యంబును నీకుఁ దెల్లంబు

కాకయున్నే. కావున సుజ్వలాలంకారభూషితుండనగు నన్నుం గాంచి సైరంధ్రిమానసంబు నాయెడం దగులుకొనును. నీవు నిక్కముగ నాప్రాణములపైం బ్రేమగలదేని దాని నెట్లైన నొడంబఱుపుము." అని యాతఁడు తన మోహంబువిడువక ప్రార్థింపసాగె. ఇట్లుసోదరుని ప్రార్థనలం గాంచి యాతనిమూర్ఖతకు మనంబునఁ గుందించుచు "పాపాత్మా! నీవు నిక్కముగ కాలహస్తగతుండ వైతివి. నీమూలమున సోదరులును వినాశోన్ముఖులగుట మిగుల శోచనీయము. నీ విట్టి యకార్యమును జేయ సమకట్టుటయెగాక నన్ను దాని సాధింప నియోగించుట మిగుల దుఃఖకరము. ఒకఁడుచేసినపాపంబునఁ గులమంతయు నాశంబు నొందు నను ప్రాజ్ఞులవచనంబులు నిక్కంబులయ్యె. నీపాపమున నీవు మాత్రమే నశింపక స్వజనమునంతయు నశింపఁజేయుదువు. ఐనను నీమానసంబు దానియెడఁ దగుల్కొని మరలదేని కార్యాంతరవ్యాజంబున మద్యమును మధురాన్నమును జేసి సిద్ధపఱుపుము. దానిం గొనితేర నామెను నీయంతిపురికిం బంపఁగలదాన. అచ్చట నేకాంతమున నామె నెట్లైన సామోపాయంబుల లోఁగొని కార్యసిద్ధిం బడయుము." అని సోదరి యాతని ననునయించి పంప నాతం డతిత్వరితగతి గృహంబుఁ జేరె. రాజభోజ్యాగ్ర్యంబులగు వివిధమాంసంబులను, వివిధరూపములగుభక్ష్యములను, మధురములగు నన్నపానములను నేర్పరులగు సూపకారులచే నాయత్తపఱచెను. ఇట్లు సుధేష్ణ కీచకునితో రహస్యాలోచనము చేసినదగుట, సైరంధ్రి నాతని యింటికిఁ బంప నిశ్చయించి "సైరంధ్రీ, నే నియ్యెడ మిక్కిలి దప్పిఁగొనియుంటిని. కీచకునిగృహంబున కేఁగి వివిధపానంబులఁ గొని యేతెమ్ము" అని యాజ్ఞాపించె. అంత సైరంధ్రి "అమ్మా! నే నాతనిగృహంబునకుఁ బోఁజాల. అతఁ డెట్లు కామవశుఁడై సిగ్గువిడియున్నవాఁడో నీకుఁ దెలియనిదికాదు. తొల్లినీయింటఁ బ్రవేశించునప్పుడు చేసినసమయమును దలంపుము. నాపతుల కనిష్టముగ నిచ్చట కామచారిణినై యుండఁజాల. కామవికారమునకు లోనై కీచకుఁడు నన్నవమానపఱచుఁ గావున నే నాతనిగృహంబునకుఁ బోఁజాల. నీకింక పలువురుసేవకురాండ్రుగలరు. వారిలో నొక్కతె నక్కార్యమున నియోగింపు" మని ప్రార్థించెను. సుర దేర నేఁ బంపిన నిన్నాతఁడు ముట్టనేరఁడని పలికి యామె బంగారుపాత్ర మొం డొసంగె. ద్రౌపదియుఁ జేయు

వచిలేక మిగులఁ గుందుచు "నిక్కముగ నాభర్తలఁ దప్ప నితరుల నే నెఱుఁగనేని, సమీపమున కేఁగిన నన్నుఁ గీచకుం డేమియుఁ జేయ లేకుండుఁగాత" యని పలుమఱు ప్రతిజ్ఞ చేయుచు, నొక్కింతసేపు జగచ్చక్షు వగు సూర్యభగవాను నారాధించెను. పద్మబంధుఁ డామెయిక్కట్టుల నెఱింగి యామెను రక్షింప నొక్కరక్కసుని నియోగించె. ఆతండును తిరోహితుండై యామెవెంట నంటియుండె. ఇట్లు పాంచాలి వచ్చిన కీచక గృహంబున కేఁగ నాతఁ డామెం గాంచినంత దాఁటువాఁడు నావను జూచినట్లు మిగుల సంతసమంది లేచెను.

కీచకుఁడు ద్రౌపదిని బరాభవించుట

ద్రుపదరాజపుత్త్రిం గాంచి కీచకుం డిట్లు పలుకం దొడంగెను. "రమణీ నీకిదే స్వాగతము. ఈదినము నాకు సుప్రభాతము. ప్రాణనాయిక వగు నీవు నన్నుం జేరితివి. ఇఁక నీవు నాకుఁ బ్రియము నొనరింపుము. దివ్యాంబరముల ధరియించి యమూల్యరత్నాలంకృతుల నలంకరించుకొని, మేలుబంగారుమాలలఁ దాల్చి, ఈయున్న నాశయనము నలంకరించి, నాతోఁగూడి మాధవీమద్యముం గ్రోలి నన్నుం దనియఁ జేయుము." అనినంత ద్రౌపది "రాజపుత్త్రి సురను దెచ్చుటకు నన్ను నియోగించెను. ఆమె చాలఁ దప్పిగొనియున్నది గాన మద్యము నిచ్చి వేగముగా నన్నుఁ బంపుము" అని పలికెను. అంతఁ గీచకుండు వేఱొక్కతె మద్యము నామెకుఁ గొంపోవుచులే యనుచు నామె దక్షిణకరంబు పట్టెను. పాంచాలి "దురాత్మా! నేను నిక్కముగఁ బతులఁదక్క నన్యులమనము లోనైనఁ దలంపనేని బతివ్రత న నిట్లవమానపఱచు నిన్నా పాతకిష్ఠుఁ డంచుఁగాక యని యాతని శపించుచుండె. అట్టియామెం గాంచి మఱియు ముగ్ధుండై యామె నుత్తరీయాంచలంబున నాకర్షింప మొదలిడెను. అంత నామెయు నాతని దూరముగఁ బోఁద్రోయుచుండెను. అట్టి యాతనిచెయిదముల నించుకంతయు సహింపనోపక యాద్రౌపది మిక్కుటమగు కోపభరంబున వడంకుచు నిట్టూర్పుపుచ్చి యాతనిని బలముగా నొక్కమ్మడిఁ జిమ్మివైచెను. అట్లామెచేఁ జిమ్మఁబడి యాతండు మొదలుతెగిన పెందరువుంబోలె నేలఁగూలె. మఱియు నాతనిమూలమునఁ దన కెట్టియిక్కట్టువాటిల్లునో యని భయము నొందుచు

కాకయున్నే. కావున సుజ్జ్వలాలంకారభూషితుండవగు నన్నుం గాంచి సైరంధ్రిమానసంబు నాయెడం దగులుకొనును. నీవు నిక్కముగ నాప్రాణములపైం బ్రేమగలదేని దాని నెట్టిన నొడంబఱుపుము." అని యాతఁడు తన మోహంబువిడువక ప్రార్థింపసాగె. ఇట్లుసోదరుని ప్రార్థ నలం గాంచి యాతనిమూర్ఖతను మనంబునం గుత్సించుచు "పాపాత్మా! నీవు నిక్కముగ కాలహస్తగతుండ నైతివి. నీమూలమున సోదరు లును వినాశోన్ముఖులగుట మిగుల శోచనీయము. నీ విట్టి యకార్య మును జేయ సమకట్టుటయెగాక నన్ను దాని సాధింప నియోగించుట మిగుల దుఃఖకరము. ఒకఁడుచేసినపాపంబునం గులమంతయు నాశంబు నొందు నను ప్రాజ్ఞులవచనంబులు నిక్కంబులయ్యె. నీపాపమున నీవు మాత్రమే నశింపక స్వజనమునంతయు నశింపఁజేయుదువు. ఐనను నీమాన సంబు దానియెడఁ దగుల్కొని మరలదేని కార్యాంతరవ్యాజంబున మద్యమును మధురాన్నమును జేసి సిద్ధపఱుపుము. దానిం గొనితేర నామెను నీయంతిపురికిం బంపఁగలదాన. అచ్చట నేకాంతమున నామె నెట్టిన సామోపాయంబుల లోఁగొని కార్యసిద్ధిం బడయుము." అని సోదరి యాతని ననునయించి పంప నాతం డతిత్వరితగతి గృహంబుఁ జేరె. రాజభోజ్యార్హంబులగు వివిధమాంసంబులను, వివిధరూపములగుభక్ష్య ములను, మధురములగు నన్నపానములను నేర్పరులగు సూపకారులచే నాయత్తపఱచెను. ఇట్లు సుధేష్ణ కీచకునితో రహస్యాలోచనము చేసిన దగుట, సైరంధ్రి నాతని యింటికిఁ బంప నిశ్చయించి "సైరంధ్రీ, నే నియ్యెడ మిక్కిలి దప్పిఁగొనియుంటిని. కీచకునిగృహంబున కేఁగి వివిధ పానంబులఁ గొని యేతెమ్ము" అని యాజ్ఞాపించె. అంత సైరంధ్రి "అమ్మా! నే నాతనిగృహంబునకుం బోఁజాల. అతఁ డెట్లు కామవశుఁడై సిగ్గఱియున్నవాఁడో నీకుఁదెలియనిదికాదు. తొల్లినీయింటం బ్రవేశించు నప్పుడు చేసినసమయమును దలంపుము. నాపతుల కనిష్టముగ నిచ్చట కామచారిణినై యుండఁజాల. కామవికారమునను లోనై కీచకుఁడు నన్నవమానపఱచుం గావున నే నాతనిగృహంబునకుం బోఁజాల నీకింక పలువురు సేవకు రాండ్రుగలరు. వారిలో నొక్కతె నక్కార్యమున నియో గింపు" మని ప్రార్థించెను. నువ దేర నేఁ బంపిన ని న్నాతఁడు ముట్టనేరఁ డని పలికి యామె బంగారుపాత్ర మొంం డొసంగె. ద్రౌపదియుఁ జేయు

నదిలేక మిగులం గుందుచు "నిక్కముగ నాభర్తలం దప్ప నితరుల నే నెఱుంగనేని, సమీపమున కేఁగిన నన్నుఁ గీచకుం డేమియుఁ జేయ లేకుండుఁగాత" యని పలుమఱు ప్రతిజ్ఞ చేయుచు, నొక్కింతసేపు జగచ్చక్షువగు సూర్యభగవాను నారాధించెను. పద్మబంధు డామెయిక్కట్టుల నెఱింగి యామెను రక్షింప నొక్క రక్కసుని నియోగించె. అతండును పరోక్షితుండై యామెవెంట నంటియుండె. ఇట్లు పాంచాలి యన్నన కీచక గృహంబున కేఁగ నాతఁ డామెం గాంచి నదిఁ దాఁటువాఁడు నావను జూచినట్లు మిగుల సంతసమంది లేచెను.

కీచకుఁడు ద్రౌపదిని బరాభవించుట

ద్రుపదరాజపుత్రిం గాంచి కీచకుం డిట్లు పలుకం దొడంగెను. "రమణీ నీకిదే స్వాగతము. ఈదినము నాకు సుప్రభాతము. ప్రాణనాయికవగు నీవు నన్నుం జేరితివి. ఇఁక నీవు నాకుఁ బ్రియ మొనరింపుము. దివ్యాంబరముల ధరియించి యమూల్యరత్నాలంకృతుల నలంకరించుకొని, మేలుబంగారుమాలలఁదాల్చి, ఈయున్న నాశయనము నలంకరించి, నాతోఁగూడి మాధవీమద్యముం గ్రోలి నన్నుం దనియఁజేయుము." అనినంత ద్రౌపది "రాజపుత్త్రి సురను దెచ్చుటకు నన్ను నియోగించెను. ఆమె చాలఁ దప్పిగొనియున్నది గాన మద్యము నిచ్చి వేగముగా నన్నుఁ బంపుము" అని పలికెను. అంతఁ గీచకుండు వేఱొక్కతె మద్యము నామెకుఁ గొంపోవునులే యనుచు నామె దక్షిణకరంబు పట్టెను. పాంచాలి "దురాత్మా! నేను నిక్కముగఁ బతులఁదక్క నన్యులమనములోనైనఁ దలంపనేనిఁ బతివ్రత నన్నిట్లవమానపఱచు నిన్నాపాత్రక మడంచుఁగాక యని యాతని జంకించుచుండె. అట్టియామెం గాంచి మఱియు ముగ్ధుండై యామె నుత్తరీయాంచలంబున నాకర్షింప మొదలిడెను. అంత నామెయు నాతని దూరముగఁ బోఁద్రోయుచుండెను. అట్టి యాతనిచెయిదముల నించుకంతయు సహింపనోపక యాద్రౌపది మిక్కుట మగు కోపభరంబున వడంకుచు నిట్టూర్పుపుచ్చి యాతనిని బలముగా నొక్కుమ్మడిఁ జిమ్మివైచెను. అట్లామెచేఁ జిమ్ముఁబడి యాతండు మొదలుతెగిన పెంపరువుంబోలె నేలఁగూలె. మఱియు నాతనిమూలమునఁ దన కెట్టియిక్కట్టు వాటిల్లునో యని భయము నొందుచు

నాయమ విరటునిసభాస్థలి శరణార్థినియైయేఁ జొచ్చె. కీచకుండును బరువెత్తు
చున్న యామెను రాజు చూచుచుండఁ గేశపాశంబు పట్టిలాగెను.
పాంచాలీరక్షణమునకై సూర్యునిచే నియోగింపఁబడినరక్కసుఁడు వాయు
వేగంబున నాకీచకాధము నెత్తివైచె. ఇట్లాతనిచే నెట్టువడి చైతన్యం
బెడలి, యాతఁడు భూమియందు పొరలఁగె. విరటసభారంగమ్మున నాసీను
లైయున్న భీమసేనయుధిష్ఠిరు లిద్దఱు నట్లు సంఘటిల్లు ద్రౌపదీపరాభవ
మును సహింపక పరికించుచుండిరి దురాత్ముండగు కీచకుని ప్రాణంబులకుం
బాపం దలంచి భీమసేనుండు దంతములఁ బటపట కొఱుకుచుండె.
ఱెప్పలు విస్ఫార నేత్రంబులు ధూమచ్ఛాయాపరిపూరితంబు లయ్యె.
గాత్రంబునఁ జెమ్మటఁ గ్రమ్మెను. బొమలు ముడివడెను. భీమసేనుం డాత్మీ
యఫాలభాగంబును గరతలంబున నొత్తుకొని కోపంబు మఱియు నగ్గ
లంబు కాఁగా నొక్కమ్మడి లేవ నుంకించెను. అంత యుధిష్ఠిరుం డద్దాని
పరికించి యంగుష్ఠంబు సంగుష్ఠమున నించుకంత నొక్కి భూరుహంబు
గాంచి విఱువ నుంకించు నాతని మదద్విరదముంబోలె నివారించి
“ఓయీ కట్టెలకునై యీభూరుహంబు నేల భంగింపఁ జూచెదవు.
అవ్వల మఱికొన్ని వృక్షంబులు గలవు. వానిని జేకొమ్ము” అని యోదా
ర్చెను. అంత ద్రౌపదియు సభాస్థలిం జేరి తనపతులు దీనులై యుండుటం
గాంచి కుయ్యిడుచుఁ గోపం బంతకంతకు దహింపఁ జేయుచుండఁ జుఱ
చుఱ చూచుచు, విరటుదిక్కు మొగంబై “మహనీయులును దానశౌండు
లును నప్రతిగ్రాహకులును శత్రుభయంకరులు నగు గంధర్వులభార్య నగు
నన్ను దురాత్ముండగు సూతపుత్రుండు భంగపఱచుచుండె. మత్పతుల జ్యా
ఘోషము దుందుభిధ్వానమువోలె భయంకరమై చూపట్టు. అట్టిమత్ప
తులు కోపించిరేని ముల్లోకముల దహింపఁ జేయఁగలరు. కాని ధర్మ
పాశములఁగట్టువడి మిన్నకున్నారు. ప్రచ్ఛన్నులై శరణాగతులకు
రక్షకులై మెలఁగుచుందురు. అట్టి మహనీయు లీదురాత్ముండు తమప్రియ
పత్నిఁ బరిభవించుచుండ నుపేక్షాతత్పరులై యుండిరి. ఇట్టియెడ
రాజు రక్షకుఁడై మానభంగము గాకుండఁ జూడవలయుఁగాని, తానై
విరాటుండు ధర్మదూషణము చేయుచుండఁ జేయునదేమి? భూభరణకార్య
నిబద్ధుఁడగు నృపోత్తముఁడు తనయెదుట నిట్టికార్యము జరుగుచుండ
నుపేక్షించుట యెంతవిపరీతము? ఓసభ్యులారా! మీరలైన పరికింపుఁడు.

మత్స్యనృపతియును గీచకుండును నెట్టిధర్మంబు నెఱుంగని వారలో, సతని సభలోఁ బెద్దలుగూడ సత్యధర్మంబు నెఱుంగంజాలరు" అని యివ్విధంబునఁ గంటఁ బెన్నీటికాల్వలు దొఱుంగ, ద్రోపది యమ్మానవపతి నుపాలంభించె. అంత విరటుండు "ఓయమ్మా! మీయిరువురకుఁ బరోక్షంబున జరిగిన యీవివాదకారణంబు నాకెఱుఁగరానిది. అట్టిది యెఱుంగక నే నెట్లు న్యాయ్యంబు బలుకనేర్తు"నని పలికె. దీనినంతయుఁ బరికించుచున్న సభ్యు లప్పరమపతివ్రతను సాధూక్తుల గారవించి, కీచకుని యెడ నికృష్టభావంబుఁ బ్రకటించి "నిక్కముగ నిరుపమానరూపలావణ్యాములుగల యీయమ్మ మానవాంగన కాఁజాలదు. ఈమెం బెట్టఁబట్టిన యాతండు మిగుల భాగ్యవంతుండు" అనిపొగడఁదొడంగిరి. అంత ధర్మజునకుఁ గోపవశంబున ఫాలతలంబు స్వేదాక్రాంతం బయ్యె. అతండు ప్రియతమయగు ద్రోపదిం గాంచి 'ఓసీ! నీ విచ్చట నిలువక శీఘ్రంబ యంతఃపురికిం బొమ్ము. వీరపత్నులు భర్తల ననురోధించి యిక్కట్టు పాల్పడుదురు. శుశ్రూషచే భర్తృలోకంబుఁ బొందంగలరు. సూర్యసమాన తేజస్కులును గంధర్వవరులు నగు నీపతులు కోపంబునెఱపఁ గాలంబు కాదని తలంచి మిన్నకుండి యుందురు. దేశకాలముల నరయక యూరకే రోదనముఁజేయుచుఁ గొలువున్న యీరాజసభ నేల సంకటపఱుతువు? పొమ్ము. నీభర్తలు నీ కపకారము గావించినవారిని దండించి నీకుఁ బ్రియంబు గలిగింపఁగలరు" అని సుగూఢముగ నుత్తరువిచ్చెను. "ద్యూతప్రియుండగు జ్యేష్ఠుండుగలయమ్మహాత్ములు సమయానుకూలముగఁ బ్రవర్తింతురుగాక" యనిపలికి సుధేష్ణాగృహంబునకుం జని యున్ముక్తకేశకలాపయై, యారక్తనేత్రాంతయై యుండె. మిక్కిలిగ నవ్వరారోహ శోకావిష్టయైయుండ నామె వదనమండలము మేఘావరణము దొలంగిన చంద్రబింబంబువడువున విరాజిల్లె. అంత సుధేష్ణ యాయమవికార రూపముం గాంచి "మానినీ, ని న్నెవ్వ రీవిధమ్మున దండించి యప్రియమ్మాచరించిరో తెలియఁజెప్పు" మని ప్రార్థించెను. నీవు "సురాహరణార్థమ్ము నన్ను నియోగింప నేను గీచకగృహంబున కేఁగ నాతండు నన్ను విజనంబున దండించి విడిచిపుచ్చె. మఱియు సభారంగంబునందును రాజసమక్షంబునఁ బరిభవించె"అని ప్రతివచనంబు లిచ్చె. "నీకిట్టివి ప్రియంబు గావించిన యమ్మానవాధముని వధింతు నని సుధేష్ణ పలికె." "నాయెడ

నిట్టి యకార్యం బాచరించు యాతం డెవ్వారికి రోషంబు గల్గించునో వారిచే నాతఁడు వధ్యుండగు" నని పాంచాలియు మాఱుపల్కె.

ద్రౌపది భీమునకుఁ దుఃఖంబు దెలియఁజేయుట

ఇట్లు కీచకాధమునిచేఁ బరిభవము నొంది యవ్వరారోహ యాతని నెట్టైనం జంపింపం దలంచుచు, స్వగృహంబుఁ జేరి శరీరమ్మును వస్త్రంబును జలంబులఁ బ్రక్షాళితంబులఁ గావించి, యుపస్పర్శం బాచరించి, దుఃఖించుచు 'ఏమ్మని చేయంగలదాన? ఎక్కడ వ్యాపరించుదును! ఈ కార్యంబు నా కెట్లొడఁగూడును' అని మిక్కుటమ్ముగ వగచుచు, మానసవీధి భీమసేనునిఁ బరామర్శించెను. అనంతరంబు భీమునందుఁదక్క నీకార్యంబు సాధింప నలంతిగాఁడని నిశ్చయించి శయనతలంబు విడిచి పవనతనయాన్వేషణార్థినియై బయలువెడలె. మానసంబున నాతనిసన్నిధి చేసికొని "అధురాత్మ! యేఁడట్లు నన్ను వమానపఱచుట కన్నులారఁగాంచియు, నెబ్బంగి నిద్రించుచున్నవాఁడవు?" అని పలుకుచు నలువంకలఁ బరికించుచు భీమసేనగృహంబుఁ జొచ్చె. అచ్చట మారుతసూతి పంచాస్యంబుం బోలె నిట్టూర్పులు పుచ్చుచు గాఢముగ నిద్రించుచుండె. అల్లనల్లన నాతని సమీపించి, యాతని దనబాహుపాశముల బిగ్గఁజుట్టి మెల్లన మేల్కొల్పఁదలచి "రాజపుత్ర! యేల యిట్లు మృతప్రాయుండవై కదలకుంటివి? జీవించియున్న పురుషవరేణ్యుని భార్య నిట్లొరులు గారింపనేర్తురే. లెమ్ము లె"మ్మని ప్రబోధించెను. భీమసేనుండును మేల్కొని శయనతలంబు వీడి "మనోహారిణీ! నీరూపు విన్నపోయినది. నిన్ను బాండురవర్ణ మాక్రమించి యున్నది. నీ వెక్కారణంబున మదంతికంబున కేతెంచితివో విశదముగాఁ దెల్పుము. సుఖదుఃఖంబులను బ్రియాప్రియంబులను దెలిపిన నేఁ దెలియనేర్తును. నేను నీకుఁ బరమవిశ్వాసార్హుఁడను. ఆపత్సమయంబుల నిన్నుద్ధరింపఁగలను. శీఘ్రముగా నీవచ్చిన ప్రయోజనం బెఱింగించి కర్తవ్యకార్యంబున నియోగింపుము. మరల నొరు లెఱుంగకుండ శయనగృహంబునకుఁ బొమ్ము." అని పలికె.

"యుధిష్ఠిరుభార్య నగు నా కూరడిల్లుట యెక్కడిది? సకలవిషయంబుల నెఱింగిన నీవేల నన్నిట్లు ప్రశ్నించుచుంటివి? తొల్లి నన్ను ద్యూతక్రీతయగు దాసియని ప్రాతికామి కౌరవసభాసభ్యబృందము మధ్య

భాగమున నాకర్షించెనుగదా! అయ్యది నేఁటికిని నన్నుఁ బ్రజ్వలితమగు
పావకజ్వాలంబోలి దహింపఁజేయుచున్న యది. ఇట్టి మహావ్యసనం బనుభ
వించి ద్రౌపదిదక్క యేక్షత్రియపుత్త్రికలు ప్రాణంబులధరింప నిచ్చగింతురు?
వనవాససమయంబున సైంధవునిచే మానభంగపడితి. ఇట్టియిక్కట్టుల
నైరింప నెవ్వరోర్తురు? నేఁడు మత్స్యరాజసమక్షంబున నద్దురాత్ముం డగు
కీచకాధమునిచే బాహతలంబునఁ బ్రహరింపఁబడితి. ఇట్టి దుఃఖంబు
సహింప నెవ్వరు పాల్పడుదురు? ఇట్లు పలువిధంబులగు క్లేశంబులనుఁ
బొల్పడునన్నుఁ బలుమఱు పరికించుచుంటివిగదా! ఇట్టి నేఁ బ్రతికియున్న
నేమిఫలంబు గలుగఁగలదు? నే నీసైరంధ్రీవేషంబున విరటరాజమహిషీ
గృహంబున నివసించుచుండ, విరటభూపాలునికి స్యాలకుండును, సైన్యా
ధీశ్వరుండును నగు కీచకుం డను దురాత్ముండు నన్ను భార్యఁగఁ గోరి
బాధించుచుండు. వధ్యుఁడగు నయ్యధమునిచే నిర్బంధింపఁబడుచున్న
నామనంబు పరిపక్వంబగు ఫలంబువలె వ్రక్కలగుచున్న యది. ఇట్టి
దుర్దశకంతకును మూలకారకుఁడగు ద్యూతకారుఁడగు మీయన్నను
నిందింపవలయును. ద్యూతంబున ధనధాన్యంబులఁ దొలంగి సన్యసించిన
వారివలె నెవ్వ రూరకుందురు? నిష్కళంకంబులు పణంబులుగా నొడ్డి
పెక్కువేలవత్సరంబులు రేయింబవళ్లు ద్యూతక్రీడ పచరించిన నెవ్వాని
ధనధాన్యంబులు, దాసదాసీజనంబులు, వెండిబంగారంబులు, రథా
శ్వాదులు, గజమేషాదులు క్షీణంబులు గావో యట్టిరాజాధిరాజు
ద్యూత మనుమిషచేఁ దనసంపదల శత్రులపాల్పఱచి మహాఘనుండై తన
కర్మంబుల చింతించుచు మిన్నకుండెను. ఎవ్వనివెంటఁ బదివేలగుఱ్ఱంబులు
బయలువెడలి యనుసరించుచుండునో యట్టిసార్వభౌముఁడు నేఁ డొకరి
యింటఁ గుడుచుచు, నొకరివెంటఁ దిరుగుచు ద్యూతంబు నడుపు
చుండెను. ఏరాజవర్యుని బహురథంబులతోడ సామంతమండలాధిపతులు
గొలుచుచుండిరో, ఏభూపాలుని మహాసనంబుల వందలకొలంది దాసీ
జనంబు లూడిగంబులు సల్పుచుండిరో, ఏమహీనాయకుండు ప్రతిదినంబును
నతిథులను నన్నదానంబులఁ దనిపెనో యట్టి నీయన్న నేఁడు ద్యూతజా
తంబైన మహావిపద్దశచే నాక్రమింపఁబడియె. ఏరాజవర్యుని సాయంప్రాత
స్సమయములందు మణికుండలోజ్జ్వలులగు సూతమాగధులు సేవించు
చుండిరో, ఏరాజవర్యుని సభాంగణంబున వేనవేలుఋషీశ్వరులు సభ్యులై

నిలిచియుండిరో, ఎనుబదియెనిమిదివేలు గృహమేధు లేపురుషవర్యుని భజించుచుండిరో, అప్రతిగ్రాహకులకు పదివేలకుంపియతీశ్వరుల నే మహీరమణుండు భరియించుచుండెనో, దయాధర్మంబులును, నకోపనత్వంబును నెవ్వానికి నైజగుణంబులో, ఏరాజ్యలక్ష్మీభర్త యంధవృద్ధబాలానాథుల నెల్ల రక్షించుచుండునో యట్టియుధిష్ఠిరుండు మత్స్యపతి కొలువున నిలిచి పరిచారకుండై వినయంబునెఱపుచు సేవించుచుండె. రాజాధిరాజులు కరంబులఁదెచ్చి యెవ్వాని యవసరంబునకుఁ బ్రతీక్షించుచుండిరో యాతం డిప్పు డొరులసమయంబు నిరీక్షించుచుండెను. పృథివీ పాలకు లగు భూపాలకు లెవనివశమున మెలఁగు చుండిరో యాతఁడిప్పు డొరులవశమున మెలంగుచుండెను. ఏభూకాంతుఁడు తేజోబలంబున సూర్యునిఁబోలి దిక్కులఁ బ్రకాశింపఁజేయుచుండెనో యట్టి యారాజోత్తముం డుదాసీనుండై విరటభూపాలునకు సేవకుండై ప్రియవచనంబుల నెఱపుచు కాలము పుచ్చుచుండె. యాయమనందనునిఁ జూడ నెవ్వనిమనంబు గలఁగకుండును? ఏకఠినహృదయంబు ద్రవీభవింపదు? ఇట్లు పలువిధములగు దుఃఖములకుఁ బాల్పడి యనాథవలె వగలఁబొగులుచు, శోకసముద్రంబు దరియం జూచు నన్నుఁ జూడకుంటివా?

ఉత్తమకులసంజాతుండవును, మహాపరాక్రమవంతుఁడవునగు నీవు జనించినయుత్తమకులంబును మఱుఁగుపఱచి వల్లవజాతివాఁడ నని చెప్పికొనుచు, నీవిరటునింట సూపకారుఁడవై సేవచేయుచుండఁ జూచుట నిక్కము నాహృదయమును శల్యములె బాధించుచున్నది. జనులెల్లరు నిన్ను నీచకులజాతునిఁగా భావించుచుండ నయ్యది క్లేశకరముగాదా! విరాటరాజు సంతుష్టచిత్తుఁడై యెన్నఁడేని నిన్ను మల్లులతోడను, సింహశార్దూలవృషభాదులతోడను బోర నియోగించిన నంతిపురింగల యెల్లర మానసంబులు వికాసమునొందును. నేనుమాత్రము శంకాకులితస్వాంతనై విన్నఁదనము గదుర జూచుచుందును. ఒకానొకప్పుడు సుదేష్ణ యానందించి యచ్చటకాంతలకుఁ బారితోషిక మొసంగుచుండ వారెల్లరు నేకగ్రీవముగా నిలిచి "చిరకాలమునుండి మనయంతిపురమున నుండుటంబట్టి యీసైరంధ్రి యావల్లవునియెడ జాలిఁగొనియున్నది. సూదుఁడుకూడ నీమె కనురూపసంపద గలవాఁడె. స్త్రీలచిత్తమెఱుంగుట మిక్కిలి కష్టసాధ్యము. వీరిరువురును మనయంతిపురంబుననే నివసించు

వారలు" అని వచించుదురు. దానం జేసి యవ్విరాటపట్టమహిషియు, నన్ను నీయెడ ననురాగముగలదానిగాఁ దలంచి కోపించి, జంకించి నన్నుఁ బనిచి నాయెడ శంకనొందు. అట్లామె నన్ను జంకించుచుండ నామనంబున వచింపరానిదుఃఖ మలముకొనెను. ఇట్లు భీమపరాక్రముండవగు నీవు వంటలవాఁడవుగ, మహానుభావుండగు మీయన్న ద్యూతకారుఁడుగ నిలువ నే నెట్లూరడిల్లఁగలను?

ఏకరథుండై మర్త్యామర్త్యులనెల్ల రణరంగంబున జయించినమహావీరుఁడగు నర్జునుఁడు నేఁడు విరటరాజపుత్త్రికలకు నాట్యగురువుగా నియుక్తుండయ్యె. ఖాండవదహనంబున నగ్నిదేవునిఁ దనిపిన పరాక్రమశాలి నేఁడు కూపాగ్నిఁబోలి నిస్తేజస్కుండై యున్న రూపుఁ దాలిగి యుండె. ఎవ్వాఁడు కుండలశోభితుండై జ్యాఘోషంబుగావింప భూలోకంబంతయు నగారణ్యవపర్వతాదులతోఁగూడి కంపించుచుండెనో, శత్రురాజలోకంబు భయంబు మనంబులఁ గదుర వెన్నిచ్చిపాఱునో యట్టిదీర్ఘబాహుండును దీర్ఘధన్వుండు నగు నర్జునుండు వేడిరూపునుండి కన్నికలకుఁ గీతకళలఁ జెప్పుచు మిగుల వెతగలిగించుచుండు. కన్యాశత పరివృతుండై విరటునిదరినుండునపుడు దిక్కులన్నియు వ్రక్కలైనట్లు దోఁచుచుండు. నిక్కముగఁ గొంతి యిట్టి యిక్కట్టఁబాల్పడియున్న ధర్మజార్జునుల నెఱుఁగదు.

గోపాలకుండై వృత్తికిం దగు రూపంబు గైకొని వచ్చుపాండుభూపాలుఁ చిన్నపట్టి సహదేవుం గని వెల్లనైయుండు నీముద్దుతమ్ముండును, బాపరహితుండు నగు సహదేవుండు గోపాలవేషమూని, గొల్లలముందు నడువఁ జూచునాకు నిక్కముగ జ్వరంబు వచ్చునట్లుండు. ఆతని చరిత్రములు చింతించుచుండఁ గంటికిం గూర్కు రాదు. మాయత్త పెక్కుసారులు గుణవంతుఁ డనియు శీలవంతుఁ డనియు నావన్నెకాని బలుమఱు వాకొనుచుండు. ధర్మాభినివేశముగలవాఁడును లజ్జాయత్తుఁడు నగు నాపట్టి వనంబున భద్రముగ నీచే నరయఁదగువాఁ డని యామె వనప్రయాణసమయంబున నాకప్పగించె. రాజు ననుసరించియుండువాఁడు సుకుమారుండు నగుట నీతనికి నీవు స్వయముగా బువ్వంబు పెట్టు మని యామె నాకుం జెప్పె. అట్టి యాసుకుమారుండు నేఁ డిట్లీవిరటుకడ నిడుమలఁ బడుచుండఁ జూచి యేనెట్లోర్వనేర్తు?

నిరుపమానసౌందర్యశాలియు, శస్త్రాస్త్రవిశారదుండును, ధీశాలియు నగు నకులుండు విరటునికడ నశ్వపాలకుండై జనవాశ్వంబుల వినయ మునకుం దెప్పుచుండం జూచి యే నెట్లు సుఖం బుండ నేర్తును? ఇట్లు యుధిష్ఠిరనిమిత్తంబులగు దుఃఖంబులు నాయభ్యంతరంబు సొచ్చి మిక్కిలి వేధించుచున్నయవి.

రాజపుత్త్రి నగు నేను ద్యూతకారుఁడగు మీయన్న కారణ మున నీ రాజగృహంబున సైరంధ్రి వేషం బూని చరించుచు సుధేష్ణకడ దాసిగా నుంటిని. నాకు సంఘటిల్లిన యీసంకటపాటుం గాంచుము. ఇట్టిదుఃఖం బెన్నండేని నంతంబునొంది సుఖంబులు గలుగునో యను నాస నిట్లుంటి. కార్యసిద్ధులును జయాపజయంబులును మానవులయెడ నస్థిరంబు లని తలపోసి, మీయభ్యుదయంబు నాకాంక్షించుచు నివసించు చుందు. చక్రంబున నాకులంబోలె యర్థవ్యసనంబులు పరివృత్తిగాంచు నని యూరడిల్లియుందు. "పురుషుండు దేన జయంబుగాంచునో దాననే పరాజయంబునొందు. పురుషులు పరులకు సమృద్ధముగా దానంబు గావించి యాచింపస్థితికి వత్తురు. పరుల నధఃపతితులఁగావించి తాముసు బతనము నొందుదురు. దైవంబు చేయరానిదియు, దైవంబు నతిక్రమింపు నట్టిదియు నేదియు నుండఁబోదు. నీరెచ్చటనుండి వచ్చినదో మరల నచ్చ టికే పోవును" అని యిట్లు తలంచి మీయభివృద్ధిని గోరుచు నాశ్వాసిల్లు చుందు. విజ్ఞానశాలురు దైవానుకూల్యమునకై ప్రయత్నంబు సలుప వలయును. నాథా! వీక్షింపుము దైవదుర్గతి. పాండవేయులయగ్ర మహిషియు ద్రుపదుని పుత్త్రియు నగు నేను మున్ననేకసామంత రాజ పత్నులచేఁ గొలువఁబడుదాన నిప్పు డీవిరట రాజపత్నికడ గొలువుండి యియ్యనర్థంబునకు లోనైతి. సోదరులు, బలవంతు లగుపతులుగల నా కిట్టిసంకటపాటు వాటిల్లుట దుర్దైవవిలాసముకాక మఱియేమి? నేను గాక మఱియెవ్వతె యిట్టిదుఃఖపాటును సహింపఁగలదు. బాల్యమున నే నేదో దైవమునెడ ననాదరమ్ము నాచరించియుందు. నే నెట్లు సుఖంబుం బొందితినో నీకుఁ దెలియనివిషయంబుగాదు. అట్టి నేను దాసిగానుండుట దైవికమ్ముగాక మఱి యొం డేమగును? భీమమహాధనుష్కుండగు నర్జు నుండు నివురుగప్పిన నిప్పుచందంబున నుండ నీయిక్కట్టు దైవికంబు

గావనియు నొకబుద్ధి వొడమెడు. ఇట్టి మీపతనము నిక్కముగ నా కొఱకే గూడినట్లు దోచుచుండు. సాగరపర్యంతము వ్యాపించియుండు భూమియంతయు నెవతె వశమున మెలఁగెనో యట్టి నేను విరటరాజ పత్నికి వశవర్తినినై మెలఁగు చుంటి. ఎవతెను ముందు వెనుకల దాసీజనంబులు పరివేష్టించియుండిరో యట్టి పాండవపత్ని నేఁ డొరులకు దాసి యయ్యె. ఎవ్వతె మహానుభావురాలగు కుంతికిం దక్క యొరులకు గంధమ్ముఁ దీయదో యట్టి పాంచాలి నేఁ డొరులకుఁ జందనంబులు దీసి యిచ్చుచుండు. ఇట్టి కష్టకార్యములవలన నాచేతు లెట్లున్నవో యని యతనికిఁ గాయలుగాచియున్న చేతులఁ జూపెను. విరటరా జొరులు తీసిన చందనం బొల్లఁడు కాన, నే నెల్లయెడల నానతవదన నగుచు నాతఁ డేమనునో యని భయంబు గదుర చూచుచుందును" అని యామె యిట్లు దుఃఖంబుల వెలువరించుచు మెల్లన నేడ్వందొడంగె. "నాథా! తొల్లి నే దేవతలను మిక్కిలి యపచారంబు గావించియుందు" నని యామె వగలఁబొగుల భీముండును నార్ద్రుండై కిణాంకితములగు నామె చేదోయిఁబట్టి వెతఁగుందుచు మెల్లన నిట్లనియె.

భీమసేనుండు ద్రోవది నూఱార్చుట

"మగువా! మిగుల మృదులము లగు త్వదీయపాణిపల్లవములు కిణాంకితములై జాజువాఱినతఱి నా యీ గదాదండధారణము ఫల్గునుని గాండీవవాహకత్వంబును నిష్ప్రయోజనంబు. విరటుకొలువుకూటంబున నద్దురాత్ముచేఁ బదాహత వగు నిన్నుం గాంచి యే నప్పుడే కదనంబు పచరించి యీమాత్స్యుల నుక్కడఁగింప నెంచితినిగాని యమతనయుం డట్టియెడఁ గనుసైగచే నన్ను వారించె. దానింగాంచి యే నెట్టకేలకు మిన్నకుంటి. ఇంతకుమున్ను నీయెడ నపచారంబు గావించియున్న సుయోధన కర్ణశకునిసౌబలదుశ్శాసనులకు శిరచ్ఛేదంబు ఘటింపకపోతి నని యే నెల్లయెడల విచారంబునఁ గుందుచుందు. ఆ యపచారంబు శల్యంబుంబోలి నాహృదయంబును బాధించుచున్నది.

కళ్యాణి! నామాటల మన్నించి, ధర్మంబు నవలంబించి క్రోధంబును ద్యజింపుము. నీకు సంఘటిల్లిన యీసంకటపాటు పాండవాగ్రజునకుఁ గాని ధనంజయునకుఁగాని కవలకుఁగాని, శ్రవణపథగోచరం బయ్యె నేని

నిక్కముగ వారు సహింపక ప్రాణత్యాగంబు గావింతురు. అట్టి నా ప్రియసోదరులు చనినఁ బిదప నే నెట్లు మొండినై ప్రాణంబుల ధరియించు వాఁడ.

దేవీ! పూర్వకాలంబున సుకన్య యను కన్యామతల్లి తన పతియగు చ్యవనుండు వల్మీకత్వంబుం బొందియుండ ననుసరించియుండె. ఇంద్రసేన యను సహస్రవర్ష వయఃప్రమాణుం డగు భర్త ననుచరించియుండె. జనక రాజపుత్రియు వనవాసోన్ముఖుండగు భర్త ననుసరించి కాననంబులఁ బలుబాముల గుడిచె. రూపశాలిని యగు ననసూయయు నన్ని సంపదలఁ దోలంగి తన పతియగు నగస్త్యు ననుసరించె. సావిత్రియు ద్యుమత్సేన పుత్త్రుం డగు సత్యవంతు ననుసరించి యమలోకంబు చొచ్చె. ఇట్లు పలువురు పతివ్రతలు పతుల ననుసరించి కష్టసుఖములఁ బాలువడయు చుండిరి. అట్ల నీవును గొంచెము కాల మోర్మినూని యుంటివేని పదు మూఁడగు నీయజ్ఞాతవత్సరం బతీతంబగుడు మరల రాజమహిషివి కాఁగలవు. అంతఁదనుక యించుక యోపికఁబట్టి యుండుము" అని యాశ్వాసించె.

అంతఁ బాంచాలరాజపుత్రి "మనోవల్లభా! దుఃఖజాలంబుల సహియింపనేరక యి ట్లశ్రుమోచనంబు గావించితిని. నే నీక రాజ్యం బొందుట యనునది కల్ల. పెక్కుమాట లేల? ఇప్పుడు దాపరించిన యీ యాపదకుఁ బ్రతీకారంబుఁ జింతింపుము. నారూపు సుధేష్ణరూపుకంటె మిన్నయై యుండుటంబట్టి నిత్యము మత్స్యమానవపతి యెట్టు లీమె నపహరింతు నని యోజించుచుండు. అయ్యది యెఱింగి దుష్టుం డగు కీచకుండు నన్ను బ్రార్థించుచుండు. దానికి నే మిగులఁ గినుకఁజెందియుఁ గోపంబు నించుకంత యడంచికొని 'యోయీ! నేను మహానుభావులగు గంధర్వుల కేవురకు భార్యను. సాహసకారులగువార లిట్టి యకార్యము నాచరించు నిన్ను దుదముట్టింపఁగలరు సుమీ' యని కామమోహితుఁ డగు నాతనికి బోధించితిని. దాన నద్దుర్మతి 'యింతీ! నే నిట్టి జంకెనలకు శంకఁ బొందువాఁడఁగాను. గంధర్వులు నూర్గురైనను నూఱువేలైన నవలీల నుక్కడఁగింపఁ గలను. నన్నుమాత్రము నీవు చేకొనుము. అదియె చాలును.' అని ప్రత్యుత్తరం బొసంగె. ఇట్లు కామాతురుండై మత్తిల్లి యున్న యయ్యధమునితో నిక్కముగా నాకొరులవధించుటయు వధించు

చుండఁజూచుటయు నిచ్చగింపను. నీ వెన్నఁడును గంధర్వుల కెదురై నిలువం జాలవు. కులశీలముల రక్షించుచుండుటం జేసి నీవు ప్రాణంబుల దక్కించుకొనఁగలిగితి' వని షంపలించితిని. అంత నాతండు తనయప్పతో నేమియో మంత్రించి నిజావాసంబుఁ జేరఁజనియె. ఆమెయు నన్ను స్నేహంబునం జీరి "సైరంధ్రీ! కీచకునిగృహంబునుండి మద్యంబు గొని" రమ్మని యాదేశించె. నే నాతనియిల్లు చేరంజన నాతండు నన్ను లోఁగొనఁ దలంచి సాంత్వనవాక్యంబులం బ్రవర్తిల్లె. నే నాతనిసాంత్వంబు ధిక్కరించి యాతనికోర్కెను నిరాకరింపఁ గోపించి నన్ను బలాభవింపఁ దలకొనియె. అట్టి యాదురాత్మసంకల్పం బెఱింగి నే నట్లు బాణవేగంబునఁ బలాయనంబు గావించి రాజగృహంబును జొచ్చితి. రాజుం గాంచునంతనే యాదుర్జాతి నన్ను బాదంబునం దాఁకి యవమతి ఘటించె. అట్లా యధముండు నన్ను గాలం దాచుచుండ విరటుండును, కంకుండును, రథికులును, పీఠమర్దులును, ధనుర్ధరులును, చెయిదములఁ దక్క యూరక చూచుచుండిరి. అంత నే రాజును గంకభట్టారకుని బహువిధంబుల నిందించితిని. దానిం గాంచియు సస్థానపతి యా యవినీతుని వారింపఁ నేరఁడయ్యె.

విరటసేనానాయకుఁ డగు నీకీచకాధముఁడు మిగుల పాపాత్ముఁడు, క్రూరుఁడు, ధర్మరహితుఁడు, పరస్త్రీరతుఁడు పరదారలఁ గామించి ధనంబుల సంపాదించు. పరులధనంబుల నపహరించు. కామవశుండై ధర్మమార్గంబు చొరఁడు. అవినీతుం డగు నాతులువ నన్నుఁ జూచునపుడెల్లఁ జంపం జూచుచుండు. ఆతని కిచ్చవచ్చినట్లు మెలంగఁజూచినధర్మనాశంబు సంభవిల్లు. సమయపాలనముగావించు మీకుఁ బ్రియపత్ని యుండ నేరదు. భార్య సురక్షితయయ్యెనే నపత్యంబు గుప్తంబుగాఁ గలయది. అపత్యంబు సురక్షితంబయ్యెనే నాత్మయు సురక్షిత మగును. ఆత్మయే భార్యయందుఁ బ్రజారూపంబునం బుట్టునని శ్రుతులు వాకొనుచున్నవి. భార్యచే నసంరక్షితుండగుభర్త యెట్లామెయందు జనియింపంగలఁడు? క్షత్రియునకు శత్రులసాధించుటకంటె వేఱొండుధర్మం బుండఁబోదు. ధర్మజుండును నీవును జూచుచుండఁగనే కీచకాధముఁడు నన్ను బాదంబున మొత్తె. తొల్లి జటాసురునిబారినుండియు, సైంధవునిబారినుండియుఁ గాచి రక్షించిన నీ వియ్యధముని జంపి యాతనిబారినుండి నన్నుఁ గాపాడుము.

షయ్యర్థకుని జట్రాతిపై వైచినమంటికుండవలె ప్రక్కలు గావింపుము.
ఇతండు ప్రాతఃకాలంబుదనుక జీవించియుండెనేని విషంబు పానంబుచేసి
నీయెదుట మిత్తిపాలంబడుదుఁగాని యిక్కీచకాధముని మోము చూడ
నేర" నని యివ్విధంబున నాక్రందనంబుగావించుచుఁ బాంచాలి య
ప్మహాబాహు నురఃస్థలంబు నాలింగనంబుఁ జేసె. భీమసేనుం డవ్వరారోహం
బిగ్గఁగవుంగలించి యోదార్చి కారణతత్త్వ యుక్తము లగుమాటలు
నచ్చెఁబల్కి కెంగేల నామెవదనకమలంబుఁ దుడిచి కీచకునియెడఁ బెన్న
లుకఁ బూని యామె కిట్లనియె.

భీమసేనుండు కీచకునిజంపఁ బ్రతిన సేయుట

"మగువా! నీచెప్పినచొప్పున బాంధవులతోఁగూడిన యద్దురాత్ము
యమసద్మమున కంపువాఁడ. దానికై యిట్టిశోకంబును దిగమ్రింగి కల
కలనాడు నెమ్మొగంబుఁ జూపుచు నీదినము సాయంసమయంబున వాని
తోఁ బాటుపడినట్లు నటించి సమయంబుసేయుము. మత్స్యరాజు
నిర్మించిన యీనర్తనాగారంబునఁ బగలు కన్యలు నృత్యగీతంబుల నెఱ
పుచు రాతిరి యిండ్లుం జేరుచుందురు. అచ్చట దృఢమగుశయనతలంబు
గలదు. నీ వాతఁ డిచ్చటువచ్చునట్లొడఁబాటుఁగావించితివేని వానికి
మృత్యువైన యాతనిపూర్వపితామహులఁ జూపింతును. ఆతనితో
యుద్ధంబుగావించు నన్నారులు చూడంజాలరు" అని యామెకుం
జెప్పె. ఇట్లు వారు మంత్రించికొని దుఃఖించుచుఁ గడుకష్టంబున రాత్రి
శేషంబును బుచ్చిరి. అట్లా రాత్రి గతించి ప్రభాతం బగుడు కీచకుండు
శయనతలంబువీడి రాజకులంబు సొచ్చి "చూచితివా! నాపరాక్రమంబు.
నిండుకొలువునఁ బాదప్రహారంబున నిన్ను భంగపఱిచిన రక్షించు
వా రొక్కరైనను గానరారైరి. నామమాత్రంబున కితండు మత్స్య
దేశంబులకు రాజుగాని యథార్థంబుగ సేనలన్నియు మదీయహస్తగతం
బులై యుంటచే నే రాజు నని చెప్ప నొప్పు. ఇట్టినన్నుం జేరిన నో
సుందరీ! నీసేవకుండనై పరిచర్యలఁగావింతు. దినంబున కొక్కనిష్క
శతంబు నర్పింతు. నూఱులకొలంది దాసదాసీజనంబులను మిగుల వడిగల
గుఱ్ఱంబుపూంచిన యరదంబును నర్పించువాఁడ" నని వేడుకొనియె.
'ఓయీ! నీవు నిక్కంబుగ నాసంగమంబు నపేక్షింతువేని నాచేయు సమ

యంబున కొడంబడుము. మన యీసంగమంబు సభకును, సోదరుల
కును దెలియరాకుండవలయును. అటుగాక యియ్యది వెల్లడియగునేని
గంధర్వులకుం జెల్లంబు గాఁగలయది యని యే నెంతయు వెఱగందు
చుందు. అట్లు నీవు గావించితేని నేను నీకు వశపడఁగలదాన" నని
యాసైరంధ్రి వాకొనియె. కామాంధుఁడగు నయ్యధముం డెట్లైన
నాయమం జేపట్టఁ గోరుచుండుఁగావునఁ దోడనే 'రమణీ! నీచెప్పిన ట్లొరుల
కెఱుకరాకుండున ట్లొక్కరుండనే పరిజనుల విడిచి సంభోగార్థినై
నీమందిరంబు చొచ్చువాఁడ. గంధర్వుల కివ్వార్త తెలియకుండునట్లు
మెలంగువాఁడ' నని యంగీకృతిఁ బ్రకటించె. అంత నప్పాంచాలి యాతని
మదనావేశంబునకుఁ గుత్సించుచు "మత్స్యజననాథుండు నిర్మించిన
యీ నర్తనాగారంబునఁ బగలు కన్యలు నృత్తగీతంబులఁ గాలంబు గడిపి
రాత్రి యావాసంబులకుం బోవుదురు. చిమ్మచీఁకటి గ్రమ్ముకొన నిచటికి
వచ్చువాఁడవు గంధర్వుల కిచ్చోటు దెల్లంబుకానిదై యుండు. ఇచ్చటి
మనసమాగమం బొరులకుం దెలియంజాలదు. దోషం బుండఁ బోదు."
అని యాతనికి సంకేతం బెఱింగించె. ఇట్లతని కవ్విధంబున బోధించి పాండ
వాగ్రమహిషి మాసంబు బోలె దీర్ఘంబగు నయ్యర్ధదినంబుంబుచ్చి యీ
వృత్తాంతంబు భీమసేనున కెఱింగించె.

### కీచకుని భీముండు జంపుట

సైరంధ్రీరూపంబునఁ దన్నాక్రమింప నెంచు మృత్యుకన్య యని
యామెం దెలియనేరక యామూఢుండు స్వగృహంబు జేరి కామమోహి
తుండై గంధాభరణమాల్యంబుల మనంబు నిల్పి బాగుగా నలంకరించు
కొనియె. నిర్వాణకాలంబునందలి దీపంబు కాంతియుంబోలె రమణీలలామఁ
బొందుఁగూడఁ దలఁచు నతనికాంతియు నెక్కువగాఁ దొడంగె. ముగ్ధుండై
యమ్మూఢుండు ద్రోవదిపలుకుల నమ్మియుండె. ఆమె సమాగమంబునఁజింతఁ
గూర్కియున్న యతనికి దివసం బతిక్రమించుటయుఁ దెలియరాదయ్యె.
పాంచాలరాజపుత్త్రియు మహానసంబున నున్న భీమసేనుం జేరి "నాథా!
నీచెప్పినచొప్పున నాతని నర్తనాగారమున నొంటిమై వచ్చున ట్లొడంబఱ
చితిని. మదమ్మువలన నయ్యధముండు గంధర్వులఁజీరికింగొనఁడు. కావున
నొంటిమై నిర్జనంబుగానున్న యానర్తనాగారంబు చొచ్చు నాదుర్జాతుని

హ్రదంబునుండి యాశీవిషంబునుంబోలె వెలువఱిచి నీపరాక్రమంబున
కును గులఖ్యాతికినిం దగునట్లు వధించి నాదుఃఖంబు నడంపుము" అని
ప్రార్థించె. అంతం బవనాత్మజుండు "లలనా! నీచెప్పిన చొప్పునం దప్పక
కార్యంబు సాధించువాఁడ. ఇక్కార్యంబున నాకొరులసహాయంబు వలదు.
కీచకునకు సంకేతంబు చెప్పితివని నీవు వచించుతఱి హిడింబుం జంపునపుడు
జనించినంతకంటె యుత్సాహంబుప్పతిల్లె. దేవపతియగు నింద్రుండు వృత్రాసు
రుంజంపిన తెఱంగున నీకీచకాధము ఖంజింతు. బాహ్యాంగణంబునం డైనను
గుప్తగహ్వరంబునం దైనను మడియించువాఁడ. కీచకునికై మాత్స్య
లొక్కయెడ యుద్ధంబునేయ సమకట్టిరేని వారింగూడం బొలియింతు
వాఁడ. ఆకోపంబునం దుర్యోధనుం జంపి భూభాగంబు గైకొనువాఁడ.
యుధిష్ఠిరుండు విరటుం దనయిచ్చవచ్చురీతిం గొలుచుంగాక" అని సింహ
ధ్వనింబోలు కంఠరవంబునం బలికె. ద్రౌపదియు "ప్రాణనాయకా! నాకై
నీవు సత్యంబు నిసుమంతయు మేరమీఱక యానీచుం బరిమార్పు" మని
వేఁడుకొనియె. భీమసేనుండును "మానినీ నేఁటిరాత్రి యంధకారంబున
నాతనికి గోచరుండఁగాక బంధుమిత్రులతోఁ గూడిన యయ్యధము
నీ చెప్పినట్లు మడియించువాఁడ. ప్రార్థింపఁదగని నిన్నుం గవయఁగోరు
నద్దురాత్ము శిరంబును వెయ్యివ్రక్కలఁ గావింతు" నని యామె నోడఁ
బఱచి, యారాత్రి యంధకారంబున నర్తనాగారంబుఁ జేరి దాఁగి
యుండి మృగేంద్రంబు హరిణంబునుం బోలె నాతని యాగమనంబుం
బ్రతీక్షించుచుండె. కీచకుండు ననేకమంగళాలంకారాలంకృతుండై
పాంచాలిం గవయు తలంపు ముప్పిరిఁ గొనం గామవశుండై సంకేతితమ్మగు
నర్తనాగారంబుం జొచ్చె. అంధకారబంధురం బగు నానర్తనాగారంబు
ప్రవేశించి యంతకుమున్నె యాగృహంబు చొచ్చి శయనతలంబు నలంక
రించి ద్రౌపదీపరాభవజనితక్రోధంబునఁ బ్రజ్వరిల్లుచున్న మహాపరాక్రమ
వంతుం డగు భీమసేనుం గరాగ్రంబున పరామర్శించె. మఱియు "ఇంతీ
నీకై వివిధరూపంబు లగు నలంకారంబులను దాసీశతంబులతోఁ గూడి
యున్న ధనసంచయంబును నాయత్తపఱచి యుంటి. అంతిపురంబును బలు
తెఱంగుల నలంకరించి యుంటి. అట్టి నాయాదార్యానులం గాంచి
నాయింటనుండు వరాంగనలు నీవు మిక్కిలి సౌందర్యవంతుండ వనియు

నీవలె దర్శనీయులు వేఱొరులు గా రనియు నన్నుం బ్రశంసించు చుందురు. అట్టి నేను నీకై యిట్టిసాహసంబున నొంటి వచ్చితిని" అని సంతోషమునఁ జంచలం బగుచిత్తంబున వాక్రుచ్చె.

అంత భీముండును "నిక్కముగ నీవు దర్శనీయుండవు. కాన నిన్నుం బ్రశంసించుకొనుచుంటివి. ఇట్టి స్పర్శమును నీ వెన్నఁడును జవి చూచి యుండవు. కామధర్మమర్మంబుల నెఱింగిన నీ వీస్పర్శను నెఱుంగఁ గలవు. నీకంటె స్త్రీల కానందము గూర్చునాయకుం డుండంబోఁడు" అని యిట్లు వచించుచుఁ ద్వరితగతి శయనంబు వీడి, మందహాసంబుచెంగ లింప "సింగంబుచే భూతలంబునఁ గూల్పంబడిన గజేంద్రంబుంబోలె నాచే నాకృష్టుండ వగుచు భూతలంబున ధూళిమ్రింగినవాఁడ వగు నిన్ను నీచెలియలు చూచుఁగాక. నీవు మిత్తివాతం ద్రోగిన సైరంధ్రి యెట్టి యిక్కట్టును లేకుండ విచరింపఁగలదు. ఆమె పతులును సుఖులై యుండంగలరు" అని వచించుచు సువాసితకుసుమంబుల నలంకృతంబులగు నాతని శిరోజంబులంబట్టి యీడ్చెను. అట్లు బలవంతుం డగు మారుతిచేఁ గేశంబుల నాకృష్టుండగు నా సింహబలుండు కేశంబులఁ దొలంగించికొని యాతని భుజయుగళంబునంబట్టె. అరణ్యంబునఁగరేణు నిమిత్తంబున మద గజయుగళంబు డీకొనుగతి, వానరవీరులగు వాలిసుగ్రీవులు పరస్పర యుద్ధంబులఁ గావించినభాతి పరస్పర జయేచ్ఛం బెనంగు నయ్యిరువురకుం బోరు ఘోరంబయ్యె. అట్లు పోరుసల్పు నవ్వీరు లిరువురును బంచశీర్షంబు లగుపాములంబోలె భుజయుగళంబుల, నఖంబుల, దశనంబులం బోరిరి. బలవంతుం డగు కీచకునిచే నేటుపడియుఁ బవనతనయుం డొక్క యడు గైనఁ దొలంగకుండె. వా రట్లు ద్వంద్వసంప్రహారంబు గావించుచుండ భుజాస్ఫాలనఘోషంబు వేణుదండంబులు భిన్నంబు లగుచప్పుడు జనించి నట్లుగా దిక్కులబధిరభూతంబులఁ గావించుచుండె బలశాలి యగువృకో దరుండు కీచకు విడిపించికొని యాగృహంబునఁ బెను చండవాయువు ద్రుమంబునుంబోలె నాతనిం ద్రిప్పె. ఇట్లు దుర్బలుం డగునాతఁడు పట్టు విడిచి కదలుచు, భీముఁగా విడిచియుఁ గోపించి మిగులఁ దత్తరంబాటున జానులవులం బట్టె. భీమసేనుం డాతనిం దప్పించుకొని యుప్పరంబున కెగసె. అంత నాన రత్నాగారంబు మాటిమాటికిఁ గంపింపం దొడంగె. భీమసేనుం డాతనిం బాదంబునఁ బ్రహరించె. పాదాఘాతంబు వడసి

మిగులం గుపితుండై యొక్కయెడనైనం గదలక బిఱుతివియక, యా
వేగంబు నోర్చి సహింపంజాలక ముహూర్తమాత్రంబు భూతలంబునం
బడియె. ఇట్లు కీచకుండు చెయిదంబు లుడిగి పదాట యొఱంగి యాతని
యురంబున బలంబునం బొడిచె. కోపవశుండై మరల నాతని కేశంబులం
బట్టి పిశితంబుంగోరు శార్దూలంబు మృగంబుం బొదివి పల్లఱచున ట్లాక్రో
శించె. అట్లలసియున్న యాతనిం భుజయుగళంబునం గీలించి ప్రముక్త కం
ఠంబున నఱచుచు నాతనిం బట్టి గిరగిరం ద్రిప్పె. భుజయుగళంబున నదిమి
పట్టి ద్రౌపదీకోపంబు శమించుటకై యాతని కంఠంబుం బీడించె. సకలాం
గంబులు భగ్నంబు లై యుండ నాతనికటితలం బారోహించి జానుదం
డంబునం బొడుచుచుం బశువుం జంపునట్లు మడియించె. ఆతండు యాతనం
బొగులుచుండ భూతలంబునం ద్రిప్పి 'సైరంధ్రి కంటకుం డగు నియ్యా
ధముం జంపి శాంతిం బొందితి' నని తలంచె. కుపితుండై యాతనిం బాణి
తలంబులం బట్టి సకలాంగంబులం గాయంబునం బ్రవేశ పెట్టె. ఇట్లాతని
మాంసపిండంబుంబోలె ముద్దగావించి ద్రోవదికిం జూపి "చూచితివా!
పాంచాలరాజపుత్రీ! యీ కాముకునిగతిని" అని యాతనికాయంబును
గాలం దన్నె. మఱియు మంట గావించి దానివెలుంగున నామెకుం
గీచకుం జూపి "నిన్నెవ్వరైనం గామించువార లిట్లే వధింపంబడుదురు"
అని వచించి ద్రౌపదికిం బ్రియంబునెఱపి యామె నామంత్రించి కోపంబుం
బాపుకొని మహానస గృహంబుం జేరెను. ద్రౌపదియు నట్లు కీచకుం జంపించి
నర్తనాగార రక్షకులం జేరి "పరస్త్రీ కామ మత్తుండగు కీచకుండు నాభర్తలగు
గంధర్వులచే మడియింపం బడియున్నవాండు. చూడుం డనిపలికె. నాట్య
శాలారక్షకులు మిగులం దొందరంబాటుతోం గరదీపికలవెలిగించి
యాతనిం గాంచి మిగులం బరితపించిరి. పౌరలోకం బాతనిం గాంచి
యట్టి యమానుష కార్యంబున కచ్చెరువందుచు "నితని కరచరణంబు
లెక్కడ ననియుం గంధరం బెయ్యెడ ననియుం బరీక్షించుచుండిరి.

### భీముం డుపకీచకుల సంహారించుట

అంత నాతనిబాంధవు లటనుండువారు చేరి చుట్టుముట్టి రోదనం
బులం గావించిరి. స్థలంబుచేరి భిన్నాంగంబై యొప్పు కూర్మంబుంబోలె
నున్న యాతనిం జూచి రోమాంచంబులనొంది సంస్కారం బొనర్పం దల

పోసి యావలికిం జేర యత్నించిరి. తత్కార్యంబున సమావిష్టులై యున్న
యుపకీచకులు నాతిదూరంబునం గంబంబుం గౌఁగిలించికొని యున్న
పాండవపత్నిం గాంచి "యీమెకుంగా మనయన్న మృతుండయ్యెం
గావున నీమెను జంపుఁడు; లేక కామించి మృతుండైన యాతనితో
దహింపుఁడు. అట్లు చేసిన మృతుండగు మాయన్నకుం బ్రియంబుగలుగ
నేర్చు" నని యాలోచించి విరటభూపాలుం గాంచి "యీమెకై సింహ
బలుండు మృత్యువుం జెందె. కావున నీమె నాతనితో దహించువారము.
దీని కనుజ్ఞ యిచ్చునది" అని ప్రార్థించిన వారల పరాక్రమం బెఱిఁగిన యమ్మా
నవపతి వారల కెదురాడనోడి దాని కంగీకృతిం దెలిపె. అంత భయంబు
నొంది మూర్ఛపడియున్న యప్పాంచాలిం బట్టి బంధించి పితృవనాభి
ముఖులై నడువ నారంభించిరి. అట్లు వారిచేం గొంపోవంబడుచు
ద్రోపది యెలుగెత్తి "జయ, జయంత, విజయ, జయత్సేన, జయద్బలులు
నామాటల నాకర్ణింతురుగాక. సూతపుత్రులు నన్నుం గొంపోవుచున్న
వారలు" అని కుయ్యిడం దొడంగె. శయ్యం జేరి సుఖసుప్తుండగు మా
రుతి యాదీనపరిదేవనంబు నాకర్ణించి "సైరంధ్రీ! నీపలుకుపల్కుల నే నాక
ర్ణించుచుంటి. భయంబు దొఱంగుము." అని ప్రతివచనంబు లిచ్చుచు,
మారువేషంబు గైకొని ప్రాకారకుడ్యంబు నధిరోహించి త్వరితగతిం
గీచకాధములు పోవుచున్న శ్మశానంబు దెసకు పరుగిడెను. జవంబునం
జని సూతపుత్రులం దరిసి చితిం జేరి యచ్చటనుండు నొక్కవనస్పతిం గాంచి
బాహాయుగళంబున నాశ్లేషణంబు గావించి, శాఖోపశాఖలం గూడియున్న
యత్తరువరంబు పెఱికి, మూఁపున మోపికొని దండధారియగు యమునిం
బోలి వారి కెదురుగాం బరువెత్తె. ఆతని యూరువుల జవంబునం బెల్లుఱేగు
వాతంబుల నచ్చట నుండు వటాశ్వత్థాదివృక్షరాజంబులు నేలం గూలం
దొడంగె. అట్లు తమకై పరుగెత్తివచ్చు పవనాత్మజుం గాంచి గంధర్వుం
డని తలపోసి, భయకంపితులై "వీఁడుగో గంధర్వుండు వృక్షంబు చేం
బూని మనకై పరువెత్తి వచ్చుచున్నవాఁడు. వైళంబ సైరంధ్రిని విడిచి
పుత్తము. దాన మనభయంబు దొలంగు" నని యూహించి పాంచాలి
నటవైచి పురంబు దిక్కు మొగంబై పలాయితులు గాం దొడంగిరి. భీమ
సేనుండును గాలికి బుద్ధిసెప్పం జూచు నయ్యధముల నూటయేవురం బట్టి
పొలియించి బద్ధయైయున్న పాంచాలి బంధంబుల బాపి యూరడించి

"పాంచాలి! నిన్నుం జెనకం దలంచువా రిప్పథంబుననే ప్రాణంబులకుం గొఱంగుదురు. నీవింక నిశ్చయంబుగం బురంబుం జేరుము. నేనును మహానసంబు జొత్తు" నని వచించి యామెం బంచి తానును వేఱొక తెరువుం బట్టి చనియె. నిహతులగు కీచకులు నూటయేవురును భూమింబడి గాలి తాఁకున నేలంగూలిన వనస్పతులుగల వనంబుం బోలియుండిరి. అట్లున్న యాకీచకులం గాంచి పౌరులు మిగుల నాశ్చర్యంబుం బొంది యేమియుం బలుకనేరకుండిరి.

జానపదు లట్లున్నవారిం గాంచి మగిడి పురంబుం జేరి భూనేతం జూచి "సూతపుత్త్రు లెల్లరును గంధర్వులచే మడిసి భూతలంబునం ద్రెళ్లియున్నవారలు. సైరంధ్రియు విముక్తయై నీగృహంబుం జేరుచుండె. నిక్కంబుగ నీసైరంధ్రి మిగుల నందకత్తె. ఆమె పతులగు గంధర్వులు మిగుల బలశాలురు. రూపలావణ్యయుక్త యగు నీమెం గాంచిన పురుషులెల్లరు నీమె సంగమంబుం గోరకమానరు. వారల కీకీచకుల గతియ సంభవించుచుండు. దాన నీనగరంబు నాశంబునొందు. కావున సైరంధ్రిహేతుకంబుగ దోషంబులు గలుగకుండునట్లు నీతి విధింపవలయు" నని సవినయంబుగ విన్నవించిరి. విరటభూకాంతుం డును వారలం గాంచి "యీసూతపుత్త్రుల కెల్లరకును నొక్కయనలంబుననే రత్నగంధాదులతో నంతిమసంస్కారంబు నెఱపుం డని వాక్రుచ్చి సుదేష్ణం గాంచి 'మగువా! సైరంధ్రి వచ్చిన సైరంధ్రి నీకు మంగళం బగుంగాక! నీ యిచ్చవచ్చినచోటికిం బొమ్ము. నీ మూలమ్మున గంధర్వులవలన నెట్టి పరాభవముగలుగునో యని భూపాలుండు తల్లడిల్లుచున్నవాఁడు. గంధర్వరక్షితయగు ని న్నాతండు పలుకనేరక స్త్రీ లదోషలుగాన నా ముఖంబునం బలుకుచున్నాఁ'డని నామాటలుగాం బలుకుము." అని యాజ్ఞాపించె.

ద్రోవదియు సూతపుత్త్రుల నిరసించి భీమసేనుండు విడిపింప భయంబుం దొఱంగి శార్దూలంబువలన భయంబునొందిన యాఁడు లేడికరణి భయమందుచు గాత్రంబును బరిధానంబులను జలంబులం బ్రక్షాళితంబులం గావించుకొని, నగరంబు చేరం జనుదెంచుచుండె. జానపదులలో గొంద ఱామెం గాంచి గంధర్వుల భయంబునం బర్వెత్తిరి. కొందఱు కన్నుల మూసికొనిరి. అంత నామె మహానస ద్వారంబున గంధగజంబు

చాడ్పున నిలిచియున్న పవనతనయుం గాంచి పాంచాలి యల్లన "సన్నిట్టి సంకటపాటునుండి గాచిన గంధర్వరాజున కిదె మ్రొక్కెద" ననియె. "నీ వశవర్తులై యెవ్వా రిచ్చట విహరింతురో యాపురుషులు నేఁడు ఋణవిముక్తులై" రని యాతండు దానికిఁ బ్రతివచనం బిచ్చె. అంత నామె యాతని విడిచి ముందునకు నడిచి యచ్చట నర్తనాగారంబున విరాటరాజపుత్రికలకు నాట్యంబు గఱపుచున్న బృహన్నలం గాంచె. రాజకన్యకలును నర్తనాగారంబు వెలువడి యర్జునునితోఁ గూడి ద్రౌపదిం గాంచి చేరంజని మిగుల సంతసించుచు, "సైరంధ్రి! దైవకృప నిట్టి యిక్కట్టు గడచితివి. పాపరహిత వగు నీకు బాములుగలిగించు నాసూత పుత్త్రులును హతులైరి" అని యామెం గారవించి యనునయించిరి. బృహన్నలయు "సైరంధ్రి! నీ వెట్లు సంకటపాటు గడవనేర్చితివి? పాపాత్ములగు నయ్యధము లెట్లు మడియింపం బడిరి? ఇదియంతయుఁ దెల్లంబుగాఁ దెలుపుము వినవలతు"నని యడిగె. అంత నయ్యువిదయు "ఓ బృహన్నలా! నీ వీసైరంధ్రివిషయంబు ప్రశ్నించుటయేల? నీవు చానం జేయున దెద్దిగలదు? కన్యాంతఃపురంబున నీవు సుఖంబున నుంటివిగాన సైరంధ్రి యెట్టి దుఃఖంబునొందునదియు నెఱుంగక దుఃఖిత నగు నన్నుం గాంచి చిఱునగవు చెంగలింపఁ బ్రశ్నించుచుందు" వనిబదులుపలికె. దానికి బృహన్నలయు "కళ్యాణి! బృహన్నలయు దుఃఖంబునొందు చున్నయది. తిర్యగ్యోనిగత యని యెఱుంగంజాలవా? నీతోఁగూడి చాలకాలం బుంటిని. నీవు నందఱతోఁ గలిసిమెలిసియుంటివి. నీవు క్లేశంబు నొందుచుండ నేరికి సంతసంబుగలుగు? నిక్కముగ నొరులు పరులహృదయంబులఁ జూరంజాలరు. కావున నీవు నాహృదయంబు నెఱుంగజాలవు" అని యుత్తరం బిచ్చె. ద్రౌపదియు నాకన్యకాజనంబులతోడ రాజగృహంబు ప్రవేశించె. రాజపత్నియగు సుధేష్ణయు విరటునవచనంబు మేరకు "రాజు నీవలనను నీపతు లగు గంధర్వులవలనను మిగుల భయము నొందుచున్న వాఁడు. కావున నీయిచ్ఛవచ్చిన క్లిందేనిం బొమ్ము. నీవు మిక్కిలి యందకత్తెవు. పురుషులఁ జూచునంతమాత్రమ్మున వలపింపనోపుదువు. గంధర్వులును మిక్కిలి కోపంబుగలవారు" అని వాక్రుచ్చె. సైరంధ్రియు "ఇంక పదుమూఁడుదివసంబులుమాత్రము రాజు నన్ను క్షమింపవలయును

అంత కృతకృత్యు లగుగంధర్వులు నిక్కంబుగ నన్నుం దీసికొనిపోవుదురు. రాజును బంధుమిత్రాదులం గూడి సుఖం బనుభవించు" నని ప్రార్థించె.

కౌరవులు పాండవులం దెలియంగోరుట

సానుజుం డగుకీచకుండు మృతుం డగుటం బురజనంబు లెల్లరును మిగుల నుమ్మలికమ్మునం గుందుచుండిరి. శౌర్యసాగరుండును, మహాసత్త్వుండును, విరాటసైన్యనాయకుండు పాపబుద్ధిం బరదారలం జెఱపట్టందలంచి గంధర్వులచే మడియింపంబడియెనని జనాపవాదం బొందు నానాదేశంబుల సంజల్పితంబయ్యె.

సుయోధనుండు దేశదేశంబులం దిరిగి నానావిషయంబుల నెఱింగిరా నియోగించిన చారులు తమతమ సంచారంబులం బూర్తిం గావించి హస్తినాపురంబునకు మరలం జొచ్చిరి. వారు భీష్మద్రోణకృప కర్ణాదులతోడను, సోదరులతోడను, త్రిగర్తాధీశ్వరులతోడను బలసికొలువున్న సుయోధనుం గాంచి "రాజేంద్రా! నిర్జనంబును మృగసంకీర్ణంబును బహువిధంబు లగు తరులతాదులతో నాకీర్ణంబునగు నవ్వనంబున మిగుల రోసియుం బాండవులజాడం జూడ నేరము వా రెటుపోయిరో యెఱుంగంజాలము. వారల పాదవిన్యాసంబులంబట్టి గిరిశిఖరంబులందును, దుర్గమాటవీస్థలంబులందును, జనపదంబులందును, జనాకీర్ణంబులగు దేశంబులందును, బహువిధంబుల నన్వేషించియు వారలజాడం దెలియనేరము. వారలు వినాశంబునొందియుండ నోపుదురు. నీ కిఁక మంగళంబు చేకూరు. వా రొకవేళ రథికులై పోయిరేమో యని మార్గంబునం బరిశీలించితిమి. అయ్యదియు వ్యర్థంబయ్యె. రథసారథులంగూడి పలుదేశంబులం దిరిగి వారలం గానక తుదికి ద్వారకం జేరితిమి అచ్చటను ద్రౌపదికాని పాండవులుకాని గానరారైరి. పాండవులం జూచియు, వారిచేయుకర్మంబుల నాలకించియుండము గావున నవశ్యంబు వారలు మృతులై యుందు రని యూహించుచున్నారము. ఇంకఁ బాండవాన్వేషణంబున మేము చేయంగల జతనంబు నా దేశింపుము. మఱియొండు మాట నాకర్ణింపుము. త్రిగర్తాధిపుల నుక్కడంచిన విరటసేనాధీశ్వరుండు కీచకుండు సోదరు లందఱతోడ గంధర్వులచే మడియింపం బడియె. ఆ

గంధర్వు లేరికిం గానరారైరి. ఇట్టి ప్రియవాక్యంబును శత్రుపరాభవం బును దెలిసిన కర్తవ్యకార్యంబున నియోగింపుము" అని విన్నవించిరి.

దుర్యోధనుండు కొంతవడి యేమియుం బలుకక మిన్నకుండి మనంబున నేమియో విచారించి సభాసదులం జూచి యిట్లనియె. "కార్య గతినెఱుంగుట మిగుల దుఃఖకరంబు. కావున మీరెల్లరు నీ విషయంబున నాలోచింపవలయును. అజ్ఞాతవాసంబున కేర్పఱచిన పదుమూఁడగు నీ వత్సరం బల్పావశేషంబుగా సంపూర్ణం బయ్యె. ఈవత్సరంబు సంపూర్ణంబు గాకమున్న యెఱుంగబడిరేని సత్యవ్రతపరాయణు లగు నప్పాండవులు కాలంబు నెఱింగినవారగుట కౌరవులంగూర్చి యెట్టి జతనంబుల సలుపక మిగుల దుఃఖితులై మరల వనంబులం బ్రవేశించి సమయపాలనంబు చేయంగలవారు. కావున మద్రాజ్యంబు సపత్న రహితంబుగా నుండు విధంబు నాలోచింపుం" డనియె. అంతఁ గర్ణుండు "రాజేంద్రా! త్వరిత గాములగు చారులు సాధుకార్యసంపాదకులు వైళంబ చని జనాకీర్ణంబు లగు జనపదంబులను, మనోహరంబు లగు గోష్ఠిప్రదేశంబులను, వివిధ సరోవరంబులను, సముద్రతీరంబులను, నదీకుంజమ్ములను, బర్వతంబులను, గుహలను నజ్ఞాతవాసంబు నెఱపుపాండవుల నెమకునది." యని వచి యించె. పాపమతియు, యువరాజు నగు దుశ్శాసనుం డన్నం గాంచి 'రాజన్యా! మనకు విశ్వాసపాత్రు లగుచారులు పారితోషికంబులం బడసి మరల వారల నన్వేషింప నేఁగవలయు. కర్ణుండు చెప్పినదంతయు నా కంగీకారంబ. చరు లొక్కదేశంబును వీడి మరొక్కదేశంబు చేరుచు నన్వేషణంబు సలుపవలయు. వారు నిగూఢులై సముద్రగర్భంబుసొచ్చిరో శూరమ్మన్యులై వ్యాళంబులచే గ్రసియింపంబడిరో యిట్టి కృచ్ఛ్రసమ యంబుల నిలుపంజాలక మృతినొందిరో యెఱుంగవలయు కావున నీ వుపే క్షింపక యధికోత్సాహంబున జతనంబు సలుపుము.' అని తనభావంబుం బ్రకటించె.

మహావీర్యుండగు ద్రోణుండు యథార్థంబు నెఱుంగువాఁడగుట 'శూరులును, విద్వాంసులును, బుద్ధిమంతులును, జితేంద్రియులును, ధర్మజ్ఞులును, గృతజ్ఞులును, ధర్మపుత్త్రులు ననుసరించువారును నగు వా రెన్నండును వినాశంబు నొందఁజాలరు. ధర్మార్థతత్త్వజ్ఞుండగు ధర్మజునిఁ దండ్రివలె గౌరవింతురు. అతఁడును నట్లు వినయంబున భక్తిగదురఁ

దన్నుం గొలుచు సోదరుల నేల యుపేక్షించును? కావున ధర్మజుండు శ్రేయంబు గూర్చుచుండ నమ్మహానుభావులు కాలమ్ము బ్రతీక్షించుచుందు రని తలంతునుగాని నాశంబు నొందుదురని యూహింపం జాల. ఇప్పు డాలోచించిన యిక్కార్యంబు వైళంబ నిర్వర్తింపఁబడవలయు. లెస్సగా నాలోచించి వారు నివసించుతావుల నారసి సాధింపవలయును. శూరు లును,దపోబలసంపన్నులును,గుణవంతులును, నీతిశాలురు నగు వారలు దుర్జ్ఞేయు లగుదురు. కావున బ్రాహ్మణులచేతను, గూఢచారులచేతను, వారివృత్తాంతంబు నెఱింగిన యితర మానవులచేతను, వారల వెదకించు నది' అని పచించె.

భరతపితామహుఁడును, జ్ఞానసంపన్నుఁడును, దేశకాలజ్ఞుఁడును, సకల ధర్మవేత్తయు నగుభీష్ముం డాచార్యుండు మిన్నకుండినంత నావా క్యంబు నవలంబించి కౌరవుల హితంబునకై, ధర్మజు నవలంబించి ధర్మ సమ్మతం బైనట్టియు, సత్పురుషుల కంగీకార్యమైనట్టి వాక్యంబును పచించె. "నిఖిలార్థంబుల నెఱింగిన బ్రాహ్మణుండగు నీ ద్రోణుండు పచించునట్లు సర్వ లక్షణసంపన్నులును, సాధువ్రతులును, వేదవ్రత పరాయణులును, వృద్ధానుశాసనంబునఁ జరించువారలును, సత్యవ్రతాసక్తులును, సమ యజ్ఞులును, సమయపాలకులును, క్షత్రధర్మనిరతులును, మహాత్ములును, వీరపురుషులు నగుపాండవులు సత్కార్యభారంబు వహియించుధర్మంబున రక్షింపం బడుదురు. కాని నాశము నొందియుండరని నే నూహించు చున్నాను. నీతియుక్తులగు నమ్మహనీయులజాడ నీతివిరహితుల కెఱుక పడఁజాలదు. మహానుభావుల గుర్తించువిధంబును నీకు మేలొనర్పు తలంపునం దెల్పుచుంటిఁగాని ద్రోహబుద్ధిం గాదు. కొలువుదీరియున్న నీకు నిక్కముగఁ నీతిఁ దెలుపంబూనుట హాస్యాస్పదంబు. యథా ర్థంబు నీకడఁ బలుకవలయు, నాయెఱింగిన విషయంబు దాపరాదు గానఁ దెల్పుచుంటి. పదుమూఁడవయేడగు నీయజ్ఞాతవాసవత్సరంబున సాధా రణమానవుంబోలె ధర్మజుఁ డుండునని యూహింపరాదు. ఆతఁ డుండు పురంబునందును, దేశంబునందును నివసించువారలు దానశౌండులును వదాన్యులు నగుదురు. ధర్మజుం డుండు దేశంబునం గలజనులు నిత్యసంతు ష్టులై సమర్థులై సత్యపరులై యసూయాశూన్యులై మాత్సర్యరహితు

లై ధర్మంబు నడుపుచుండురు. అతం డధివసించు దేశంబున బ్రహ్మ ఘోషంబులును, బ్రాహ్మణాహూతులును, గ్రతువులును సధికముగా బ్రవర్తిల్లుచుండు. అచ్చటఁ బర్జన్యుండు బాగుగా వర్షించుచుండు. భూమియు సస్యభరితయై యాతంకశూన్యయై యుండు. ధాన్యంబులు ఫలవంతంబులును, ఫలంబులు రసవంతంబులుగా నుండు. మాల్యంబులు పరిమళవంతంబులును, మాటలు శుభశబ్దంబులు గలవియు నగు. అచ్చోట సుఖస్పర్శం బగువాయువు వీచుచుండు. ఆతావున భయం బనుమాటయు నుండనేరదు. గోవులు బలముగలిగి సుపుష్టంబులై బహుళంబుగా నభి వృద్ధిం గాంచు. పాండవు లుండుదేశంబున జనులు సంతుష్టచిత్తులై, దేవతాతిథిపూజాపరాయణులై, శుభప్రతులై యుందురు. సత్యధైర్య దానశాంతిక్షమాశ్రీహ్రీ కీర్తి తేజ ఆనృశంస్యార్జవంబు లుండుతావు పాండవ నివాసంబని ధర్మాత్ము లగుబ్రాహ్మణోత్తములు ధర్మాధారంబునం దెలియనేర్తురుగాని ప్రాకృతు లెఱుంగంజాలరు. కావున నిట్టిగుఱుతులం బట్టి వారలగుర్తింపఁ బ్రయత్నింపుము. ఇంతకుమించి యేనేమియుఁ బలుకం దలంపను.”

భీష్ముఁ డుపశాంతవాక్యం బగుడు శారద్వతుం డగుకృపుండు “కురుపితామహుండు పల్కువాక్యంబు ధర్మార్థసహితంబై సహేతుకంబై సమయానుకూలంబై యుక్తరూపంబై యుండు. ప్రాజ్ఞు లగుపురుషులమూలంబున వారలప్రవృత్తిం దెలియునది. ఇంతలో నీతియు నెలకొల్పందగు. శాత్రవుండు ప్రాకృతుండైనను వృద్ధింబొందఁగోరు జన్యుం డుపేక్షింపరాదు. మహాత్ములగు పాండవులు సర్వాస్త్రకుశలులుగదా! అట్టిచో వారివిషయంబున సించుకంతయు నుపేక్షింపరాదు. పాండవులు సమయానుకూలంబుగ గూఢభావంబునఁ బ్రచ్ఛన్నులై యుండ స్వపరరాష్ట్రంబుల నాత్మబలంబుం దెలియవలయు. కాలక్రమంబునఁ బాండవుల కభ్యుదయంబు గాఁగలదు. మహాత్ము లగుపాండవులు సమయంబు నిస్తరించి యమితోత్సాహవంతులు కాఁగలరు. దానికై బలమును, కోశమును, నీతిమార్గంబును వృద్ధిపఱుపవలయును. మన కుదయకాలం బగుతఱి పరాత్మబలంబులం దెలిసి సామదానభేదదండంబులను చతురుపాయంబుల నెఱపి బలవంతులతోడను, బలహీనులతోడను, నుచితమార్గంబుల సంధి సేయుదము. మిత్రుల నాశ్వాసించి కోశబలం

బుల వృద్ధిఁబొందించి యభివృద్ధిఁబొందు వాఁడవు. ఎదుర్కొనిన బలవంతుల నేనిం బాండవపుత్రులం గూడిన రాజుస్యులఁ జుట్టుముట్టి యాయోధనంబు సలిపి జయంబు గాంచంగలవు. కావున నిట్లు దేశకాలంబుల నెఱిఁగి నీతిని నెఱపుము. దాన సుఖంబులు నెందు" నని వచియించె.

**సుశర్మ విరాటునిగోవులం బట్టుట**

అంత రథసైన్యనాయకుండును త్రిగర్తాధీశ్వరుం డగు సుశర్మ త్వరితహృదయుఁడగుచు రాజు నుద్దేశించి "మత్స్యనరపాలుండు నా రాష్ట్రంబును బలుమారులు పాడుసేసెను. క్రూరుండును మత్సరియు నగు కీచకుండు దుష్టాత్ముఁ డాతని సేనానాయకుండు. అతఁడు మిగుల బల వంతుఁడు. అట్టివాఁడయ్యు నాతఁడు గంధర్వులచేతం జిక్కి మిత్తి వాతంబడియె. ఆతఁడు పడిన నిక్కంబుగ నా నేలతేఁడు నిరాశ్రయుఁ డును నిరుత్సాహుఁడు నగును. తమకిచ్చవచ్చినచో నాతనిపై కేఁగి బవ రంబు సలుపుదము. ఇదియ యిప్పటికింబోలిన కార్యం బని నాతలంపు. బహుధాన్యసమాకులం బగునాతని రాజ్యంబుం జొచ్చి ధనసంచయంబును నమూల్యరత్నంబులను, గ్రామంబులను, రాష్ట్రంబులను, గోసహస్రంబు లను హరియింతము ఆతని నగరంబును బీడించువారము. కౌరవత్రిగ ర్తులు కలిసిమెలిసి యాతనిసైన్యంబును ముట్టువఱచి యాతనిఁబట్టి బంధించి వశపఱచుకొందము. దాన నీకు బలవృద్ధి గాఁగలయది." అని వాక్రుచ్చె. దాని నాకర్ణించి కర్ణుఁడు "సుశర్మవాక్యంబు మిగుల యుక్తరూపం బై యుండు. కాన సేనలంగూర్చుకొని యుక్తవిధంబున విభజించి దండువిడియుదము. కురువృద్ధుఁడగు భీష్ముఁడును, నాచార్యుఁ డగుద్రోణుఁడును, శారద్వతుఁ డగుకృపుఁడును వారికిఁ దోఁచిన ట్లాదే శించునట్లు జతనంబు సలిపి కార్యంబు సాధించుకొందము. బలపౌరు షార్థశూన్యు లగుపాండవులతో మన కెట్టి ప్రసక్తియు నుండదు. లాభంబు సమకూడదు. వా రడవుల నిడుమలఁగుడుచుచు యమాలయంబుం జొచ్చి యుందురు. నిర్భయంబున విరాటనగరంబుసొచ్చి యతని గోధనంబులను వసుసంచయంబును జూఱఁగొందము" అని నచ్చఁజెప్పె.

అంతఁ గౌరవేంద్రుండు నిత్యమాజికై ప్రతీక్షించు దుస్ససేనుం గాంచి, "వృద్ధులతో నాలోచించి సైన్యసమూహంబు నాయత్తపఱపుము.

కౌరవ బలంబులం గూడి మన మొకవంక కేఁగుదము. సుశర్మ త్రిగర్త వాహినులం గూడి వేఱొకవంకఁ బసులం బట్టుఁగాక. మహారథుం డగు నాతండు సబలవాహనుండై యొక్కదినంబు ముందేఁగవలయు. మఱు నటిదినంబున మనము విరాటదేశంబు చొత్తము. గోవుల నరికట్టి విపుల ధనసంచయంబులను శుభలక్షణ లగుగోమతల్లికలను గొల్లఁగొందము. దీనికై మనసైన్యంబు రెండుభాగంబులుగ విభజింపవలయు” నని యాజ్ఞాపించె. అంత వారు సమరసన్నద్ధులై బలసంయుతులై రెండు భాగంబులై బయలువెడలిరి. త్రిగర్తాధీశ్వరుఁ డగు సుశర్మ కృష్ణపక్ష సప్తమీదినంబున బయలువెడలెను. కౌరవు లష్టమీదినంబున బయలు వెడలిరి.

## మత్స్యరాజ రణోద్యోగము

విరాటనగరంబున మాఱువేసంబుల నున్న మహాపరాక్రమశాలు రగు పాండవుల కల్లన సమయం బతిక్రమించె. కీచకుఁడు నిహతుఁ డైనదిమొదలు మత్స్యభూకాంతుఁడు కుంతీపుత్రులయెడ నత్యాదరంబు చూప మొదలుపెట్టె. అరణ్యాజ్ఞాతవాసంబుల కేర్పఱచినవానిలోఁ బదుమూఁడవ వత్సరంబు నంతంబున విరటగోధనంబును సుశర్మ చుట్టు ముట్టి యాక్రమించె. అంత గోపాలకుఁడు వడిగలయరదంబు నెక్కి పురంబుఁ జొచ్చి కుండలాంగదాదుల శోభిల్లుశూరవరులు బలసికొలువ మంత్రివరులతోడను బాండుతనూభవులతోడను గొలువు దీరియున్న యమ్మానవపతిం గాంచి యతనియడుగుల కెఱఁగి “బాంధవులతో మమ్ము జన్యంబున నోర్చి త్రిగర్తులు భవదీయగోమతల్లులను శతసహస్రంబులం గొంపోవుచున్నవారు. వారల నోర్చి గోధనంబుల మరల్చుకొమ్మ”ని విన్న వించె. మత్స్యనరపతి యమ్మాట లాలకించి రథగజాశ్వంబుల నొప్పారు సైన్యంబు నాయత్తపఱచె. రాజులును రాజపుత్రులును జిత్రములై శూరసేవ్యంబులైన తనుత్రాణంబుల ధరియించిరి. విరటుని ప్రియ సోదరుఁడగు శతానీకుఁడు వజ్రంబులను గీల్కొల్పిన తనుత్రాణంబు ధరి యించె. శతానీకావరజుఁ డగు మదిరాక్షుఁడు దృఢంబగుకళ్యాణపట లంబగు వర్మంబు ధరియించె. శతసూర్యంబును, శతావర్తంబును, శత బిందువును, శతాక్షియు నగుకవచంబును మత్స్యనరపాలుండు ధరి

యించె. సూర్యదత్తుఁడు సూర్యకాంతిగల గాత్రత్రాణంబును ధరించె. విరటపుత్త్రుఁడును వీరుఁడు నగుశంఖుఁడు దృఢతరాయసతనుత్రాణంబు నలంకరించె. ఇట్లు దృఢతరంబు లగు కవచంబులం బూని యుద్ధవీరులగు నమ్మహావీరులెల్లరును వేలువేలుపతాకంబులుగల యరదంబుల నశ్వంబులం బూంచిరి. సూర్యచంద్రులంబోలు విరటునియరదంబునఁ గేతనంబు నెలకొల్పఁబడియె. తక్కుంగల యరదంబులనెల్ల నట్లె కేతనంబులఁ బాదుకొల్పిరి. అంత విరటభూపాలుఁడు తమ్ముఁ డగుశతానీకుం గాంచి "కంకవల్లవగోపాలదామగ్రంథులుకూడ యుద్ధంబుసేయ నేర్తురని నేఁ దలంతును. కావున సకేతనంబులగు నరదంబుల నొసంగి, విచిత్రంబు లగుకవచంబుల నలంకరించి చిత్రంబులగు నాయుధంబుల నొసంగుఁడు. వీరాంగులును బురుషవరేణ్యులును నగు వీరు యుద్ధవ్యవహారంబుల నెఱుంగకుండం జాలరు." అని యాదేశించె. దానంజేసి శతానీకుఁడు మిగులఁ ద్వరితగతిం జని యరదంబుల సమకూర్చె. రాజభక్తులును బ్రీతచిత్తులునగు సూతు లరదంబులను ధర్మజభీమనకులసహదేవులకై యాయత్తపఱచిరి. అంత విరటుండు మృదులంబులును దృఢంబులు నగు కంకటంబులవారలకుఁ బ్రసాదీకరించె. యుద్ధవిశారదు లగు నన్నలువురును బ్రచ్ఛన్నవేషులై హయంబులంబూన్పి యున్న దివ్యరథంబుల నధిరోహించి యామానవపతి ననుసరించిరి. బలశాలురును నేర్పరులును నగు జోదులెనిమిదివేలును, వేయిమదనాగంబులును, నాఱువేల గుఱ్ఱంబులును, విరటుపశ్చాద్భాగంబునం గదలి గోవులజాడ రోయుచు బయలువెడలె.

### సుశర్మవిరాటుల యుద్ధము

సూర్యుండు పరిణతుండగుడు మత్స్యసైనికులు పురంబు వెలువడి త్రిగర్తసైన్యంబుల ముట్టికొనిరి. గోవులకై యాత్రిగర్తులును మాత్స్యులును బరస్పరంబు యుద్ధంబుసేయ సమకట్టిరి. కుశలు లగుమావటీలఁ బ్రేరణంబున నడగొండలంబోలు గజంబులును పరస్పరంబు డీకొనియె. అట్లాయుభయసైన్యంబులు పెల్లుబ్బి యాయోధనంబు సలుపుచు సూర్యుఁడు పడమటిదెసకొఱగుసరికి దేవాసురులంబోలి ఘోరంబుగఁ బోరందొడంగె. పదాతులు నరదంబులు నాగంబులు నశ్వంబులును బరస్పరం బెదిరి డీకొని బవరంబు సలుపుచుండఁ బాదాహతులం బెల్లు

రేఁగినధూళివిసరంబు నభోమండలంబు నాక్రమించె. దానం జిమ్మచీఁక
టులు గ్రమ్మ నేమియు గోచరంబు గాకయుండె. సైన్యరజోభరంబున
సంధీభూతంబులై పక్షిసంఘంబులు నేలంగూలె. పరస్పరంబు విడుచు
సాయకాసారంబుల మార్తాండమండలంబు గప్పువడియె. అరదంబుల నర
దంబులును, నాశ్వికుల నాశ్వికులును, గజంబుల గజంబులును నెదిరిపోరం
దొడంగిరి. శిరంబులు దెగి భూమిం ద్రెళ్లుచున్నను, గాత్రంబులు శిథిలం
బులై నేలరాలుచున్నను శూరులగువీరులు యుద్ధపరాఙ్ముఖులు కాకుండిరి.
అట్లు పోరు ఘోరంబగుడు వీరగాత్రంబులం జనించినరక్తవాహినులు
ధరాతలంబుం బర్వ ధూళి తనయంతన యడంగి మీఁది కెగయకుండె.
ధరాతలంబంతయుఁ గర్దమప్రాయంబయ్యె. త్రిగర్తవాహినిం జొచ్చి
వీరవర్యుఁ డగుశతానీకుండు శతాంగశతంబును, విశాలాక్షుఁడు పంచశ
తంబును దునుమ నేసిరి. సూర్యదత్తుఁడును మదిరాక్షుఁడు నట్లు పిఱుతివి
యక పోరిరి. విరాటభూపాలుండును నేనూరురథంబులఁ బొడిచేసె.
అంతఁ ద్రిగర్తాధీశ్వరుఁడగు సుశర్మ విరటభూకాంతుం గవిసి పోరందొ
డంగె. రథికులగునయ్యిరువురకుఁ జండతరంబగుభండనంబు సంఘటిల్లె.
అస్త్రమోక్షణసంధానాదుల నెఱింగిననవ్వీరయుగళంబు కాఱుమొయి
ళ్లంబోలి శరాసారంబులఁ గురియుచు, బాణశక్తిగదాది వివిధసాధనంబు
లంబూని పరస్పరజయేచ్ఛం బిఱుతివియక పోరిరి. మత్స్యరాజు పదియ
మ్ముల సుశర్మయురంబు నాటనేయ నాతఁడు నాల్గుబాణంబుల మత్స్యపతి
గుఱ్ఱంబుల నొప్పించె. ఇట్లు వారు పోరుసలుపుచుండ సైన్యధూళిం
బ్రుంగియున్న సైన్యంబున కప్వో రెఱుంగరాదయ్యె.

## సుశర్మనిగ్రహము

అంధకారంబు బంధురం బగుటను ధూళిపాళివికీర్ణంబై వెల్లు
రేఁగుటను నుభయబలంబులు లక్ష్యంబులం జూడంజాలమి, యుద్ధంబులు
మాని విశ్రాంతినొంద యుద్ధావేశులగు వీరాగ్రేసరుల కుత్సాహంబు
గొల్పుచు, తిమిరసంఘంబుల నడంచుచుఁ జంద్రుఁడు వొడమె. మరలఁ
బ్రకాశంబుగలుగుడు నుభయసైన్యంబులు మరల జన్యంబు సాగించె.
త్రిగర్తాధీశ్వరుఁడగు సుశర్మ తమ్మునింగూడి రథవ్రాతంబునుబూని విరట
నరపతి నెదిర్చె. పిమ్మట నాయిరువురు నరదంబులం జని గదాదండంబుల

హస్తంబులంగిలించి యమ్మహారాజునరదంబుల కెదురునడిచిరి. మత్స్యసైన్యం
బులును వివిధాయుధంబులంబూని కోపంబినుమడింపఁ ద్రిగర్తులంగవిసె.
సుశర్మయు నాతనిసోదరుఁడును విరటు నెదిర్చి యాతనిరథాశ్వంబులం
జంపి, సారథి నేలఁగూల్చి, చక్రరక్షకుల నంతంబునొందించి, విరథుఁడై
యేమియుఁజేయనేరక బిచ్చునడి చూచుచున్న మత్స్యపతిం బ్రాణంబుల
తోడంబట్టుకొనియె. కాముకుఁడు జవరాలింబోలె సుశర్మ విరటుం దన
యరదంబున నిడుకొనిపోవుచుండఁ బరికించి మత్స్యభూపాలబలంబులు
నరపాలుఁడు శత్రులచేఁ జిక్కుట, నాయకుండు లేమి చీకాకువడి భయం
బునఁ బాఱందొడంగె. సైన్యంబులు కలంగి పలాయనంబు లగుచుండఁ
గుంతీసుతాగ్రజుండు భీమసేనుం జీరి "వత్సా! నరపాలుఁడు శత్రులచేఁ
జిక్కె. ఈతనియండఁజేరి మనము సుఖంబున దుస్తరంబగు నీయజ్ఞాత
వాస సమయంబు గడపుకొంటిమి గావున నీతని శోకముప్పు వాటిల్ల
నొప్పరికించి చూడందగదు. దానికై యాతని నెట్లేని విడిచిపుచ్చు"
మని యాజ్ఞాపించె. పవనతనయుం డన్నంగాంచి "నీయాజ్ఞ మేర కిదే
యానరవరేణ్యు విడిపింతు. ఏకాంతంబుననుండి మదీయపరాక్రమంబు
నాలోకింపుము. శాఖాశతంబులనున్న యీవనస్పతిం బెఱికి దాన సుశర్మ
నోడింతు" నని యుత్సాహంబుఁ జూపె. ధర్మజుఁ డవరజుం గాంచి
"సోదరా! యిట్టియమానుషకార్యంబు చేయవలదు. తరువరంబు నాయు
ధంబుగా సవరించి యాయోధనంబు నిర్వర్తించు నిన్నుం గాంచి
జనంబులు భీమసేనుండని పోల్పవట్టుదురు. కాన నట్లుచేయక ప్రాకృతుం
బోలి ఖడ్గకుంతాద్యాయుధంబుల బూని జయంబు చేకొనుము.
మహీరమణు వైశంబ విడుచునది. కవలు నీకుఁ జక్రరక్షకులుగా నుండు
వారు" అని యాదేశించె. భీమసేనుం డన్నయానతి నొదలందాల్చి
యుత్తమంబగుచాపంబుం బూని శరవర్షంబులఁ గురియింపఁ దొడంగె.
క్రమంబున సుశర్మం దరిసి విరటభూపాలుం బరికించి "యోయీ! కదల
వలదు. నిలునిలు"మని యాక్రోశించె. పృష్ఠభాగంబున "నిలునిలు"మని
యెలుగెత్తి వాకొనుచు దన్నెదిరింపవచ్చు నమ్మహావీరుం గాంచి
యముఁడో యని సుశర్మ శంకించుచు నతని కభిముఖుఁడై నిలిచె.
భీమసేనుఁడును వారలం దరిసి బాణధారల గురియుచు శూరసహస్రం
బులను, వీరవర్యులచే నధిష్ఠితంబులగు రథగజవాజులను బెక్కింటి

నంతంబు నొందించి గదాదండంబు గ్రహించి పదాతులం జావమోదెను. త్రిగర్తాధీశ్వరుండు నిహతంబు లగుసైన్యంబులం గాంచి చిచ్చువడి చేయునదిలేక చాపంబున వాడియమ్ములం గీలించి పఱుపుచుండె. అంతఁ బాండవులు తమతమ యరదంబులం దోలుచుఁ దలపడిరి. విరటపుత్త్రుఁడును నిసుమడించినయమర్షంబునఁ బోరు సలిపె. ధర్మపుత్త్రుఁడు వేవురను మడియించె. పవనతనయుం డేడువేలసైనికుల జమునియింటి కనిచె. నకులుం డేడునూర్లఁ బొరిగొనె. శూరుఁ డగుసహదేవుఁడు మున్నూరు వీరుల నూర్ధ్వలోకంబున కంపె. సైన్యంబు దైన్యంబునొందించి యుద్యతాయుధుఁడై పాండవజ్యేష్ఠుఁడు సుశర్మం దలపడి వాడియమ్ములం బఱపె. సన్నద్ధుండై సుశర్మయు యమతనయునైఁ దొమ్మిదివారసంబుల నిగుడించె. గుఱ్ఱంబుల నాల్గింటఁ జదిమె. మేటిపోటుమానిసి యగు మారుతసూతి సుశర్మంజేరి యాతని యశ్వంబులం జంపి,యంగరక్షకుల విగత ప్రాణులఁ గావించి, సారథి నరదంబునుండి నేలం గూలఁద్రోచె. ఛత్త్రరక్షకుఁ డగు మదిరాక్షుఁడు విరథుఁ డగు త్రిగర్తాధీశ్వరుం గాంచి యెదుర్కొనియె. విరటుఁడును సుశర్మ యరదంబునుండి లంఘించి యాతని గదాదండంబు చేఁబూని యాతనితోఁ బోరఁగోరి వృద్ధుఁడయ్యు యువకుంబోలి నిలిచె. పలాయమానుఁ డగు త్రిగర్తాధిపుం గాంచి మారుతపుత్త్రుం డెలుగెత్తి “ఓయీ! రాజపుత్త్రుఁడ వగు నీవు బవరంబున వెన్నిచ్చిపాఱుట యుక్తంబుగాదు. ఇట్టి మేటిపోటుమానిసి వగు నీవెట్లు గోవులం గొనం దలఁతువు? అనుచరులనెల్ల వీడి యేల యిట్లు గుందెదవు?” అని యాతని నూరార్చె. భీమసేనునియా పోటుమాటలు సూటిమై చెవులఁజొచ్చి పోటు గలిగింప “నిలునిలు” మనుచు సుశర్మయు నభిముఖుండయ్యె. మృగేంద్రంబు హరిణంబుం బట్టిపోవుగతిఁ ద్రిగర్తాధీశ్వరుం బట్టుతలంపునఁ బవనతనయుఁడు త్వరితగతి నేఁగె. సుశర్మం గేశదామంబునఁబట్టి ధరణిం బడద్రొబ్బి రోషావేశంబునఁ బాదంబున జంఘల, జానువుల, మూర్ధంబుం బొడిచె. దాన నాతఁడు మూర్ఛనొందె. త్రిగర్తాధిపుం డట్లు శత్రుగృహీతుఁడగుడు నాతనిబలం బంతయు భయంబునఁ గలంగి భంగంబు నొందె. గోవుల మరలించి సుశర్మం జయించి యమితధనంబులంగొని, పాండవులు మత్స్యభూపాలు నెదుట నిలిచిరి. భీముఁడు సుశర్మంబట్టి యాపాపాత్ముఁడు

జీవింపందగఁడు. ఏమి సేయనగు” నని యాలోచించి యాతనిగళంబునం బట్టి బంధించి యరదంబున నిడుకొని, విసంజ్ఞుఁడై ధూళిబ్రుంగిన యాతని యుద్ధరంగంబు మధ్యంబున నున్న ధర్మజునకుం జూపె. మత్స్యమానవ నాథుం డతనిం గాంచి దయఁగొని చిఱునగ వంకురింప “విడిచిపుచ్చు” మని భీమున కాదేశించె. భూపాలుం డట్లుపలుక భీమసేనుండు సుశర్ముం గాంచి “నీకుఁ బ్రాణంబులఁ నాశగలదేని ‘అచ్చులందును జనపదంబులను విరటభూపాలునకు దాసుండ’ నని వాకొనుము. అట్లైన నీప్రాణంబులం గొనక విడిచిపుత్తు” ననియె. ధర్మజుఁడు తమ్ముం గాంచి ‘ఓయీ! ఈతఁడు విరటునకు దాసుండే. నీకు మాయెడ గౌరవం బుండునేని వీని యథేచ్ఛం బొమ్మని విడిచిపుచ్చు’ మని యాదేశించె.

### విరాటజయఘోష

ఇప్పలుకు లాలించి సుశర్మ లజ్జావనతవదనుఁడై బంధముక్తుఁడై పుడమిఱేని పాదంబుల కెఱఁగె. పాండవు లట్లాతని విడిచిపుచ్చి బాహు బలంబున నప్రతిమానులై రణరంగంబున నారాత్రి గడపిరి. విరటుం డతి పరాక్రమశాలురగు నప్పురుషవరేణ్యుల ధనకనకవస్తువాహనాదుల నొసంగి సన్మానించె. విరటుండు వారలం జూచి “మదీయ రాజ్యంబును, ధనధాన్యంబులును, రత్ననివహంబులును మీయవియ. అలంకారంబు లను యువతు లగుకన్యలను ధనంబుల నొసంగెదను. మీయిచ్చవచ్చి న ట్లుపభోగింపుఁడు. మీ బాహుబలంబున నేఁడు నేనాత్మరక్ష గావించు కొంటిని. కావున మీరలే యీమత్స్యదేశంబున కధీశ్వరులరు.” అని గారవించె.అట్టియానేలయేలికంగాంచియాతనికిమ్రొక్కులిడుచు “ఱేఁడా! నీమాటలు మెచ్చవచ్చు. నీ యీపలుకుల కేమెల్లరము సంతసింతుము. నీవు శత్రులకుం జిక్కక దక్కితి వదియే మాకు సంతోషకరంబు” అని వేర్వేఱ వాక్రుచ్చిరి. సంతుష్టచిత్తుండై యాభూపాలుండు పాండ వాగ్రజుం గాంచి “నేఁడు నిన్ను నారాజ్యంబున నభిషేకింతు. నేఁడు మొదలు నీవ మా కేలికవు. మదీయరత్నంబుల గోవుల నన్నిటి భవదధీ నంబు గావింతు. నీమూలంబునగదా యో! వైయాఘ్రపద్యగోత్రజాత భూసురవర్య! మదీయరాజ్యంబును, బుత్రులును శత్రువశంబులుగాక దక్కె. నాయశంబు కొఱంతనొందక చిక్కె” అని సగౌరవంబుగ

భాషించె. అంత యుధిష్ఠిరుఁడు "రాజా! మిగుల సుందరంబుగ సంభాషణంబుఁ ఁ జల్పుచుంటివి. నీవాక్యంబుల కేఁ బ్రీతుఁడనైతి. నృశంసుఁడవు గాక సుఖం బుండుము. దూతలు త్వరితగతిం జని భవదీయ విజయ వార్తను బురంబునఁ బ్రకటింతురుగాక" యని యాదేశించె. ఆతని యానతిమేరకు దూతలం జేరి భూనేత "త్వరితగతిం బురంబుచేరి మద్విజయంబుం బ్రకటింపుఁడు. కన్యలు మంగళాలంకారాలంకృతలై నన్నెదుర్కొనవచ్చునట్లు గావింపుఁడు. మంగళవాద్యంబులు పురంబున మ్రోఁగవలయు. వారవనిత లలంకరించుకొని యెదురు నడతురుగాక" యని యాజ్ఞాపించె. ఆతనియానతి నౌదలందాల్చి దూతలు సంతుష్టచిత్తులగుచు త్వరితగతిం జని పురంబుచొచ్చి తేనివిజయంబును బ్రకటించిరి.

## ఉత్తరప్రశంస

త్రిగర్తాధినాథుం డోడించన మత్స్యధరణీపాలుఁడు గోధనంబును జుట్టుముట్టి మరలించుచుండ, దుర్యోధనుఁడు మంత్రివర్గంబులును యోధవర్య లగు భీష్మ ద్రోణకర్ణకృపశకునిదుశ్శాసనాశ్వత్థామవింశతి వికర్ణచిత్రసేనదుర్ముఖదుస్సహాదు లగు మహారథులును బలసి యనుగమింప మత్స్యరాజ్యంబుసొచ్చి ఘోషంబులనదల్చి గోధనంబులంబట్టె. గోపాలకులు వారింప వారిని శరాసారంబున ముంచి బాధింప వారియాక్రందనధ్వానంబులు మిన్నుముట్టె. గోపాధ్యక్షుఁ డిట్లు గోధనంబులు పరవశంబగుటయు, గోపాలకులు దైన్యంబు నొందుటయుఁ గాంచి విభ్రాంతి చెంది యరదంబునెక్కి యాక్రోశించుచు సత్వరంబున నగరాభిముఖుండై చనియె. పురంబుచేరి రాజభవనంబు దరిసి రథంబుడిగ్గి లోనఁ బ్రవేశించి భూమింజయుఁడను విరాటనరపతి పుత్త్రుం గాంచి, "రాజపుత్త్ర! కౌరవు లాఱువేలగోవులంబట్టి కొంపోవుచున్నవారు. ఆ గోధనంబు మరల్పరమ్ము. మానవపతి నిన్నిచ్చట సైన్యనాథుఁగా నియమించె. సభామధ్యంబున ధరణీపాలుఁడు నిన్ను "అనురూపుండగు పుత్త్రుఁడనియు, శస్త్రాస్త్రనిపుణుఁడనియు వీరుఁడనియు మెచ్చుచుండు." నేఁడట్టి మెచ్చుట సత్యంబగునట్లు కౌరవులం జయించి గోగణంబుల మరల్పుము. భవదీయశరాసారంబున నీకౌరవవాహినుల దహింపుము. పాశం బనును పథానంబును, నారియను తంత్రులు గలదియును, జాపం బనుదండంబుగల

యును, శరవర్షంబును, మహాస్వనంబగు ధనుర్ఘోషను, శత్రుసేనా మధ్యంబున బ్రోయింపుము. వెండివలె వెల్లనగుయుగ్యంబులు భవదీయరథంబును వహించుఁగాక. సింహకేతనంబు వరదంబున నెలకొల్పుము. రుక్మపుంఖంబు లగు భవదీయశరంబులు సూర్యమార్గంబును నిరోధించుఁగాక. రణరంగంబునఁ గౌరవుల నోర్చి యమిత యశంబార్జించి మరల నీ నగరంబును బ్రవేశింపుము. పాండుపుత్రులలో నర్జునునిబోలి పరాక్రమశాలివై నీవ నేఁడీరాష్ట్రంబును రక్షించునది. నేఁడు నీమూలమున నీజానపదులు రక్షనొందుదురు." అని విన్నవించె. ఇట్లు యువతీమధ్యంబునఁ దన్నగ్గించుటకు మిగుల సంతసించి యుత్తరుం డిట్లు పలికె.

## బృహన్నలాసారథ్యము

"దృఢధనువుగల నేను యుద్ధమర్మజ్ఞుం డగుసారథి లభించెనేని గోపదంబుచొచ్చి గోగణంబుల మరల్ప నేర్తు. సారథి లేకుండుటంజేసి వెతఁగుందుచుంటి. తగుసారథిని వైళంబ యారయుఁడు. ఇరువదియెనిమిది దివసంబులు జరిగిన బవరంబున నాసారథి మడిసె. సారథి యలవడెనేని త్వరితగతిం జని గజవాజిరథసంకులంబగు శాత్రవానీకంబుసొచ్చి శస్త్రప్రతాపదుర్వారులగు భీష్మద్రోణకర్ణకృపాశ్వత్థామాదనైన్యపతులతోఁగూడ దుర్యోధను నోటఁబుచ్చి యాలకదుపుల మరల్చి యీమహాహవాంతంబునఁ దిరిగివచ్చువాఁడ. మనగోగణంబుల ముట్టి యింతకుమున్నె కౌరవులు మరలిపోవుచుందు రొకో! నే నచ్చట లేకుంటి, నేమిచేయవచ్చు? నే నచ్చటనే యుంటినేని పార్థుఁ డనుబుద్ధి కలంగునట్లు చేయకుందునే!"

ఇట్లుత్తరుండు పలుక నింద్రతనయుం డచ్చట నుండుట నాకర్ణించి యజ్ఞాతవాసవత్సరం బతీతంబగుట నిశ్చయించి, ద్రుపదపుత్రిం గాంచి యల్లన రహస్యంబునఁజేరి ఉత్తరకుమారునకు వైళంబ నన్నుం జూపి "ఈతఁడు పాండుపుత్రుఁడగు నర్జునుని మెప్పువడసిన సారథి కావున నీతని సారథిగా నంగీకరింపు" మని పలుకు మనిచెప్పె. ఉత్తరుం డర్జునుఁ డను భీతి కలంగునట్లు జన్యంబు గావింతుననుట నాలకించి పాంచాలియు సామర్షయై యుండె. ఇంచుక లజ్జించుచుఁ బాంచాలి యుత్తరుం డాసి "మదగజంబుపోల్కినున్న యువకుం డగు నీబృహన్నల యర్జునునకు

సారథియై యుండె. ఈతం డింద్రతనయుకడ ధనుర్వేదం బభ్యసించుట నాతనికి శిష్యుండు. పాండవులం గూడి వీరవిహారంబులు సలుపుచుండు నీతని నేఁ బలుమఱు చూచియుందు. పావకుం డర్జునసాహాయ్యంబున ఖాండవవనంబు దహియించునాఁడు సురపతిసూతి కితఁడు సారథ్యంబు నలిపె. ఈతని సాహాయ్యసంపద నింద్రతనయుఁడు ఖాండవప్రస్థంబున సర్వభూతంబులం జయించె. ఇట్టిసారథి వేఱొకరుం డుండఁబోఁడు." అని విన్నవించె.

ఉత్తరుండు సైరంధ్రిం గాంచి "అతివా! బృహన్నల నిక్కం బనుయావనశాలికాక నపుంసకుండగుట నాతని సారథి గమ్మని ప్రార్థింపం జాల" నని వాక్రుచ్చె. ద్రోవదియు కుమార! నీచెలియలు బృహన్నల నొడంబఱుప వలంతి. ఆతండు సారథియై యుగ్యంబులంబూన్చి పగ్గం బులం బట్టెనేని గౌరవులనెల్ల జయించి గోగణంబుల మరల్చి నిమేష మాత్రంబునఁ దిరిగి రావచ్చు ననియె. అంత నుత్తరుండు సోదరిం జీరి బృహన్నలం గొనిరమ్మని నియోగించె. సోదరుఁడు పనుప నామెయుఁ బాండవమధ్యముఁ డుండునర్తనాగారంబులు త్వరితగమనంబునం జేరె.

మేఘమండలంబు సొచ్చు మెఱుఁగుచందంబున భాగ్యొత్పచోదిత యగు నమ్మగువ నర్తనాగారంబుసొచ్చి గజేంద్రబుంబోలె నొప్పుచున్న యర్జునుంగాంచి యర్థించెను. కాంచనాలంకారంబులను, విచిత్రమాల్యం బులను, కనకాంబరంబులగాత్రంబుకై నేసికొనివచ్చు నమ్ముగుదం గాంచి యింద్రపుత్రుఁడు "ఉవిదా! నేఁ డేలకో నీవు త్వరితగతిఁ జనుదెంచు చుంటివి? నీమోముదమ్మి వికసించియున్నయది. కాని యందుఁ బ్రసన్న భావంబు గాన రాకున్న యది. కారణంబు నెఱింగింపు" మని ప్రశ్నించె. చెలికత్తెలమధ్యంబున నట్లు ప్రశ్నించిన బృహన్నలం గాంచి సప్రణ యంబుగ నమ్మానిని "మనరాజ్యంబునందలి గోగణంబులఁ గౌరవులు చుట్టుముట్టిరి. వానిని మరలింప ధనుర్ధరుండై నాయన్నయుత్తరుం డేఁగు వాఁడు. మున్ను సంగ్రామరంగంబున నాతనిసారథి వధ్యుఁడగుటం జేసి యాతని యరదంబుగడపఁదగుసారథిఁ దొఱకొనకుండె. సారథినరయు మా యన్నకు నీకు సూతకృత్యంబునఁ గౌశలంబుండుటనని సైరంధ్రియెఱింగించె. తొల్లి నీవర్జునునకు సారథివై యుండి రథంబు గడపితివఁట. నీసాహాయ్యం బునఁ బాండవమధ్యముండు భూమండలంబును జయించెనఁట. అట్లు

నీవు మాయన్నకు సారథ్యంబు నడిపి జయం బాపాదింపుము. కౌరవు
లిప్పటికే గోవులంగొని మిక్కిలి దూరం బేగుచున్నారు. ఇట్టి నాప్రణ
యంబును నెఱవేర్పవేని జీవితంబును ద్యజింతును." అని ప్రార్థించె.

ఇట్లు కిరీటి ప్రార్థితుండై జాగుసేయక రాజపుత్రునికటంబుం జేరి
కరేణువు గజేంద్రంబుంబోలె నుత్తరయు నాతని వెన్నంటిపోయె. అట్లు
వచ్చుబృహన్నలం దూరంబునుండి గాంచి యుత్తరుండు "పాండవమధ్య
మునకు నీవు సారథివై ఖాండవప్రస్థంబు నగ్ని దేవుం దృప్తినొందించి
తివి. నీసూలంబున ధనంజయుండు ధరణీతలంబు నెల్ల జయించె. సైరంధ్రి
పాండవుల నెఱుంగుం గావున నీరహస్యంబు నాయమ పేర్కొనియె.
ఆతని కెట్లు సారథ్యంబు నడిపి ప్రియం బాపాదించితివో యటుల గో
గణంబుల మరల్పం గౌరవులతోం బోరువాకు సూతకృత్యంబు సలుపుము"
అని వాక్కొనియె. ఇట్లుపలుకు రాజపుత్రుంజూచి బృహన్నల "కుమారా
రణరంగంబున సారథ్యంబుసేయ నేర్తునే? గీతంబో నృత్తంబో నెఱపు
మన్న సేయనేర్తుంగాని యిది నాకెట్లు సాధ్యమగు" ననియె. ఉత్తరుం
డును "బృహన్నలా! తరువాత గాయకుండవో, నర్తకుండవో యగు
దువుగాక. ప్రథమంబున నరదంబున హయంబులం బూన్పు" మని దృఢ
తరం బగుతనుత్రాణంబు నొసంగె. ఫల్గునుండు కవచధారణంబు నెఱింగి
యుండియు నాకవచంబును గాత్రంబునం గప్పుకొనియె. అచ్చట నుండు
నబలాజనంబు లవ్విధంబువీక్షించి నవ్వందొడంగిరి. ఉత్తరుం డది గాంచి
యాకంకటంబును సమంబుగా నాతని గాత్రంబున నమర్చి, తానును
నుదాత్తంబగుమణువుం దొడంగి సింహధ్వజం బెత్తించి, సురుచిరంబులగు
బాణజాలంబుల నరదంబున నెలకొల్పి బృహన్నల సారథిగాం గొని
బయలువెడలె. ఉత్తరయు నామె చెలు లగుకన్యలును బృహన్నలంజేరి
"భీష్మద్రోణాదుల సంగ్రామరంగంబునం బరాజయంబునొందించి బొమ్మ
పొత్తికలకు విచిత్రంబు లగువస్త్రంబులను మృదులములగువానిని దేర
వలయునండీ" యని వేడుకొనిరి. ఇట్లు పలుకుకన్యలంగాంచి చిఱునగవు
తోలకరింపం బార్థుండు "భూమింజయుండు జయంబునొందునేని మనో
హరంబు లగువస్త్రంబులం దెత్తు" నని యుత్తరం బిచ్చె. ఫల్గునుండు కురు
సైన్యంబులం జేరుతలంపున యుగ్యంబులందోల నటనుండు స్త్రీలును,
గన్యలును, బ్రాహ్మణోత్తములును, బ్రదక్షిణంబు గావించి "ఖాండవ

దాహసమయంబున నర్జునున కొనఁగూడిన మాంగళ్యంబు కౌరవులతో రణంబుసలుపఁబోవు నీయుత్తరునకు బృహన్నలా! నీసారథ్యంబునఁ గలుగవలయు" నని వాకొనిరి.

## ఉత్తరుఁడు కురుసేనలఁ జూచి భయ మందుట

అకుతోభయుం డగునుత్తరుండు పురంబు నిర్గమించి 'కూడి యున్న కౌరవులనెల్ల నోడించి, గోవుల మరలించి త్వరితంబుగఁ బురంబుఁ జేరవలయుఁగావునఁ గౌరవులున్న తావున కశ్వద్రథంబుగడపు' మని యాజ్ఞాపించె. అంత నర్జునుఁడు రథ్యంబులఁ బ్రచోదించె. అయ్యర్జును నిచేఁ బ్రచోదింపఁబడిన యయ్యుగ్యంబు లంబరంబు నొరయుచున్నట్లు పరువెత్తసాగె, అనతిదూరంబు చని పితృవచనంబు దరిసి యమిత్రఘ్నులగు ధనంజయభూమింజయులు శమీవృక్షంబు సమీపించి కౌరవబలంబును బరికించిరి. అయ్యనీకంబు సాగరంబుభాతిఁ గానవచ్చుచుండె. సైన్య సంచారసంజనితం బగు ధూళి యుప్పరంబు గప్పి యాకసమున కరిగాపు వోవుచున్న వనంబువలెఁ గానవచ్చె. దాన నేత్రంబుల కాంధ్యంబు సంఘటిల్లుచుండె. భీష్మద్రోణకృపాదిధనుష్మంతులచేఁ బరిరక్షితం బగు సబ్బలంబు నవలోకించి భయంబుగదుర, రోమాంచకంచుకితగాత్రుఁడై యుత్తరుఁ డర్జునుం గాంచి "కౌరవుల నెదిర్చి బవరంబు సలుపంజాల. చూచితే! నాశరీరంబున భయంబుకతంబున నెట్టు రోమాంచం బుప్పతి ల్లెనో? బహుప్రవీరసంగుప్తమగు నీసైన్యంబు దేవతలకుంగూడ దురాసదంబని నాకుం దోఁచుచుండె. రథాశ్వ సంకులంబును, గజపదాతి బహుళంబును భీమకార్ముకంబునగు నీబలంబును గాంచినంతనే నామ నంబు దిగు లొందుచున్నది. ద్రోణుఁడును, భీష్ముఁడును, కృపుఁడును, ద్రోణపుత్రుఁడును, కర్ణుఁడును, దుర్యోధనుఁడును, వికర్ణుఁడును, సోమ దత్తుఁడును, బాహ్లికుఁడును,యుద్ధవిశారదులగుమహావీరులును ద్యుతిమం తులై వెలుఁగుచుండ వారలఁ గాంచినంతనే భయంబున రోమహర్షంబు గలిగె" నని పరిదేవనంబు సలుపుచు "మదీయజనకుండు త్రిగర్తులం బోరనేఁగె. నే నంతిపురంబుననొంటినుంటి. సైన్యంబు రాజుంజేరిపోవుటఁ బురంబున సైన్యం బేమియును లేదు. నేనొంటిమై పెక్కురగుకౌరవుల నకృతాస్త్రపరిశ్రముండ నస్త్రపరిశ్రమంబున నారితేరినవారల నెదిర్చి

బవరంబు సలుపంజాల. ఓబృహన్నలా! యరదంబు మరల్పుమని మొఱ పెట్టఁబోడంగె. బృహన్నలయు "కుమారా! నీవు భయంబునం గుందుచు శాత్రవులకు హర్షంబు గలిగించుచుంటివి. పగతురు రణాంగణంబుననేమియు సలుపరైరి. నీవే స్వయంబుగ శత్రుసైన్యంబులపైకి రథంబు గడుపుచుంటివి. నేనామిషంబుచవిసాయముదప్పి పసులఁబట్టి కౌరవులున్న తావునకు రథంబు పఱపెద. పగతుఱ నెదిర్చి పోరుసల్పుము. అట్లు స్త్రీపురుష సమక్షంబునఁ బౌరుషం బగ్గించుటకు సంతసించి యుత్సహించి, యిటవచ్చి యుద్ధంబు సేయ నేల వెఱతువు. యుద్ధంబునఁ గురుసేనలజయింపక గోగణంబుల మరల్పక పురంబు సొత్తేని నగరంబునం గల నరనారీజనంబులు గేలిసేయుదురు. నన్ను మెచ్చి సైరంధ్రి పేర్కొనియె. దాని మెచ్చి సారథిగాఁ గైకొంటివి. ఇట్లు నేఁ బసుల శాత్రవులు గొంపోవుచుండ వెఱచఱచి యెట్లూరకుండు. పసులకదుపుల మరలింపక, శాత్రవుల జయింపక పురంబు సొరనొల్ల" నని యుత్తరంబిచ్చె. ఉత్తరుఁడు గఱుపాఱిన మేనితో "కౌరవులు మాత్స్యులధనంబుల నపహరింపనిమ్ము. పగఱకు వెన్నిచ్చి వచ్చిన నన్నుం గాంచి నరనారీజనంబు లపహసింపనిమ్ము. గోగణంబులు వోనిమ్ము. నేమాత్రము బవరంబు సలుపఁజాల. పురంబు నెవ్వరును బాసటలేరు" అని వచించుచు నరదంబు డిగ్గనుఱికి మానంబును దర్పంబును విడిచి, శరశరాసనంబులఁ బాఱవైచి పురిదెసకుఁ బఱువెత్తె. బృహన్నల దానిం గాంచి "శూరులగుక్షత్రియులు రణరంగంబునుండి పలాయితులు గాఁజాలరు. యుద్ధరంగంబున మనంబునొందుట శూరధర్మంబుగాని పలాయనంబు గాదు." అని వచియించుచు రథంబు నవతరించి లంబకేశభారుఁడును విధూతశుక్ల వస్త్రయుగళుఁడు నగుచు పలాయితుఁ డగు రాజపుత్రు దెసకుఁ బర్వెత్తె.

అట్లు పర్వెత్తు నర్జునుం గాంచి కౌరవసైనికులు వికృతరూపంబున నున్న యాతనిం గాంచి యర్జునుండని తెలియనేరక పరిహసించిరి. కొందఱు భస్మసంఛన్నుఁ డగు వీతిహోత్రు చందంబున వికృతవేషంబున నున్న యీతం డెవ్వఁడొక్కొ? ఇతనిరూపం బొకింత యువతింబోలియు నొక్కింతపురుషుంబోలియు నున్నయది. క్లీబరూపుండగు నీతం డర్జునునిసారూప్యంబు భరియించుచున్న వాఁడు. ఈతనికంధరంబును బరిఘులంబోలు భుజయుగళంబును నతిమానుషగమనంబును గల యాతండు

పార్థుండు గాక యితరుండు గానేరఁడు. ధనంజయుండు దక్క నితరుం
డెవం డిట్లు కురుసైన్యంబుల నొంటిఁదలపడి పోరవచ్చు. పురంబున
నొంటిమై నున్న విరాటపుత్త్రుఁడు కురుసైన్యంబులు గోవులముట్టె నను
కుయ్యి రా బాలుండు గావునఁ గ్రిందు మీఁ దెఱుంగక ప్రచ్ఛన్నవేషుఁ
డగు పార్థుం దెలియనేరక సారథి గావించుకొని, యెత్తివచ్చి మనసైన్యం
బులం గాంచి భీతహృదయుఁడై పలాయితుఁడు కానోపు. అట్లు పర్వెత్తు
నాతని నిర్వీరుండు మరలింపఁ దలంపఁబోలు" నని యిట్లు విమర్శించుచు
నేదియు నిశ్చయింపనేరకుండిరి.

అర్జునుఁడు పలాయమానుఁ డగు పార్థివాత్మజుం గాంచి పదశత
మాత్రంబు పరుగిడి కేశంబుల నాకర్షించె. అట్లు పరామృష్టుఁడై మత్స్య
పతి తనయుఁడు భయవిహ్వలుఁడై బహుకృపణంబుగ "కళ్యాణీ!
బృహన్నల, నామాట లాలకింపుము. అరదంబును మరల్పుము. బ్రదికి
యున్న సుఖంబులఁ బొందవచ్చు. శుద్ధసువర్ణనిష్కశతంబును, నెనిమిది
హేమబద్ధంబులగు వైడూర్యమాణిక్యంబులను, బది మదపుటేనుఁగులను
నీ కిత్తు. నన్ను విడిచిపుచ్చు" మని విలపింపఁదొడంగె. ఇట్లు నిశ్చేత
నుఁడై విలపించు నాతని రథసమీపంబునకుం దెచ్చి "శత్రువుల
నదల్చి యుద్ధంబు సేయ నోపు దేని నీ విట్లేల పలాయనంబు గావింపవలయు?
నే శత్రువులఁ దలపడి పోరుసలిపెద. నాకు సారథ్యంబు నిర్వహింపుము.
శత్రుపరిగుప్తం బగు నీ కౌరవసైన్యసాగరంబును మద్బాహుబల పరిరక్షి
తుండవై నిర్భయంబునం జొచ్చి విహరింపుము. క్షత్త్రియుండ వగు నీవు
శత్రుమధ్యంబున నిట్లేల విషాదంబు నొందెదు. నేను గౌరవులతోఁ బోరు
సల్పి విజయంబు చేకొని పశువుల మరల్చెద. అరదంబు నెక్కి సన్నద్ధుండ
వగు" మని యాతని ముహూర్తమాత్రం బాశ్వాసించి భయపీడితుం
డగు నతని నరదంబు నెక్కించె.

### అర్జునప్రశంస

అరదంబు నెక్కి క్లీబవేషంబున సైన్యాభిముఖుఁడై వచ్చు నాపురుష
పుంగవుం గాంచి, రథికవరులగు భీష్మద్రోణాదు లెల్లరు నర్జునుండను
భయంబున నుత్సాహంబు దొఱఁగియుండఁ జాపాచార్యుఁ డగు ద్రోణుఁడు
సంఘటిల్లు నుత్పాతంబుల నాలక్షించి "చండవాతంబు రూక్షంబుగ

పేఁచుచు నిసుక నెగఁజిమ్ముచున్నది. భస్మవర్ణంబగుతమం బుష్పరంబు గప్పె. జలదంబులు రూక్షవర్ణంబులై కానవచ్చె. శస్త్రంబులు తమకోశంబుల నుండి తమంత వెలికివచ్చుచున్నయవి. ప్రాగ్దిశాంతరమున నక్కలు కూయుచున్నవి. ఉత్తమహయంబులు కన్నీరుమున్నీరుగాఁగార్చుచున్నవి. కదల్పఁబడకయు ధ్వజంబులు కంపించుచున్నయవి. ఇట్టి కారణంబు మన కవశ్యంబు సంగరంబు గాఁగలయది యని నిశ్చయింపఁబోలు. కాన నెల్ల వారలు సన్నద్ధులై యాత్మరక్ష గావించుకొనుచు, సేనల మొనలుదీర్చి యుంచునది. సమయప్రతీక్షణంబు గావించుచు గోధనంబుల రక్షించునది. మహాబలపరాక్రముఁడగు పార్థుఁడు క్లీబవేషంబున నిటువచ్చినాఁడు,సంశయంబువలదు. వనచరకేతుండును, గిరీటధారియు నగు నియ్యంగనా రూపపురుషుఁడు పార్థుఁడుగాక యన్యుఁడుగాఁడు. ఈతఁడవశ్యంబు గోగణంబుల మరలించు. సంగరంబున నీతఁడు సురాసురు లెదురైనను జయంబు చేకొనంగలఁడు. వనవాసాయాసంబునఁ గడుం బడలి యమర్షావేశంబునఁ బూన్కి మిగుల నిదే వచ్చుచున్నవాఁడు. నేఁ డితని కెదురు నిల్చి పోరంగల పోటుమానిసి నిబ్బలంబునం గాంచనోప. త్రిపురాంతకుండును బవరంబునఁ బార్థుచే నోటువడియె నని విందుము.” అని వాక్రుచ్చె. దానికిఁ గర్ణుఁడు కటకటంబడి “ఆచార్యా! నీ వేటి కెల్లకాలము పార్థుం బ్రశంసింతువు? ఆతఁడు నాకుంగాని, రారాజునకుంగాని పదియాఱవభాగంబునకు సాటివచ్చువాఁడుగాఁడు.” అనియె. కౌరవాధినాథుఁడగు దుర్యోధనుఁడు “రాధేయ! నిక్కమ్ము నీతఁడు పార్థుండేని మనకార్యంబు సఫలంబైనదియ. అజ్ఞాతవాసవత్సరం బగునియ్యేడుదాఁటమి ప్రతిజ్ఞాతవత్సరంబునకు మున్ను దెలియఁబడుటం జేసి మరల వారలు ద్వాదశాబ్దంబులు వనంబులం గ్రుమ్మరంగలవారలు. అట్లుకాక యీతఁడు క్లీబవేషధరుండగు ప్రాకృతమానవుఁడేని మదీయసాయకంబుల నాతని వివశుం గావించి భూశయ్యం బవ్వళింపఁజేయుదు”ననియె. అట్లు దుర్యోధనుఁడు పలుక భీష్మద్రోణకృపాశ్వత్థామలు రారాజు పౌరుషంబు మెచ్చిరి.

## అర్జునాస్త్ర కథనము

అర్జునుఁ డుత్తరుని సారథి గావించుకొని తా మస్త్రముల నిక్షేపించినశమీవృక్షంబుసమీపముం జేరి, యుత్తరుం జీరి “ఓయయ్యా!

ఇయ్యాయుధంబు లన్నుపలు. బలవిరహితంబులు. గజరథాదులఁ బడ
నేయు మదీయబాహుభరంబు సహియింపనోపవు. కావున నీశమీవృక్షంబు
నధిరోహింపుము. దీనం బాండవులు తమయాయుధంబుల నిక్షేపించిరి.
యుధిష్ఠిరభీమార్జుననకులసహదేవులయాయుధంబులును, ధ్వజంబులును,
దనుత్రాణంబులును, శరంబులును, దాఁచఁబడెను. పాండవమధ్య
ముండగు పార్థునిబాణాసనం బందుండు. ఆగాండీవంబు తృణంబువలె
బెండువడియుండి శత్రుసంబాధసహంబును వ్యాయామంబునకోర్చునది
యునై యొప్పు. మిగుల పొడవై వ్రణంబులేక చూడ నందంబై బహు
భారంబు సహింపవలంతి. యుధిష్ఠిరభీమనకులసహదేవుల యాయుధం
బులు నట్టివ" యని యాదేశించె.

## అస్త్రారోపణము

ఉత్తరుఁడు "ఈతరువరంబున శరీరంబొండు రజ్జుబంధనంబున విగత
ప్రాణంబయ్యెనని విందుము. అట్టివృక్షంబును రాజపుత్త్రుఁడనగు నేఁ గేలం
దాఁక నిచ్ఛగింపను. రాజపుత్త్రుఁడను మంత్రజ్ఞుఁడ నగు నాచే నిట్టియును
చితకర్మంబులు సేయించుట పాడియే? శవంబునుం దాఁకి శవవాహకుని
బోలి యశుచినై యున్న నాచే నెట్లు పనిగొనుచు వ్యవహార్యునిఁగాఁ
బరిగ్రహింపఁగలవాఁడవు?" అని యాబృహన్నలం బ్రశ్నించె. "రాజ
పుత్త్రా! శుచియును వ్యవహార్యుఁడవును గాఁగలవు. ఇట్చుట శవశరీరంబు
లేదు గాన భీతినొంద నగత్యము లేదు. కుమార! మత్స్యమానవనాథాత్మ
జుండ వగు నీచే ననుచితకర్మంబు నే నేలఁ జేయింతును?" అని పార్థుఁడు
హాకొని యాతని నొడంబఱచె. మత్స్యనాథపుత్త్రుండును రథంబు నవత
రించి శమీవృక్షంబు నధిరోహించె. "ఇయ్యాయుధంబులనున్న పరివేష్ట
నంబు సడల్చి క్రిందికి డిగ్గవిడుపు" మని యాధనంజయుం డాతని కాదే
శించె. ఆ విరాటసూనుం డట్లు కావించి వానిపరివేష్టనబంధంబును సడల్చి
పాండుపుత్త్రుల యాయుధంబులం గాంచె. పరివేష్టనంబు సడల్చునంత
నయ్యాయుధంబులు గ్రహోదయంబులవెలువడుకాంతిం బోలు కాంతులు
నభోమండలంబు నాక్రమించె. జృంభణంబుగావించు సర్పంబులం బోలి
యున్న యయ్యాయుధంబులం గాంచి, మేను గఱుపాఱఁ బ్రకాశవంత
ములగువానిఁ గరాగ్రంబున స్పృశించి యర్జునుం గాంచి యిట్లనియె.

## అస్త్రదర్శనము

"సౌవర్ణబిందుశతసహస్రంబుల నలంకృతం బగునికార్ముకంబు పాండుపుత్త్రుల నెవ్వారు ధరియించునది? పృష్ఠభాగంబున సౌవర్ణప్రావరణంబులుగల యియ్యాయుధం బెవ్వారిది? హేమమయంబగు నీధనుః పృష్ఠంబున నింద్రగోపంబురుచు లలరారుచున్నయవి? ఇయ్యది యెవరిచేతి కలంకారంబు? స్వర్ణమయములగు సూర్యప్రతిమలు విరాజిల్లు నియ్యాయుధం బెవ్వారిది? జాతరూపశలభభాసితం బగు నీబాణాసనం బెవ్వరు వహించునది ? కంకపత్త్రవిరాజితంబులును గలధౌతపుంఖంబులును గల యీనారాచంబు లెవ్వరివి ? పీతంబులై హారిద్రవర్ణంబులై సర్వాయసంబులగు నీచాపంబు లెవ్వారివి? వరాహకర్ణంబులంబోలు కంకపత్త్రంబులం బూను నారసంబులు గలయమోఘమయం బగు నీధనుశ్శ్రేష్ఠం బెవ్వారిచేతి కలంకారంబు ? మిగుల దీర్ఘంబును, దీర్ఘశిలీముఖంబును, గురుభారసహంబును, శత్త్రుభయంకరంబును నగు నీబాణాసనం బెవ్వారిది? వ్యాఘ్రకోశనిక్షిప్తంబును హేమత్సరువిభాసితంబులు నగు నీఖడ్గం బెవరు ధరించునది? పృథులంబును జిత్రకోశంబును గింకిణీసాయకంబును స్వర్ణత్సరువును నగు నీయసిపుత్రిక యెవ్వారలది? గోకోశనిక్షిప్తం బగు నీఖడ్గం బెవ్వరిది? తక్కంగల యియ్యాయుధంబులు పాండుపుత్త్రుల నెవ్వారు భరించునవి? ఇదియంతయు సవిస్తరంబుగ నా కెఱిగింపుము. వీనిం జూడ నాకు విస్మయంబు జనించె."

## అర్జును డుత్తరున కస్త్రంబు లెఱింగించుట

అంత నర్జునుండును "కుమార ! నీయడిగిన యియ్యర్థంబు తేటపడ నుత్తరముల వాకొందు. సావధానుండవై యాకర్ణింపుము. శాతకుంభపరిష్కృతంబును మిగుల నాయితంబు నగు నిద్ధనుర్వరంబు పార్థుండు ధరియించులోకవిదితంబగు గాండివంబు. ఇయ్యాయుధంబు సాహాయ్యంబున విజయుండు దేవమానవావళి జయించి విజయంబుగొనుచుండు. దేవదానవగంధర్వాదులచే నుత్తమబాణంబులతోడ నియ్యాయుధంబు బహుకాలంబు పూజింపంబడియె. తొల్లి కమలాసనుం డీబాణాసనంబును వేయివత్సరంబులు ధరియించి ప్రజాపతి కొసంగె. ఆతఁడు మున్నూట యేనువత్సరంబులు ధరియించి యింద్రున కొసంగెను. శక్రుం డెనుబది

యేనువత్సరంబులుపూని సోమున కర్పించె. సోముం డేనూఱువత్సరం
బులు వహించి వరుణున కాయత్తపఱచె. ఆతఁడు నూఱువర్షంబులు
మోచి పార్థున కిచ్చె. ఆతఁ డఱువదియేనువత్సరంబు లియ్యాయుధం
బుఁ బనిగొనుచుండె. అల్లదియ కుంతీసుతమధ్యముం డగు పవనతన
యుండు ధరియించు చాపరాజంబు. దీనిసాహాయ్యంబున నమ్మానవపుంగ
వుండు ప్రాగ్దిశనంతను జయించె. ఇంద్రగోపరుచులనీను నాసుందరచాపంబు
యుధిష్ఠిరుండు పూనునది. సౌవర్ణసూర్యుల విరాజిల్లుతేజోవంతమగు
నయ్యాయుధంబు నకులుని హస్తభూషణంబు. హిరణ్మయశరభవిభ్రాజి
తంబగు కార్ముకంబు సహదేవపరిగృహీతంబు. చురియలంబోలు నీవాఁడి
యమ్ములు పార్థుండు పూనునవి. శత్రువ్యూహంబున నరిమర్దనంబు
గావించుతఱి నీనారసంబు లక్షయ్యంబులై యాతనిశరధుల నిండియుండు.
అర్ధచంద్రాకారంబులై దీర్ఘంబులైయున్న యీకోలలు పవనతనయు
నివి.హరిద్రవర్ణంబులై హేమపుంఖంబులం దనరు నీశరములు నకులునివి.
వీనిసాహాయ్యంబున నిప్పీరవరుండు ప్రతీచీదిశను నిర్జించె. భాస్కరా
కారంబులగు నీయమ్ములు సహదేవునివి. వాఁడి గలిగి పీతవర్ణంబులై దీర్ఘం
బులై హేమపుంఖంబులు గల యానారాచంబులు పాండవజ్యేష్ఠునివి,
శిలీపృష్ఠంబును శిలీముఖంబును నగు నీయమ్ము విజయునిది. ఇయ్యది గురు
భారసహంబును శత్రుభయంకరంబును నైయుండు. వ్యాఘ్రకోశంబునఁ
దనరుచుండు నీసాయకంబు వృకోదరునిది. చిత్రకోశంబును హేమ
త్సరువిరాజితంబు నగు నీనిస్త్రింశంబు ధర్మతనయుఁడు పూనునది. పాంచ
నఖకోశంబున నిక్షిప్తంబగు నాకృపాణంబు నకులుండు ధరియించునది.
గోకోశనిక్షిప్తంబగు నావిపులఖడ్గంబు సహదేవుని హస్తాగ్రనిలయంబు"
నని యుత్తరంబిచ్చె.

## అర్జునపరిచయము

దాని విని యుత్తరుండు "సువర్ణవికృతంబు లగు పాండవుల
యియ్యాయుధంబులు మిగుల నుజ్జ్వలంబులైయున్నయవి. కపటద్యూ
తంబున రాజ్యంబు గోలుపోయి మహాత్ము లగుపాండవు లెచ్చట కేఁగిరో
తెలియఁబడకున్నది. స్త్రీరత్నం బనఁదగు పాంచాలి వారల ననుగమించి
యెట కేఁగెనో యెఱుంగఁబడదయ్యె." అని దీనంబుగ వాకొనియె. అంతఁ

బాండవమధ్యముండు "అయ్యర్జునుండు నేన. మీజనకునికొలువున సభాస్తారుండై యుండువాఁడు పాండవాగ్రజుండు. వల్లవుఁ డనువాఁడు పవనతనయుఁడు. అశ్వబంధకుఁడు నకులుఁడు. గోపాలకుఁడు సహదేవుఁడు. ఎవతెకై కీచకు లెల్లరు పరలోకంబున కరిగాపులైరో యామెయ పాంచాలి" అని యెఱింగించె. అంత నవ్వచనంబున నమ్మిక చాలమి నుత్తరుండు "పార్థునకుఁ బదినామంబు లుండు నని విందు. నీకు నే విశ్వసనీయుఁడ నేని వాని నెఱింగింపుము" అని ప్రార్థించె. విజయుండును "రాజపుత్ర! సావధానుండవై యాలకింపుము. ఆనామంబులు పదింటిని జెప్పెదు. అర్జునుఁడును, ఫాల్గునుఁడును, జిష్ణుఁడును, గిరీటియు, శ్వేతవాహనుఁడను, బీభత్సుఁడును, విజయుఁడును, కృష్ణుఁడును, సవ్యసాచియు, ధనంజయుఁడును నను నీపదియు మదీయనామంబులై యుండు" నని ప్రతివచనం బిచ్చె. అంత నుత్తరుండు "నీ కీపదినామంబు లెట్లువచ్చెనో చెప్పితేని భవద్వచనంబుల నాకుఁ బ్రత్యయంబు జనించు" నని యెఱింగించె. అన్నిజనపదంబుల జయించి యపరిమితధనంబులం జేకొంటం జేసి ధనంజయుండును, రణరంగంబున శత్రులఁ బారంద్రోలి విజయంబుచేకొంట విజయుండును, వెల్లగుఱ్ఱంబులం బూన్చిన యరదం బెక్కి బవరంబు సవరించుకతంబున శ్వేతవాహనుండును, నుత్తరఫల్గునీనక్షత్రయుక్తదివసంబున జనియించుటం జేసి ఫల్గునుండును, దానవులతోఁ బోరుసల్పునాకు శక్రుండు దయచేసినకిరీటంబు గలుగు నిమిత్తంబునఁ గిరీటియు, యుద్ధంబు సలుపుజోదులకు భయం బుప్పతిల్లఁ జేయుటం జేసి బీభత్సుండును, పాణియుగళంబున గాండీవకర్షణంబు గావించుటను సవ్యసాచియుఁ, జతురంతపరీతభూవలయంబున దుర్లభం బగు శుక్లవర్ణంబు గలవాఁడ నగుట నర్జునుండును, శక్రతనయుండను శత్రువులకు దురవాపుండను నై యుండుకతంబున జిష్ణుండును నను తొమ్మిదినామంబులం బ్రఖ్యాతినొందియుండుదు. బాలకుండ నగునెడ కృష్ణావదాతవర్ణంబులు గలుగ హర్షించు మదీయజనకుండు కృష్ణుండను దశమనామంబు గావించె" నని వాకొనియె. అంత విరటతనయుండు పాండుపుత్రుపాదంబుల కెఱఁగి 'భూమింజయుండ నను నే నుత్తరుండ. భాగ్యవశంబున నేఁడు నిన్నుఁ జూడఁగంటి నిదియ స్వాగతంబు. మహానుభావా! మోహవశంబునఁ దెలియనేరక యే నిన్నుఁ బలుగాకిపలుకులఁ

బలికియుండు. వాని సైరింపుము. నీ కావించిన చిత్రకర్మంబుమూలంబున మదీయభయంబు సకలంబును వ్యపగతంబయ్యె. నీయం దింతయనివాకొన రాని ప్రియం బుద్భవిల్లె నని వచించె.

## అర్జునయుద్ధారంభము

మఱియు నాతఁడు రథంబు నధిరోహించి 'సారధి నగు నన్నుం గూడి యేయనీకంబునం గవయఁగోరెదవో యెఱింగించిన నాదెస కరదంబు పఱపెద' నని వాకొనియె. దాని కర్జునుఁడు "పురుషవ్యాఘ్రా! నీయెడఁ గరంబు సంతసించితిని, రణరంగంబున భవదీయారాతులఁ దుత్తునియలు గావింతు. స్వస్థుఁడవై శత్రులతోఁ బోరు నన్నుఁ బరికించుచుండుము. స్వర్ణమయంబులగు నియ్యాయుధంబులనెల్ల మదీయరథంబున భద్రపఱుపుము. ఒక్కని స్త్రింశంబునుమాత్రము వెలికిఁ దీసియుంచుము." అని యతని కుపదేశించెను. అయ్యర్జునువచనంబు నాలకించి యుత్తరుం డర్జునుగాండీవాదుల గ్రహించి తరువరంబు నవతరించె. అంత నర్జునుఁడు "నేఁ గౌరవులతోఁబోరి భవదీయగోగణంబులం బరివర్తింపఁ జేయుదు. విరాటనగరంబును మదీయబాహుబలంబునఁ బరిరక్షించి విజయకేతనని కేతనంబుగాఁ జేయంగలవాఁడ. గాండీవధన్వినగు మద్బాహుబలపరిరక్షితుండవై రణాజిరంబున సుస్థిరంబుగ నిలుము. శత్రుబలంబుల కజేయుండవై యుండుము. భీతి దోఁపంగుము" అని యాశ్వాసించె. "నే రణరంగంబునం బరులకు భయమందువాఁడను గాను. నీవు రణరంగంబున సుస్థిరుండవనియుఁ, బగఱకు వెన్నిచ్చువాఁడవు గావనియు నే నెఱుంగుదును. బవరంబున కేశవశక్రాదులకుఁ దుల్యుండవు. కాని యిట్టి యంగరూపలక్షణయుక్తుండ వగు నీ వేకారణంబునఁ గ్లీబత్వంబు నొంది యుంటివో యని మిక్కిలి విచారించియు నిశ్చయంబుఁ దెలియనేరకుంటి. క్లీబవేషప్రచ్ఛన్నుం డగు శూలపాణియో సురేంద్రుఁడో యని తలపోయుచుందు." అని యుత్తరుండు వక్కాణించె. అర్జునుండు "భ్రాతృనియోగంబున నొకవత్సరంబు వ్రతంబు చరియించుచుంటినే కాని నిక్కంబుగ నే షండుండఁగాను. నీ కిట్లు సత్యంబు దెలిపితి"నని సమాధానంబుచెప్పె. అది యాకర్ణించి యుత్తరుండు "నిక్కముగ నియ్యది నాయెడం గల యొకమహానుగ్రహంబు. నాతర్కంబు రిత్త

వానయ్యె. ఇట్టి యుజ్జ్వలవేషంబు క్లీబరూపులు కాకుండుట యథార్థం బయ్యె. భవత్సాహాయ్యంబున సురలతోనైనఁ బోరుసల్పంగలవాఁడ. మదీయపరిత్రాసం బపగతంబయ్యె. నాచేయుకార్యంబుల నియోగింపుము. భవదీయరథయుగ్యంబు శత్రురథంబుల బాధించునట్లు గడపం గలను. అరదంబు గడపుటయందు మిక్కిలి కౌశలంబు గలిగియుండు. సారథ్యంబున నింద్రునిసూతుం డగు మాతలికిని, వాసుదేవురథయంత యగు దారుకునకును నీడై యుండు. బలవంతం బగు నివ్వాహోత్తమంబులు సుగ్రీవ, మేఘపుష్ప, శైబ్య, బలాహకంబుల కెనవచ్చు. నిక్కముగ నివ్వాజులఁ బూన్చిన యియ్యరదంబు మేటిమగండవగు నీవే యధిరోహింప నర్హుండవు. ఇవ్విషయంబు నాకాకరం బభీష్టంబై యొప్పె" నని వచియించె. అంతఁ బార్థుండు బాహువులవలయంబులనూడ్చి, కేశంబుల ముడివెట్టి ప్రాఙ్ముఖుండై శౌచంబు గావించి సకలాస్త్రంబుల ధ్యానించె. ప్రాంజలులై యయ్యస్త్రరాజంబు లన్నియు "పాండునందనా! మే మిచ్చటనే సన్నిహితులమై నీయాజ్ఞగొన వేచియుంటి"మని వాక్రుచ్చె. పార్థుండు వానినన్నిటిం బరిగ్రహించి మీరెల్ల మానసికంబులుగావలయునని ప్రార్థించి, మిక్కిలి యానందంబునొందె. గాండీవంబున గుణంబు గూర్చి నారిసారింప దానంజేసి మహాధ్వనియొండు బయలు వెడలె. దానంజేసి శైలశిఖరంబునశైలంబు గూలునట్లు భూభాగంబంతయు నిర్ఘాతపాతంబు నొందినట్లు ఘూర్ణిల్లె. వాత్యాసమూహంబు లావిర్భవించె. మహోల్కాపాతంబు సంఘటిల్లె. దిశాభాగంబులు వన్నెవాసియుండె. ద్రుమంబులును, ధ్వజంబులును గంపించె. అట్టి యాయర్జును ధనుర్గుణనాదంబును గౌరవబలంబు లశనిపాతంబుంబోలె నాకర్ణించిరి. ఉత్తరుండు మనంబున శంకించుచు "పాండవమధ్యమా! ఎక్కటి వగు నీవు సర్వశస్త్రాస్త్రపారగులును, మహారథులు నగు నీకురువీరులఁ బలువురసాహాయ్యసంపద లేక యెట్లు జయింపంజాలుదు వని భయంబునొందియుందు"నని ప్రశ్నించె. దాని కర్జునుఁడు "రాజపుత్ర! భయంబు చెందకుము. మహాబలులగుగంధర్వుల నెదిర్చి ఘోషయాత్రా సమయంబునం బోరునప్పు డెవ్వరు నాకు సాహాయ్యం బొనర్చిరి? దేవదానవసంకులంబగు ఖాండవయుద్ధసమయంబున నాకుఁ దో డెవ్వరు చూపిరి? ఘోరులోకు లగుకాలకేయనివాతకవచాదుల మడియించునప్పు

డెవ్వాఁడు నాకుఁ జెలులై చెంత నిలిచిరి? పాంచాలీస్వయంవరసమయంబున
రాజులతో నాజి గావించు నాకొరు లెవ్వ రేడుగడలైరి? మద్గురువర్యుం
డగు కుంభసంభవునకు, నింద్రునకు, వైశ్రవణునకు, సూర్యపుత్రునకు,
వరుణునకు, పావకునకు, కృపునకు, కృష్ణునకు, నీశునకు, మ్రొక్కులిడి
యీయనవల నోడింపంగలను. మఱియురథంబును బోనిమ్ము.”

ఉత్పాతపర్యసము.

అని యాదేశించి యుత్తరు సారథిం గావించుకొని జమ్మికిఁ బ్రదక్షి
ణంబుగావించి యాయుధంబుల నన్నింటిం జేకొని యప్పాండుపుత్రుండు
సింహధ్వజం బపనయించి శమీమూలంబున నిక్షేపించె. విశ్వకర్మ నిర్మించిన
యమరదంబునన్నట్టియు, సింహలాంగూలశోభితంబగునట్టియు, కపికేతనం
బును మనంబునఁ దలంచుచుఁ బావకప్రసాదంబును జేర్కొనియె. తోడనే
యాతనియూహాభిజ్ఞంబు లగుచు భూతంబులు ధ్వజంబు నలంకరించె.
పతాకాసహితంబును విచిత్రాంగంబును, హిరణ్మయంబు నగు దివ్యశతాం
గంబు నభోభాగంబునుండి యవతరించె. అట్లు సన్నిహితంబైన యయ్యు
రదంబున కయ్యనఘుండు ప్రదక్షిణంబు గావించి యధిరోహించి శ్వేత
వాహనుం డగుచు, గోధాంగుళీత్రాణంబును దొడిగి, శరాసనంబుఁ బరి
గ్రహించి కపికేతనంబు గ్రాల నుదీచీదిశ కేఁగుచు శత్రులకు రోమ
హర్షణం బగుభంగి మహాశంఖంబునుం బూరించె. మహాజవంబులగు నయ్యు
రదంబు తురంగంబులు చాపచుట్టపగిది భూమి కొఱఁగె. ఉత్తరుండును
భయంబుగదుర నరదంబునఁ గూలఁబడియె. ఫల్గునుండు కళ్లెంబులంబట్టి
యుగ్యంబుల నేదదేర్చి యుత్తరు నాలింగనంబు గావించి యాశ్వాసించె.
“రాజపుత్ర! క్షత్రియుండవు. పురుషపుంగవుండవు. శత్రుమధ్యంబున
నిట్లేల విషాదంబు నొందెదు? శంఖధ్వానంబులను, భేరీనినదంబులను, కరి
ఘీంకారంబులను పలుసారులు వినియే యుందువు. అట్టి నీ వీశంఖధ్వని
నాకర్ణించి ప్రాకృతుంబోలి యేల విత్రాసంబు నొందెదు?” అని యూఱ
డించె. ఉత్తరుండు “తొల్లి యేను శంఖశబ్దంబులను, భేరీధ్వానంబులను,
గంధద్విపఘీంకారంబును బహుయుద్ధంబుల వినియుందు. కాని యివ్విధం
బగు శంఖధ్వని నే నెన్నండును విని యెఱుంగను. ఇట్టి ధ్వజరూపంబును

గాంచియుండును. ధనురాస్ఫాలనశబ్దంబు నిట్టిది యే నెఱుంగ. ఈశంఖ
ధ్వానంబునను,ధనుర్గుణనిర్ఘోషంబునను, ధ్వజంబున వసియించు నమాను
షంబులగు భూతంబుల యాక్రోశంబునను, రథనేమి నిస్వనంబునను, నా
మానసంబు మోహంబుజెందుచున్న యది. దశదిశలును వ్యాకులంబులై
యుండె. మదీయహృదయంబు వెతఁజెందుచుండె. ధ్వజాంశుపరిచ్ఛిన్నం
బులై దిశాభాగంబులు గానరావయ్యె. గాండీవరవంబున శ్రవణపుటం
బులు బధిరీకృతంబులయ్యె” అని విన్నవించె. అర్జునుం డుత్తరుం జేరి
“కుమార! సుస్థిరుండవై పాదంబుల నరదంబు పీడించి పగ్గంబులంబట్టి
యవహితుండవై యుండుము. మరలఁ జిందంబు పూరింతును.” అని
యాతని నాయత్తుంగావించి మరల శంఖంబునొత్తె. పర్వతంబుల భేదించు
నట్లుండు నా నిస్వనంబు శత్రులకు హర్షదాయకంబు నయ్యె. దాన శైల
కందరంబుల ప్రతిధ్వని లెగసె. ఉత్తరుండును వివశుండై యరదంబున
నాసీనుం డయ్యె. అట్టి యాభయంకరధ్వానంబున ధరాతలంబు కంపించె.
మరల ధనంజయుండు భూమింజయు నాశ్వాసించె.

### కురుసేన కలకలపడుట

“రథనిర్ఘోషంబు మేఘస్తనితంబుం బోలియున్నయది. మహీవల
యంబు కంపంబునొందు చున్నయది. ఇవియన్నియుఁ బరికింప నీవచ్చు
వీరుండు ఫల్గునుండు గాక తక్కొరుండు గాఁడు. మనయాయుధంబులు
ప్రకాశంబు దొఱంగియున్న యవి. అశ్వరాజంబులు హేషాస్వనంబులు
విడిచియున్నవి. సమిద్ధంబు లగునగ్నులును మండకున్న యవి. ఇయ్యవి
శుభసూచకంబులు గాఁజాలవు. ఘోరంబుగ నరచుచు మృగంబు
లాదిత్యాభిముఖంబులై యరుగుచున్నవి. ధ్వజంబుల వాయసంబులు
కాలూనుకొనియున్నవి. ఇట్టి వన్నియు నశుభసూచకంబులుగాన మహా
భయబుం ప్రాప్తంబై యుండె. గోమాయువు రుతంబు గావించుచు సేనా
మధ్యంబునఁ బర్వెత్తె. శరీరంబులు గగుర్పాటియుండె. కావునఁ దప్పక
యుద్ధంబున క్షత్రియనాశంబుఁ గాఁగలయది.” అని చాపాచార్యుం
డగు ద్రోణుండు నిమిత్తంబుల నాలక్షించి వచించి పుడమితేనిం గాంచి
“రాజా! ఈదుర్నిమిత్తంబులు విశేషంబుగ నస్మత్సేనానాశనసూచకం
బులై యున్నయవి. గృధ్రంబులు కన్నీరుగార్చుచున్న యవి. సైన్యంబున

సుల్కులెగయుచుండె. సేనయంతయుఁ బార్థబాణప్రపీడితయై యున్నట్లు తోఁచుచుండె. మనసైన్యంబున జోదులు యుద్ధంబుసేయ నిచ్ఛగింప కున్నారు. కావున సేనలమొనలఁదీర్చి యాలకదుపుల బయలుదేర్చి సన్నద్ధులమై యుందము” అని పలికె.

అనంతరంబు సుయోధనుండు భీష్మద్రోణులం గాంచి “యాచార్యులారా! ఇ య్యర్థంబు దేటపడ నేనును రాధేయుండును బలుమఱు వచించుచుందుము. దాని నెన్నిసారులు చెప్పియు నేఁ దృప్తిఁ బొందఁజాలను. ద్యూతపరాజితు లగు పాండవులు వనంబున ద్వాదశవత్సరంబును నజ్ఞాతవాసంబున నొక్కవత్సరంబును వసియింపవలయు ననియు సమయంబు సేయంబడియె. పదుమూఁడగు నియ్యజ్ఞాతవత్సరంబతిక్రమింపకమున్న మనము విప్పాచ్ఛుం గనుంగొంటిమి. అజ్ఞాతవత్సరంబు దాటకమున్న గుర్తింపఁబడిరేని పాండవులు మరల ద్వాదశవత్సరంబులు వనంబున నివసింపవలయును. లోభంబున వార లెఱుంగకుందురు. లేక మనమైన ముగ్ధులమై యుందుము. దీన నెచ్చుతక్కులు నిరూపింపఁ గురుపితామహుండ వలంతి. అర్థంబులకు ద్వైవిధ్యంబు గలుగుతావుల సంశయంబుపొడము. ఒకవిధంబునఁ జింతింపంబడు నర్థంబు వేఱొకవిధంబున జరుగుచుండు. ధర్మవిదులైనను మానవులు స్వార్థంబున ముగ్ధులగుదురు. మాత్స్యులఁ బవరంబునకుఁ జూచుచుండ విప్పాచ్ఛుండు పొడసూపుట యెవ్వరిదోషంబు? మనము త్రిగర్తులకు సాహాయ్యంబు నెఱపఁగోరి మాత్స్యులతోఁ బోర నిచ్ఛగొంటిమి. మాత్స్యులు తమకుఁ గావించిన యపకారంబులఁ బెక్కింటిని బేర్కొని భయాభిభూతులై యున్నత్రిగర్తులకు సాహాయ్యంబుగావింప నిశ్చయించుకొంటిమి. సప్తమీదివసంబు సాయంకాలంబునఁ ద్రిగర్తులు విరటగోధనంబును దక్షిణదిశను బట్టియుందురు. మన మష్టమీ దివసంబు నుదయంబున మత్స్యగోధనంబుల గ్రహించితిమి. త్రిగర్తులు మత్స్యుల జయించి గోగణంబులం గొనిరెత్తురో పరాజితులై మనతో సంధించి మాత్స్యులతోఁ బోరుదురో తెలియవలయు. మత్స్యనరపతి యా త్రిగర్తులం జీరికింగొనక సకలసైన్యంబులంగూడి మనతో యుద్ధంబు సలుప నిటకు వచ్చుచుండఁబోలు. ఈతం డాతని పురస్సరుండగు పురుషుండై యుండఁబోలు. మనతోఁబోర మత్స్యుండేనియు, బీభత్సుండేనియు వచ్చిరేనియు

నందఱును సన్నద్ధులై పోరుసలుపవలయు నని సమయంబుగావించియుం టిని. అట్టిచో భీష్మద్రోణకృపాశ్వత్థామాదు లగు నీపురుషులెల్ల నేల విశ్రాంతమానసులై యుండిరి? ప్రస్తుతంబు యుద్ధంబునకు నన్యంబు శ్రేయస్కరంబు గాఁజాలదు. రణరంగంబున సురేంద్రునితోనైనను జమునితోనైనను బోరి గోగణంబుల రక్షింపవలయు. గోగణంబులవిడిచి హస్తిపురంబుచేర నెవ్వరు సాహసింతురు? శరంబుల భగ్నాంగులై వనంబులఁ గృశించిన పదాతుల కేలఁ దలంకవలయు? పాండవులయెడఁ బ్రేమ మెండుగ నుండువాఁడగుటను బార్థు విశేషంబుగ గౌరవించు టను నాచార్యుండు సమరంబున కేతెంచు బీభత్సుం బొగడి సేనల కుత్సాహభంగంబు గలిగించుచున్నవాఁడు. ఈతనిం గైకొనక నీతికార్యం బుల నిర్వర్తింపుఁడు సేనలు భంగంబునొందకుండునట్లు చూచుకొనుఁడు. అశ్వహేషితంబు విని యెవ్వార లట్లు శుభాశుభంబుల వాకొనంగలరు? ఎల్లయెడలను వాజులు హేషారవంబుల సలుపుచుండు. వాయువులును నిత్యంబును వీఁచుచునే యుండు. నిత్యంబు వర్షంబు గురియుచుండు. మేఘనిర్ఘోషంబు లెల్లకాలంబుల వినంబడుచుండు. ఇచ్చటఁ బార్థుండు చేయుకార్యం బేమియుండు? వ్యర్థముగా నాతని నేల కొండాడు చుండు? ఇతరకార్యంబుల నాచార్యులు ప్రాజ్ఞులును గారుణికులును నుపాయదర్శకులునుగా గలుగుదురుకాని మహోపాయంబు సంఘటిల్లిన యిట్టిచోట వారల నుపాయంబు లడుగవలదు. ప్రాసాదంబులను, గోష్ఠి ప్రదేశంబులను, నుపవనంబులను విచిత్రకథలు వాకొనుచుఁ బండితులు శోభిల్లుదురు. పరరంధ్రాన్వేషణకార్యంబులను, హస్త్యశ్వరథచర్యల యందును, నన్నసంస్కారదోషంబులను గురువులు ప్రాజ్ఞులు కావున వారల నిట్టిచో వెనుకనుంచి పరుల జయించురీతిని గోగణంబుల రక్షించు మార్గంబును జూచికొనుచు వ్యూహరచనంబు గావించి సంసిద్ధులై యుండవలయు" నని యాజ్ఞయిచ్చె.

### కర్ణవికత్థనము

అంత సూతాత్మజుండు సైనికులం గలయంగనుంగొని "మీరెల్ల రును భయంబునొందియుందురని యూహించుచున్నాను. మనస్స్వా స్థ్యంబుదప్పి యుద్ధవిముఖులై యున్నట్లు గానవచ్చెడిని. మత్స్యమానవ

పాలుండుఁగాని వివ్వచ్చుండేని సంగరంబునేయ నెత్తివత్తురేని మకరాల యంబును జెలియలికట్టయుంబోలె నే నిలువరింపనేర్తు. మదీయబాణా సనవినిర్ముక్తంబులును, నతపర్వంబులును, నగుసాయకంబులకుఁ బ్రసరించు నాగేంద్రంబులకుంబోలె నవరోధం బుండఁజాలదు. మదీయబాణ జాలంబులు శలభంబులు వనస్పతింబోలెఁ బార్థుం బొదివి నిరోధించుఁగాక. జ్యావినిర్ముక్తంబులై పుంఖసత్వంబులై నిగుడుబాణంబులశబ్దంబు భేరీ ఝాంకారంబులంబోలి వినఁబడుం గాక. పదుమూఁడువత్సరంబుల వనవాసాజ్ఞాతవాసంబుల నాయాసంబునొంది యుద్ధంబున జాతకుతూహలుండై యుండుసవ్యసాచి యేనెదుర్కొని సంగరంబుపచరింప గుణవంతుం డగుబ్రాహ్మణుండువలె పాత్రభూతుం డగుచు మనీయశరౌఘంబుల గ్రహియించుంగాక. ఈతండును ముల్లోకంబులఁ బేరొందెనమేటి జోదు. నేను నెవ్విధంబున నాతని కించుకేనియుఁ దక్కువగాఁజాల. అట్టి యేమిషువురము జన్యంబు నడుపుచుండఁ గాంచనపుంఖంబు లగు సాయకంబు లంబరతలంబున శలభంబులంబోలి యాక్రమించును. తొల్లి ధార్తరాష్ట్రునకే ప్రతిశ్రుతంబుగావించిన యర్థంబును సురనాథతనయుఁ జంపి యీఁగికొని ఋణశేషంబును దీర్చికొందును. మహేంద్రసమతేజస్కుం డగు నయ్యర్జునుసుల్కలచేఁ గుంజరంబునుంబోలె మర్దింతు. శూరుండును, శస్త్రధారాపలతలమానికం బనందగు నవ్వీరవరుని గరుడుండు పన్నగంబునుంబోలె నరదంబునుండి పరిగ్రహింతును. శరేంధనంబులం బరిగొనుచు శత్రుగణంబులం దహియించు నప్పాండవానలంబును, వాజులను పురోహతంబును, రథపంక్తులను మేఘంబులును, గలమహామేఘుండ నగుచు శరధారావర్షంబున శమియింపంజేయుదు. ఆశీవిషోపమంబులగు శరంబులు మచ్చాపవినిర్ముక్తంబులై వల్మీకంబునుంబోలె పార్థు నాక్రమించును. హేమపుంఖంబులును, నతపర్వంబు లగుసాయకంబుల వ్యాప్తుండై పార్థుండు కర్ణికారద్రుమసంకీర్ణంబగు పర్వతంబుం బోలి ముందు ఋషిపుంగవుం డగు జామదగ్న్యునిం గొలిచి దివ్యాస్త్రంబుల సంపాదించియుంటి. అయ్యస్త్రంబులకు నేడు సద్వినియోగంబు గలిగె. ధ్వజాగ్రమందుండు నక్కపివరుండు మదీయభల్లనిపతితుండై నేలంగూలును. శత్రుధ్వజనివాసంబులగు భూతంబులు దిగంతరంబులు మాఱుమ్రోయఁ దొలంగిపోవును. నేఁడుగదా! సుయోధనుని మానస

మున నాటికొనిన శల్యంబును నేను సమూలంబుగ నుద్ధరింపఁగలను. విరథుండై పౌరుషంబు నెఱుపుపార్థుని నిశ్వసించు మనాగంబునుంబోలెఁ గౌరవులెల్ల వీక్షింతురు గాక. కౌరవులు ధనంబు సేకరించుకొని యరదంబుల నెక్కి మద్భుజబలంబు పరికించుచు యథేచ్ఛం బోవుదురుగాక!" అని యాత్మశ్లాఘ గావించుకొనియె.

## కృపవాక్యము

అట్టి యాత్మవికత్థనంబు నాకర్ణించి కృపాచార్యుఁడు "రాధేయ! ఎల్లకాలమును యుద్ధంబున మనసు నిల్పియుందు. అర్థంబుల ప్రకృతిం దలంతువు కాని పరస్పరానుబంధంబులం దలపోయవు. పలువురు శాస్త్రజ్ఞులు బవరంబు సేయుట మంగళకరంబు కాదని తలంచుచుండుట యే నెఱుంగుదు. దేశకాలంబులఁ బరికించి సలుపుపోరు విజయంబు చేకూర్చు. అకాలంబునఁ బ్రవర్తింపఁబడుచో నయ్యది ఫలంబు నీఁజాలదు. దేశకాలానుకూల్యంబునం జేయుయుద్ధంబు కార్యంబుల ననుకూలింపఁజేసి మంగళం బొడఁగూర్చు. ప్రకృతంబు పార్థునితోఁ గయ్యంబు దీర్చుట యుక్తకార్యంబుగాఁ దోఁపదు. అమ్మేటిమానిసి యొక్కటిమై కౌరవుల రక్షించె. ఒంటిమై ఖాండవదహనావసరంబున నగ్ని దేవు మెప్పించె. ఒంటరియై యైదేండ్లు బ్రహ్మచర్యంబు నడపె. ఒక్కటే యరదంబున సుభద్ర నెక్కించికొని యాదవవీరుల నోర్చె. ఎక్కటికయ్యంబున ముక్కంటితోఁ బోరె. ద్రోవది నెత్తికొనిపోయిన సైంధవు నొంటిమై నోడించె. ఇంద్రు కడ నొక్కండే యైదువత్సరంబు లస్త్రంబుల నేర్చె. కురురాజు బంధించి కొంపోవు గంధర్వుల నొకండే గదా జయించె. దేవదుర్జయు లగు కాలకంజనివాతకవచాదిదానవుల నేకాకియై మడియించె. ఇట్లాతం డెక్కటి నెన్నో మహాకార్యంబుల గావించె. సూతపుత్రా! నీ వెయ్యెడ నొంటిమై నేకార్యంబు చేసి వాసికెక్కితివో వాకొనుము. ఒంటి నిందఱు రాజుల జయించి ఖ్యాతినొందు నప్పాండవమధ్యము నెదిరి సురేంద్రుండును జయంబుగొనంజాలఁడని తలంతు. అట్టి యప్పార్థుతో జన్యంబు సేయం గోరు నీవు సంక్రుద్ధంబగు నాశీవిషవక్త్రగహ్వరంబునుండి హస్తాగ్రంబునం దంతంబు పెకలించువానిచందంబునను, వనంబున జరించుమదగజంబు నంకుశంబు లేకయ యధిరోహించి పురంబుఁ జేరఁ దలంచువాని

బోలికను, ఘృతమేదోవసాదులసమిద్ధం బగు పావకునియందు ఘృతాక్త చీరవసనుండై చొచ్చునజ్ఞపశువునను, హాస్యాస్పదుండవగుదువు. కంఠం బున గండశిల వ్రేలంగట్టుకొని సముద్రంబు దరియందలంచునట్ల మూఢుండె యస్త్రపరిశ్రమంబున నిష్ణాతుండైన యప్పార్థున కృతార్థుండై బలయుతుండగు నవ్వీరు బలశూన్యుండై యెదిరింపం దలంచు. వనవాసాజ్ఞాతవాసంబుల కష్టంబడలియున్న యప్పార్థుండు పాశవినిర్ముక్తంబగు పంచాస్యంబునుంబోలి ప్రతిపక్షబలంబులం బోరిగొనును. అజ్ఞానంబునఁ దృణచ్ఛన్నకూపంబునుంబోలె దెలియంజాలక యియ్యనఘుతో సంగరంబుగల్గుకతంబున భయంబు దెచ్చుకొంటిమి. కావున మనమెల్లరము కలసి బోరుసల్పుదము. సైన్యంబులు మొనలుతీర్చి సన్నద్ధంబులై యుండవలయు. భీష్మద్రోణదుర్యోధనాశ్వత్థామాదులమగు మనమెల్లరము బవరంబు చేయుదము. మే మార్వురము రథషట్కంబు నూని యెదురునిలిచియుందుము సైన్యంబులంపేర్చి దానవు లింద్రు నెదిరించిన ట్లెదిరింతము." అని యుపాయంబుగఱపె.

### అశ్వత్థామ భర్త్సనవాక్యము.

దాని కశ్వత్థామ యిట్లనియె. "ఇప్పటి కింకను గోగణంబులు జయింపంబడలేదు. అయ్యవి యింకను సీమాంతంబును జేరలేదు. హస్తి పురంబును జేర లేదు. ఓయీ! సూతపుత్ర! నీవేల యిట్లాత్మశ్లాఘ గావించుకొనుచుంటివి? మహాత్ములు పలువరశూరవరుల సంగ్రామరంగంబుల నోటుఁబుచ్చియు, విపులధనరాసులనార్జించియు, నివ్విధంబు తమ పౌరుషంబును వాకొనరు. అగ్ని సద్దింతయు లేక యల్లన దహనకర్మంబు నెఱవేర్చు. దివాకరుండు మెల్లనఁ బ్రకాశించుచుండు. ధరాతలంబును జరాచరరూపంబగు నీలోకంబును మూఁగదై మోయు కమలాసనుండు చాతుర్వర్ణ్యంబు సృజియించి వాని కుచితంబు లగుకర్మంబుల నేర్పఱచె. బ్రాహ్మణుండు వేదంబుల నధిగమించి జన్నంబులచేయుటయుఁ జేయించుటయుఁ జేయుచుండును. క్షత్త్రియుండు బాణాసనంబు నూని జన్నంబు చేయవలయునే కాని చేయింపరాదు. వైశ్యుండు ధనసంచయంబుగావించి బ్రహ్మకర్మంబుల నాచరింపవలయును. శూద్రుండు తక్కంగల మూఁడుజాతులవారికిని శుశ్రూషణంబు సలుపవలయు. న్యా

య్యంబున రాజ్యలాభంబునొందియు రాజసూయులు గురువులు గుణహీనులైనను బూజసేయుచుందురు. కపటద్యూతంబున రాజ్యంబు చేకొనిన రాజు నెవరు నుతింతురు? అట్టుల యీధార్తరాష్ట్రుండు వంచనామూలంబున రాజ్యసంపదగొనిన నృశంసుండు. అట్టి కృపణమార్గంబున ధనసంచయంబుగావించుకొని యొుప లెవ్వరిట్లు తమనొప్పతనముం జెర్కొందురు? మోసగానివలె వంచనాయోగంబులందక్క పాండవులలో నెవ్వారు పౌరుషంబున జయింపఁబడిరి? ఇంద్రప్రస్థంబు నేయుద్ధంబునఁ గెల్చి చేకొంటిరి? పాంచాలి యే బవరంబున సంపాదితయయ్యె? పాపాత్మా! రజస్వలయై యేకవస్త్రయైయున్న యప్పతివ్రత సభాస్థలంబున కే జయంబుమూలంబున నీడ్వఁబడియె? ఓయీ! రాధేయా! ఇట్టి నికృష్టకార్యంబులఁ జేయించుచు నన్నిటికి మూలకారణమై యుంటివిగా? ఆసమయంబున మహానుభావుం డగు విదురుండు పల్కిన పల్కులం దలంతే? నిక్కముగ భూతలంబున నుండు పిపీలికాదిజీవరాసుల కెల్లను శమం బుండవచ్చుగాని యట్లు ద్రౌపది భంగపఱచిన మీయెడ పాండవులకు క్షమయుండఁబోదు. ధార్తరాష్ట్రులం బొరిగొనఁ బాండవమధ్యముం డుద్భవించియుండె. నీ విక్కడ పండితునింబోలి రజ్జులు గొట్టుదు? నేడు ధనంజయుండు వైరంబు బాపికొనం దలంచి మనలనం దఱం బ్రాణంబులకుం బాపు. ఇయ్యనఘుం డలిగెనేని దేవరాక్షసపన్నగ గంధర్వాదులనేని సరకుసేయక రణరంగంబున నేలపాలు గావించు. వేగంబున గరుడతుల్యుండును, నీకంటె వేయిమడుంగుల మేటిజోదును, రణంబున వాసుదేవసముండు నగు నవ్వీరు నెవ్వారు పూజింపకుందురు? అర్జునుండు దైవమానుషంబు లగు నస్త్రంబులఁ దత్తదనురూపంబులగు ప్రత్యస్త్రంబుల సమయించు. అట్టిపార్థున కీడెవ్వరు? శిష్యుండు పుత్త్రుననంతరంబు పుత్త్రుండని ధర్మవేత్తలు వాకొందురు. ఇక్కారణంబునఁ జాపాచార్యుం డగు ద్రోణునకు పాండవమధ్యముండు ప్రీతిపాత్త్రుండై యుండు. ఎవ్విధంబున ద్యూత విజయంబుచేకొని యింద్రప్రస్థపురంబు చేకొంటివో, ఏమార్గంబునఁ బాంచాలి సభాస్థలంబున కీడ్చితివో, యట్టుల నేడు జన్యంబు నడపుము. కాకున్న మాతులుండును క్షత్త్రియధర్మమర్మజ్ఞుండును ద్యూతనిపుణుండు నగు నీగాంధారరాజు యుద్ధంబు నేయుఁగాక. కానిపార్థుండు గాండీవంబున నక్షంబులపఱుపక జ్వలనంబు

పోలి యుజ్జ్వలంబు లగు వాడినారసంబుల విడుచు గాండీవనిర్ముక్తంబు లగు నమ్మహాశరంబులు శైలంబులనేని సరకుసేయక వ్రక్కలు సేయు. కోపించిన జముండును, మృత్యువును గొంచెము శేషంబు నుంతురేమోకాని క్రుద్ధుండగు పార్థుండుమాత్రము నిరవశేషంబుగ శత్రువాహినులం గాల్పక తొలఁగఁడు. మాతులసహాయ్యంబునఁ గపటద్యూతంబు సవరించినట్టుల సంగ్రామంబునఁ బోరుసల్పుఁడుగాని నేను ధనంజయు నెదిర్చి పోరుసల్ప. మత్స్యుండు కయ్యంబు కేఁగివచ్చెనేని గోగణంబులకై యాతని నిలువరింతు.”

### భీష్మసైన్యవ్యూహము

దాని నంతయు నాకర్ణించి కురువృద్ధుం డగుభీష్ముం డిట్లనియె. “కృపాచార్యుండును, నాచార్యపుత్త్రుండును యథార్థంబు నెఱింగిరి. కర్ణుండు కేవల క్షాత్త్రధర్మంబును బూని యుద్ధంబుసేయఁ గోరుచుండె. ఇయ్యవసరంబున నభిజ్ఞుం డగుపురుషుం డాచార్యునకుం జెప్పవలయున దెద్దియు నుండఁబోదు. దేశకాలంబుల నారసి సంగ్రామంబు చేయుదమని నే వాకొందు. సూర్యసములగు సపత్నులు వృద్ధిబొందుచుండ నెఱుక గలవాఁడైనను ముగ్ధుండు గాక తక్కఁడు. ధర్మంబు నెఱింగినవారయ్యు మానవులు స్వార్థంబున మోహంబు నొందుచుందురు. అక్కారణంబున రాజా! నీకే యేచెప్పఁదగుపలుకులు గలవు. తేజం బభివృద్ధిచేయుతలంపున నంగరాజు పల్కినపల్కుల నాచార్యపుత్త్రుండు సహింపవలయు. ఇయ్యది సన్నాహంబుసేయ సమయంబుకాని వాదంబుల కదనుగాదు. కౌంతేయుం డిటు సమీపించుచుండ నిట్లు వాదంబులు పచరించుట యుచితంబుగాదు. కావున కృపాశ్వత్థామ ద్రోణాచార్యులు శాంతిం బొంది ప్రసన్నులు గావలయు. సూర్యునియందుఁ బ్రభయు, శశాంకుని యందు లక్ష్మియు నిలిచినట్లు మీయంద చాపవిద్యానైపుణ్యంబు నెలవు కొన్నది. మీయెడ నాల్గువేదంబులును సాంగోపాంగంబు లగు బ్రహ్మాస్త్రాది ధనుర్వేదంబులును నెలకొనియున్నవి. బ్రాహ్మ్యక్షాత్త్రంబులు రెండును మీయందుఁ దాండవంబు సలుపుచున్నవి. ఈ రెండును సపుత్త్రుం డగు భారతాచార్యునందుఁ దక్క వేఱొండుచోట నున్నట్లు విని యెఱుంగము. బ్రహ్మాస్త్రవేదంబు లొక్కచోట నుండవు. నిక్కంబుగ నలిగె

నేని కుంభసంభవుండు సకలక్షత్త్రియవినాశకుం డగు జామదగ్న్యునికంటెం
గూడ నేవు చూపంగలండు. ఆచార్యతుల్యుం డగు ద్రౌణి యియ్యవ
సరంబున శాంతిం బొందవలయు. మనమెల్లరము నొక్కమొగంబై కవ్వడి
నెదుర్కొనిసంగరంబు సేయుదము. బుద్ధిమంతులు పేర్కొనినదుర్నిమిత్తం
బులలో నీస్వపక్షకలహంబు ముఖ్యంబును దోషయుక్తంబునై యున్నది."
యనిన దానికి ద్రోణి, "పితామహా! మా కిట్టులఁ జెప్పం బనిలేదు. గురు
నిందఁ జేయ సహింపనోడి రోషావేశంబున నట్లు వచియించితిని. శత్త్రువై
నను సద్గుణంబులున్న నుతించుటయు, గురుండైనను దోషయుక్తుండైన
దోషంబులఁ బేర్కొనుటయు యుక్తరూపంబు. పుత్త్రునియెడను శిష్యుని
యెడను గురుండు హితంబు కూర్పవలయు. అట్లు మదీయజనకుండు
శిష్యవాత్సల్యంబునఁ గిరీటిం బేర్కొనెను." అని పలికె. అంత కౌరవ
రాజన్యుం డగు సుయోధనుండు "ఆచార్య! శాంతించి యియ్యర్థంబున
క్షమింపుము." అని ప్రార్థించి కర్ణభీష్మకృపులచే నమ్మహాత్ము శాంతింపం
జేసె. ద్రోణుండును బ్రసన్నుండై "శాంతనవుండుపలుకు ననునయంబులఁ
బ్రసన్నుండనైతి. దుర్యోధనుండు శత్త్రువశంగతుండు కాకుండునట్లును,
పుడమితేనిం బార్థుండు బవరంబున బొదువకుండునట్లును వ్యూహరచ
నంబు గావించి నీతిఁ బచరింపుఁడు. సమయంబు నిర్వర్తింపక పార్థుం
డాత్మప్రదర్శనంబు గావించుకొనియుండఁడు. గోధనంబు చేఁజిక్కక
పోయిన నాతండు మిన్నకుండఁడు. కావునఁ బూనికలను దీర్ప నాయత్తు
లగుఁడు. సైన్యంబు దైన్యంబు నొందకుండున ట్లుత్సాహంపఱుపుఁడు.
పుడమితేఁడు నిట్టివాక్యంబు పలికె. గాంగేయుం డియ్యర్థంబు నిర్ణయింప
వలంతి" అని పేర్కొనియె.

## భీష్మ వాక్యము

దానికి భీష్ముం డిట్లనియె. "కళలును, గాష్ఠంబును, ముహూర్తం
బులును, దినంబులును, పక్షంబులును, మాసంబులును, ఋతువులును,
నక్షత్త్రంబులును, గ్రహంబులును, సంవత్సరంబులును, ననువిభాగంబులం
గూడి కాలచక్రంబు ప్రవర్తించుచుండు. కాలాతిరేకంబునను, జ్యోతి
ర్వ్యతిక్రమంబునను ఐదైదువత్సరంబులకు రెండధిక మాసంబులు
గలుగుచుండు. పాండవుల వనవాసాజ్ఞాతవత్సరంబులకై నియమించిన

యీ పదుమూఁడువత్సరంబులకును నైదుమాసంబుల పండ్రెండుదినంబు లధికంబులై యుండు. అట్టి యక్కాలంబంతయుఁ బ్రతిశ్రుతార్థంబున వీరలు వనవాసాజ్ఞాతవాసంబులం గడపిరి. ఇట్టి దెఱింగియే యిప్పార్థుం డెత్తివచ్చుచున్నవాఁడు. యుధిష్ఠిరాధిష్ఠితు లగు నప్పాండవోత్తము లెల్లరును ధర్మపరాయణులు. ధర్మంబున కెన్నండేనియు విరుద్ధంబుగాఁ బ్రవర్తింపరు. అలుబ్ధులై యమ్మహనీయులు దుష్కరం బగు నీసమయంబు నవరించిరి. ఉపాయవిరహితులై వారలు రాజ్యంబునే గోరువారేని ద్రౌపదీవస్త్రాపహరణ సమయమునంద తమబలంబుం జవిచూప విక్రమించియుండెడివారు. ధర్మపాశబద్ధులై వారలు క్షత్త్రియకర్మంబులకుం జోరరైరి. వారలు మరణంబునేని సుఖంబుగ వరియింపంగలరు గాని యనృతంబు వచియింపరు. యుక్తకాలంబునఁ బొందఁ దగురాజ్యభాగంబు నింద్రుం డెదురై నిల్చినను సరకుసేయక చేకొనంగలరు. కావున నీయస్త్రభృదగ్రేసరుం డగు పార్థున కెదురు నిల్చి పోరుదము. తగురీతి కళ్యాణకరంబగు జతనంబు గావింపుఁడు. ఫల్గునుండు సమీపించుచున్నవాఁడు. సమరంబున జయాపజయంబులు భావాభావంబులు నిశ్చితంబులు గాఁజాలవు. జయంబునకై పోరు రెండుబలంబుల నొకబలంబు గెల్చుటయు నొక్కటి యోడుటయు సంభవించుచుండును. కావున యుద్ధోచితకర్మంబునేని ధర్మయుక్తం బగుకర్మంబునేని జేయ సమకట్టుము." అని మందాకినీ నందనుండు వాకొన, రారాజు "నే పాండుపుత్త్రులకు రాజ్యభాగం బియ్యనోపను. కావున యుద్ధంబున కనువగు నుపాయంబుల నంతరించి యాయత్తులుకండు" అని యాజ్ఞాపించె. అంత మందాకినీనందనుండు "రాజన్యా! మదీయహితవాక్యంబు శ్రవణయోగ్యంబేని ఆకర్ణింపుము. నే నెల్లయెడల భవచ్ఛ్రేయంబు గోరి హితంబ వచియించుచుందు ఈబలంబునఁ జతుర్భాగంబు గొని హాస్తిపురాభిముఖుండవై మును. నీవు చనుము. మరియొకచతుర్భాగంబు గోగణంబులం బొదివి నీవెంటఁబోవలయు. తక్కంగలయర్ధసైన్యంబు గొని నేనును, ద్రోణుండును, గర్ణుండును, ద్రోణపుత్త్రుండును, శారద్వతుండును యుద్ధంబుసేయఁ గవియు బీభత్సు నెదిర్చి పోరువారము. మత్స్యుండువచ్చినను, శక్రుండు సంప్రాప్తుండైనను, సముద్రంబును జెలియలికట్టఁబోలి నిలువరింతును." అని కర్తవ్య ముపదేశించె. భీష్ముండు

తెల్పు నయ్యర్థంబు కురువీరుల కెల్ల నభీష్టంబగుట కురురాజన్ల కార్యంబు చేయ సమకట్టి. సురనదీసూతి సేనానాయకులం జేరంజీరి, "ఆచార్యా! నీవు సేనామధ్యంబున నుండుము. గురుపుత్రా! నీవు వామపార్శ్వంబున నిలుచునది. కృపాచార్యా! నీవు దక్షిణభాగంబును రక్షించుచుండుము. కర్ణా! నీవు సేనాగ్రంబున నిలిచియుండుము. నే సైన్యంబుల పృష్ఠ భాగంబున నిలిచి రక్షించుచుండు" నని సేనావిభాగంబు గావించె.

## గోనివర్తనంబు

అట్లు కురుసేనలు వ్యూహంబులు పన్ని సన్నద్ధంబులై యుండ రథ ఘోషంబు చెలంగ నర్జునుండు డాయం జనుదెంచె. అమ్మహారథులు ధ్వజాగ్రంబు నాలోకించిరి. రథనేమినిస్వనంబు నాకర్ణించిరి. గాండీవ గుణరవంబును శ్రుతిగోచరంబయ్యె. అయ్యది యంతయుం గాంచి యా చార్యుం డగు ద్రోణుండు, "ఇయ్యదియ పార్థునిధ్వజాగ్రంబు. దూరంబు నుండి గానవచ్చుచున్నది. ఇయ్యది యతని రథనిర్ఘోషంబు. ధ్వజాగ్రమం దలి వానరంబు వెల్లరుచుచున్నయది. ఈవానరంబు సకలసేనయందును భయంబు పుట్టించుచుండు. రథికవరుం డగు నియ్యర్జునుండు రథవరంబు నధిరోహించి గాండీవంబున జ్యానాదంబు పుట్టించుచు నశనిధ్వనిం బుసహింపం జేయుచున్నవాఁడు. చూచితిరే! మత్పాదతలపార్శ్వయుగ ళంబులం బడినట్టియు, కర్ణాంతికంబుల స్పృశించి చనినట్టియు బాణయుగ ళంబులను! వనవాసంబు నిర్వర్తించి యమానుషకర్మంబు సవరించి పార్థుండు మత్పాదంబుల కభివాదనంబు చేయుచున్నవాఁడు. శ్రవణ పార్శ్వంబుల బాణంబుల విడిచి కుశలప్రశ్నంబు గావించుచున్నవాఁడు. బంధుప్రియుండును బ్రజ్ఞాశాలియు నగు నిమ్మహనీయుండు పెద్దకాలంబు నకుం గానవచ్చె. అక్షయశరధులం బూని శంఖంబు చేబట్టి కిరీటంబు శిరంబునం గీలించి గాండీవంబు కేలం గైకొని యీ వీరవరేణ్యుండు మిగుల శోభిల్లుచున్నవాఁడు." అని మెచ్చుకొనియె.

అంత నర్జునుండు యుద్ధంబునేయ సమకట్టి సన్నద్ధులైయున్న కురువీరులం గాంచి మత్స్యనృపతి పుత్రుం జూచి కాలోచితంబుగ "కుమార! బాణపాతదూరంబున నరదంబు నిలుపుము. ఈసైన్యంబున కురుకులపాంసనుండగు సుయోధనుం డెచట నుండెనో నిరీక్షింతు. వీరల

నందఱు సరకుగొనక యాతనిం గాంచి యతిమానియగు నతనిపై కుఱికి జయింతు. దాన వీరలందఱును విజితు లగుదురు. చూచితివా! వీరుగో ద్రోణుండును, ద్రోణపుత్త్రుండును, కృపుండును, గాంగేయుండును, కర్ణుండును గానవచ్చుచున్నారు. కురురా జిచ్చటఁ గానరాకుండె. అతండు జీవపరాయణుండై గోగణంబులం గొని దక్షిణమార్గంబుపట్టి హస్తిపురంబునకు మరలుచుండఁబోలు. కావున నోసారథీ! యీరథిక బలంబువిడిచి సుయోధనుం డరుగు దెసకు నరదంబు పఱుపుము. ఆయో ధనంబు నిరామిషంబు గారాదుగాన నాతనిం దాఁకి జయింతు. గోవుల మరలింతు" నని యాదేశించె. అంత వైరాటి యవ్వచనంబుల నను సరించి పగ్గంబులంబట్టి కురుపుంగవు లుండు దెసనుండి వాజుల మరలించి రాజుండు దెసకుఁ బ్రచోదించె.

ఇట్లు రథికవర్యుల వీడి యన్యదిశకుఁ బాండవమధ్యముం డేగ నాతనియభిప్రాయంబు నెఱింగి కృపాచార్యుండు "విజయుండు కురు రాజుకడఁ దక్క వేఱొండుచోట నిలువ నుత్సహింపఁడు. గావున జవం బునఁబోవు రాజుపార్శ్వంబుల నిలిచి సాహాయ్యంబు సేయుచుందము. అతిసంక్రుద్ధుం డగు నీపార్థున కెదురై దేవనాథుండును దేవకీసుతుం డునుం దక్క వేఱొకఁడుం డేకాకియై సంగరంబు గావింపం జాలఁడు. సపుత్త్రుండగు నాచార్యుండేనియు నెదిరి పోరంగలఁడు. ఇట్టిచో గోధనంబు లేమగును? సుయోధనుండు పార్థుం డను జలంబున శిథిలనావం బోలి మునుంగు." అని వక్కాణించె.

ధనంజయుం డట్లు కొంతదూరంబు చని తనబీభత్సనామంబు వినిచి శలభంబులంబోలు బాణజాలంబుల నాసైన్యంబు గప్పె. పార్థనిర్ముక్తంబు లగుబాణజాలంబుల నంధీభూతులై యాకురువీరులు భూమ్యంతరిక్షంబులఁ దెలియనేరరైరి. అట్టియుద్ధంబు సిద్ధంబగుచుండ వారల కుత్సాహంబు తగ్గుచుండె. వార లెల్లరును విజయుచ్చు చుఱుకుఁదనముం బ్రశంసించు చుండిరి. అంత ఫల్గునుండు శత్త్రులకు రోమహర్షంబు గలిగించునట్లు శంఖంబునొత్తె. గాండివధనువు నెక్కిడిభూతంబులఁ బ్రచోదించె. అట్టి యాశంఖధ్వనిచేతను, రథనేమినిస్వనంబుచేతను, గాండివగుణధ్వానంబు జేతను భూతలంబు కంపించె. గోగణంబులు పుచ్ఛంబుల మీఁది కెత్తి కొనుచు దక్షిణపుదెసకు మరలం దొడంగెను.

కర్ణాపయానము

ఇట్లు పాండవమధ్యముండు శత్రుసేనాసముద్రంబును వ్యాకుల పఱిచి గోగణంబుల మరల్చి యుద్ధంబుచేయం దలంచి దుర్యోధనాభిముఖుండై యేఁగెను. గోగణంబులు మత్స్యదేశంబునకు మరలఁ గిరీటి తావచ్చినకార్యంబు నెఱవేర్చెనని తలపోయుచు రారాజుం దరియు నమ్మహావీరు కురువీరు లెల్లరును సమీపించిరి. మొనలుతీర్చి బహుళధ్వజంబుల నలరారు నమ్మహావీరుల మోహరంబులం గాంచి యప్పార్థుం డుత్తరుం జీరి "రాజపుత్రా! అరదంబు నల్లన నీతని సమీపించునట్లు గడుపుము. పెద్దకాలంబునుండియు నియ్యంగరాజు నాతోఁ బోర నుత్సహించుచుండు. దుర్యోధను నాశ్రయించుటం జేసి యుక్కుమిగిలిన యీతని దరియఁ బోనిమ్ము." అని యాజ్ఞాపించె. విరటభూపాలతనయుండును వాయుజవమనోవేగంబు లగు నత్తురగోత్తమంబులం ద్రోలి యా రథికవర్యులబలంబులం జెదరునట్లు మధ్యంబునుండి పఱపి, ధనంజయు సేనామధ్యంబునకుం దోడ్కొనిచనియె. అట్లు మహాజవంబున మీఁది కురుకు నప్పాండవుః చిత్రసేనుండును, సంగ్రామజిత్తుండును, శత్రుసహుండును, జయుండును, గర్ణుం గొలుచుచు పటువిశిఖంబులం దొడరి పోరిరి. అంత నమ్మహావీరుండు పెచ్చురేఁగినదవాగ్ని యరణ్యంబు దహియించురీతి గోపం బగ్గలంబుగ నమ్మహారథులవ్రాతంబు నూఱార్చె. అట్లు పోరుఘోరంబు సంప్రవృత్తం బగుచుండ, నతిరథుం డగువికర్ణుండు మిగుల భయంకరం బగు ధనుర్వరంబునఁ బార్థుం దాఁకె. జాంబూనదమయం బగు నవ్వీరుధనువును విఱుగ నేసి యాతనిధ్వజంబును బార్థుండు గూలనేయ నప్పురుషపుంగవుండు పలాయితుం డయ్యె. శత్రుగణముల బాధించుబీభత్సుం గాంచి శత్రుంతపుండు శరవర్షంబునం గప్పె. మరుసైన్యంబు చూరంబాఱు నప్పార్థుండు శత్రుంతపనిరుద్ధుండై బిట్టుకనలి యాతని నేను బాణంబులను, సూతు దశబాణంబుల నొప్పించె. దాన నమ్మానవపతి తనుత్రాణంబు తెగి యమ్ములు మర్మంబుల నాట భూతలంబునంబడి యసువులకుం బాసె. ఇట్లు నరర్షభుం డగుకిరీటిచే భంజింపఁబడి పలువురు రాజన్యులు వాతకంపితతరువరంబులమాడ్కి నల్లలనాడుచుండిరి. కొంద ఱసువులంబాసి భూమిం ద్రెళ్లుచుండిరి. దవాగ్ని వనంబులం గాల్చు

విధంబునను, మహాపవనం బంబుధరమాలికలఁ దూలించువడువునను, మదనాగంబుబోలెను వైరివీరమధ్యంబున నయ్యనఘుండు వీరవిహారంబు సలుపుచుండె. సంగ్రామజిత్తు నరనంబువూన్చిన శోణాశ్వంబులం జంపి యాతనిశిరంబు నొక్కకోలం డుల్లనేసె. అట్లు సోదరుండు పడుట గాంచి సూతపుత్త్రుండు కర్ణుండు నాగేంద్రంబు పైకి లంఘించు హరిచందంబునను, వృషభంబుపైఁ గవియు వ్యాఘ్రంబుచాడ్పునను బార్థుం డాఁకి ద్వాదశశరంబులం బార్థు నేసి, హయంబులగాత్రంబుల నమ్ములు గాడించి, యుత్తరుకరంబునఁ గొట్టె. ఇట్లు వెల్లువ్బుచున్న యవ్వైకర్తనుం గాంచి కిరీటి వేగంబున నెదుర్కొనియె. ఇట్లు వీరవరులగు కర్ణార్జును లెదుర్కొని యుద్ధంబు సలుపఁబూన కురువీరులెల్లరును నిరీక్షించుచుండిరి. కృతాపకారి యగు సూతపుత్త్రుం జూచి పార్థుండు కోపానలంబు రగుల్కొని మఁట లెగయ నాతండు సమీపించుటకు మిగుల హర్షంబునొంది యశ్వరథసూతులతోఁగూడ నాతని శరాసారంబునం గప్పె. అమ్ము లెమ్ములనాట నశ్వంబులును సూతుండును బెల్లఱిచెను. అయ్యంగరాజు పార్థబాహువినిర్ముక్తంబు లగు బాణజాలంబుల ప్రతిశరంబులం దునిమి బాణాసనంబునూని స్ఫులింగంబులం గ్రక్కు నగ్నింబోలియుండె. అట్లు యుద్ధదుర్మదుం డగు సూతపుత్త్రుం బూజించుటకు కౌరవసైనికులు శంఖభేరీపణవంబుల మ్రోయించిరి. ఇట్టు లా సూర్యసూతిం గాంచి యర్జునుండు గాండీవగుణంబు సారించి నినదంబు గావించె. కర్ణుండును గుణంబు మ్రోయించి పెల్లార్చె. పాండవమధ్యముండు రాధేయు శరంబుల నొప్పించి సూతునశ్వంబుల నెఱకులు గాఁడ నేసి, కురుపితామహుని ద్రోణాచార్యకృపాచార్యులం బాణవర్షంబుల ముంచె. సూతపుత్త్రుండును బెక్కువాడియమ్ములఁ బార్థుం గీలించె. ఇట్లు కఱకుటమ్ములం బఱపుచు నస్త్రంబులసంధించు నవ్వీరవరులను జంద్రసూర్యుల ఘనాచ్ఛాదితులై యున్నట్లు చూడనైరి. అంత సూతసూతి చులుకఁదనంబునఁ బార్థుహయంబులఁ గాఁడ నేసి, మూఁడుబాణంబుల సూతు నదల్చి, మఱిమూఁడు బాణంబుల కేతనంబు బ్రహరించె. అంత నిదురించుసింగంబు మేల్కొన్న చాడ్పున నేటువడి యప్పార్థుండు వాఁడి నారసంబులం బఱపె. అతిమానుషం బగు కరలాఘవంబుఁ జూపుచు సహస్రకిరణుండు లోకంబును గిరణజాలంబులంబోలె నయ్యంగరాజు వృషత్క

జాలంబుల ముంచె. గజంబుపై నేటుపడ్డ మృగేంద్రంబుంబోలి నిషం
గంబులనుండి నిశితభల్లంబుం గైకొని యాకర్ణపూర్ణంబుగా గుణంబు
బాణంబు నాకర్షించి సూతపుత్రుగాత్రంబు నాటనేసె. అశనిప్రకాశం
బులగు నారాచంబుల నాతని సకలాంగయవంబుల నొప్పించె. ఇట్లు పాండ
వుండు చేయాడకుండ బహుంబు సలిపి నొప్పింప నిలుపనేరక యాతండు
యుద్ధంబు దొఱఁగి యొండెడకుఁ బాఱె.

## అర్జునకృప సంగ్రామము

రాధేయుండు కలను దొఱంగి పాఱ దుర్యోధనపురోగాములగువీరులు తమతమయనీకంబులం గూడి యప్పార్థు నెదిర్చిరి. అట్లు సన్నద్ధంబగు నవ్వరూథినీమహాసముద్రంబును వేలయుంబోలి బాణంబుల నాకౌంతేయుం డాపెను. మఱియు నప్పేటిమగఁడు చిఱునవ్వు తోలుక దివ్యాస్త్రంబు సంధించియేసియు, గాండీవనిర్ముక్తంబు లగు కఱకుటమ్ముల నుప్పరంబు గప్పియు నేపుమిగిలె. పార్థబాణంబుల వ్యాప్తంబగు నభోమండలంబున రెండంగుళంబుల యంతరంబును గలుగఁజాల కుండె. పార్థుని కరలాఘవంబును హయంబులచుఱుకుఁదనంబును జవంబును భూమింజయు సారథ్యనైపుణింగాంచి యెల్లరును బూజించిరి. కాలాగ్నివలె శత్రుసంహారము గావించు నాతనియెడ శత్రువులు తేఱిచూడం జాలకపోయిరి. వడిగలశరంబుల నాకీర్ణంబులై యానేనలు సూర్యరశ్మివ్యాపృతంబులగు మహాభ్రంబులంబోలి ప్రకాశించె. పార్థశరవిదారితగాత్రంబులై రుధిరధారలదొఱంగు నానేనలు పుష్పించినయశోకంబులం బోలి యలరె. నరుశరంబులం గీడ్పడి యుగ్యంబులు రథాంగంబులం గొని సూతుల సరకుఁగొనక తమయిచ్చవచ్చినదెసకు పర్వెత్తె. కర్ణకక్షదంతంబులందును మర్మంబులను బాణహతులు గావించి యవ్వీరుండు గజంబులం గూలనేసె. కురునాథుముందు నడచుగజబలంబు భూమింబడ మేఘంబులం నావృతంబగు నభోమండలంబుపోలిక నయ్యిలాతలంబు రాజిల్లె. యుగాంతకాలంబున హవ్యవాహనుండు విజృంభించి స్థావరజంగమాత్మకమగుజీవలోకంబు దహియించునట్లు ఫల్గునుండు రణాంగణంబునఁ బ్రత్యర్థుల నశియింపఁజేసె. సర్వాస్త్రతేజంబునను, గాండీవగుణారవంబునను, రథధ్వానంబునను, కపిభైరవారావంబునను,

భూతంబుల యాక్రోశంబునను దుర్యోధన బలంబులకు భీతిగలుగం జేయుచు విహరించుచుండె. కౌరవుల రథబలంబు మొదటనే విఱిగిపాఱె. బాణంబులముందుఁ గురియుచు వెనుకఁ దాగదలుచు నా ధనంజయుండు ముందు రథ్యలు చెలంగ వెనకఁ బోడము నాతిత్యు ననుకరించుచుండె. అరాతు లాతసి బాణంబులం జూచి యర్జునుం డిటు వచ్చెనని తలంపఁగలి గిరి కాని యాతనియరదంబుం దిలకింపనేరరైరి. ఇవ్విధంబున ననంతుండు మహార్ణవంబునఁ గ్రీడించునట్లు సేనాసముద్రంబు నాకులపఱచె. అశ్రుతం బగు నాతనిగుణరవంబును భూతంబు లాకర్ణించుచుండె. ఆతండు స్వల్ప మాత్ర ప్రదేశంబునఁ బెక్కుబాణంబులం గ్రుచ్చి యేసుంగుల భీతిపఱచె. సవ్యాపసవ్యకరంబుల బాణంబులనేయుచు బవరంబున సాయకమండ లంబు గానవచ్చునట్లు గావించె. వికృతరూపంబునఁ జాపులు తార్క్ష్యా ననిభంగి యలక్ష్యంబులవీషి యర్జును మార్గణంబులు లక్ష్యంబుమాత్రమ చేరుచుండె. వనంబున గజసహస్రంబులు నడవ నేర్పడిన మార్గంబుబోలు గాండీవిరథసంచారంబు నలముకొనియె. పార్థనిహతులగు నరివీరులు పార్థజయైషియై సురేంద్రుఁడు సురసంఘంబులంగూడి తమ్ము మడియించె నని తలంచుచుండిరి. శత్రుసేనల మడియించు నవ్వీరవరుఁ బ్రజల యసువు లకుం బాపుకాలుండని తలంచిరి. అర్జునానలభిన్నంబు లగు శత్రుసైన్యం బులు లోహితంబులు గ్రమ్మికొన లోహితవర్ణంబులై యుండె. సంజ కాలంబు వచ్చువన సంబరతలంబంతయు జాజువాఱె. అస్త్రాభిముఖుం డగు సూర్యుండు తనతైక్ష్ణ్యంబును సడల్చుగాని యప్పాండవుం డవ్వీరుల నెల్ల స్రుందింపక మరలఁడయ్యె. ఇవ్విధంబున నాశూరాగ్రేసరుండు ధనుర్ధరుల నెల్ల నుక్కడగించె.

ద్రోణు డెబ్బదిమూఁడు బాణంబులను, దుస్సహు పదిమార్గణంబు లను, ద్రోణపుత్రు నెనిమిదియమ్ములను, దుశ్శాసనుఁ బదిభల్లంబులను, శారద్వతు మూఁడుబాణంబులను, మందాకినీనందను నాఱుమార్గణంబు లను, రారాజు నూఱు కఱకుటమ్ములను, గర్ణు నొక్కనిశితసాయకంబు నను నర్జునుండు నొవ్వనేసె. అయ్యుద్ధంబున మహారథుం డగుకర్ణుండు సూతాశ్వంబులుమ్రగ్గి యరదంబు బోడియై పఱచ నాయనీకంబు భయం బునఁ గలంగె.

అట్లు ప్రతిపక్షబలంబు భంగంబునొందుట నాలోకించి పార్థు నంతరంగం బెఱింగి విరాటపుత్త్రుండు "శ్వేతవాహన! నీవిక నెయ్యనీకంబు మార్కొనందలంతువో సారథినగు నాకెఱింగించి పనిగొనుము." అని విన్నవించె. దానికి సవ్యసాచి యిట్లనియె.—"ఎఱ్ఱని యశ్వంబులును, నీలవర్ణపతాకయుఁ గల యా యరదంబుననుండు నయ్యనఘుండు కృపుండు. ఈతండు మాకు బాల్యగురువు. ఈతనికి మదీయాస్త్రంబులఁ జవిచూపవలయు గావున నియ్యనీకంబున కరదంబుఁ బఱపుము. కేతనంబునఁ గమండలువుగల యయ్యరదంబునందలి మహారథుండు ద్రోణాచార్యుండు. ఇయ్యనఘుండు సర్వశస్త్రధారులకును విశేషంబుగ నాకును మాన్యుండు. ఈతండు నాయెడ కరంబు ప్రేమగలిగియుండు. మహావీరుం డగు నీతనికిఁ బ్రదక్షిణంబుగ నరదంబు పోవనిమ్ము. ఈతనికడ నరదంబు డిగ్గవలయు. ఇయ్యది సనాతనాచారంబు. ఈతండు నాపై నిశిత-సాయకంబుల నిగుడించెనేని నే నీతని నెదుర్కొందు. ఈతనికి కినుక పొడమ రాదని యట్లు గావింతు. ఈతని కనతిదూరంబున ధనుర్ధ్వజంబు గల యవ్వీరుండు ద్రోణపుత్త్రుండు. ఈతండు మేటిమగఁడు. శస్త్రధారులకుఁ బూజార్హుఁడు. తండ్రి కెనవచ్చువాఁడు. ఈతనియరదంబు చేరి నీవు మరలమరల మరలుము. అల్ల యనీకంబున బంగరుమఱువుఁదొడిగి నాగధ్వజంబుగల స్యందనం బధిరోహించి హేమకేతనంబు గలిగి యుండువాఁడు కురురాజు. ఈతండు మిక్కిలి దుష్టుండు. కావున మదీయ శతాంగంబు నీతని కభిముఖంబుగఁ బఱపుము. మదీయదివ్యాస్త్రంబుల బలం బీతం డెఱుంగవలయు. ధ్వజాగ్రంబున నాగకక్ష్య గలయాతండు రాధేయుండు. నీ వీతని తొల్లి యెఱింగియుందు. ఈతండు నా కీడగు నని యూసుపూనియుండు. ఈతని కభిముఖంబుగను నాయరదంబు గడపుము. నల్లని పంచతాళంబులు కేతనంబునం గలిగి, దీర్ఘంబగు చాపంబు పూని, శ్వేతచ్ఛత్త్రంబు ధరియించి, దృఢతనుత్రాణంబు ధరియించి స్వర్ణశిరస్త్రాణంబు పూనిన యమ్మహావీరుండు గంగాపుత్త్రుఁడు. మాకురుకులంబునకుఁ బితామహుండు. రాజ్యలక్ష్మిని బొందియున్న దుర్యోధను ననుసరించు. మనము తక్కుంగల దండిమగలఁ భజించి యాతని నెదుర్కొందము. తొలుత నీతని మార్కొంటిమేని మనకార్యంబున కియ్యనఘుండు విఘ్నంబు గలిగింపంగలఁడు. ఇతనితోఁ బవరంబు సేయునప్పుడు

వాజుల మిగుల జాగరూకుండవై ప్రచోదింపుము.” అట్లర్జునుండు వాకొన నుత్తరుండు కృపుం డున్నెడ కరదంబు నడిపె.

## దేవగమనము

కురుసేనాబలంబులు యుద్ధసన్నద్ధంబులై మందమారుతాందోళితములగు నీలాంబువాహంబులఁబోలియుండె హయరత్నంబుల నధిరోహించి నిశితాయుధంబుల ధరియించి రౌతులు పోజుదీరియుండిరి. మాతంగంబుల నెక్కి తోమరాంకుశాదులఁ బూని గజయోధులు సన్నద్ధులైయుండిరి.

అంత సురేంద్రుండు సకలసురలంగూడి సుదర్శనం బను విమానంబు నధిరోహించి విశ్వేదేవాశ్వివ్యాదులంగూడి రణదిదృక్షాకుతూహలంబున నంబరతలంబున నిలిచె. మేఘవినిర్ముక్తంబగు నయ్యంబరతలంబు దేవగణసంకులంబై గ్రహమండలంబుల నొప్పారినట్లుండె. నిశితాస్త్రంబులం బ్రయోగించు కృపార్జునులపోరు ఘోరంబయ్యె. అయ్యుద్ధంబు నాలోకింపఁ దమతమవిమానంబుల నెక్కివచ్చిన దివిజులు నూర్గ్గకొలంది యంబరతలంబున నిలిచిరి. హిరణ్మయసాయకంబు లొకవంకనుండియు, రత్నమయసాయకంబు లొక్కయెడనుండియు సుస్వరంబు గప్పుచుండె. అచ్చట స్వేచ్ఛాచరంబును, సర్వరత్నవిభూషితంబును, ఖేచరంబునగు దేవనాయకువిమానంబు విరాజిల్లుచుండె. దానికడ దేవపతింగూడి త్రయస్త్రింశద్దేవతలును బలసియుండిరి. గంధర్వులును, రాక్షసులును, నాగులును, పితృదేవతలును, మహర్షులును జేరియుండిరి. అవ్విమానరత్నంబున నష్టకుండును, శిబియు, యయాతియు, నహుషుండును, గయుండును, మనువును, పూరుండును, రఘువును, కృశాశ్వుండును, సగరుండును, నళుండును, వసుమనస్కుండును, బలాక్షుండును, ప్రతర్దనుండును నిలిచి యాసంగరంబు నాలోకించుచుండిరి. దిక్పాలకులయు, కమలాసనునియు, నలంబుసోగ్రసేనులయు, తుంబురునియు, విమానంబు లొక్కయెడ నిల్చియుండె. దేవనికాయంబులును, సిద్ధులును, కౌరవకిరీటులయుద్ధంబు వీక్షింపఁ గుతూహలంబు చెందియుండిరి. అచ్చట వసంతర్తువునఁ బుష్పించిన లతాంతగంధంబుంబోలు దివ్యగంధంబు వ్యాపించె. దివ్యులరత్నాంబరాభరణకేతనచామరాదులు కాన

నయ్యె. భూమండలంబున వ్యాపించినరజోభరంబు శమించె. సువాసితం బగు మందవాతంబు ప్రసరించె. నానారత్నవిభ్రాజితంబు లగు నరదంబుల నెక్కి యున్న సురసంఘంబులం గూడి యయ్యమరనాయకుండు విమానంబున నిలిచి పద్మోత్పలంబులం గూర్చినమాలికను ధరియించి యక్కటముగఁ బౌరుషంబు సలుపు సూనుం గాంచియుఁ దనివిసనకయుండె.

## కృపాపనయనము

వ్యూఢానీకంబు లగు కురుసైన్యంబులం గాంచి పాండుసూతి వైరాటిం గాంచి, "జాంబూనదమయం బగు వేదిగలసిడంబు గలవాఁడు కృపాచార్యుండు. అతనికి దక్షిణంబుగ రథంబు పోవనిమ్ము" అని యానతిచ్చె. అవ్వీరువచనంబుల నెరవు వెండిబోలి వెల్లనై హేమభాండోదరంబు లగు యుగ్యంబుల నల్లనఁ దోలి కురుసేనాసమీపంబు చేరి యవ్వైరాటి వాయుజవంబు లగు సవ్యాజుల మరల్చి ప్రదక్షిణంబుగాఁ బోనిచ్చి మండలభ్రమణంబు చేయించి యక్కురువ్యూహంబుల నెల్ల మోహపెట్టె. కృపాచార్యు నరదంబునకుఁ బ్రదక్షిణంబు సలిపి యాతని యగ్రంబున నకుతోభయుం డగుచు నిలిచె. అంత పార్థుండు బీభత్సనామంబు వినిచి మహాస్వనంబగు దేవదత్తంబు పూరించె. అద్దివ్యశంఖరవంబు కొండ బ్రద్దలగునప్పుడువలె మిక్కిలి పెద్దయై మిన్నుముట్టె. అయ్యర్జునునిచేఁ బూరితంబయ్యు వ్రక్కలుగాక నిలిచియున్న యాశంఖంబును గౌరవు లెల్లరు మనంబులఁ బూజించిరి. శంఖరవం బంబరతలంబు నాక్రమించి మరలివచ్చి పర్వతంబునంబడు వజ్రనిర్ఘోషంబునుంబోలె వినవయ్యె.

ఇయ్యంతరంబున బలదర్పసమన్వితుం డగు శారద్వతుం డాశబ్దంబును సహింపక యర్జును నెదిరి పోర సంరబ్ధుండై సముద్రజంబగు శంఖంబు నొత్తె. ఆశబ్దంబు ముల్లోకంబుల నాక్రమింపఁ జాపంబుం గొని జ్యాశబ్దంబు గావించె. అట్లు పరస్పరంబు తలపడి యాయోధనంబు చేయు నయ్యిరువురు శారదనీరదంబులం బోలియుండిరి. అంత శారద్వతుండు మర్మభేదకంబు లగు పది వాడియమ్ములం బార్థుం గీలించె. పార్థుండును లోకవిశ్రుతం బగు గాండీవంబున బాణంబులు నిగుడ్చి మర్మభేదకంబులగు బహుబాణంబుల నయ్యాచార్యుపైఁ బఱపె. పార్థముక్తంబు లగుశరంబుల మధ్యనే కృపుండు తెగనేసె. అంత పార్థుండు కనలి

విచిత్రమార్గంబులం బ్రదర్శించుచు నారాచజాలంబుల దశదిగంతములు నాచ్ఛాదించె. అంబరంబు నంత నేకచ్ఛాయంబు గావించి శరశతంబుల శారద్వతు ముంచె. అగ్నిశిఖోపమంబు లగు నాసాయకంబుల నొచ్చి క్రుద్ధుండై యమ్మహారథుండు, దశసహస్రబాణంబులఁ బార్థుపైఁ బఱపి, యాతని బాధించి పెల్లార్చె. అనంతరంబు కనకపర్వాగ్రంబులును సన్నత పర్వంబులు నగు దశసాయకంబుల నర్జునుం డాచార్యుపై నేసె. మరియు లాఘవంబుఁ జూపుచు నాలుగు నారాచంబుల వాజులఁ గూలనేసె. అయ్యేటుపడి యాయుగ్యంబులు పర్వెత్తె. కృపుండు స్థానంబునుండి చలించె. స్థానచ్యుతుం డగు శారద్వతుం గాంచి యాతనిగౌరవంబు గాపాడఁదలంచి కుంతీసుతుం డాతనిపై బాణంబుల నేయనమానె. శార ద్వతుండును స్వస్థానంబుచేకొని కంకపత్రంబు లగు దశబాణంబులఁ గిరీటి నేసె. పార్థుండు నిశితభల్లంబున నాతనిచాపంబు దునిమి, హస్తా వాపంబు హరియించి, వాడినారసంబుల కవచంబు ఛేదించియు నాతండు కృపాచార్యగాత్రంబు నొవ్వనేయఁడయ్యె. కవచంబునకుం దొలంగు నయ్యనఘుశరీరంబు కంచుకంబు విడుచు సర్పంబువోలె గానవయ్యె. పార్థుండు చాపంబువిఱుగనేసిన శారద్వతుం డన్యశరాసనంబు గొని దాని సజ్యంబు గావించె. కౌంతేయుం డొండుబాణంబున దానిని భంగించె. ఆతండు వేఱొండుచాపంబుఁబూన దానిని విఱుగనేసె. ఇట్లు పాండవమధ్యముండు శారద్వతుండు పూను బహుబాణాసనంబుల ముక్కలునేయుచుండె. ఇవ్విధఁబున బాణాసనంబులు ముక్క లగు చుండుటఁగాంచి యమ్మహాశూరుండు శక్తింబూని ప్రదీప్తంబగు నశనిం బోలెఁ బాండుపుత్రుపై నేసె. అంబరంబుననుండి యగ్ని కణంబులఁ జల్లుచు దరియ నాశక్తిం గాంచి దశశరంబులఁ బిండిచేసె. పార్థునిచే దశభాగంబులుగ భిన్నమై యాశక్తి నేలంగూలె. అంత ధనుస్సు సగు ణంబుగావించుకొని కృపాచార్యుండు పదివాడియమ్ముల పార్థుపై నిగి డించె. పార్థుఁడు నగ్ని తేజంబు లగు పదుమూఁడుబాణంబులఁ బఱపె. రథ యుగంబు నొక్కబాణంబునను, నాలుగుబాణంబుల నాలుగుహయంబు లను, నాఱుబాణంబుల రథసూతుని, రెండింట నక్షంబులను, నొక్క బాణంబునఁ గేతనంబును, నొవ్వనేసి చిఱునగవు మొగమునఁ జెంగలింప నొక్కబాణంబున శారద్వతువక్షంబు నేసె. కృపాచార్యుండును ఛిన్న

ధనుష్కుండగుచు, అశ్వంబులును సారథియు మ్రగ్గ, గదాపాణియై ధర ణికి లంఘించి యర్జునుపై గదాదండంబు విసరె. అవ్వీరాగ్రేసరుచే ముక్తం బగు నాగదాదండంబును, నర్జునుం డేయు వాఁడిబాణంబుల వమ్మై పోయె. శారద్వతుం డట్లుండుటఁ గాంచి యోధులెల్లరు గుమిగూడి పార్థుపై శరవర్షంబు గురియించిరి. వైరాటి వాజుల సవ్యంబుగాఁ బఱపి మండలంబు చుట్టి యయ్యోధుల వారించె. అంత నవ్వీరవరులు విరథుం డగు కృపా చార్యుఁ జేరదీసి యర్జును సమక్షంబుఁ బాసిరి.

### ద్రోణాపయానము

కృపాచార్యుండు రణంబునుం దొలంగి చనుడు శోణాశ్వుం డును నప్రధృష్యుండు నగు ద్రోణుండు సశరంబగు ధనువు పరిగ్రహించి శ్వేతవాహను నెదుర్కొనియె. అయ్యర్జునుండు రుక్మరథంబుఁ గాంచి గురుం డంతికంబునకు వచ్చుట యెఱింగి యుత్తరుం జీరి, "కాంచనమయ వేదిగల ధ్వజంబును, ప్రవాళంబులం బోలి యెఱ్ఱనైన వాజులును గల యయ్యనీకంబునకు నా తేరు గడపుము. అందు సర్వలోకప్రఖ్యాతుం డును, బుద్ధికి శుక్రుండును, నయంబున బృహస్పతియు, చతుర్వేద వేత్తయు నగు ద్రోణుం డుండు. సంహారప్రయోగంబులం గూడి సకలా స్త్రంబులు నామహాభాగు కరగతంబులై యుండు. ఇంత యేల! శస్త్రవే దంబు కాయంబు నొందినట్లు దోఁచుచుండు. క్షమయు దమంబును నానృశంస్యమును, ఋజుప్రవృత్తియు మున్నగు సద్గుణంబు లాయయ్య కలంకారంబులు. అట్టి యయ్యాచార్యుతో బవరంబు సేయఁ గోర్కె వొడ మెడు" అని యాదేశించె. అర్జునుం డిట్లాజ్ఞాపింప నుత్తరుండు హేమ భూషణంబు లగు నత్తురగంబుల భరద్వాజునరదంబు డాయఁ బుచ్చెను. అట్లు తన్నుం డాయవచ్చు నప్పార్థు నాచార్యుండు సన్నద్ధుండై కవిసె. శంఖంబుఁ బూరింప నబ్బలం బంతయు వాయుసముద్ధూతం బగు సము ద్రంబు చాడ్పునఁ గలంగె. శోణంబులగు నశ్వంబులు హంసవర్ణంబులగు వాజులం దరియఁ గాంచి యవ్వీరు లెల్లరు విస్మయంబు నొందిరి. వీర్యసంప న్నులగు నాచార్యుండును శిష్యుండును నెదుర్కొనఁ జూచి యాకురు బలం బుత్సాహంబున కలంగుడువడియె. పార్థుండు హర్షయుక్తుం డగుచు చిఱునగ వంకురింప ద్రోణాచార్యురథంబు నరదంబునం దరిసి

నమస్కరించి సామపూర్వకంబుగ మందమృదూక్తులొలుక, "ఆచార్యా! వనవాసంబునఁ బెద్దగాలంబు ప్రతిక్రియచేయ నుద్దేశించుచు నివసించి యిడుమలం బడితిమి. మాయెడ రణదుర్జయుండవ వగు నీవు కోపంబు సేయం దగదు. మీరు నన్నేసినఁగాని నే నేయంజాల కావున మీరు తొలుత బాణంబులు నిగుడింపుఁడు" అని ప్రార్థించె. అంత నయ్యాచార్యుండు వింశతిబాణంబుల నర్జునుపై నేయ నప్పార్థుండు వానిమార్గంబు ననే తునియనేసె. భారద్వాజుండు పార్థునరథంబు శతసహస్రసాయకంబుల గప్పె పార్థుం గుపితుం జేయుటకో యన వెల్లగుఱ్ఱంబుల శిలాశితంబు లగు మార్గణంబుల నొప్పించె. ఇవ్విధంబునఁ బ్రఖ్యాతపౌరుషులును, దివ్యాస్త్రకోవిదులును, సత్తరుతేజస్కులును నగు భారద్వాజ కిరటుల యుద్ధంబు ప్రవృత్తంబగుడు, నటనుండు యోధవరులెల్లరు విస్మయంబు నొందిరి. కొందఱు శరాసారంబులం గురియు నయ్యిరువురం బూజించిరి. మఱికొందఱు ఫల్గునుండుదక్క యన్యుం డెవ్వండు చాపాచార్యున కెదిరి నిలువనోపు ననిరి. క్షత్త్రియధర్మంబు మిగుల క్లేశకరంబు. బాల్యంబు నుండియు విద్యగఱపిన యాచార్యునే యెదుర్కొనవలసివచ్చె నని యింకొకకొంద ఱనిరి. ఇవ్విధంబున నచటఁ గూడిన వారెల్లఁ బలువిధంబులఁ బలుకుచుండిరి. అవ్వీరవరులిరువురు సంరబ్ధులై యొండొరులం డాసి శరవ్రాతంబులఁ గప్పుచుండిరి. అంత భారద్వాజుండు హేమపృష్ఠం బగు మహాచాపంబు నెక్కిడి ప్రకాశవంతంబు లగు బాణంబుల నయ్యర్జునుపై నిగుడించె. దానం జేసి యాకసంబుగప్పుబడి సూర్యకాంతి గానరాదయ్యె. ఘోరం బగువర్షంబు పర్వతంబుముంచునట్లు పార్థు సాయకంబుల గప్పె. అప్పాండవమధ్యముండును మిగుల హర్షంబునొంది గాండీవంబుచేకొని కరవేగంబుచూపుచుఁ జిత్రశరంబులం బఱపుచు ద్రోణముక్తబాణవర్షంబును మార్గమధ్యంబున నిలువరించుచుఁ బోరుసలిపె. రథంబునఁ జరించు నప్పార్థుండు సకలదిక్కులందును సర్వాస్త్రంబులం జూపె. అంబరంబు నేకచ్ఛాయంబుగఁ జేసె. అప్పుడు ద్రోణాచార్యుండు ప్రకాశంబునొందు పర్వతంబు మంచు గప్పఁ గానరానిభంగి బాణసంవృతుండై యడంగె. పార్థుబాణంబుల నప్రకాశంబై యున్న యాత్మరథంబు వీక్షించి యగ్నిచక్రంబుసాటియగు ధనువు నాకర్షించి వాఁడిశరంబుల నిగిడించె. దావదగ్ధంబులగు వంశంబుల రొదవలె శబ్దంబొం దుప్పతిల్లె. కనకపుంఖంబు

లగు దివ్యసాయకంబుల వ్యోమతలంబు నరికట్టి సూర్యకాంతి నడగించె. ద్రోణశరవినిర్ముక్తంబులై పుంఖానుపుంఖంబులై యెడము లేక యేగు నాసాయకంబు లొక్క దీర్ఘబాణంబువోలెఁ గనుపట్టుచు చూపఱుల కచ్చెరువు గలిగించుచుండె ఇవ్విధంబున నవ్వీరాగ్రణులు శ్రవణబాధాకరంబుగ బాణంబులం బఱపుచు నంబరంబు నుల్కాలంకృతం బగునట్లు గావించిరి. కంకపత్రంబులం బూనియున్న వారల శరంబు లంబరంబున నెగయుచు బాఱులుగట్టి పాఱు విహగసంతతులఁబోలె, వనాంతరంబున విషాణాగ్రంబులం బూని పోరు మదకరుల చాడ్పునను, వృత్రవాసవుల పోలికను, నన్యోన్యంబు శరంబులం బ్రహరించిరి. అయ్యోధయుగము దివ్యాస్త్రంబులఁ బ్రయోగించుచుండిరి. అర్జునుం డాచార్యుండు పఱపు సాయకంబుల వారించి యస్త్రంబులం జూచుచున్న వీరుల కాశ్చర్యంబు గలుగునట్లు వ్యోమతలంబును శరంబులంగప్పె. ఇవ్విధంబున స్వతేజంబు ప్రదర్శించు నరపుంగవుం డగు నరునితో భారద్వాజుండు రణాంగణంబున శరంబులఁగ్రీడించె. ఫల్గునుండు ప్రయోగించు దివ్యాస్త్రంబుల బ్రత్యస్త్రంబుల వారించిగురుండు యుద్ధంబు చేసె.ఇంద్రవాయవ్యాగ్నేయాది దివ్యాస్త్రంబులగురుండేసినంత మాత్ర నర్జునుండుసంహరించుచుండె.అయ్యర్జునుం డేయుశరంబులు ప్రతిపక్షగాత్రంబులందాకి పర్వతంబునఁ బడునశనిపోలిక సద్దుగలిగించుచుండె. ఆయుద్ధంబున నేటువడి గజంబులు తురంగంబులు రక్తంబులం దోఁగఁజూచిన మోదుగుచెట్లు వోలియుండె. పార్థబాణపాతంబుల నేలఁబడు కవచంబులను, ధ్వజంబులను, యోధసంఘంబులను నబ్బలంబు సముద్భ్రాంతంబయ్యె. అవ్వీరవరు లన్యోన్యముక్తసాయకంబుల నంబరంబుం గప్పిరి. వారికంత తుములయుద్ధంబు ప్రవృత్తంబయ్యె.

అయ్యవసరంబున "మహావీరుండును దుష్కరుండు నగు నర్జునుం దలపడిపోరుట నీద్రోణుండు ఘనకార్యంబు గావించె" నను ద్రోణప్రశంసావాక్యం బంబరతలంబున వ్యాకీర్ణంబయ్యె. ద్రోణుండు నర్జును శరలాఘవంబునకు నేర్పునకును గడుంగడు విస్మయంబునొందుచుండె. అంత నర్జునుం డించుక యలుకపొడమ గాండీవంబు నెత్తి శలభంబులంబోలె బాణసంఘాతంబు సృజియించె. అట్టి యర్జునుశరసంధానవేగంబు నెల్లరు మెచ్చిరి. ఆతని బాణంబుల యంతరమున వాయువును బ్రవేశింపఁ

జాలకుం డెను. పార్థుం డంతరంబు లేకుండ త్వరితంబుగ బాణంబు నిగు
డించుటం జేసి బాణంబుల సంధించుటయు విడుచుటయు నెఱుఁగఁబడ
కయ్యె. ఇట్లు బాణయుద్ధంబు జరుగుచుండ శీఘ్రంబునఁ బార్థుం డసంఖ్యే
యశరంబుల నిగిడించుచు నొక్కుమ్మడి ద్రోణునరదంబును వేయిబాణ
శతంబులం గప్పె. కుంభసంభవుం డవ్విధంబునఁ బార్థుచే నాక్రాంతుం
డగుడు, సైన్యంబుల హాహాకారంబులు జనియించె. పాండవుని
యయ్యస్త్రకౌశలంబు నింద్రుండు మెచ్చుకొనియె. ఇట్టి సమయంబున
నాచార్యపుత్త్రుం డగు నశ్వత్థామ రథబృందంబునుంగూడి యయ్యర్జును
నిరోధించె. ఆద్రోణపుత్త్రుండు పార్థుహస్తకౌశలంబున కచ్చెరువునొం
దెను; ద్రోణాచార్యుఁ దూలనేయుటకుఁ గోపించెను. కుపితుం డగు
నయ్యాచార్యపుత్త్రుండు మేఘంబుఁబోలి శరాసారంబులం గురియుచుఁ
బార్థుం దాఁకె. వివ్వచ్చుండు ద్రౌణి యుండునయ్యెడ కశ్వంబులం దోలి
యాచార్యునకుఁ దొలంగ నవకాశ మిచ్చె. అంతరంబునొంది యవ్వీర
గురుండు భిన్నతనుత్రాణుండును, నికృత్తగాత్రుండు నగుచు రణంబు
నకుం దొలంగె.

## అర్జునాశ్వత్థామయుద్ధము

మిక్కిలి జవంబున ద్రోణసూతి యర్జునుపై కురికె. వాయువేగం
బున శరజాలంబు గురియు నాతని నంబువాహంబునుంబోలి పార్థుం
డెదిరినిలిచె. ఒండొరుల శరవిన్యాసంబు గాంచుకొను నాయిరువురకును
దేవాసురులకుంబోలి వృత్రవాసవులకుంబోలి ఘోరయుద్ధంబు పొసఁగె.
అంబరంబు శరజాలావృతంబై ఛాయారూపంబై యుండ, సూర్యుం
డును బ్రకాశింపనేరఁడయ్యె. గంధవహుండు లోకప్రసారంబుదొఱంగె.
ఒండొరులగాత్రంబుల బాణంబులు దాఁకుచు కాలుచున్న వెదురులం
బోలి చటచట యను శబ్దంబు గలిగించుచుండె. అంతఁ గుంతీసుతమధ్య
ముండు నిశితసాయకంబుల హయంబులపైఁ బఱపి వాని నల్పజీవితం
బులుగఁ జేసె. ఇట్లు వివ్వచ్చుం డుద్రేకించుచుండ సమయంబు నిరీక్షించి
ద్రోణపుత్త్రుండు వింటిగుణంబు దెగనేసె. అతిమానుషంబు నాద్రోణ
పుత్త్రుండుచేయు సాహసంబు గాంచి సురలెల్లరు మెచ్చుకొనిరి. భీష్మ
ద్రోణకర్ణకృపాదు లగుకురువీరులును "మేలుమేలని" ప్రశంసించిరి. అంత

నాచార్యసూతి శరంబులు నిగుడించి పార్థుహృదయంబు నొవ్వనేసె. దానికిఁ గిరీటిమందహాసంబుసల్పుచు మంజులనాదంబు గలనూతనమహార్ద్యం గాండీవంబునఁ గూర్చి యర్థచంద్ర బాణంబు సంధించి గజంబును మద గజంబు గవియునట్లు తాఁకె. ఏకవీరులగు నవ్వీరులకు మహాయుద్ధంబు ప్రవృత్తంబయ్యె. రోసంబులు మీఱ పౌరుషం బగ్గలంబుగఁ బోరు నయ్యశ్వత్థామకిరీటులయోధవరు లెల్లరు నాశ్చర్యంబునం జూచుచుండిరి. పురుషపుంగవు లగు నాయిరువురును నాశీవిషోపమంబు లగు బాణంబులఁ బోరిరి. పార్థుతూణీరంబు నక్షయ్యంబులగుట నెన్ని యమ్ములు నిగిడించి నను శరక్షయంబు కాకుండుట నర్జునుండు పర్వతంబుఁబోలి యచలుండై నిల్చియుండె. అశ్వత్థామ బాణంబుల నెగయుచుండుకొలంది క్షయంబు నొంది శూన్యంబులగుచుండుట నతనికంటె నర్జునుండు మిన్నయై యుండె.అయ్యవసరంబునఁ గర్ణుండు మహాచాపంబున గుణంబు సంధించి యాకర్షించి మౌర్వీనినదంబు గావించె. ధనురారోపణశబ్దంబు వినవచ్చు దెసకుఁ బార్థుండు దృష్టిసారించి రాధేయుం గాంచె. దాన నాతనికిఁ గోపం బగ్గలంబయ్యె. కోపించి యయ్యనఘుండు సూతపుత్త్రుమడియింపం దలంచి చూపుమరల్చి యాతనినే చూచెను. అవ్విధంబునఁ బాండవుండు విముఖుండగుడు త్వరితు లగునుద్యోగులు ద్రోణపుత్త్రునకు సాయకిం బులం దెచ్చియిచ్చిరి. ద్రోణపుత్త్రు విడిచి ధనంజయుండు కర్ణునిమీఁది కుఱికె కోపంబున జాజువాఱిన గనులుగిలిగి యాతనిం గవిసి యుద్ధంబు సేయుతలంపున నాతనితో నిట్లనియె.

### కర్ణాపయానము

"సూతపుత్త్ర ! సభాస్థలంబునఁ బలుపల్కులుపల్కుచు నాత్మశ్లాఘ గావించుకొంటివి. రణరంగంబునకు సరివారు లే రంటివి. నేఁడు దానికి సమయంబు దాపురించె. నేఁడు నాకెదురు నిల్చి బవరంబుసలిపి యాత్మ బలంబు నెఱిఁగి యన్యుల నవమానింపమానుదువు. ధర్మంబు దొలఁగి పరుషవాక్యంబులఁ బల్కవచ్చుఁగాని యట్లు రణంబు చేసి యరుల నిర్జింపవచ్చునే? నా కెదురుపడక నీపల్కుల నాతోఁ బోరి నిక్కంబు చేసి కొనుము. పాంచాలరాజపుత్త్రిని సభాంగణంబునఁ బరిభవింపంజూచిన దానికిఁ దగుఫలంబు నేఁ డనుభవింపుము. వాఁడు ధర్మపాశనిబద్ధుం

డగుచు నిన్నుఁగన్న యుష్ప్వార్థకోపంబును జవిగొనుము. వనవాసాయా
సంబునఁ బహుముఖాఁడేండ్లు గ్రుంచినదానికిఁ బ్రతిఫలంబు చేకొనుము.
రమ్ము. నాతోఁ దలపడి సంగరంబు గావింపుము. నీసైనికులగు నీకుర
బలంబులు ప్రేక్షకులై యుందురు." అన, దాని నాకర్ణించి యారాధే
యుండు పార్థునితో, "పార్థా! నోటిలో పల్కు కార్యంబుల క్రియా
రూపంబునఁ జూపుము. నీమాటలు మిగుల పెద్దలు. నీవు మున్ను
చేతకాక యూరకుంటివిగాని ధర్మంబున బద్ధుండవగుచు తూష్ణీంభావంబు
వహింపలేదు. నేఁడు నీపరాక్రమంబు దెలిసి నిక్కముగ నీవు ధర్మపాశ
గృహీతుఁడవై మిన్నకుంటివో, కాక శౌర్యంబులే కూరకుంటివో నిశ్చ
యింతును. ధర్మంబు నెఱింగి వనవాసంబు చరించి నాతోఁ బోర నుత్స
హించితివి. నీకు సాహాయ్యంబుఁ జేయఁగోరి యింద్రుం డెదురు నిల్చినను
నాకించుకంతయుఁ జలనంబు గలుగదు. నీకుఁ బెద్దకాలంబునుండి నాతోఁ
బోరఁ గోర్కెగలదు. దాని కనువగునట్లు నేఁడు రణంబు సల్పుము.
నాబలంబు నెఱుంగుము" అనియె. అంత నర్జునుండు కర్ణుం గాంచి,
"రాధేయా? ఇప్పుడేగదా నీవు రణంబున నాకెదురునిలువనోపక ప్రాణాశఁ
బలాయనంబు గావించితివి! దాన బ్రతికితివి. ఘోరకృత్యంబు నెఱపు నీసోద
రుండు మిత్తివాతఁజొచ్చె. నీవు దక్క సోదరుం జంపుకొని యొరు
లెవ్వార లిట్లు పలుక సాహసింతురు!" అని న్యక్కారించె. తనుత్రాణంబుఁ
బగుల్పంజాలు నిశితబాణంబులం బ్రయోగించుచు కవ్వడి కర్ణుం దాఁకె.
దానికిఁ గరంబలరి యంగరాజు వానినెల్లఁ బ్రతిగ్రహించె. నలుకెలంకు
లను శరవర్షంబులు గురియుచుండె. కర్ణుండు పార్థాశ్వంబుల నొప్పినేసి
హస్తావాపంబు దునియనేయఁ జూచుచుండెను. పార్థుండు దానికమర్షంబు
వూని యాతనియమ్ములఁ దెగనేసెను. కర్ణుండు తూర్ణంబ తూణీరంబు
నుండి వేఱొండమ్ము గొని పాండవమధ్యము హస్తంబున నేసె. అంత
నాతనిముష్టి విడువడియె. అంతఁ బార్థుండు కర్ణుధనువును ఛేదించె.
కర్ణుండు శక్తినిఁ బ్రయోగింప శరంబుల దానిని ముక్కలుగొట్టెను.
రాధేయు నంగరక్షకులు పార్థుం దాఁకిరి. వారల నాతఁడు యమగృహం
బున కతిథులగాఁ బంపె. పాండవుఁడు మిగుల బరువగు వాఁడియమ్ములఁ
గొని యాతనిహయంబుల నొవ్వనేసె. దాన నవి భూమిని వ్రాలి ప్రాణంబు

లకుం బాసె. ప్రజ్వరిల్లుశరంబు నొండుగొని కర్ణునురంబు నాట నేసె. అయ్యది యంగరాజుతనుత్రాణంబు భేదించి యాతనిగాత్రంబునం దాఁకె. దాన విగతసంజ్ఞుడై చైతన్యంబు లేక మిగుల బాధనొందుచు రణంబునకుఁ దొలంగి యుత్తరాభిముఖుండై పఱచె. అంత నర్జునుండు నుత్తరుండును వెల్లార్చిరి.

## అర్జునదుశ్శాసనాదియుద్ధము

అవ్విధంబున సూతసూతుం జయించి సూతుం జేరి కవ్వడి, "యీ తాళధ్వజంబు గానవచ్చు ననీకంబున శాంతనవుం డస్మద్వృద్ధ కాంక్షియై యుండు. ఆతనిదిక్కు తేరు పోని"మ్మని యానతిచ్చె.అంత రథనాగహయ సంకులం బగు మహాసైన్యంబుం గాంచి యుత్తరుం డిట్లనియె.—"వీర వరేణ్యా! నే నిఁకఁ ద్వదీయసూతకృత్యంబు సలుపనోప. నా ప్రాణంబులు మిగుల నలయికఁ జెందియున్నవి. మన్మానసంబు విహ్వలభావంబు నొందె. కురువులతోఁ బోరుచు నీనిగిడించు దివ్యాస్త్రంబులప్రభావంబున దశ దిక్కులును గలంగుచున్నట్లు దోఁచు. వసారుధిరమేదుపం బగుగంధం బున నే మూర్ఛఁగూర్కితిని. చూచుచుండ నామనంబు రెండు విధంబు లయ్యె. నేనిట్టి శూరసమాగమంబుగల బవరంబు గాంచియెఱుఁగ. గదా ఘాతంబులను, శంఖనిస్వనంబులను, సింహనాదంబులను, కరిబృంహితం బులను, వజ్రనిర్ఘోషంబుఁబోలు గాండీవజ్యాశబ్దంబునను, నా వీనులును స్మృతియు నశించెను. అగ్నిచక్రంబువోలె గాండివంబు గుడుసువఱచి యుండఁజూచు నాదృష్టి మిగుల సంచలించె. మదీయహృదయంబును వ్రక్కలైనట్లుండె. కోపించి రుద్రుంబోలి రణంబుగావించు నీశరీరంబు కరంబుప్పొంగు. చైతన్యంబుదక్కి బాణంబు సంధించుటయు, నేయు టయు, గుణంబు సారించుటయు నెఱుంగఁజాలకుందు. ప్రాణశక్తి యడంగుచున్నది. ఈధరావలయంబు గిరగిర దిరుగునట్లు దోఁచు. నీవా జులరశ్మలచేఁ బూని సారథ్యం బొనరింపనోప." ననిన దాని కయ్యర్జు నుం డిట్లనియె—"కుమార! భీతినొందకుము. ఆత్మను శాంచెము ధైర్య పఱుపుము. ధైర్యంబు చిక్కఁబట్టుము. రణరంగమున నీవు మానుష కర్మంబులఁ గావించితివి. జాతిచే క్షత్రియుండవు. మత్స్యనృపాలవంశా లంకారంబవు. నీవిట్లు విషాదంబు నొందఁదగదు. ధైర్యంబుఁబూని యర దంబున నిలిచి వాహనంబుల నడపుము. వైశంబ నాయరదంబు భీష్మసేనా

నాయకుఁ బ్రాపింపుము. యుద్ధంబున నే నీతని ధనుర్గుణంబు దెగనేయు
దును. దివ్యాస్త్రంబులఁ బ్రయోగించు నన్నును బాణంబులను మేఘం
బును మెఱుపును బోలె రిపులు గాంచఁగలరు. కురువీరులు సువర్ణపృష్ఠం
బగు గాండివంబుఁజూచి యియ్యది వామదక్షిణకరంబుల నెద్దాన నమ్రీ
కృతమని వితర్కింతురు. శోణితమును నుదకమును, నరదంబులను నావర్తం
బులును, నాగంబులను మకరంబులును, నగునరలోకప్రవాహిని యగు
నదినిఁ బ్రవహింపంజేయుదు. పాణిపాదశిరఃపృష్ఠ బహుశాఖలుగల
యిక్కురువనంబును నిశితసాయకంబుల ఛేదింతు. కురుసేనజయించు
నేకవీరుండ నగు నాకుఁ బావకునకుఁబోలె నూఱుమార్గంబులు చేకుఱు.
సైన్యంబును జక్రాకారంబున నిలువరించుటం జూడుము. నే నెఱింగిన
బాణకౌశలంబును నీకుఁ జూపువాఁడ. శమవిషమంబు లగునెడల సం
భ్రాంతి నొందక నిలిచియుండుము. భూనభోంతరముల సందిడక యాక్ర
మించియుండుశైలంబు నేని శరంబుల భేదింతును. తొల్లి యింద్రువచనం
బున పౌలోములను గాలకంజులను రణరంగంబున మడియించితిని.
శక్రునివలన దృఢముష్టిని, గమలయోనివలన హస్తలాఘవంబును, బ్రజా
పతివలనఁ జిత్రమగునపవిద్ధమును బొందియుండుదు. హిరణ్యపురవాసు
లగు రక్కసులు చండమారుతంబుచేఁ బోలె నాచే నామాపశిష్టులైరి.
ధ్వజవృక్షంబును, పదాతితృణంబును, రథికసింహగణంబును నగు కురు
వనంబును మదీయాస్త్రానలంబున దహియింతు. ఆయోధనంబు సలుపు
నవ్వీరులనెల్ల వజ్రపాణి యగు నింద్రుం డసురులంబోలె మడియింతు.
రుద్రుం బ్రసన్నుంజేసి రౌద్రాస్త్రంబును, వరుణువలన వారుణాస్త్రం
బును, అగ్నివలన నాగ్నేయాస్త్రంబును, వాయుదేవునిచే వాయవ్యాస్త్రం
బును, శక్రునివలన వజ్రంబును సంపాదించియుంటి. నరసింహరక్షితం
బగు నీధార్తరాష్ట్రవనంబును గాల్చివేయుదు. నీభయం బుడిపి
కొనుము.” అని పలికి ఇవ్విధంబునఁ గిరీటి యాశ్వాసింప, నవ్వైరాటి
భీష్మాభిరక్షితం బగు నారథబృందంబుఁ జొరంబారె. రణరంగంబునఁ
గురుకులంబు జయింపవచ్చిన విప్వచ్చుం గాంచి సుస్థిరుండై యాపగా
నందనుండు వారించె. ఆతని సమీపించి యర్జునుఁ డాతనిధ్వజంబు
విఱుగనేసి కలధౌతాగ్రంబు లగుశరంబుల నాతని నొప్పించె. దాన
నాతండు భూతలంబున కొఱగె. అవ్విధంబునఁ బెల్లురుకు గాండీవిని

మహాబలు లగు దుశ్శాసనవికర్ణదుస్సహవివింశతులు గవిసిరి. అట్లు వా
యర్జునుం జుట్టుముట్టి దుశ్శాసనుండు నిశితభల్లంబున నుత్తరువక్షంబునం
మఱియొండుభల్లంబున నర్జునుబాహ్వంతరంబున నొవ్వనేసె. అంత పార్థుండ
వాఁడియమ్ము వైచి యాతని కార్ముకంబు విఱుగనేసి యైదుబాణంబుల
నురంబు నాటనేసె. అంత నాతండు భీతిగదుర రణంబు దొలఁగిపోయె
ధృతరాష్ట్రపుత్త్రుం డగువికర్ణుండు తీక్ష్ణబాణంబుల నొప్పించె. అంత
నర్జునుం డొకయమ్మున నాతనిలలాటంబున నాట నాతండు మూర్ఛ
నొంది యరదంబునుండి భూమిపైఁబడియె. ఇయ్యవసరంబునఁ ద్వైతు
లగుచు దుస్సహవివింశతులు గవిసి సోదరుం గావఁదలంచి పార్థుపై నిశిత
శరంబులఁ బఱపిరి. పార్థుండు వాని కించుకయుఁ జలింప కొక్కయెడ
వారివాహనసూతుల మడియించె. రథంబులువిఱుగ భగ్నాంగులగు నా
ధృతరాష్ట్రపుత్త్రులు పర్వెత్తి యితరరథంబులనెక్కి యన్యపదాతులఁ
గూడి పఱచిరి. ఇవ్విధంబునఁ గిరీటి యపరాజితుండగుచు నలుదెసలు
దిరిగివచ్చె.

## అర్జున సంకులయుద్ధము

అంతఁ గౌరవబలంబునం గలమహావీరులెల్లరు నొక్క మొగంబై
యప్పార్థున కెదురు నిల్చిరి. అయ్యోధవరుండు నీహారంబునఁ బర్వతం
బులఁగప్పుచొప్పున నమ్మహారథులనెల్ల సాయకజాలంబులం గప్పె. కరిబృం
హితనాదంబులను, హయ హేషాధ్వానంబులను, భేరీశంఖనినదంబు
లను నాశరపాతశబ్దంబు విపులంబయ్యె. విభ్వచ్చుబాణంబులు గజగాత్రం
బులను హయశరీరంబులను దనుత్రాణంబులను ఛేదించి క్రిందఁబడు
చుండె. రణంబున శీఘ్రంబుగ శరంబులనేయు నాపాండుసూతి శర
త్కాలదివాకరుంబోలి యొప్పె. రథికవరులు రథంబులం దూఁకియు,
సాదులు వాజిపృష్ఠంబుల నవతరించియుఁ బర్వెత్తఁ దొడంగిరి. శరం
బుల ఛేదింపంబడు తామ్రాయసలోహంబులగు తనుత్రాణంబులశబ్దంబు
మిన్నుముట్టె. విగతజీవు లగు యోధులకళేబరంబుల నాయాయోధన
ప్రదేశంబు వ్యాకీర్ణం బయ్యె. విగతసంజ్ఞులై భువింబడిన గజాశ్వసాదులు
శితలబాణంబుల సంజ్ఞలంబడసి యరదంబుల నెక్కుచుండిరి. అయ్యా
యోధనంబున ధనంజయుండు క్రీడించుచున్నట్లుండె. వజ్రనిర్ఘోషం

బునుంబోలె గాండీవగుణరవం బాకర్ణించి శత్రుసేనానివహంబులు రణంబు దొఱఁగి పాఱె. రణాంగణంబున కుండలోష్ణీషయుక్తంబు లగు శిరంబులు గూలియుండె. శరచ్ఛిన్నంబు లగు గాత్రంబులను హస్తపాదాద్యవయవంబులను ధరావలయంబు గప్పఁబడియె. శరీరంబులం బాసి పడుశిరంబులు నేలంగూలుట పడగండ్లవానం బోలియుండె. పదుమూఁడు వత్సరంబులు కడగండ్లు గుడిచి మిగుల నాయాసంబు నొందుటకుఁ దగురీతి నవ్విధంబున రౌద్రంబుఁ జూపి క్రోధాగ్ని వర్షించుచు, ధార్తరాష్ట్ర సైన్యంబు వైన్యంబునొందించుచు విహరించుచుండె. అట్టి యర్జునున కెవ్వరును నెదురు నవక శాంతిల్లి యూరకుండిరి. ధార్తరాష్ట్రుండు చూచుచుండ సైనికులఁ బలాయితులంజేసి మహారథుల నుక్కడఁగించి శోణితజలంబుగల మహానదిం బ్రవర్తింపఁజేసి యాతండు మరలె. శోణితంబను నుదకంబును, నస్థిశకలములను శైవాలంబును, శరచాపంబులను నోడలును, శిరోజంబులను శాద్వలంబును, మదగజంబులను గూర్మంబులును, మేదోవసాసృక్ప్రవాహంబున మిగుల భయంకరంబును, శ్వాపదాభినాదితంబును, తీక్ష్ణశస్త్రంబులను మహామకరంబులును, చిత్రాలంకారంబులను బుద్బుదంబులును, శరసంఘములను నావర్తంబులును, మహారథంబులను ద్వీపంబులును గలిగి యాశోణితనది పార్థుచేఁ బ్రవర్తితయై పెద్ద నినదంబునఁ బ్రవహించె. బాణంబుల తూణీరంబులనుండి వెలికి దీయుటయు బాణాసనంబునఁబూన్చుటయు నేయుటయు నేరికిని గానరాదయ్యె.

అనంతరంబున దుర్యోధనుండును, గర్ణుండును, దుశ్శాసనుండును, వివింశతియును, ద్రోణుండు, నశ్వత్థామయుఁ, గృపుండును ధనంజయు మడియించుకోరిక బద్ధపరికరులగుచు ధనువుల నాస్ఫోటించుచు మరలఁ గవిసిరి. ఆదిత్యవర్ణం బగునరదంబున వానరకేతువు దనర గాండీవి వారల కెదిర నిలిచె. కృపకర్ణద్రోణాదులు మహాస్త్రంబులం గప్పిరి. వర్షకాల మేఘంబులంబోలి శరంబులం గురిసిరి. అవ్విధంబున శరకీర్ణుం డగు నాతని గాత్రంబున రెండంగుళంబుల యంతరంబును గానరాదయ్యె. అంత నవ్వీరప్రవరుండు నవ్వుచు నైంద్రాస్త్రంబు గాండీవంబున సంధించి కురువీరులనెల్ల ముంచె. మేఘంబున మెఱుమును బర్వతంబున పీతహోత్రునిఁ బోలి యాతనిచేతఁ గాండీవం బలరె. విద్యుద్విరాజితాంబరంబున

మేఘంబు వర్షించునట్లు గాండీవంబుల నలుదెసల వెలిగించుచు బాణం బులం గురియుచుండె. రథికులును గజంబులు మోహావిష్టులైరి. శాంతి పరులై యయోధులు తమతమ మానసంబుల మఱచిరి. వారెల్లరును నిశ్చేతనులై సంగ్రామవిముఖులైరి. ఇవ్విధంబున భయంబుగదుర నాకురు బలంబులు జీవపరాయణంబులగుచు దిక్కులకుం బఱచె.

### భీష్మాపయానము

ఇవ్విధంబున యోధులు పలాయితులగుచుండ శాంతనవుండును గురుపితామహుండును నగు గాంగేయుండు జాతహాసపరిష్కృతం బగు దృఢకార్ముకంబుఁ బూని యర్జునుం బాఁకె. నిశితశరంబులం బూని పాండురాత పత్రంబున నొప్పారుచు సూర్యోదయంబునఁ బర్వతంబుంబోలి యయ్యు నఘుం డొప్పె. శంఖంబుఁ బూరించుచు ధార్తరాష్ట్రుల హర్షింపం జేయుచుఁ బ్రదక్షిణక్రమంబున సమీపించి పార్థు వారించె. అట్లు చేరవచ్చుపితామహుం గాంచి పార్థుం డెదిరి దాఁకె. గాంగేయుం డెని మిది శరంబులఁ గీలించి యింద్రసూతిధ్వజంబు నేసె. ఆబాణంబులు ధ్వజాగ్రంబున నుండుచున్నవానరుం బ్రహరించెను. ధ్వజాగ్రమున నుండు నాబాణంబులఁ బ్రతిసాయకంబుల వారించి పృథుధార యగు భల్లంబునఁ బితామహుచ్ఛత్రంబు ఛేదింప నయ్యది నేలంగూలె. అంతం బోక కౌంతేయుండు మఱికొన్ని వాడితూపులధ్వజంబును రథవాహంబు లను నంగరక్షకులను, సూతును నొవ్వనేసె. ఆతని యాకరలాఘవంబు నెఱింగియుండియు సహింపనోపక యొకదివ్యాస్త్రంబున నాతనిశరీరంబు గాఁడనేసె. పాండవుండును నదీసుతుపై వేఱొండుదివ్యాస్త్రంబు పఱపె. అవ్విధంబున బలివాసవులంబోలి యయ్యిరువురు సంగరంబుచేయఁ బోరు ఘోరంబయ్యె. కురుయోధులెల్లరు సైనికులంగూడి యాయోధనంబు చూచుచుండిరి. భీష్మార్జునులభల్లంబులు భల్లంబులంగూడి వర్షకాలం బున ఖద్యోతంబులంబోలి యంబరతలంబునఁ బ్రకాశించె. సవ్యాప సవ్యహస్తంబుల బాణాసనంబు నాకర్షించి శరంబులం గురియుటం గాండీవంబు వహ్నిచక్రంబుంబోలె వర్తులమ్మై గానవచ్చుచుండె. మేఘంబు జలధారలఁ గప్పుచాడ్పునఁ బార్థుండు బాణజాలంబుల భీష్ముం గప్పె. భీష్ముండు ప్రతిశరంబుల నవ్విశిఖవృష్టి వారించె. అంత హేమ

పుంఖంబులగు శరంబులు పార్థు నరదంబునుండి శలభంబులుంబోలె బయ ల్వెడల భీష్ముండు వానినిగూడ నడంచె. ఇయ్యది గాంచి కురుబలంబు లెల్ల భీష్ము మెచ్చుకొనిరి. బలవంతుండును, యౌవనశాలియు, దక్షుం డును, క్షిప్రకారియు నగుపార్థున కెదురు నిల్చి పితామహుండును, గృష్ణుండును, నాచార్యుండును దక్క యన్యు లెవ్వరు పోరఁగలరని ప్రశంసించుచుండిరి. అవ్వీరు లస్త్రంబుల నస్త్రంబులవారించుచు భూతం బులకు మోహంబు గలిగించుచుఁ, బ్రాజాపత్యంబును, నైంద్రంబును, వాగ్నేయంబును, రౌద్రంబును, కౌబేరంబును, వారుణంబును, యామ్యంబును, వాయవ్యంబును మొదలుగాఁగలయస్త్రంబులఁ బ్రయో గించుచు సమరంబున విహరించుచుండిరి. అవ్వీరులంగాంచి భూతంబు లచ్చెరువంది, 'మేలు మేలు, పార్థా! మనుష్యులపై నిట్టిమహాస్త్రసంప్ర యోగంబు యుక్తంబుగాదు.' అని వచించుచుండెను.

ఇవ్విధంబున వారివువు నస్త్రయుద్ధంబు నిర్వర్తించి శరయుద్ధంబు నారంభించిరి. అంత జిష్ణుండు క్షురధారం బగుశరంబున జాతరూప మయం బగు భీష్ము కార్ముకంబు దునియనేసె.నిమిషాంతరంబున గాంగేయుం డన్యబాణాసనంబు చేకొని సజ్యంబుగావించి కుపితుండై పలుతూపుల ధనంజయుపైఁ బఱపె. అర్జునుండు నిశితశిలీముఖంబుల నతనిపైఁ బఱపె. అవ్విధంబున నొండొరులశరంబుల వారించు నవ్వీరులయంతరం బేమియు నెఱుకఁబడదయ్యె. అంత పాండవుండు శరజాలంబున దశ దిక్కులఁ బ్రతిరోధించె. పితామహుండును నట్లు దిగ్బంధంబు గావించె. గాంగేయు పార్థుండును బార్థు గాంగేయుండును నతిక్రమించుచుండిరి. భీష్మరథరక్షకులు పాండవశరంబుల హతులై పార్థురథంబుకడ శయనించి యుండిరి. గాండివనిర్ముక్తంబులును, శ్వేతపత్రంబులును, మేఘుపుంఖంబు లును నగు నర్జునసాయకంబు లంబరతలంబున నంచలపిండుబోలె రాజిల్లెను. అవ్విధంబున దివ్యాస్త్రంబు ప్రయోగించు నయ్యర్జునునైపు ణ్యంబు నంబరతలంబున నిల్చియుండు సురలెల్లరును మెచ్చుచుండిరి. దానిం గాంచి చిత్రసేనుండను గంధర్వరాజు మిక్కిలి ప్రియంబునొంది, "దేవా!చూడుమియ్యస్త్రంబుల. పార్థనిర్ముక్తంబు లగుశరంబులు పరస్పరా లింగనంబు చేసికొన్న వానింబోలె పాఱుచున్నవి. ఇట్టి యస్త్రంబు మను ష్యులకు దుర్లభంబు. పార్థుండు బాణంబు చేకొంటకు, బాణాసనంబునఁ

గిలించుటకు, విడుచుటకు నంతరం బింతయుఁ గానరాదు. మధ్యందినం బున మండుచున్న సూర్యునట్లు సమరంబునఁ బార్థు నరాతులు వీక్షింపం జాలరు. అట్టుల గాంగేయుంగూడఁ దేరిచూడంజాలరు. ఇయ్యిరువురును మేటిమగలు. సమాన శౌర్యనైపుణ్యంబు గలవారు.సమరదుర్జయులు." అని దేవరాజునకుఁ బార్థపితామహసమాగమంబు నెఱింగించి, పుష్పవర్షంబు గురిసె. అంత శాంతనవుండు ప్రతిశరంబుల నిగుడ్చు నర్జును వామ పార్శ్వంబునం గొట్టె. దానికి నవ్వి వివ్వచ్చుండు గార్ధపత్రం బగుబాణం బున నాతనిశరాసనంబు తునియ నేసి దశశరంబుల నాతని స్తనాంతరం బునఁ బ్రహరించె. అంతఁ గాంగేయుండు పీడితుఁడగుచు రథకూబ రంబుం జేరి క్రొవ్విదప్పి పెద్దకాలంబుండె విసంజ్ఞుం డగు నమ్మహావీరు నాదేశంబుచేసికు రథసూతుండు రక్షించుటకై మఱియొండు దెసకుం దోకొనిపోయె.

### దుర్యోధన పలాయనము

అవ్విధంబున గాంగేయుండు సమరంబు విడిచి తొలంగుడు, సుయోధనుండు ధనువొండు చేఁబూని యర్జును నెదిర్చి యాకర్ణంబుగ నారిమోపెట్టి యొకనిశితభల్లంబు నిగుడ్చి శత్రుగణంబులనడుమ వీర విహారంబుసలుపు నవ్వీరునుదుట నాటె. అయ్యేటుపడిన యర్జునులలాట భాగంబునుండి వేడిరక్తంబు చొటచొటకాఱె. బాణాభిహతుండై యామేటిజోదు కోపం బగ్గలంబుగ విషాగ్నికల్పంబు లగు బాణంబున రారాజు నేసె. దుర్యోధనుండు పార్థునేయుచుండ నాతండు దుర్యోధను నేయుచుండె. ఇవ్విధంబున నాయిరువురును జయంబుఁ గోరుచు బిఱుతివి యక పోరుచుండిరి. అంత వికర్ణుండు నడగొండంబోలి నాగంబు నెక్కి నలుగురురౌతులు తురంగమంబుల నధిరోహించి గజంబు నాల్గుపాదం బులు రక్షించుచుండ నర్జునుం దాఁకె. మీఁదికివచ్చు నగ్గజేంద్రంబుం దూరంబునం గాంచి యాకర్ణపూర్ణంబగుసాయకంబునఁ బడ నేసె. వజ్రంబు పర్వతంబుచొచ్చుచాడ్పునఁ బర్వభాగంబునుండి యవ్వాఁడి ములుగు కుంభగర్భంబుచొచ్చె. శరపీడితంబగుచు నగ్గజంబు గాత్రంబు కంపింప నేలంగూలె. ఏనుంగు పీనుంగుగా వికర్ణుండు భయంబున నెని మిదిపదములు వెనుకకుంజని వివింశతియరదంబు నధిరోహించె. నాగంబు

నిశితభల్లంబునఁ గూలనేసి యట్టిబాణంబునే దుర్యోధనువక్షంబు భేదించె. గజంబును, రాజును, బాష్పవ్యాప్తులంగూడి వికర్ణుండును బరాఙ్ముఖు లగుడు యోధులెల్లరును బర్వెత్తిరి పార్థుండు గజంబుఁ గూలనేయు టయు, యోధులు పలాయితులగుటయు నాకర్ణించి సుయోధనుం డరదంబు నెక్కి పఱచె. బాణభిన్నాంగుండై రుధిరంబు గ్రక్కుచు యుద్ధంబు నకుం బాసి పాఱు నక్కురురాజు నర్జునుండు యుద్ధంబుచేయ నాస్ఫోటించె. "కౌరవ రాజా! విపులమగుకీర్తిని జాఱవిడిచి యుద్ధంబు దొలంగి పాఱెదవేల? నీతూర్యస్వనంబు లింక వ్రేయలేదే. రాజ్యభ్రష్టుం డగు యుధిష్ఠిరమహారాజు నాజ్ఞాకారులఁ ధృతియుండ. ఇట్టి నేఁ బవరంబునకుఁ జేరుచుండ మోము ద్రిప్పికొందువేల? తొల్లి నీకావించిన దుర్వృత్తంబుఁ దలంపుము. నిక్కంబుగఁ గదనరంగంబుం బాసి తొలంగు నీవు దుర్యోధనంబు వ్యర్థము గావించితివి? నీకు మున్నగాని, పృష్ఠభాగంబునం గాని రక్షకుల నేరినింగాన. ప్రాణంబులు తీపుగదా! పొమ్ము. కుంతీపుత్రునుండి యాత్మరక్షగావించుకొనఁ బలాయనంబొనర్చి పొమ్ము." అనియె.

## అర్జున యుద్ధనివర్తనము

అవ్విధంబున మహానుభావుం డగు పాండవమధ్యముండు యుద్ధంబునకుఁ బిలువ నంకుశంబున మరలింపఁబడిన యేనుఁగుచాడ్పున రారాజు మరల యుద్ధాభిముఖుండయ్యె. మహాభిమానుం డగు నయ్యధిపతి పాదతలాభిమృష్టం బగు భోగిచందంబున నరదంబు మరల్చె. పుడమితేఁ డట్లు మరలుటఁగాంచి రాధేయుండును ధైర్యంబు చిక్కఁబట్టి దుర్యోధనున కుత్తరభాగంబున నిల్చె. మహారథుం డగు భీష్ముం డదియంతయుం గాంచి యాతనిపృష్ఠభాగంబునఁ బార్థువలని భయంబుగలుగకుండ రక్షించుచుండె. ద్రోణాచార్యుండును, కృపుండును, వివింశతియు, దుశ్శాసనుండును మున్నగునెల్లరు త్వరితహృదయులగుచు కురురాజు ముందు నిలిచిరి. అవ్విధంబున మరలు సాగరంబువలెనున్న యాసైన్యంబు గాంచి యర్జునుండు హంస మేఘమాలికనుబోలె మీఁదఁబడెను. అంత నవ్వీరులు మహాయుధంబులంగొని పార్థు వారించుచు భూధరంబు నంబుధరమాలికలు ముంచువడువున శరంబుల ముంచిరి. కురువీరుల

యస్త్రంబులఁ బ్రత్యస్త్రంబుల వారించుచు నాకొంతే యుండు సంమోహానం బను నవారణీయాస్త్రంబును, వరుణదేవతాకంబును బ్రయోగించె. హాఁడియమ్ముల దిగ్విదిక్కుల నల్లలనాడించుచు గాండీవరవంబున వారల మనంబుల భయకంపితంబులఁగాఁ జేసె. మఱియు భీమరవం బగు పాంచజన్యంబును హాస్తంబులంబట్టి పూరించె. ఆశంఖనాదంబున గురుప్రవీరులు సమ్మోహితులై చాపంబులవీడి తలలువాల్చి చెయిదములఁదక్కి శాంతిపరులైరి.

అవ్విధంబునఁ గురువీరులెల్లగు విసంజ్ఞులగుడుఁ బార్థుండు బొమ్మపొత్తికలకుఁ జీరలు తెండను నుత్తరవాక్యంబులం దలంచి మత్స్యపుత్త్రుం జేరి "కుమార! ఆచార్యశారద్వతులు చుట్టిన తలచీర శుక్లవర్ణంబు. రాధేయు శిరోంబరంబు పీతవర్ణంబు. ద్రోణపుత్త్రుండును, రారాజును జుట్టినవస్త్రంబులు నీలవర్ణంబులు. పగ్గంబుల ముడిచి యరదంబుడగ్గి వీనిం గొనిరమ్ము. భీష్ముండియ్యస్త్రంబునకు ప్రతీకారంబు నెఱుంగుం గావున నాతండు విసంజ్ఞుండుగాఁడు. ఈతని సవ్యపార్శ్వంబున నశ్వంబు లుండునట్లు రథంబు నిలుపుము" అని యానతిచ్చె. అంత నుత్తరుండు పగ్గంబుల నొగలముడిచి రథంబుడిగ్గి యమ్మహావీరుల తలచీరలఁ జేకొనితూర్ణంబ మరల నరదంబెక్కె. అనంతరంబు చతురుం డగు నవ్విరాటసూతి యయ్యగ్యంబులశాసింప నా శ్వేతవాజులు రణమధ్యంబునుండి యాధిక బలంబునకు నర్జునుం గొంపోయె. అవ్విధంబునవచ్చు విభ్వచ్చుంగాంచి గాంగేయుండు మిక్కిలి త్వరితుండగుచు శరంబుల నిలువరించె. పార్థుండు శాంతనవుహయంబులజంపి యాతనిఁ బదిబాణంబులనొప్పించి యామహానీయు విడిచిపుచ్చి రథబృందమధ్యంబుబాసి మేఘమండలంబు వెడలి ప్రకాశించుసూర్యుంబోలి వెలుఁగొందుచుండె. సుయోధనుండును, దక్కంగలవీరవర్యులును జైతన్యంబునొందియుండ దుర్యోధనుండును రణంబున నొంటి విహరించుపార్థుం గాంచి త్వరితహృదయుం డగుచు "ఈతం డెవ్విధంబున మీ చేతులకుం దప్పె? ఈతండు తప్పించుకొనిపోకుండునట్లు ప్రయత్నంబు సలుపుఁడు" అని యాజ్ఞాపించె. దాని విని గాంగేయుం డపహాసంబుగావించి, "సుయోధనా! నీబుద్ధి యేటికిఁ బోయె? నీవీర్యం బేమయ్యె? పార్థప్రయుక్తంబగు బాణబలంబున నందఱు ముగ్ధులై బాణంబుల ధనువులఁ జాఱవిడిచి యంగంబులం దెలియనేరక

తెలివిదొఱంగి శాంతినొందియుండిరి. ఈబీభత్సుండు నృశంసంబు జేయం
జాలియు దయదలంచి త్రైలోక్య కారణంబున స్వధర్మంబు పుడువనోడి
యెవరికి నపాయంబుగావింపక తలచీరలమాత్రము చేకొనియె. కావున
నోకురురాజా! మరల నాతనితో సంగరంబునకుఁ బూనక బుద్ధిశాలివై
కురుదేశంబులకుఁ బొమ్ము. పార్థుండును జయంబుచేకొని గోవుల మర
లించి పోవుఁగాక. మరల మోహంబున నీస్వార్థంబు చెడకుండునట్లు
చూచుకొనుము.” అని హితంబు గఱపె.

అవ్విధంబునఁ బితామహుండు పలుక [illegible]ణంబున నమర్షం బధికం
బుగ నున్నను గార్యంబుగానక యాత్మహితం బగు పితామహవాక్యం
బులం గొని నిశ్వసించి మిన్నకుండె. ఆభీష్మవాక్యంబు నాలకించి హితం
బని తలంచి ధనంజయాగ్ని ప్రజ్వరిల్లుటం గాంచి దుర్యోధను రక్షిం
చుచు నెల్లరు మరలం దలంచిరి. అవ్విధంబున నగరంబునకు మరలు
నవ్వీరులం గాంచి పార్థుండు మిగుల హృష్టచిత్తుండగుచు ననునయంబు
పలుకం దలంచి పితామహుం డగు శాంతనవునకు వృద్ధుం డగు ద్రోణు
నకు, గురునకు, నశ్వత్థామకు, మాన్యులగు కురువీరులకు, విచిత్రశరం
బుల నభివాదన సత్కారంబు గావించి యుత్తమరత్నచిత్రితంబగు
దుర్యోధనుమకుటంబు బాణంబునఁ బగులనేసె. అవ్విధంబున మాన్యుల
నెల్ల నామంత్రించి గాండీవఘోషంబున లోకంబుల నినాదబహుళం
బులుగావించి, దేవదత్తంబు పూరించి యరులమానసంబుల ప్రక్కలు
గావించి ధ్వజంబున శాత్రవులఁ బరాభవించి కురువీరులు ప్రతినివృత్తు
లగుటకు సంతసించి “కౌరవులు పరాజితులైరి. భవదీయగోగణంబులు
జయింపంబడియె. అశ్వంబుల మరల్పుము. ప్రహృష్టుండ వగుచుఁ బురం
బునకుఁ బొమ్ము.” అని యాదేశించె. దేవతలును గౌరవులకు ఫల్గునుతో
సంఘటిల్లిన యుద్ధంబు పరికించి యందుఁ బార్థుండు గావించిన విచిత్ర
కర్మంబులఁ దలంచుచు స్వగృహంబులం జేరిరి.

### ఉత్తరాగమనము

సంగ్రామరంగంబునఁ గురువీరుల జయించి యాపురుషసింహుండు
విరాటుగోధనంబు దెచ్చెను. ధార్తరాష్ట్రులు రణపరాజితులై కరినగరం
బునకు మరలిపోవఁ బెక్కుమంది కురుసైనికులు గహనంబు వెలువడి

భయంబునఁ గలతపడిన మనంబులతో నొకరినొకరు వచ్చి కలియుచు ముక్తకేశులును, ప్రాంజలులును, ఉత్సృష్టాసనధులును, విచేష్టులును, విచేతస్కులును నగుచు నయ్యోధులు ప్రాంజలులగుచుఁ బార్థుం జేరి "నీకడ నేమిచేయువారము. సెలవిచ్చి కింకరులగు మావలనఁ బని గొ"మ్మని ప్రార్థించిరి. దానికిఁ గరం బలరి యర్జునుండు, "మీకు శుభం బగుగాక! పొండు మీరు భయంబు నొందవలదు. నే నార్తుల నెన్నఁడును బాధింపను. మిమ్ముల నాశ్వాసింతు" నని యూరడించె. అయ్యనఘుని యభయప్రదానంబు నాలకించి యోధులెల్లనుఁ జేరి కీర్తికరంబులగు నాశీస్సుల నాతని నభినందించిరి. శత్రులఁ బరాభవించి విరాటరాష్ట్రాభిముఖుండగుచు బోవు నప్పార్థు ననుసరింపనేరక సెలవందిపోయిరి.

శత్రుగణంబుల వోలి పురంబుదెస మరలి యర్జునుం డుత్తరుం జేరి, "రాజపుత్త్రా! మీతండ్రికొలువునఁ బార్థులెల్లరును మాఱువేసంబున నివసించియున్నారనుట నీకును విదితంబే. అవ్విధంబున రాజున కొక్కమ్మడి నెఱింగించిన నాతండు భయంబునఁ జీకాకుపడును. కావునఁ జెప్పవలదు. కురుసైన్యంబును గెల్చి గోధనంబుల నేనే మరల్చితినని యావిజయంబు నాత్మకార్యంబుగాఁ జెప్పుకొనుము." అని పలికె. దానికుత్తరుండు "వీరాగ్రేసరా! నిక్కముగ నీవు గావించినకర్మ మమానుషము. దానిం జేయుటకు నామనంబునకును శక్తిచాలదు. ఐనను నీవు గోరుచుంటివిగావున మత్పితృసమక్షంబున నీయనుజ్ఞవడయు నంతకు నివ్విషయంబు డాచియుంతు" నని వాకొనియె. శత్రుసేనల భంగించి గోగణంబులఁ గైకొని యప్పార్థుండు శ్మశానంబుఁజేరి శమీవృక్షంబు సమీపించె. అంత నగ్నితుల్యం బగు నాకపిధ్వజంబు భూతసంఘంబుతో నంతర్ధానంబుఁజెందె. మరల సింహధ్వజంబు నెలకొల్పఁబడియె. శరశరాసనంబుల నెప్పటివలె నాశమీవృక్షంబున నిల్పి యర్జునుఁడు సారథియై యరదంబుగడప నవ్వీరుండు మిగుల హర్షంబుఁజెంది రథికుండయ్యె. పార్థుండు వేణిబంధనంబు గావించుకొని హయంబుల రశ్ముల గ్రహించె. బృహన్నలారూపంబున సారథియై యొప్పె. కౌరవు లెల్లరు భంగంబు నొంది దైన్యంబున హస్తిపురికిఁ బోయిరి. పార్థుండు రాజపుత్త్రుం గాంచి, "కుమార! గోపాలకులతో గోధనంబు లెల్లను బ్రతినివృత్తంబు లయ్యె. కావున మన మపరాహ్ణంబునఁ బురంబు చేరుదము. ఈహయంబులకు

విశ్రాంతిగలిగించి జలంబులం గ్రోలంజేసి విశ్రమింతము. గోపాలకులు త్వరితగమనంబునం జని నగరంబున భవదీయజయంబు సుద్ఘోషింపవలయును. వారలం బుచ్చుము" అని యాదేశించె. అంత నుత్తరుండు త్వరితహృదయుండగుచు ఫల్గునువచనంబుల దూతలంజేరి, "నగరంబుం జేరి యనిశత్రులు పరాజితులైరనియు, గోధనంబులు నివర్తింపఁబడె ననియుఁ దెల్పుఁడు" అని యాజ్ఞాపించె. ఇవ్విధంబున నవ్వీరులు శమీవృక్షంబున నాయుధభాండంబు నుంచిరి. శత్రుల జయించి శత్రుహస్తంబునుండి ధనంబునంతయుఁ జేకొని బృహన్నళాసారథియై యయ్యుత్తరుండు పురాభిముఖుండై నడిచె.

## విరాటోత్తర సంవాదము

విరటభూకాంతుండును సుశర్మం జయించి గోధనంబు చేకొని పాండుపుత్త్రులంగూడి మత్స్యనగరంబుచేరె. పాండవులఁగూడి కొలువు తీరియుండఁ బౌరవృద్ధులు బ్రాహ్మణులు మున్నగువా రాతని గారవించి విజయంబు నభినందించిరి. అనంతరం బమ్మహారాజు వారల నామంత్రించి యుత్తరుం డెచటికేఁగెనని ప్రశ్నించె. అటనుండు కన్యలును, స్త్రీలును, నంతఃపురచారులును, కౌరవులు గోధనంబు నాక్రమింప భీష్మద్రోణకర్ణదుర్యోధనకృపాశ్వత్థామలంగూడి వచ్చిరనియు, వారల జయించి గోధనంబు నివర్తింప భూమింజయుం డొక్కరుండ బృహన్నళాసహాయుం డగుచు నేఁగెననియు నెఱింగించిరి. భూమింజయుండు బృహన్నళను సారథిగాఁగొని యొక్కయరదంబున నేఁగెనని విని మిక్కిలి పరితపించి మంత్రిముఖ్యులఁ జేరి యిట్లనియె. "కౌరవులును, నితరరాజన్యులును మనము త్రిగర్తులం జయించివచ్చితిమని యెఱింగి నిలువనోపరు. కావునఁ ద్రిగర్తులచే నేటువడకఁ దక్కినయోధవరు లెల్లరు నుత్తరుసహాయార్థం బరుగవలయు." అని యాజ్ఞాపించి యశ్వంబుల గజంబుల రథంబుల పదాతివర్గంబుల సుతునిసాహాయ్యార్థంబు బయలుదేర్చెను. మఱియు నమ్మానవపతి "షండుండు సారథిగాఁగలకుమారుండు జీవంబులతో నున్నదియు లేనిదియు వైళంబ యెఱుంగుఁ"డని యాజ్ఞాపించుచుండె. అవ్విధంబున పృథివీశ్వరుండు మిక్కిలి భయంబునొందియుండ ధర్మరాజు దరహాసంబుచేయుచు, "బృహన్నళయే సారథియైయున్న నేఁడు నిక్కం

బుగ నరాతులు నీగోధనంబులం గైకొనం జాలరు. కౌరవులతోఁగూడి యున్న సకలరాజన్యులను, దేవాసుర సిద్ధయక్షసంఘంబులనైనను నీ కుమారుండు జయింపవలంతి హితుం డగుసారథి నాతండు సకలకార్యంబులం జక్కఁ బఱచు” అని ధైర్యంబు చెప్పె. అయ్యవసరంబున సుత్తరుండు పంచినదూతలు శీఘ్రగమనంబున విరటనగరంబుచొచ్చి విజయంబు నెఱింగించిరి. మంత్రివర్యుండు కౌరవుల నోర్చి గోవులమరల్చి యుత్తరుండు మగిడివచ్చుచుండెనని రాజున కెఱింగించె. అంత యుధిష్ఠిరుండు, “గోవుల నిర్జించి కౌరవబలంబులం బలాయితులం జేసివచ్చుచుండుట యదృష్టచిహ్నంబు. కాని, బృహన్నల సారథిగానుండ నాతండు కురులం జయించుట యద్భుతం బనిమాత్రము తలంపఁజాలను” అని వాకొనియె.

అంత విరటభూకాంతుండు మిగుల సంతుష్టచిత్తుండగుచు రోమహర్షంబు చెలంగఁ గుమారవిజయంబు నాకర్ణించి యవ్విజయవార్త నెఱింగించినదూతల కనకాంబరంబుల నాచ్ఛాదించి మంత్రులం బిలిచి “రాజమార్గంబుఁ బతాకాదుల నలంకరింపుఁడు. దేవతలెల్లరును బుష్పోపహారాదుల నర్చింపఁబడవలయును. కుమారులును, యోధముఖ్యులును, గణికలును నలంకరించుకొని మంగళవాదిత్రంబులఘోషంబు నెలంగ నాకుమారు నెదుర్కొనవలయు. వైళంబ ఘంటధరియించి యొకమానవుండు మదగజేంద్రంబు నధిరోహించి చతుష్పథంబుల భూమింజయు విజయంబు ఘోషింపవలయు. ఉత్తరయు శృంగార మగువేషంబుల నలంకరణంబులం దాల్చి పలువురుకుమారికలంగూడి భూమింజయున కెదురు చనవలయు.” అని యాజ్ఞాపించె.

నరపతియాజ్ఞ ననుసరించి భేరీమృదంగాదిమంగళవాద్యంబులును, బ్రమదాజనంబును, మాగధులును, నాందీపణవాదులును రమణచెలంగఁ బురంబునుండి కుమారు నెదుర్కొన వెలువడియె. సైన్యంబులను, గన్యాజనంబులను, సలంకృత లగువేశ్యలను బయలుదేర్చి యవ్విరటభూపాలుండు మిగుల సంతుష్టుండగుచు “సైరంధ్రీ! అక్షంబులం గొని రమ్ము. కంకభట్టా! ద్యూతక్రీడ నెఱపుము.” అని యానతిచ్చె. అవ్విధంబునఁ బలుకు నారాజన్యుం గాంచి పాండవజ్యేష్ఠుం డిట్లనియె.

"ప్రహృష్టచిత్తుం డగుద్యూతకారునితో నక్షక్రీడ నెఱప రాజని
శాస్త్రం బెఱింగించుచున్నది. కావునఁ బ్రహృష్టుండ వగు నీతో నేఁ
జూదం బుపచరింపంజాల. ద్యూతక్రీడ జరుగవలయు నని నీ కున్నచో
నీకే ప్రియంబు సేయువాఁడ." అన, దాని విని విరాటుండు, "స్త్రీలును
గోగణంబులును, హిరణ్యంబును దక్కుంగల ధనసంచయంబును బణం
బుగా నొడ్డఁబడును. ఎయ్యదియు నొడ్డక మిగుల్పను." అని వాకొనియె.
అంత గంకుండు "రాజేంద్ర! బహుదోషయుక్తం బగుద్యూతంబు
నెఱప నేల? దాన బహుప్రత్యవాయంబులు గలవుగాన నయ్యది దోషం
గుము. నీవును వినియేయుందువు. పాండవజ్యేష్ఠుం డగు యుధిష్ఠిరుండు
ధనధాన్యసమృద్ధం బగు రాజ్యంబును, సురలంబోలు సోదరులను ద్యూతం
బున నోడిపోయె. కావున ద్యూతక్రీడ నా కభిమతంబుగాదు. కాని
నీ కభిమతంబయ్యె నేని ద్యూతక్రీడ నెఱపుదము." అని యుత్తరంబిచ్చె.

అక్షక్రీడ ప్రవృత్తంబగుడు మత్స్యనృపతి పాండవాగ్రజుం
జూచి, "చూచితివా! కంకభట్టా! మదీయపుత్రుండు దండిమగ లగుకౌర
వ్యుల నోర్చె" అనిపలికె. మహాత్ముండగు నయ్యుధిష్ఠిరుండు, "బృహన్నళ
సారథియైయుండ నాతం డేల విజయంబు చేకొనఁ" డని వాకొనియె.
దానఁ గుపితుండగుచు మానవపతి, "ఓ బ్రాహ్మణాధమా! షండు నొక
డని మత్పుత్రతుల్యుఁగాఁ బ్రశంసించుచుంటివి. నిక్కంబుగ నీకు
వాచ్యావాచ్యంబులు తెలియంబడవు. నన్నుం దిరస్కరించి పలుకుచుం
టివి. భీష్మద్రోణప్రముఖు లగు వీరవరుల మత్పుత్రుం డేల జయింపం
జాలఁడు? నీవు మిత్త్రుండవు గావున నియ్యపరాధంబు క్షమియించితిని.
నిజముగ నీకు జీవితేచ్ఛగలదేని మరల నిట్టివాక్యంబులు పలుకరాదు."
అని తర్జించె. అంత ధర్మసూతి, "భీష్ముండును గుంభసంభవుండును ద్రోణ
పుత్త్రుండును రాధేయుండును శారద్వతుండును గలయమ్మహాసైన్యంబు
సురసహాయ్యుం డగు నింద్రుండును జయింపనోడు. కాని బృహన్నల
మాత్రము నిరుపమానబాహుబలంబుగలదగుట వారి కెదురునిల్చి పోరం
గలదు. అట్టి సాహాయ్యసంపద గల నీపుత్రుండు వారలం జయించుట
యద్భుతంబు గాఁజాలదు." అని మరల బృహన్నలం బ్రశంసించె. దానికి
విరటుండు కటకటంబడి, "పెక్కుసారులు ప్రతిషిద్ధుండ వగుచు మాట
మానకుందువు. నియమించువారు లేకున్న నెవ్వరును ధర్మంబు నాచ

రింపరు." అని యాక్రోశించుచు నాతని సహంబుల మోమునం బ్రతా
డించె. బలముగాం దాడింపంబడిన యాతనినాసికాగ్రమునుండి బొట
బొట మని శోణితంబు గాఱంజొచ్చె. అంత సమ్మహానియుండు రుధిరంబు
భూమిం దొఱంగకమున్న హస్తంబునంబట్టి పార్శ్వంబుననున్న ద్రౌపదిం
గాంచె. అద్దేవియు నాతని యింగితంబు నెఱింగి జలపూర్ణం బగు సౌవర్ణ
పాత్రంబుదెచ్చి నాసికనుండి జాఱుశోణితంబు నందుం బ్రతిగ్రహించె.

అంతం బౌరులు వివిధకుసుమంబుల నక్షతలం జల్లుచుండ స్త్రీజాన
పదాదులు గౌరవించుచుండం బిగులం బ్రహృష్టుండగుచు నుత్తరుండు నగ
రంబు ప్రవేశించి భవనద్వారంబు చొచ్చి జనకున కహ్వాగ్త నెఱింగింప
ద్వార పాలకున కెఱింగించె. ద్వారరక్షకుండు, "బృహన్నళాసహాయుం
డగు భూమింజయుండు ద్వారదేశంబున నిలిచె"నని మనవిచేసికొనెను.
దానికి విరటుండు కరం బలరి ద్వారపాలకుం జూచి, "వారిరువుర వైళంబ
ప్రవేశపెట్టుము. నేవారింజూడం గుతూహలపడుచుంటి" నని యానతిచ్చె.
యుధిష్ఠిరుం డాతని కేకాంతంబున, "నుత్తరు నొకనినే తోడితెమ్ము. బృహ
న్నల నవరోధింపుము. బృహన్నల బవరంబుదక్క యన్యసమయంబుల
నెవ్వరేని నాకు వ్రణంబు గావించిన వారిం బొరిగొందు నని వ్రతంబు
పూనియుండు. కావున శోణితంబుదొఱఁగు నన్నుం గాంచి కోపించి
సమిత్రపుత్రుం డగు విరటు నశియింపంజేయు." ననిపలికె. అనంతరంబు
విరటజ్యేష్ఠపుత్రుండు భూమింజయుండు ప్రవేశించి జనకుం బాదంబు
లకు మ్రొక్కి కంకభట్టారకునకు మ్రొక్కి లేచినిలిచి రుధిరంబుదొఱఁగ
భూభాగంబున నొంటరి సైరంధ్రి సేవింపనున్న యయ్యనఘుం గాంచి
మిక్కిలి త్వరితుం డగుచుం దండ్రిం జేరి "యిమ్మహానుభావు నెవ్వ రివ్వి
ధంబున బాధించిరి? ఇట్టి యకృత్యం బెవ్వరు సల్పిరి?" అని ప్రశ్నించె.
దాని కాపుడమిఱేడు, "ఈవక్రబుద్ధి నే నిన్నుం బ్రశంసింపం దాంబేడిం
గొండాడును. దానికేం గనలి యివ్విధంబున నేటుంబుచ్చితి"నని యుత్త
రం బిచ్చె. దానికి భూమింజయుండు మిగుల పగచి, "తండ్రీ! గొప్ప
యకార్యంబు నాచరించితివి. ఘోరం బగు బ్రాహ్మణకోపానలంబు సమూ
లంబుగ నిర్దహింపంగలదు. అట్లు గాకుండ నాతని ననునయించి ప్రసన్ను
నింజేసికొనుము." అని హితవు గఱపె. అంత నమ్మానవపతి పుత్రువచ
నంబు లాలకించి భస్మచ్ఛన్నంబగు ననలంబు చందంబున నున్న యాతని ననునయించె.

అట్లాశ్వాసించు నప్పుడమితేనిం గాంచి, "మహారాజ! నాకోపంబు పెద్ద
కాలంబుక్రిందనే శమించె. నాకుఁ గ్రోధంబు లేదు. ముక్కునుండి స్రవిం
చునారుధిరంబు భూమింబడెనేని నిక్కంబుగ రాష్ట్రంబుతో నశియించి
పోవుదు కాని నిన్ను నేదూషింప!" నని పాండవజ్యేష్ఠుండు వాకొనియె.

శోణితంబు శాంతించినంత బృహన్నళ ప్రవేశించి మత్స్యపతికి
మ్రొక్కి కంకునకు నమస్కరించె. మత్స్యమానవపతి సవ్యసాచి విను
చుండ నుత్తరుం జేరి, "తండ్రీ! నిక్కముగ నీవు నాకనురూపుం డగు
పుత్రుండవు. నినుబోలు పౌరుషశాలురు లేరు. అన్నా! అసమానపరా
క్రముం డగు కర్ణుతో నెట్లు పోరసల్పితివి? కురుపితామహుం డగు భీష్ము
నెట్లుదుర్కొని జయంబు చేకొంటివి? సర్వశస్త్రాచార్యుం డగు ద్రోణు
నెవ్విధంబున జయించితివి? శూరవరుం డగు నాచార్యపుత్రు నెట్లు
పరాజితుగావించితివి? రణరంగంబున నెవనింజూచి ధనము గోలుపోయిన
వణిజులగతి వీరులు దుఃఖింతురో యట్టి శారద్వతుతో నెట్లు సంగరం
బయ్యె? పర్వతంబునేని భేదింపఁగల కురురాజు నెట్లోటుఁబుచ్చితివి?
నిక్కంబుగ నీవు కౌరవులఁ జయించిగోధనంబు మరల్చుటం జేసి మృదు
మందవాతంబు వీఁచుచుండె. బలశాలురగువారలనెల్ల నోడించి ధనంబు
గొంట మిగులఁ బ్రశంస్యంబు" అని ప్రశంసించె.

### విరాటోత్తరసంవాదము

"నే గోవుల మరలింపలేదు. శాత్రవులనిర్జింపలేదు. ఒక దేవపుత్రుం
డకార్యజాతంబు నంతను నిర్వర్తించె. కౌరవులసైన్యంబు వీక్షించి
భయంబు గదురఁ బర్వెత్తుచున్న నన్నుం గాంచి నివారించి యవ్వీరుండు
రథంబునెక్కి రథికుండయి నన్ను సారథింగా గైకొనె. అతండే కౌర
వుల నోర్చి గోధనంబుల మరల్చె. నే నికార్యంబు చేయనేర. ఆవీర
వరుండే భీష్మద్రోణకృపాశ్వత్థామ రాధేయసుయోధనవికర్ణాదుల నోడించి
పాఱుచున్న కురురాజుం గాంచి "ఱేఁడా! హస్తిపురంబున నీ కెవరు
రక్షకు లుండరు. నీవు పాఱెదను విడుచువాఁడఁగాను. రణంబున జయించి
తేని భూభాగంబు నిస్సపత్నంబుగ నేలికొందువు. లేదేని సురలోకంబు
చూఱఁగొందువు." అని యాతని నెత్తిపలికె. దాన నమ్మహీపతి యాప్తు
లంగూడి నిశితశరంబులం గురియుచు మరలివచ్చె. ఆతనిం జూడ నాకు శరీ

రంబు గజివాడిచె. గాత్రంబు కంపించె. అవ్విధంబున మరలివచ్చు సుభ
టులం గాంచి మందహాసంబుగావించి యుంపఱ కన్నిరూపులై పోరంబు
సలిపి నిర్జించె." అని యుత్తరుండు వాకొనియె. విరాటుండు, "అహా!
శత్రుసంగృహీతం బగు గోధనంబును నన్ను రక్షించి మహోపకారంబు
గావించిన యా దేవపుత్త్రుం డెవ్వండోగదా! అతనిం దర్శించి యుచ్చింప
గలయు నని కోరిక పొడముచున్నది." అని పలికె. అంత నుత్తరుండు
"మహాబలుం డగు నవ్వీరుం డచటనే యంతర్హితుండయ్యె. రేపుగాని
మఱుచటిదినంబునంగాని యాతండు దర్శనంబు నీఁగలఁడు." అని
యుత్తరమిచ్చె. ఇవ్విధంబున నపుంసకుం డని పరిహసింపఁబడు మహా
పురుషుం డేట షండరూపంబుననుండు సురపతిపుత్త్రుం డని యారా
జెఱుంగఁడయ్యె. అంత భూమిపాలానుజ్ఞాతుం డగుచు నర్జునుండు కురు
వీరుల తలచీరల నుత్తర కిచ్చె. ఆమెయు మహావస్త్రంబులం బొంది మిగుల
ప్రీతయయ్యె. పార్థుండు భూమింజయునితోడను యుధిష్ఠిరునితోడను
గర్తవ్యంబు నాలోచించి యాతనితోఁగూడి మిగుల హృష్టచిత్తుండై
యుండె.

పాండవప్రకాశము

అనంతరంబు తృతీయదివసంబునఁ బాండుపుత్త్రు లేవురును సమ
యంబు నిర్వర్తించి సుస్నాతులగుచు శుక్లాంబరంబులం ధరియించి
సర్వాభరణభూషితులై యుధిష్ఠిరుం బురస్కరించుకొని విరాటుకొలువు
కూటంబుం జేరి యగ్నిత్రయంబు నగ్నులుంబోలె భూమిపాలాసనంబుల
నాసీనులైరి. వారటుల నాసీనులై యుండ మత్స్యపతి రాజకార్యంబులం
జక్కంబెట్టంగోరి కొలువుదీర సభాంగణంబున కేతెంచె. అతండు తేజస్సం
పన్నులగుపాండవులం జూచి యించుకంతదనుక యూరకుండి మిక్కు
టం బగురోషంబుఁ జెంది మరుద్గణంబులం గూడిన సురేంద్రుంబోలియున్న
కంకుం జేరి, "ఓయీ! నాతో ద్యూతంబు నెఱపు సభాస్తారుగా నిన్ను నే
నియోగించితి. అట్టి నీవేల నేఁ డీరాజాసనంబున సుపవిష్టుండవైతి" వని
వాక్రుచ్చె. అవ్విరాటభూపువాక్యంబు పరిహాసంబుగాఁ గొని మిగుల
నచ్చెరువందుచు నర్జునుండు "రాజేంద్రా! ఇయ్యనఘుండు సురేంద్రు
నర్ధాసనంబేని నధిరోహింప నర్హుండు. ఈతం డీ చిఱుతగద్దియ నెక్కుం

జాలండే? బ్రహ్మణ్యుండును, శ్రుతవంతుండును, యజ్ఞశీలుండును, త్యాగధనుండును, దృఢవ్రతుండును నగునిమ్మహానుభావుండు ధర్మంబు రూపంబుగొన్న యట్లుండును. మిగుల బలశాలి. బుద్ధిని బృహస్పతి కెనవచ్చు. వివిధాస్త్రంబుల నెఱుంగు. దేవాసురయక్షకిన్నరాదు లెవ్వరీతనికిపలె నస్త్రంబు లెఱుంగరు. ఈతండు దీర్ఘదర్శి. పౌరజానపదప్రియుండును మహర్షితుల్యుండగు రాజర్షిప్రవరుండు. సత్యవాది. జితేంద్రియుండు. సర్వలోకంబులం బ్రఖ్యాతుండు. మనువుంబోలి లోకరక్షధురంధరుండు. ఈతండు కురుప్రవరుం డగు ధర్మాత్మజుండు. ఈతనికీర్తి యుదయించు సహస్రకిరణుకాంతింబోలె పదిదిగంతంబుల వ్యాపించుచుండు. ఈతండు కురుదేశంబులంబాలించునెడ పదివేలకుంజరంబులు బలంబులును ముప్పదివేలరథంబులును వెన్నంటి వచ్చుచుండు. ఎనిమిదినూర్లసూతపుత్త్రులు దివ్యస్తోత్రంబులం బ్రస్తుతింతురు. కురుదేశంబులవారెల్ల రీతని గింకరులంబోలి యనువర్తింతురు. రాజన్యులెల్లరు నీతనికిం గరదానంబుచేసి ప్రసాదంబుం బొందుచుందురు. అష్టాశీతిసహస్రసంఖ్యులగుస్నాతకు లీమహారాజుంగొలిచి జీవించుచుందురు. పంగువృద్ధానాథులనెల్లర నీతండు పుత్త్రులంబోలె పాలించె. ధర్మదమదయాసత్యంబులం దీతం డపరాఙ్ముఖుండు. ఈతని ప్రతాపంబునకును సంపదకును కర్ణసౌబలాదులంగూడి గాంధారీనందనుండు మిగులం బరితపించుచుండు. ఈతని గుణంబుల గొండాడ వలనుగాదు. అట్టి యిమ్మహనీయుం డీగద్దెనెక్క యోగ్యుండు గాండే?" అని యుత్తరంబిచ్చె.

## ఉత్తరావివాహప్రస్తావము

ఆశ్చర్యావిష్టుండై విరట రాజు, "ఈతండు కుంతీసుతాగ్రజుండగుధర్మసూతియేని, సోదరులగు భీమార్జుననకులసహదేవు లెచట నున్నవారు? పరమపతివ్రతయగు ద్రౌపది యెచట నున్నయది? ద్యూతంబున నోటువడినది మొదలు వారలవృత్తాంతం బించుకేనియుం దెలియరాదయ్యె." యని సాహసంబుగం బలికె. "రాజా! వల్లవుండను పేరంబరంగుచు భవదీయపాకగృహంబున సూదకృత్యంబు నవరించువాండు పవనతనయుండు. ఈతండ క్రోధవశంబున గంధమాదనపర్వతంబున గంధర్వులం జయించి పాంచాలికై సౌగంధికకుసుమంబులం దెచ్చె. దురాత్ము

లగు కీచకులం బొరిగొన్న గంధర్వుం డీతండ కాక యన్యుండుగాఁడు. నీయంతిపురంబున నీవినోదంబునకై ఋక్షవ్యాఘ్రవరాహంబుల భంజించుచుండు. నీయశ్వంబులఁ బాలించుచుండు నశ్వబంధకుండు నకులుండు. గోపాలకుండు సహదేవుండు. ఈకవలు మహారథులు. మిగుల యశశ్శాలురు. పలువురు మహారథులనేని జయింపంగలవారు. చారుహాసిని యగు నీసైరంధ్రి పాంచాల రాజకుమారి. ఈమెకై కీచకు లెల్లరు మిత్తివాతం బడిరి. భీమున కవరజుం డను గవలకు బూర్వజుండ నగు నేను నీశ్రవణపథంబొచ్చు పార్థుండను. భూపాలా! నీయాశ్రయంబున సుఖంబుగ దుస్తరం బగు నజ్ఞాతవాసంబు గడపినారము." అని యింద్రపుత్త్రుండు పేర్కొనియె.

అర్జునుం డివ్విధంబునఁ బాండవులఁ బ్రకాశింపంజేయ భూమింజయుండు పార్థపరాక్రమవిజృంభణంబును వాకొని వేత్వేఱ ద్రౌపదీసహితు లగు పాండవులం బేర్కొనుచు నుత్తరుం డిట్లనియె—"జాంబూనదశుద్ధగౌరుండును, సింహసంహననుండును, దామ్రాయతనేత్రుండును, పృథూన్నతఘోణుండును నగు నియ్యనఘుండు యుధిష్ఠిరుండు. మదగజగమనుండును, స్వర్ణగౌరుండును, పృథుస్కంధుండును, దీర్ఘబాహుండు నగు నీవీరవరుండు పవనాత్మజుండు. ఈతనిపార్శ్వంబున దీర్ఘధనుష్కుండును, శ్యామలవర్ణుండును, సింహోన్నతాంసుండును, పద్మాయతాక్షుండు నగునీపురుషసింహుం డర్జునుండు. రాజపార్శ్వంబున నుండు జిష్ణుతుల్యు లగు నీకవలు మాద్రీపుత్త్రులు. వారిపార్శ్వంబున రూపంబు గొన్న లచ్చివడువున కనకవర్ణాంగియై యుండు నయ్యువిద పాంచాల రాజపుత్త్రి." అని వారల వర్ణించిచెప్పి యర్జునువిక్రమంబుఁగూర్చి యిట్లనియె—"మున్ను నే వాకొనిన శత్త్రుంతపుం డగు దేవపుత్త్రుం డీతండ. ఈతండు మృగంబులఁ బంచాస్యంబువోలె నారథికవరులఁ బొరిఁగొనెను. ఈమహావీరుం డొక్కయలుగునన మాతంగంబు నేలఁగూల్చె. ఈతండే కౌరవులం జయించి గోగణంబుల మరలించె. ఈతని శంఖధ్వని నాకర్ణించి నంతమాత్ర మదీయశ్రవణయుగళంబు బాధిర్యంబునొందె." అని పుత్త్రుండుపలుక మత్స్యవల్లభుండు "నీచెప్పినదంతయుఁ దగియున్నది. ఇయ్యెడ మనము మహాత్ములగు పాండవులఁ బ్రసన్నులఁజేసికొనవలయు. దానికై మనయుత్తరను బార్థున కిచ్చువాఁడ" ననియె. అంత నుత్త

రుండు, "మాన్యులగు నియ్యార్యుల్యలం బూజించుట నాకభిమతంబు. పూజార్హులగువీరలం బూజింపు" మనియె. విరాటుండు "నేను సంగ్రామంబున నోడి శత్రులకుం జేఁజిక్కితి. భీమసేనుండు నన్ను బంధవిముక్తుం గావించి గోవుల మరలించె. ఈపాండవోత్తముల భుజబలంబునన మనకు విజయంబు సమకూడె. కావున సహామాత్యుల మగు మన మెల్లరము సాసుజుం డగు పాండవాగ్రజుం బ్రసన్నుం జేయుదము. మనము తెలియక యన్న దురుక్తులనెల్ల నియ్యనఘుండు క్షమింపవలయు" నన సంతసించి, ధర్మసూతికి దండకోశపురంబులంగూడ రాజ్యంబు నర్పించె. పాండవుల నెల్ల నాలింగనంబుచేసికొని "మేలు మేల"ని యభినందించియు శిరంబుల మూర్కొనియు, నెంతయుం దనియ లేఁడయ్యె. మఱియు నవ్వసుధాపతి పాండవజ్యేష్ఠుం జేరి, "భాగ్యవశంబున మీ రెల్లరు వనవాసంబు నుండి కుశలంబుగ వచ్చి మిగుల కష్టకరం బగు నీయజ్ఞాతవాసవత్సరంబు నిస్తరించితిరి. మీరు శంకదక్కి యీరాజ్యంబును సురసూతికై చేకొండు. ధనంజయుండు మదీయపుత్త్రి యగు నుత్తరను బ్రతిగ్రహించుఁగాక. ఈతండ యామెకుం దగువల్లభుండు." అని వచించెను, ధర్మసూతి పార్థు నీక్షించె. అర్జునుండును, "రాజేంద్రా! నీదుహితను గోడలిగాఁ గైకొనువాఁడ. మత్స్యభారతుల కగు నీసంబంధము మిగుల శ్లాఘ్యంబు" అనియె.

## ఉత్తరావివాహపరిసమాప్తి

అంత విరటభూపాలుండు సవ్యసాచిం గాంచి, "పాండవశ్రేష్ఠ! నాయొసంగు మదీయదుహిత నేల భార్యగాఁ బరిగ్రహింప నొల్లవు?" అని ప్రశ్నించె. దానికయ్యర్జునుం డిట్లనియె— "రాజేంద్రా! నీదుహిత నీక్షించుచు నీయంతిపురంబుననే పెద్దకాలం బుంటి. ఆమెయు రహస్యంబుగను బ్రకాశంబుగను నాయందుఁ దండ్రియందువలె విశ్వాసంబు నొందియుండె. నే నామెకుం బరమసమ్మతుం డగు నుపాధ్యాయుండను. ఆమె నన్నాచార్యుంబోలెఁ జూచుచుండె. యువతి యగు నామెతో నొకవత్సరం బుంటి! కావున నీకేనియు లోకులకేనియు శంక జనింపవచ్చు. నే నీదుహితను దుహితగా భావింతు. విశుద్ధేంద్రియుండ నగుచు నింద్రియంబులం జయించి శుద్ధి యొనర్చియుందు. తనయందును, దనుజాతు

నందును, దనయునందును, గోడలియందును శంకింపం జనదు. శాప యుక్తుఁడ నగుచు నసత్యంబు పలికి యట్లు ప్రవర్తించితిని. కావున నీదుహి తను స్నుషగాఁ బరిగ్రహింతు. వాసుదేవునకు మేనల్లుండును, నభిమ తుండును, బాలుఁడయ్యు నస్త్రకోవిదుండును, మహాబాహుండు నగు మత్పుత్త్రుం డభిమన్యుండు నీకూఁతునకుఁ దగువరుండు గానోపు." ననియె. దాని నాకర్ణించి భూకాంతుండు, "కురుశ్రేష్ఠుం డగు ధనంజయు నెడ నిది యెంతయుఁ దగియుండు. ఇవ్విధంబున ధర్మనిత్యుండును విజ్ఞానసంపన్నుండు నగువాఁ డెవ్వం డుండు? పార్థున కిష్టం బగు వాక్యంబు సలుపఁబడును. మత్సంబంధి యగు నిమ్మహాత్మునకు సర్వకామం బులు నెఱవేఱుఁగాక" అని వాకొనియె.

ఇవ్విధంబున మానవపతి వాకొనఁ గుంతీసుతాగ్రజుండు మత్స్య పార్థులవియ్యంబున కనువగుసమయంబు వేర్కొనియె. అంత విరట భూపాలుండును బీభత్సుండు మిత్త్రులను వాసుదేవుని బిలువ నంపిరి. త్రయోదశవత్సరం బతీతం బగుడు పంచపాండవులును విరాటునియుప ప్లావ్యంబు చొచ్చిరి. సురరాజసూతి యభిమన్యుని జనార్దను నంతరం బున దాశార్హులను రావించె. కాశీశుండును, శైబ్యుండు యుధిష్ఠిరునెడ మైత్త్రిపాటించి చేరి యొకయక్షౌహిణింగూడి యేతెంచిరి. మహా బలుం డగు యజ్ఞసేనుండు నక్షౌహిణీబలంబును, ద్రౌపదీపుత్త్రులును, శిఖండియు, ధృష్టద్యుమ్నుండును, నక్షౌహిణీపాలురును బలసి కొలువఁ బాండవులం జేరవచ్చె. డాయవచ్చు నమ్మహారాజును బరివారంబుఁ గాంచి మత్స్యభూభర్త సబలవాహను లగువారలనెల్ల పూజించె. ఇవ్వి ధంబున రాజులెల్లరు చేరవచ్చుతఱి వాసుదేవుండును, హలాయుధుం డును, గృతవర్మయు, హార్దిక్యుండును, యుయుధానుండును, సాత్య కియు, నక్రూరుండును, సాంబుండును, నిషధుండును, నభిమన్యుం గొని యింద్రసేనాదులతోఁగూడి రథంబులతోఁ జేరవచ్చిరి. పదివేలయేనుం గులును, పదివేలగుఱ్ఱంబులును, నర్బుదంబురథంబులును, నిఖర్వంబు పదాతులును, బరమతేజశ్శాలురగు వృష్ణ్యంధకయోధులును వేర్వేఱ స్త్రీరత్నవస్త్రాదులంగొని వృష్ణివరుం డగు వాసుదేవు ననుసరించి వచ్చిరి.

అనంతరంబు శంఖభేరీరవంబులు గోముఖాడంబరంబులును బాండ వులం బూజించు మత్స్యమహీపాలమందిరంబునఁ జెలంగె. ఉచ్చావచంబు

లును మేధ్యంబులు నగు బహుపశువుల వధించిరి. మైరేయపానంబులను సురను దెచ్చిరి. నటవిటగాయకాదులు తమతమనైపుణంబు నెఱపుచుండిరి. వందిమాగధసూతులు స్తోత్రంబులు చేయుచుండిరి. సుదేష్ణ మున్నిడి కొని మత్స్యపురస్త్రీలు బాగుగా నలంకరించుకొని రత్నాభరణభూషిత లగుచు నచ్చటికి విచ్చేసిరి. వారెల్లరు నుత్తరను వైవాహికమంగళాలంకరణంబుల నలంకరించిరి. ఆమెను ధనంజయుండు పుత్రునకై ప్రతిగ్రహించె. కుంతీపుత్త్రుం డగు యుధిష్ఠిరుండు నిరుపమానలావణ్య యగు నయ్యువతి నభిమన్యుభార్యగా నంగీకరించి చేకొనియె. ఆమెం జేకొని పార్థుండు వాసుదేవు మున్నిడుకొని యభిమన్యునకు వివాహంబు గావించె. విరాజభూపాలుండు పవనజవంబులగు నేడువేల తురంగంబులను, రెండువేలగజంబులను, బహుధనంబును గానుకఁ జెప్పె. అగ్నిం బూజించి బ్రాహ్మణుల నర్చించి ధర్మపుత్త్రుండు రాజ్యంబును బలంబును బహుధనంబులను, వాసుదేవుండు దెచ్చినదెల్లను దానంబు గావించె. గోసహస్రంబులను, రత్నంబులను, నంబరంబులను, వివిధభూషణంబులను, శయనాసనాదులను, హృద్యభోజనపానాదులను, బ్రాహ్మణుల కర్పించె. మహోత్సవం బొప్ప జను లెల్లరు హర్షోత్ఫుల్లనయనులై యుండ నాపురవరంబు మిగుల శోభిల్లుచుండె.

విరాటపర్వము సమాప్తము.



శ్రీరస్తు.

శ్రీమదాంధ్ర

# వచనమహాభారతము

## ఉద్యోగపర్వము

ఉ. సంసారాంబుధినోలలాడి తుదకుఁ సన్న్యాసులై యోగులై
పాంసువ్రాతము వోనడంచి మది నేభవ్యాత్ముఁ గన్గొందు రా
కంసారాతిపురాంతకాదిబహుళాఖ్యారూపరాజత్కళుఁ
హంసుఁ హంససహస్రకాంతియుతు నే నశ్రాంతనుం గొల్చెదన్.

చ. బహుళరజోగుణంబు నభవత్వమునన్ జగముల్ సృజించి స
త్త్వహ్యాతిమ్మృడాత్మతన్ జగము దద్దయు మన్చిహరాత్మతన్ భయా
వహమగుతామసంబు నభవంబు హరించి గుణాళిఁ బాసి చి
న్మహాశివరూపత న్వెలుఁగు మాన్యగుణాకర చంద్రశేఖరా!

దేవా! యవధరింపుము. వైశంపాయనుండు జనమేజయజననాథునకు విరాటనగరంబునఁ బాండవులు ప్రవర్తించినతెఱం గెఱింగించి యనంతరము సేనోద్యోగవృత్తాంతం బెఱింగించువాఁడై యిట్లు వచించె. జనమేజయా! నీపూర్వపితామహు లగుపాండవు లట్లభిమన్యువివాహంబు సకలవైభవంబులతోడ నిర్వర్తించి యారాత్రి యెల్లరు సుఖం బుండి వఱువాత లేచి స్నానసంధ్యాదికకృత్యంబులు నెఱవేర్చి ప్రీతితో స్వపక్షరాజలోకంబెల్ల వెంటరా విశాలరమణీయంబగు విరాటు కొలువుకూటంబున కరిగిరి. ఆవిరాటునిసభామంటపంబు విశేషవిస్తృతంబై యుత్తమరత్నాలంకారములతోడను జిత్రచిత్రంబు లగు నుత్తమాసనంబులతోడను సమస్తరాజార్హవస్తునివహంబులతోడను బాక

శాసనుసుధర్మం బురుడించుచు నెలుంగుచుండె. ఆసభామధ్యభాగంబున నెడుదగ విరాటుండు ద్రుపదుండు నింకనుం గలవృద్ధనరపాలకు లుచితాసనంబుల నుపవిష్టులై యుండిరి. పాంచాలరాజునకు సమీపంబున వసుదేవుం డాసీనుండయ్యె. మఱియు శినిప్రవరుం డగు సాత్యకియు బలదేవుండు నుపవిష్టులై యుండిరి. మత్స్యనరపతిసమీపంబున జనార్దనుండును యుధిష్ఠిరుండును ద్రుపదాత్మజులందఱును భీమార్జుననకుల సహదేవులు నుపవేశించిరి. వారికెలనఁ బ్రద్యుమ్నసాంబు లభిమన్యుని తోడను విరాటనందనులతోడను బలసియుండిరి. శౌర్యంబున వీర్యంబున రూపంబునఁ దండ్రులకు సమానులగు ద్రౌపదీనందనులు సువర్ణ మణిగణాలంకృతంబులగు చిత్రాసనంబులఁ గూర్చుండియుండిరి. ఆమహీపతు లట్లు కనకమణిమయాలంకారవిభ్రాజమానంబు లగు వరాసనంబుల నుపవిష్టులై యుండ వారియాభరణాంబరంబుల కాంతిచే నాసభాంగణము గ్రహములతో నిండినయంబరతలంబు ననుకరించె.

### కృష్ణుండు రాజులకుఁ బాండవులకష్టంబు లెఱింగించుట

ఆమహీనాథు లెల్లరు జిత్రవిచిత్రంబు లగుకథలతో సరససల్లాపంబులు నెఱపుచు గొంతవడికి వారెల్లరు కృష్ణునిటక్కు మొగంబై యాతని నాలోకించుచుండిరి. వారివారిప్రసంగంబులు ముగిసినపిదప వాసుదేవుండు పాండునందనులకార్యంబు మది నెంచి యారాజలోకంబును సావధానంబుగ నాకర్ణింపు మనిపల్కి మహార్థంబు మహోదయంబు నగువాక్యం బిట్లని సెప్పందొడంగె. మీరెల్లరు నీపాండవాగ్రజుండు శకునిచేఁ గపటద్యూతంబున నోడుటయు, నీతినిరాజ్యమెల్ల సుయోధనుండు వంచనమై నపహరించుటయు నెఱుంగుదురుగదా! బలంబున రాజ్యంబు స్వాయత్తంబుగావించికొన శక్తులైయుండియు సత్యరథు లగువీరు సత్యంబు వీడక యుగ్రరూపం బగు వనవాసవ్రతంబు పండ్రెండేండ్లు చరించిరి. మఱియు నజ్ఞాతవాసంబుగావించిన యీపదుమూఁడవయేఁడు మిక్కిలి దుస్తరమైనది. ఒరుల కెఱుకపడకుండ మీసమీపంబున దుస్సహంబు లగు నానావిధక్లేశంబు లనుభవించి యజ్ఞాతవాసంబు నెఱపిరనుటయు మీ రెఱింగినయదియ. మహారాష్ట్రవర్ధను లగువీరు దుష్కరంబగుపరదాస్యంబు నిండుగ నొకవత్సరంబు నెరవేర్చిరి. ఇది యిట్లుండ

నిజము. ఇపుడు ధర్మనందనునకును సుయోధనునకును హితమగునదియుఁ గురుపాండవు లుభయులకు యశస్కరమగునదియు ధర్మ్యమగునదియు నగునుపాయ మొక్కటి మీ రెల్లరును విచారింపుఁడు. ఈ ధర్మనందనుండు ధర్మోపేతంబగు సురలోకాధిపత్యంబయిన నంగీకరింపఁడు. ధర్మార్థయుక్తంబయ్యెనేని చిన్నపల్లెకారి ప్రభుత్వమునైన సంతుష్టాంతరంగుంబున నంగీకరించును. పాండవులకుఁ బిత్ర్యంబును దిగ్విజయలబ్ధంబు నగు రాజ్యంబు ధార్తరాష్ట్రుండు కపటద్యూతంబున నపహరించుటయు, నామిథ్యోపచారవశంబునఁ బాండవులు దుస్సహక్లేశంబు లనుభవింప వలసివచ్చుటయు మీ రెఱుంగనిది కాదు. వారి తేజోబలపరాక్రమంబులు ధార్తరాష్ట్రు లెఱుంగనివియుఁ గావు. అట్లయ్యును శమప్రియుండ నీ యమనందనుండు ధార్తరాష్ట్రులకు మిత్రగణంబులతోఁ గూడ క్షేమంబ కోరుచుండును. తమ తేజంబు పెంపున దిగ్విజయంబు గావించి యలవరించికొన్న పదంబుమాత్రమే యిపుడు పాండవు లభిలషించుచున్నవారు. వీరి రాజ్యం బపహరింపఁదలంపుగొని చిన్ననాఁటనుండియు నుగ్రులు దుర్మార్గులు నగు శాత్రవులు గావించిన యాయాదుష్కార్యంబులెల్ల మీ కందఱకుఁ దెలిసినవియే. వారల యతిప్రవృద్ధం బగు లోభంబును, యుధిష్ఠిరుధర్మాభిరతియు, వీరిరుపక్షంబుల వారన్నదమ్ములబిడ్డలగుటయుఁ దలంచి, యుభయులకు హితంబగునుపాయం బారయుఁడు. పాండవులు సత్యాభిరతులై ప్రతిజ్ఞాతంబులైన వనవాసాజ్ఞాతవాసంబుల నొక్కకొంత లేకుండ సమగ్రంబుగఁ జరించిరి. ధృతరాష్ట్రనందనుండు వీరికి యథోచితంబుగ రాజ్య మిచ్చిన సరియే. ఇంకను మిథ్యోపచారంబులు గావింప నెంచిన, వీరలా ధార్తరాష్ట్రుల నెల్ల నొక్కపెట్టున వధింపక మానరు. వారలు విప్రకారంబు గావింప సమకట్టి సుహృజ్జనంబులఁ గూర్చికొని వీరిపై నెత్తివచ్చి వీరల హింసించినను హింసింపవచ్చును. ఆతతాయినైనను బాండవులు ధార్తరాష్ట్రుల వధించుట నిక్కము. సుయోధనుం డధికబలసంపన్నుండు; వీర లల్పబలులని తలంతురయేని వీరలును మిత్రబలంబులెల్లఁ బ్రోవుగావించికొని వారల జయింప సమర్థులైయుండురు. ఏకార్యము గావింప నున్నదియు నా దుర్యోధనునినిశ్చయం బెఱుంగ రాకున్నది. పరులమతము బాగుగ నెఱుంగకుండనే మన మే కార్యము గావింపఁగలము? కావున నాసుయోధనునభిమతం బెఱుం

గుట్టకై యిక్కడనుండి ధర్మశీలుండును శుచియుం గులీనుండు నప్రమత్తుండును నగు పురుషుని దూతగాఁ బంపవలయు. ఆదూత దుర్యోధను పాలికిం జని తగినతెఱంగున నాతని నొడంబఱిచి యాతండు శాంతుం డగునట్లును బాండవుల కర్ధరాజ్యం బిచ్చునట్లు నొప్పించి వచ్చుఁగాక." యని వచించె.

ధర్మార్థయుక్తంబును మధురంబులు నగు జనార్దనుభాషణంబు లాలించి వానియందలి సమత్వమునకును న్యాయతత్పరతకు నెద మెచ్చి బలదేవుండు సభాసదుల నాలోకించి యిట్లనియె. "మీ రెల్ల రీ గదాగ్రజు వచనంబు లాకర్ణించితిరి కదా? ఈమాటలు దుర్యోధనునకు నజాతశత్రునకును గూడ గరంబు హితంబు లగును. ఈకుంతీతనయులు తాము కోల్పోయిన తమరాజ్యమునే మరల నభిలషించుచున్నవారు. కావున, సుయోధనుండు వీరికి సగపాలు రాజ్యమిచ్చి మనయెల్లరితోడ సుఖంబుండుట యుచితంబు. పరు లపకారపరత్వము వీడి శాంతులై యుండఁ గౌంతేయులు తమరాజ్యమును దామేలుకొనుచు సుఖంబు లనుభవింతురు. వీరిశాంతి ప్రజల కత్యంతము హితమగునది. దుర్యోధను నభిప్రాయం బెఱుంగుటకును యుధిష్ఠిరు నభిమతం బాతని కెఱింగించుటకు నిక్కడనుండి దూత వెడలుట సముచితంబు. కురుపాండవులు శాంతి నొందుట నాకెంతయుఁ బ్రియతమము. ఇక్కడనుండి వెడలినదూత భీష్ముని గురుపుంగవుం డగు నాంబికేయుని ద్రోణుని ద్రోణాత్మజుని విదురుని గృపుని గాంధారాధినాథుం డగు శకునిని సూర్యసూనుని వినయంబు పెంపున నామంత్రణం బొనర్పందగును. మఱియుఁ దక్కుంగల ధార్తరాష్ట్రులను బలప్రధానులను నిగమప్రధానులను నుచితరీతులఁ బ్రసన్నులఁ గావించికొని ధర్మవేత్తలు లోకజ్ఞులు శాస్త్రకాలవేదులు నగు పౌరులు వృద్ధులును గొలువుదీరియున్న యవసరమ్మున ధర్మనందను నర్థమ్ము సిద్ధించుతెఱంగున వినయంబునఁ గార్యంబు విన్నవింపందగును. సర్వావస్థలందును వారికిఁ గోపంబు కలుగకుండునట్లును వీరియెడఁ బ్రసాదం బుదయించునట్లును గార్యంబు సాధించునది. ధార్తరాష్ట్రులు బలం బాశ్రయించి వీరల రాజ్యభాగంబు స్వాయత్తంబు గావించికొనిరి. మహాసంపదుపేతుం డగు ధర్మనందనుండు జూదంబునం బ్రమత్తుండై కలధనంబు లెల్ల రాజ్యంబుతోడన కోలుపోయె. సమస్తమిత్రబృందం

బులు పలదని వారించుచున్నను వారిహితవాక్యంబులు సరకుసేయక
యాజమీఢుం డగు నీయుధిష్ఠిరుండు దనకక్షక్రీడాపాటవంబు లేకున్నను
గాంధార రాజనందనుం డగు శకునిని దేవనంబున కాహ్వాన మొనర్చె.
సౌబలునకు దురోదరపాటవం బగ్గలంబని యెల్ల రెఱింగినదియకదా?
నాఁ డాసభయందు ద్యూతకారులు వేలకొలందిగ నుండిరి. వారిలో
నెవ్వనినేని యుధిష్ఠిరుం డశ్రమంబున నోడించియుండును. కాని
యాతం డట్లుకావింపక వారలనెల్ల నిరాకరించి సౌబలునే పిలిచి వానిచే
సర్వస్వముం గోల్పడియె. ఆశకునియు నితండు ద్యూతంబునకు మిక్కి
లిగాఁ బ్రేరించుటం జేసి యాతనితో నాఁడెనుగాని తనంత తా నుత్సా
హంబున నాడినవాఁడుగాఁడు. అక్షంబులు ధర్మనందనునకుఁ బ్రతికూలం
బులుగా నుండుటయు నీతండు రోషసంరంభంబున ముందెఱుంగక
సర్వంబు నొడ్డి పరాజితుండయ్యె. అట్టియెడ శకుని కావించిన పరాభవం
బేమి కలదు? కావున మీరలు పంచినమానిసి వైచిత్రవీర్యునికడఁ గడువిన
యంబు మెఱయ బహుసామయుక్తంబు లగువాక్యంబులు పలికి యాతని
యనుగ్రహంబు వడయవలయు. అట్లుకావించెనేని యాదూత సుయో
ధనునివలన స్వాభిమతంబు సుఖంబునంబడసి మరలివచ్చును. మీరలెవ్వ
రును గౌరవులతోడి యుద్ధం బభిలషింపకుఁడు. సామవచనంబులతోడన
యారాజును స్వాధీనపఱుచుకొనఁ దలంపుఁడు. సామోపాయంబున
సాధింపఁబడు కార్యంబున విశేషంబుగ నర్థంబులు సిద్ధించు. యుద్ధమున
సిద్ధించినయర్థంబు సిద్ధంబుగానోపదు. కావున సామవచనంబులఁ గార్యంబు
చక్కఁబఱుచునది." అని వచించె.

### సాత్యకి బలదేవువాక్యంబుల గర్హించుట

బలదేవుం డిట్లుపలికి విరమించినంత శినిప్రవీరుం డగు సాత్యకి
తటాలున నాసనంబుననుండి లేచి కోపాటోపంబున బలదేవునివాక్యం
బులు పెక్కుభంగుల నిందించి రోషతామ్రాక్షుండై యిట్లుపలికె.
ఏపురుషుండైనను, దనయంతరాత్మ యెట్లుండునో యట్లే వచిం
చును. బలదేవా! నీ యంతరాత్మ కనుగుణం బగు తెఱంగుననే నీవు
భాషించుచున్నవాఁడవు. లోకంబుల శూరవరేణ్యు లగు పురుషులు
గలరు. కాపురుషులు నున్నారు. పురుషులం దెల్లెడల నీరెండుపక్షంబు

లును వృక్షంబులుగ నగపడుచునేయుండును. ఒక్కకులమునందే క్లీబుం
డును మహాబలశాలియు నివ్వరు నుదయింతురు. ఫలభారనతయగు
శాఖయు నసఫలపత్రపుష్పయైన శాఖయు నొక్కభూరుహమునంద
కనుచున్నారముకదా? తుంగలధ్వజా! నీయిచ్చవచ్చిన తెఱంగున నీవాడిన
మాటలకు నా కించుకంతయు నలుక యుదయింపదుగాని, నీ వేవెడవారు
లెల్లఁ బాడిగాఁ బల్కుచుండ నాదరంబున నాలించువారియెడ నాకగ్గ
లంబుగఁ గోపంబు గల్గును. కేవలము నిరపరాధుం డగు ధర్మనందనునెడ
నల్పంబేని దోషంబు నిరూపించుచుఁ బరిషన్మధ్యంబున నకుతోభయుం
డవై యుండుట నీకుఁ దగియున్నది. అక్షక్రీడాపరిజ్ఞానంబు లేని ధర్మ
నందనుని మాయాద్యూతపరిణతు లగువారలెల్లరు గూడుకొని పిలిచి
బలిమిమై నాడించి యాతనిసంపదలెల్లఁ జూఱఁగొనిరి. వారలు ధర్మంబున
జయించి రనుట యెట్లు పొసంగును. కుంతీనందనుండు తనగేహంబునఁ
దనసహోదరులతోఁ గ్రీడించునెడల వార లరుదెంచి యాతనితో నాడి
గెల్చి రేని నది ధర్మజయం బనఁజెల్లును. క్షత్త్రధర్మగతుండై సంతతము
ప్రజాపాలనైకవ్యగ్రుం డగు కౌంతేయాగ్రజుని బిలిచి వంచనమై నాతని
రాజ్యంబెల్ల నపహరించిన వీరు గావించినసత్కార్యం బేమున్నది?
ఇంతియ కాక యీధర్మనందనుండు తాను బ్రతిజ్ఞ గావించిన పణంబున
కనుగుణంబుగ వనవాసంబు నజ్ఞాతవాసంబును నేకొంతయుఁ గల్గ
కుండ సమగ్రంబుగ నిర్వహించి తొలుత గావించిన ప్రతిజ్ఞ నిర్వహించి
యున్నాఁడు. కట్టిపరిశుద్ధాత్ము: డాదురాత్ములకుఁ బ్రణిపాతం బొనరింప
నవసర మేమి కలదు? ఈతండు పందెము నెఱవేర్చినంతన తనపిత్రుపైతా
మహం బగు రాజ్యంబునకు నిస్సంశయంబుగ నర్హుండయ్యె. ఇది యిట్లుండ
నిమ్ము. కుంతీతనయుండు పరులసొమ్మున కాసపడియెనందువా? అశ్లిష్టమైన
నీతండు పరులయాచించుట యెంతయు ననర్హంబు. ఎట్లయినను వీరల
రాజ్యం బపహరించుటకే నిశ్చయించినధార్తరాష్ట్రులు ధర్మమార్గం
బున బ్రవర్తింతు రనుటయుఁ గల్ల. పాండవులు ధర్మమార్గంబున
మహాక్లేశంబు లనుభవించియు వనవాసాజ్ఞాతవాసంబులు నెఱపి తీర్ణ
ప్రతిజ్ఞులైయుండ నజ్ఞాతవాసంబు సమగ్రంబుగ ముగియకుండనే
పాండవులు బయల్పడి రను ననృతంబులాడు కౌరవులు ధార్మికు లను
టను నివాఱుకః సాహసించెనే కాని వివేకవంతుం డగువాఁ డెవ్వండు

వర్ణనఁజాలఁడు. మహాబుద్ధిమంతులు మహానుభావులు నగు గాంగేయుం డును కుంభసంభవుండు నెన్నిభంగుల ననునయించినను బాండవుల పైతృకం బగు రాజ్యంబు వారి కీచ్చుట కాదురభిమాని యగు సుయోధనుం డంగీకరింపకున్నాఁడే! నేను నిశితంబు లగు శరపరంపరలచే రణాగ్రంబున ధార్తరాష్ట్రుల ననునయించి మహాత్ముం డగు నీకౌంతేయాగ్రజుని పాదంబులకడ వ్రాలునట్లు కావింతును. అప్పుడైనను వారు ప్రణిపాతంబున కంగీకరింపరేని సహామాత్యబంధుమిత్రగణంబుగ నవశ్యంబు యమనగరంబున కరిగెదరుగాక. మహాసంరంభంబున యుద్ధంబుగావించు నీయుయుధానుని బలవేగంబు నాఁప నాపక్షంబున నొక్కండైనను లేఁడు గదా? మహారథంబులపయిం బడు పిడుగులంబోని యీతనిబెడిదంపు బాణంబులచవి యెఱింగినఁగాని సుయోధనుండు మెత్తఁబడునా? ఎక్కటిపోర ముక్కంటిం గెల్చిన కడిందివీరుం డీగాండీవి. చక్రాయుధుని యువక్రపరాక్రమం బొం డన నక్కఱ లేదుగదా? భీమగదాధరుండైన భీమునిఁ గాలాంతకోపము లగు కవలవారిని నన్నును కౌరవులలో నెవరులు సహింపఁగలవారు? ప్రాణంబులం దాసగల యేమానవుండు పార్షతుం డగు నీధృష్టద్యుమ్ను సమీపించి నిలువంగలండు? పాండునందనులకు సమానం బగు వీర్యంబునుం బ్రమాణంబునుం గలిగి మదోత్కటులైయున్న యుపపాండవుల నోర్వఁగలవా రెవ్వరున్నారు? దేవతలకేని దుర్జయుం డగు నీసౌభద్రుని, గాలవజ్రానలప్రతీకాశులై యాజిభయంకరు లగు నీప్రద్యుమ్నసాంబులను నెదిరించి పోలికలఁ బ్రాణంబులవీడకయుఁ బాదంబులకడ వ్రాలకయు నుండుటకు నాధార్తరాష్ట్రులవశమా? మే మెల్లరము నాతులువ యగు ధార్తరాష్ట్రుని శకుని కర్ణులతోఁగూడఁ బరిమార్చి, పాండవాగ్రజుని ధరణిరాజ్యంబున నభిషిక్తుం గావింతుము. ఆతతాయులగు శాత్రవులఁ జంపిన నధర్మంబు పొరయకుండును. శాత్రవుల యాచించుట యధర్మ్యంబు నయశస్యంబు నగు నీచకార్యంబు యుధిష్ఠిరునిహృదయంబున నేకోర్కి కలదో దానిన మన మెల్లర మిపు డాచరింపం దగును. ధృతరాష్ట్రుండు జాలినొంది యొసంగినరాజ్యం బనుభవింప నీతనికిష్టమో? పాండునందనుం డగు యుధిష్ఠిరుండు తనపేరు సార్థకంబుగా నాచే నిహతులై కౌరవులెల్ల వసుధాతలంబునం బరుండియుండ నిష్కంటకంబై ప్రాజ్యం బగుసామ్రా

జ్యం బనుభవించుట యీతని కభిమతమో? ఈధర్మనందనున కేది యభిమతం బగుదానినే యాచరింతు" మని పలికె.

ద్రుపదుండు సాత్యకిపలుకుల శ్లాఘించుట

సాత్యకి యిట్లు పలికినపలుకు లాలించి ద్రుపదుండు సభాసదుల కిట్లనియె. సాత్యకివచనంబు లెంతయు సమయానుకూలంబు లై యున్న యవి. రాజ్యబలగర్వితుం డగు సుయోధనుండు మధురవాక్యంబుల కొడంబడి రాజ్యభాగం బిచ్చుట కంగీకరింపమి నిక్కువంబు. సుతప్రేమ నిబద్ధుం డగు నాంబికేయుండు సుయోధనుం డేది చెప్పినను వల్లెయనుం గాని యాతని నిరోధింపంజాలఁడు. కార్పణ్యవశంబున గాంగేయుండును, ద్రోణుండును నాతనినే యనుసరించువారు. రాధేయుండును, గాంధార రాజును మౌఢ్యంబున నాసుయోధను సేవించుచున్నవారు. నాకుం జూడ బలదేవువాక్యంబులు వివేకవిదూరంబులై కన్పట్టెడిని. ఇక్కడనుండి యరిగినపురుషుండు కార్యంబు సాధింపఁగోరెనేని ధార్తరాష్ట్రునికడ నెట్లును మృదువచనంబులు పలుకంగూడదని నాతలంపు. పాపబుద్ధి యగు నాసుయోధనుండు మార్దవంబునఁ గార్యంబున కంగీకరింపఁ డని నాకుఁ దోఁచుచున్నయది. పాపచిత్తుం డగు దుర్యోధనునెడ మార్దవంబు ప్రకటింపం దలంచుట గోవునెడఁ దీక్ష్ణబుద్ధిని, గార్దభంబుదెస సామవచనంబులనుం బ్రయోగించుటంబోలె నిందాపరిహాసంబులకుం బాత్రంబగును. ఆపాపభావుండు మృదువాక్యంబులు పలుకువారి నశక్తులుగా భావించి బిఱ్ఱబిగియునే కాని యించుకేనియు నాదరింపఁడు. వివేకవిహీనుండు మార్దవంబు చూపినంతమాత్రన తనయర్థంబెల్ల విజితంబయినట్లు తలంచును. మన మేమఱియుండక సమయానుకూలంబుగఁ బ్రయత్నంబు గావింతము. మనమిత్రుల కెల్లరకును బలంబులు తోడ్కొనిరా దూతలచే వార్త లంపుదము. శల్యుండు, ధృష్టకేతుండు, జయత్సేనుండు, కైకేయులు నాదిగాఁగల రాజన్యుల కెల్ల శీఘ్రగమను లగుదూతలచేఁ జెప్పి పంచునది. వీరితలం పెఱింగిన గాంధారీనందనుండును సహాయార్థియై యాయా రాజులకు వార్తలంపును. సద్ధర్మపరాయణు లగు నరపాలురు పూర్వ మెవ్వ రభ్యర్థించిరో వారికే తోడుచూప నంగీకరింతురు కావున, రాజుల నెల్ల రావించుటకుఁ ద్వరితంబుగ యత్నంబులు గావింపుఁడు.

మన మిప్పుడు మహాకార్యభారంబు వహింపవలయునని నాకుం బొడకట్టు
చున్నది. శల్యునకు, నాతని ననుసరించు నరపతులకు శీఘ్రంబుగ దూతల
నంపుఁడు. పూర్వసాగరోపాంతనివాసి యగు భగదత్తునకును, నమితౌ
జసుం డగు నుగ్రునకును త్వరితంబుగ వేగపు లగుకాలరులం బంపుఁడు.
హార్దిక్యుండు, నాహుకుండు, మానుండు ననురాజుల వేగంబ రావింప
వలయు. బృహంతుండు, సేనాబిందుండు, సేనాజితుండు, ప్రతివింధ్యుండు,
చిత్రవర్మనుండు, సువాస్తికుండు, బాహ్లికుండు, ముంజకోశుండు, చేది
దేశాధిపుం డగు సహదేవుండు, సుపార్శ్వుండు, సుబాహుండు, మహా
రథుం డగుపౌరవుండు నాదిగాఁ గలుగురాజులకు వార్తలంపి సాహ్యా
మర్థింపవలయు. శప్లవదరదదేశాధీశ్వరులు, సురశత్రుండు, నటిజా
తుండు, కర్ణవేష్టుండు, నీలుండు, వీరధర్ముండు ననువీరోదగ్రు లగు నర
పాలుర రావింపంజనును. దుర్జయుండు, దంతవక్త్రుండు, రుక్మి నరపాలుండు,
జనమేజయుం డాషాఢుండు, వాయువేగుండు, పూర్వపాలి, భూరి
తేజుండు, దేవకుం డేకలవ్యుండు, నాతనితనయులును, గారూషకమహీ
పాలురును, వీర్యవంతుం డగు క్షేమధూర్తియుఁ, గాంభోజులు, ఋషి
కులు, మఱియుఁ బశ్చిమానూపవాసు లగు నరపాలకులును, జయత్సే
నుండు, కాశ్యుండు, పంచనదాధీశు లగుభూపాలురు, ప్రాథపుత్త్రుండు,
దుర్ధర్షుండు, పార్వతీయు లగుజనపతులు, జానకి, సుశర్మ, మణిమంతుండు,
సుషాతి, మతనికుండు, పాంసురాష్ట్రాధిపాలుండు, వీర్యవంతుం డగు
ధృష్టకేతుండు, పౌండ్రుండు, దండధారుండు, బృహత్సేనుం డుద్ధ
వుండు, క్షేమకుండు, నాటధానపార్థివుండు, శ్రుతాయువు, దృఢా
యువు, సాల్వపుత్త్రుండు, కళింగదేశాధీశ్వరుండు, యుద్ధదుర్మదుండు
నగుకుమారుండు మొదలగుభూభుజులకెల్లర కీక్షణంబున దూతలఁ బంప
వలయు. ఇట్లు కావించుటయే శ్రేయం బని నాకుఁ దోఁచుచున్నయది.
వీఁడుగో నీబ్రాహ్మణుండు మదీయాగ్రపురోహితుండు. వేదవేదాంగాది
సమస్తవిద్యలం దాఱితేఱినవాఁడు; వృద్ధుండు. శ్రుతాచారసంప
న్నుండు, సత్యశీలుండు, క్షమావంతుండు, ధర్మశీలుండు నగు నీవిప్రోత్త
మునకు దుర్యోధనుండు, ధృతరాష్ట్రుండు, శాంతనవుండు, ద్రోణాచా
ర్యుండు నాదిగాఁగలకౌరవప్రధానపురుషులకడ నేయేమాట లెట్లాడ
వలయునదియు నెఱింగించి ధృతరాష్ట్రుకడ కంపుద మని వచించె.

ఆసమయంబున వాసుదేవుండు పాంచాలపతివచనంబు లాలించి యిట్లు వచించె. "సోమకధురంధరుం డగు నీద్రుపదమహీపతిభాషణంబు లెంతయు నొప్పియున్నవి. ఈమహానుభావుండు నుడివినవడువున నడచిన బాండవుల కెల్లయర్థంబులు సిద్ధించును. మన మిపుడు ముందుగాఁ జేయవలసినకార్యంబులు మంచినీతి నుపయోగించి చేయంజనును. నీతివిదూరంబు లగుకార్యంబు లాచరించుపురుషుండు బాలిశుం డనంబడు. పాండవులును, కౌరవులును మనకొక్కరీతిన బాంధవు లగుదురు. వారిరుపక్షంబులవారును సుఖంబుగ వారివారిరాజ్యంబు లనుభవించుట మనకెల్లరకును సంతసంబు." అని పలికి ద్రుపదు నాలోకించి యాతనితో మేమెల్లరమును నీవును వివాహంబునకై పిలువంబడి వచ్చినవారము. వివాహంబు సకలవైభవంబులతో సమగ్రంబై నెఱవేఱె. మనమెల్లరము మరల మనపురంబుల కరుగ నగునై యున్నది. ఈయున్నరాజలోకంబునం దెల్లఁ బ్రాయంబునను, శాస్త్రంబులనుగూడ నీవు గడు వృద్ధుండవు. మేమెల్లరమును శిష్యులవలె నిన్ననుసరింతుము. నిన్ను ధృతరాష్ట్రుండును బహుమానించు. ధనుర్విద్యాచార్యులగు కృపద్రోణులకు మిత్రుండ వగుటంజేసి వారును నీవాక్యం బాదరింతురు. నీవ యిపుడు పాండవుల కర్థకరం బగుసందేశ మంపవలయును. నీవే సందేశ మంపిన నది మాయెల్లరకును నభిమతంబ యగును. కురునరపాలుండు న్యాయపథం బనుసరించి శమంబు గావించెనేని దానఁ గురుపాండవులకు సౌభ్రాత్రంబు వర్ధిల్లును, రానున్న ప్రజాక్షయంబు నివారితంబగును. బలదర్పాన్వితుం డగు ధృతరాష్ట్రనందనుండు మోహాతిరేకంబున నీ మాటలు పెడచెవి నిడి కార్యంబున కొడంబడండేనిఁ దొలుత రాజుల నందఱం బిలువంబంచి పిదప నాకును వార్త నంపునది. మందుం డగు సుయోధనుండు మిత్రబంధుజనంబులతో సంక్రుద్ధుం డగుగాండీవికోప ఫలం బనుభవించుననిపలికి తాను బ్రయాణోన్ముఖుండయ్యె. విరాటుండు జనార్దనునకు ధనకనకవస్తువాహనాదిసత్కారంబులు పెక్కులు ప్రీతిపూర్వకంబుగాఁ గావించి సపరివారుం డగు నాతని వీడ్కొలిపె. వాసుదేవుండు ద్వారవతీపురంబున కరిగినయనంతరము యుధిష్ఠిరుం డాదిగాఁగల్గురాజవరు లెల్లరును, విరాటుండును సాంగ్రామికంబు లగుసన్నాహంబు లాచరింపం దొడంగిరి. విరాటుండును, ద్రుపదుండును, సమస్త

భూపాలురకును బంధుమిత్రామాత్యబలపరివృతులై యేతేర వార్తలంపిరి. ఆకెవార్త లాలించినన రేంద్రులెల్లరును బాండవులయెడలఁ బ్రేమవలనను పుత్ర్యపాంచాలనరపాలు యెడగౌరవమువలనను మహాబలంబులంగూర్చి కొని యుపప్లావ్యంబునకు రానారంభించిరి. ఇక్కడి యీపాండునందనుల ప్రయత్నంబులు చారులవలన నెఱింగి ధార్తరాష్ట్రులును దమతమ మిత్రులగు రాజన్యులనెల్ల రావించిరి. కురుపాండవులకు జరుగ నున్న మహాసమరంబున సాహాయ్యంబు గావింప నరుగు దెంచుమహీపతుల ప్రయాణసంరంభంబున భూతలంబెల్ల నాకులంబయ్యె. చతురంగబలంబుల పాదాఘాతంబులకు భూమి కంపించె. దెస లదరె. సాగరంబులు కలంగె. సపర్వతవనోద్దేశం బగు మహీతలం బానీకులసంరంభాటోపంబున కులికి పాతాళంబుదాకఁ గ్రుంకు తెఱంగున మహాక్షోభంబందె. ఇట్లు భయకటకంబులకు నేతెంచుసైన్యంబులు లెక్కకు మిక్కిలియై యొప్పె.

### ద్రుపదుండు తనపురోహితునిఁ గౌరవులకడకుఁ బంపుట

ఆసమయంబునం బాంచాలమహీవల్లభుండు వృద్ధుం డగు తన పురోహితునిం బిలిచి యుధిష్ఠిరు ననుమతంబున నాతనిని గౌరవుల పాలి కనుచువాఁడై యాతనితో నిట్లు చెప్పంబోడంగె. బ్రహ్మసృష్టంబు లగు భూతశ్రేణులందుఁ బ్రాణివర్గంబు లుత్తమంబులు, ప్రాణివర్గంబులందును బుద్ధిజీవు లుత్తమతం బెలంగు. బుద్ధిమంతులలో మానవులు శ్రేష్ఠులు. మనుజులందు ద్విజులును, ద్విజాతులందు వైద్యులును, వైద్యులందుఁ గృతబుద్ధులు నుత్కృష్టులు. కృతబుద్ధులందుఁ గర్తలును, గర్త లందు బ్రహ్మవేత్తలును శ్రేష్ఠతము లనంబడుదురు. నీవు బ్రహ్మవేత్తలం దుత్తముఁడవు. కులంబునను, బ్రాయంబునను, శాస్త్రంబులనుంగూడ నీవు విశిష్టుండవు. ప్రజ్ఞయందు గురుశుక్రులకు సమానుండవు. ఆకౌరవేశ్వరుని వృత్తంబెల్ల నీవెఱింగినయదయే. ధర్మనందనుసచ్చరిత్రంబును నీకుఁ దెల్లంబ. ధృతరాష్ట్రుం డెఱింగియుండఁగానే పాండవులను గౌరవులు వంచించిరి. ఆయాంబికేయుండును బహుభంగుల విదురుండు బోధించి నను వినక పుత్రుననుమతంబ యనుసరించుచున్నవాఁడు. దురాత్ముం డగు శకుని వంచనాపాటవంబున ధర్మనందనుఁ జూదంబాడఁ బిలిచె. గాంధారరాజు ద్యూతంబున నాఱి తేఱినవాఁడు. ధర్మనందనుం డక్షక్రీడానభి

జ్ఞుండు గావున వారెల్లఁ దనను బవిత్రం బగుక్షత్త్రవృత్తంబున నున్న యుధిష్ఠిరుని గర్హితంబున వంచించిరి వార లెన్నిభంగులను రాజ్యం బొసఁగకుండుటకే నిశ్చయించి యున్నవారు. నీవు ధృతరాష్ట్రునితో ధర్మార్థయుక్తంబు లగు వాక్యంబులు పలికి యక్కడి యోధప్రవరుల మనంబులెల్లఁ బాండవులయెడ వ్రాలునట్లు మరల్పఁగల్గుదువు. విదురుం డును సామర్థ్యంబెల్లను ప్రయోగించి నీమాట నెఱవేఱునట్లు సాయ మొనరించును. భీష్మద్రోణకృపాది యోధపుంగవుల కాతండు ఖేదంబు జనింపం జేయును. మంత్రులు సేనాధిపతులును భిన్నులై సమరపరాఙ్ముఖులై రేని వారల నేకముఖంబునకుం దెచ్చు టీధార్తరాష్ట్రుల కశక్యంబై యుండును. ఇంతలో నేకాగ్రబుద్ధు లగు పాండవులు సుఖంబున నావశ్యకం బగు సేనాసంగ్రహంబు గావించికొందురు. వలసినద్రవ్యసంచయంబు లెల్ల నేకరించికొందురు. నీవు పాండవులసచ్చరిత్రంబును, దుర్యోధను దుర్వృత్తంబును మాటిమాటికి బోధించి చెప్పుటం జేసి, స్వపక్షమందలి యోధముఖ్యులెల్లరు ఖేదంబునొందఁ గౌరవులసేనాకర్మము సులభం బుగఁ గావింపఁజాలకుండుట నిక్కంబు. ఇట్లు వారు భేదం బొందు టయ నీవరుగుటకుఁ బ్రధానఫలం బనికూడ నెన్నందగును. బహుకాల సంగతివశంబున ధృతరాష్ట్రుండును ధర్మ్యం బగు నీవాక్యంబున కొడం బడును. నీవు ధర్మయుక్తుండవై వారియెడ ధర్మంబు లగువచనంబులు పలుకుచు వారలెల్లరకు ననుగ్రహంబు జనింపఁజేయునది దయార్ద్ర చిత్తు లగువారికడఁ బాండవు లనుభవించినమహాక్లేశంబుల నొడువుచు వృద్ధులకడఁ బూర్వులచే ననుష్ఠితంబు లగు కులధర్మంబులు తెల్పుచు వారలమనంబులెల్ల దుర్యోధనువలన భేదింతు వనుట కింతయు సందే హము లేదు. పాపాచారు లగు ధార్తరాష్ట్రులవలన నీకొక్క కీడువాటిల్లు ననియు భయమందవలసినపనిలేదు. నీవు వేదవిదుండ వగు బ్రాహ్మణ ప్రవరుండవుకదా! విశేషించి దూతకర్మంబున నియోగింపఁబడినవాఁడవు. దూతకృత్యంబు నెఱపువారి నెవ్వరును బీడింపరనుట ప్రసిద్ధమే. అందును నీవు వయోవృద్ధుండ వగుట నీ కేభయంబును గలుగదు. నీవు పుష్య యోగంబున జయముహూర్తంబునఁ గౌంతేయుల కార్యసిద్ధికై కౌర వులకడ కరుగు మని పలికె. మహాత్ముం డగుద్రుపదుం డిట్లు పలికినపిదపఁ గులశీలాచారసంపన్నుండును, నీతికోవిదుండు, విద్వాంసుండు నగు నా

పురోహితుండు శిష్యజనంబులు సేవింపఁ బాండవులకు హితంబు గావించు
వాఁడై కౌరవాధిష్ఠితం బగు హస్తినపురంబునకు వెడలె.

### సుయోధనార్జునులు వాసుదేవునికడ కరుగుట

పాండునందను లిట్లు కౌరవులపాలికి ద్రుపదపురోహితు దూతఁ
గాఁ బంచి మిత్రులగు రాజన్యులనెల్ల సమరంబునకుఁ దోడురాఁ బిలువ
నంపిరి. ఇతరభూపాలురకడకు దూతలం బంపి వాసుదేవునిసాయంబు వేఁడ
ధనంజయుండు స్వయముగ నరిగె. వాసుదేవుండును, బలదేవుండును
వృష్ణ్యంధకభోజులతోడ ద్వారవతీనగరంబున కరిగినపిదప నంత నక్కడ
ధృతరాష్ట్రతనయుం డగు సుయోధనుండు గూఢచారులవలనం బాండ
వులచరిత్రంబెల్లఁ దెలిసికొనియె. అతండు వాసుదేవుండు ద్వారవతీ
పురంబుఁ బ్రవేశించె నని వినినంతనే స్వల్పపరిమాణం బగుబలంబుతో
ద్వారకాపురంబునకు స్వయముగ నరుగుదెంచె.

ఏదినంబున సుయోధనుండు ద్వారకానగరంబుఁ బ్రవేశించె, నా
దినముననే ధనంజయుండు నాపురంబుఁ జేరెను. ఆపురుషపుంగవు లిరువు
రును బురప్రవేశంబు గావించి మాధవుని దర్శింప నాతనిమందిరమున
కేతెంచునరి కాపురుషోత్తముండు నిద్రాధీనుండై యుండె. అపుడు సుయో
ధనుండు గోవిందుఁడు శయనించియున్న పర్యంకమునకు శిరోభాగసమీ
పంబున నున్న మహోన్నతాసనమున నుపవిష్టుండై యుండె. తరువాత ధనంజ
యుండు దుర్యోధనునివెనుకనే యాభవనంబుఁ బ్రవేశించి కృష్ణునిపాదం
బులకడఁ గృతాంజలియై వినయవినమితోత్తమాంగంబున నిలువంబడి
యుండె. అట్లుండఁ గొంతవడికి గోవిందుఁడు మేల్కాంచి తొలుదొల్తం
దనకాలుకడ నిలచియున్న కిరీటి నాలోకించి యనంతరము తలాపిదెస
నున్న కౌరవేశ్వరుం గనియె. గోవిందుఁడు వార లిరువురఁ గుశల
ప్రశ్నంబు గావించి యర్ఘ్యపాద్యాదివిధులచే యథార్హముగ సత్క
రించి వార లేతెంచిన కార్యం బే మని ప్రశ్నించె. అంత సుయోధనుండు
చిఱునగవు దోప వాసుదేవునితో 'మాధవా! మాకు జరుగనున్న సంగ్రా
మంబున నీవు నాపక్షంబుననుండి సాహాయ్య మాచరింపవలయును. నా
యందు నర్జునునందునుగూడ నీకొక్కరీతినే స్నేహంబు గలదుకదా!
అట్లే నీకు నేను నర్జునుండును సమాన మగు బంధుత్వముగలవారము,

అయినను నేను ముందుగా నీకడ కరుదెంచితిని. సద్ధర్మపరాయణు లెప్పు
డును దొలుతవచ్చినవారికే తోడునడుపుట లోకప్రసిద్ధము. నీవు
లోకంబునందలి సత్పురుషులలో నెల్ల శ్రేష్ఠతముండవు. సన్మార్గాభిరతుం
డవు. కావున నీవు సజ్జనాచారమును పాలించి నాకు సాహాయ్యంబు గా
వింపు' మని పలికె. వానివాక్యంబు లాలించి మధుసూదనుండు 'సుయో
ధనా! నిక్కంబుగ నీవు తొలుతనే యిక్కడికి కేతెంచినాడవు. ఐనను
నేను ముందుగా ధనంజయునే యాలోకించితిని. నీవు తొలుత వచ్చుట
వలనను, నేను ధనంజయునిం దొలుత విలోకించుటవలనను, మీయిరువు
రకును గూడ నవశ్యముగ సాహాయ్యము గావించుట ధర్మము కావున
మీయుభయులకునుగూడ నేను సాయ మొనర్చెదను. బాలకులు ముం
దెంచుకొనుట శాస్త్రసమ్మతం బగు నాచారంబుకదా? కావున బాలుం డగు
పార్థుండు ముం దెంచికొనందగును. నావంటివారు మహాబలపరాక్రమో
పేతులు నగుగోపాలు రర్బుదసంఖ్యగలవారు గలరు. నారాయణాభి
ధాను లగువారెల్లరును బహుయుద్ధంబులందు విజయమంది కీర్తిప్రతి
ష్ఠలం గన్నవారు. అట్టి దురాధర్షు లగువారెల్లరు నొక్కనికి సైనికులై
సమరవ్యాపారంబు సాగింతురు. నేను సన్న్యస్తశస్త్రుండనై యొక్కని
కడ యుద్ధంబుమాని కేవలము హితవాదినై యుందును. ధనంజయా!
యీమాయిరుభాగంబులందు నీయిచ్చకువచ్చినవారి నేరికొను'మని పలికె.
కృష్ణుం డట్లు పలికినంతన ధనంజయుండు సమరవ్యాపారవిరహితుం డగు
మధుసూదనునే కోరికొనియె. కృష్ణుండు దుష్టసంహారము శిష్టపరిపోష
ణముగావింప మానవలోకమున నవతరించిన సాక్షాన్నారాయణుం
డనుట సవ్యసాచి చక్కంగ నెఱింగియుండెను. దేవదానవులతోంగూడిన
రాజలోకమెల్ల నొక్కతలయు వాసుదేవుం డొక్కతలయు ననికూడ
నాతనికి విదితమే. అర్జునుం డట్లు కృష్ణునిం గోరినయనంతరము సుయోధ
నుండు వేయివేలనారాయణగోపాలుర నతిముదంబునం గోరికొనియె.
మఱియు నాతండు సవ్యసాచి కృష్ణు నొక్కని గోరుకొనినందుల
కెంతయు ముదమందెను. దుర్యోధనుం డట్లు మహాబలపరాక్రమవంత
మగు మహాసైన్యమును గైకొని కృష్ణునిచే ననుజ్ఞాతుండై బలదేవుని
కడ కరిగె. బలదేవునిచేం గుశలప్రశ్నానంతర మాగమనహేతు
వడుగంబడి తాను వచ్చినపనియెల్ల నాతని కెఱింగించె. ఆసుయోధను

వాక్యంబు లాలించి బలదేవుం డిట్లాతనికి బదులుసెప్పె. వత్సా! విరాట
నగరంబున వైవాహికావసరంబున నేను వచించినవాక్యంబులెల్ల నీవు
వినియే యుందువు. నీకై నేను జనార్దనునితో చాల నిర్బంధించి పలికితిని.
పెక్కుతడవలు మాకు మీయిరుపక్షములవారును సమానులగుబంధు
వులే యని కూడ వచించితిని. నే నెంతచెప్పినను గోవిందుడు నావాక్యం
బుల నంగీకరింపండయ్యె. నేను వాసుదేవు నెడఁబాసి యొక్కనిమేష
మాత్రంబైనను నిలువనోపను. అదికారణంబుగ నే నాక్షణంబున నే
దుర్యోధనునకేని యుధిష్ఠిరునకేని సహాయుండఁ గానోప నని నిశ్చయించి
కొంటిని. రాజా! యిలాతలంబున సకలపార్థివులచేఁ బూజింపంబడు
భారతవంశమున జనియించితివికదా? నీ కితరులసహాయత యేల? వెడ
లుము. క్షాత్రధర్మంబు నాలంబించి యుద్ధంబు గావింపు మని హలా
యుధుండు భాషించినంతన సుయోధనుం డాతని బిగ్గఁ గౌఁగిలించికొని
తనకు యుద్ధంబున విజయంబుచేకూరినట్లు సంతోషించి కృతవర్మకడ
కరిగి యాతనిసాహాయ్యము వేఁడె. కృతవర్మం డాతని కొక్కయక్షౌహిణి
సైన్యంబు నొసంగె. అపుడు సుయోధనుం డాసైన్యమెల్లఁ గైకొని
సంతుష్టహృదయుండై తనమిత్రుల యానందాబ్ధి నుప్పొంగించుచుఁ గరి
పురంబున కరిగె. అంత నిక్కడ గృష్ణుం డట్లు దుర్యోధనుండు వెడలి
నంత నర్జునునితో, "వత్సా! నేను యుద్ధంబుగావింపక శస్త్రంబు కేల
నంటక నిర్వ్యాపారుండనై యుందు నని యెఱింగియు నన్నే కోరికొని
జయసాధనం బగు మహాసైన్యంబెల్లఁ జేచేత నేల విడనాడితి"వని యడిగె.
దాని కర్జునుండు వినయవినమితోత్తమాంగుండై కరకమలములు
మొగిడ్చి యిట్లనియె.—"నీవొక్కండ వాసైన్యంబులనెల్లఁ బరిమార్ప
సమర్థుండవు దీని కింతయును సంశయము లేదు. నేనొక్కరుండనే యా
శాత్రవుల వధింపంగలను. నీవు యుద్ధం బొనరించినచోఁ బ్రసిద్ధుండ
వగు నీకే కీర్తిలభించును. నేనును గొంతకీర్తి నాశించియున్నవాఁడను.
నీ వాయుధంబుఁబూని సమరంబుగావించునెడ నాకుఁ గీర్తి లభించునా?
కావుననే నిరాయుధవ్యాపారుండ వగు నిన్నే నేను గోరికొంటిని. నీవు
నాకు యుద్ధంబునఁ జేయఁగలసాహాయ్య మొక్కటిమాత్రము కలదు.
నీవు నాకు రథచోదనంబుగావించితివేని, సురాసురనికరంబైన నే నశ్ర
మంబున జయింతును. చిరకాలమునుండియు నీవు సారథివై రథంబు

నడుపుచుండ సంగరంబు గావింపఁ గుతూహలంబు గలదు. కాదనక నాప్రార్థనంబు మన్నించి యాసాహాయ్యంబు నీ వవశ్యము గావింపవలయు” నని విన్నవించె. ఆమాటలాలించి ముకుందుండు, “పార్థా! నాతోఁ బ్రతిస్పర్థింప సమర్థుండ వగు నీ విట్లుగావించు టెంతయు నొప్పియున్నది. నేను దప్పక నీకు సారథ్యముగావింతుఁ. నీకోర్కె యెల్లభంగుల నెఱవేర్తు”ననియె. పిమ్మట ధనంజయుండు కృష్ణు ననుమతి వడసి వాసుకి ప్రవరులనెల్ల దర్శించి యనంతరము యుధిష్ఠిరునికడ కేతెంచి తాను వెడలివచ్చినకార్యంబెల్ల సవిస్తరంబుగఁ దెలిపె.

## శల్యునిరాక

పాండవప్రయుక్తదూతలవలన వార్త విని శల్యుండు మహాసైన్యపరివృతుండై మహారథులగుతనయులు పరివేష్టింపఁ బాండవులకుఁ దోడుచూప నేతెంచుచుండె. ఆతనిసైన్య మధ్యర్ధయోజనవిస్తారంబై విపులమై యొప్పె. అక్షౌహిణీపతి యగు నాతండు మహావీర్యంబు మహాపరాక్రమంబు గలిగి శత్రుజనభయంకరుండై యుండె. ఆతనిసైనికులెల్లరును విచిత్రాభరణంబులతో విచిత్రరథవాహనంబులతో విచిత్రమాల్యాంబరంబులతో స్వదేశానుగుణంబు లగు వేషభూషణములతో వేలకొలఁదిగ శత్రుదుర్నిరీక్షులై వెలుంగుచుండిరి. ఆతని సేనానాయకులందఱు నుత్తమకులసంజాతు లగు క్షత్రియోత్తములై యుండిరి. అట్టి మహానీకంబును భూతములు వ్యథనొంద మేదిని కంపింప మెల్లమెల్లన విడియించుచుఁ బాండవు లున్నయెడ కాతండు వచ్చుచుండె. మహారథుండు మహాత్ముండు నగు శల్యుండు పాండవులకు సాహాయ్యమొనరింప నేఁగుచున్నాఁడని చారులవలన విని సుయోధనుండు దాను స్వయముగ నరిగి మార్గమధ్యమున శల్యునకు సపరివారంబుగ వలసినసపర్యల గావించె. సుయోధనుండు శల్యునివచ్చుమార్గంబున రమణీయంబులగు ప్రదేశంబులందు విచిత్రరత్నాలంకారశోభితంబు లగు సభల నిర్మించె. శిల్పులు తమవిద్యాప్రావీణ్యంబు మెఱయ నాసభలందు వివిధంబు లగు వినోదంబులు రచించిరి. పరిమళభరితంబు లగు మాల్యంబులు [illegible]నంబులు భక్ష్యంబులు పేయంబులును నాసభామందిరములం దాయత్తంబులు గావింపంబడియె. మనోహర్షవివర్ధనంబులు వివిధాకారంబులు గల

కూపంబులు నానాప్రకారంబు లగుదీర్ఘికలు వివిధంబు లగునోదనంబులు సుందరంబు లగుగృహంబులును నిర్మింపించె. శల్యుండు మార్గమధ్యంబున నెడనెడ నాసభలందు దేవేశ్వరుండువోలె సుయోధనామాత్యులచేఁ బూజింపఁబడుచు సుఖంబునఁ బ్రయాణంబుసాగించె. దేవావసథంబులం బోలు నాసభలయందు నొక్కదానివిడి వేఱొక్కదానియందు విశ్రమించుచుఁ గల్యాణములు నతిమానుషములు నగు నాసభయందలి భోగంబు లనుభవించుచుఁ దానే దేవేంద్రునికంటె నధికభోగి ననియుఁ బురందరుండు దన కీడు రాఁ డనియుఁ దలంచెను. ఒకానొకసమయమున నాతండు మిక్కిలి సంతోషించి ప్రహర్షమాఁపుకొనఁజాలక దగ్గఱనున్న పరిజనులతో నీసభాంగణముల నింతవిపులంబులుగను మనోహరంబులుగను నిర్మించినయుధిష్ఠిరునిసేవకు లెవ్వరు? వా రెక్కడనున్నారు? వారికి బహుమానమీయఁ గుతూహలపడుచున్నాఁడను. కావున వారిని సత్వరంబుగ నాయెదుటకుఁ గొనిరండు. యుధిష్ఠిరుండు మెచ్చునట్లు వారల కభిమతంబు లగువరంబు లొసంగెద నని యాజ్ఞాపించె. సేవకు లామాట లాలించి విస్మయావిష్టచిత్తులై యాతనివాక్యంబులు సుయోధనున కెఱింగించిరి. శల్యుండు సంతుష్టుండై వరం బొసంగెద ననుట దెలిసికొని యంతవఱ కాతనిపరిజనులలో గూఢంబుగ గలసియున్న దుర్యోధనుం డిదియ తన్నుఁ గాన్పించుకొనుటకుఁ దగియవసరం బని తలంచి యాతని యెదుట నిలువంబడియె. మద్రనాథుండును నాతని నాలోకించి ససంభ్రమంబుగ నాతని నుచితరీతిని సత్కరించి యాతనికావించిన పరిచారంబులకు మిగుల నానందించి యాతనిం గౌఁగిలించుకొని 'వత్సా! నీకిష్టంబు లగునర్థంబుల వేఁడుము. కాదనక నాజీవితంబేని దప్పక యొసంగెద' ననియె. అంత దుర్యోధనుండు రాజోత్తమా! సత్యవాక్యుండ వగుము. నీవు ప్రతిజ్ఞగావించినవరము నా కొసంగుము. నీవు నాసర్వసైన్యంబునకును నాయకుండవై నడపుము. నాయభీష్టంబు దయనిచ్చి నీవాక్యంబు సత్యంబుగావింపు మని పలికె. అంత శల్యుండు వత్సా! నీకోరినవరం బొసంగితి. నే నవశ్యంబుగ నీసేనల నడిపెద. ఇదికాక యింకను నీకభిమతం బేదియైనఁ గలదేని వరింపు. నీ వేదికోరిన వానినెల్ల నే నవశ్యమొసంగెద ననియె. ఆమాట లాలించి సుయోధనుండు 'రాజోత్తమా! నీవాదరాతిశయంబున నామాట చెల్లింతునని వరం బొసంగితి వింతియ

చాలు. నాకు వేఱుకామం బేదియు లే దని పచించె. అప్పుడు మద్రనా థుండు 'దుర్యోధనా! నీవు సంతసంబున నీపురంబున కరుగుము. నేనరిం దముం డగు యుధిష్ఠిరునిఁ జూడ నేఁగెదను. పురుషశ్రేష్ఠుం డగు నాయుధి ష్ఠిరు నవశ్యము చూడఁగలసియున్నది. అతనిం జూచి త్వరితంబుగ నీకడకు వచ్చెద' ననియె. దానికి సుయోధనుండు 'రాజోత్తమా! యట్లే కావిం పుము. యుధిష్ఠిరు నాలోకించి వేగముగా మరలిరమ్ము. మా ప్రయత్నంబు విజయంబు నెల్లను భవదధీనములై యున్నవి సుమా! నీవు కావించిన వరదానమును స్మరించుకొనుచు శీఘ్రంబుగ మరలి ర' మ్మనియె. దానికి శల్యుండు 'వత్సా! నే నాడినమాట తరుగదు. ఒక్కపరి నాభాగినేయుల నాలోకించి శీఘ్రంబుగ నేతెంతును. నీకు మంగళం బగును. నీపురంబు నకు నీ వరుగు'మని పలికి యాతని దృఢంబుగఁ గౌఁగిలించికొనియె. దుర్యో ధనుండును శల్యుండు నొండొరుల గాఢంబుగ నాలింగనంబు గావించి కొని యొకరినొకరు వీడ్కొని దుర్యోధనుండు హస్తినాపురంబునకు మరలి చనియె.

## శల్యుం డుపప్లావ్యంబున కేతెంచుట

శల్యుండు దుర్యోధనునిచే నామంత్రితుండై పాండవులకడ కేతెంచె. అతం డుపప్లావ్యంబందలి స్కంధావారమునకుఁ జనుదెంచి యందుఁ బాండవులందఱను జూచెను. యుధిష్ఠిరుండు శల్యు నాలో కించినంతన పాద్యమర్ఘ్యము మధుపర్కము నొసంగి యథావిధిగఁ బూజించె. ధర్మనందనుం డొనరించియుపచారంబులు ప్రతిగ్రహించి శల్యుఁడు పరమసంతుష్టుండై ధర్మజుని భీమార్జునులను దనచెలియలి కొడుకు లగు నకులసహదేవులను నాలింగనంబుగావించికొని వారలతోఁ గూడ నుచితాసనమం దుపవిష్టుండయ్యె. అప్పుడు మద్రనాథుండు ధర్మనందను నుద్దేశించి 'రాజశార్దూల! నీకన్నింటను గుశలంబుకదా? దైవానుగ్రహంబు కలిమిం జేసి దుస్సహం బగు నరణ్యావాసక్లేశంబుల వలన విముక్తుండవైతివి. అనుజులతోడను సుకుమారశరీరిణి యగు నీ పాంచాలితోడను నిర్జనారణ్యములందు వసించి దుష్కరం బాచరించి తివి. రాజా! మఱియు దుశ్చరం బగు నజ్ఞాతవాసంబును గావించితివి. వత్సా! రాజ్యభ్రంశ మొదవినపిదప నన్నియు దుఃఖంబులే సమకూడును

గాని సుఖం బెట్లుగల్గును? ధార్తరాష్ట్రులు కావించిన యీమహాదుఃఖం
బులకెల్ల ఫలముగ శాత్రవులనాజిలో నిర్జించి యైశ్వర్యము సుఖంబు
లనుభవింతువు. మహారాజ! నీవు లోకతంత్రంబెల్లఁ జక్క నెఱింగిన
వాఁడవు. కావున లోభమువలన జనించెడిదోసం బిసుమంతయు నీ
చెంతఁ బొసంగదు. భరతకులనందనా! పురాణరాజర్షులమార్గ మను
సరింపుము. దానంబునను దమంబునను సత్యంబునను దృఢవ్రతుండ
వగుము. యుధిష్ఠిరా! నీయందు క్షమయు దమంబు సత్యంబు నహిం
సయు నద్భుతం బగు లోకవృత్తమెల్లను బ్రతిష్ఠితంబై ప్రకాశించు
చున్నది. నీవు మృదుశీలుండవు, వదాన్యుండవు, పరమబ్రహ్మణ్యుండవు,
దాతవు, ధర్మపరాయణుండవు నై యశంబు గంటివి. నీవు లోకసాక్షి
కంబు లగుధర్మంబు లనేకంబు లెఱింగినవాఁడవు. పరంతపా! యీజగం
బున నీ వెఱుంగనిది యొక్కటియును లేదు. భరతర్షభా! దైవంబు కృప
సెంపున నీవు వనవాసాజ్ఞాతవాసంబుల నొక్కలోపంబు లేకుండ నిర్వ
ర్తించితివి. ధర్మాత్ముండవై ధర్మనిచయం బననోపు సిన్ననుజులతోఁగూడఁ
బ్రతిజ్ఞ నెఱవేర్చినపిదప సుఖంబునం జూడఁగనుట మాభాగ్యములఫలమె
సుమ్మని పలికి, యనంతరము తానువచ్చుమార్గంబున సుయోధనుండు
గావించిన యుపచారవిశేషంబులును, దాను బ్రీతుండై యాతనికిఁ
గావించినవరదానంబు నానుపూర్వికంబుగా యుధిష్ఠిరున కెఱింగించె.
ఆవాక్యంబు లాలించి ధర్మనందనుండు 'రాజోత్తమా! నీవు చాల మంచి
పనిగావించితివి? మనంబు ప్రహృష్టంబగుడు సుయోధనునకు సాహాయ్యంబు
వాగ్దత్తంబు గావించు టెంతయు సముచితంబు. ఒక్కనియెడఁ బ్రీతులై
వానివాంఛితంబు లీడేర్చుట పెద్దల కర్తవ్యంబుగదా? నీవు కా వనక
నాకుం గూడ నొక్కమహోపకారంబు గావింపవలయు నని వేఁడు
చున్నాఁడ. ఆకార్యం బకర్తవ్యమ యయ్యును నాయెడ నీకుం గల
వాత్సల్యాతిశయంబున దానిని దప్పక కావింపఁగోరెదను. నేను గోరు
వరం బే దంటివేని విన్నవించెద నాకర్ణింపుము. మహారాజ! నీవు యుద్ధం
బున వాసుదేవునకు సమానుండవు. కర్ణార్జునులకు ద్వైరథం బగుమహా
యుద్ధంబు సంప్రవృత్తంబగుతఱిని నీ వవశ్యంబుగఁ గర్ణునకు సారథ్యంబు
గావింపవలసియుండును. ఇదినిక్కము. దీనికింతయు సందేహము లేదు.
వాసుదేవునకు సమానుం డగుసారథి నీవుదక్క మఱియొక్కం డాపక్షం

బున లేదు. నీవు నాకుం బ్రియం బాచరింపఁ దలంచెద వేని భావికర్ణా
ర్జునద్వంద్వసమరంబున నర్జునుని రక్షింప నను గ్రహింపుము. నీవు సార
థ్యంబు నెఱపునెడఁ గానీనునకుఁ దేజోనాశంబు గావించి మాకు విజ
యంబుఁ బ్రసాదింపుము. ఈ కార్యం బకర్తవ్యంబైనను, మాయెడ
వాత్సల్యంబు పెంపున నీ వీకార్యం బాచరింపవలయు నని ప్రార్థించె.
అతని ప్రార్థనం బాలించి మద్రేశ్వరుండు ధర్మనందనా! నీ కెల్లవిధంబుల
భద్రంబగును. దురాత్ముం డగు సూతనందనుని తేజోవధంబునకై నన్న
భ్యర్థించితివి కదా? తప్పక నేను నీ చెప్పినచొప్పునఁ గావింతును. సంగ్రామ
రంగమ్మున నేను దప్పక వానికి వధంబు గడపెదను. సుయోధనుండు
నాతనిపక్షంబువా రగు రాజులెల్లరు నన్ను వాసుదేవునకు సమాను
నిఁగా భావించుచున్నారు. ఆదురాత్ముం డగు కర్ణుండు సమరంబు గావించు
నపుడు నే నెల్ల భంగుల వానికిఁ బ్రతీపంబు లగువచనంబులు పలికి తేజో
హాని గలిగించెద. నామాటలచే వాఁడు దర్పంబు నశించి తేజంబు
రూపుమాసియున్నతఱి నర్జునుండు వాని నశ్రమంబున వధింపఁగల్గును.
నీ యీకోరిక తప్పక నెఱవేర్చెద. ముమ్మాటికిని సత్యము వచించు
చున్నాఁడను. ఇంతియ కాక నీకుఁ బ్రియమగు కార్యం బేదియున్నను
దప్పక కావింతును. నీవు దుర్ద్యూతంబున మిగుల దుర్భరంబు లగు
దుఃఖంబు లొందితివి. ఆదిగర్భేశ్వరి యగు నీపాంచాలితోఁగూడ మీ
రనుభవించినక్లేశంబులకు రాలును గఱఁగకుండునే? సూతపుత్రుండు
నాఁడట్లు నిండుసభలో వెక్కసంబు లగుపరుషంబులు పలికె. జటాసు
రుండు వనంబునను గీచకుండు విరాటసదనంబునను నట్లవమానములు
గావించిరి. తొల్లి దమయంతి మహాక్లేశంబు లనుభవించినరీతిని మహాపతి
వ్రతయగు నీపాంచాలి యాయాదుఃఖంబు లెల్ల ననుభవించినది. వీర
చూడామణీ, యీదుఃఖంబు లెల్లను మీ కవశ్యంబు సుఖోదర్కంబు
లగును. దైవికంబులుగఁ బ్రాప్తించిన యీక్లేశంబులకు నీవింతయు వగవ
కుము. దైవవిహితంబు లగుశుభంబులే నహితంబులే ననుభవింపక తీఱదు
గదా? కావుననే దైవము బలవత్తరమని యార్యు లండ్రు. దైవవశం
బున నెంతటిమహాత్ములైన నొకప్పుడు దుఃఖంబు లనుభవింతురు. దేవ
తలుగూడ దుఃఖంబు లనుభవించి రని పురాణంబులవలనఁ దెలియుచున్నది.
తొల్లి దేవతల కెల్ల రాజై ముల్లోకముల కధీశ్వరుం డగు మహేంద్రుం

ఘను భార్యతోఁగూడ దుస్తరం బగుదుఃఖ మనుభవించె నని వింటిము
కదా? నీవు శాంతచిత్తుండవై గతంబునకు వగవక సుఖంబు లనుభవింపు
మని పలికె.

## ఇంద్రుండు వృత్రాసురవృత్తాంత మెఱింగించుట

మద్రనాథుండు తొల్లి పురందరుండు సభార్యుండై మహాదుః
ఖంబు లనుభవించె నని చెప్పఁగా నాలించి తత్కథాకర్ణనకుతూహలాం
యత్తచిత్తుండై ధర్మనందనుండు 'రాజోత్తమా! యేకారణంబున సురేశ్వ
రుండు ఘోరం బగుదుఃఖ మ్మనుభవించె? ఆదుఃఖ మెట్టిది? విస్తరంబుగ
నానతి మ్మని యడుగుటయు నాతం డిట్లు చెప్పందొడంగె—మహాతపశ్శా
లియు దేవశ్రేష్ఠుండు నగు త్వష్ట యను ప్రజాపతి కలఁడుకదా? ఆప్రజా
పతి మున్నొకసమయంబున నింద్రద్రోహంబు గావింప నెంచి యింద్ర
పదంబు బలంబున నపహరింపఁజాలు కుమారుని మూఁడుతలలుగలవానిని
సృజించి వానికి విశ్వరూపుం డని నామంబు గావించె. విశ్వరూపుండు
పుట్టినతోడన దేవేంద్రపదము నభిలషించె. వానివదనములుమూఁడును
దివాకరుండు నిశాకరుండు ననలుండును సాటిగా వెలుంగుచు ఘోర
రూపంబులై యుండె. వాఁ డొక్కముఖమున సోమపానము గావించు
చుండె. వేఱొక్కదానితో సురాపానము గావించుచుండె. మూఁడవ
ముఖముతో దెసలనెల్ల గ్రహించుకై పడి భయంకరంబుగ విలోకించు
చుండె. ఇట్లుండి వాఁ డింద్రపదప్రాప్తికై తపంబుసేయ నిశ్చయించి
శాంతుండు దాంతుండు మృదుశీలుండు నై ధర్మంబునను దపంబునను
నేకాగ్రుండై సుదుశ్చరం బగు మహాతీవ్రతపంబు గావించె. వానితపో
బలంబును సత్యంబును నమితంబుగ నంతకంతకుఁ బ్రవర్ధమానం బగు
తేజంబు నాలోకించి పాకశాసనుండు దిగులొంది మిగుల భయాకులుం
డయ్యె. మఱియు నిట్లు మనంబునం దలపోసె. వీనితపంబు నుగ్రత్వముం
గాంచిన నీతఁ డింద్రపదము తప్పక హరించు నని తోఁచుచున్నది. అంత
కంతకు వివర్ధమానుం డగు నీత్రిశిరుండు భువనంబు లెల్ల నవలీల గ్రసిం
చును. కావున వీనివలన లోకంబుల కొక్కబాధ పొడమకుండ నుపా
యంబు గావింపవలయు. ఇపుడు వీఁ డీఘోరతపంబు వీడి భోగంబులం
దాసక్తుఁ డగునట్లు గావించితినా! లోకంబులకు భయంబు గలుగకుండు

నని నిశ్చయించె. ఇట్లు పాకశాసనుండు తనమనంబున నిశ్చయించి యప్సరసలను బిలిచి వారలతోఁ 'త్రిశిరుం డగు త్వష్ట్రనందనుండు తపంబుం జాలించి కామోపభోగంబులం దాసక్తుం డగునట్లు వానిని బ్రలోభమునకు వశుండుగా నొనర్పుఁడు శృంగారంబు లగువేషంబులు ధరించి మనోహరంబు లగుహారంబులతో విస్తృతం బగుశ్రోణిపయోధరం బులతో హావభావవిలాసంబులు మెఱయ సర్వాతిశాయిసౌందర్యాభి రామలగు మీరలు వాని నెట్లయిన నీయుగ్రతపంబునుండి మఱలించి కామ పరాధీనమానసుం గావింపుఁడు! నాహృదయమందలిభయం బెడలిం పుఁడు. వానివలనిభయంబున నేను మిగుల నస్వస్థుండ నై నాలో నేనే కుందుచున్నాఁడను. మీ రెల్లవిధంబుల నాభయము వాప వలంతులరు. త్వరితంబుగ వెడలుఁడు. మీకు భద్రం బగుఁగాక.' యని యానతిచ్చె. ఇంద్రుఁ డట్లాజ్ఞాపింప నాయచ్చరలేమలు కరకమలంబులు మొగిడ్చి, 'దేవా! నీహృదయమందలిభయంబు తొలంగునట్లు వానిని గామా యత్తునిఁ గావింప యత్నంబు సేయుదుము. కన్నులచే దహించువాఁడు వోలెఁ దపంబు కావించుచున్న యాతపోనిధిని లోభపరవశుం గావిం చుట కిదే మేము వెడలుచున్నవారము. వానిని వశము గావించికొని నీభయము తొలంగించుటకు విశేషంబుగఁ బ్రయత్నము గావింతుము. నీ విక్కడ సుఖముండు'మని పలికి యమరేశ్వరునానతి గైకొని వార లెల్లరు నాత్రిశీర్షుండు తపం బొనరించు నాశ్రమంబున కక్రమంబునం జనిరి. అచ్చట నాయచ్చరలు వివిధంబు లగుహావభావంబులచేఁ దమశరీర సౌష్ఠవంబులు బహుప్రకారంబులఁ జూపుచు నెన్నియేని శృంగారచేష్టలు గావించిరి. మహాతపం బొనరించుచుఁ బూర్ణసాగరంబునకు సాటియగు నామూఁడుతలలముని వారివిలాసచేష్ట లాలోకించియు మధురగానంబు లాలించియు శరీరసౌరభంబు లాఘ్రాణించియుఁ దనూసంస్పర్శంబు లను భవించియు నింద్రియంబులఁ జెవరనీక మనమందు దృఢంబుగ బంధించి యొక్కింతయు వికారంబు లేకయుండె. ఆసురసుందరీసందోహం బిట్లు విఫలప్రయత్నం బై లజ్జావనతాననకదంబంబులతోఁ దిరిగి సురేంద్రుని కడ కేతెంచి 'దేవా! నీయానతిఁ దలఁదాల్చి మేమెల్లరమల్ల తాపసకడ కేగి మామోపినన్ని ప్రయత్నంబులు గావించితిమి కాని యాతం డెంతయు వశపడలేదు. దుర్ధర్షుం డగు నామహామునిధైర్యంబు తొలఁగించుటకు

మేమేకా దేవ్వరును సమర్థులు గారు. మేము చేయఁదగినంత చేసితిమి. ఇంక మేము చేయునదేదియు లేదు. నీవు నీయిచ్చవచ్చువడువున గావింపు మని పలికి యింద్రున కభివందనంబు లాచరించి వానిచే ననుమతిం బడసి యథేచ్ఛం జనియె.

## ఇంద్రుండు త్రిశీర్షుని వధించుట

అనంతర మమరనాథుండు వారనారీనికాయంబును నికామంబు పూజించి పంచి యాత్రిశీర్షునివధోపాయంబు నేకాంతంబునఁ జింతింపం దొడంగె. పెద్దప్రొద్దు చింతించి చింతించి యెట్టకేలకు వానిని వజ్రంబునఁ బ్రహరించి వధింప నిశ్చయించె. బలవంతుఁడు తనశత్రు వెంతటి దుర్బలుండైనను బ్రవర్ధమానుం డగునెడ నుపేక్షింపంజనదు. శాత్రవు లల్పబలముగలవారై యున్నతఱిన నారి నుపాయంబున సంహరించుట శాస్త్రసమ్మతంబు. కావున వీని నిప్పుడు తప్పక పరిమార్పవలయునని నిశ్చయించి యాతండు వైశ్వానరసన్నిభంబై ఘోరంబు భయావహంబు నగు వజ్రాయుధంబు సన్నద్ధంబు గావించి క్రోధాతిరేకంబున దానితోఁ ద్రిశిరునిఁగొట్టెను. ఆవజ్రంబుచే దృఢంబుగ నేటువడి త్రిశీర్షుండు పిడుగుతాఁకునఁ బగిలిపడిన కొండశిఖరమువలె నిలాతలంబునం బడియె. నేల నీల్గిపడియున్నను వానిశిరంబులు మూఁడును మూఁడగ్నులువోలె వెలుంగుచు భయంకరంబులై కన్పట్టుచుండుటం జూచి సురేంద్రుండు భయము విడువంజాలఁడయ్యె. వజ్రాహతుండై పర్వతంబువలె నేలఁబడి యును వాఁడు తేజోవిశేషంబున జీవించియున్నవడువుననే యుండెను. వానిశిరంబులు సజీవంబులువలె మిగుల భయంకరంబులై యుండె. వానిం గాంచి సురనాయకుండు మహాభయపరీతచిత్తుండై యేమిచేయుటకును దోఁపక దిక్కులు సూచుచుండె. అంత నాసమయంబున దేవరాజు మనంబున భీతివాపుటకో యన నొక్కతక్షకుండు తీక్ష్ణధారం బగు కుఠారంబు మూఁపున నిడుకొని యాప్రదేశంబున కరుగుదెంచె. దారువులఛేదించు నావర్ధకి నాలోకించి దేవేంద్రుండు కొంతధైర్య మవలంబించి వానిం జేరంజేరి 'యోరి నీ వీత్రిశిరస్కునితలలను ముక్కలు ముక్కలుగా నఱికివేయుమని వచించె. అదివిని యాయగసాలి యిాపడి యున్న యాతఁడు మహాబలశాలి. ఈతనిస్కంధంబు లుక్కుకంబెను

బలిష్ఠంబులై చూపట్టుచున్నవి. నాపరశు వల్పబలముగలది. దీనితో నీతని ఛేదించుట సాధ్యముగానేరదు. అదియునుంగాక, యట్లు విగతాసుండై పడియున్న యనపరాధునితలలు దునుముట సజ్జనవిగర్హితం బగు నీచ కార్యము. అట్టినీచకార్యముగావింపనేనొల్ల'ననియె.అదివిని యింద్రుండు 'ఓయీ! నీవు భయపడకుము. నామాట నిరాకరింపక వెంటనే వీని తలలు ద్రుంపుము. నాప్రసాదంబునంజేసి నీకుఠారంబు వజ్రకల్పంబై కఠోరతరం బగు'నని వచించె. ఆపలుకు లాలించినంతన యావర్ధకి యాతం డెవ్వండో గొప్పనిగ్రహానుగ్రహసామర్థ్యముగల దివౌకసుండుగావల యు నని నిశ్చయించి యాతనితో 'నోయీ! ఘోరకర్మాచరణంబునకుఁ బూనిన నీ వెవ్వండవు. నీయాకారంబు గొప్పపదవిని సూచించుచున్నది. నీచేయుకర్మంబు మిగుల గర్హాపాత్రంబై యున్నది. సజ్జనగర్హితం బగు నిట్టిక్రూరకార్యముచేయు నీవాస్తవ చరిత్రం బెఱుంగక నే నీపని చేయఁజాల నని ప్రత్యుత్తరంబిచ్చె. అపుడు సురేశ్వరుండు 'శిల్పీ నేను త్రిలోకాధినాథుం డగు దేవేంద్రుండను. ఒక్కకారణంబున నీత్రిశీర్షుని వధంబు లోకకాంక్షితంబై యుంటఁ దాని కుపక్రమించితి. నీవు లేని పోనిశంకల మది నిడుకొనక నిర్భయంబున నావాక్యానుసారివై యీ తలల ద్రుంపు'మని వచించె. ఆమాట లాలించినంతనే యాతక్షమనంబున సురేంద్రునియత్నంబునకు మిగుల రోసి 'శక్రా! క్రూరం బగు నీకార్యం బాచరించుటకు నీకు లజ్జలేకపోయెనా? ఋషికుమారుండు ఋషివ్రత సంపన్నుండు నగు నీమహాత్ము ననపరాధు నకారణంబున వధించితివిక దా? నీకు బ్రహ్మహత్యామహాపాతకంబువలని భయమైన లేకుండెనా?' యనియె. దాని కింద్రుండు వర్ధకీ! ఈతనివధంబువలన లోకంబులకు హితంబు గల్గును. లోకహితంబుఁబొంకె నెట్టిదుష్కార్యములైనఁ బార్థి వులు గావించుట న్యాయ్యముగదా? ఈతని వధించిన బ్రహ్మహత్య సంభ వించునని నే నెఱుంగుదును. ఈతండు విగతాసుండయినపిదపఁ బావన త్వంబుసంపాదింప సుఘోరంబగువ్రతంబు గావించెద. మహావీర్యోపేతుం డగు నీశాత్రవుని వజ్రంబున వధించితిని. అయిన నీతనిశిరంబులకాంతి చూచి నేను భయోద్విగ్నుండ నై యున్నాఁడను. నీవు శీఘ్రముగ వీని తలలు ముక్కలుముక్కలుగా నఱికివేయుము. నీకుం దగినబహు మానము గావించెద. మానవు లొనరించుయాగంబులందు పశువు

యొక్క శిరము నీకు భాగంబుగా నిప్పింతును. నీ వీలాభం బంగీకరించి త్వరితంబుగ నాకిష్టంబుగావింపుమని యానతిచ్చె. మహేంద్రుం డిట్లాజ్ఞాపింప వాఁడు దాని కంగీకరించి కఠోరం బగుకుఠారంబున ద్రిశీర్షుని శిరంబులను ఖండఖండములుగ నఱికివైచెను. ఆతలలు నఱుకునపుడు వానివలనఁ గపింజలములు తిత్తిరపులుగలవింకములు ననునండజములు బయలువెడలి యాకసం బెల్ల నిరంధ్రముగ వ్యాపించె. ఏకశిరంబువలన వేదంబులఁ జదువుచు సోమపానంబు గావించెనో యావక్త్రంబువలన గపింజలంబు లుద్భూతంబులయ్యె. ఏముఖంబున దెసలెల్ల గ్రసించు పడువున నిరీక్షించెనో దానివలనఁ దిత్తిరంబులు ప్రభవించె. ఏవదనంబున సురాపానంబు గావించెనో దానివలనఁ గలవింకములును శ్యేనంబులు సుత్పన్నంబులయ్యె. ఇట్లు త్రిశీర్షుని వధించి మనంబున భయంబు వాసి దేవేంద్రుండు హృష్టస్వాంతంబునఁ ద్రిదివంబున కరిగి సుఖంబుండె. ఆతక్షకుండును సురేశ్వరానుగ్రహంబున యజ్ఞభాగం బంది తనగృహంబున కరిగె. సురనాయకుండు త్రిశీర్షుని వధించుటవలనఁ దన్నుఁ గృతార్థునిగాఁ దలంచి నిర్భయంబున నుండె.

## త్వష్ట వృత్రుని సృజించుట

అంత నిక్కడఁ బ్రజాపతి యగు త్వష్ట శక్రుండు తనతనయుని వధించుట తెలిసి శోకాతిరేకంబునఁ గొంతవడి నిశ్చేష్టుండై యుండి యెట్టకేలకుఁ గొంత ప్రొద్దునకుఁ దెలిసి క్రోధసంరక్తనయనుండై యిట్లనియె. మహాక్లాంతుండు దాంతుండు జితేంద్రియుండునై నిత్యంబును దపం బాచరించుచుఁ బరమశాంతవృత్తిమై నున్న నాతనయు నేయపరాధంబును లేకుండనే యకారణంబుగ వధించినశత్రు నుపేక్షించుట భావ్యంబు గాదు. నే నిప్పుడ నాతపోబలంబున శక్రుని వధింపఁగల్గుపుత్రు నొక్కని సృజించెద. లోకంబులెల్ల నిపుడు నావీర్యంబును దపంబు పెంపును బరికించునుగాక. దురాత్ముండు పాపచిత్తుండు నగు దేవేంద్రుం డిపుడు నాప్రభావంబు దెలిసికొనుఁగాక.' యని కోపాటోపంబున వచించి యాతపోనిధి యగ్నియందు సమిదాజ్యలాజకుశాక్షతంబుల వ్రేల్చి ఘోరాకారుం డగు వృత్రుని సృజించె. వానితో నింద్రశత్రుండవై నా తపోబలంబున వివృద్ధుండ వగు మని వచించె. ఆక్షణంబ సూర్యవైశ్వా

నగోపముం డగువాఁడు ప్రళయకాలాదిత్యుండువోలె దుర్నిరీక్ష్యుండై దివంబును సంస్తంభించి త్వష్టతో నేకార్యము గావింపవలయునో యానతిమ్మని పలికె. త్వష్టృప్రజాపతి వానివాక్యంబులకును దేజోవిశేషంబునకును గరం బలరి వత్సా! త్వరితగమనంబున సురేశ్వరునిపై కరిగి వాని వధింపు మని వచించె. జనక నియుక్తుండై వాఁడు కాలానలంబువోలె విజృంభించి త్రిదివంబున కరిగి యమరనాయకుని యుద్ధంబునకు రమ్మని పిలిచె. ఇంద్రుండు వానిగర్వాలాపంబు లాలించి పౌరుషాతిరేకంబు మెఱయ నైరావతంబు నారోహించి కేల వజ్రంబు ధరించి ద్వాత్రింశదాయుధంబులు పదిలపఱచికొని మూర్తీభవించిన వీరరసంబుమాడ్కి బయలువెడలి వృత్రునిం దలపడియె. వృత్రుండు నిరాయుధుం డయ్యు ననేకాయుధోపేతుండువోలె బాహుబలంబు మెఱయ నింద్రునిశస్త్రాస్త్ర సంచయంబెల్ల భంజించుచుండెను. మహాఘోరం బగు నాసమరంబున సురేంద్రుండు తనకైదువులెల్ల వమ్మగుడుఁ గ్రోధసంరంభంబున దంభోళి నెత్తి వృత్రునెత్తినివైచె. వృత్రుండా ప్రహారంబు తూలికాప్రహారంబు వలె సరకుసేయక కోపాటోపంబు మెఱయ నింద్రునిఁ దనవలకేలఁ బట్టి కొని భల్లూకంబు తేనెపెర గ్రసించుపోల్కి నాసహస్రాక్షుని దనవదన కుహరంబున వైచి మ్రింగె. ఆసమయంబున సురానీకంబులు హాహాకారంబులు గావించి భయభ్రాంతులైరి. దేవత లపుడు తమసామర్థ్యంబు మెఱయ వృత్రున కావలింత పుట్టించిరి. వృత్రుండు పాతాళగహ్వరంబుంబోని తనవదనగహ్వరంబు తెఱచి యావలించునంత సురేశ్వరుండు తనయంగంబులెల్ల సంక్షేపించి సూక్ష్మరూపుండై వెలుపలి కుఱికి. వచ్చె. వృత్రవదనమువలన వెడలివచ్చినయమరేశ్వరుం గాంచి యమరులెల్లరు హర్షంబునొందిరి. నాఁడుమొదలుగ నెల్లజీవులకును జృంభిక ప్రాణాశ్రితయై యొప్పుచుండె. ఇంద్రుండు మరల వృత్రునిం దలపడి ఘోరం బగుపోరు గావింపఁదొడంగె. మొక్కవోని పరాక్రమంబునఁ బిగుదివియక పోరు నాబిరుదుమగలసమరప్రకారంబు చూడ నద్భుతంబై మహాభయంకరంబై యొప్పె. వృత్రుండు త్వష్టృప్రజాపతితేజంబున నంతకంతకు మహాబలంబు వృద్ధిఁబొందుచుండి దుర్నిరీక్ష్యుండై వెలుంగుచుండె. అది కని యమరేశ్వరుండు తన కెట్టును విజయంబు దుర్లభంబనియు ప్రజాపతి మహాతేజంబు దుర్నివారంబనియు నిశ్చయించి సమర

వ్యాపారంబు చాలించి వెనుకకు మరలివచ్చె. దేవతలెల్లరు సురేశ్వరుం డిట్లు పరపరాఙ్ముఖుం డగుట కెంతయుఁ జింతించి మునులతోఁ గూడి సురేశ్వరుని ముందిడుకొని మందరాచలంబున కరిగి యందు ముందరి కార్యంబు తెలియక మనంబున సకలచరాచరాత్మకుం డవ్యయుండు సనాతనుండు నగు నారాయణుని ధ్యానించిరి. ఆసమయంబునఁ బాకశాసనుండు దివౌకసుల కిట్లనియె. అవ్యయం బగు నీజగం బెల్ల వృత్రునిచే వ్యాప్తంబయ్యె. వాని ప్రతిఘాతంబునకు సమర్థంబగువస్తు వెద్దియుఁ గాన రాదయ్యె. నేను దొల్లి యమేయబలపరాక్రమవంతుండనై మిగుల సమర్థుండనై యుండియు నిప్పు డెంపలకుఁగొఱగానివాఁడనైతి. నే నేమి చేయుటకును దోఁపకున్నది. ఏభంగిని జూచినను వృత్రుండు దుర్ధర్షుండై వెలుంగుచున్నవాఁడు. అమితవిక్రముం డగువా డంతకంతకుఁ దేజంబు పెంపొంద యుద్ధంబున దుర్నిరీక్షుండై యున్నాఁడు. దేవాసురమానుషులతోడి మూఁడులోకంబులు వానిచే గ్రసింపంబడియె. కావున నిపు డుపాయంబునంగాని వానిని జయింప నసుప్ర గాన రాదు. నానిశ్చయం బాలింపుఁడు. ఇపుడు మన మెల్లరమును మహాత్ముం డగు విష్ణుదేవుని పాలి కరిగి యాతని కీవృత్తాంతమెల్ల నెఱింగించి వృత్రుని వధించు నుపాయంబు తెలుప వేఁడుదము. ఈమహాత్ముం డానారాయణు నుపాయంబునంగాని నేలం గూలం డనియె.

ఇట్లు దేవేంద్రుండు వలుక దేవతలు మునులును వల్లె యని ముకుళితకరకమలపుటంబులు నిటలతటంబుల మోఁపి నారాయణు నిట్లు వినుతింపఁదొడంగిరి. "నారాయణా! తొల్లి నీవు మూఁడడుగులచే మూఁడు లోకంబుల నాక్రమించితివి. జగన్మోహనా! నీవు దైత్యుల వధించి యమృతంబు దెచ్చి యమరుల కిచ్చితివి. దంభవామనా! నీవు బలిని బంధించి సురరాజపదంబునఁ బురందరుం బ్రతిష్ఠించితివి. సర్వదేవతలకు బ్రభుండవీవ. నీచే నీప్రపంచమెల్లఁ బరివ్యాప్తంబై యున్నది. సర్వలోకనమస్కృతుండ వగు నీవ దేవతలకును దేవుండవు. నీవ మహాదేవుండవు. అమరేశ్వరునితోఁ గూడి యిడుమలం బడుచున్న యమరగణంబులకు నమరోత్తముండ వగునీవ గతి కావలయు. నీవు తొల్లి త్రివిక్రమాకారంబున నెట్లు జగంబున వ్యాపించితి వట్లు యిపుడు వృత్రుండు జగంబెల్ల నిండి యున్నాఁడు. వానిభయంబు వాపి లోకంబులు నిరాకులంబులు గావింప

నీవు తక్క నితరులోప"రని వినుతించినంత నారాయణుండు వారియెదుట సాక్షాత్కరించి వారి నాశ్వాసించి యిట్లనియె. "అమర ప్రవరులారా! మీకు హితమగుకార్య మవశ్యము నాచరించుట నావిధి కావున నా దురాత్ముండు నశించుసుపాయం బెఱిఁగించె. మీరెల్లరును, గంధర్వులను, మహర్షులను ముందిడుకొని విశ్వరూపము దాల్చిన యావృత్రుని కడ కరుగుఁడు. మీరెల్లరును వానితో సామవచనంబులు పలికి వానికి సురేశ్వరునితో సఖ్యంబు సమకూర్పుఁడు. అవసరంబయినపుడు వాని వధింపఁగలరు. నాతేజంబుపెంపున శక్రున కవశ్యంబును విజయంబు లభించును. నేనదృశ్యుండనై వజ్రపాణివజ్రంబున నావేశింతును. అపుడు వాఁడు తప్పక నశించును. మీ రాలస్య మొనరింపక యీక్షణంబ తరలి వానికడ కరిగి వాని కింద్రునితో సఖ్యంబు సమకూర్పుఁడు. మహర్షులను గంధర్వులను బంచి వానితో సంధిగావింపుం" డని పలికి నారాయణుం డంతర్హితుండయ్యె. ఆసమయంబు రమామనోహరుం డంతర్ధానంబయినంతన దేవత లెల్లరుఁ బ్రహృష్టాంతరంగులై మహర్షిగంధర్వ ప్రవరులతోఁ బురందరుని ముందిడుకొని వృత్రునికడ కరుగుదెంచిరి.

## ఇంద్రుండు వృత్రునితో సంధిగావించుట

ఆసమయంబున వృత్రుండు ప్రజ్వలించుచున్న తన తేజోవిశేషంబున పదిదిక్కులువెలుంగ సూర్యచంద్రులతోఁగూడ మూఁడులోకములు గ్రసించుచున్నట్లు మిక్కిలి భయంకరుండై వెలుంగుచుండె. వానిం జూచి మహర్షి పుంగవులు దూరంబున నుండియు సాధువాక్యంబులు వచించుచు సమీపించి ప్రియపూర్వకంబుగా వానితో నోయీ! నీవు మహాతేజోవంతుండవు. నీతేజం బీజగంబు లెల్లెడల వ్యాపించియున్నది. అట్లయ్యును నీవు వాసవుని జయింప సమర్థుండవుగావు. బలరిపుండును నిన్ను జయింపఁజాలడు. మీరిరువురును బహు కాలము యుద్ధ మొనరించియు జయాపజయంబులు గననేరక యలసియున్నవారలు. బలవంతులరగు మీయిరువురకదనంబువలన దేవాసురమానుషులతోఁగూడఁ బ్రాణివర్గంబులు మిగులఁ బిడితంబులైయున్నవి. ఇంకను మీరిట్లు కలహించుట లోకవినాశంబునకు హేతువగును. కావున మీరిరువురును శాంతినొందవలయు. నీవు సురేశ్వరునితో నెలపుదును

సఖ్య మాచరింప మేమెల్లరము నభిలషించుచున్నారము. నీ కింద్ర లోకంబులు శాశ్వతంబుగ సుఖభోగ్యంబులై యుండును. కావున నీవు ప్రసన్నుండవగు మని పలికిరి. ఆవాక్యంబులు విని వాఁడు కరకమలం బులు శిరంబున నునిచి ఋషులకు నమస్కరించి వారలతో మహాభాగు లారా! మీరును గంధర్వప్రవరులు నానతిచ్చినవాక్యంబు లాలించితిని. లోకహితంబుపొంటె మీరు వచించువాక్యంబులు నాకెంతయు సంత సంబు నించినవి. నేను దప్పక మీమాన దలఁదాల్చి యుద్ధంబుమానెద. నావచనంబుకూడ నొక్కటి మీ రాలకింపుఁడు; నేను దేజోవంతుండ నని మీర వచించితిరి. సురేంద్రుం డధిక తేజశ్శాలియనుట లోకప్రసి ద్ధమేకదా? అట్టియెడ మాయిరువురకు సంధిపొసఁగుట యెట్లో మీ రాలోచింపుఁడనియె. అదివిని మహర్షులును, గధర్వులును వానితో మహాతేజశ్శాలీ! నీవన్నయర్థంబు యథార్థంబేయైనను సంధిచేసికొను టయే లెస్స యని మాకుఁ దోఁచుచున్నయది. ఎన్నిప్రయత్నంబు లాచ రించియైన నొక్కపరి సత్పురుషులతో సంగాతము గావింపవలయు. దాని వలన శుభము చేకూరును. ఎప్పుడును సత్పురుషులమైత్రి నిరాకరింపం జన దని వేదంబులు వక్కాణించుచున్నవి. కావున సజ్జనసాంగత్యము తప్పక కావింపవలయు. ధీరుండు తనహితుల కెల్లపుడును సజ్జనసాంగ త్యము నుపదేశింపవలయును. అర్థకృచ్ఛ్రంబు ప్రాప్తించునెడ హితా ర్థము బోధింపంజనును. సత్పురుషులతోడిమైత్రి మహార్థంబు లశ్రమం బున సమకూర్చునుగావున నెప్పుడును సత్పురుషస్నేహామే యభిలష ణీయము. ఇంద్రుండు సజ్జనులలోనెల్ల నుత్తముఁడు. అసంఖ్యాకు లగు మహాత్ము లీతనిప్రాపున సుఖించుచున్నవారు. ఆతఁడు సత్యవ్రతపరాయ ణుండు అనింద్యచారిత్రుండు. సకలధర్మాధర్మవిదుండు. ఏమేని నొక్క కార్యసంశయంబు సంభవించినపుడు సూక్ష్మనిశ్చయ మొనరించుటయం దసమానప్రజ్ఞకలవాఁడు. అట్టి దేవేంద్రునితో నీ వెల్లపుడు నెయ్యం బున నుండుట లోకహితం బగును. ఇంద్రునెడ నీ వించుకయు శంకింప వలదు. తప్పక సంధి కావింపు మని వచించిరి. ఆమహర్షులయు, గంధర్వు లయు వాక్యంబు లాలించి వృత్రుండు మహాత్ములారా! మాననీయు లగుమిమ్ముల నే నవశ్యము గౌరవింపవలయును. మీవాక్యము లంగీక రింపక నిరాకరింపం జనదు. నే నొక్కటి వాంఛించెదను. దానిని దేవత

లంగీకరించిరేని ద్విజపుంగవులు తపోనిధులు నగు మీర లానతిచ్చినదెల్ల శిరసావహించి యాచరింతును. ఎండినదానను, దడిసినదానను, ఱాతను దారువునను, శస్త్రంబున, నస్త్రంబునను, పగటియందును, రాత్రియందును, దేవతలెల్లరకును, దేవేంద్రునకునుగూడ నవధ్యుండ నగునట్లు నాకు వరంబు కృపసేయఁ బ్రార్థించెదను. ఈ నాప్రార్థనమును మీరు కాదనక యొసంగితిరేని నే నెల్లప్పుడును సురేశ్వరునితో నెయ్యంబు నెఱపెద నని పలికినంత మహర్షులు వానికుటిలవచనంబులకుఁ దలంకియు శ్రీవిష్ణుదేవుని ప్రతిజ్ఞను దలంచికొని ధైర్య మవలంబించి వల్లె యని వాని వాంఛితంబులెల్ల నంగీకరించిరి. వృత్రాసురుండు మహర్షులవలన దుర్లభంబగువరంబు గడించి ప్రముదితాత్ముండై నిత్యంబును సురేశ్వరునియెడ సానురాగంబుగను, సగౌరవంబుగను దేవతలయెడ సప్రేమబహుమానంబుగనుం బ్రవర్తించుచుండె. వాసవుండును వానితోడిసంధి లభించుటకు హర్షించియు లోలోన వానిని వధించుటకుం దగునుపాయంబు లరయుచునే యుండెను. ఛిద్రం బన్వేషించు నాతం డెల్లవేళలందును సముద్విగ్నమానసుండై యుండెను. ఇట్లు కొంతకాలంబు చనినవెనుక నొకానొకదినంబున వృత్రాసురుం డొంటిపాటున సముద్రతీరంబున విహరింప నేఁగి సంధ్యాకాలం బగునంతకు నచ్చోటనే విహరించుచుండె. సురేశ్వరుం డాసంజవేళ నక్కడ నాతనిం గాంచి వాని వధించుటకిదియ తగునదనని నిశ్చయించి తనమనంబున నిట్లు తలపోసెను. ఇప్పుడు రౌద్రం బగుసంధ్యాకాలంబు ప్రవర్తించుచున్నయది. ఇది రాత్రియుం గాదు. పవలునుం గాదు. ఈసమయంబున వానికి సహాయు లెవ్వరును లేరు. వాఁడు సంధివచనంబుల విశ్వసించినవాఁడగుటం జేసి నిశ్శంకంబుగను, నిర్భయంబుగను విహరించుచున్నవాఁడు. నాసర్వధనంబులు కీర్తిని నపహరించిన యీదురాత్ము నిపుడ వంచించి వధింపనేని నాకు శ్రేయంబు దుర్లభంబు. మహాబలుండు మహాకాయుండునగు నీమహాసురుండు జీవంబులతో నుండునంతకు నాకు సుఖంబు లభింపదు. కావున వీని నిప్పుడ తప్పక వధింపందగు నని నిశ్చయించి విష్ణుదేవుని మనంబున ధ్యానించెను. ఆక్షణంబున వైష్ణవమాయాప్రభావంబున సురేంద్రునకు వృత్రవధదక్షం బగు నుపాయంబు స్ఫురించె. పురందరుం డాయెడఁ బర్వతోపమంబై పడియున్నసముద్రపునీటినురుగు నాలోకించి యిది

యార్ద్రంబును శుష్కంబునుంగాదు. మఱియు శస్త్రంబు నస్త్రంబును గాదు. దీనితో నీదురాత్ముని బ్రహరించితివేని వీ డవశ్యము గతాసుం డగునని నిశ్చయించి యాఫేనంబు వజ్రాయుధంబునకుఁ బూయునంత విష్ణుదేవుం డాశతకోటియందు సన్నిధిఁజేసె. ఇట్లు విష్ణుతేజోభినివిష్టం బగు వజ్రంబును బాకశాసనుండు మహోత్సాహంబు మెఱయ వృత్రాసురునిపైఁ బ్రయోగించె. ఆఫేనంబునం బ్రవిష్టుం డగు శ్రీవిష్ణుం డాక్షణంబ వృత్రుని ప్రాణంబు లపహరించె. వజ్రాహతం బగు మేరుగిరిశిఖరంబుంబోలి వృత్రుండు నేలంగూలినంతన దెసలఁ జీకట్లుమాసి కాంతులు వ్యాపించె. సుఖస్పర్శంబులు సౌరభోపేతంబు లగు మందమారుతంబులు వీచె. ప్రజ లెల్లరు హర్షపరవశులై సుఖించిరి. ఆసమయంబున దేవతలు, గంధర్వులు, యక్షులు, రాక్షసులు, మహోరగులు, మహర్షులును దేవేశ్వరుండు కావించినసాహసంబున కచ్చెరువంది, వివిధంబు లగు స్తవంబులచే నాతనిఁ బొగడిరి. అట్లు సర్వభూతంబులవలన నమస్కారములందికొని యాభూతంబులనెల్ల సాంత్వనం బొనరించి యనంతరంబు దేవేంద్రుండు శత్రునాశప్రహృష్టుండై యాదేవతలెల్లరతోడంగూడి త్రిభువనశ్రేష్ఠుం డగు విష్ణుదేవుని వివిధప్రకారంబులం బూజించి దేవగంధర్వయక్షరక్షో గణంబుల నెవరిస్థానంబులకు వారి ననిచె.

దేవభయంకరుండును, లోకకంటకుండును నగువృత్రాసురుం డట్లు మడిసినంత ననృతదోషప్రయుక్తం బగు మహాపాతకంబు సురేశ్వరు నావహించె. అంతకుమున్న త్రిశీర్షునివధించుటవలన సంభవించిన బ్రహ్మహత్యామహాపాతకంబును బరమదుర్మనుం డగువాసవు నభిభవించె. ఇట్లు మహాపాతకంబులచే నభిభూతుం డగు పాకశాసనుండు నష్టసంజ్ఞుండును విచేతనుండునై లోకంబులయంతము నాశ్రయించి తనయునికి యొరుల కగోచరంబుగ జలంబులం దురగంబువోలెఁ దిరుగుచుఁ బ్రతిచ్ఛన్నుండై యుండె. బ్రహ్మహత్యాభయార్దితుం డగు పాకశాసనుం డట్లు ప్రణష్టుం డగుటం జేసి భూమియెల్లఁ బ్రధ్వంసమొందినవడువున తేజుమాసియుండె. వృక్షంబులన్నియు శుష్కంబులై నశించె. కాననంబుల పేరైనఁ గనరాకుండె. మహానదులప్రవాహంబులెల్ల నెండఁబాఱె. సరోవరంబునందలి జలం బింకిపోయె. అనావృష్టివలన నెల్లభూతంబులును మిగుల సంక్షోభించె. సకలదేవతలును, మహర్షులును గడు సంత్రాస

విహ్వాలులై రి. అరాజకం బగుటచే జగంబులెల్ల నుపద్రవంబులకుం జిక్కి పోలుపు నశించియుండె. దేవత లెల్లరును భీతచిత్తులై యీయుపద్రవం బులవారించి మనలం బాలింపఁగల రాజెవ్వండగునో కదా యని యాలో చింపంబోడంగిరి. దేవర్షులుకూడ దేవలోకంబున విహ్వాలులై యుండిరి. ఆసమయంబున దేవరాజ్యంబును బాలించుట కెవ్వరు నంగీకరింపరై రి.

## నహుషుఁ డింద్రపదము నొందుట

ఇట్లరాజకంబున ముల్లోకంబు లాకులంబు లగుటకుఁ జింతించి మహర్షులును త్రిదివంబునంగల సకలదేవతలు నొక్కటిగాఁగూడి కర్తవ్య మాలోచించి మహాతేజస్వియు యశస్వియుఁ బరమధార్మికుండును నిత్యధర్మాభిరక్తుండునగు నీనహుషుండు దేవరాజ్యంబుపాలింప నెంతయు నర్హుండు. శ్రీమంతుం డగు నీతని నభిషేకించిన ముల్లోకంబులు నిరా మయంబుగాఁ బాలించు నని నిశ్చయించి యెల్లరు నేకముగా వానికడ కరిగి యతనితో రాజా! నీవు సురరాజ్యాభిషిక్తుండవై మమ్ములను బాలింపు మని పలికిరి. వారివాక్యంబు లాలించి నహుషుండు దేవతలను, ఋషిగణంబులను, పితృదేవతలను గలయం గనుంగొని తనహితంబు నాకాంక్షించి యిట్లనియె. మహాత్ములారా! నేను దుర్బలుండను. మిమ్ములఁ బాలించుటకుఁ దగినంతశక్తి నాకు లేదు. ఎప్పుడును బలముగలవారే రాజులుగాఁదగుదురు. శక్రుండు మిగుల బలాఢ్యుండుగావున మిమ్మెల్లరఁ బాలించెను. బలహీనుండ నగు నే నెట్లు పాలింపఁగల నని పలుకుటయు ఋషిగణములును, దేవతలును వానివినయంబునకు మెచ్చి యిట్లు పలి కిరి. రాజా! మే మొనరించినతపంబు మిగులఁ గలదు. ఆతపంబుబలంబెల్ల నీకొసంగెదము. దాన బలాధికుండవై యీసురరాజ్యంబు పాలింపుము. త్రిదివం బరాజకం బగుటవలన మాకుఁ బరస్పరము మహాఘోరం బగు భయంబు జనించును. ఇది నిక్కువంబ. మాభయంబు వాపుటకై నీ వవశ్యమును దేవరాజ్యాభిషేకం బంగీకరింపుము మరియు నీవు కన్నె దురఁ జూచినంతన దేవదానవయక్షరాక్షసులయొక్కయు, మహర్షి పితృ గంధర్వులయొక్కయు, సకలభూతంబులయొక్కయు దేజంబుల నాహ రించి యధికబలపరాక్రమసంపన్నుండ వగునట్లు వరం బొసంగెదము. కావున ధర్మంబు పురస్కరించికొని సర్వలోకంబుల కధినాథుండవై

త్రివిష్టపంబున బ్రహ్మర్షులను దేవతలను రక్షింపు మని పలికి యాతని నొడంబఱిచి త్రివిష్టపంబున నాతనిని త్రిలోకాధినాథునిగా నభిషేకించిరి. నహుషుండును సుదుర్లభంబు లగు వరంబులు పొంది ధర్మంబును బురస్కరించికొని సురరాజ్యంబునొంది త్రిలోకాధిపుండై ధర్మంబున నెల్లలోకంబులను బాలించుచుండె.

మహైశ్వర్యసంపన్నుం డగు నాతండు కొంతకాలం బిట్లు ప్రజలను జల్లఁగఁ బాలించి కాలవశంబునఁ గామపరతంత్రుండై యప్సరస్స్త్రీ పరివృతుండును దేవకన్యాసమావృతుండునై సకలదేవోద్యానంబులందును, నందనోపవనంబులందును, కైలాసగిరిశిఖరంబులందును, సుమేరు నగశృంగంబులందును, హిమాచలసానువులందును, మందరమహీధర కటకంబులందును, శ్వేతపర్వతోపత్యకలందును, మహేంద్రశిఖరిశిలాతలంబులందును, మలయధరాధరాధిత్యకలందును, సముద్రంబులందును, మహానదులందును యథేచ్ఛంబుగ విహరించుచు, శ్రవణసుభగంబులు దివ్యంబులునగు బహువిధకథల వినోదించుచుఁ గర్ణానందసంధాయకంబు లగు సకలవాద్యంబుల నాలించుచు శ్రవణపేయంబగు సంగీతకంబుల నాకర్ణించుచు వివిధవినోదంబులం దగిలి క్రీడాపరతంత్రుండై కాలంబు పుచ్చుచుండె. విశ్వావసుండు నారదుండు గంధర్వాప్సరోగణంబులు మూర్తిమంతంబు లగు నాఱుఋతువులును, దేవేంద్రపదాధిష్ఠితుం డగు నాతని సేవించుచుండిరి. సురభిగంధగంధిలంబు సుఖస్పర్శంబు నగు వాయువు మనోజ్ఞ సంచారంబున నిత్యంబు నాతని సేవించుచుండె. ఇట్లు వివిధసుఖక్రీడల నుపభోగించునాతనికంటి కొక్కదినంబున శక్రుని ప్రియమహిషి యగు శచీదేవి మూర్తిమంతం బగు సౌందర్యగుణాధిదేవతవోలె నగపడియె. ఆవనితామణి నాలోకించినంతన కామపరవశుండై యాదురాత్ముండు కన్నుగానక సభాసదులలో నేనింద్రపదం బధిష్ఠించి యింద్రభోగంబు లన్నిటి నేకొఱంతలేకుండ ననుభవించు చున్నాఁడనుగదా? ఇంద్రభార్యయగు శచికూడ నింద్రుండ నగు నన్ను సేవించు టుచితంబకాదా? నేను సకలదేవతలకును నిఖిలలోకంబులకు నధీశ్వరుండను. ఈశచీదేవి త్వరితంబుగ నాకడ కరుదెంచి నామది కానందముం గూర్చుఁగాక యని పలికె. ఆవాక్యంబు లాకర్ణించినంతన భయాకులచిత్తయై సంభ్రమంబున బృహస్పతిసదనంబున కరిగి గురువరుం డగు

నాతని పదకమలంబులకుఁ బ్రణమిల్లి యిట్లని విన్నవించె. 'బ్రాహ్మణపుం
గవా! నహుషువలన నన్నుం గాపాడుము. నిన్ను శరణువొందినదానను.
మహాత్మా! నన్ను సర్వలక్షణసంపన్న యనియు, దేవరాజునకుఁ బ్రియపత్ని
యనియు, నత్యంతసుఖభాగిని యనియు, వైధవ్యవిహీన యనియు, నేక
పత్నీవ్రతపరాయణ యనియు నీవు పలుమాఱుపల్కియుంటివి. నీవాక్యం
బులు సత్యంబు లగునట్లు నన్నిపుడు నహుషుబారినుండి రక్షింపుము.
సర్వకార్యసమర్థుండ వగు నీ వెన్నండు లేశమైన ననృతంబు వచించి
యెఱుంగవు. నాయెడ నీవు పల్కినపల్కులెల్ల సత్యంబులై చెల్లును
గాక' యని వచించె. అపుడు బృహస్పతి భయమోహిత యగు నద్దేవిని
లాలించి 'దేవీ! భయపడకుము. నేను నిన్నుద్దేశించి నొడివినవాక్యంబు
లెన్నండును మిథ్యాప్రలాపంబులు గాఁజాలవు. అవి తప్పక సత్యంబులే
యగును. అచిరకాలంబుననే యిక్కడకు వచ్చిన యమరేంద్రునిం గనుం
గొందువు. నహుషువలన నీ కొంతయు భయంబుగలుగదు. నామాటలు
ముమ్మాటికి సత్యంబులుగా నమ్ముము. అచిరకాలమునందే శక్రునితో
నిన్ను గూర్చెద. విచారంబుమాని సుఖం బుండు' మని పలికె.

## నహుషుండు శచినిఁ దేర దేవతల నియోగించుట

అట్లు సురపురోహితుండు శచీదేవికి శరణం బొసంగుట విని
నహుషుండు బృహస్పతియెడఁ గడుఁగోపించె. ఋషిగణములు మొద
లుగ దేవతలెల్లరును నహుషుఁ డట్లు కోపించుట చూచి భయాక్రాంత
హృదయులై కొంతవడి నిశ్చేష్టులై యుండి యెట్టకేలకు ధైర్య మవలం
బించి క్రోధఘూర్ణమానసుం డగు నాతని ననునయించి యిట్లు విన్న
వించిరి. "దేవరాజా! నీ వీయకారణం బగుక్రోధంబు విడువుము. జగత్ప్ర
భుండ వగు నీవు కోపించినంతన సురాసురగంధర్వయక్షరాక్షసమహోర
గంబులతోడి జగంబెల్ల భయవిస్రస్తంబై పొలుపఱియున్నది. నీవు
సాధుసత్తముండవు. ఎన్నిభంగులను నీవు కోపింపఁదగదు. నీవంటిసజ్జ
నులు కోపంబునకు వశు లగుదురా? ఆశచీదేవి పరునకుఁ బత్నికదా?
త్రిలోకాధినాథుం డవగు నీ వామెను గోరఁజెల్లునా? మనంబు ప్రసన్నంబు
గావించి యాదేవియెడ లగ్నం బగుమానసంబు మఱలింపుము. పరదా
రాభిమర్శనంబు మహాపాతకం బన విందుముకదా? దేవరాజపదాధిష్ఠి

తుండ వగు నీవ ప్రజలను ధర్మమార్గంబునఁ బాలింప కిట్లధర్మ మాచరించితివేని ధర్మము నింకెవ్వ రాదరింతురు? కావున నింద్య మగు నీయకార్యమునుండి మనంబు మరలింపు"మని ప్రార్థించిరి. అది విని నహుషుండు వారిమాటలఁ జైకొనక పకపక నవ్వి కామమోహితుండై "ఓహోహోహో! యేమినీతు లుపదేశించుచున్నవారలు? పూజ్యుం డగు గౌతముండు జీవించియుండఁగనే యాతనిధర్మపత్ని యహల్యను శక్రుండు చెఱిచినపుడు మీరును మీనీతివాక్యంబులు నెక్కడనణఁగియుండినవో? అప్పు డాతని మఱలించుట కేల ప్రయత్నింపలేదో? పురందరుండు మున్ను లెక్క లేనన్ని నృశంసకార్యంబు లాచరించియుండెనే? ఎన్నియో వైధర్మ్యంబులు, నెన్నియో సుపథలు నాచరించినపుడు మీరాతని నేల వారింపరైతిరి? చాలుచాలు! మీపొల్లుమాటల నాలించి మోసపోవుటకీత్రిలోకాదినాథుం డగు నహుషు డంత బేలమానిసి కాఁడు. ఏమైనను సరే; శచీదేవి నన్ను సేవింపక తీఱదు. నావాంఛితంబు నెఱవేర్చుట శచికిని మీకునుగూడ మంగళమే యగును. అయాచితంబుగఁ జేతికందిన శ్రేయమును రిత్తశంకలచేఁ జాఱవిడిచికొనక త్వరితంబుగ నాదేవికడ కరిగి యామెకు హితోపదేశంబు గావించి నాకడకుఁ గొనిరం"డని నియమించె. అంత దేవతలు 'సురేశ్వరా! మేము చెప్పఁదగినమాట లెల్లఁ జెప్పితిమి. నీహితంబుకోరి మే మింతగాఁ జెప్పితిమి. మావాక్యంబులు నీవాదరింపకున్న వాఁడవు. సరియే! నీయిచ్చవచ్చినట్లు శచీదేవిని దోడితేఁ బ్రయత్నింతుము. ఈక్రోధం బుడుగు' మని పలికి వారెల్లరును ఋషులతోఁగూడి సురాచార్యునిసదనంబున కరిగి శచీదేవి వినుచుండ నాతనికిట్లనిరి. 'సురగురూ! యింద్రాణి యగుశచీదేవి నిన్ను శరణంబువేఁడి నీయింటి కేతెంచిన దనియు నీ వాయమకు శరణంబు ప్రసాదించితి వనియు వింటిమి. దేవతలు ఋషులు గంధర్వులును నిన్నుఁ బ్రసాదంబు వేఁడుచున్నవారు. నహుషునకు శచీదేవి నొప్పింపుము. మహాద్యుతిమంతుం డగు నహుషుండు దేవరాజపదం బంది యింద్రునికంటె నధికవిశిష్టుం డుగా నున్నాఁడు. ఈతనిని వరారోహ యగు శచీవరవర్ణిని భర్తగా వరించి సుఖించుఁగాక. ఈదేవి యాతని వరించిన లోకంబులు సుఖించును. ఈయమ దానికి నిరాకరించెనా యాతండు క్రోధాతిరేకంబున నీచరాచరం బగుజగంబెల్ల దహించు' నని పలికిరి. ఆమాట లాలించి శచీ

దేవి కన్నీరుమున్నీరుగా నేడ్చుచు బాష్పగద్గదస్వనంబున బృహస్పతితో 'గురూత్తమా! నే నెన్ని బాధలు సంభవించినసరే! నహుషుని బతిగా నంగీకరింపను. నిన్ను శరణుసొచ్చినదానను. శరణాగతవత్సలుండ వగు నీ వీమహావిపదాంబుధినుండి న న్నుద్ధరింపు' మని యాతనిపాదము లంటి కొని యేడ్చుచుండె. ఆయమ పలుకు లాలించి జీవుండు జీవనదగంభీర భాషంబుల నాదేవి నూఱడించి "పతివ్రతామతల్లీ! ధర్మజ్ఞవు, సత్యశీలవు, విశేషించి నన్ను శరణుచొచ్చినదానవు నగునిన్ను నహుషునకొఱకు విడువను. ముమ్మాటికిని విడువను. ఇయ్యది నానిశ్చయము. అనిందిత యగు నింద్రాణిని శరణమీయక విడిచి యకార్యంబు గావింపను. సుర ప్రవరులారా! నేను బ్రాహ్మణుండను. విశేషించి యెల్లధర్మంబులు నెఱింగి సత్యశీలంబు గలిగినవాఁడను. ధర్మానుశాసనం బెఱింగిన నే నీతుచ్ఛ కార్య మ్మెట్టులను గావింపనోపను. మీమీ తెఱంగుల మీరు పొండు. ఈయర్థంబునం దొల్లి ప్రజాపతి నొడివినగీతంబులు గలవు. వానిని వచించెద నాకర్ణింపుఁడు. "ఎవ్వండేని భయార్తుండై శరణుసొచ్చిన వానిని రక్షింపకున్న, వాఁడు నాటినబీజంబులు మొలకలెత్తక నశిం చును. వానికి వర్ష కాలంబున బర్జన్యుండు వర్షింపకుండును. వాని కెందును రక్షణంబు దుర్లభంబై యుండును. విచేతసుం డగువాఁడు భుజించినయన్నంబు పుష్టికరంబుగాక మోఘంబగును. వాఁడు నష్ట చేష్టుండై స్వర్గంబువలన భ్రష్టుండగును. అకాలమున వానిప్రజ వినాశ మొందును. వానిపితృదేవత లెల్ల వేళ వివాదంబులం దగిలి దుఃఖింతురు. వాని వ్రేల్చినహవ్యము సురలు ప్రతిగ్రహింపనొల్లరు. ఇంద్రుం డాదిగ నెల్ల దేవతలును వానినెల్లకాలంబులందును బ్రహరించుచుందురు." ఇట్లు బ్రహ్మచే నుపదేశింపఁబడిన గీతంబుల నెఱింగియు లోకంబులం దింద్రుని మహిషిగాఁ బ్రసిద్ధిగన్న యనిందితచరిత్ర నేశచీదేవి నెట్లు విడిచిపుత్తును? నే నెన్నిభంగులను శచిని నహుషున కీయను. మీరు వివేకవంతుల రగుదు రేని నాకు నీదేవికి నీసమయంబున నేకార్యంబు హితంబగునో దాని నాచరింపుఁడు. ముమ్మాటికిని శచిని విడువ"నని వచించె.

అంత నప్పుడు గంధర్వులును దేవతలును నహుషుని మాధ్యంబును, శచీదేవిభయంబును, గురుని నిరాకరణంబును దిలకించి మిగుల

ఖిన్నులై కొంతవడి కింకర్తవ్యతామూఢులై యుండి పదంపడి యించుక విచారించి గురున కిట్లనిరి. 'గురువరా! నీప్రతిజ్ఞకు మిగుల సంతసించితిమి. కాని యిపుడు నహుషుండు క్రుద్ధుండై యున్నవాఁడు. లోకంబులకు వానివలన నొకయపాయంబు వొడమకుండను, నీదేవికి వాని బాధ తొలంగునట్లును నీవ యొక్కయుపాయం బారయుము. నీవు మంత్రించినయర్థంబునకుఁ బ్రతిఘాతం బెన్నండు నుండఁబోదుకదా!' యని పలికిరి. అది విని సురాచార్యుండు వారి కిట్లనియె. మహాభాగురా లగు నీయింద్రాణి యవిశంకితంబుగ నిప్పుడ నహుషుకడ కరిగి కొంత కాలవ్యవధి నడిగి వానియనుమతినొంది రావలయును. ఇయ్యది యీయామెకును మనకునుగూడ శుభోదర్కం బగును. కాల మెప్పుడును బహువిఘ్నంబుల కాకరంబు. కాలమును కాలమే వెడలనడఁచును. నహుషుండు వరసంశ్రయంబునంజేసి మహాబలసంయుతుండును గర్వోన్మత్తుండునై కన్నుగాన కున్నవాఁడు. కావున వాఁ డచిరకాలంబున వినాశ మొందకపోవఁ డని వచించుటయు దానికి దేవతలు మిగుల ముదిత హృదయులై 'సురయాజకా! నీవు బాగుగఁ జెప్పితివి. నీపలుకులు సకల దివౌకసులకును హితములై యొప్పుచున్నవి. నీవాక్యంబు లన్యథా ప్రవర్తించుట యెన్నండు నెఱుంగము. ఇదియ యీయదనునకుఁ దగిన కార్యము శచీదేవి కిప్పుడ యెల్ల యర్థంబులు నివేదించి యామెప్రసాదంబు వేఁడుద'మని పలికి యగ్నిపురోగము లగువారెల్లరు నవ్యగ్రభావంబున ముకుళితకరకమలంబులు నిటలతటంబుల ఘటించి శచీదేవి కిట్లు విన్నవించిరి. 'దేవీ! స్థావరజంగమాత్మకం బగు నీజగంబునెల్ల నీవ ధరించితివి. మహేంద్రున కేకపత్నివై కీర్తిగంటివి. లోకంబు లాకులంబులు గాకుండఁ గాపాడుట నీ కవశ్యకర్తవ్యంబు. నీ విప్పుడ నహుషుపాలికి విచ్చేయుము. మహాపతివ్రత వగు నిన్నుఁ గామించిన నహుషుండు శీఘ్రంబ నశించును. అచిరంబునన శక్రుండు సురరాజ్యాధిపత్యం బొందు' నని పల్కిరి. వారిమాట లాలించి పులోమపుత్త్రి తనమది నొకనిశ్చయంబు గావించికొని వ్రీడావనతాననయై కార్యసిద్ధికై ఘోరదర్శనుండు పాపకర్ముండు నగు నహుషుకడ కరిగె. నహుషుండును వయోరూపసంపన్న యగు నింద్రాణిం గాంచి కామోపహతచేతనుండై యింద్రాణి తనవశమయినట్లు సంతసించె.

## ఉపశ్రుతిదేవీయాచనము

అనంతరము దేవాధినాథుం డగు నహుషుండు శచీదేవి నాలోకించి 'శుచిస్మితా! నేన మూఁడులోకముల కింద్రుండను. నన్ను భర్తగా నీవు పరిగ్రహించి పూర్వమువలె సకలభోగములు ననుభవింపు' మనియె. అట్లా ప్రతికఠోరంబు లగువచనంబు లాలించి పతివ్రతాతిలకం బగు శచీదేవి పెనుగాలికిఁ గదళీతరువువలె వడంకుచు మనంబున విధాతకు నమస్కారంబు గావించి ఘోరాకారుం డగు నహుషున కిట్లనియె. సురేశ్వరా! నేను నీయభ్యర్థనంబు గాదనఁజాలనుగాని యింద్రుని గూర్చి చింత నామనంబునఁ గలంత కలిగించుచున్నది. ఆతండు జీవించి మరల వచ్చినచో నాకు దుర్భర మగుపతిద్వయావస్థ సంభవించునుగదా? కావున నింద్రుం డెందేని ప్రచ్ఛన్నుండై తిరుగుచున్నవాఁడో, లేక స్వరూపనాశ మొందినవాఁడో నిశ్చయముగఁ దెలిసికొనువరకుఁ గొంత కాలము నాకు గడువు దయచేయ వేఁడుచున్నదానను. ఇంద్రునివృత్తాంతము విస్పష్టముగ నెఱిఁగినంతన యవశ్యము నిన్ను భజింతును. ఇది సత్య మని ముమ్మాటికి నమ్ముము; కొంతకాలము గడువిమ్ము. అని యిట్లు పౌలోమి ప్రార్థించినంతన సంతోషభరితాంతరంగుండై 'సుశ్రోణి! నీ కోరిక యట్లె యగుఁగాక. సత్వరమ యింద్రునియుదంతము తెలిసికొని నాకడకు రమ్ము. నీవు సత్యభాషిణి వని నమ్మి నిన్నిపుడు విడుచుచున్నాఁడను. నీవు పలికినసత్యవచనముల మఱువక యరుదెమ్మని పలికి యామె నింటికిఁబో ననుమతించెను. నహుషునిచే విడువఁబడిన యాశుభాంగి బృహస్పతినికేతనంబున కరిగి జరిగినవృత్తాంతమెల్ల సురలతోఁగూడి యున్న సురాచార్యున కెఱింగించెను. ఆవరవర్ణినివాక్యంబు లాలించి యగ్నిప్రముఖు లగు దేవతలెల్లరుఁ బ్రభవిష్ణుం డగు విష్ణునితోఁగూడి యింద్రునిఁగూర్చి యేకాగ్రచిత్తంబున నాలోచింపం దొడంగిరి. వారెల్లరు నేకముఖంబున విష్ణు నభినుతించి యాతని కిట్లని విన్నవించిరి. దేవదేవా! శతక్రతుండు బ్రహ్మహత్యాభిభూతుండై యెటకో వెడలి పోయినాఁడు. జగంబులకెల్ల నాదికర్తవుఁ బ్రభువు నగు నీవ మాకిపుడు గతివి. నీవు సర్వలోకంబుల రక్షించుటకై విష్ణురూప మొందినాఁడవు. సురేశ్వరుండు నిమిత్తమాత్రుండుకాని నీ వీర్యంబువలననే వృత్రుండు

నిహతుండయ్యె. వాసవుండు బ్రహ్మహత్యామహాపాతకంబున నావృతుం
డయ్యె. ఆతనికి నీవ యాపాతకము వాయునుపాయంబు నిర్దేశింప
వలయు నని ప్రార్థించిరి. సురగణంబులవాక్యంబు లాలించి ప్రసన్నుండై
నారాయణుండు దేవతలారా! భయపడకుఁడు. పుణ్యంబగుహయ
మేధంబున నన్ను యజించిన నే నాతని బవిత్రునిఁగావింతును. హయ
మేధయాగపుణ్యంబున సురేశ్వరుండు మరల సురాధిపత్యంబునొంది
వెలుంగును. దుష్టకర్మాభిరతుం డగు నహుషుండు స్వకర్మపరిపాకంబున
నాశంబు నొందును. మీర లోపికమై కొంచెముకాలము మాత్రము
నిరీక్షింపుఁడు. అనంతర మెల్ల శుభంబులును జేకూరునని వచించె. విష్ణుని
శుభం బగువచనంబు సత్యమైనదిగాను సుధాసమానముగాను నిశ్చ
యించి సురగణంబులెల్ల సురాచార్యుని ముందిడుకొని భయోద్వి
గ్నుండై పాకశాసనుండు మఱుఁగువడియున్న ప్రదేశంబునకుం జనిరి.
వారందఱు నింద్రునిం గాంచి విష్ణుదేవునివాక్యంబులు జంభసూదనున
కెఱింగించి యాతనిచే నాచోటనే మహావైభవంబుగ నశ్వమేధంబు
సేయించిరి. హయమేధపుణ్యవశంబున సంక్రందనుండు బ్రహ్మహత్యను
వృక్షములందు నదులందు శైలంబులందు భూమియందును వనితలందును
భూతములందును బంచి యుంచివేసి తాను విగతపాపుండు విజ్వరుండై
యెప్పటియట్ల యాత్మతేజంబున వెలింగె. పిదప సురగణపరివృతుండై
నాకలోకంబున కేతెంచి నహుషునిం గాంచె. ఆసమయంబున నహు
షుండు స్థానమ్మువలన నకంప్యుండును సర్వభూతంబుల నతిక్రమించు
తేజంబున మెఱయుచున్నవాఁడును వరదానంబున దుస్సహుండునై
ప్రకాశించుచుండె, పాకశాసనుండు వానిదుస్సహం బగుతేజం బాలో
కించి భయాకులుండై మఱల నెందేని కానరాకుండఁ బాఱిపోయెను.
ఎల్లభూతంబులకు నదృశ్యుఁడై తనకు మంచిదినము లెప్పుడు వచ్చునో
యని చింతించుచుఁ గాలయాపనంబు గావించుచుండె.

ఇంద్రుం డిట్లు పలాయితుండయినంత శచీదేవి మిగుల దుఃఖా
కులయై శక్రు నుద్దేశించి పరిపరివిధముల విలపించె. మఱియు నామె
యిట్లుపలికె: నేను ధానధర్మాభిరతురాలనేని, నేను నిత్యము నగ్నిహోత్ర
పరాయణురాలనేని శుశ్రూషచే గురువులఁ బ్రీతులం గావించితినేని
ఎపుడును సత్యమంద నామనం బాసక్తం బగునేని నాకేకపత్నీత్వమే నిలిచి

యుండుఁగాక. ఉత్తరాయణంబున నిపు డాసన్నంబైన యీరాత్రి దేవ
తను భక్తిపూర్వకంబుగ నమస్కరించుచున్నదానను. నామనోరథంబు
నెరవేఱుఁగాక యని నియమంబు సంభరించి నిశాధిదేవత నతిభక్తి
నారాధించె. మఱియుఁ బతివ్రతాత్వంబుపెంపున నుపశ్రుతినావాహ
నంబు సేసి తల్లి దేవేశ్వరుం డెక్కడ నున్నవాఁడో యాప్రదేశంబు
నాకుఁ జూపుము. నాసత్యంబువలన సత్యంబు గోచరం బగుఁగాక. అని
యుపశ్రుతిని వేఁడెను. ఆప్రార్థన మాలించి యుపశ్రుతి రూపముఁ దాల్చి
పరమపతివ్రతాతిలక మగు శచీదేవికట్టెదుటఁ బ్రత్యక్షమై నిలిచె. రూప
యౌవనలావణ్యపరిపూర్ణయై తనయెదుట నిలిచిన యుపశ్రుతి నాలో
కించి యింద్రాణి సంప్రహృష్టాంతరంగయై యాయుపశ్రుతి నష్టవిధులఁ
బూజించి ముకుళితకరకమలయై దేవీ నీ వెవ్వతెవు? ఇక్కడ కేమిటికై
విచ్చేసితివి? నాప్రార్థనం బాలించి నన్నుఁ బాలింప నేతెంచినయుపశ్రుతి
విగా నిన్ను దలంచుచున్నదానను. నీవృత్తాంత మెఱింగించి నన్నానం
దింపఁజేయుమని ప్రార్థించినంత నామె శచీదేవి కిట్లనియె. దేవీ! నిక్కం
బుగ నీవు తలంచినట్లు నే నుపశ్రుతినే. నీసత్యనిరతిచే నీసమీపంబునకు
వచ్చి నీకంటికి కగపడితిని. ఇతరు లెవ్వరు నన్నాలోకింపంజాలరు. నీవు
మహాపతివ్రతవు. యమనియమాభిరామచరితవు. వృత్రాసురుం బరిమార్చి
విజయంబందిన శతక్రతుని నీకుం జూపెద. వేగము నావెను వెంట రమ్ము.
ఈక్షణంబ సురసత్తము నాలోకింతువని పలికె. ఆయుపశ్రుతివాక్యము
లాలించి యింద్రాణి మిగుల సంతసమొంది ప్రయతురాలై యామె
వెనువెంటఁ జనియె. వారిరువురును దేవారణ్యము లనేకములు కడచి
యనేకపర్వతంబుల నతిక్రమించి పర్వతకుల సార్వభౌముం డగు హిమ
వంతమున కరిగి దానియుత్తరపార్శ్వంబును జేరి యట శతసహస్ర
యోజనవిస్తీర్ణం బగు సముద్రమును లంఘించి దానితీరంబున నానా
ద్రుమలతాపరివృతంబు వివిధతరుగణపరిశోభితంబు నానాసత్త్వసంకు
లంబు నగు నొక్కమహాద్వీపముం గాంచిరి. ఆ దీవినడుమ శుభంబు
దివ్యంబు నగు సరోవర మొండుగలదు. శతయోజనవిస్తీర్ణంబు శతయో
జనాయతంబు నగు నాసరోవరంబున హంససారసాదిశకుంత సంతానంబు
లనుతోభయంబులై చూపఱకత్యానందసంధాయకంబు లగు నానావిధా
రావంబులచే విహరించుచుండు. దానియందుఁ బంచవర్ణంబులు గలపద్మం

జులు కొదమతుమ్మెదలరొదలచే వినువారికి వీనులవిందుఁగూర్చుచు నలరారుచుండెను. ఆసరోవరమధ్యంబున నొకదివ్యమగు కమలినీలత యొప్పుచుండె. ఆతామరతీఁగ నెత్తునినాళంబు గొప్పపద్మంబును గలవు. వారిరువురు నాకమలమధ్యము ప్రవేశించి దానినాళమును భేదించి యందు బిసతంతుప్రవిష్టుండై సూక్ష్మరూపుండై యున్న శతక్రతు నాలోకించిరి. అంత వారును సూక్ష్మరూపంబులు దాల్చి యాతని సమీపించిరి. అప్పు డింద్రాణి యింద్రునకు నమస్కరించి బహుభంగుల స్తుతింప నాతఁ డచ్చెరువంది 'యోమచ్ఛకంటీ! నీవిచ్చటికెట్లు వచ్చితివి? నీవచ్చిన కారణం బేమి? నేనీయెడనుండుట నీవెట్లెఱింగితివి? అంతయుఁ దెల్పు'మన 'శచీదేవి మహాత్మా! నేనుపశ్రుతి నారాధించి ప్రసన్నురా లగునామెవలన నీయునికి తెలిసి యామెతోడన వచ్చి నిన్ను దర్శించితిని. నీవిట్లు ప్రచ్ఛన్నుండవై యుండుటవలన నాకు మహాపద సంభవించినది. మూఁడులోకంబులకుఁ బ్రభువై యింద్రపదవిఁ బొందిన నహుషుండు వీర్యదర్పావిష్టుండై కన్నుమిన్ను గానక యొడలు తెలియనిమదాతిరేకంబున నన్నుం గాంచి తనకు భార్యగమ్మని నిర్బంధపఱిచెను దేవతలు ఋషులు నెంద ఱెన్ని విధంబుల నది యకార్యమని బోధించిన నాదురాత్ముండు విన నొల్లక వారి నెల్లఁ బరాభవించె. అట్టిదుష్టుని సామవాక్యంబుల నొడంబఱిచి కొంత కాలము గడవుగడించితిని. ఆకాల మతిక్రమింపకమున్న నీవు నన్ను రక్షింపకున్న నాదురాత్ముఁ డవశ్యము నన్ను వశపఱుచుకొనును. ఈ కారణంబున నేను నీసన్నిధి కరుదెంచితి. మహాబలపరాక్రమసంపన్నుండవు, నధికతేజస్వివి నగు నీవిట్లు ప్రాకృతపురుషుంబోలి దాఁగియుండుట తగవగునా? లెమ్ము. నీ తేజంబు పెంపునఁ బాపనిశ్చయుండు రౌద్రుండు నగునహుషుం బరిమార్పుము. దైత్యదానవసూదనం బగు నీతేజంబు నెప్పటియట్ల మరలఁ బ్రకటింపుము. దేవరాజ్యమును బొంది ముల్లోకములు చల్లగఁ బాలింపు' మని పలికెను.

### ఇంద్రుండు శచీదేవి కుపాయ మెఱింగించుట

ఆమాట లాలించి శతక్రతుండు కొంతవడి తనమనంబునఁ జింతించి వరవర్ణినీ! నీవు పలికినవాక్యంబు లెంతయు సముచితంబులై యొప్పుచున్నవి. అయిన నిప్పుడు పరాక్రమమున కనువైనకాలము

గాదు. ఋషిప్రదత్తము లగు హవ్యకవ్యంబులచే వాఁడు మిగులఁ
గ్రొవ్వియున్న వాఁడు. బలవత్తరుఁడగు నాతనితో నిప్పుడు మార్కొనుట
తగనిపని. శత్రువు బలవంతుఁడై యున్నయెడ నీతి నుపయోగించి వాని
సాధించుట ప్రాజ్ఞసమ్మతము. ఇపుడు నీకొక్కయుపాయ మెఱింగింతును.
ఇతరుల కెఱుకపడకుండ నీయుపాయంబు వన్నితివేని దాన వాఁడు
తప్పక భ్రష్టుం డగును. ఎప్పటియట్ల మనము సుఖంబు లనుభవింపం
గలము. నీవు నహుషుపాలికిం జని వానితో ఋషివాహనంబున స్వా
మందిరమునకు నీవు రావలయును. అట్లు వచ్చుట నాకు సంప్రీతికర మని
వాని నట్లు వచ్చుట కొడంబఱుపుము. లోకంబున నున్న యానంబు
లన్నియు సర్వసాధారణంబులు. దివ్యం బగు ఋషియానంబు నీకుఁదక్క
నితరులకు నలభ్యం బని వచింపుము. అని పలికినంత నామె పురందరు
వచనంబు లాలించి శతక్రతు నభినందించి యాతనికడ సెలవంది నహు
షునికడ కరుదెంచె. నహుషుం డామెను గాంచి వికసితవదనారవిం
దుండై మందహాసంబు ముఖంబునం దోఁప 'వరారోహా! నీకుస్వాగతము.
కల్యాణి! శుచిస్మితా! భక్తుండనై నీకొఱ కిట్లు పరితపించుచున్న నన్ని
ట్లింతకాల మలయించెదవు? నాయెడఁ గనికరమూని యనంగతాపతప్తంబు
లగు నాయంగంబుల సుధారసస్యందివీక్షణంబులఁ జల్లఁగఁ జేయుము.
దాసుండ నగు నన్నేలుకొనుము. ఈత్రిలోకసామ్రాజ్యంబు నాశరీరంబు
నాసుకృతంబు నన్నియు నీయధీనంబులు. నీవేది యాజ్ఞాపించినను గింక
రుండనై యాకార్య మెట్టిదైనను గావింతును. సంశయమువీడి నీయిష్ట
మేదియో తెలుపుము. నీమదిలోనికోర్కి తెలుపుటకు సిగ్గుపడకుము.
నాయందు సంపూర్ణమగునమ్మక ముంచుము. నీపనిచినకార్యము తప్పక
చేయుదునని సత్యంబున శపథము జేయుచున్నా' నని పలికెను. వాని
మాట లాలించి పౌలోమి ముదితహృదయయై యిదియ యుపాయంబు
ఫలింప నద నని విచారించి వానితో 'జగత్పతీ! నీవు నాకు నిచ్చినకాలము
గడువునకై ప్రతీక్షించియున్న దానను. ఈస్వల్పసమయము కడచినని
నంత నీవ నాకు భర్తవయ్యెదవు. నన్ను నీవు పరిగ్రహించుటకు ముందు
నామనీషిత మొక్కటి నెరవేర్పఁగోరెదను. నీవు తప్పక నాకోర్కి
తీర్చెదనని యంటివేని యది తెలిపెద. నాచెప్పినపని నీవొనరించితివేని
నాకెంతయుఁ బ్రియంబై యుండు. ప్రణయసంయుక్త మగు నావాక్య

మనస్త్రథాకరింపక నీవాచరించితివేని నేను గలకాలము నీకు వశంవదనై యుందును. మున్ను నాకు భర్త యగునింద్రునకు లోకసాధారణంబు లగు తురంగంబులు మాతంగంబులు రథంబులుమాత్రమే వాహనంబులై ప్రాకృతులకు నాతనికిని భేద మేర్పఱింప వీలుగాకుండెడిది. కావున నీవింతవఱకు నెవ్వరు నెప్పుడు నారోహింపనివాహనంబున నామందిరమునకు విచ్చేయవలయును. దేవమానవదానవాదులేకాక బ్రహ్మవిష్ణుమహేశ్వరులుగూడ నెన్నండు నధిరోహింపనివాహనంబు నీవారోహింపఁ జెల్లును. నీయంతటి మహాశక్తిసంపన్నుండు ప్రాకృతంబు లగు వాహనంబు లధిష్ఠించుట కీర్తికరంబుగాదు. ఋషులచే మోయఁబడు శిబిక నారోహించి నామందిరమునకు నీవువచ్చుట నాకత్యంత ప్రీతికరంబు. నీకును బహుళకీర్తికరంబు. నీవు దేవదానవులకంటె నధికుండవుగా నుండవలయునే కాని వారితో సమానుఁడవై యుండుట యశోవిశేషముం గూర్పదు. నీకంటఁబడినంతమాత్రమున నెల్లభూతంబుల తేజంబులు నాకర్షింతువుగదా? యట్టి నీకిది యంత దుష్కరముగాదు. ఎంతటివీర్యముగలిగియు నితరులు నీయెదుట నిలువనోపరు. కావున నాయభీష్టముతీర్చి నన్నేలుకొమ్మని పలికెను.

ఆపలుకులు విని నహుషుండు ప్రహర్షతరంగితాంతరంగుండయ్యెను. మఱియు ననిందిత యగు నాపురందరభామినితో వనితామణీ! నీచెప్పినమాట యెంతయు నొప్పియున్నది. నీవు పేర్కొన్న వాహనంబపూర్వంబు నశ్రుతపూర్వంబునై నామనంబున కెంతయు సంతసంబు గూర్చినది. నేనెల్లభంగుల నీకు వశుండనై యున్న వాఁడను. నావంటి మహాబలశాలికిందక్క నల్పవీర్యులకు మునీంద్రులచే వాహనంబు మోయింప నలవికాదు. నేనన్నో దుశ్చరం బగుతపంబున మహాబలంబు గడించితిని. నేనే భూతభవిష్యద్వర్తమానంబులకెల్ల దొరను. నేను గోపించిన నీజగమ్మెల్ల నశించును. ఈసర్వమ్ము నాయందు ప్రతిష్ఠితంబై యున్నది. దేవదానవగంధర్వులును కిన్నరోరగరాక్షసులును వీరువారననేల సకలలోకంబు లొక్కటియయ్యును నేను గోపించిన నాయెదుట నిలువ భయమందును. కన్నెత్తిచూచినంతమాత్రాన నెదుటివాని తేజంబు నాహరింతును. కావున నా కశక్యం బేదియు లేదు. కాంతామణీ! నీవు చెప్పినకార్యము తప్పక కావింతును. దీని కించుకయు సంశయింపం బని

లేదు. సప్తమహర్షులును బ్రహ్మర్షులును దప్పక నాశిబికను మోయుదురు. వరవర్ణినీ! మాయైశ్వర్యంబును మాహాత్మ్యంబును వీక్షింతువుగాక.

## నహుషుండు బ్రాహ్మణులచేఁ బల్లకి మోయించుట

అనిపలికి శచీదేవి నింటికనిచి ఋషులఁ బిలిపించి వారిచేఁ బల్లకి మోయించి తా నాపల్లకియం దారోహించి యథేచ్ఛగ విహరింపం దొడంగె. ఆబ్రహ్మణ్యుండు మదోన్మత్తుండు బలదర్పగర్వితుండు నగు నాదుష్టాత్ముండు కానికార్యమని మది నించుకేనియు శంకింపక కామపరవశుండై మహాప్రభావసంపన్నులు జితేంద్రియులు త్రిలోకపూజితులు నగు మహర్షులను బ్రహ్మర్షులను వాహకులుగా నియమించి యెల్ల యెడల నుల్లాసంబునఁ దిరుగఁజొచ్చె. నహుషునిచే ననుజ్ఞాతయై శచీదేవి సురగురునికడ కేఁగి యాతనిచరణంబుల కెఱఁగి ప్రణతయై, "మహాత్మా! దురాత్ముం డగు నహుషుం డేర్పఱించిన కాలంబు గతప్రాయంబయ్యె. ఇంక కొంచెము మాత్రమే గడువుకలదు. నీవు త్వరితంబుగ శక్రు నన్వేషింపు. భక్తురాలను దీనను నగు నాయందు దయబఱపుము." అని ప్రార్థింప బృహస్పతి యామె ప్రార్థించిన తెఱంగునఁ దప్పక కావింతునని యూరడించి మఱియు నిట్లనియె. దేవీ! దుష్టచిత్తుం డగు నహుషువలన నీవు భయపడకుము. ఈనహుషుం డింకెంతకాలమో యీపదవియం దుండఁడు. నరాధముం డగువాఁడు నశించెననియే యెఱుంగుము. ధర్మమెఱుంగక ఋషులచే వాఁడెప్పుడు వాహనము మోయించెనో యాక్షణమునందె వాని యాయువు శ్రీయు సకలంబు వికలంబై నయది. ఇంతియకాక యీదుర్మతి వినాశముంగోరి నే నిష్టి నొక్కదానినిగూడఁ జేయుదును. తప్పక శక్రుని మరలఁ గొనివత్తును. నీ వెంతమాత్రము భయమొందక నిశ్చలచిత్తంబున దేవదేవుని ధ్యానించుచుండుమని పలికెను. పిదప నాంగీరసుం డగ్న్యగారమున నగ్నిని బ్రజ్వలింపఁజేసి విధివిహితం బగు విధానంబున నగ్నిలో వ్రేల్చెను. అంతఁ గృశానుండు పరమాద్భుతం బగు స్త్రీవేషంబున గురునకుఁ బ్రత్యక్షమై కార్యమేమని యడిగెను. బృహస్పతియు నగ్నిదేవు ననేకవిధంబుల నినుతించి దేవేంద్రు నన్వేషింప నియోగించె. సురాచార్యానుమతినొంది హుతాశనుఁ డక్కడ నంతర్ధానమొంది యెల్లభూతంబులకు నదృశ్యుండై దిక్కులు విదిక్కులు ప్రది

కుల్యాజలసకలపర్వతంబులు వివిధకాననంబులు పృథివ్యంతరిక్షంబులునుమనో
వేగంబునఁ జరించి యెందును బురందరుఁ గానక తిరిగి గురునిపాలి కేతెంచి
యాతనితో నిట్లు వచించె.—సురవరా! యెల్లప్రదేశంబులు వెదకితిని
గాని యెందును సంక్రందనుని జాడ గానరాదయ్యె. నేనొక్కనీళ్లు దక్కఁ
దక్కినతావులెల్ల వెదకితిని. నీళ్లన్న నాకమితమగు భయము. నీళులందుఁ
బ్రవేశింప గలసామర్థ్యము నాకు లేదు. నాచేతనైనవంతయుఁ జేసితిని.
ఇంక నేకార్యంబున నియోగింతువో తెలుపుమనియె. బృహస్పతి యగ్ని
దేవా! జలంబులఁ గూడ బాగుగ వెదకుమనినంత వీతిహోత్రుండు
సుమహాత్తమా! నేను జలంబులం బ్రవేశింపఁజాలను. జలస్పర్శమాత్రంబ
నాకు వినాశం బగును. నిన్ను శరణుచొచ్చితిని. శరణాగతుండ నగు నా
శరీరనాశం బగుకార్యంబున నియోగింపవలదు. బ్రాహ్మణులవలన క్షత్రియ
జాతియు ఱాలవలన లోహంబులును జనించుటం జేసి రాజులయు లోహ
ములయుఁ దేజంబులు లోకంబుల సర్వపదార్థంబులందు నప్రతిహతంబు
లయ్యు స్వజన్మకారణంబు లగు బ్రాహ్మణులందును ఱాలయందును గుంఠి
తంబులై యుండు. అట్లే నే నుదకంబులవలన జనించితిని. నేను లోకం
బులందెల్లయెడల విజృంభింపఁగలను గాని నీరంబులను స్పృశింపనైన
సమర్థుఁడను గానని వచించెను.

అగ్నిదేవుం డటు వచింప సురాచార్యుం డాతని తేజంబు
పెంపొంద మహార్థవంతంబు లగువాక్యంబుల నాతని బ్రస్తుతించె. అగ్ని
దేవా! నీవు దేవతలకెల్ల ముఖమవై యుంటివి. ద్విజులు నీయందు
వ్రేల్చినహవ్యంబుల నాయా దేవతలకు నీవ యందింతువు. కవులు నిన్నే
కాత్మకునిగాను ద్విరూపునిగాను వర్ణింతురు. నీ వెల్లభూతంబులందును
నాభ్యంతరుండవై నిగూఢముగఁ జరింతువు. నీవొక్కనిమేషము జగం
బును వీడితివే నది యప్పుడ నశించును. బ్రాహ్మణులు నీకు నమస్కరించి
స్వకర్మసంపాదితము లగు నుత్తమలోకములకుఁ బుత్రపౌత్రాదిపరివార
సహితంబుగ నేగుదురు. నిన్ను నమస్కరించిన సుకృతంబున వారికి
శాశ్వతము లగుగతులు లభించుచున్నవి. నీవ హవ్యవాహనుండవు. నీవ
హవ్యమవు. ద్విజులు పరమాధ్వరంబున యజ్ఞంబులచే నిన్న యజిం
తురు. నీవ యీమూఁడులోకంబులు సృజించి యంతకాల మాసన్నమయి
నపుడు నీవ విజృంభించి వానిని సంహరింతువు. చరాచరాత్మక మగుభువన

మునకు నీవ కారణమవు. నీవ వానికిఁ బ్రతిష్ఠాపకుండవు. విద్వాంసులు నిన్ను జలదంబులుగాను మెఱుపులుగాను వచింతురు. నీవలన జనించిన జ్వాలలు సర్వభూతంబులను దహించుచున్నవి. నీయందు జలము నిహితంబై యున్నది. ఎల్లజగంబులు నీయందు యిమిడియున్నవి. పావక! మూఁడులోకంబులందు నీకుఁ దెలియని దొక్కటియు లేదు. ఎల్లవస్తువులును స్వకారణమందుఁ బ్రవేశించునుగదా? నీవును శంకమాని నిర్భయంబుగ జలంబులఁ బ్రవేశింపుము. నీ కేవిధంబుగను గీడు కలుగకుండ నేను బ్రాహ్మంబు లగుమంత్రంబులచే నీతేజంబు పెంపొందింతునని వచించెను.

ఇట్లు బృహస్పతిచేఁ బ్రస్తుతుండై దత్తాభయుండైన యనలుండు సురాచార్య! నీమంత్రప్రభావంబున నా కమిత మగుబలము గలుగును. నేను దప్పక యిప్పుడ సురేంద్రునారసివచ్చెద నని గురునివలన ననుమతి పొంది నదనదీపల్వలంబులు సాగరంబులును బ్రవేశించి యెట్టకేలకుఁ బురందరుండు డాఁగియున్న సరోవరంబున కేఁగెను. ఆసరోవరంబంతయు వెదకి దానియందున్నపద్మంబు లొక్కొక్కటి వెదకుచు నొక్కకమలంబున బిసతంతుప్రవిష్టుం డగు శతక్రతు నాలోకించి సత్వరంబుగ మరల బృహస్పతిపాలి కేతెంచి యింద్రుండు కమలనాళాంతరంబున నణుమాత్రశరీరంబున నున్నవాఁడని యెఱింగించె. అగ్నివాక్యంబు లాలించి సురాచార్యుండు దేవర్షిగంధర్వులతో నాసరోవరంబు దరియం జని బలభేది నుద్దేశించి యాతనిపూర్వచరితములచే నిట్లని వినుతించెను. శక్ర! మున్ను దారుణుం డగు నముచిదానవుని వధించితివి. ఘోరవిక్రములగుశంబరుండును బలుండును నీచేత మడిసిరి. అట్టిమహారాక్షసనిహంత వగు నీవు నేటికాలంబున నిట్లు డాఁగియుండ నేల? లెమ్ము. నీబలపరాక్రమంబుల స్మరించికొనుము. నీశత్రువుల దునుముము. వీరే దేవతలు ఋషులు నీదర్శనంబునకై యరుదెంచియున్నారు. లేచిరమ్ము. వీరి నాలోకింపుము. తొల్లి మహాసురుల ననేకుల వధించి లోకంబులు నిరాకులంబులుగాఁ బాలించితివి. విష్ణుతేజంబున నుపబృంహిత మగు నీటినురుగు నాయుధంబుగాఁ గొని వృత్రుని సంహరించితివికదా? నీవు సర్వభూతంబులందును శరణ్యుండవు, శ్లాఘ్యుండవును. నీకు సాటి యగుభూత మేదియును లేదు. నీవ సర్వభూతంబులను ధరించియుంటివి. నీవ దేవతలకు

మహిమము నాపాదించితివి. మమ్ములను నీసకలలోకములను రక్షింపుము. నీతొంటిబలంబును బ్రకటింపుము.

ఇట్లు గీష్పతిచే సంస్తూయమానుండై బలనిషూదనుండు క్రమక్రమంబుగ వృద్ధినొంద నారంభించెను. తన పూర్వశరీరము నెప్పటియట్ల పొంది బలోపేతుం డయ్యెను. ప్రకృతినొంది దేవర్షుల సమీపించి గురునకుం బ్రణమిల్లి, "మహాత్మా! నావలన మీకుం గావలసినకార్యమింక నేమికలదు? త్వష్టకుమారుం డగు వృత్రుం డనుమహాసురుని వధించితినిగదా? దాన లోకంబులు నిరాకులంబులై యున్నవే? మరల నే యుపద్రవము సంభవించిన"దని యడిగెను. అంత బృహస్పతి, "పురందరా! మానుషుం డగు నహుషుండు దేవర్షిగణంబుల తేజంబునొంది దానివలన దేవరాజ్యమునం బట్టాభిషిక్తుండై మమ్మెల్ల బాధించుచున్నాం" డనిబదులు పలుకుటయుం, బురందరుండు "దేవతలకుంగూడదుర్లభం బగుసురరాజ్యాధిపత్యంబు మానవమాత్రుండగు నహుషుం డెట్లుపొందెను? వాం డేతపం బొనరించెను? వానిబలపరాక్రమంబు లెట్టివో సవిస్తరంబుగ వాని యుదంతమెల్ల నెఱింగింపు" మని యడిగెను. అపుడు బృహస్పతి పురందరునితో, "రాజా! నీవట్లు రాజ్యంబు విడిపోవుటచే దేవతలెల్లరు నరాజకత్వంబునకు దిగులొంది యెవ్వనినే నొక్కబలశాలి నింద్రపదవియందు నియోగింప నిశ్చయించిరి. పిదపం బితరులు, ఋషులు, గంధర్వులు నెల్లరు గలసి నహుషుపాలికిం జని 'రాజా! సురలోకం బింద్రపరిత్యక్తమై యరాజకంబుగా నున్నయది. నీవు సురరాజ్యమం దభిషిక్తుండవై లోకంబులెల్ల గావవలయు'నని ప్రార్థించిరి. వారికి నహుషుండు మహాత్ములారా! నే నల్పబలుండను. సురరాజ్యపాలనంబు దుష్కరమైనది. నే నార్జించినతపంబును, బలంబును త్రిలోకపాలనంబునకుం జాలినవి కావు. నన్ను మీరాజుగాం గోరెదరేని మీమీతపంబులందును, దేజంబులందును నాకుం గొంతయింత యిచ్చితిరేని నేను సమగ్రతేజోబలాన్వితుండనై మిమ్ముం బాలింతుననియె. నహుషునివచనంబు లాలించి దేవర్షిగంధర్వగణంబు లప్పటి కది యవశ్యకర్తవ్యంబగుటం జేసి వానికోరినట్ల తమతమతపోబలంబులచే వాని నభివృద్ధుం గావించిరి. వాండును దేవరాజ్యము స్వాధీనమయినదాదిగ మంచిచెడ్డ లాలోచింపక ఘోరం బగు వీర్యంబున లోకంబు లాకులంబులు సేయుటయకాక మహర్షులను, బ్రహ్మ

ర్షులను శిబికావాహకులుగా నొనర్చి లోకంబులెల్లెడల జరించుచున్న వాఁడు. వాఁడు దృష్టిమాత్రంబున నితరుల తేజంబులెల్ల నపహరించును. వానిదృష్టి విషపూరితమై ఘోరంబైనది. నీవెప్పుడును వానికంటఁబడకుము. దేవతలెల్లరు మిగుల నార్తులై యెన్నండును నహుషుని జూడకుందురు. వానికంటఁబడకుండ గూఢరూపంబుల సంచరించుచుందు”రని వచించె.

ఇట్లు లాంగిరసకుల ప్రవరుం డగు సురాచార్యుండు వచించు సమయంబున లోకపాలకు లగు కుబేరుండు, యముండు, సోముండు, వరుణుండును సంక్రందనుండున్న యెడకువచ్చి యాతనిం గాంచి ముదితహృదయులై మహేంద్రునకుఁ బ్రణమిల్లి యతని కిట్లనిరి. పాకశాసనా! యదృష్టవశంబున ధృష్టకుమారుని వధించితివి. భాగ్యంబు పెంపున శత్రు జేత వగు నిన్న క్షతగాత్రునిగాను, కుశలవంతునిగాను జూడఁగలిగితిమి. అని పలికినపలుకు లాకర్ణించి వారిని యథోచితంబుగఁ బూజించి కుశల ప్రశ్నం బడిగి యిట్లనియె.—ఇపుడు దేవరాజ్యంబు పాలించుచున్న నహుషుండు ఘోరాకారుండై, లోకంబుల బాధించుచున్నాఁడు. వాని జయించుటకు మీరెల్లరు నాకు సాయపడవలయుననియెను. వారలు దేవా! నహుషుండు మిగుల ఘోరుండు వానిదృష్టియందు విషముండును, మేమెల్లరము వానికి భయపడు చుందుము. నీవడిగినట్లు తప్పక చేతనైనసాహ్య మొనరింతుము. నీవు వానిని జయించి రాజ్యము పొందితివేని మాకు యాగభాగంబు లిమ్మని వచించిరి. దానికి శతక్రతుండు సంతసించి యట్లేయగుఁగాక. యముఁడు, కుబేరుఁడు, వరుణుఁడును యాగభాగంబులు నాతో ననుభవింప నర్హులు. వారి కిప్పుడ సేనాధికారిపదవులం దభిషేకముగావింతును. ఇపుడ మనమెల్లరమును గలిసి సమరసన్నాహంబు మెఱయ నహుషుపై నెత్తి వెడలి ఘోరదర్శనుం డగువాని జయింతమని పలికెను. ఆసమయంబున ననలుండు సంక్రందనునితో దేవా! నేనును యుద్ధంబున సాహ్యంబుగావింతును. నాకుఁగూడ యజ్ఞభాగ మిమ్మని యడిగెను. అగ్నిమాట లాలించి యింద్రుండు మిగుల సంతసించి ధనంజయా! నీవుకోరినట్లు తప్పక యొసంగెదను. మహాక్రతువునందు నాతోఁగూడ నీకును ‘ఇంద్రాగ్న్య’మనుభాగము కల్పింపఁబడునని వచించి, భగవంతుం డగు పాకశాసనుండు కుబేరుని సర్వయక్షులకును

ధనములకును, యమునిం బితృదేవతలకును, వరుణుని జలంబులకును ప్రభువులుగా నిర్దేశించి యథాక్రమంబుగ వారివారి నాయకపదములం దభిషేకంబు గావించె.

## అగస్త్యుం డింద్రునకు నహుషభ్రంశ మెఱింగించుట

ఇట్లు యమవరుణకుబేరాగ్నుల కాధిపత్యంబు లిచ్చి నహుష వధోపాయంబు చింతించుచున్న సురేశ్వరునికడకు భగవంతుం డగు నగస్త్యమహాముని చేతెంచి, పురందరా! యదృష్టవశమున సర్వసంపదల తోడను నీవు వర్ధిల్లుచున్నవాఁడవు. దైవంబుకరుణాపెంపున విశ్వరూపుని వృత్రుని సంహరించి విజయలక్ష్మిని బరిగ్రహించితివి. నహుషుం డిప్పుడు దైవరాజ్యపరిభ్రష్టుం డయ్యె. విధికృపచే నిహతశత్రుం డగు నిన్నిపుడు చూడఁగంటి ననిపలికె. ఇంద్రుండును ముని కెదురేగి ప్రణామం బాచరించి మహర్షిసత్తమా! నీకు స్వాగత మగుఁగాక. నీదర్శనంబున నాకత్యంతప్రీతి లభించినది. ఇదే నేనొసంగుపాద్యంబు ఆచమనీయంబు. గోవును బరిగ్రహింపుమని పలికి యతని విధిచోదితవిధానంబున నర్చించి యాసనోపవిష్టునిగావించి భగవానుఁడా! పాపనిశ్చయుం డగు నహుషుండు స్వర్గమునుండి యెట్లు పరిభ్రంశ మొందెనో తెలియం గుతూహలపడుచున్నాఁడను. ఆయుదంత మెల్ల సవిస్తరంబుగ వచింపుమని యడిగె. అంత నగస్త్యుండు శక్ర! దురాత్ముండు దురాచారుండు నగు నహుషుండు స్వర్గభ్రంశ మొందిన తెఱం గెఱింగించెద నాకర్ణింపుము. బలదర్పితుండు పాపకర్ముండు నగు నహుషునివాహనంబు మోయుచు శ్రమార్తులై దేవర్షులును, బ్రహ్మర్షులును సురేంద్రపదవియందున్న నహుషు నొక్కసంశయముదీర్పుమని యడిగిరి. మలినరహితులును మహాభాగులునగు నాఋషులు "గోప్రోక్షణంబునఁ జెప్పంబడిన బ్రాహ్మణమంత్రంబులు నీకుఁ బ్రమాణంబు లగునా కావా" యని యడిగిరి. అజ్ఞానమూఢచేతస్కుం డగు నహుషుండు ముందువెనుక లరయక ప్రమాణంబులు గావని ప్రత్యుత్తరంబిచ్చె. దానికి ఋషులు కోపించి, "రాజా! నీవు అధర్మప్రవృత్తుండవైతివి. ధర్మము నెఱుంగకున్నాఁడవు. తొల్లి మహర్షులచేఁ జెప్పంబడినమంత్రములెల్ల మాకుఁ బరమ ప్రమాణము" లని వక్కాణించిరి. అనంతర మావిషయమున ఋషులతో వివాదము సలుపుచు

నోడ లెఱుంగని మదాతిరేకంబున నధర్మంబని యెంచక "సర్ప సర్ప" యని పదపాదంబున నాశిరంబుఁ దాఁచె. దానివలన వాని తేజంబును సిరియు వానియంత నవి యవిహతంబులయ్యె. పిదప నేను కోపాటోపంబుగదుర, "దురాత్మా! తొల్లి బ్రహ్మర్షులచేఁ బ్రోక్తంబయి దోషరహితం బగు మంత్రగ్రామంబు నకారణంబ నిందించితివి. నిర్హేతుకముగ నిరపరాధుండ నగు నన్నుఁ గాలఁ దన్నితివి. మఱియు మూఢుండవై బ్రహ్మకల్పు లగుమునులచేఁ బల్లకి మోయించితివి. ఈపాపకర్మంబులవలన నీ యొనర్చినపుణ్యంబెల్ల క్షీణంబయ్యె. నీవు స్వర్గమునుండి క్రిందఁబడుము. పదివేలయేండ్లు సర్పరూపంబున మహీతలంబునఁ జరించి పదివేలయేండ్లు నిండినవెనుక మరల స్వర్గమును బొందెదవుగాక" యని శపించితిని. అరిందమ! దురాత్ముం డగు నహుషుం డీరీతి నాచే నశించె. దైవవశంబున బ్రాహ్మణకంటకుం డగువాఁడు వధింపఁబడియె మన కెల్లరకు సుఖంబు సంప్రాప్తమయినది. నీవు సత్వరంబ త్రివిష్టపంబున కేతెంచి యెప్పటియట్ల సురరాజ్యపదవినంది లోకములెల్ల బాలింపుము. మహర్షులెల్లరును జితేంద్రియుఁడవు, జితామిత్రుండవు నగు నిన్నుఁ బ్రస్తుతించుచున్నారని వచించె.

### ఇంద్రుండు మరల రాజ్యంబు పాలించుట

అగస్త్యుండు పలికినవాక్యంబు లమృతోపమానంబులై వీనుల సోకినంత నెల్లరును బరమానందంబున నోలలాడిరి. ఆసమయంబున మహర్షిగణంబులతోఁగూడి పితరులు, యక్షులు, పన్నగులు, రాక్షసులు, గంధర్వులు, దేవకన్యలు, సర్వాప్సరస్త్రీలు, సరస్సులు, నదులు, శైలములు, సాగరములును నింద్రునికడ కేతెంచి వానితో 'శత్రుతాపసా! విధాత దయచే నగస్త్యునివలన దురాత్ముం డగునహుషుండు నిధనంబు నొందె. పాపసమాచారుం డగువాఁడు సర్పరూపంబున భూలోకంబునఁ ద్రెళ్లుచున్నవాఁడు. నీవాలసింపక యీక్షణంబ యేతెంచి సురరాజ్యంబు పాలింపు'మని పలికిరి. అనంతరము గంధర్వాప్సరోగణంబులు జయజయధ్వను లొనరించుచుఁ గైవారంబునేయ సర్వలక్షణసంపన్నం బగు నైరావతం బను మదగజంబు నధిష్ఠించి మహాతేజుం డగు వీతిహోత్రుండును, మహర్షి యగు బృహస్పతియు, యముండు, కుబేరుండు, వరుణుండును

దోడకా సర్వదేవగణపరివృతుండై వృత్రనిషూదనుండు త్రివిష్టపంబు నకుం జనియె. మహేంద్రుం డిట్లు మహావైభవంబునఁ ద్రిదశాలయం బున కరిగి పరమసంతోషంబున శచీదేవిం గూడి ముల్లోకముల నుల్లా సంబునఁ బాలించెను. ఆసమయంబున "అంగిరోమహర్షి" సురేంద్రుని కడ కరుదెంచి యాతని నథర్వవేదమంత్రంబులఁ బ్రస్తుతించె. భగవం తుం డగునింద్రుండు అథర్వాంగిరునియెడఁ గరంబు ప్రీతుండై యా మహర్షి పేర నీస్తుతిభాగము అథర్వాంగిరోవేదమని వేదంబునఁ బ్రకా శించుననియు, వానికి యజ్ఞభాగంబు లభించుననియు వరంబు లొసంగి పూజించి యతనిని వీడ్కొలిపె. మఱియు నెల్ల దేవతలను, మహర్షులను యథోచితంబుగ సత్కరించి ధర్మంబు తప్పకుండ లోకంబులు పాలిం చెను.

ధర్మనందనా! తొల్లి యింద్రుండు భార్యతోఁగూడ నిట్లు దుఃఖంబు లనుభవించె. శత్రువధ కాంక్షచే నింద్రుం డజ్ఞాతవాసంబుగూడఁ గావించె. దేవేంద్రుఁడే యట్లు క్లేశంబు లనుభవింప మనమన నెంత వారము? భార్యతోడనుఁ సహోదరులతోడనుగూడి మహావనంబులం దనుభవించినక్లేశంబులకు వగవకుము. సురేశ్వరుండునుంబోలె నీవును యథాపూర్వముగ నీరాజ్యంబు నొందెదవు. వృత్రాసురుని వధించి యెట్లు సురేశ్వరుండు నిష్కంటక మగు రాజ్యము నొందెనో, యట్లే నీవునిష్కంటక మగు రాజ్యంబునొంది సుఖంబుగఁ బ్రజారక్షణంబు గావిం తువు. దురాచారుం డగు నహుషుం డెట్లు బ్రహ్మద్వేషంబున నగస్త్యు నిచే శాపమొంది చిరకాల మెట్లు వినాశమొందెనో, యట్లే దురాత్ము లగు నీశాత్రవులు కర్ణదుర్యోధనాదులు నచిరకాలంబున వినాశము ప్రాపింతురు. పిదప నీవు పత్నితోడను, సోదరులతోడను నిహతకంటక మగురాజ్యంబు స్వాయత్తంబు గావించికొని సాగరపర్యంత మగు మహీ తలంబు నవక్రపరాక్రమంబున ననుభవింతువు. వేదసమ్మితం బగు శక్ర విజయం బను నీయుపాఖ్యానము రాజులు యుద్ధసమయంబులందు, సేనలు వ్యూహంబులు పన్నియున్నయవసరంబులందు వినవలయును. అట్లు విన్నవారికి జయము తప్పక లభించును. కావున విజేతల కగ్రేస రుండ వగు నీకిప్పు డీకథ వినిపించితిని. మహాత్ము లెప్పుడును స్తూయమా నులై తమబలము ప్రకటించుచుందురు. ధర్మనందనా! యిపుడు దుర్యో

ధనునియపరాధంబువలనను భీష్మ కర్ణసులబలంబు పెంపునను సకలక్షత్రియు లకును వినాశం బాసన్నంబై యున్నది. ఇంద్రవిజయం బను నీయాఖ్యా నంబు నెవ్వండు నియతిమెయిః బఠించునో వానికి స్వర్గంబు సుప్రాప్తం బగును. వానికిః బరలోకమందు నీలోకమందు నానందముగల్గును. వానికి శత్రుకృత మగుభయ మింతయు నుండదు. వానికి దీర్ఘాయుష్కు లగు పుత్రులు గల్గుదురు. ఏయాపదలును వానికి సంభవింపవు. వాఁడు దీర్ఘా యుష్కుండగును.

ఇట్లింద్రవృత్తాంత మెఱింగించి శల్యునిచే నాశ్వాసింపఁబడిన ధర్మ జుండు ధర్మభృదగ్రగణ్యుం డగుశల్యుని మిగులఁ గొనియాడి వానితో రాజా! నీవు తప్పక కర్ణునకు సారథ్యముఁగావింతువు. ఆవిషయమ్మున సంశయము లేదు. సారథ్యంబు నెఱపుతఱి నర్జునుని బ్రస్తుతించుచుఁ గర్ణునకుఁ దేజోవధంబు గావింపవలయునని ప్రార్థించెను. అదివిని శల్యుండు కౌంతేయాగ్రజా! తప్పక నీచెప్పినదొప్పునఁ గావింతును. ఇంతియ కాక నాకుఁ జేతనైనంతవఱకు నితరవిధములఁగూడ సాహ్యంబు సేసెదనని పలికి శల్యుండు సబలుండై ధర్మనందనుని వీడ్కొని దుర్యో ధను పాలికిం జనియె.

## భగదత్తాదిరాజులు దుర్యోధనునిఁ జేరవచ్చుట

అనంతరము సాత్వతవీరుండగు యుయుధానుండు మహారథుండు చతురంగబలపరివృతుండై యుధిష్ఠిరునిఁ జేరవచ్చెను. నానాదేశాగతు లగువానిసైనికులు వివిధాయుధంబులధరించి యాబలంబు నధికంబుగ వెలుంగంజేసిరి. పరశ్వధంబులు, భిండివాలంబులు, శూలంబులు, తోమ రంబులు, ముద్గరంబులు, పరిఘంబులు, యష్టులు, పాశంబులు, నిర్మలంబు లగుకరవాలంబులు, ఖడ్గంబులు, కార్ముకంబులు మొదలగుతైలధౌతంబు లగు నాయుధంబుల తళతళనిమెఱుపులచే నాసైన్యంబు మిగుల శోభిల్లె. మెఱుపులంబోనియాయుధంబులకాంతులచే సైన్యమెల్ల జల దంబుల ననుకరించియొప్పె. అక్షౌహిణీపరిమితం బగు నాబలంబు యుధి ష్ఠిరుని మహాబలమందుఁ బ్రవేశించి సాగరంబుఁ బ్రవేశించిన చిన్న చిన్న కుల్యలవలె నణఁగియుండె. చేదిపుంగవుం డగు ధృష్టకేతుండు తానొక్క యక్షౌహిణీబలంబుగైకొని పాండవులం గదియవచ్చెను. మగధాధి

[illegible]ఘుండు జరాసంధతనయుండు జయత్సేనుం డనువాఁ డొక్కయక్షౌ
హిణిసేనతో ధర్మనందనుకడకు వచ్చెను. అట్లు పాండ్యదేశాధీశ్వరుండు
పర్వతానూపవాసు లగు సైనికుల మహాయోధులతోఁగూడి యుధిష్ఠిరుని
సమీపించెను. వానిసైన్యంబు లెక్కకుమిక్కిలియై సువేషంబును బల
సత్త్వంబులను మిగులఁ బ్రకాశమయంబై యుండె. ద్రుపదుండును నానా
దేశాగతు లగు వీరవరేణ్యులతోడను మహారథు లగు తనయులతోడనుం
గూడి మహాసైన్యంబుతో వచ్చి యుధిష్ఠిరునియనీకంబు గలిసె. అట్లు
మత్స్యదేశాధీశ్వరుం డగు విరాటుండును బర్వతనివాసు లగు సైనికు
లతోఁగూడి పాండవులఁ జేరవచ్చెను. నానాదేశంబులనుండియుఁ బాండ
వులకు సాహాయ్యంబు గావింప నేతెంచిన వివిధధ్వజసంకులంబు లగుబలంబులు
ఏడక్షౌహిణులయ్యె. ఈబలంబులెల్లఁ గౌరవులతోడియుద్ధంబునకు సిద్ధం
బులై పాండవులకు మహాహర్షంబు నాపాదించినవి.

ఆసమయంబున ధార్తరాష్ట్రులకు హర్షంబుగూర్చుచు భగదత్తుండు
చీనకిరాతసంకులంబై కాంచనావృతంబువలెఁ బ్రకాశించు నొక్కయక్షౌ
హిణీబలంబు సుయోధనున కొసంగె. కర్ణికారవనంబుంబోలె విరాజ
మానం బగు నాబలంబు పగఱకనాధృష్యంబై వెలింగె. భగదత్తునియట్ల
భూరిశ్రవసుండును శల్యుండు నేకైకాక్షౌహిణితో దుర్యోధను నుప
గమించిరి. హార్దిక్యుం డగుకృతవర్ముండు భోజాంధక కుకురవీరులతో
నేకాక్షౌహిణీబలంబున దుర్యోధనునిం గదియవచ్చె. వనమాలాధరు
లగు వీరవరులచే నిండినకృతవర్మునిబలంబు మదపుటేనుంగులతోడి మహా
వనంబుంబోలి విలసిల్లె. సింధుసౌవీరదేశంబులవసించు జయద్రథుం డాది
గాఁగల నరపాలురు పర్వతంబులు కంపమొంద సుయోధను సమీపిం
చిరి. వారలసైన్యంబెల్ల నేకాక్షౌహిణీపరిమితంబై యుండె. మారుతం
బుచే విధూయమానం బగు మహాజలదంబుమాడ్కి కాంభోజదేశాధీశ్వ
రుండు సుదక్షిణుండు నొక్కయక్షౌహిణితోఁ జేరవచ్చె. మిడుతలం
బోని వానిసైన్యంబు సుయోధనుబలంబు సొచ్చి యంతర్ధాన
మొందె. మఱియు మాహిష్మతీపురాధిపతి యగు నీలుండు దక్షిణాపథ
నివాసులు మహాబలదర్పితులు నగు యోధులతో వివిధాయుధంబులు
చూపఱకు భయంబుగొలుప నేతెంచె. అవంతిదేశాధీశ్వరులు మహాబల
పరివృతులై రెండక్షౌహిణులసేనతో నేతెంచిరి. కేకయదేశాధిపతు

లేవురు సోదరులు కౌరవేశ్వరునకు ముదం బుదయింప నొక్కయక్షౌహిణితో నేతెంచిరి. మఱియు నానాదేశంబులనుండి వచ్చినబలంబెల్ల మూఁడక్షౌహిణులయ్యె. ఇట్లువచ్చిన కౌరవబలంబెల్లఁ బదునొకండక్షౌహిణులై కౌంతేయులతో యుద్ధంబుసేయ మహోత్సాహంబునఁ జెలంగుచుండె. బలముఖ్యు లగురాజులు విడియుటకైన హస్తినపురంబున నవకాశంబు చాలియుండలేదన్న సైన్యంబు లన్నింటికి స్థలము చాలలేదని వేఱచెప్పనేల? అప్పుడు పంచనదంబునను, గురుజాంగలంబులను, రోహితకారణ్యంబున, మరుభూమియందు, నహిచ్ఛత్రంబునఁ, గాలకూటంబున, గంగాకూటంబున, వారణమున, వాటధానంబునను, సువిస్తీర్ణంబు ధనధాన్యసంపన్నంబు నగు యామునపర్వతోపాంతంబునందును గౌరవబలంబువిడిసి మహోత్సాహంబు మీఱియుండెను.

## ద్రుపద పురోహితుఁడు కౌరవసభ కేఁగుట

ఆసమయంబునఁ బాంచాలపతిచేఁ బ్రేషితుండయిన పురోహితుండాసాగరోపమానం బగు కౌరవబలమెల్ల నీక్షించుచు ధృతరాష్ట్రసభాంగణంబున కేఁగె. వేదవేదాంతవేదాంగములు సాకారంబై యేకరూపం బందినట్లు బ్రహ్మతేజంబునఁ బ్రజ్వలించు నావృద్ధమహీసురుని విదురుండు శాంతనవుండు ధృతరాష్ట్రుండు నర్ఘ్యవిధులం బూజించి వేర్వేఱఁ బాండవులయుఁ బాలురయుం గుశలం బడిగిరి. అతండును పాండవుల కుశలంబు వచించి దుర్యోధనాదుల కుశలం బడిగి సేనానాయకులనెల్ల ననామయంబు ప్రశ్నించి సకలసేనాధీశుల సమక్షంబునఁ దాను వచ్చినపని యిట్లు చెప్పం దొడంగె. సభాసదులారా మీకెల్లరకును రాజధర్మంబు బాగుగఁ దెలిసినయదియే. అవసరం బాసన్నం బగుటవలన మీరెల్ల రెఱింగినదియే యైనను నేను మరలఁ జెప్పవలసివచ్చినది. ఈధృతరాష్ట్రుండును పాండునరపాలుండు నొక్కనితనయులే యనియుఁ బైతృక మగుధనము వారిరువురకు సమానమే యనియు మీ రెఱుంగనిది కాదుకదా? అట్టితఱి ధృతరాష్ట్రునితనయులు తమపైతృకధనం బనుభవించుటకును బాండవులు వారితండ్రిసొత్తు ననుభవింపకుండుటకును గారణ మేది? పాండవులు తమపిత్రార్జితధన మనుభవింపకుండ ధార్తరాష్ట్రుండు వారి కెన్ని బాధలు కల్పించెనో మీ రెప్పుడును స్మరింతు రనియే తలంచెదను.

ధార్తరాష్ట్రులు ప్రాణాంతకంబు లగు నుపాయంబు లొనరించినను నా
యుష్యశేషంబులుగలవా రగుటచే వారు యమసదనంబున కరుగరైరి.
మఱియు నమ్మహాత్ములు స్వబలపౌరుషంబుల ననేకవిధంబులఁ బెంపొం
దించిన రాజ్యంబును క్షుద్రులగు నీధార్తరాష్ట్రులు కపటద్యూతం
బున నపహరించిరి. సౌబలుండును వీరిదుస్తంత్రముల కూఁతగొమ్మయై
బహుపాపకర్మంబు లాచరించియున్నాఁడు. పదుమూఁడువత్సరంబులు
మహారణ్యంబులందు వారు వసించుట దుర్యోధనాదుల దుర్నయంబుననే
కదా? సభయం దమ్మహావీరులు బహువిధంబు లగుబాధలు భార్యతోఁ
గూడ ననుభవించిరి. వనములందు వివిధంబులగు కష్టపరంపరలకుఁ
బాలైరి. మఱియు విరాటనగరంబున వార లనుభవించిన ఖేదంబు
లెవ్వండు చెప్పఁగలఁడు? ఎవఁడు వినఁగలఁడు ? జన్మాంతరగతులంబోలెఁ
బాపకారులమాడ్కిఁ బ్రచ్ఛన్నవృత్తినుండి మహాఖేదంబు లనుభవిం
చిరి. ఇట్టి విపత్పరంపరల నీధార్తరాష్ట్రులవలన ననుభవించినవా
రయ్యు నావిషయమును మదిని గణింపక వారు కౌరవులతోడిసామము
నాకాంక్షించుచున్నవారు. లోకోత్తరపుణ్యచరితు లగు కౌంతేయుల
సద్వృత్తంబును దుర్యోధను దురాచారంబును బాగుగ విమర్శించి యీ
సభయందున్న సుహృజ్జనంబులెల్ల ధార్తరాష్ట్రు ననునయింపం దగును.
ఆవీరపుంగవులు కౌరవులతోడికయ్యంబున కియ్యకొనరు. యుద్ధంబుల
వలన జనక్షయం బగుట వారి కెంతమాత్ర మభిమతముగాదు. ఎవ్వరికిని
లేశమైన గీడుకలుగనివిధంబునఁ దమరాజ్యభాగంబు తాము పొందఁ
గోరుచున్నవారు. మొదట స్వబలమాత్రదర్పితుండును బైఁగ నిపుడు
సాహాయ్యమునకై వచ్చిన బలంబులచే మదోన్మత్తుండు నగు సుయోధనుండు
బలాధిక్యంబువలన యుద్ధంబునకు సన్నద్ధుం డగుచున్నవాఁడు. కాని
వానియూహ మహోహము. ఎట్లయ్యెను పాండవులే బలాధికులని దృఢం
బుగ నమ్మవలయును. ధర్మనందనునిసైన్యంబు లేడక్షౌహిణులు. వీరివి
పదునొకండక్షౌహిణులందురేని వినుండు. సైన్యంబు లేడక్షౌహిణులు
మాత్రమకాక వేయునక్షౌహిణులకీ డగు మహావీరులెందరో యాతని
యానతికై వేచియున్నారు. సాత్యకియు భీమసేనుండును గవలవారు
నొక్కొక్క రొక్కొక్కయక్షౌహిణిపాటివారు. కావున పాండవుల
సైన్యముగూడఁ బదునొకం డక్షౌహిణులనియే యెఱుంగుఁడు. ఇంతియ

కాక బహుళంబు లగునీసేనలన్నియు నొకయెత్తును, బహురూపుం డగు ధనంజయుం డొకయెత్తునని తెలియుఁడు. మహాబాహుం డగు కిరీటి యొక్కరుండ సకలసేనలకంటె నెట్లధికుండో యట్లే వాసుదేవుండును బరమాధికుండై యున్నవాఁడు. వారలకు బహుళంబు లగుసేనలుగలవు. త్రిలోకదుస్సహం బగు గాండీవిపరాక్రమంబు గలదు. అఘటనఘటనాచతురుం డగు వాసుదేవునిబుద్ధిసాహాయ్యంబు గలదు. అట్టిపాండవులతో నొడలిపైఁ దెలివిగలమానవుం డెవ్వఁడు తలపడ నిచ్ఛగించును? కావున మీ రెల్లరు బాగుగ ధర్మంబును సమయంబు నాలోచించి వారికీయవలసినభాగము సత్వరంబుగ వారికిచ్చునది. వారితోడమైత్రి సంపాదించుటకిదియ తగినయదను. ఈయవకాశంబు వమ్మైనర్పితిరేని పిదప శోకింపవలసియుండు" నని పలికి మిన్నకుండె.

ఆపురోహితుం డటుపలికినవాక్యంబు లాలించి ప్రజ్ఞావృద్ధుండును మహాద్యుతియు నగు శాంతనవుం డావిప్రునిఁ బూజించి యిట్లనియె. భూసురోత్తమా! దైవకృపచే దామోదరునితో వారెల్లరును గుశలమున్నవారని విని మిగుల నానందమయ్యె. వారలు సహాయము సంపాదించుటయు మాకుఁ బ్రీతికారణంబే. క్షత్రధర్మంబునందు వా రభిరతులై యుండు టెంతయు నొప్పియున్నది. యుద్ధశ్రద్ధఁబూనక వారు సంధి నాకాంక్షించు టెంతయుఁ బ్రశంసనీయము. నీచెప్పినవాక్యంబులన్నియు సత్యంబులై మహార్థవంతంబులై యున్నవి. వాక్యంబులందలి తీక్ష్ణత్వముమాత్రము బ్రాహ్మణస్వభావమువలనఁ గలిగినది కావున దాని నాలోచింపఁబనిలేదు. పాండవులు నిస్సంశయంబుగఁ బురంబందును వనంబులందునుగూడ మిగులఁ గ్లేశంబు లనుభవించియుండిరి. ధర్మాభిరతిచే వారలు తమపైతృకం బగు సర్వధనంబును బొందుట నిక్కము. పృథాతనయుం డగు నర్జునుండు కృతాస్త్రుండు మహారథుండు మహాబలవంతుండును. ఆధనంజయునాజులం దెవ్వఁ డెదిరించి నిలువఁగలఁడు? వజ్రంబుధరించిన పురందరుండైన వానిధాటి కాఁగఁజాలఁడన్నచో నితరులఁ జెప్పనేల? ఆపాండవమధ్యముండు ముల్లోకంబు లొక్కటియైవచ్చినను గెల్వ సమర్థుండని నానిశ్చయము. అని యిట్లు భీష్ముండు పలుకుచున్నంతఁ గర్ణుండు మన్యుపరవశుండై శాంతనవునిమాటల నాక్షేపించి యిట్లు పలికెను. విప్రపుంగవా! మీరుచెప్పినవిషయంబులు లోక

మందలి యెల్లభూతంబులు నెఱింగినవే! మరలమరల నావిషయంబులే యెత్తిచెప్పుటవలన నేమిప్రయోజనముగలదు? శకునిదుర్యోధనునిమిత్తం బున ద్యూతమాడి వారలరాజ్యంబెల్ల గెలిచినవాఁడు. పాండునందనుండు సమయంబొక్కటి నిర్ణయించి తత్పాలనమునకై యరణ్యముల కేఁగినవాఁడు. మాత్స్యపాంచాలురబలంబు నాశ్రయించి ధర్మనందనుండు తాను మున్నొనర్చినసమయము ననాదరించి మూర్ఖుఁడువోలెఁ బైతృకంబగు రాజ్యంబు గోరుచున్నవాఁడు. ఈసుయోధనుండు బలంబున కు భయమంది తుదకు నొక్కయడుగుమోపు ననువైనభూమియైన నిచ్చువాఁడు గాఁడు. శత్రుండైనను ధర్మమార్గంబున నడుగునేని రాజ్యంబు సమస్తంబును సంతోషంబున నిచ్చివేయును. వారలకుఁ దమ పితృపైతామహంబగు రాజ్యంబునం దాశకలదేని వారు ప్రతిజ్ఞానుసారంబుగ వనంబులఁ జరింపవలయు. వనవాసానంతరమందు నకుతో భయులై దుర్యోధను నంక మాశ్రయించి సుఖింతురు. మూర్ఖత్వ మాలంబించి కేవలము అధర్మప్రవృత్తులు గాకుందురుగాక. వారలు తాఁబట్టినకుందేటికి మూఁడేకాళ్లనురీతిని మూఢత్వమున ధర్మమువీడి యుద్ధంబుసేయ సమకట్టిరేని, కురుశ్రేష్ఠులగు వీరినెదిరినపుడు నావచనము తలంచుకొందురని పలికె. ఆమాటల కలిగి భీష్ముండు 'రాధేయా! వృథాఁగా మాటలేల యాడెదవు? పార్థుం డొక్కరుండ మహాసేనలతోఁ గూడిన మనలనెల్లర నశ్రమంబున నోర్చినవిషయ మప్పుడే మఱచితివా! ఈబ్రాహ్మణోత్తముం డుపదేశించినరీతిని మన మాచరింపనిచో మన మెల్లరము సంక్రందననందనుగోపాగ్నికి శలభంబులమై పాంసుభక్షణంబు గావింపవలపినవారలమే యనియె. ఆసమయంబున నాంబికేయుండు శంతనుపుత్రు ననునయించి ప్రసన్నుఁగావించి రాధాత్మజు మందలించి వానితో నిట్లనియె. సూతనందనా! శాంతనవుండు మన హితంబు గోరియే యట్లు వచించియున్నాఁడు. ఆవాక్యము మనకుఁ బాండవులకు మాత్రముగాక యెల్లజగంబులకు హితమైనది. అని పలికి ద్రుపదపురోహితునితో 'మహామతీ! నేను బాగుగ నాలోచించి పాండవులకడకు సంజయునిఁ బనిచెద. నీవు సత్వరంబుగఁ బాండవులపాలి కరుగుమనిచెప్పి యావిప్రునకు కుచితసత్కారంబు లొనర్చి పంపి తరువాత సంజయు రావించి వానితో నిట్లని పలికె.—

ధృతరాష్ట్రుండు పాండవులకడకు సంజయు నంపుట

సంజయా! పాండవు లుపప్లావ్యంబునకు వచ్చియున్నారని వింటిని. నీ వచ్చటికేఁగి వారిఁ జూచిరమ్ము. అజాతశత్రునితో 'వత్సా! దైవకృప వలన నీవస్థానంబు నధిగమింపకుంటివి సుమ్ము. వారందఱితోడను గృచ్ఛ్రం బున తదర్హ్యంబు నగువాసంబువలన స్వస్తిమంతులరై బయలు వెడలితి రనుము. మనము వారలు కావించినయుపకారంబులు మఱచి వారి నకారణంబ పలుబాములఁ బెట్టినను సజ్జను లగువారు మనయెడ శాంత చిత్తులై యే యున్నారు. సంజయా! ఎప్పుడే నొకప్పుడైనను బాండవులు మన కాచరించిన యప్రియంబు నేను జూడలేను. ఆత్మబలంబున నార్జించినసిరియెల్ల నాయందు విడిచియున్నారు. ఎంత వెదకినను వారు మన యెడఁగావించిన యకార్యం బొక్కటియేని గానరాకున్నపుడు వారి నెట్లు దూషింపఁగలము? వార లెల్లపుడును ధర్మార్థంబులకే కర్మము లాచరింతురు. సుఖప్రియంబులను గామంబులను వాంఛింపరు. శీతా తపంబులను, క్షుత్పిపాసలను, నిద్రను, తొందరపాటును, క్రోధంబును, హర్షంబును, బ్రమాదంబును, ధైర్యంబుచేతను బ్రజ్ఞచేతను బరిహ రించి ధర్మార్థంబులకే ప్రయత్నింతురు. వారు మిత్రులందు సమయమను సరించి ధనంబులు విసర్జింతురు. మైత్రి వారియెడ సుఖవాసంబొంది జీర్ణించును. వారు యథోచితంబుగనె సమ్మానము గావించుచుందురు. ధర్మనందనుపక్షమందుఁ బార్థులను ద్వేషించువాఁ డొక్కఁడైన నుం డఁడు. కేవలము బుద్ధిహీనుండు పాపాత్ముండు విషముండు నగు దుర్యో ధనుండును క్షుద్రాత్ముఁ డగుకర్ణుండునుదక్క లోకంబునందుఁ బాండవుల ద్వేషించువాఁ డెవ్వఁడును లేఁడు. బాలిశు లగువీరిరువురును సుఖప్రియరహితులగువారల తేజంబు నభివృద్ధిపఱుచుచున్నారు. దుర్యో ధనుం డుత్థానవీర్యుండై సుఖంబు లనుభవించుచు నదియే సుకృతమని భావించుచున్నాఁడు. పాండవులు జీవంబులతో నుండఁగానే వారల రాజ్యభాగం బపహరింప శక్యమగునని బాలిశుం డగు సుయోధనుండు తలంచుచున్నాఁడు. ఎవనికంటె ముందుగా నహమహమికమీఱి నర్జు నుండు కేశవుండు వృకోదరుండు సాత్యకి మాద్రీతనయులు సృంజయుం డును యుద్ధంబున కాయత్తం బగుదురో యట్టి యజాతశత్రునితోడి

యుద్ధంబునకునున్న దాని భాగంబు వానికిచ్చుట శ్రేయస్కరము. సవ్యసాచియొక్కఁడె రథారూఢుండై గాండీవంబు కేలం బూని యీ భూమిగలపేరులనెల్లఁ బరాజితులం గావింపంగలఁడు. వానియట్ల నప్రధృష్యుండును జిష్ణుండును త్రిలోకాధిపతియునగు కేశవుండును లోకంబుల నాశిలంబు గావించు. సర్వలోకంబులందును బ్రవరుండగు నెవ్వండు గాండీవంబు కేలం బూని యేకరథంబున మేఘగంభీరఘోషంబు లగు శరాసారంబులను శీఘ్రవేగంబులగు పతంగసంఘములవలె విడుచుచు నుత్తరదిక్కును నుత్తరకురుదేశంబులను జయించెనో యట్టి సవ్యసాచి కెదిరి నిలువంగలమర్త్యుం డెవ్వండు? మఱియు నాతం డాయా దేశంబులందలి ధనంబులెల్ల జయించె. ద్రావిడులనెల్ల ననుచరుల గావించె. ఖాండవవనదాహసమయంబున సర్వసురలతోఁగూడిన దేవేంద్రునశ్రమంబున గాండీవమాత్రసహాయుండై జయించె. అట్లు జయించి ఖాండవవనంబు జాతవేదున కిచ్చి పాండవుల కత్యధికమగు యశంబు గూర్చె. గదాధరులందును హస్త్యారోహకులందును భీమసేనున కీడైన వాఁ డెందును గానరాఁడు. రథచర్యయందు వృకోదరునికి సమానుం డెవ్వఁ డని యందురు? వానిబాహుబలము పదివేలమదగజంబులబలంబునకు సాటియైనది. వాఁడు యుద్ధంబులందు సుశిక్షితుండు. మహాజీవసంపన్నుండు. వానికిఁ గోప ముదయించెనే నాక్షణంబ ధార్తరాష్ట్రులనెల్ల నొక్కపెట్టున దహించివైచును. అత్యమర్షుం డగు నాబలీయుని గెలువ సాక్షాత్పురందరునకైన శక్యంబుగాదు. సుచేతస్కులు బలవంతులు శీఘ్రహస్తులు సుశిక్షితులునగు కవలవారు ఫాల్గునికి సమానులైనవారు. శ్యేనంబులు పక్షికులంబులమడియించుతెఱంగున వారు శాత్రవు నొక్కనినేని మిగులనీయక వధింతురు. ఇప్పు డిక్కడ మనకు సంపూర్ణంబగు బలము కలదుగాని వారు సమీపించినంతన మనకు బలమేమియు మిగులదని నానమ్మకము. వారిమధ్యంబుననున్న ధృష్టద్యుమ్నుండు మిగుల జవసత్త్వంబులుగలవాఁడు. అతఁడు పాండవులలో నొక్కముఖ్యుఁడుగా నున్నాఁడు. సోమకప్రవరుం డగునాతఁడు పాండవులకై ప్రాణంబులైన వీడ నుత్సహించుచున్నాఁడని వింటిని. వృష్ణిసింహం బగుబలదేవుం డొక్కరుండు తక్క నన్యుం డెవ్వండైన నజాతశత్రు నెదిరి నిలువంగలఁడా? మాత్స్యులకెల్ల నధిపుండగు విరాటుండు వారలతోఁగూడి

నివసించిన స్నేహంబునఁ బాండవులం దధికప్రీతికలవాఁడు. ఆతండు నాతనితనయులును బాండవులకై ప్రాణంబులైన ధారవోయ సిద్ధమై యున్నారు. విరాటునకు యుధిష్ఠిరునియం దధికమగుభక్తియుఁ గలదు. పైఁగ బంధుత్వగౌరవంబు నున్నది. కైకయాధిపతు లేవు రన్నదమ్ములు దాయాదులచే రాజ్యంబు గోల్పడి మరల రాజ్యంబు స్వాధీనపఱుచు కొనఁదలంచి పాండవుల శరణుసొచ్చిరని వింటిని. వారేవురును మహాబల పరాక్రమాభిరాములును సంతతయుద్ధలుబ్ధులు నని వింటిని. మఱియు నుత్తమవీరులు శూరులునగు రాజు లనేకులు పాండవులకు సాహ్యంబు కావింప వచ్చియుండిరని తెలియుచున్నది. వచ్చినవారెల్లరును మహా శూరులును ధీరులును ధర్మరాజునం దధికప్రీతియు భక్తియుఁ గలవారు. గిరినివాసులును, దుర్గనివాసులును, యోధకులంబులం దుద్భవించినవృద్ధులును, నానాయుధవీరోద్రిక్తులగు మ్లేచ్ఛులును బాండవులకై వచ్చి ప్రాణంబులైన నర్పింప సంసిద్ధులై యున్నవారు సంగరంబున సంక్రందనున కెనయగుపాండ్యరాజన్యుండు యుద్ధములం దాఱితేఱిన యనేక యోధపుంగవులతోఁగూడి పాండవసహాయుండై వచ్చియున్నవాఁడు. లోకప్రవీరుండు నప్రతివీర్యతేజుండునగు నమ్మహాత్మునకు సాటిలేదని వింటిని. ద్రోణునివలనను నర్జునునివలనను వాసుదేవునివలనను కృపాచార్యునివలనను భీష్మునివలనను నమేయంబులగునస్త్రంబుల గడించి యేక వీరుండని కీర్తిగడించి వసుదేవాత్మజునకు సమానుం డగుసాత్యకి పాండవార్థంబయి మిక్కిలి నభినివేశమున నున్నవాఁడు.

తొల్లి చేదినరపాలురు కారూషకులు నాదిగాఁగలరాజు లనేకులు గలసి కృష్ణునితోడి యుద్ధంబునకు సన్నద్ధులై యుండఁగా వారి మధ్యను మధ్యందినమార్తాండబింబంబుడంబున వెలుంగుచున్న చేది దేశాధీశుండగు శిశుపాలుండు మహాగర్వాతిరేకంబున రాజలోకంబునఁ దనకెవ్వరు నెదురులేరని మదించి కృష్ణు నెదిరించె. యుద్ధంబులం దెట్టిరాజులకు నస్తంభనీయుం డగువానిని లీలచే విలోకించి ప్రేక్షకులగురాజుల సర్వోత్సాహంబు నశించునట్లు ధనుర్ధరుల కగ్రేసరుండగు వానిని మడియించెను. కరూషదేశాధీశ్వరుండు మొదలగురాజు లెవ్వనికిఁ జేదోడువాదోడునై యెవ్వనికి యశోమానంబులు పెంపుగావించిరో యట్టి మహావీరుండగు శిశుపాలు నశ్రమంబున సంహారించి పాండ

వ్రుల కత్యధికంబులగు యశోమానంబులు గూర్చె. సుగ్రీవంబను తురం
గంబుంబూన్చినయరదంబున నసహ్యబలపరాక్రమాభిరాముండగు కృష్ణు
నీక్షించి శిశుపాలునిపక్షంబునందలి నరపాలు రెల్లరును సింహంబు నాలో
కించిన శశకంబులట్లు లజ్జామానంబుల డిగనాడి శిశుపాలు నక్కడన
విడి పరువెత్తిరి. కృష్ణునితో విరోధించి ద్వంద్వయుద్ధంబుసేయ నెవ్వండు
తలఁపడునో వాఁడు కృష్ణునిచే మడిసి గాలికివిఱిఁగిన కర్ణికారంబుంబోలి
నేలఁగూలె నన్నమాటయే నిక్కము. సంజయా! పాండవకార్యార్థమై
నాకుఁ గృష్ణునిపరాక్రమం బీక్షణంబునఁ దెలిపియుండిరో యాక్షణము
నుండియు నమానుషములు నతిలోకములు నత్యద్భుతంబు లగువాని
పరాక్రమంబులు తలంచుకొనుచున్న నాకు శాంతి యన నెట్టిదో కలుగఁ
దయ్యె. నే ననుభవించుహృదయావేదన మింతంతగాదు. వృష్ణిసింహం
బగుకృష్ణుం డగ్రేసరుండై నిల్వఁ బాండవులను శాత్రవు లెవ్వరును
జెనకఁజాలరు. కృష్ణార్జును లిరువురు నేకరథాధిరూఢులై యున్నారని
వినినదాదిగ నామనంబు కంపమొందుచున్నది. మందబుద్ధియగు నా
కొడుకు వాసుదేవార్జునులతో యుద్ధంబునకు సిద్ధపడఁడేని సుఖమను
భవింపఁగలఁడు. సుయోధనుండు క్రిందుమీఁదు లరయక వారితో
సంగరంబునకు డీకొనియెనేనిఁ దొల్లి సంక్రందనుండును విష్ణుండు దైత్యా
నీకంబునుంబోలె వారిరువురును గౌరవానీకంబులనెల్ల నేకకాలంబున
దహించివైతురు. ధనంజయుడు నిస్సంశయంబుగ శక్రసమానుం
డనియుఁ గృష్ణుండు సాక్షాన్నారాయణుండనియు నేనుఁ దలంచుచున్నాఁ
డను. ధర్మాభిరతుండు హ్రీనిషేవణుండు తరస్వి కుంతీసుతాగ్రజుండు
పాండునందనప్రవరుండునగు నజాతశత్రుండు దుర్మార్గగామి యగు
దుర్యోధనుచే నికారమంది మిగులఁ గోపించియున్నవాఁడు. ఆతనికిఁ
గోప మంకురించెనేని నిరవశేషంబుగ గౌరవులనెల్ల దహింపక విడు
వఁడు. గవల్గణాత్మజా! క్రోధోద్దీప్తుండగు నాయుధిష్ఠిరునికోపంబునకు
భయమందినట్లు వాసుదేవునివలనఁగాని యర్జునువలనఁగాని భీమసేను
వలనఁగాని కవలవారివలనఁగాని భయమొందను. ధర్మతనయుండు మహా
తపశ్శాలి. బ్రహ్మచర్యవ్రతపరాయణుఁడు. ఆతండు మనంబున నిశ్చ
యించినసంకల్పము తప్పక సిద్ధించితీఱును. కావున ధర్మనందనుండు
కోపించియున్నాఁడని వినినంతన నేను మిగుల దిగులొందు చున్నాఁడను.

సంజయా! నీవు శీఘ్రగమనంబగురథం బారోహించి పాంచాలరాజన్యుని స్కంధావారంబున కరుగుము. అజాతశత్రుని కుశలంబడిగి వాని తోడఁ బ్రీతియుక్తంబులగువచనంబులు మరలమరలఁ బలుకుము. వీర్య వంతులలో మహోదారుండు మహామాత్రుండునగు జనార్దనునితో నా వచనంబులుగా ననామయంబడుగుము. ధృతరాష్ట్రుం డెప్పుడును బాండ వులతోడి శాంతినే యభిలషించుచున్నాఁడని పలుకుము. ఆవాసుదేవుని వాక్యంబుల నెప్పుడును ధర్మనందనుం డన్యథాకరింపఁడు. వాసుదేవుండు పాండవులకుఁ బ్రియుండును నాత్మసమానుండును నై యున్నాఁడు. విద్వాం సుం డగుకృష్ణుండు నిత్యము పాండవులకార్యంబునం దప్రమత్తుండై యున్నవాఁడు. మఱియు నక్కడ సమావేశమైయున్న పాండవులను, సృంజయులను, జనార్దనునియు, యుధానుని, విరాటుని, ద్రౌపదీతనయు లేవురను నాపలుకులుగా ననామయం బడుగుము. అప్పు డక్కడఁ బ్రసంగసమయమున భారతులకు హితంబును, సమయోచితంబు నని నీకుఁ దోఁచినదెల్ల నసంశయంబుగఁ బల్కుము. మఱియు నక్కడిరాజు లకుఁ గోపము గలుగకుండునట్లును, యుద్ధప్రయత్నంబు విరమింపఁబడు నట్లు నుచితవచనంబు లాడుమని పలికె.

### సంజయుం డుపప్లావ్యంబున కరుగుట

సంజయుండు ధృతరాష్ట్రునివచనంబు లాలించి యమితౌజస్కు లగుపాండవులదర్శింప నుపప్లావ్యంబున కరిగె. సంజయుండు ధర్మనందను కడ కేఁగి నమస్కరించి వినయవినమితాంగుండై యిట్లని విన్నవించె. సూతకులసంభూతుండను గవల్గణనందనుండను నగుసంజయుం డనునేను దైవకృపచే నారోగ్యవంతుండవు, సహాయసంపన్నుండవు, మహేంద్ర సమానుండవు నగు నిన్ను దర్శించి యమందానంద మొందుచున్నాఁ డను. వృద్ధుండు శ్రుతసంపన్నుండు నగు నాంబికేయుండు నిన్ననా మయం బడుగు మనియె. పాండవాగ్ర్యుండగు భీముండును ధనంజయుం డును మాద్రీనందనులను వేర్వేఱ కుశలం బడుగుమనియె. సత్యవ్రత పరాయణురాలు, వీరపత్ని, మనస్విని, మహారాజపుత్త్రియునగు ద్రౌపది కొడుకులతోడఁ గుశలమున్నదికదా? ఆపాంచాలరాజనందనభరతాన్వ యంబునకు మంగళంబులు చేకూర్పఁజాలునది యని మీతండ్రి మీకుశల

వార్త లడుగుటకై నన్ను బంపెనని చెప్పెను. ఆమాటలాలించి యుధిష్ఠిరుండు సంజయా! నీకు సుస్వాగతంబగుంగాక. నిన్ను జూచుటవలన మాకెల్లరకు నతిమాత్రంబు ప్రీతిజనించినది. నీకనామయంబ యని తలంచెదను. నేను నాతమ్ములు నెల్లరము కుశలమున్నవారము. భారతకుల విస్తారకుండు కురువృద్ధుండునగు ధృతరాష్ట్రుని క్షేమము నీవలన విని మిక్కిలి సంతసించితిమి. నిన్నుం జూడ ప్రత్యక్షముగ ధృతరాష్ట్రునాలోకించినట్టు లానందమగుచున్నది. మనస్వి మహాప్రాజ్ఞుండు సర్వధర్మోపపన్నుండు వృద్ధుండు మాకెల్లరకును బితామహుండు నగు భీష్ముండు కుశలంబున నున్నవాఁడుకదా? తొల్లింటిచందంబున నాతనివృత్తి నిరాతంకంబుగఁ జెల్లుచున్నదియా? పుత్రసహితుం డగు వైచిత్రవీర్యుండు సుఖియేకదా? విద్వాంసుండు ప్రతాపనందనుండునగు బాహ్లికున కనామయంబే? సోమదత్తుండు భూరిశ్రవసుండు సత్యసంధుండగు శల్యుఁడును స్వాస్థ్యంబున నున్నవారలకదా? మహాధనుర్ధరులు నాచార్యులునగు ద్రోణుండు కృపుండు నశ్వత్థామయు నరోగులై యున్నవారలా? మఱియుఁ బృథివింగలధనుర్ధరులలో నగ్రగణ్యులును, గౌరవులకై తమయసువు లర్పింప నుత్సహించువారును, మహాప్రాజ్ఞులు సర్వశాస్త్రావదాతులు నగు మహాయోధులకు క్షేమమా? ఈధనుర్ధరులకు యథోచితసమ్మానములు జరుగుచున్నవా? వారలెల్ల నారోగ్యంబున నున్నవారేకదా? మహాధనుర్ధరుండు సత్స్వభావుండు దర్శనీయాకారుండునగు ద్రోణపుత్రుం డర్హగౌరవమును బొందుచుండునుగదా? రాజునకు వైశ్యస్త్రీయందు జనించినవాఁడు మహాప్రాజ్ఞుండునగు యుయుత్సుండు సుఖమున్నవాఁడా? సుయోధనునకు ముఖ్యామాత్యుం డగు కర్ణుండు సుఖమున్నవాఁడా? మందుండగు సుయోధనుం డెల్లభంగుల నాతనికి విధేయుండై చరించును. వృద్ధలగు రాజమాతలును, మహాదాసీజనంబులును, దాసభార్యలును, రాజభార్యలును, కుమారవర్గంబును, భాగినేయులు, భగినులు, దౌహిత్రులు మొదలగువారి కేబాధలులేక సుఖంబున సంతసించుచున్నవారలుకదా? బ్రాహ్మణులయొక్క వృత్తంబు మునుపటివలెనే చెల్లుచున్నదికదా? తొల్లి మేము బ్రాహ్మణుల కొసంగినదాయంబులు సుయోధనుం డపహరింపలేదుకదా? సపుత్రుండగు నాంబికేయుండు బ్రాహ్మణాతిక్రమముల నుపేక్షించుచున్నాఁడుకదా?

అనర్గళమగు స్వర్గమార్గమగు బ్రాహ్మణశుశ్రూష నుపేక్షింపఁడుకదా? బ్రాహ్మణసేవ యనునది బ్రహ్మదేవునిచేఁ బ్రజలకై వినియోగింపఁబడిన శుభ్రంబగు నుత్తమజ్యోతి. వారియెడ మందులై కౌరవులు దోషములు తొలఁగించుకొనకున్నచోఁ గౌరవులకెల్ల నప్పుడ సర్వనాశ మగును. సపుత్రుం డగుధృతరాష్ట్రుం డమాత్యవర్గంబున సువృత్తి నాలంబించి యుండునుకదా? సుహృద్ద్రోహులగునమిత్రులు భేదోపాయంబులు పన్ని దుష్కార్యంబు లొనరించి జీవింపఁ దలంపరుకదా? తండ్రీ! కౌరవులలో నెవ్వరేని పాండవులయెడ నసూయాపరవశులై లేనిదోషంబుల ప్రకటింపరుకదా? ద్రోణుండు కృపుండు నశ్వత్థామయు మాయందు దోషంబు లున్నవని పేర్కొనరుకదా? ప్రజలు ధృతరాష్ట్రునితో మా దోషంబు లేవేని నివేదింపరుకదా? ఎప్పుడేని దస్యుసంఘంబు లేకమై పల్లెలపైఁ బడినపుడు పార్థునిపరాక్రమంబు స్మరింతురా? దోధూయమానంబగు గాండీవమును గేలంబూని సవ్యసాచియొగిసిన మౌర్వీభుజాగ్రప్రహితంబులు జలదగంభీరనిర్ఘోషంబులునగు బాణంబులనొకప్పుడేని స్మరింతురా? ఈవసుధాతలంబున సంక్రందననందనుకంటె నధికుండుగాని వానికి సాటియగువాఁడుగాని యెవ్వండును విలుకాఁడు నాకంటి కగపడలేదు. ఆయర్జుననకుఁ దీక్ష్ణములగునగ్రంబులుగలవి సుపాసోవిరాజితంబులగు నఱువదియొక్క బాణంబు లొక్కహస్తావాపంబని మన కెల్లరకుఁ దెల్లమకదా? మహాతరస్వియగు భీమసేనుండు గద కేలం దాలిచి యనీకంబులందు శత్రుసంఘంబులు బట్టఁదలఁచి మదోత్కటంబగు గంధద్విపంబు శాద్వలప్రదేశములందువోలెఁ జరించుట యెప్పుడైనఁ దలంతురా? మాద్రీనందనుండగు సహదేవుండు దంతకూరంబున నసంఖ్యాకు లగుకళింగుల నొక్కరుండ వామదక్షిణకరంబుల విల్లు మార్చుచు నశ్రమంబున జయించె. ఆమహాబలు నొకప్పుడైన వారు స్మరింతురా? సంజయా! మున్ను త్రిగర్తులజయింప నకులునిబంపుటయు నాతండు పశ్చిమదిక్కునెల్లఁ జయించి వశపఱుచుకొనుటయు నీవును జూచితివికదా? ఆమహాబలశాలి నిప్పు డెవరైన స్మరించుచుందురా? దురాలోచనం బొనరించి ఘోషయాత్ర కరుదెంచిన సుయోధనాదులకు ద్వైతవనంబున భరింపరానిపరాభవంబుకాఁగా మందులగు వారు శత్రులచేఁ జిక్కియుండఁగా భీమసేనుండు వారలనెల్ల విడిపించివుచ్చెను.

మఱియు నేను నర్జునుండు భీమసేనుండు మాద్రీతనయులును వారల రక్షించితిమి. అర్జునుండు గాండీవమాత్రసహాయుండై శత్రుసంఘముల నెల్లఁ బరాజితంబులు గావించి యశ్రమంబున వచ్చె. అట్టి యర్జునుపరాక్రమ మెప్పుడేని వారు తలంచుచుందురా? మేమెల్ల ప్రయత్నంబు లొనరించి యాధృతరాష్ట్రాత్మజుని గెల్వఁజాలకపోతిమేని, సంజయా! లోకంబున నెట్టిపుణ్యకర్మంబు లొనరించినను సుఖంబు దుర్లభంబని నమ్మవలసి యుండును.

## సంజయుండు సంధివచనంబులాడుట

అజాతశత్రుం డిట్లు పలికిన విని సంజయుండు భయవినయసంభ్రమంబులు ముప్పిరిగొన పాండవాగ్రణీ! కౌరవులనుగూర్చి నీవెట్లు పచింపితి. వదియెల్ల నట్లయున్నది. నీ వేయేజనంబుల కుశలంబడిగితివో వారలెల్లఁ గుశలంబుగనే యున్నవారు. ధార్తరాష్ట్రునినికటంబున మహాధార్మికులగు సాధుపుంగవులు వృద్ధులును గలరు. మఱియుఁ బాపకర్మనిరతులు నున్నారు. ధృతరాష్ట్రతనూభవుండు శత్రువులకుంగూడ నెప్పుడు నాయాధనంబుల నిచ్చుచునే యుండును. అతఁడు బ్రాహ్మణుల వృత్తుల నెట్లపహరించును? అద్రోహులగు మీయెడ ద్రోహులవిషయంబునంబలె ధార్తరాష్ట్రుం డధర్మ్యమార్గంబునఁ జరించుటమాత్రము నింద్యమే. సాధువర్తనులగు మిమ్ములద్వేషించి ధృతరాష్ట్రుండు సపుత్రుండుగ మిత్రద్రోహమాచరించెననుట నిక్కము. ఆదుష్కార్యము మంచిదని యెట్టినీచుండు ననఁజాలఁడు. ముదుసలియు నంధుండునగు నాంబికేయుండు మీయెడ సుయోధనుం డాచరించినపాపకార్యంబు నంగీకరింపకయ యున్నాఁడు. ఆతఁ డాదుష్కార్యంబున కిప్పుడు నత్యంతశోకాకులుండై తపించుచునే యున్నవాఁడు. బ్రాహ్మణులెల్లరు నాతనికి మిత్రద్రోహం బెల్లపాతకంబులకంటెఁగూడ నధికతరపాతకంబని తెలుపుదురు. రాజా! వారలెల్లపుడు నిన్నును ధనంజయుని స్మరించుచునేయుందురు. ఎప్పుడైన దుందుభిశంఖశబ్దంబు లాకర్ణించిరేని భీమసేనుగదావిహారంబు లప్పుడే స్మరింతురు. రణాంగణంబుల సర్వదిక్కుల నాక్రమించు మాద్రీపుత్రులను స్మరింతురు. కపలవారు శరవర్షంబున శత్రుసేనల ముంచుచు యుద్ధములందు దుష్ప్రకంపులని వారిని వేనోళ్లఁ బొగడుచుందురు. మహారాజా! యేపురుషునకును ననాగతంబును భవిష్యం

బును దెలియఁ గాదా? చూడుము. సర్వధర్మోపపన్నుండవు. సత్యనిర తుండవునగు నీవిట్టికష్టంబు లనుభవింపవలసివచ్చెనో? అజాతశత్రుండ వగు నీవ యీయుకార్యంబులనెల్ల పక్షపాతముచేయఁగల సమర్థుండవు. నీ ప్రజకు వశముకాని దేదియు నుండదు. ఇంద్రసమానులగు పాండునంద నులు కామాభిలాషకు వశులై ధర్మంబును విడనాడరుగదా ? యని లోకము విశ్వసించియున్నది. ధర్మనందనా! యజ్ఞానులగు కౌరవులకు సుఖంబుగల్గునట్లు నీవ దీనినెల్ల సమీకరింపుము. నీ ప్రజ్ఞావిశేషంబున ధర్మాభిరతిని ధార్తరాష్ట్రులకుఁ బాండవులకు సృంజయులకును నింక నితరంబగు రాజలోకంబునకును శుభంబు ప్రాప్తించును. మీతండ్రియగు ధృతరాష్ట్రుండు రాత్రి నీతో నాడుమని చెప్పినవచనంబును మంత్రులు పుత్రులు గలసియుండ నాకర్ణింపఁగోరెద నని పలికెను.

ఆవచనంబు లాకర్ణించి ధర్మతనయుండు మేమే పాండవులమెల్ల ర మిచ్చటనున్నవారము. వీరే సృంజయులు. జనార్దనుండు యుయుధా నుండు విరాటుండును వీరె. గవల్గణనందనా! యంబికానందనుండు మాతో నాడుమనిచెప్పిన వాక్యంబులెల్ల నిశ్శంకంబుగ వచింపుము. ఇక్కడనున్న వారలెల్ల నాస్వజనంబకాని పెరవారెవ్వరును లేరని పలుక సంజయుండు ధర్మనందనుని వృకోదరుని ధనంజయుని మాద్రీనందను లను వాసుదేవుని యుయుధానునిఁ జేకితానుని విరాటుని వృద్ధుండగు పాంచాలమహీవల్లభుని యజ్ఞసేననందనుండగు ధృష్టద్యుమ్నుని వేర్వేఱ నామంత్రణంబుగావించి ముకుళితకరయుగళుండై యిట్లనియె. రాజ పుంగవులారా! నేను కౌరవులకు భూతికాముండనై పలుకువచనంబు లెల్ల మీరు దయార్ద్రచిత్తులై యాకర్ణింతురుగాక. ధృతరాష్ట్రుండు శాంతి నాకాంక్షించుచున్నవాఁడై మీపాలికి రానున్న నాకుఁ దాన యరదంబు సిద్ధంబు గావించెను. భ్రాతృపుత్రులను స్వజనముగానే తలంచు నాధృతరాష్ట్రునియభీష్టంబు పాండవు లనుమతింతురుగాక. పాండవు లెల్లవిధముల శాంతచిత్తులుగావలయునని ప్రార్థించుచున్నాఁడు. పాండవులు సంస్థానంబునను మృదుత్వంబునను ఋజుత్వంబునను సర్వ ధర్మోపపన్నులై యున్నవారు. మహోన్నతవంశంబున జనించినవారు. ఆనృశంసస్వభావులు, వదాన్యులు, హ్రీనిషేవణులు, సకలకర్మనిశ్చయం బులు జక్కనెఱింగినవారునని జనులెల్లరు నెల్లవేళల మిమ్ముఁ బ్రస్తుతిం

కుసు. అట్టి మీయందు హీనంబగుకర్మంబు చూపట్టు టెంతయు నయు
క్తంబు. శీలసదాచారములగు యీసత్త్వ మనన్యాదృశమైనది. మీయెడ
నొక్కకల్మిషంబు వొడమెనేని, శుభ్రవస్త్రంబున మసిబొట్టువలె నది
సర్వజనప్రకటంబగును. జయపరాజయంబులు నిర్ణయింప నలవికానికల
హంబునకుం బ్రాజ్ఞుం డెవ్వం డంగీకరించును? ఎవర్వు జ్ఞాతులకార్యం
బులు శ్రద్ధాసులై యాచరింతురో యట్టివారే ధన్యులు. కౌరవు
లకై పుత్రులు మిత్రులు బంధువులు నెల్లరు బ్రాణంబులనైన వీడి
వారికై వైభవంబు గూర్ప నిశ్చయించియున్నారు. కౌరవుల ననుశాసించి
శాత్రవుల నిర్జించి రాజ్యంబు సంపాదించుట యోగ్యముగాదు. జ్ఞాతి
వధ నాచరించి జీవించుట మృత్యువునకు సమానమైనది. కేశవుండు
చేకితానుండు పార్షతుండు సాత్యకియు నుండంగా మీతోడికయ్యం
బున కెవ్వం డియ్యకొనంగలండు? దేవతలెల్లం దోడయివచ్చిన దేవేంద్రుం
డయినను మిమ్ము జయింప సమర్థుండు గాండన నన్యుల నననేల? ద్రోణ
భీష్ములు రక్షింప నశ్వత్థామ శల్యకృపాదులతోం బలసియున్న కౌరవుల
నెవ్వ రోర్వంగలరు? సకలభూపాలురును రాధేయుండును మోహరించి
నిలువ వారికెదురై యెవరు నిలువంగలరు? ధార్తరాష్ట్రుని మహాబలం
బును బరిమార్ప నెంతవానికిని దరంబుగాదు. రాజా! మీరెండుపక్షం
బులలో నెవరు జయించినను నెవరు పరాజితులైనను సుఖంబు లేదనియే
నాతలంపు. దుష్కులంబులం బొడమిన నీచులవలె నుత్తమకులసంజాతు
లగుపాండవులు ధర్మార్థంబులకుం గొఱంగాని నీచకర్మం బెట్లాచరిం
తురు? నేనిదె ప్రణతుండనై వాసుదేవుని ప్రసాదం బభ్యర్థించుచున్న
వాండను, వృద్ధుండగు ద్రుపదున కివె వందనశతంబులు. కృతాంజలినై
మిమ్మెల్లరను శరణము యాచించుచున్నాండను. మీరెల్లరును గురు
సృంజయులకు శుభం బగురీతిని బాండవులను శాంతినొందింపవలయునని
ప్రార్థించుచున్నాండను. వాసుదేవుండుగాని ధనంజయుండుగాని నా
వాక్యంబు నన్యథాకరింపరని దృఢముగ నమ్ముచున్నాండను. యాచించు
వారికిం బ్రాణంబులైన లేదనక యిచ్చు ధర్మనందనునకు నా ప్రార్థనము
సఫలపఱుచుటన నొకగొప్పపని కాదు. ఆవిషయం బెఱింగినవాండనోటం
గార్యసాధనం బాశించి నేను వచించితిని. నావచనంబులు భీష్మునకు
నాంబికేయునకు నభిమతంబులు. మీరలుగూడ మీబుద్ధులగురీతి

సత్తముశాంతి చేకూఱునట్లు ప్రయత్నింప వేడుచున్నానని పలికి సంజ యుండు ధర్మనందనుదెస విలోకించుచుఁ దూష్ణీంభావమున నుండెను.

ధర్మరాజు రాజ్యమిచ్చిన శాంతికలుగునని వచించుట

సంజయుం డిట్లు పలికినవచనంబు లాలించి ధర్మనందనుండు మరల నిట్లు పలికె. సంజయా! యుద్ధము యుద్ధమని నీ వంతగాఁ బలవించుచు భయపడుచున్నావుకదా? నామాటలలో యుద్ధము నభిలషించుపద మొక్కటియైన నీకు వినఁబడెనా? తండ్రీ! యుద్ధముకంటె నయుద్ధంబు వేయిమడుంగు లధికశ్రేయమైనది. అయుద్ధంబు నొందియు నెవఁడు యుద్ధంబునకు సన్నద్ధుండగును? ఏకర్మంబు లాచరింపకున్నను బురుషు నకు మనస్సంకల్పితార్థంబులు సిద్ధించునో యట్టికర్మంబు లెప్పుడు నాచ రింపరాదని నేను బాగుగ నెఱుంగుదును. కావుననే యుద్ధంబుకంటె బహులఘుతరంబులగు నుపాయంబులే నే నెల్లపుడు నరయుచుందును. నరుం డెవ్వాఁడు నెప్పుడును యుద్ధము నభిలషింపఁడు. దేవతలచే శపింప బడినవాఁడుమాత్రమే యుద్ధంబు వరించును. పార్థు లెల్లపుడును సుఖాభి లాషులై ధర్మోపపన్నంబును లోకమునకు బథ్యంబు నగుకర్మంబె సమా చరింతురు. వారు సుఖంబు నభిలషించువారై ధర్మోదయ మగుకర్మం బాచరింతురు. ఎవ్వఁడు ఇంద్రియములకు వశుండై వానిప్రీతినే ప్రధాన ముగా నెంచునో సుఖమును బొందుటకును దుఃఖమును బోఁగొట్టు కొనుటకు నూహించునో యట్టివాఁడు కృచ్ఛ్రోపాయంబును తత్త్వ మున దుఃఖాత్మకము నగుకర్మం బాచరించును. పురుషుండు కామాభి వృద్ధిచేఁ దనశరీరమును క్లేశపఱుచుకొనుచున్నాఁడు. కామాభివృద్ధి విడిచినచో నెవ్వఁడును దుఃఖావహమగుకర్మ గావింపఁబోఁడు. బాగుగా జ్వలించుచున్నయగ్నియందుఁ గట్టెలువేసిన మఱియు నధికముగా నెట్లు మండునో యట్లే కామార్థసంపన్నునకు భోగంబులవలన నాశ యధిక మగునేకాని చల్లాఱదు. నేయిపోసిన నగ్ని చల్లాఱునుకదా? అట్లే కామానుభవమున నెన్నఁడును దృప్తి జనింపదు. ధృతరాష్ట్రుండు మాతోడంగూడియ భోగచయంబు లనుభవించుట లెస్సయని నీవెఱుం గుము. శ్రేయోవంతుఁడు కాఁడేని విగ్రహంబునకుసమర్థుండుగానేఱఁడు. శ్రేయోవంతుఁడు కాఁడేని గీతవాదిత్రాదిమంగళధ్వను లాలింపఁజాలఁడు.

శ్రేయోవంతుఁడు కాకున్న మాల్యగంధముల నాఘ్రాణింపఁదగఁడు. శ్రేయోవంతుఁడు కాఁడేని లేపనంబుల ననుభవింప నర్హుండై యుండఁడు. శ్రేయోవంతుఁడు కానిచో విలువగలవసనంబులధరింపఁజాలఁడు ఆ హేతువు వలన నేనెట్లు కౌరవుల యెడ కోపింపఁగలను? అజ్ఞానులకు నీవిషయంబు నన కామము వృద్ధిపొంది శరీరమును హృదయమును దపింపఁజేయుచుండును. రాజుస్వాయముగ విషమబుద్ధులగునితరులందుఁ బెద్దతనముంచి తన సామర్థ్యముననుఁ బొంగుచుండును. అట్లుపొంగు టెంతమాత్రమునుచిత కార్యముగాదు. ఆతండు సంతతము తనసౌఖ్యమును వృత్తంబు నెట్టు లాశించునో యట్లే పరులసుఖవృత్తంబులఁగూడ నాలోచించుట లెస్స. నిదాఘుకాలంబున గంభీరకక్షంబగు గహనంబున నగ్నినిడి రగుల్కొలిపి యది వాయువశంబునఁ బ్రజ్వలించినచోఁ దమక్షేమమునకు భంగమని శోకించువాఁడు మూఢుండు కాకపోవునా? దుర్బుద్ధి యనార్జవుఁడు మందుఁడు దుర్మంత్రిపరివృతుండు నగుసుయోధను నాలంబించియు ధృతరాష్ట్రుండు రాజ్యభోగలాభంబున కెట్లు సంతసించునో? మిక్కిలి యాప్తుండును హితుండునగు విదురునివచనంబు లమిత్రవచనంబులవలె విడిచి సుయోధనుం డకార్యముగావించినాఁడు. ధృతరాష్ట్రుండును సుతప్రియాభిలాషియై యెన్నిభంగులవారించినను వినక యధర్మమార్గం బునన చరించుచున్నవాఁడు. సంతతము కౌరవులయర్థసిద్ధికై ప్రయత్నించువాఁడును, మహామేధావియు, బహుశ్రుతుండు, శీలవంతుండు నగువిదురునిఁ బుత్రమోహపరవశుండగు నాంబికేయుండు తలంపనైనఁ దలంపలేదు. మానహంతయు, మానకాముండును, ఈర్ష్యాళువు, సంరంభవంతుండు, అర్థధర్మాతిక్రమణశీలుండు, దుర్భాషణుండు, మన్యువశానుగమనుండు, కామాత్మకుండు, దుర్హృదయసంభావితుండు, ఆనేయుండు, నశ్రేయస్కుండు, దీర్ఘక్రోధుండు, మిత్రద్రోహి, పాపబుద్ధియు నగుతనయునిప్రియం బాకాంక్షించుచు వానిప్రియంబె యనుసరించుచు ధృతరాష్ట్రుండు నిక్కంబుగ నర్థకామంబులఁ బోనాడినాఁడు.

సంజయా! నాఁడు ద్యూతక్రీడాసమయంబున విదురుండు వచించినయుత్తమబోధనంబును ధృతరాష్ట్రుం డనుసరింపకుండుటచే, నప్పుడ కౌరవులకు వినాశ మాసన్నమయియున్నదని నాకు నిశ్చయంబు జనించి

నది. కౌరవు లెప్పుడు విదురునిబుద్ధి ననుసరింపక తిరస్కరించిరో, యప్పుడే కౌరవులకు దుఃఖము సంప్రాప్త మయియున్నది. వార లెంత కాలము విదురుని ప్రజ్ఞ నాదరించి యనుచరించిరో యంత కాలము వారి రాజ్యము వృద్ధినొందినది. సంజయా! విదురునిమాట యెప్పుడు తిరస్కరించిరో, నాటంగోలె వారిరాజ్యము క్షయాభిముఖమై యున్నదని నమ్ముము. మఱొక్కసంగతి నాలింపుము. అర్థలుబ్ధుండగు దుర్యోధనునకు దుశ్శాసనుండును శకునియు సూతనందనుండును మంత్రులంట! గావల్గణీ, చూచితివా! వానిసమ్మోహము? నే నెన్నిభంగుల నాలోచించినను గౌరవులకు సృంజయులకును మంగళంబు చేయుమార్గంబు గానఁ జాలకున్నాఁడను. పరులవలన మహైశ్వర్యంబు పొందినను దీర్ఘదృష్టికల విదురుని నిరసించియు సపుత్త్రుండగు ధృతరాష్ట్రుఁ డీమహారాజ్యమెల్ల నకంటకంబుగఁ బాలింపఁ దలంపుగొన్నవాఁడుగా! ఎంత సాహసము! ఆయాంబికేయునియెడ శమమనునది లేశమైన నగపడదు. అర్థజాతంబెల్ల నాయది నాయధీనమైనది యనియే తలంచుచుండును. ఇట్లు లాతఁ డాలోచించుటకు; యుద్ధమునం దర్జును నశ్రమంబున నోడింతునని కర్ణుండు తలంచుచుండుటయు, నిక్కంబుగఁ గర్ణుం డర్జును గెల్వఁజాలునని రాజు తలంచుటయును గారణంబులై యున్నవి. మున్ననేకంబులగు సంగరంబులు ప్రవర్తిల్లియుండెఁగదా? కర్ణుం డాయుద్ధంబులందు వీరల రక్షింపఁజాలకపోయెనేల? కర్ణుండు సుయోధనుండు ద్రోణుండు శాంతనవుండు నింకను దక్కుంగలకౌరవులెల్లరు నసంశయంబుగ నర్జునునకు సరియగుధనుర్ధరుండు వేఱొక్కరుండు లేఁడని యెఱుంగుదురు. అరిందముం డగుఫాల్గునుం డుండ దుర్యోధనున కీరాజ్యం బెట్లు లభించెనో కౌరవులెల్లరును నింకను భూమియందుఁగలరాజులెల్లరు నెఱుంగుదురు. అనాత్మజ్ఞుం డగుటంజేసి పాపుం డగుసుయోధనుండు పాండవుల మమత్వము నెడలింప శక్యంబగునని తలంచుచున్నవాఁడు. సమరపండితుండగు సంక్రందనసూతి తాళప్రమాణంబగు గాండీవంబు కేలం దాల్చి పాలికలను సొచ్చి కావించుజ్యాటంకారంబు నాలకించునంత వఱకుమాత్రము కౌరవులు జీవంబుల ధరించియుందురు. ఈసంగతి నెఱుంగక దుర్యోధనుండు మామమత్వము బోఁగొట్ట శక్యమగునని యూహించుచున్నాఁడు. క్రోధవిస్ఫారితనయనుండగు భీమసేను నాలో

కంపఁజేసి సుయోధనుం డర్థము సిద్ధమయినదని తలంచుచుఁడు. భీమసేనుండు
జీవించియుండ నింద్రుండైనను మాయైశ్వర్యంబు నపహరింప నుత్సహిం
పఁడు. అట్లె ధనంజయుండును వీరుం డగునకులుండును సహాయుం డగు సహ
దేవుండుగాని జీవంబులతో నున్నంతకాలము పురందరుండైనను మా
యైశ్వర్యంబువంకఁ గన్నెత్తిచూడనోపఁడు. ఈ యుద్ధం బా వృద్ధరాజా
నాతనితనూజుండు నెఱిఁగియుండఁడేని ధార్తరాష్ట్రులు పాండవకోపాన
లంబున కాహుతులై నశింపకుండరు. సంజయా! మే మనుభవించిన
క్లేశంబు లెట్టివో నీ వెఱుంగనిది గాదుగదా? అయినను శాంతికాముం
డనై నీవు పలికినందున నిన్ను గౌరవించి యాయపరాధంబులన్నియు
మఱచెదను. తొల్లి కౌరవులు మ మ్మెట్లు గౌరవించిరో మేము ధార్త
రాష్ట్రునం బెట్టినవ్యాసనంబున నుండెడివారమో యట్టిస్థితియే యిప్పుడును
బూర్వమువలెనే జరుగుఁగాక. నీవుచెప్పినట్లు నేను వప్పక శాంతించెదను.
నాకింద్రప్రస్థంబునందు మాత్ర మా రాజ్యముండనిమ్ము. సుయోధనుండే
భారతులకెల్ల నగ్ర్యుం డగుఁగాక.

అని యిట్లు ధర్మతనయుండు వచింప సంజయుండు మరల నిట్లు
నియె. పాండవాగ్రణీ! నీచేయుకార్యంబులెల్ల ధర్మనిత్యంబు లసి విను
చుండుటకాక ప్రత్యక్షంబుగఁగూడఁ గనుచున్నారము. జీవితంబు
మహాప్రవాహంబుభోలె దుర్నిరోధం బగునదియు ననిత్యమయినదనియు
నీ వెఱింగినదికదా? అట్టి నీవు తుచ్ఛసుఖంబు లనుభవింపఁగోరి శాశ్వ
తం బగు యశంబునకు హానిగల్పించికొందువా? కౌరవులు యుద్ధంబు
సేయక నీరాజ్యభాగమ్ము నీ కీనిరు. అంధకవృష్ణిరాజ్యంబులందు భిక్షా
చారివై జీవయాత్ర కడపుట యుత్తమముగాని, యుద్ధమ్మొనరించి యీ
పృథివీరాజ్యమెల్ల స్వాయత్తంబుగావించికొన్నను మంచిది కాదు. మను
ష్యునిజీవిత మల్ప మయినది; మహాభిద్రభూయిష్ఠమైనది; నిత్యదుఃఖ
భాజనము; చంచలము నని తెలిసియు పాపకార్యం బగు యుద్ధ మాచ
రించి నిర్మలం బగుకీర్తిని విడనాడకుము. కామంబులు మనుజులందు
లగ్నంబులై ధర్మాచరణంబున కెల్లపుడును విఘ్నంబు లాచరించుచుం
డును గావున మనుజుండు తొలుతఁ గామంబులను జయించి లోకంబున
ననవద్యం బగు కీర్తిఁగొందును. పార్థాగ్రణీ! యర్థంబులందలి తృష్ణనిబంధ
నముగలదికదా? అట్టి యర్థతృష్ణగలవారలధర్మంబునకు బాధ యొప్పు

డును సిద్ధమయియే యుండును. ఎవఁడు ధర్మంబునే ప్రధానంబుగాఁ దలంచునో వాఁ డుత్తమబోధంబున విరాజిల్లును. కామమం దత్యాశ కలవాఁ డర్థానురోధంబున హానిఁబొందును. ఎల్లకర్మంబులందు నుత్తమ మగుధర్మంబు సమాచరించిన పురుషశ్రేష్ఠుఁడు మహోగ్రతాపవంతుఁ డగు ప్రభాకరునిం బోలె వెలుంగుచుండును. ధర్మహీనుం డగుపాపాత్ముండు మహీమండలంబునెల్ల స్వాయత్తంబు గావించుకొనియుఁ దుఃఖములపాలై చెడును. నీవు వేదంబులెల్లఁ జదివితివి. బ్రహ్మచర్యంబు శాస్త్రచోదితం బగురీతి నాచరించితివి. అసంఖ్యాకంబు లగుయజ్ఞంబులు గావించితివి. బ్రాహ్మణు లడిగినదెల్ల లేదనక యిచ్చితివి. మఱియు ననేకవర్షంబు లీప్సితభోగంబు లనుభవించితివి. అతివేలంబులుగ సుఖప్రియంబు లనుభవించుచుఁ దదాసక్తుండై యెవ్వఁడు యోగాభ్యాసంబునకై ప్రయత్నింపఁడో వాఁడు విత్తంబులెల్ల నశించినపిదప సుఖహీనుండై కామవేగాభిహతుండై దుఃఖభాజనంబగును. ఈరీతిని బ్రహ్మచర్యం బొనరించియు ధర్మంబువిడచి యధర్మంబు నెవ్వఁ డాచరించునో యాపాంసుఁడు పరలోకసుఖములందు నమ్మకములేనివాఁడై దేహాంతమున మిగుల యాతన లనుభవించును. పుణ్యకర్మంబులుగాని పాపకర్మంబులుగాని యీ లోకంబుననే నశింపవు. కర్తకంటె ముందుగానే పుణ్యపాపంబులు పరలోకంబున కరుగును. వానివెనుక నాకర్మ లాచరించనవాఁ డరిగి హాని ఫలంబు లనుభవించును. న్యాయార్జితంబును, శ్రద్ధచేఁ బవిత్రంబును, దివ్యమయినవాసనయు రుచియుఁ గలదియు, ఉత్తమంబులగుదక్షిణలుగల అన్వాహార్యంబు లనఁబడుయాగములందలి బ్రాహ్మణాన్నంబులవలె నీ కర్మంబు లన్నియుఁ బ్రఖ్యాతంబులై యున్నవి. ధర్మనందనా! ఈజన్మమందకదా యేకార్యంబైన నాచరింపవలయును? దేహావసానంబునఁ జేయంగలకర్మ మిసుమంతయు లేనే లేదుకదా? నీవు పరలోకంబులందనుభవింపం దగు మహాపుణ్య కార్యంబు లాచరించితివి. నీచేసిన కార్యంబులు సజ్జనులెల్లరును బ్రశంసించుచుందురు. పరలోకంబున మృత్యువును ముదిమిని భయమును క్షుత్పిపాసలును మనంబున కప్రియంబులైనవానినెల్ల విడిచెదరు. ఆచోట నింద్రియములకుఁ బ్రీతిగల్గించుటకంటె వేఱు కార్యం బేదియు లేదు. రాజా! కర్మఫల మిట్టిది హృదయప్రీతిచే మాత్రాధీనమైనది. పాండవాగ్రణీ! నీవు క్రోధజంబును హర్షజంబు నగు లోక

ద్వయంబును జిరకాలము విడనాడకుము. నీవు కర్మంబులయంతంబు
చూచినవాఁడవు. వాని నిపుడు మరల విడువకుము. సత్యంబు దమంబు
నార్జవంబు నహింసయు నిత్యవ్రతంబులుగా నశ్వమేధంబు రాజసూ
యంబు ననుయాగంబులను గావించి పుణ్యకర్మంబులయంతంబు చూచిన
నీవు నిపుడు మరలఁ బాపకర్మము నంతంబుచూడ నభిలషింపకుము.
వారలు ద్వేషరూపంబునఁ బాపకర్మంబుల యాచరింపందలంచితిరేని
వర్షసహస్రంబులయినను వనంబుల వసించుటయ లెస్స. వనవాసంబు
లందు దుఃఖంబు లనుభవింపవలసియున్నను నావనవాసము ధర్మమై
నదెను. తొల్లి నీయధీనమైయున్న బలంబెల్ల విడచి ప్రవ్రజ్య నంగీకరించి
తివి. నీమంత్రిసత్తములగు జనార్దనుండును, యుయుధానుండును, విరాటుండును
వానితనయులు, రుక్మరథుండు వానితనయులు మొదలగు రాజులెల్లరు
పూర్వముగూడ నిన్నే యాశ్రయించి నీకు సహాయులై యుండిరి. అట్టి
మహాబలంబులు బలసిరా బలమధ్యంబునఁ బ్రతాపంబు మెఱయ వాసు
దేవార్జునులఁ బురస్కరించికొని పేరెన్నిక గన్న శాత్రవులనెల్లఁ దునిమి
సంగరాంగణమ్మున ధార్తరాష్ట్రునిదర్పంబును మున్న యణఁచియుండ
వలసినది. అట్లు కావింపక పరునిబలంబు బెంపొందించి నిజసహాయుల
నెల్లఁ బలుకష్టములచేఁ గృశింపఁజేసి పెక్కువర్షంబు లడవుల నిడుమలం
గుడిచి హీనంబగు కాలంబునందు యుద్ధంబునకు సిద్ధమయ్యెద వేల? అప్రా
జ్ఞుండు నధార్మికుండును యుద్ధంబులందు విజయంబొందుటయుఁ బ్రజ్ఞా
వంతుండును బోధశాలియు మహాధార్మికుండును బరాజయంబొందు
టయుఁగూడ నొకప్పుడు గలుగుచుండును. ఎప్పుడును ధర్మమే జయించు
నను నిశ్చయము లేదుగదా? పృథానందనా! నీబుద్ధి యొకప్పుడు నధ
ర్మంబుపొంతఁ బోదు. నీవెప్పుడును తొందరపాటుననేని బాపకార్యం
బాచరించి యెఱుంగవు. అట్లయ్యు నిప్పుడు ప్రజ్ఞావిరుద్ధం బగుకర్మ మాచ
రింపనేల సమకట్టెదవు? వ్యాధిలేకుండనే పుట్టినదియు, కటువయినదియు,
శిరోవేదనంబు గల్గించునదియు, యశంబు నపహరించునదియుఁ, బాపఫల
ములఁ గలిగించునదియు నగుమన్యువును సజ్జనులెల్లరును మ్రింగివేయు
దురుగాని బయలఁ బ్రకటింపరు. కాపురుషులామన్యువును బ్రాపఁజాలరు.
సజ్జనాగ్రణి వగు నీవామన్యువును దిగమ్రింగి శాంతనొందుము. పాపం
బులతో ననుబంధించియున్న యామన్యువు నెవ్వఁ డభిలషించును? నీ

కెల్లవిధముల క్షాంతియే యాదరణీయము. భోగంబులు వాంఛింపఁదగి నవిగావు. భోగంబుల కాసపడియెదవేని శాంతనవుం డగు భీష్ముండును, సపుత్రుం డగు ద్రోణాచార్యుండును, కృపుండు, శల్యుండు, సోమదత్తి, వికర్ణుఁడు, వివింశతి, కర్ణుండు, దుర్యోధనుండు మొదలగువారలనెల్లఁ జంపినఁగాని నీకు భోగంబులు లభింపవు. గురువులను హితులను బంధుఁవులను జంపి నీవెట్టిసుఖంబు లనుభవింపఁగలవో చెప్పుము. ససాగరపర్యంతం బగు భూమండలము నాత్మాయత్తంబు గావించికొనియు, నీవు జరామృత్యువులఁ బాయఁద్రోలఁగలుగుదువా? లేక ప్రియాప్రియంబులను సుఖదుఃఖంబులనైన విడిచియుండఁగలవా? ఈయుద్ధంబు చక్కఁగ నెఱింగి మహారాజా! యెల్లవిధముల శాంతింపుము. యుద్ధంబునఁ బుద్ధి జొన్పకుము. ఒకవేళ నీమంత్రులప్రోత్సాహమున నీవు యుద్ధమాచరింపఁ దలంచితేనియు, వారియుపక్రమంబునకు నీయాత్మను బలిగా నొసంగి దేవలోకమున కరుగుమార్గమునుండి తొలఁగిపోయెదవు.

అని సంజయుండు వచించినవాక్యంబు లాలించి కుంతీసుతాగ్రజుండు వానితో నిట్లనియె. సంజయా! నీవు పలికినతెఱంగున నెల్లకర్మంబులకును ధర్మమే యుత్తమ మైనదగును. నే నాచరించునది ధర్మమో యధర్మమో ముందుగా నీవు బాగుగా నాలోచించి నిశ్చయించికొని పిదప నన్ను నిందింపుము. ఒకప్పుడు ధర్మం బధర్మరూపంబునను, నధర్మంబు ధర్మరూపంబునను నగపడుచుండును. విషమంబు లగు నీధర్మాధర్మంబులను విద్వాంసులు బుద్ధిబలంబునఁ దెలిసికొనఁగల్గుదురు. పురుషుండు ధర్మాధర్మంబులు రెంటి నొకప్పుడు నిత్యవృత్తులుగా స్వీకరింపందగును. ఆపత్సమయంబున నధర్మస్వీకారంబు ధర్మంబే యైయుండును. దాని నాపద్ధర్మ మందురు. జీవనోపాయంబులు లోపించినవాఁడు స్వవిహితకర్మమె ట్లాచరింపఁగలఁడు. కావున వాని కన్యధర్మాచరణంబ ధర్మంబై యొప్పును. ప్రకృతియందుండియు స్వధర్మ మాచరింపనివాఁడును నాపదలకుం జిక్కియు నాచరింపరాని స్వధర్మమునే యపేక్షించుచుఁ గర్మహానిగావించువాఁడు నిరువురును గర్హ్యులగుదురు. అన్యధర్మంబు లాచరించియును నాపదల నుత్తరించినతరువాత బ్రాహ్మణధర్మంబు నశింపకుండుటకై బ్రాహ్మణులు ప్రాయశ్చిత్తంబు గావించికొనవలయు నని విధినిర్దేశము గలదుగదా? ఆనిర్దేశమువలన నెల్లరకును నొకప్పుడు

ధర్మాధర్మంబులు వ్యత్యాసంబున నాచరింపఁబడుచుండు నని తెలియు
చునే యున్నది. కావున నాపదలు లేనియెడ స్వకర్మరతులనుగాను
నాపదలందు నన్యధర్మాచరణులనుగాను దెలియవలయును. ఆపదలున్న
యెడ స్వకర్మాభిలాషచే నాత్మహింసగావించుకొనువారును, ననాపత్సమ
యంబున నాత్మధర్మంబులు విడచువారును నింద్యు లగుదురు. మనో
నిగ్రహంబు నభిలషించుపురుషులను సజ్జనులయిండ్లకడనుండి జీవయాత్ర
కడపుట యెల్లప్పుడును విహితమైనది. కావున బ్రాహ్మణవృత్తినాలంబించి
భిక్షాచరణంబునజీవయాత్ర సాగించు టెవ్వరికి నింద్యముగాదు.ఎవరుబ్రాహ్మ
ణులుకాకున్నను విద్యానిష్ఠులు కాకుందురో వారెల్లరును స్వస్వధర్మంబు
లన యాచరింపందగునుగాని బ్రాహ్మణధర్మం బగు భిక్ష నాచరింప రాదు.
పూర్వు లగుపితరులు పితామహులు వారికంటెను బూర్వు లగుప్రపి
తామహులునుగూడ యజ్ఞంబు లాచరించుటకై నేను జెప్పినరీతిని
ధర్మంబు లాచరించి చనిరి. నేనును ఆస్తికుండ నగుటంజేసి వారు చన్న
మార్గంబ యనుగమింతునుగాని యితరమార్గంబు లనుసరింప నొల్లను.
సంజయా! యీపృథివియందుఁ గలవిత్త మేదైనగానీ, దేవలోకంబున
దేవతలకెల్లను బరమం బగుధనముగానీ, నింకను బ్రజాపతి లోకంబు
గానీ, బ్రహ్మలోకంబుగానీ, స్వర్గలోకంబుగానీ యధర్మాచరణంబున
లభించుదానిని నే నొల్లను. ఎల్లధర్మంబులకు నధీశ్వరుండును దక్షుండు
సకలనీతిపారంగతుండు బ్రాహ్మణోపాసకుండు విద్వాంసుండు నగు కృష్ణుం
డు నానావిధంబు లగు రాజులమహాబలంబులెల్లం జక్కఁగ నెఱింగి
మమ్ముల ననుశాసించును. నేను సామంబు విడనాడితినేని గర్హ్యుండ
నగుదును. స్వధర్మంబు వీడి యుద్ధం బొనరించినను నింద్యుండ నగుదును.
మహాయశుం డగు కేశవుండు మంచిచెడ్డలు నిర్ణయించి చెప్ప నర్హుండు.
వాసుదేవుండు కౌరవులకు మాకు నొక్కరూపమై యిరువురకును
సమానంబుగ నర్థకాముండై యున్నవాఁడు. ఈసాత్యకి, యీచేది
భూపాలకులు, నీవార్ష్ణేయులు, భోజులు, కుకురులు, సృంజయులు నెల్ల
వారును వాసుదేవునిబుద్ధి ననుసరించి శాత్రవులం బరిమార్చి మిత్రుల
కానందముఁ గూర్చుచున్నవారు. ఉగ్రసేనాదు లగు వృష్ణ్యంధకవీరులెల్ల
రును కృష్ణునివచనంబు ననుసరించినవారై యింద్రభోగంబులంబోని

భోగంబు లనుభవించుచున్నారు. మనస్వులు, సత్యపరాయణులు, మహా
బలవంతులు నగుయాదవులు, కృష్ణు ననుసరించి సకలసుఖంబు లనుభ
వించుచున్నారు. కాశ్యుం డగు బభ్రుం డగ్రజుం డగువాసుదేవు నను
మతిని జీవించుచు సుత్తమసంపదలొంది విరాజిల్లుచున్నవాఁడు. ఈ
కృష్ణుండు తన్ను నమ్మినవారలకెల్ల కామంబులను గ్రీష్మాత్యయంబునఁ
బర్జన్యుండునుంబోలె వర్షించుచుండును. తండ్రీ! కేశవుం డిట్టిమహాత్మ్య
సంపన్నుండు. ఈతం డెల్లకర్మంబుల నిశ్చయం బెఱింగినవాఁడని యెఱుం
గుము. మాకుఁ బ్రియుండు సాధుతముండు నగు వాసుదేవునానతి
నే నెన్నఁడు నతిక్రమింపంజాలను.

**కృష్ణుండు సంజయునితో భాషించుట**

ధర్మనందనుం డట్లు వచింప విని వాసుదేవుండు సంజయున కిట్ల
నియె. సంజయా! నే నెల్లప్పుడును పాండవులు నశింపకుండుటకై యభిల
షించుచుందును. వీరలకు సంపదలను, బ్రియంబును గోరుచుందును.
అట్లే బహుపుత్రుం డగు నాంబికేయునకు వృద్ధి నాశంసించుచుందును.
ఎల్లప్పుడును నామనంబునందలి కామం బిదియ నే నెల్లప్పుడును శాంతిని
దక్క నితరం బెదియుఁ బలుకను. ఈపాండవు లందఱకడనుగూడ నా
రాజునకు హితం బగుశాంతినే యాచించుచుందును. ధర్మనందనుండు
కౌరవులయెడ శాంతి సుపుష్కరంబని ప్రకటించెను అత్యాశాపరుం డగు
ధృతరాష్ట్రుండు కొడుకుననుసరించియుండ వారలకుఁ గలహంబుగాక
శాంతి యెట్లు రుచించును? సంజయా! నావలన ధర్మంబు లుప్తమయినట్లు
నీ కగపడ లేదుకదా? ఉత్సాహవంతుఁడై స్వధర్మము నాచరింప సమ
కట్టిన యుధిష్ఠిరునందుఁగూడ ధర్మలోప మగపడ లేదుగదా? పూర్వులు
చన్న ప్రసిద్ధంబగు ధర్మమార్గంబునఁ గుటుంబము నడపుచున్న ధర్మతనయు
నందు నీ వెట్లు ధర్మవిలోప మారోపింతువు? విధివిధానం బనుసరించి
ప్రవర్తించుటానికిబ్రాహ్మణులవాక్యంబులే యుచ్చావచనంబులై యున్నవి
కదా? కొందఱు కర్మంబునన సిద్ధిగల్గునందురు. మఱికొందఱు కర్మవీడి
విద్యచేఁ బారలౌకికసిద్ధి గల్గునందురు. ఎవ్వఁడును భక్ష్యభోజ్యంబుల
ననుభవింపకయ యాఁకలిదీర్చికొనఁజాలఁడుగదా? విద్వాంసుండైనను
బ్రాహ్మణవిహితంబు లాచరించియే తీఱవలయును. ఏవిద్యలు కర్మంబును
సాధించునో వానికి మాత్రమే ఫలము గలదు. ఇతరంబుల కెందును

ఫలంబు లేదు. కర్మంబు పరలోకంబున నీలోకంబుననుగూడ దృష్టఫలమే కదా? దప్పిగొనయెడ జలపానంబున నాత్మతృష్ణ శాంతించును. సంజయా! యీవిధియెల్లఁ గర్మంబుచేతనే విహితంబై యున్నది. పరలోకంబునందును గర్మంబు ప్రవర్తించును. పరలోకవిషయమునఁ గర్మకంటె వేఱగు నొక్కటి యనిని మంచిదిగా నెవ్వఁ డూహించనో యట్టిదుర్బలునివాక్యంబులు పనికిమాలినవని నిశ్చయంబుగ నెఱుంగుము. పరలోకంబున దేవతలెల్లరుఁ గర్మపరతంత్రు లగుటవలనఁ బ్రకాశించుచున్నారు. ఈలోకంబున వాయుదేవుండు కర్మవశంబునన వీచుచున్నవాఁడు. సూర్యుండ తంద్రితుండై కర్మంబునన యహోరాత్రంబులు గల్పించుచు నిత్యంబు నుదయించుచున్నవాఁడు. మాసంబులు, పక్షంబులు, నక్షత్రంబులు, యోగంబులను గర్మవశంబుననే కల్పించుచుఁ జంద్రుండు నతంద్రితుండై యుదయించుచున్నవాఁడు. సమిధలచే మండింపఁబడునగ్నియును నతంద్రితుండై ప్రజలకొఱకుఁ గర్మంబు లాచరించుచు దహించుచున్నవాఁడు ఈభూదేవికూడ నతంద్రితురాలై కర్మబలంబున మహాభారంబు వహించుచున్నది. మహానదులును తంబ్రారవహితంబులై కర్మవశంబున నెల్లభూతఁబులకుఁ దృప్తిఁగూర్చుచు శీఘ్రంబుగఁ బ్రవహించుచున్నవి. మహాతేజస్వి యగు పర్జన్యుం డతంద్రితుండై దిక్కులు నంతరిక్షంబులు ప్రతిధ్వనులీన వర్షించుచున్నవాఁడు. బలభేదనుం డగు దేవేంద్రుండు నైతము దేవరాజ్యంబుఁ బొందఁ దలంచి బ్రహ్మచర్యం బాచరించెను. సుఖంబును మానసికములగు నెల్ల ప్రియములను వీడి కావించిన యా కర్మంబుననే దేవేంద్రుండై వెలుంగుచున్నవాఁడు. సత్యంబును, ధర్మంబును బాలించుచు నప్రమత్తుండై దమము తితిక్ష సమత్వము మొదలగువానినెల్ల సేవించుచు ముఖ్యం బగు దేవరాజ్యంబు నాతఁడు కర్మబలంబునఁగదా పొందియున్నవాఁడు. బృహస్పతియును మాహితుండై సంశితాత్ముండై సుఖంబులఁ బోనాడి యింద్రియంబులెల్ల నిగ్రహించి యథాశాస్త్రంబుగ బ్రహ్మచర్యం బాచరించుటంజేసి దేవాచార్యపదవి నొంది యెల్లదేవతలమన్ననలకును బాత్రమై యున్నవాఁడు. అట్లే నక్షత్రంబులును గర్మంబుచేతన వెలుంగుచున్నవి. రుద్రులు, ఆదిత్యులు, వసువులు, విశ్వేదేవతలు, యముండు, కుబేరుండును, గంధర్వులు, యక్షులు, నప్సరోగణంబులును కర్మంబుచేతన వెలుంగుచున్న

వారు. బ్రహ్మవిద్యను బ్రహ్మచర్యవ్రతంబు నాలంబించి బుధు లీలోకం బున విరాజిల్లుచున్నవారు. సర్వలోకంబులందును బ్రహ్మక్షత్రవైశ్యు లకు విహితంబగుచున్న యీధర్మం బెఱింగినవాఁడవయ్యుఁ గౌరవులకై యీపాండవులధర్మంబు నేల నిరోధింతువు ? ధర్మనందనునకు నిత్యంబు నామ్నాయములం దాసక్తి కలదు. అశ్వమేధంబు రాజసూయంబు ననుయాగములందు నితని కత్యాసక్తి కలదు. ధనువు ధరించుటయందుఁ గవచముదొడుగుటయందు హస్త్యశ్వాద్యారోహణంబులందు రథచర్య యందు సకలశస్త్రాస్త్రంబులందును బాండిత్య మీతనికిఁ గలదు. ఈపార్థులు కౌరవులను వధింప నక్కఱలేకయ ధర్మరక్షణక్షమంబగు నుపాయంబు తెలిసికొనఁగల్గిరేని భీమసేనుని హింసాకార్యంబువలన మరలించి పుణ్యాం బుగావించినవారగుదురు. వారలు పిత్రుపైతామహాగతం బగుకర్మంబు నాచరించుచు దైవవశంబున మృత్యువునకుఁ జిక్కిరేనియు శక్తివంచ నముగావింపకుండ స్వధర్మాచరణము గావించుటవలనఁ గలిగినయామరణ మైనను వీరలకుఁ బ్రశస్తమైనదిరే.

'శాంతిశాంతి' యని పలుమఱు బోధించునీవు శాంతినే కోరెద వేని, రాజులకు యుద్ధములందు ధర్మతంత్రముగలదో యుద్ధాభావము లందు ధర్మతంత్రముగలదో నీవే వచింపుము. నీ వేదిచెప్పిన దానిని మే మంగీకరింతుము. సంజయా ! తొలుతఁ జతుర్వర్ణంబుల సంవిభాగం బును ఆయావర్ణంబులకు విధివిహితంబు లగుకర్మంబులును బాగుగ నాలోచించి పిదపఁ బాండవు లాచరించుకర్మంబు నాలోచించియు నీ బుద్ధి కెట్లుతోఁచిన నట్లు వీరలకర్మంబును నిందించుటకాని, ప్రశంసించుట కాని కావింపుము. బ్రాహ్మణుండు వేదాధ్యయనము గావింపవలయును, యజ్ఞంబు లాచరింపవలయును. యథాశక్తిని దానం బొనరింపవలయు. తీర్థయాత్రలు గావింపవలయు. శిష్యులకు వేదంబులు గఱపఁదగును. యాజ్యులచే యాగంబులు చేయింపనగును. విహితంబు లగుదానం బులఁ బ్రతిగ్రహింపవలయును. క్షత్రియుండు వేదంబు చదువ వలయును. యజ్ఞంబులు గావింపవలయును. దానంబు లిచ్చుచుండ వలయును. అతఁ డెప్పుడు నితరుల యాచింపరాదు. మఱియు నొరులచే యాగంబులు చేయింపరాదు. ఒరులకు వేదాధ్యాప నంబు గావింపంగూడదు. ఇవి సాధారణంబుగ క్షత్రియుల కెల్లరకు

నుచితంబు లగుధర్మంబులు. అట్లే పృథివీపాలకుం డగు రాజన్యునకుఁ బృథివీరక్షణంబును, ధర్మముతప్పకుండఁ బ్రజలఁ బాలించుటయు, గొప్ప దానంబు లొనరించుటయు, యజ్ఞంబులచే వేల్పులకుఁ దృప్తిగావించుటయు, సర్వవేదంబుల నేర్చుటయు, ధర్మపత్నిని బరిగ్రహించి గృహమందు వసించుటయు సుత్తమధర్మంబులు. అట్టిధర్మంబు లాచరించు రాజన్యుండు తుదలేనిపుణ్యంబు గడించి యదృచ్ఛచే బ్రహ్మలోకంబు నొంది యానందించును. వేదాధ్యయనము, కృషిగోరక్షణవాణిజ్యంబులవలన విత్తమార్జించుట, పరాకుమాని దానిని బాలించుట, బ్రాహ్మణక్షత్రియులకుఁ బ్రియంబు లాచరించుచుండుట, ధర్మశీలుండై గృహమందు వసించుటయు వైశ్యునకు విధినిహితంబు లగు నుత్తమధర్మంబులు. శూద్రుండు బ్రాహ్మణులకుఁ బరిచర్యావందనములు గావించుచుండవలయును. ఆతండెప్పుడును యాగంబుసేయరాదు. నిత్యోచ్ఛ్రితుండై భూతికై యతంద్రితుండై యుండవలయును. ఇవి యాతని కుత్తమధర్మంబులు. ఈనాల్గు వర్ణంబులవారి నప్రమత్తుండై పాలించుచు నెల్లవారిని వారివారివిహిత ధర్మాచరణంబున నియోగించుచు, కామవర్జితుండై ప్రజలెల్లరయందు సమవృత్తిగలవాఁడై యుండుట రాజునకు ముఖ్యకార్యంబులు. రాజెన్నండును అధర్మంబు లగుకామంబులం దగిలియుండరాదు. వానికంటెనుగూడఁ దత్త్వవేత్తయు సర్వధర్మోపపన్నుండు నగువాఁ డెవ్వండేనున్నయెడ నాతనిదర్శించుటకు నాతనివలన ధర్మంబు లెఱుంగుటకును బ్రజల ననుశాసింపవలయును. వానివలన దాను ధర్మంబు లెఱుంగవలయును. వానియం దెన్నఁడు నసాధువృత్తి నాచరింపంజనదు. నృశంసుండు విధిప్రకోపంబున నెప్పుడు బలంబులంగొని పరైశ్వర్యంబులం దత్యాశకలవాఁడై యుండునో యప్పుడు రాజులకుయుద్ధంబు సిద్ధమగును. ఆయుద్ధంబునకై యే యీవర్మంబులు శస్త్రంబులు ధనువులు నుద్భవించినవి. తొల్లి యింద్రుండు దస్యువధం బాచరించుటకై ధనుశ్శస్త్రవర్మంబులుత్పాదించెను గావున దస్యువధం బాచరించినపుడు శస్త్రాస్త్రంబుల వలనఁ బుణ్యమే లభించును. అధర్మజ్ఞులు నబోధవంతులు నగు కౌరవులచే నీదోషంబు తీవ్రరూపంబున నుత్పాదింపఁబడినది. అది యనుచితమైనది. రాజగు ధృతరాష్ట్రసూనుండు పాండవులకు ధర్మ్యంబగువిత్తమ్ము నకారణంబ యపహరించెను. వాని ననుసరించుకౌరవులెల్లరును బుర

తనం బగు రాజధర్మంబు నాదరింప కున్నారు. దొంగ కనఁబడకుండ ధన
మపహరించినను, కనఁబడి బలాత్కారముగా ధన మపహరించినను
నొక్కటియే కాని వేఱురీతి కానేరదు కదా? ఈ రెండు కార్యంబులును
గర్హ్యంబులే యగును. అట్టి దొంగకును సుయోధనునకును భేద మేమి
కలదు? క్రోధవశంవదుం డగు నీసుయోధనుండు తానేది వాంఛించె నది
యెల్ల ధర్మమే యని లోభంబునఁ దలంచుచుండును. పరులు పాండవుల
భాగంబు నపహరించి యింతదనుక ననుభవించియుండిరి. ఇప్పుడు వారి
భాగము వారి కేల యీయరు? ఈవిషయంబునకై యుద్ధ మాచరించు
వారు వధంబు ప్రాప్తించినను శ్లాఘ్యమైనదియే. పరరాజ్యంబుకంటెఁ
బిత్ర్యమయినరాజ్యము వేయిమడుంగు లధిక ప్రశస్తము. సంజయా!
యెల్లరాజులు వినుచుండ సభామధ్యంబున నీధర్మంబు లెల్ల గౌరవుల
కుపదేశింపుము. మృత్యువశాభిపన్నులై ధార్తరాష్ట్రునిచేఁ జేరఁదీయఁ
బడిన మందబుద్ధులకెల్లఁ బురాణంబులగు నీధర్మంబు లుపదేశింపుము.

సంజయా! సభామధ్యమం దాకౌరవు లానాఁ డాచరించినకర్మ
మెంత పాపిష్ఠమైనదో యెంత నీచమైనదియో యాలోచింపుము. యశ
స్విని, సచ్ఛీల, సద్వృత్తములతోఁ గూడినదియు నగు పాండవుల ప్రియ
భార్య ద్రౌపదిని కామానుగుం డగు సుయోధనుం డట్లు భంగపఱుచు
చుండ భీష్ముండు మొదలగుకౌరవు లెల్లరును వల దని వారింపక యుపే
క్షించిరే? అప్పు డట్లు రోదనంబు నేయుచున్న ద్రౌపదిని కురుకుమారులు
గాని కురువృద్ధులుగాని యూరడించియుండు రేని, ధృతరాష్ట్రుండు నాకుఁ
బ్రియం బొనరించియుండెడివాఁడు. మఱియు నాతండు తనకుమారుల
కును హిత మాచరించియుండెడివాఁడు. దుశ్శాసనుండు ప్రతిలోమం
బుగ శ్వశురు లున్న సభామధ్యంబునకు ద్రౌపది నీడ్చి తెచ్చెఁగదా? అట్లు
సభామధ్యంబునకుఁ దీసికొనిరాఁబడిన పాంచాలరాజపుత్త్రి కెంత యేడ్చి
నను నొక్కవిదురుండుదక్క నొక్కరు రక్షకులు లేరైరికదా? అక్కడ
నున్న రాజు లెల్లరు గృపణులై యే యొక్కమాటయైనఁ బలుక సాహసింప
రైరి. ఒక్కవిదురుండుమాత్రము ధర్మవిశిష్టము నర్థోపపన్నంబు నగు
వాక్యంబు వలుకువాఁడై యల్పబుద్ధి యగువానికిఁ బ్రతివచనం బిచ్చెను.
అప్పు డాసభయందుఁ గౌరవుల కాధర్మంబు చెప్పఁజాలక యిప్పు డీధర్మ
నందనునకు ధర్మంబు గఱప నీ వెట్లు సాహసించుచున్నాఁడవు? అప్పు డా

సభామధ్యంబున ద్రౌపది విశుద్ధంబు దుష్కరంబు నగుకర్మ గావించు
కృచ్ఛ్రగతు లగుపాండునందనులను పత్నిఁగూడ సముద్రంబువలన నా
నౌకవోలె నుద్ధరించెను. ఆసభ యందు శ్వశురులనికటంబున నిలిచి
యున్న ద్రౌపది నాలోకించి "యాజ్ఞసేని! నీ కింక గతిలేదు. దాసివై
ధార్తరాష్ట్రనివేశనంబున నుండుము. నీపతు లెల్లరును బరాజితులైరి.
వేఱొకపతిని వరింపు" మని కర్ణుండు పలికినపలుకులు ములుకులవలె
బీభత్సుని హృదయంబున నాఁటి యెమ్ముకలఁ బ్రవేశించి మర్మంబుల వేధిం
చుచు ఘోరం బగు వేదన నిప్పుడును గలిగించుచున్న దికదా? కర్ణప్రయు
క్తంబగు నావాగ్రూపశరము తీక్ష్ణతేజంబై ఫాల్గుని హృదయంబు
దూసిపాఱి యిప్పుడును విసువనియాతనం గుడుపుచున్నది. వీరలు కృష్ణా
జినంబులు ధరించునవసరంబున దుశ్శాసనుండు "వీర లెల్లరు షండతిల
ప్రాయులై వినాశ మొందిరి. నశించుట యకాక దీర్ఘకాలంబు నరకంబునుం
బొందిరి" యని మిక్కిలి కఠినము లగుదుర్భాషలాడు టెల్లరు నెఱుంగరా?
గాంధారరా జగు శకునియు నికృతిచే ద్యూతకాలంబున ధర్మనందను
నితో "నకులుండును బరాజయింపంబడియె. ఇంక నీకేమి కలదు? ద్రౌప
దినిఁ బణంబుగా నొడ్డియాడు" మని పలికెఁగదా? సంజయా! ద్యూత
మ్మునం దిట్టిదుర్భాషణమ్ములాడుట గర్హ్యం బని నీ వెఱుంగుదువు కాదే?
నేను స్వయంబుగ నక్కడికి వచ్చి చెడిపోయిన యీకార్యంబెల్లఁ జక్క
బఱుపం దలంచుచున్నాఁడను. పాండవులయర్థంబునకు భంగంబురా
కుండఁ గౌరవులకు శాంతి గల్గునట్లు సమాధాన మొనఁగూడవలయునని
నా కభిమతముగలదు. అట్లుగావింపఁగలిగితినేని నాకుఁ బుణ్యంబుగల్గును.
నాచరిత్రంబు మహోదయంబగును. కౌరవులు మృత్యుపాశంబులనుండి
విముక్తు లగుదురు. కావ్యంబు, ధర్మనిరతంబు, నర్థకరంబు, హింసాదూ
రంబు నగు నావాక్యంబును గౌరవు లాదరింతురా? వారిసన్నిధికి వచ్చిన
నన్నుఁ బూజింతురా? వారలకెల్ల శుభంబులు గల్గును. అట్లు గావింపరేని
రథారూఢుం డగుఫాల్గునునిచేతను నాహవదోహలుం డగు భీమసేనుని
చేతను స్వకర్మపరిపాకంబుచే దహ్యమాను లగునాపాపులు విగతజీవు
లగు రని తెలియుము. ధార్తరాష్ట్రుండు ద్యూతంబునఁ బరాజితు లగు
పాండవులను రౌద్రంబులు రూక్షంబులు నగుమాట లాడియున్నాఁడు.
సమయమాసన్నమయినపుడు భీమసేనుండు గదాపాణియై యావాక్యంబు

రెల్ల దుర్యోధనునిచే స్మరింపంజేయుము. సుయోధనుండు క్రోధరూపం బగు మహావృక్షము. దానికిఁ గర్ణుండు స్కంధము. దానికి శాఖ శకుని. దుశ్శాసనుండు పుష్పఫలములు బంధములు, మొదలు ధృతరాష్ట్రుండు నై యున్నారు యుధిష్ఠిరుండు ధర్మమను మహాతరువు. దానిస్కంధ మర్జునుండు. శాఖ భీమసేనుండు. మాద్రీతనయులు పూవులును, బంధములును, మొదలు నేనును వేదంబులును బ్రాహ్మణులమునై యున్నారము. సపుత్రుండగుధృతరాష్ట్రుండు మహారణ్యమువంటివాఁడు. పాండునందనులు వ్యాఘ్రంబులవంటివారు. వ్యాఘ్రంబులతోఁ గూడినవనం బెవ్వరును ఛేదింపఁజాలరు. వనమందున్న వ్యాఘ్రంబుల నెంతటివారును జెనకఁజాలరు. అడవి విడిచిన వ్యాఘ్రంబునకు ముప్పువాటిల్లును. పులులుండని వనంబు నెల్లరును ఛేదింతురు. కావున వ్యాఘ్రంబు వనంబును రక్షింపవలయును. అరణ్యంబు వ్యాఘ్రంబులఁ గాపాడవలయు. ధార్తరాష్ట్రులు లతాధర్ములు. పాండవులు మహావృక్షంబులంబోలువారు. మహాద్రుమముల నాశ్రయింపనిదే లత యెన్నఁడును బెరుఁగదు. ఈపార్థులు శుశ్రూషయొనరింపను సిద్ధంబుగ నున్నవారు. యుద్ధ మొనర్చుటకైనను సిద్ధమై యేయున్నవారు. ధృతరాష్ట్రున కీసమయంబున నేది యుచితంబని తోఁచిన దానినే యాచరించుఁగాక. మహాత్ములు ధర్మచరులు నగుపాండవులు కేవలము శమాభిరతులై యే యున్నవారు. వారలు యుద్ధంబులం దాఁటి తేఱినమహావీరులు. నీ విషయంబులెల్ల బాగుగఁ దెలిసికొని యాధృతరాష్ట్రునితో వాస్తవంబెల్లఁ జెల్పు మని పలికె.

వాసుదేవుం డిట్లు పలికినపలుకు లాలించి సంజయుండు ప్రయాణోన్ముఖుండై, "నరదేవదేవుండ వగు కృష్ణా! ని న్నామంత్రించుచున్నాఁడను. పాండవాగ్రణీ! నీకు శుభంబగుఁగాక. నేను మీచే ననుజ్ఞాతుండనై హస్తినపురంబునకు వెడలుచున్నాఁడను. నేను మీతోడ మాటలాడునప్పుడు మానసికదోషంబువలన నేవేని ప్రమాదవాక్యంబు లన లేదుగదా? జనార్దనుని భీమసేనార్జునులను మాద్రీనందనులను సాత్యకినిఁ జేకితానుని నెల్లర నామంత్రణం బొనర్చి వెళ్లుచున్నాఁడను .మీకు శుభంబులు సుఖంబు నగుఁగాక. రాజన్యులారా! మీ రెల్లరును నా యెడ ననుగ్రహింపుఁడు." అని పలికినంతన యుధిష్ఠిరుండు "సంజయా! మా యెల్లరచే ననుజ్ఞాతుండవై తివి. భద్రంబుగ వెడలుము. మే మెప్పుడు

నప్రియంబు లాచరింపలేదుగదా ? కౌరవులును మేముఁగూడ నిన్ను శుద్ధాత్ముండనియు మధ్యవర్తివనియు నెఱుంగుదుము. సంజయ ! నీ వాప్తుండవగుదువాతవు. నీయందు నాకుఁ బ్రీతి మెండు. నీవు కల్యాణ వచనుండవు, శీలవంతుండవు. తృప్తిమంతుండవు నన నెగడియున్నావు. నీమతి యెన్నండును మోహము నొందదని సంభవింపదు. దురుక్తంబులు పలికి నను గోపింపవు. ఎప్పుడును మర్మంబులంటు కఠినవాక్యంబులుగాని, యుప ప్రుతిగాని, కటువాక్యంబులుగాని, మందవచనంబులుగాని పలుకవు. నీ వాక్యంబు ధర్మాభిరతమైన దనియు, అర్థవంతమైన దనియు, హింసాదూర మైన దనియు మేము తలంచుచున్నారము. మాకడకు దూతగా వచ్చు టకు నీవును విదురుండునుమాత్రమే యెల్లభంగుల నర్హులరు. మునువు నిన్ను మేము తఱచుగాఁ జూచుచుండెడివారముగదా? నీవు ధనం జయునకు నాత్మసముండ వగు నెచ్చెలివి. సంజయా! నీ విక్కడనుండి వెడలి వేగంబుగ హస్తినపురంబున కరిగి మాన్యార్హులగు బ్రాహ్మణుల నెల్ల సమ్మానింపుము. విశుద్ధవీర్యులు, చరణోపపన్నులు, మహాకులప్రసూ తులు, సర్వధర్మసంపన్నులు, స్వాధ్యాయనిరతులు నగుబ్రాహ్మణులు, భిక్షువులు, నిత్యంబు వనవాసనిరతులగు తపస్వులను నావాక్యంబులుగా నభివాదనం బొనరించి వృద్ధులగువారలయు నింకఁ దక్కుం గలయెల్ల రయుఁ గుశలం బడుగుము. ధృతరాష్ట్రునిపురోహితుని యాచార్యు లను ఋత్విజులను నావచనంబుగాఁ గుశలప్రశ్నము గావింపుము. వార లెల్లరకడకుం దప్పక నీవరిగి యోగక్షేమంబు లారయుము. శ్రోత్రి యులు మనస్వులు శీలబలసంపన్నులునై యెప్పుడును మాయందుఁ బ్రేమ గలిగి యథాశక్తిగ ధర్మంబు లాచరించువృద్ధులకెల్లరకును ముందుగా మాకుశలం బెఱింగించి తరువాత వారల ననామయం బడుగుము. మఱియు నెవ్వరు రాష్ట్రంబున వ్యవహారంబున జీవింతురో యెవ్వరు రాష్ట్రంబులఁ బాలింతురో వారలనెల్లఁ గుశలం బడుగుము. ధనురా చార్యుండు ఇష్టుండు నీతిపారంగతుండు, వేదవేదాంతవేత్త, బ్రహ్మ చర్యవ్రతపరాయణుండు నయ్యు నస్త్రవేదంబు నాలుగుపాదంబు లెవ్వఁ డధ్యయనం బొనర్చెనో యట్టి ప్రసన్నుండగు ద్రోణున కభివాదనం బొనరింపుము. సకలవిద్యావిదుండు, చరణోపపన్నుండు, ధనుర్వేదంబు నాలుగుపాదంబు లధ్యయనం బొనర్చినవాఁడు, గంధర్వపుత్రసముండు,

తపస్వియు నగు ద్రోణనందనుండగు నశ్వత్థామను గుశలం బడుగుము. శారద్వతునిసదనంబున కరిగి మహారథుండు నాత్మవిదుండు నగు నాకృపాచార్యునకు మాకుశలం బెఱింగించి యాతనిపాదంబులఁ గరంబుల స్పృశించి నమస్కరింపుము. ఎవ్వనియందు శౌర్యము ఆనృశంస్యము, తపము, ప్రజ్ఞ, శీలము, వేదశాస్త్రంబులు, ధైర్యమును నిత్యప్రతిష్ఠితంబులై యున్నవో యట్టి కురుసత్తముం డగు భీష్మునిపాదంబులు పీడించి మాక్షేమం బెఱింగింపుము. ప్రజ్ఞాచక్షుండు, కురుకులంబున కెల్ల నాయకుండు బహుశాస్త్రవేది, వృద్ధోపసేవి, మనీషియు నగు ధృతరాష్ట్రునకు నమస్కరించి మాయారోగ్యం బెఱింగింపుము. ధృతరాష్ట్రునిజ్యేష్ఠపుత్రుండు, మందుండు, మూర్ఖుండు, శఠుండు, పాపశీలుండు, పృథివికెల్ల నేలికయు నగు సుయోధనుని కుశలం బడుగుము. వానితమ్ముఁడు వానివలెనే మందుండు, పాపశీలుండు, మహేష్వాసుండు, కౌరవులకు శూరతముండు నగు దుశ్శాసనుని క్షేమం బడుగుము ఎవఁడు భారతులకు శాంతియే యుత్తమం బని యెల్లప్పుడు నమ్ముచుండునో యట్టిసాధుశీలుండగు బాహ్లికున కభివాదనం బాచరింపుము. అనేక శ్రేష్ఠగుణసంపన్నుండు విజ్ఞానశాలి యనిష్ఠురుండు నై స్నేహంబున నెవ్వఁ డమర్షమును సహించునో అట్టి సోమదత్తుండు నాకు మిగులఁ బూజ్యుండు. ఆతని కభివాదనం బాచరింపుము. సోమదత్తి కౌరవులకెల్ల మిగులఁ బూజ్యుండు. ఆతండు మాకన్న యగును. మాకెల్లప్పుడును సహాయుండు, మహాధానుష్కుండు. రథికులలో నుత్తముండు. ఆతని నాతనిమంత్రులెల్లరను గుశలం బడుగుము. మఱియు నితరులగుకురుముఖ్యులు పిన్నలును మాకు పుత్రులు పౌత్రులు భ్రాతలు నగువారలలో నెవ్వరెవ్వరి కేయేవిధం బన్వంబో యావిధంబునఁ బలికి యెల్లర ననామయం బడుగుము. పాండవులతోడి కయ్యంబున కియ్యకొని ధార్తరాష్ట్రునకు సహాయులుగా నేతెంచిన వశాతులు, సాల్వులు, కేకయులు, ఆవంత్యులు, త్రిగర్తులు, శూరు లగుప్రాచ్యులు, ఆవాచ్యులు, పాశ్చాత్యులు, నుదీచ్యులును, పార్వతీయులును నగు రాజులనెల్లఁ గుశలం బడుగుము. వారెల్లరును నహింసాతరులును, సచ్ఛీలసద్వృత్తంబులుగలవారు. మఱియు మావటీలు, రథికులు, తురగారేవంతులు, పదాతులు, ఆర్యసంఘంబులు మొదలగు వారలకెల్ల మాకుశలంబు సెప్పి వారల యనామయం బడుగుము.

క్షాంతియు కాక రాజయొక్క యర్థసిద్ధికై నిత్యము ప్రయత్నించు నమాత్యులను ద్వారపాలకులను సేనానాయకులను నిత్యంబు నాయవ్యయముల గణించుచు నర్థోపార్జనమందు సంతతచింత గలగణకులను గుశలం బడుగుము. కౌరవకులముఖ్యుండైన బృందారకసముండు, అమోఘుండు, ప్రజ్ఞాశాలి, సర్వధర్మోపపన్నుండు నగు వైశ్యాపుత్త్రుండు యుయుత్సుని కుశలం బడుగుము. సంజయా! ఆతనికి యుద్ధ మెప్పుడు నభిమతము గాదు. నికృతిపాలు సేయుటయందును ద్యూతమందును నద్వితీయుండు, ఘనోత్కటుండు, దేవనాభిజ్ఞుండు, అప్రతియుండు, ద్యూతమునను యుద్ధమునను గూడ దుర్జయుండు నగు చిత్రసేనుని కుశలం బడుగుము. గాంధార దేశాధిపతియు పార్వతీయుండును, నికర్తనమం దద్వితీయుండును, నక్షక్రీడానిపుణుండును సుయోధనునకు మానంబు వృద్ధిసేయువాఁడును గపటబుద్ధియు నగు శకునిని గుశలప్రశ్నము గావింపుము. అప్రధృష్యులగు పాండవులనెల్ల నేకరథంబున నేజయింతునని గర్వించుచు మోహామందు వారల నతిముగ్ధుల గావించు కర్ణుని గుశలం బడుగుము. సంజయా! మాకు విదురుండు భక్తుండు. అతఁడే గురుండు; అతఁడే భర్త; అతఁడే తండ్రి; అతఁడే తల్లి; అతఁడే స్నేహితుండు; అతఁడే మాకు మంత్రి. అగాధబుద్ధిశాలియు దీర్ఘదర్శియు నగు విదురుని కుశలం బడుగుము. గుణోపపన్నలగు వృద్ధస్త్రీలు నాకు మాతృసమానలు. ఆస్త్రీల నెల్ల నీవు దర్శించి వారల కెల్ల నాయభివాదనంబు దెల్పుము. వారలతోఁ దొలుత జీవపుత్త్రలారా! మీపుత్త్రులు హింసాదూరులై మీయెడల సద్వృత్తంబునఁ బ్రవర్తించుచున్నారా యని యడిగి యనంతరము సపుత్త్రుండ నగు నాకుఁ గుశలమని చెప్పుము. సంజయా! రాజభార్యల నెల్ల నీ వెఱుంగుదువే కదా? వారల నెల్లఁ గుశలం బడుగుము. మఱియు వారలు గుప్తంబుగా నుండి అనవద్యలై ప్రమాదంబు వీడి గృహములందుఁ జరించుచున్నారు కదా? భద్రలారా! యత్తమామలయెడ నన్నృశంసమగు కల్యాణవృత్తి నాలంబించుచున్నారా? ఏవృత్తంబునఁ బతులనుకూలురై సంతసింతురో యట్టివృత్తంబున మెలంగుఁ డని వారలకుఁ జెప్పుము. మహాకులంబులనుండి వచ్చినవారును సద్గుణోపేతలు నగు మా కోడండ్ర నెల్లఁ గుశలం బడిగితి ననుము. అక్కడి కన్యాజనంబుల నెల్లఁ గుశలం బడిగి, భర్తల కనుకూలవృత్తి నుండుఁ డనియు, వారల కెల్లఁ

బతులు కల్యాణముం గాంక్షించు ననుకూలురై యుందురుగాక యని దీవించితి ననియుఁ జెప్పుము. సుగంధవస్త్రాభరణంబులచే నలంకృతలు, సౌమ్యలు, సుఖితలు, భోగపరాయణలు నగుభవనస్త్రీలనెల్లఁ గుశలం బడుగుము. వారలదర్శనంబు లఘువైనది. వాక్యములును లఘువు లయినవి. మఱియు దాసీజనంబులు, దాసులు, వారల నాశ్రయించిన కుబ్జులు ఖంజులు మొదలగువారల కెల్ల మాకుశలం బెఱింగించి వారల కుశలం బడుగుము. వారలతో 'సుయోధనుండు పూర్వమువలె మిమ్ముల నాదరించుచున్నాఁడా! పూర్వమువలె భోగంబు లొసంగు చున్నాఁడా' యని ప్రశ్నింపుము. మఱియు ధృతరాష్ట్రునిచేఁ బోషింపఁ బడుచున్న యంగహీనులు, కృపణులు, వామనులు, అంధులు, స్థవిరులు, హస్తాజీవులు మొదలగువారల కెల్ల నాక్షేమం బెఱింగించి, వారల క్షేమం బడుగుము. వారలెల్లరతోడను దుఃఖం బగుజీవితంబువలన మీరు భయమందవల దనియు, మీరలు పూర్వజన్మంబులం దేవియో పాపంబు లాచరించితిరి. వానివలన నిపుడీదుఃఖము లనుభవింపవలసివచ్చి నది. నేను శాత్రవులనెల్ల నిగ్రహించి మిత్రుల ననుగ్రహించి మీకు వలయునన్న వస్త్రంబు లిచ్చి మిమ్ములనెల్ల భరింతునని వారలకుం జెప్పుము. నే నిదివఱకు బ్రాహ్మణుల కిచ్చినవృత్తు లనేకంబు లున్నవి. మఱి ముందు గూడ వారికి వలయువృత్తుల నిచ్చెదను. యుక్తరూపు లగుబ్రాహ్మణుల నాగౌరవంబుతోడనే చూచుచున్నాఁడను. ఆసిద్ధినే యార్జున కెఱిం గింపుము. అనాథులు దుర్బలులునై సర్వకాలంబు నాత్మార్థంబు ప్రయ త్నించు నజ్ఞానులను కృపణులను నావాక్యంబులుగఁ గుశలం బడు గుము. ఇంక నితరులు నానాదిక్కులనుండి యేతెంచి ధార్తరాష్ట్రుల నాశ్రయించినజనంబులనెల్ల నర్హరీతి నెల్లరను గుశలం బడుగుము. ఇట్లే నానాదిక్కులనుండి వచ్చిన రాజదూతలనెల్ల క్షేమం బడిగి నాకుశ లంబు వారి కెఱింగింపుము. ధార్తరాష్ట్రుఁడు సంపాదించిన యోధుల వంటి యోధు లీభూమియందు మఱెచ్చోటను లేరు. అయినను ధర్మ మెప్పుడును నశింపదు. నాకు శత్రువిజయంబున మహాబలవత్తమ మగు ధర్మమే సహాయము. సంజయా! నీవు ముఖ్యముగా ధార్తరాష్ట్రునితో నావచనంబుగా, 'నీశరీరంబునందు కురురాజ్యంబెల్ల నసపత్నముగ నేలవ నేను కామము హృదయమును వేధించుచున్నది కాని, యాకామము నెర

వేఁడుటమాత్రము కల్ల. నీ కిట్లు ప్రియంబగునో యే మట్టివారలము కాము. నాకు స్వర్గలోకము ప్రాప్తించినను సరియే. లేదా నీవు వీరుండవై యుద్ధమొనరించినను సరియే' యని వచింపుము.

సంజయా! విధి సజ్జనుని దుర్జనుని బాలుని వృద్ధుని బలియుని దుర్బలునిఁగూడ వశపఱుచుకొనును. బాలునకుఁ బాండిత్యమును పండితునకు బాలత్వమును గూడ విధియే యొసంగును. అని బలం బెఱుంగఁ గోరు ధృతరాష్ట్రునకు వాస్తవంబుగ నెఱింగింపుము. మఱియు మంత్రావసరమున సంతసముతో నాతని కిట్లు తెలుపుము. గవల్గణాత్మజా! నీవు కౌరవులకడ కరిగి మహాబలుండగు నంబికానందనున కభివాదనం బాచరించి యనామయం బడిగి యనంతర మెల్ల కౌరవులతోడను బరివృతుండై యాసనంబున సుఖాసీనుండైన యాతని కిట్లు విన్నవింపుము. రాజా! నీ పర్యంబువలననే పాండవులు సుఖంబుగ జీవించుచున్నవారు. బాలురగు వారు నీయనుగ్రహంబున రాజ్యం బొందినవారు. నీవ తొల్లి వారల రాజ్యంబునం బ్రతిష్ఠించి యిప్పుడు వినాశోన్ముఖు లగువారి నుపేక్షింపకుము. సంజయా! యీసమావేశంబయినబలంబులెల్ల మాలో నొక్కనికి సరిపడవు. శాత్రవుల నవశ్యంబు పరిమార్చి జీవింతుముగాని శాత్రవుల కెన్నండును వశంవదులము గామని పల్కుము. భారతులకెల్లఁ బితామహుండును శంతనుమహారాజున కాత్మజుండు నగు భీష్మునకు నానామ ముచ్చరించి శిరంబునఁ బ్రణామంబు గావింపుము. అనంతర మాతనితో, 'ఆపన్నిమగ్న మగు శంతనునివంశమును మున్ను నీవ యుద్ధరించి నిలిపితివి. ఇపుడును నీవ నీపౌత్రులెల్లరును సుఖంబుగ జీవించు తెఱంగున నీబుద్ధికిందగునట్లేర్పఱింపు'మని వచింపుము. విదురునితోఁ గూడ, 'యుద్ధంబు పొసఁగకయ కార్యంబగునట్లు ప్రయత్నింపు' మని పలుకుము. అతండు కౌరవులకెల్ల మంత్రధారకుండు కదా! పిదప నమర్షణుం డగుసుయోధనుని గౌరవసభామధ్యమందు బాగుగ ననునయించి వాని కిట్లనుము.—'పాపరహిత యగు ద్రౌపది నానాఁడు సభామధ్యంబునఁ భంగపఱిచినదుఃఖంబు నెల్లఁ గౌరవులవధింపకుండ నుండవలయు ననుసంకల్పమున క్షమించి యున్నారు. ఇంతియకాక పూర్వాపరంబు లగుపాపకార్యంబులనెల్లఁ బాండవులు సహించుచునేయున్నారు. వారు బలియులైనను నిట్లు సహించుట వారిసద్భావంబునఁగాని వేఱుగాదనుము. నావలనఁ గావలసిన

దేవియో దానినెల్లఁ గౌరవు లెఱుంగుదురు. నమ్ముల నజినధారులఁ
గావించి పురమునుండి వెడలనంపిన పాపముసుగూడ గౌరవవధమం
దిష్టములేనివారై యోర్చియుంటిమి. కురుకులనాశంబుగావింప నిచ్చ
లేమిం జేసియే నాఁడు కుంతీదేవి నతిక్రమించి నీయనతిని దుశ్శాస
నుండు ద్రౌపదిని దలఁబట్టియీడ్చిన యపరాధమునైత ముపేక్షించితిమి.
మేమెల్లభంగుల నుచితం బగుమార్గంబున మారాజ్యభాగంబును స్వాధీ
నముగావించికొందుము. పరద్రవ్యాపహరణమం దత్యాశగల నీబుద్ధి
నింక మఱలింపుము. నీవట్లొనరించితివేని మన కురుపక్షములవారికిని
శాంతియుఁ బ్రీతియుఁ గల్గును. శాంతినేవాంఛించు మాకు రాజ్యంబునఁ
గొంతభాగమైన నిమ్ము. కుశస్థలంబు వృకస్థలంబు మాకంది, వారణావత
మునను నాలుగూళ్లును నైదవది నీయిచ్చకువచ్చిన దేదే నొక్కయూ
రును మాకేవుర కేనూళ్లిమ్ము. మేమంతమాత్రంబుననే తృప్తినొందె
దము. జ్ఞాతులతోడి మనకెల్లరకు శాంతి చేకూరును. అన్నయుఁ దమ్ముం
డును గలసికొందురుగాక. కొడుకులు తండ్రితోఁగూడి యానందింతురు
గాక. పాంచాలురు చిఱునవ్వునగుచుఁ గౌరవులతోఁ గలియుదురుగాక.
నేను గౌరవులను బాంచాలురను నక్షతగాత్రులుగాఁ జూడ నాశించు
చున్నాఁడను. ఎల్లరమును మనంబులందలి క్రోధశోకంబుల వీడి శాంతి
ననుభవింతము. నేను శాంతికి సమర్థుండ నెట్లో యట్లే యుద్ధంబునకును
సమర్థుండనే. ధర్మార్థములకును సమర్థుండనే. మృదుత్వమునకును దారు
ణత్వమునకుంగూడఁ జాలియున్నాఁడనని వచింపు" మనియె.

### సంజయుండు ధృతరాష్ట్రునకుఁ బాండవులయిష్టం బెఱింగించుట

ఇట్లుపలికి ధర్మనందనుం డనుజ్ఞాపింప సంజయుండు ధృతరాష్ట్రుఁ
డానతిచ్చినకార్యంబు సమగ్రంబుగ నెరవేర్చి హాస్తినపురంబున కరిగె.
అతండు త్వరితగమనంబున బురంబున కరిగి శీఘ్రంబుగఁ బురప్రవే
శంబుగావించి యంతఃపురంబు సమీపించి యచ్చోటనున్న ద్వారపాల
కునితో, పాండవులకడనుండి సంజయుండు వచ్చి ద్వారంబుకడ వేచి
యున్నాఁడని వేగముగ నివేదింపుము. ఆలస్యము సేయకుము. రాజన్యుండు
జాగరూకుండై యున్నచో నావచ్చినవార్త తెల్పుము. ముందు రాజున
కెఱుకపఱిచి యనంతర మాతనిగృహంబున కేఁగెదను. రాజునకు వేగ

షముగా విన్నవింపవలసినవార్తలున్నవి. అనినంత ద్వారపాలకుఁ డా
క్షణంబుననే రాజుకడ కేఁగి 'రాజోత్తమా! నీకు నమస్కారంబు. పాండ
వులకడ కరిగినదూత సంజయుండు పాండవులకడనుండి యిప్పుడ వచ్చి
ద్వారదేశంబున మీదర్శనంబు నాకాంక్షించియున్నవాఁడు. వాని కేమి
పనులు చెప్పెద'రని విన్నవింప ధృతరాష్ట్రుఁడు 'ఓరీ నేను క్షేమంబున
నున్నవాఁడను. నేనెల్లవేళలందు నాతనికి దర్శనయోగ్యుఁడనే. వానికి
స్వాగతంబగుఁగాక. వానిని వేగమ రమ్మనుము. నే నెప్పుడు నాతనికి
నకల్యుఁడను (దర్శనాభ్యంతరముగలవాఁడను) గానుకదా? ఆతఁ డేల
సంశయగ్రస్తుఁడై ద్వారముకడ నిలిచియున్నవాఁడు? నే వేగను వాని
నిటకుఁ బంపు'మని యానతిచ్చె.

అట్లు ధృతరాష్ట్రు ననుమతం బడసి ప్రాజ్ఞులు శూరులు నార్యులు
నగుపురుషులచే రక్షింపఁబడు రాజమందిరము ప్రవేశించి ప్రాంజలియై
సింహాసనంబున నాసీనుండై యున్న ధృతరాష్ట్రుని సమీపించె. రాజా!
సంజయుండ నేను నమస్కరించుచున్నాఁడను. నీయానతి తలందాల్చి
పాండవులకడ కరిగి వారినిఁ జూచి తిరిగివచ్చితిని. మనస్వి యగుపాండు
నందనుండు యుధిష్ఠిరుండు నీకు నమస్కారంబుగావించి కుశలం బడి
గెను. ఆతండు ప్రీతిపూర్వకంబుగ నీపుత్రు లెల్లర క్షేమంబు నడిగిన
వాఁడు. నీవు పుత్రులతోడను మనుమలతోడను హితులతోడను సచి
వులతోడను నింకను నిన్నాశ్రయించి జీవించువారెల్లరతోడను సుఖం
బుగ సంతసించుచున్నావా? యని యడిగెను. "సంజయా! నిన్నెంతయు
మెచ్చుచున్నాఁడను. ఆయజాతశత్రుండు సుఖంబున్నవాఁడా? పుత్రుల
తోడను మంత్రులతోడను సహోదరులతోడను కుశలంబుగ నున్నాఁడు
గదా?" యని పలికెను. అదివిని సంజయుండు రాజా! పాండునందనుం
డమాత్యపుత్రానుజులతో క్షేమంబున నున్నవాఁడు. నీకు మనంబున
నెట్లుండెనో యట్లే సుఖమనుభవింప నుత్సహించుచున్నవాఁడు. ఆతండు
దోషరహితంబు లగుధర్మార్థంబులనే సేకరించువాఁడు; మనస్వి; బహుశ్రు
తుండు; దీర్ఘాలోచనముగలవాఁడు, శీలవంతుఁడు నై యున్నవాఁడు;
పాండవాగ్రజున కెల్లధర్మంబులకంటె నహింసయం దభీష్ట మధికము.
ద్రవ్యసంగ్రహముకంటె ధర్మమే యుత్తమమని యాతఁడు తలంచును.
ధర్మార్థవిహీనములుగాని సుఖప్రియంబులనే యొల్లపుడు నాతనిబుద్ధి యభి

లభించును. పురుషుండు పరప్రయుక్తుండై దారముగట్టినకఱ్ఱబొమ్మవలెఁ జరించుచుండును. ఈయర్థంబు చక్కఁగ నెఱింగియే యాతండు మనుష్యునికంటెఁ గర్మమే యధికతరమని తలంచుచుండును. ఘోరంబున వాచ్యంబుం బాపోదర్కమ్మునగు నీకర్మ దోషంబునుగూడ నాలోచించినచో బలవంతుండగు శాత్రవుండుపేక్షించునంతవఱకు నెట్టివాఁడైనను శుభము లొందునని తోఁచుచున్నది. అజాతశత్రుండన్ననో సర్పము జీర్ణమైన కుబుసంబునుంబోలె, ననర్థంబగుపాపంబును విడిచి యార్యవృత్తంబునఁ బ్రకాశించుచున్నవాఁడు. ధీరుండగు నాయుధిష్ఠిరుండు పాపంబులనెల్ల నీయందు విడిచియున్నవాఁడు. కటకటా! రాజా! నీ వొనరించిన కార్యము ధర్మార్థయుక్తం బగు నార్యవృత్తంబునకు మిగుల దూరమైనదని యెఱుంగుము. లోకంబున మిక్కిలి నపఖ్యాతినొందితివి. మఱియుఁ బరలోకంబునఁ బాపఫలం బనుభవింతువు. నీవు పుత్రవశమునన్నవాఁడవై పాండవుల విడిచియే దుర్లభ మగునీధనమెల్ల ననుభవింపఁదలంచెదవు. భూమియం దధార్మికుఁ డనునింద నీకత్యధికముగా సంభవించియున్నది. హీనప్రజ్ఞుండు, దుష్కులసంజాతుండు, హింసాపరుండు, దీర్ఘవైరముగలవాఁడు, క్షత్రవిద్యలందు ధైర్యములేనివాఁడు, శిష్టుండు కానివాఁడు మొదలగువారల కెప్పుడు నాపదలు సన్నిహితంబు లగుచుండును. సత్కులప్రసూతుండు, బలశాలి, యశోవిరాజితుండు, బహుశ్రుతుండు, సుఖజీవనుండు, ప్రయతచిత్తుండునై యెవ్వండు ధర్మాధర్మములను భజించుచుండునో వానిదరి కాపదలు చేరఁజాలవు. మంత్రాభిజ్ఞులను బోషించుచుండియు నామంత్రవేత్తలచే నాపత్సమయమున ధర్మాధర్మంబు లెఱింగింపంబడిన విద్వాంసుండు మూఢుండే కానిచో నిట్టినృశంసం బగుకర్మము నెట్లాచరింపఁగల్గును? మంత్రవిదు లగు నీమంత్రు లెల్లరును కార్యములందు నిత్యప్రయత్నులై యున్నారు. నీవొనరించినకార్యంబు తప్పక కులక్షయకారణం బగునని వారలెల్లరును బలమగునిశ్చయంబున నున్నవారు. నీపాపకార్యంబునఁ బ్రేరితుండై యజాతశత్రుండు పాపం బొనరించెనేని కౌరవు లొక్కమారు నశించియుందురు. ఆతండు నీయందు పాపమెల్ల విసర్జించియుండుటచే నీకు లోకంబున నింద సంప్రాప్తం బయియున్నది. దైవవిలసితములకంటెను జిత్రము లేవి కలవు? ధనంజయుండు దేవలోకంబుచూడ నీ

శరీరంబుతోడనే పోయెనుగదా? అట్టిమహాశక్తిమంతుండయ్యు, వన
వాసాదిక్లేశము లనుభవింపవలసినవు డెల్లవిషయంబులు దైవాధీనంబుల
కాని పురుషప్రయత్నసాధ్యములుగావని నిశ్చయంబుగనే తెలియు
చున్నారు. ఈశౌర్యసాహసాదిగుణంబులెల్లఁ గర్మకృతంబులని తెలిసి
ఐశ్వర్యానైశ్వర్యంబులు దైవాయత్తంబులనియు నెఱింగి యను
భవించినకాలంబునయు విషయోపభోగంబున కంతులేదని నిశ్చయించి
తుదకుఁ గాలస్వరూపుఁ డగు భగవంతునికంటెఁ గారణంబు వేఱులేదని
బలిచక్రవర్తి యెఱింగెను. ప్రతిజంతువునకును కన్నులు, చెవులు,
ముక్కు, చర్మము, నాలుకయు జ్ఞానసాధనంబు లగు నింద్రియం
బులు. వానికిఁ బ్రీతికలిగించిననే కాని తృష్ణ నశింపదు. జ్ఞానవంతుండగు
పురుషుండు వానిని నిరోధించి దుఃఖహీనుండగును. కొందఱట్లు తలం
పక పురుషకారంబె సమ్యక్ప్రయుక్తంబై ఫలించునందురు. పురుషుండు
మాతాపితరులకర్మంబున జనించి భోజనంబున వృద్ధినొందుచున్నాఁ
డనియు నందురు. ప్రియాప్రియంబులు సుఖదుఃఖంబులు లాభాలాభం
బులు నిందాప్రశంసలు యథాప్రాప్తంబుగఁ బురుషుఁ డనుభవింపవలయు
ననియు నందురు. మఱికొందఱు దీనిని సహింపక యపరాధంబు కార
ణంబుగా నీకర్మవాదులను గర్హింతురు. వారు సాధువృత్తంబును
మాత్రమే ప్రశంసింతురు. పాండవులతోడ విరోధంబుఁగొన్న నిన్నెం
తయు గర్హించుచున్నాఁడను. ఆవిరోధంబువలనఁ గౌరవులకెల్ల నాశం
బాసన్నం బయియున్నది. నావాక్యంబులు నీవాదరింపవైతివేని నీకర్మా
పరాధంబువలన నగ్ని వనంబులంబోలె కృష్ణసారథి యగునర్జునుండు
కురుకులంబెల్ల దహించివైచును. ఎల్లలోకంబులందును నీవొక్కఁడవు
మాత్రమే ద్యూతకాలంబున నాత్మశ్లాఘాపరాయణుం డగుపుత్త్రునకు
వశుండవై శమ మభిలషింపవైతివి. దానిపరిణామ మిప్పు డాలోకిం
పుము. అనాప్తులను సంగ్రహించుటయు నాప్తుల నిగ్రహించుటయుఁ
గారణంబులుగా దుర్బలుండవై యనంతమగు నీభూమండలమును
బాలింప నీవర్హుండవు కాఁజాలవు. రథవేగంబునఁ జాల నలసియున్నవాఁ
డను. నాకనుజ్ఞ యొసంగితివేని గృహంబున కరిగి నిద్రింతును. ప్రాతః
కాలంబున సభామధ్యంబునఁ గౌరవులెల్లరు గలిసియుండి ధర్మనందను
వచనంబు లాకర్ణింతురుగాక. అని పలికెను. ఆతనిమాట లాలించి

యంబికానందనుండు 'సంజయా! నీవు గృహంబున కరుగుము. సుఖంబుగ నిద్రింపుము. ఉదయముననే యేతెంచి కౌరవులకెల్లరకు నజాతశత్రుని వచనంబు వినిపింపు'మని యాజ్ఞాపించి యాతని నింటికిఁ బంపెను.

అనంతరము ప్రజ్ఞాచక్షుండు ద్వారపాలకునిం బిలిచి విదురు నిపుడు చూడ మనసరంబై యున్నది కావున వేగమ యాతని నిటకుఁ దోడితెమ్మని యాజ్ఞాపించె. వాఁడును సత్వరం బరిగి విదురుని దర్శించి యతనితో మిమ్ముఁ జూడవలయునని మహారాజు వాంఛించియున్నవాఁడని నివేదింప నాతండును నాక్షణంబున రాజమందిరమునకరిగి ద్వార పాలకనివేదితాగమనుండై రాజానుమతింబడసి మందిరప్రవేశం బొన రించి సింహాసనాసీనుండగు నరపాలునిఁ జేరి చేతులుజోడించి నమస్క రించి 'మహారాజా! నేను విదురుండను మీయానతిం దలఁదాల్చి వచ్చి నాఁడను. నన్ను రావించినకార్య మేది? మీయానతి నిర్వర్తింప సిద్ధమై యున్నాఁడను. నాకాజ్ఞ యొసంగు'మని విన్నవించె. ఆతనివాక్యంబు లాలించి ధృతరాష్ట్రుండు 'విదురా! సంజయుండు పాండవులకడనుండి యిప్పుడ వచ్చి నన్ను మిగుల గర్హించి యింటికేఁగినవాఁడు. రేపకడ సభామధ్యంబున నజాతశత్రునివాక్యంబు లెఱింగించును. ఆధర్మనంద నునివాక్యం బిప్పుడు నాకెఱుఁగరాకున్నది. దానివలన నాయంగంబులు తపించుచున్నవి. కంట నిదుర చొప్పడకున్నది. తాపంబు నొందుచు నిద్రా రహితుం డగువాని కేవాక్యంబు లుచితంబు లగునో యావాక్యంబు లిపుడు నాకుఁ జెప్పుము. నీవు ధర్మార్థంబులందుఁ గుశలుండవుకదా? పాండవులకడనుండి సంజయుం డరుదెంచినప్పటినుండియు నామనంబు నకు శాంతిలేదు. ఇంద్రియంబులెల్ల ప్రకృతి తప్పియున్నవి. సంజ యుండు సభయం దేమి పలుకునో యనియె నాకు గాఢంబుగఁ జింతఁ గలుగుచున్నది. కావున, విదురా! యజాతశత్రుని యభిమతంబెల్ల నా కిప్పు డెఱింగింపుము దానివలన మనకెల్లరకును హితంబును బ్రజల కెల్లరకు సుఖంబును లభించును' అని పలికెను.

### విదురుండు ధృతరాష్ట్రునకు నీతి యెఱింగించుట

అనిపలికిన ధృతరాష్ట్రునివచనంబు లాలించి విదురుండు 'రాజా! బలవంతుఁడు పైనెత్తివచ్చినను, దుర్బలుండైనను, సాధనహీనుండైనను,

చోరులచే ధనము గోల్పడినవాఁడైనను, కాముకులుం డైనను, చోరుం డైనను నరునకు నిద్రపట్టదు. రాజా! నీ వీచెప్పంబడినదోషంబులం దేదేని నొక్కదోషంబునకు వశుండవు కాలేదుకదా? పరవిత్తంబులం దత్యాశగలిగి తపించుచుండలేదుకదా? ఏల నీ కిట్లు నిద్ర రాకుండుట యని యడిగెను. అంత ధృతరాష్ట్రుండు ధర్మ్యంబు నిశ్శ్రేయససాధనంబు నగు నీవాక్యంబు వినవలతును. ఈరాజర్షి వంశమందెల్ల నీవు మిగులఁ బ్రాజ్ఞ సమ్మతుండవుకదా యని పలికె. ఆపలుకు లాలించి విదురుండు, సర్వలక్షణ సంపన్నుం డగు రాజు ముల్లోకంబులు పాలింపంజాలును. యుధిష్ఠిరుండు నిన్నెల్లప్పుడును ప్రేష్యభావంబున సేవించుచుండువాఁడు. నీ వాతనిని వనంబున కనిపితివి. నీవు రాజవంశమునందు రాజలక్షణహీనుండవై యున్నవాఁడవు. నేత్రశక్తిగ్గుటచే ధర్మాధర్మవిచక్షణతయందును నీకు శక్తితగ్గినది కాఁబోలును. ఆనృశంసస్వభావంబునను, దయవలనను, ధర్మా పేక్షవలనను, సత్యపరాక్రమంబువలనను, నీయందలి గురుబుద్ధివలనను ధర్మనందనుండు వచింపరాని క్లేశంబులెల్ల సహించుచున్నవాఁడు. దుర్యోధ నునియందు శకునియందును గర్ణదుశ్శాసనులందును నొరతనమెల్లనుంచి నీవె ట్లైశ్వర్యం బనుభవింపఁ దలంచుచున్నవాఁడవు? ఆత్మానాత్మవివే కము, కర్మసమారంభము, క్షమాగుణము, నిత్యధర్మపరాయణత్వంబును నెవ్వనియర్థంబులం దెడపకయుండునో యతఁడు పండితుం డనంబడును. రాజా! ఒక్కవృక్షంబువలననే స్రుక్కుద్రోణులు, పేఠనపీడనులు నను యజ్ఞపాత్రంబులు జనించుచున్నవి. అట్లే మంచియుఁ జెట్టయుఁగూడ నొక్కనివలననే కలుగుచున్నవని యెఱుంగుము. ప్రశస్తవస్తువులసేవిం చుట, నిందితకార్యంబుల విసర్జించుట, ఆస్తికత్వము, శ్రద్ధాళుత్వమునను నవి పండితలక్షణములు. క్రోధము, హర్షము, దర్పము, సిగ్గు, స్తంభము, మాన్యుండ ననుగర్వము నెవ్వనియర్థంబుల బాధింపకుండునో వాఁడు పండితుం డనఁబరఁగును. ఎవనికార్యంబులనుగాని మంత్రంబులనుగాని పరు లెఱుంగఁజాలకుందురో చేసినకార్యంబులుమాత్రమే తెలియఁగలు గుదురో యతఁడు పండితుం డనంబడును. ఎవనియొక్క ప్రజ్ఞ యెల్లవిష యంబులందు నవ్యాహతంబుగఁ బ్రసరించునదై ధర్మార్థంబుల ననుస రించియుండునో; యెవఁడు కామంబువలనఁగూడ నర్థంబునే యభిలషిం చునో వాఁడు పండితుం డగును. పండితబుద్ధిగలవరులు శక్తినతిక్ర

మింపకుండనే కార్యంబు లొనరింప నిశ్చయింతురు. శక్తినిమీఱకయే కార్యంబు లొనరింతురు. దేనినిఁగూడ నవమానింపరు. చిరకాలము వినుట వేగముగానే తత్త్వ మెఱుంగుట బాగుగ నెఱింగియే యర్థంబు సేవించుట కామమునకు వశుఁడు గాకుండుట తన్నడుగనిచే పరార్థంబున వాగ్వ్యయము గావింపకుండుటయు ననునవి పండితునకు ముఖ్యమైనధర్మంబులు. పండితు లెన్నండును దుర్లభవస్తువుల గాంక్షింపరు. నశించినదానికి వగవరు. ఎంతటి యాపదలందును మోహావిష్టులుగారు. ఎవండు మొదట బాగుగ నిశ్చయించి కార్యంబునకు గడంగి మధ్య నెన్ని విఘ్నములు సంభవించినను విడువక సఫలం బగు లాభంబొందునో యట్టివశ్యేంద్రియుండు పండితుం డనంబడును. పండితు లెప్పుడు నార్యకర్మాభిరతులై యైశ్వర్యకారణంబు లగుకర్మంబు లాచరింతురు. ఎప్పుడును హితులఁ గోపింపరు. తమకు సమ్మానం బగునెడల హర్షంబున నుప్పొంగరు. అవమానంబుగలుగు నెడఁ బరితాప మొందరు. ఎల్లప్పుడును గంగాహ్రదంబుమాడ్కి నక్షోభ్యులై యుందురు. సర్వభూతంబులతత్త్వం బెఱింగినవాఁడును సర్వకర్మంబులయోగంబులు దెలిసినవాఁడును నెల్ల మనుజులయుపాయంబు లెఱింగినవాఁడు నగునరుండు పండితుం డనం బరఁగును. అడ్డులేనివాక్ప్రవాహముఁగలవాఁడు లోకవృత్తాంతములు కథలు నెఱింగినవాఁడు తర్కవేత్త సమయస్ఫూర్తిగలవాఁడు శీఘ్రంబుగ గ్రంథముచెప్పు నేర్పుగలవాఁడు నగునరుండు పండితుఁ డనఁబడును. ఎవ్వనిశాస్త్రంబు ప్రజ్ఞ ననుసరించియుండునో ప్రజ్ఞయు శాస్త్రంబు ననుసరించియుండునో యెవ్వఁ డెన్నండు నార్యమర్యాద నతిక్రమింపక ప్రవర్తించునో వాఁడు పండితబిరుదమందును. గొప్ప ధనమును విద్యయు నైశ్వర్యంబు నొందియును నెవ్వఁడు గర్వరహితుఁడై చరించునో యాతఁడు పండితుఁ డనఁబడును. శాస్త్రంబు లధ్యయనంబుగావింపనివాఁడు మిగుల గర్వించువాఁడు దరిద్రుండై గొప్ప కోరికలుగోరువాఁడు కర్మ కావింపకయే యర్థంబుల నభిలషించువాఁడును సజ్జనులచే మూఢుఁ డనంబడును. ఎవ్వఁడు స్వార్థంబువిడిచి పరార్థంబునం బ్రవర్తించునో మఱియు మిత్రులందుఁ గపటవృత్తిని మెలంగునో వాఁడు మూఢుండనబడును. కామరహితులఁగామించుచుఁ, దన్ను గామించువారలఁ బరిత్యజించుచు బలవంతునితో ద్వేషించుచు

నెఱపకుండునో వాఁడు మూఢుండు. వాఁడు శత్రుని మిత్త్రుఁడని
పెట్టుకొను. మిత్త్రునితో విరోధించి చంపును. దుష్టం బగుకర్మంబు లాచ
రించును. కార్యంబులఁ దుదముట్టనీక విలంబమున జరుపుచుండును. ఎల్ల
యెడలను సంశయగ్రస్తుండై యుండును. శీఘ్రంబుగ గావింపవలసిన
పనులను చిరకాలమునకుఁగాని యొనరింపఁడు. మూఢుండు పితృదేవత
లకు శ్రాద్ధ మాచరింపఁడు. దైవతములఁ బూజింపఁడు. మంచిమనస్సు
గలస్నేహితుని సంగ్రహింపఁడు. ఎవ్వండు పిలువకయే చొఱఁబడునో
యడుగకయే పెక్కుమాటలు చెప్పునో దన్ను విశ్వసింపనివానిని విశ్వ
సించునో వాఁడు మూఢుఁ డనంబడును. తాను ప్రవర్తించుమార్గంబు
ననే ప్రవర్తించుచున్న ప్రవరునియందు దుష్ప్రవర్తకుఁడను నింద నారో
పించును. సమర్థుండుగాకున్నను నకారణంబు గోపించుచుండు నెవ్వఁడో
యట్టినరాధముండు మూఢతముం డనంబరఁగును. తనబలం బెఱుంగక
ధర్మార్థంబుల వీడి యే ప్రయత్నంబు గావింపకయ దుర్లభఫలంబు లెవ్వఁ
డాశించునో వాఁడు మూఢబుద్ధి యనంబడును. ఎవఁడు శాసింప
శక్యముగానివానిని శాసించుచు శిష్యుని శాసింపక విడచునో, లుబ్ధుని
ధనాశచే సేవించునో వాఁడు మూఢుం డనఁబడును. ఎవఁడు తానొక్క
రుండ సంపన్నం బగునన్నంబు భుజించునో, తానొక్కరుండ శోభనంబు
లగువలువలఁ దాల్చునో, భృత్యులకుఁ బంచియీయక తానొక్కరుండ
యెవ్వం డైశ్వర్య మనుభవింపఁ గోరునో వానికంటె నృశంసతరుం డీ
లోకంబున నెందేని గలఁడా ? లోకంబున నొక్కఁడు పాపకార్యంబు
లాచరించి యర్థంబు లార్జించును. వాని నేకరించినయర్థంబు బహుజను
లనుభవింతురు. అయినను ఫలభోక్తల కిసుమంతయుఁ బాపంబు గలు
గదు. పాప మాచరించినవాఁడుమాత్రమే దుర్గతు లనుభవించును.
మిగుల నేర్పరి యగువిలుకాఁడు విడిచినతీవ్రబాణం బొక్కనినిమాత్రమ
చంపఁగలుగును. ఒకప్పుడు గుఱితప్పి చంపకయపోవును కాని బుద్ధిమంతు
నిచేఁ బ్రయోగింపఁబడిన నీతి రాజును వానిరాజ్యంబెల్లనుగూఁడ బరి
మార్చును. ఒక్కబుద్ధిచేతఁ గార్యాకార్యంబులు రెంటిని నిశ్చయించి
మిత్త్రోదాసీనశాత్త్రవులను మువ్వురను సామదానభేదదండంబు లను
నాల్గుపాయములచే వశపఱిచికొని పంచేంద్రియంబులును జయించి సంధి
విగ్రహయానాసనద్వైధీభావసమాశ్రయంబు లాఱింటినెఱింగి, వెలఁది

జూదంబు, వేఁట, పలుకు, ప్రల్లదము, మద్యపానంబు, దండపారుష్యంబు, అర్థంబుల దుర్వ్యయము ననునేడువ్యసనంబులు వీడి ప్రవర్తించువాఁడు వివేకియై సుఖించును. విషరసం బొక్కనిని జంపును. శస్త్రముగూడ నొక్కనిని వధించును. మంత్రవిప్లవంబన్ననో రాజు నాతనిరాష్ట్రంబును గూడఁ జంపును. ఒక్కరుండై యెన్నండు నర్థచింతనంబు గావింపంజనదు. భుజింపరాదు. ఒక్కరుండై యెన్నండు నర్థచింతనంబు గావింపంజనదు. ఒంటిగా మార్గంబున నడువరాదు. ఎల్లరు నిద్రించియుండ నొక్కరుండ మెలఁకువతో నుండజనదు. సాగరంబున నౌకవలె సత్యం బొక్కటియ స్వర్గంబునకు సోపానంబై విరాజిల్లుచున్నది. దానికంటె వేఱుమార్గంబు స్వర్గలోకగమనంబునకు లేదని నీవెఱుంగకున్నవాఁడవు. క్షమావంతుల యెడ నొక్కటిమాత్రమె దోషంబు గాన్పించుచున్నది. వెదకిచూచి నను రెండవదోషం బగపడదు. ఆదోష మేదంటివేని క్షమావంతుఁడై యే భూతంబుల హింసింప నిచ్ఛలేని యాతని మూఢులు చేతగానివాఁడని పరిహసింతురు. అంతమాత్రమున నాతనికి క్షమ దోషంబని తలంపఁగూడదు. లోకంబున శాంతికి సమానం బగుబలవద్వస్తువు లేనేలేదు. శాంత మసమర్థులకు గుణంబు; శక్తిమంతుల కది పరమాలంకారము. శాంతిచే లోకంబెల్ల వశంవదమై యుండును. క్షమ కసాధ్యం బగున దేదియు లేదు. ఏమహావీరునికరంబున శాంతి యనుఖడ్గంబుండునో వానిని దుర్జను లేమిచేయఁగల్గుదురు? గడ్డిలేనిచోటఁ బడిన నిప్పుతునుక తాన చల్లారి నశించునుగదా? లోకమునం దొక్కధర్మము మాత్రమే శ్రేయస్సాధనమైనది. క్షమాగుణం బొక్కటిమాత్రమే శాంత చేకూర్చునది. విద్యయొక్కటియే తృప్తిగలిగించునది. అహింస యొక్కటియే సుఖావహమైనది. సర్పంబు బిలశయంబు లగుపురువుల భక్షించురీతిని విరోధరహితుం డగు రాజును ప్రవాస మెఱుంగనిబ్రాహ్మణుని నీయిర్వురను భూమి గ్రసించివైచును. ఎప్పుడును పరుషవాక్యంబులాడకుండుటయు నయోగ్యుల గౌరవింపకుండుటయు నను రెండు కార్యంబులు కావించునరుం డీలోకంబున నుత్తమత్వమున విరాజిల్లును. పురుషపుంగవా! కామితంబులగువస్తువులనే కామించుస్త్రీలును పూజితులనే పూజించునరులును బరప్రత్యయకారు లగుచున్నారు. అలభ్యవస్తువుల వాంఛించు దరిద్రుండును సామర్థ్యములేనిదే శాసింప నెంచు

మార్గంబునఁ బ్రవర్తింపక శరీరశోషణంబు గావించు కంటకప్రాయు లగు మనుజులు, కర్మారంభము లేని గృహస్థుండును, కార్యాసక్తుం డగు భిక్షుకుండును, స్వకీయకర్మంబులచే నన్ని తెఱంగులఁ జెడుదురు. ఎవ్వఁడు ప్రభుత్వ ముండియుఁ క్షమాగుణము గలిగియుండునో యెవ్వఁడు దరిద్రుండయ్యు యథాశక్తిగ దానం బాచరించుచుండునో వార లిరువురును మహాతేజంబులతో స్వర్గంబున విరాజిల్లుదురు. న్యాయాగతంబగు విత్తంబునకు నపాత్రదానంబును పాత్రాదానంబు ననునవి రెండుదోషంబులై యుండును. ధనవంతుండయ్యు నెవ్వఁడు సత్పాత్రదానంబు గావింపఁడో వానిని, దరిద్రుండయ్యు నెవ్వఁడు తపం బాచరింపఁడో వాని నిరువురను కంఠంబున గొప్పబండఱాయిఁ గట్టి నీటముంచి చంపంవగును. యోగయుక్తుం డగు పరివ్రాజకుండును యుద్ధంబులం దపరాఙ్ముఖుండై ప్రాణంబులు వీడినశూరుండును వీరిరువురును సూర్యమండలమును భేదించి పుణ్యగతిఁ బొందుదురు. మానవుల కెల్ల నుత్తమమధ్యమాధమంబులను మూఁడు న్యాయంబులు గలవు. వాని ననుసరించి పురుషులు నుత్తమాధమమధ్యములన మూఁడు తెఱంగులఁ బరగుచున్నవారు. అట్టిపురుషుల నెప్పుడును వారివారి కుచితంబు లగుకర్మంబులందు నియోగింపంవగును. లోకంబున భార్య, దాసుఁడు, కుమారుండు ననుమువ్వురు నిర్ధనులనం బడుచున్నారు. వీరికి ధనమం దధికారం బెంతమాత్రమును లేదు. వారలార్జించినను వారలఁ బోషించువానికే యాధనము చెందును. పరద్రవ్యాపహరణము పరస్త్రీసంపర్కము మిత్రపరిత్యాగము ననుమూఁడు దోషంబులు నరకంబునకు మార్గంబులు, నాత్మవినాశహేతువులునై యుండును. వీనివలన నరుఁడు తప్పక క్షీణించును. కామముఁ గ్రోధము లోభము ననునవికూడ నట్లే నరకద్వారములై యున్నవిగావున వీనిని విడువవలయును. వరంబులొసంగుట, రాజ్యంబు, పుత్త్రజననము నను మూఁడు నొకయెత్తును శాత్రవులగష్టములనుండి విడుచుట యనున దొక్కటియును సమానము లగుసత్కార్యములు. భక్తుండును, దన్ను సేవించువాఁడును, నీవే గతి యనువాఁడును నీముగ్గురు శరణాగతులను నెంతటివిషమసమయములందును విడువంజనదు. మహాబలుం డగు రాజు నాలుగుదోషంబు లవశ్యంబును విడువవలయును. అల్పబుద్ధులతోడ మంత్రంబు కూడదు. దీర్ఘసూత్రులతోడను, నట్లే యలసులతోడను,

స్తుతిపాఠకులతోడనుగూడ సమాలోచింపంజనదు. వీరు నలువురును గృహస్థధర్మంబునందున్న నీయింట భుజించుచుండవలయును నేకాని, వీరితోఁ గార్యాలోచనంబుమాత్రము సలుపరాదు. మఱియు, వృద్ధులగుదాయాదులను, పేదఱికంబునున్న సత్కులజాతులను, దరిద్రులగుమిత్రులను, సంతానములేనిచెలియండ్రను నెల్లపుడు నాదరంబున నింటనుంచి పోషించుచుండవలయును. తొల్లి సురాచార్యుండు తన్నడిగినయింద్రునకు సద్యఃఫలంబుల నాల్గింటి నెఱింగించెను. నేనిపుడు నీకు వాని నెఱింగింతు నాకర్ణింపుము. దేవతలసంకల్పము, ధీమంతులప్రభావంబు, విద్యావేదులయెడవినయమును, పాపకర్ములయొక్కవినాశమును సద్యఃఫలదంబులని యెఱుంగుము. మానాగ్నిహోత్రంబు, మానమౌనంబు, మానాధ్యయనంబు, మానయజ్ఞంబు, ననునాలుగును యథావిధి నాచరించిన నభయప్రదంబు లగును. అవియే విధిహీనంబుగ నాచరింపఁబడిన మహాభయంబు లాపాదించును. తండ్రి, తల్లి, యగ్ని, యాత్మ, గురువు ననునేవురును బంచాగ్ను లనంబడుదురు. ఈపంచాగ్నుల నతిప్రయత్నంబునఁ బురుషుండు పరిచరింపవలయును. దేవతలను, పితరులను, మనుష్యులను, భిక్షువులను, నతిథులను నీపంచదేవతలను బ్రయత్నంబునఁ బూజించువానికి సకలశ్రేయంబులును లభించును. మిత్రులు, నమిత్రులు, మధ్యస్థులు, నుపజీవ్యులు, ఉపజీవులు ననువారేవురును బురుషుం డెక్కడ కేఁగిన నక్కడనే లభింతురు. పంచేంద్రియములుగల మానవున కొక్కయింద్రియమేని లోపించినచో వారిప్రజ్ఞయెల్లరంధ్రముగలపాత్రమునలన నుదకంబు గాఱిపోయినవడువున జాఱిపోవును. ఐశ్వర్యము నపేక్షించుమనుజుండు నిద్ర, తొందరపాటు, భయము, క్రోధము, దీర్ఘసూత్రత్వము ననునాఱుదోషంబులు విసర్జింపవలయు. మఱియుఁ బూరుషుండు శుభము లాశించునేని ప్రవక్తగాని గురువును, వేదాధ్యయనరహితుం డగుఋత్విజు, రక్షింపకున్నరాజు, అప్రియంబులుపలుకుభార్య, గ్రామనివాసంబు నాశించుగోపాలుఁడు, వనవాసంబు నాశించుమంగలి యనునాఱుగురుపురుషులను నదీమధ్యంబున బ్రద్దలైననౌకను వీడినట్లు విడువవలయును. సత్యంబు, దానంబు, అనాలస్యము, అసూయారాహిత్యము, క్షమ, ధైర్యము ననునాఱుగుణంబులను బురుషుం డెన్నండును విడువంజనదు. అర్థాగమంబు, నిత్యంబు

నారోగ్యము, ప్రియవాదిని యగుభార్య, వశుండగుపుత్త్రుండు, అర్థప్రదమగువిద్య, ప్రియకారులగుభార్యయు ననునాఱును జీవలోకంబునకు సుఖంబులైనవి. కామక్రోధలోభమోహమదమాత్సర్యంబులను నాత్మయందే నివసించునార్వురు శత్త్రువుల నెవఁడు వశపఱుచుకొనునో వాఁడు పాపంబువలనఁగాని యనర్థంబులవలనఁగాని బాధ ననుభవింపఁడు. వాఁడు విజితేంద్రియుఁడై సుఖంబు ననుభవించును. లోకంబున నార్వురమనుజు లార్వురుమనుజులవలన జీవింతురు. ప్రమాదశీలునివలన చోరులు జీవింతురు. వ్యాధిగ్రస్తునివలన వైద్యుఁడు జీవించును. కామాతురునివలన స్త్రీ జీవించును. యజ్ఞమాచరించువానివలన యాగము చేయించువాఁడు బ్రతుకును, మూర్ఖునివలనఁ బండితుఁడు జీవించును. గోవులు, సేవకవృత్తి, వ్యవసాయము, భార్య, విద్య, శూద్రస్నేహము ననునాఱును నొక్కక్షణమైన నుపేక్షించిన నశించును. విద్యలెల్ల గ్రహించినశిష్యుండు గురువును, భార్యతోఁ గాఁపురము సేయువాఁడు తల్లిని, కామంబు లేనివారు స్త్రీలను, కార్యంబు నెఱవేఱినవాఁడు ప్రయోజకుని, యేఱు దాటినవారు నావను, ఆరోగ్యవంతులు వైద్యులను, నీయార్వురు నార్వురు పూర్వోపకారులుగావించిన యుపకారంబులు మఱచి యవమానింతురు. రోగములు లేకుండుట, ఋణములు లేకుండుట, ప్రవాసంబుననుండక స్వస్థలమున నివసించుట, సజ్జనులతోడిసావాసము, తాను గోరినవృత్తి, భయము లేకవసించుట యనునాఱును మనుజులకు సుఖకరములు. ఈర్ష్యాళువు, ఘృణావంతుఁడు, సంతోషము లేనివాఁడు, క్రోధస్వభావముగలవాఁడు, నిత్యము శంకావిష్టుండు, పరైశ్వర్యంబులవలన జీవించువాఁడు ననునాఱుగురు నెప్పుడును దుఃఖంబు లొందుచుందురు. స్త్రీలయం దత్యాసక్తిగలిగియుండుట, జూదమాడుట, వేటయం దతికుతూహలము, మద్యపానం బొనరించుట, కఠినంబులగు మాటలాడుచుండుట, స్వల్పదోషమునకై యధికదండనము విధించుట, ధనము దుర్వ్యయముగావించుట, యనునవియేడును సప్తవ్యసనము లనంబడును. ఈవ్యసనములను రాజు లెల్లపుడును విడువవలయును. వీనివలన నెంతటిరాజులును నశింతురు. మనుజునకు నాశ మాసన్నంబయినపుడె యిట్టిదుర్గుణంబులు పొడసూపుచుండును. తొలుత బ్రాహ్మణులను ద్వేషించుట, బ్రాహ్మణులతో విరోధించుట, బ్రాహ్మణ

ద్రవ్యంబు లపహరించుట, బ్రాహ్మణులఁ జంపఁదలంచుట, బ్రాహ్మణనింద గావించుట, బ్రాహ్మణప్రశంస నసహ్యించుకొనుట, ఏకార్యములందును బ్రాహ్మణుల స్మరింపకుండుట, బ్రాహ్మణులు యాచించినపుడు వారలఁ గోపించుటయును ననునెనిమిదిదోషములును మనుజునకు బాగుగఁ దెలిసి కొని యెన్నఁడును వానియంతంబోక విడువవలయును. మహేంద్రుఁ డంతవాఁడైన నీదోషంబులు వినాశము గలిగించును. రాజా! హర్షం బునకుఁగూడఁ గారణంబులగు నెనిమిదిగుణంబులు గలవు. అవియే మిగుల సుఖకరంబులుగూడ నగును. మిత్రులతో సమాగమము, గొప్ప ధనలాభము, కుమారుని కౌఁగిలించుకొనుట, మైథునమున సమరతం బగు, సమయంబునఁ బ్రియవచనంబులుపలుకుట, జనసంఘమున నౌన్న త్యము, కోరినవస్తువులభించుట, జనులచేఁ బూజింపఁబడుచుండుటయు ననునెనిమిదిగుణంబులు మానవులకు దీప్తిగలిగించును. మఱియు ప్రజ్ఞా వంతుండగుట, సత్కులమున జనించుట, దమంబు, శాస్త్రములుచదు వుట, పరాక్రమంబు, మితభాషిత్వము, తనకున్నదానిలో శక్తికొలఁది దానమాచరించుట, చేసినమేలు మఱవకుండుటయు ననునెనిమిదిగుణం బులచే నరుఁడు మిగులఁ దేజరిల్లుచుండును. రెండుకన్నులు, ముక్కు రంధ్రములు, చెవులు, నోరు, అపానమార్గము, శిశ్నోపస్థములు నను తొమ్మిదిద్వారంబులుగలిగి వాతపిత్తకఫలంబు లనుమూఁడుదూలంబులు గలిగి శబ్దస్పర్శరూపరసగంధంబు లనుగుణంబులు పంచసాక్షులుగానున్న మనదేహంబు క్షేత్రజ్ఞున కధివాసం బగుగృహమని యెవ్వఁడెఱుంగునో వాఁడు విద్వాంసుండు, సుత్తమకవియు నగుచున్నాఁడు. రాజా! మత్తుండు, ప్రమత్తుండు, సున్మత్తుండు, శ్రాంతుండు, క్రుద్ధుండు, నాఁకలి గొన్నవాఁడు, తొందరపనిగలవాఁడు, లుబ్ధుండు, భయాకులుండు, కామ వశుండు నను పదుగురు ధర్మంబు నెఱుంగంజాలరు. కావున నరుం డీ పదిదోషంబులందును దగులరాదు.

ఈవిషయంబున సుధన్వుం డను నసురేంద్రుండు తనపుత్రునకై యుపదేశించినగీతముల నార్యు లుదాహరింతురు. ఆయుపాఖ్యానంబు దెలి పెద; సావధానుండవై యాకర్ణింపుము. ఏరాజు కామక్రోధంబులవిడిచి సత్పాత్రములందు ధనత్యాగము గావించుచు ఎల్లయర్థంబులందును విశేషంబులఁ దెలిసికొనుచు శీఘ్రకారియై యుండునో యాతని నెల్ల

వారలు ననుసరించి గౌరవింతురు. ఎవ్వఁడు మనుష్యులకు విశ్వాసము గలిగింప నేర్పరియై దోషంబులు ప్రకటంబులైన వారల దండించుచు, దండమున సరియైనరీతిని విధించుచు, నోర్పుగలిగియుండునో, యానరపాలున కెల్లసంపదలు లభించును. దుర్బలుండగువాని నెవ్వని నవమానింపరాదు. మర్మాన్వేషణంబున ననహితుండై శాత్రవుని బుద్ధిపూర్వకంబుగ సేవింపవలయును. బలాధికులతోఁడ నెన్నండును యుద్ధ మాచరింపరాదు. మంచిసమయ మాసన్నంబగునపుడు పరాక్రమింపవలయును. ఆపద లొంచెనను ఖేదపడరాదు. పరాకులేకుండ సంతతము ప్రయత్నము గావించుచుండవలయును. అవసరమయినపు డెంతటిదుఃఖంబులను సహింపవలయు. ఎవ్వఁ డిట్లాచరించునో యానరపాలుండు ధురంధరుండై శాత్రవులనెల్ల జయించి యవక్ర పరాక్రమంబున భూమి పాలింపఁగల్గును. అనర్థకంబుగ గృహమువీడి పరదేశంబులకేఁగుట, పాపాత్ములతోఁ జెలిమి చేయుట, పరస్త్రీలతో సంగమము, దంభము, దొంగతనము, పిశునత్వము, మద్యపానము ననుదుర్గుణంబు లెవ్వఁడు దరిజేరనీయఁడో వాఁడు సుఖంబుగ జీవించును. ధర్మార్థకామంబులను సంరంభముతో నారంభింపరాదు. తన్నడిగినపుడు వాస్తవమే పలుకుచుండవలయును. మిత్రులకార్యంబులయెడ వివాద మాచరింపఁగూడదు. తన్ను గౌరవింపలేదని కోపింపఁజనదు. మాధ్య మెన్నండును వహింపఁజనదు. ఎప్పుడును గోపింపక దయగలిగియే యుండఁదగును. దుర్బలుండైనయెడ నెవ్వరితోడను విరోధింపఁగూడదు. అతిప్రసంగముగ నేవిషయమును బలుకఁగూడదు. వివాదంబులందు ఓరిమిగలిగియుండవలయును. ఎవ్వఁడిట్లాచరించుచుండునో వాఁ డెల్లవిషయములందును గౌరవమునొందును. ఎన్నఁడు నుద్ధతంబగునలంకారము ధరింపఁగూడదు. పరులఁగూర్చి పౌరుషము చేతనైనను నాత్మశ్లాఘన మాచరింపరాదు. కోపపరవశుండైయున్నను కటువాక్యంబు లాడఁగూడదు. ఎవ్వఁ డిట్లు చరించునో వాని నెల్లజనులు నధికముగఁ బ్రేమింతురు. చల్లారినవిరోధమును మరలఁ బయలుదీయరాదు. ఎన్నండును దర్పింపఁజనదు. శాంతచిత్తుండై యుండవలయును. దురవస్థపాలై నపుడైన నకార్యంబు లాచరింపఁగూడదు. ఎవ్వఁ డిట్లు ప్రవర్తించునో వానిని ఆర్యశీలుండని ప్రాజ్ఞులు ప్రశంసింతురు. తనకెంతటిసుఖంబు లభించినను బ్రహర్షపరవశుండు గాఁగూడదు. ఇతరులకు దుఃఖంబు

సంభవించినపుడు తాను హర్షింపఁజనదు. ఏదేనివస్తువు దానంబు గావించి యనంతరమిచ్చితినని విచారింపఁగూడదు. ఎవ్వఁ డిట్లు ప్రవర్తించునో వాఁ డార్యశీలుం డనఁబడును. దేశాచారంబులను గులమును జాతిధర్మములను ననుసరించి యెవఁడు ప్రవర్తించునో వాఁడు పరావరజ్ఞుం (మంచిచెడ్డ లెఱింగినవాఁ) డనఁబడును. అట్టివాఁ డెక్కడనుండునో యక్కడకే జనంబులు వత్తురు. వాని నెల్లరు ననుసరించుచు వానికిఁ బెద్దతనమిత్తురు. దంభము, మోహము, మాత్సర్యము, పాపకార్యములు, రాజద్వేషము, పైశునము, సంఘవైరము, మత్తులు, సన్మత్తులు, దుర్జనులు మొదలగునీచులతో వివాదమును దుష్కార్యంబు లెవఁడు విడిచి వర్తించునో వాఁడు ప్రాజ్ఞుండై ప్రధానుఁడగును. దమంబు, శౌచంబు, దైవభక్తి, మంగళంబులు, వివిధంబులగు ప్రాయశ్చిత్తంబులు, లోకవాదంబులు ననుసత్కార్యంబుల నెవ్వఁ డాచరించుచుండునో వానికి దేవతలభివృద్ధిఁగూర్తురు. వివాహం బెప్పుడును సమానులైనవారితోడ గావింపవలయును. హీనులతోడ నధికులతోడను గావింపరాదు. సమానులగు వారితోడనే చెలిమియు వ్యవహారమును సంభాషణములును గావింపవలయును. ఎవ్వఁ డిట్లాచరించునో యాతనినీతి యత్యుత్తమంబై ఫలప్రదంబగును. తనధనము నాశ్రితులకుఁ బంచియిచ్చి తాను మితంబుగానే భుజింపఁదగును. మితిలేనికర్మంబు లాచరించి మితమైనకాలము మాత్రమే నిద్రింపవలయును. అడిగనయెడ శత్రువులకైన నీయవలయును. ఎవ్వఁ డిట్టు లాదరించునో యట్టియాత్మవంతున కనర్థంబు లెప్పుడును దరిఁజేరవు. ఎవ్వనియొక్క కార్యప్రయత్నంబు లితరుల కెఱుఁగరాకుండునో ఎవనికార్యంబులు నితరు లెఱుంగకుందురో, ఎవని మంత్రంబు గుప్తంబుగానుండి బాగుగఁ బ్రయోగింపఁబడునో యట్టివాని యర్థం బెన్నఁడును గొంచెమైనను జెడుగునొందదు. ఎవండు సర్వభూతంబులకు శాంతి నాశంసించునో సత్యవచనుండు, మృదుశీలుండు, మానంబు నాచరించువాఁడు, శుద్ధస్వభావుండునై యెవ్వఁ డుండునో వాఁడు జ్ఞాతులమధ్యంబున జాతిరత్నంబువోలె వెలుంగును. ఎవ్వఁడు లజ్జాస్వభావము గలిగియుండునో వాఁడు సర్వలోకంబులకును గురుపదం బొందును. వాఁ డనంతతేజస్కుండు సమనస్కుండు సమాహితుండునై తేజంబున సూర్యునకు సరియై వెలుంగును. శాపదగ్ధుండగుపాండు

నరపాలునకు వంశంబున బంచేంద్రులతో సమానులగు నేవురుకుమారు లుదయించిరి. నీవ యాబాలురనెల్లఁ బెంచి పెద్దవారింజేసి విద్యాబుద్ధులు గఱపితివి. వార లెల్లప్పుడును నీయాజ్ఞనే తలఁదాల్చుచున్నవారు. వారల కుచితం బగు రాజ్య మిచ్చి పుత్త్రులతోఁగూడ నానందించుచు సుఖింప బొలుపము, అట్లు కావించితివేని నిన్ను దేవతలుగానీ మనుష్యులుగానీ గర్హింపకుండురని పలికి విదురుం డూరకుండె.

అప్పుడు ధృతరాష్ట్రుండు విదురునితో, “తండ్రీ! నీవు ధర్మార్థంబులందు మిగుల దక్షుండవు; శుచివి. అట్లగుటం జేసి నిద్ర రాక తాపమొందువాని కేయేకార్యంబులు హితంబులో వాని నాచరింపుము. అజాతశత్రుని యాప్సితంబెల్లఁ బ్రజ్ఞాపూర్వకంబుగ నెఱింగింపుము. ఇపుడు మన కెయ్యది పథ్యమో కౌరవుల కేది శ్రేయస్కరమో దానిని దెలుపుము. నేను భయంబును శంకించుచున్నాఁడను. నాకింటి కెల్లయెడలఁ బాపమే గోచరం బగుచున్నది. ఆత్మ చాల వ్యాకులంబై యున్నది. నీవు సకలార్థవేదివి. కావున నజాతశత్రునియిష్టంబెల్ల నెఱింగింపుము. అని వచించెను. అదివిని విదురుండు రాజా! శుభంబుగానీ, యశుభంబుగానీ, ద్వేషింపఁదగినదిగానీ, ప్రియమైనదికానీ, యడుగనిదే యేదియుఁ జెప్పఁగూడదు. అడుగనిదే వచించువాఁడు పరాభవ మొందును. నీవిప్పుడు నన్నడిగితివి కానఁ గౌరవుల కేది హితంబగునో దానిని వచించెదను. ధర్మ్యంబు శ్రేయస్కరంబు నగు నావాక్యంబును సావధానుండవై యాలింపుము. ఉపాయంబులులేకయే ప్రయుక్తంబులై కపటద్యూతంబులు మొదలగువిధ్యోపేతంబు లగుకార్యంబులు సిద్ధించినను వానియం దెన్నండును మన స్సుంపకుము. అట్లే యుపాయంబులు యోగంబులు యోజించినను నేకార్యంబు సిద్ధింపదో దానియందు మనంబు నాయాసపఱుపరాదు. సప్రయోజనంబు లగుకర్మంబులందుఁ బ్రయోజనంబుల నాలోచింపవలయును. ఎప్పుడును గార్యంబులు బాగుగ నాలోచించియే కావింపవలయును. తొందరపడి యేపనియుఁ జేయరాదు. ప్రయోజనంబును గార్యములపరిణామంబును దనయభ్యుదయమును బాగుగ నాలోచించి యుచితకార్యంబుల నాచరించి యనుచితకార్యంబుల విడువవలయును. ఎవఁడు స్థానమునందు, వృద్ధియందు, క్షయమందుఁ, గోశమందు, జనపదమందును బ్రమాణం బెఱుంగక వర్తించునో వాఁడు రాజ్య

భ్రంశ మొందును. ఎవండు వీనియందుఁ బ్రమాణబుద్ధిగలిగి ధర్మార్థంబులఁ జక్కఁగఁ దెలియునో వాఁడు చిరకాలము రాజ్యమనుభవింపఁగలఁడు. రాజ్యము స్వాధీనమయినంతమాత్రమునఁ నయుక్తాచారుండై ప్రవర్తింపం జనదు. ఉత్తమం బగురూపంబును నుదిమి పాడు సేయుచుండం బున, నవినయంబు సర్వసంపదలను బోఁగొట్టును. మత్స్యము భక్ష్యంబుచే నావరింపంబడిన యుక్కుగాలమును ఆహారాశచే మ్రింగునే కాని, తరువాత సంభవించు నాపద నాలోచింపదు. ఏది యనుభవింపసాధ్యపడునో, యేది యనుభవించిన సుఖంబుగ జీర్ణమగునో, యేది పరిణామంబున హితంబగునో, దానినే యైశ్వర్యంబు గోరువాఁ డెల్లవేళల ననుభవింపం దగును ఎవఁడు చెట్లనుండి ఫలములందలి యాశచే లేఁతకాయలఁ గోయునో వాఁ డాఫలరసంబు లనుభవింపఁజాలకుండుటయే కాక వాని విత్తనముగూడ నశించును. ఎవఁడు సరియైన కాలంబున బాగుగఁ బండిన ఫలములను గోయునో వాఁ డాపండ్లవలన మంచిరసము నొందును. ఆపండ్లవిత్తనములవలన మరలమరలఁ బండ్లనుభవింపఁగల్గును. తుమ్మెదలు పూవులను హింసింపకయ వానివలన నెట్లు మకరందము గ్రహించునో యట్లే యొరులమనములు గందకుండగ నర్థంబుల సంగ్రహింపవలయును మాలాకారకుండు దండగూర్పుటకై యెట్లొక్కొక్కపూవుగోయుచు వృక్షంబులకు బాధకలుగనీయకుండునో యట్లే యొరులకు హింస లేకుండనే యర్థంబు లార్జింపవలయునుగాని, బొగ్గులమ్మువాఁడు బొగ్గులకై మొదలంట నఱికినట్లు మూలనాశంబు గావింపరాదు. పురుషుండు కార్యారంభమునకు మున్నుగ "నీకార్యమాచరించిన నాకేమిలాభము? దీనినాచరింపకున్న నాకేమి పోవును?" అని బాగుగ నాలోచించి లాభమున్న గార్యంబు లాచరింపవలయును. లాభము లేని కార్యంబులు విడువవలయును. కొన్ని కార్యంబుల నెప్పుడు నారంభింపనేరాదు. ప్రబలులతోడి వైరంబు మొదలగు కార్యంబు లెన్నండును జేయరాదు. కొన్ని కార్యంబుల కెప్పుడును ఫలప్రాప్తి గలుగదు. ఏలయన నాకార్యంబులందుఁ బురుషప్రయత్నంబు నిరర్థకం బగును. అనర్థకార్యాభిరతుండు నర్థకర కార్యపరాఙ్ముఖుండు నగు పురుషుని బ్రజలు స్త్రీలు షండుండగుపతిని విడిచినభంగిని విడనాడుదురు. ఎవ్వానియనుగ్రహంబు ఫలము లేనిదో, క్రోధంబు నిరర్థకమగునో, వానినిగూడఁ బ్రజలు రాజుగా నంగీకరిం

పడు. ప్రాజ్ఞుండగుమానవుండు గొన్ని కార్యంబులను లఘుమూలంబులు మహాఫలంబులు ననుకారణంబున శీఘ్రంబుగ నాచరించును. అట్టికార్యం బులయెడ దీర్ఘసూత్రత్వ ముపయోగింపడు.ఎవండు కంటిచే నెల్ల యర్థం బులను బ్రావున ట్లాదరమున మృదువుగా నాలోకించుచుండునో యాతఁ డేకార్యంబు లాచరింపకున్నను బ్రజలు వానిని మిక్కిలి ప్రేమిం తురు. కొన్నివృక్షంబులు బాగుగఁ బూచుటయేకాని ఫలింపవు. కొన్ని బాగుగఁ బండినను నెక్కుటకు వశముగానివై యుండును. అపక్వమ యియే పక్వమయినట్లు చూపట్టును; కాని యెన్నఁడును వృక్షము నశిం పదు. దృష్టిచేతను, మనస్సుచేతను, వాక్కుచేతను, గర్మముచేతను నెవ్వఁడు లోకమును ననుగ్రహించునో, వానికి లోకంబెల్లఁ బ్రసన్నం బయియుండును. వేఁటకానికి మృగములు జడియువడువున నెవనికి లోకము భయపడుచుండునో వాఁడు సాగరాంబర యగు భూమినెల్ల స్వాధీనపఱుచుకొనియును క్షీణించును. నీతిదూరుండు పితృపైతామ హం బగు రాజ్యంబునొందియును వాయువును సమీపించినమేఘము చందమ్మునఁ దన దుష్కర్మముననే నశించును. తొల్లింటి సజ్జనులెల్లరు నాచరించినధర్మంబు నాచరించువాని కీవసుమతి వసుసంపూర్ణయై యైశ్వ ర్యవృద్ధి నొసంగును. ధర్మము విడుచుచు నధర్మం బాచరించురాజువలన, నగ్నిలోఁబడిన చర్మమ్ముభంగిని భూమి మలమల మాడిపోవును. రాజు లెల్లపుడును పరరాష్ట్రంబులు జయించుట కేయేప్రయత్నంబు లాచరిం తురో యాప్రయత్నంబులనే స్వరాష్ట్రాభివృద్ధికిని నాచరింపం దగును. ధర్మంబున రాజ్యంబును సంపాదింపవలయు; దానిని ధర్మంబుననే బరి పాలింపవలయును. ధర్మమూలం బగుసంపదలఁ బొంది యెన్నండును నాశ మొందఁడు. ఱాలనుండి బంగారమును గ్రహించునట్లు వక్తయగుసుత్త ములవలనను తొక్కుపలుకులు పలుకుబాలురవలననుగూడ సారంబు గ్రహింపందగును. ఒక్కొకతండులకణమునే సేకరించి జీవించుశిలాహారి శిలంబు నెట్లు సంపాదించునో యట్లే యార్యులవాక్యంబులును మహా త్ములసుకృతంబులను గ్రహింపవలయును. గోవులు వాసనవలన మంచి చెడ్డలఁ దెలియును. పండితులు వేదంబువలన నెఱుంగుదురు. రాజులు చారులవలన నెల్లయు నెఱుంగుదురు. ఇతరజనులు కన్నులతోమాత్రమే తెలియఁగలుగుదురు. ఏయావు సుఖంబుగఁ బాలుపితుకనీయదో యా

యావు మిగులఁ గష్టంబు లనుభవించును. ఏ ధేనువు సుఖంబుగ క్షీరం
బుల స్రవించునో దానికి క్లేశమనుమాటయే యుండదు. ఏది యగ్నిలోఁ
గాల్పకుండనే వంగునో దానిని బ్రాజ్ఞుఁ డెవ్వండును నగ్నిలో వైచి
కాల్పఁడు. తనంతతాన వంగినకఱ్ఱను బుద్ధిగలవాఁ డెవ్వఁడును వంపఁ
బూనఁడు. ఈయర్థంబు లెఱింగి బుద్ధిమంతుండు బలవంతునికడ విన
మ్రుఁడై యుండవలయును. ఎవఁడు బలవంతునకు వంగియుండునో వాఁ
డింద్రునకుమాత్రమే నతుండగును. పశువులకుఁ బర్జన్యుండు బంధువు.
రాజులకు మంత్రులు చుట్టములు. స్త్రీలకుఁ బతులే బంధువులు. బ్రాహ్మ
ణులకు వేదంబులే చుట్టంబులు. ధర్మంబు సత్యంబుచే రక్షింపఁబడును.
యోగముచే విద్య రక్షితం బగును. కొలఁతచే ధాన్యము రక్షింపఁ
బడును. వ్యాయామశిక్షాదులచే నశ్వంబుల రక్షింపవలయును. తఱ
చుగఁ జూచుచుండుటచే గోవులు రక్షింపఁబడును. మలినవస్త్రములు
గట్టనిచ్చుటచే స్త్రీలమానంబు గాపాడఁబడును. సద్వ్యాపారహీనుని
కులము గౌరవహేతువుగాదని నాతలంపు. అంత్యజాతులందు జనించిన
వారైనను సద్వృత్తంబున గౌరవమొందుదురు. ఎవ్వండు పరుల ద్రవ్యం
బులందును రూపమందును కులమందును సుఖసౌభాగ్యసత్కారములం
దును నీర్ష్యగొనియుండునో వాని కంతములేనివ్యాధి సంభవించును.
అకార్యంబుల గావింపరాదు. కార్యంబుల విడువఁజనదు. అకాలమున
మంత్రభేదము గావింపరాదు. మదముగలిగింపనిపానమునే త్రాగవల
యును. మదమును గలిగించుదానిని ద్రావరాదు. గరిష్ఠులకు విద్యయు
ధనమును సత్కులసంజననమును మదము గలిగించును. సజ్జనుల కవియే
వినయమునుగూర్చి గౌరవము నాపాదించును. సజ్జను లెన్నండేని
గార్యవశంబునఁ గాపురుషు నొక్కయర్థంబునకై యాచించిరేని యా
కాపురుషులు తాము దుర్జనులమని తెలిసియున్నను సజ్జనులమనియే
తలంచుకొనుచుందురు. ఆత్మవంతులకు సత్పురుషులే గతి, సత్పురుషు
లకు సత్పురుషులేగతికాని యితరులుగారు. అసత్పురుషులకును సత్పురు
షులు గతి యగుదురుగాని సత్పురుషులకుఁ గాపురుషు లెన్నఁడును గతి
గాఁజాలరు. విలువగలవలువలు దాల్చినవానికి సభ వశమైయుండును.
గోవులుగలవానికి సంపన్నత్వమందలియాశ గలుగదు. వాహనంబున
బయనంబు సల్పువాని కధ్వశ్రమంబు గలుగదు. మంచిశీలముగలవాని

కెల్లజయంబులును జేకుఱును. పురుషునకు శీలంబే ప్రధానంబు. అది నశించినవానికిఁ బ్రాణంబువలనఁగాని ధనమువలనఁగాని బంధువులవలనఁ గాని యిసుమంతయుఁ బ్రయోజనముండదు. ధనికులు మాంసముతోడి యన్నమును, మధ్యములు గోక్షీరంబులతోడి యాహారంబును, దరిద్రులు తైలమిశ్రితం బగునన్నమును భుజింతురు. దరిద్రు లెప్పుడును దృప్తిగానే యన్నము భుజింతురు. ఆఁకలిగొన్నవారల కెల్లపదార్థంబులును రుచ్యంబులై యుండును. ధనికులకు నాఁకలి మందమగుటచే వారి వాలుక కేపదార్థములును రుచింపక వారు తృప్తిగా భుజింపకయే యుం దురు. సాధారణముగ సంపన్నులకు భోజనముచేయుటకు శక్తియుం డదు. దరిద్రులకన్ననో కట్టెలను దిన్నను జీర్ణములై పోవును. దరిద్రు లకుఁ గూలివాలిలేకుండుటయే భయము. మధ్యములకు మరణంబుకంటె వేఱుభయముండదు. ధనికులకు మరణముకంటెఁగూడ నవమానమన్న భయము మిక్కుటము. ఐశ్వర్యమదంబు పాపిష్ఠమైనది. దానివలననే మద్యపానంబు మొదలగుమదంబులెల్ల సంభవించును. ఐశ్వర్యమద మత్తుం డధఃపతితుండయ్యును దెలియఁజాలఁడు. నిగ్రహంబులేమిచే నింద్రియంబులు భోగంబులం దాసక్తంబులై మనుజుని నక్షత్రములును గ్రహంబులును వేధించురీతిని వేధించి చంపును. ఎవఁడు మనంబు నపహ రించు పంచేంద్రియవర్గంబుచే జయింపఁబడునో వాని కాపదలు శుక్ల పక్షంబునఁ జంద్రుఁడువలె దినదినము వృద్ధినొందును. మనంబును నిగ్ర హింపకయ యెవఁడు మంత్రుల నిగ్రహింపఁ దలంచునో శత్రులనేని జయింప నూహించునో వాఁడు మంత్రులచేతనే జయింపఁబడి క్షీణిం చును. తొలుదొల్త మనంబునే విరోధిగాఁ దలంచి దానిని జయింపవల యును. తరువాత మంత్రులను బిదప శత్రువులను జయింపవలయును. అట్లుగావించువానికి విజయం బెల్లయెడలను సిద్ధించును. వశ్యేంద్రియుని మనోనిగ్రహముగలవానిని నపరాధులయెడ నుచితదండ మాచరించు వానిని బాగుగఁ బరీక్షించి కార్యంబు లాచరించువానిని సిరి యెప్పుడు విడువక యాశ్రయించియుండును. రాజా! పురుషునకు శరీరము రథము. మనస్సు సారథి. ఇంద్రియములు తురంగంబులు. ధీరుండు సారథిని గుఱ్ఱ ములను నేర్పుతో వశముగావించికొన్నచో వాఁడు మహారథికునివలె సుఖముగ జీవయాత్ర సాగింపంగలఁడు. ఈయింద్రియముల నిగ్రహిం

పనిచో దుష్టాశ్వంబులు రథంబును సారథినిగూడఁ బరిమార్చువడువున నరుని నశింపఁజేయును. బాలిశుం డగునరుండు అర్థంబు ననర్థంబుగాను, ననర్థంబు నర్థంబుగాను, ఇంద్రియముల నిగ్రహింపకుండుటచే దుఃఖమునే సుఖముగాను దలంచును. ఎవండు ధర్మార్థములువిడిచి యింద్రియంబులకు వశుం డగునో వానియొక్కసిరియు ప్రాణంబులును ధనంబులును భార్యయుఁగూడ వేగముగా వానిని విడిచిపోవుట నిక్కము. ఎవండింద్రియంబుల వశపఱుచుకొనఁజాలకయే యర్థంబుల వశపఱుచుకొనఁ దలంచునో వాఁ డింద్రియనిగ్రహము లేనికారణంబున శీఘ్రంబున నైశ్వర్యంబు గోల్పోవును. మనోబుద్ధీంద్రియంబుల నియమంబున బంధించి తనను దానే యాలోకింపఁదగును. తనకుఁదానే చుట్టంబును దనకుఁదానే విరోధియు నగుచున్నాఁడు. ఎవండు తనను తనచేతనే జయించునో వానికి వాఁడే బంధు వగుచున్నాఁడు. ఎవఁడు ఆత్మచే నాత్మను జయింపఁడో వానికి వాఁడే శత్రు వగును. కావున నిక్కమైన బంధువయినను శత్రువైనను దనకుఁదానే యగును. చిన్నరంధ్రములుగల వలయందు మహామీనంబు లెట్లుపడునో యట్లే ప్రజ్ఞానమున కిసుమంత రంధ్రముండెనేని కామంబు క్రోధంబును బ్రవేశించి జ్ఞానమును నశింపఁజేయును. ఎవఁడు ధర్మార్థముల నాలోచించి సంభారముల నేకరించునో వాఁడు సంభారసంగ్రహమువలన నెల్లకాలము సుఖ మనుభవించును. తనశరీరమునఁగల యింద్రియములను నైదువురుశత్రువులజయింపకయే బాహ్యశత్రువుల జయింప నెవఁడుతలంచునో వాఁడు తప్పకశత్రువులచేఁ బరాభవంబొందును. తొల్లి మహాత్ములగురాజులునైతము ఇంద్రియముల జయింపఁజాలక వానికి వశులై రాజ్యవిభ్రమంబొంది స్వకర్మములచేతన నశించుట మనమెఱుంగుదుమేకదా? పాపాత్ములను విడువకుండ వారితోఁగలిసియుండు పాపరహితున కాపాపాత్ములతో సరిగనే దండము లభించును. పచ్చికట్టె యెండుకట్టతోఁ గలిసియుండుటవలనఁ గాలిపోవునుగదా? కావునఁ బాపాత్ములతో నెన్నండును సహవాసమాచరింపరాదు. తనశరీరమునంద వసించియుండి శబ్దస్పర్శరూపరసగంధంబులను నైదు వేర్వేఱు ప్రయోజనంబు లుద్దేశించి విజృంభించు శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణంబులను నైదుగురశత్రువులను మోహమ్మున నెవ్వఁడు జయింపకుండునో వాని నాపదలు భక్షించును. అసూయ

లేకుండుట, ఋజుత్వము, శుచిత్వము, సంతోషము, ప్రియభాషిత్వము, దమము, సత్యము, అనాయాసమునను మంచిగుణంబులు దురాత్ములదరిఁ జేరవు. ఆత్మజ్ఞానము, అనాయాసము, క్షాంతి, ధర్మనిత్యాభిరతి, సూనృతవాక్యము, గుప్తదానము ననునవి దుర్జనులకు లభింపని గుణములు. దుర్జనులు నిందాపవాదంబులచే సజ్జనుల బాధించుచుందురు. ఎప్పుడును వక్త పాపం బనుభవించును. క్షమాయుతుండు పాపము బొందఁడు. దుర్జనులకు హింసయే బలము. రాజులకు దండవిధి బలము. స్త్రీలకు శుశ్రూషయే బలము. సద్గుణవంతులకు క్షాంతియే బలము. రాజా! వాక్సంయమము మిగుల దుష్కరమైనది. అర్థవంతమై విచిత్ర మగురీతిని బహువాక్యంబులు పలుకుట దుష్కరము. యోగ్యంబుగఁ బలుకఁబడినమాట కల్యాణంబు లనంతముగాఁ జేకూర్చును. దుర్భాషిత మగువాక్యంబువలనఁ బెక్కు లనర్థంబులు సంభవించును. బాణంబులచే నైన గాయముమీఁద మరల యథాపూర్వముగ మాంసము పెరుగును. పరశువుచే నఱుకఁబడినవనము తిరిగి వృద్ధినొందును. నీచవాక్యంబులచే జనించినవాక్క్షత మెన్నఁటికిని మానదు. కర్ణి, నాళీకము, నారాచమునను బాణములు శరీరమున నాటినను వానిని బైకి పెరికివేయ వచ్చును. మాటలనెడు శల్యములు మాత్రము హృదయమున నాటి పెరుక నలవిగానివిగా నుండును. మాటలనుబాణంబులు ముఖమువలనఁ బ్రయోగింపంబడును. ఆబాణంబులచేఁ గొట్టఁబడినవాఁడు రాత్రియనక పవలనక యెల్లకాలం బేడ్చుచునే యుండును. ఆవాక్శరంబు లెప్పుడును బరుల మర్మస్థానంబులంద నాటుచుండును. గావునఁ బండితుం డెన్నండు నావిషబాణంబుల విడువరాదు. ఏపురుషునకు దేవతలు పరాభవమును గల్పింతురో వానిబుద్ధిని క్షీణింపఁజేయుదురు. వాఁడెల్లపుడును నీచకార్యంబులే యాచరించుచుండును. బుద్ధికలుషితంబై యుండఁగా వినాశము సమాసన్నమై యుండఁగాను, నయమువలె నాభాసించు దుర్ణయము మనమునుండి వెడలదు. రాజా! యీవిపరీతబుద్ధి పాండవులతో విరోధముగొన్న నీతనయులందు నాటుకొనియున్నది. వారలను నీవు బాగుగఁ దెలిసికొనఁజాలకున్నావు. లక్షణసంపన్నుండగు యుధిష్ఠిరుండు ముల్లోకములకు రాజుగాఁదగువాఁడు నీకు శిష్యుండు. అతఁడు రాజుగానున్నచో మనకెల్లశుభంబులు సులభంబు లగును. ధర్మనంద

నుండు నీతనయులనెల్ల నతిక్రమించియున్నాఁడు. భాగధేయసంపన్నుఁ
డుండు, తేజంబును బ్రజ్ఞయుఁ గలవాఁడు. ధర్మార్థంబులతత్త్వ మెఱిం
గినవాఁడు. అనుక్రోశంబునను నానృశంస్యంబున నాతండు ధర్మవేదు
లలోనెల్ల శ్రేష్ఠుండై యున్నవాఁడు. నీయందలి గౌరవాతిశయముచే
లెక్కలేనిక్లేశంబు లనుభవించుచున్నవాఁడు

అని విదురుండు వచింప నాంబికేయుండు వానితో విదురా! నీవచ
నంబులు మిగులఁ జిత్రంబులై యెంతవిన్నను తృప్తి జనింపకున్నది.
కావున నింకను జెప్పుమనుటయు విదురుండు మరలఁ జెప్పందొడంగెను.
సర్వతీర్థములందు స్నానమొనరించుటయు సర్వభూతంబులందు ఋజు
వృత్తినుండుటయు రెండును సమానమైనవి. వానిలో ఋజుత్వమే
యధికమైనది. నీవు పుత్రులందు ఋజువృత్తి నాలంబింపుము. దాని
వలన నీలోకంబునఁ గీర్తియుఁ బరలోకంబున సుఖంబును లభించును.
ఎంతకాలము పురుషునిసత్కీర్తి యీలోకంబున విరాజిల్లుచుండునో
యంతకాల మాతఁడు స్వర్గలోకంబునఁ బ్రకాశించును. ఈవిషయం
బునఁ గేశినిమిత్తమై విరోచనునకును సుధన్వునకును బ్రవర్తించిన
వివాదంబు నుదాహరింతును. తొల్లిఁ గేశిని యనుపేరుగలకన్య యుత్తమ
చరితంబు గలపతిని వరించుతలంపున స్వయంవరంబున నుండె. ఆసమయం
బున నాకన్యకను బెండ్లియాడఁదలంచి విరోచనుం డను దైతేయుండు
స్వయంవరమంటపమున కరుదెంచెను. వచ్చినవిరోచనున కుచితసత్కా
రంబు లాచరించి కేశిని వానితో బ్రాహ్మణులయం దుత్తమత్త్వము
గలదా? దైత్యులం దుత్తమత్వమున్నదా? ఏకారణంబున సుధన్వుండు
నాపర్యంక మధిరోహింపకున్నాఁడు? అని ప్రశ్నించెను. దానిమాట
లాలించి కేశినీ! మేము ప్రాజాపత్యులము. మేమే శ్రేష్ఠులము. ఈలోకంబు
లెల్ల మాయధీనంబులు. దేవతలును బ్రాహ్మణులు నన నెంతవారు అని
పలికెను. ఆపలుకులు విని కేశిని యోయీ నీవాక్యంబులు విచిత్రం
బులై యున్నవి. నేను నీమాటలు శంకించుచున్నదానను. సుధన్వుండు
నేఁడిక్కడ కరుదెంచును. వాని నడిగిననఁగాని సంశయముతీఱదు. వాని
వచ్చునటుకు మనమిర్వురయీస్థానంబుననే నిరీక్షింతమని పలికెను. ఆమాట
లకు విరోచనుం డంగీకరించి కల్యాణీ నీవు నొడివినట్ల కావింతము.
ప్రాతఃకాలంబున నన్నును సుధన్వుని నాలోకింతువుగాక యని వచించె.

రాత్రి యతీతంబగుటయు సూర్యమండలంబు తూర్పుకొండశిఖరంబునం బొడసూపినంత నావేళకు సుధన్వుం డేతెంచె. కేశినితోడ ప్రహ్లాద తనయుండగు విరోచనుం డున్నయెడ కాతఁడు రాఁగానే కేశిని ప్రత్యుత్థానం బాచరించి సుధన్వునకుం బాద్యార్ఘ్యాసనంబు లొసంగి సత్కరించె. అప్పుడు సుధన్వుండు విరోచనునితోఁ, బ్రహ్లాదనందనా! నీ సౌవర్ణంబగు నాసనంబున సుపవసింపుము. నేను బ్రాహ్మణుండను. హిరణ్మయంబగు నాసనంబు నీకొసంగుచున్నాఁడను. నీతోఁగలిసి యేకా సనంబునఁ గూర్చుండుటకు బ్రాహ్మణుండ నగు నే నంగీకరింపననియె. దానికి విరోచనుండు, సుధన్వుఁడా! నీకుఁ గూర్చుండుటకు దారుఫల కంబును, కూర్చయును, బృసియు నర్హంబులు. కాంచనంబగు నాసనంబు నీకుఁ దగదు. నాతోఁగూడి కూర్చుండుటకు నీకెంతయు నర్హత లేదని పలికిన, సుధన్వుండు, ఓయీ! తండ్రికొడుకు లేకాసనంబునఁ గూర్చుండఁ దగుదు. ఇరువురువిప్రులును, ఇరువురుక్షత్రియులును, వృద్ధులగువైశ్యు లిరువురును, నట్లె వృద్ధులగుశూద్రులు నిద్దఱిద్దఱొక్కయాసనంబునఁ గూర్చుండవచ్చును. ఇతరు లెవ్వరు నిట్లు రొక్కయాసనంబున నుపవే శింపఁజనదు. నీతండ్రి యగు ప్రహ్లాదుండు క్రిందఁ గూర్చుండియే నన్నె ప్పుడు నుపచరించుచుండును. ఇంట సుఖంబుగఁ బెరుఁగుచు లోకమెఱుం గనిబాలుండవగు నీ వీధర్మ మెఱుంగకున్నాఁడవని పలికె. ఆమాటలకు విరోచనుండు క్రుద్ధుండై, ఓయీ! మాకుఁగల హిరణ్యము గోవులు నశ్వంబులు మొదలగునవెల్లఁ బణంబు గావించుచున్నాఁడను. ఈవిష యంబున బెద్దలకడ కరిగి తెలిసికొందమనియె. సుధన్వుఁడు విరోచనా! హిరణ్యంబుగవాశ్వంబు నీక యుండుఁగాక ప్రాణంబులు పందెమువైచి యార్యుల నీవిషయంబు ప్రశ్నింతమని పలికె. ఆమాట లాలించి విరో చనుండు "సరియే యట్లే కానిమ్ము. ప్రాణంబులు పణంబుగా నొడ్డుట కంగీకరించితిని. కాని, మనకుఁ దగవుచెప్పువా రెవరు? దేవతలు మను ష్యులుచెప్పినవాక్యంబులుమాత్రము నాకు విశ్వాసార్హంబులుగా" నని వచించె. అంత సుధన్వుండు, విరోచనా? దేవతలకడకు మనుజులకడ కేఁగనేల? ఎవ్వఁడు డార్యబుద్ధికలిగియుండునో వాఁడు నిస్సంశయముగ మనవివాదము దీర్పఁగలఁడు. నీతండ్రి యగుప్రహ్లాదుండు మహాధార్మి కుండు కుమారుని ప్రాణంబులకొఱకైన నాతఁ డనృతం బెన్నఁడును బలు

కఁడు. కావున నాతనికడకే వెడలి మనవివాదము తీర్చికొందమని పలి
కెను. ఇట్లు వారిరువురును బందెము చఱచి ప్రహ్లాదునికడ కరుగ
నాతండు వారల నిరువుర నాలోకించి, యోహో! వీరలిరువురును గలసి
వచ్చుచున్నవారు. ఎన్నండును వీరుగలసి తిరిగినవారు కారు. కోపించిన
వీరు పాములవలె బుసకొట్టుచు నొక్కమార్గంబుననే వచ్చుచున్నవారు.
పూర్వ మెప్పుడును గలిసి తిరుగనివీరు నేఁడేలకో యిట్లు కలిసి వచ్చు
చున్నారని యాలోచించి విరోచనునితో వత్సా! మున్నెన్నఁడును
గలిసి చరింపని మీరు రీనాఁ డిట్లు కలిసివచ్చుట కేమికారణము? సుధన్వు
నితో నీవు చెలిమిగావించితివా? యని పలికెను. ఆమాట లాలించి విరో
చనుండు, తండ్రీ! నాకు సుధన్వునితో సఖ్యములేదు. మేమిరువురము
నిప్పుడు ప్రాణంబులు పణంబుగావించితిమి. నిన్ను ప్రశ్న మడిగెదము.
తత్త్వం బెఱింగింపుమని పలికెను. అంత ప్రహ్లాదుండు సుధన్వు నాలో
కించి, బ్రాహ్మణోత్తమా! ఇదే పాద్యము; ఇదియే మధుపర్కము. మిగుల
బలసిన శ్వేతవర్ణముగల గోవిదియే, నీవు పూజ్యుండవు. నాసత్కారంబు
లందుకొమ్మని పలికెను? ఆమాటలు విని సుధన్వుండు, ప్రహ్లాదా! నీప్రశ్న
వాక్యంబులచేతన నాకు సకలసత్కారంబులులభించినవి. నేను నిన్నొక్క
ప్రశ్నం బడిగెదను. దానికి సత్యమైన ప్రత్యుత్తరం బిమ్ము. మేమిరువు
రము నీప్రశ్నంబుకతంబునఁ బ్రాణంబులతోఁ బందెము చఱచితిమి.
లోకంబున బ్రాహ్మణులు శ్రేష్ఠులో లేక నీతనయుండు విరోచనుండు
శ్రేష్ఠుఁడో తెలుపుమని పలికె. ఆమాట లాలించి ప్రహ్లాదుండు విప్రో
త్తమా! ధర్మంబు కల్మాషంబుగాదు; కపిలంబునుగాదు; కృష్ణంబును
లోహితంబునుకూడఁ గాదు. అది కత్తియంచుకంటెను సుసూక్ష్మమైనది.
దానిని జెప్పుట కెవనికిఁ దరమౌను? నీవు పూజ్యుండ వగు బ్రాహ్మణుం
డవు. నన్ను సాక్ష్యంబున నియమించితివి. నాకుఁ బుత్త్రుండు విరోచనుం
డొక్కరుండే. నీవును. వాఁడును వివాదపడి నన్ను సాక్ష్యంబు సెప్పు
మన్న నేమి చెప్పఁగలను? అనిపలుక సుధన్వుండు, ప్రహ్లాదా! నీవిష
యంబున నేమియుఁజెప్పకయూరకుండినను, నసత్యము సెప్పినను, నీశిరంబు
పగులునని పలికెను. అప్పుడు ప్రహ్లాదుం డేమిసేయుటకును దోఁపక
సూర్యునితోఁగూడ వచ్చుచున్న హంసము నాలోకించి, మహాప్రాజ్ఞ!
సర్వజ్ఞ! హంసా! పుత్త్రుండును మఱియొక్క బ్రాహ్మణుఁడును వివాదపడి

నన్ను సాక్ష్యంబున నియోగించిరి. ఇట్టి సమయంబున నాచరింపఁదగు ధర్మమెట్టిదని యడిగెను. దానికి హంస, రాజా! కుమారునకు గోవులు గాని ప్రియమైనధనంబు లేవికాని యీవచ్చును. కాని యిరువురకు వివాదము సంభవించినపుడు సత్యమే వచింపవలయునని పలికెను. ప్రహ్లాదుండు హంసమా! యెవ్వఁడు సత్యంబుగాని యసత్యంబుగాని వచింపక యున్నకుండునో వానికిఁ బాపముగలదా? యని యడిగెను. అది విని హంసము, రాజ! ధర్మమడిగినపుడు సర్పంబువోలెఁ గుటిలగామియై యసత్యమాడరాదు. ధర్మముచెప్పకయు నుండరాదు. అట్లుపేక్షించు వాఁడు ధర్మభ్రంశ మొందును. వానికుత్తమలోకంబు లుండవు. వానికి సంతానమునుగూడ నుండదు. నదివేగంబు తీరంబున జనించినవృక్షం బులంబోలె ధర్మము వానిలోకంబులను సంతానమునుగూడఁ గూల్చును. ఎవ్వరు ధర్మంబెఱింగియుఁ జెప్పకుందురో వారిసుకృతంబునం దర్ధ భాగము వివాదగ్రస్తులలో శ్రేష్ఠుఁడు హరించును. కర్త యొకపాదం బపహరించును. మిగిలిననాల్గవపాలు సభాసదు లపహరింతురు. నింద్యుని నిందింపకున్నను శ్రేష్ఠునకుఁ బాపము నశించును. సభాసదులును బాప ముక్తు లగుదురు. నింద్యుని నిందించినచోఁ గర్తను బాపముపొందును. అదివిని ప్రహ్లాదుండు, హంస! మోహంబునఁగాని కామంబునఁగాని మిథ్యావచనంబులాడెనేని వానికి లభించుగతి యేదియో తెలుపుము. నాకుఁ దెలియక నిన్నడుగుచున్నాఁడనని పలికెను. అపుడు హంసము రాజా! సవతిగలస్త్రీ రాత్రి యేదుఃఖమనుభవించునో, ద్యూత మందోటు వడినవాఁ డేదుఃఖంబు లనుభవించునో, భారంబున దప్తశరీరుండగువాఁ డేదుఃఖ మనుభవించునో; యబద్ధమాడిన వాఁ డాదుఃఖ మొందును. నగరంబునఁ బ్రవేశింప నిషిద్ధుండై ద్వారంబు వెలుపల నాఁకలిగొని శత్రుమధ్యమందున్నవాఁ డెట్టియవస్థ నొందునో యసత్యమాడువాని కట్టియవస్థ లభించును. ద్రోహంబునకు వశుండై హితులు మిత్రులు విడువఁగా సర్వధనంబులు గోల్పోయినవాఁ డేశోకంబునొందునో యనృతమాడువాఁ డాశోకము నొందును. పశువులకొఱకై యనృత మాడిన నుత్తమలోకంబులందున్న యేవురుపూర్వు లధఃపతితు లగుదురు. గోవులయెడ ననృతమాడిన బదుగురుపూర్వులు నరక మొందుదురు. అశ్వంబులయం దసత్యమాడిన నూర్వురుపురుషులు నిరయ మొందుదురు.

పురుషునివిషయంబున మిథ్యావచనంబులు పలికిన నేపురుషుపూర్వు లధో
లోకంబులపా లగుదురు. హిరణ్యంబునకై యనృతమాడువాఁడు తన
కులంబునబుట్టిన పూర్వులను బుట్టఁబోవువారలనుగూడ నశింపఁజేయును.
భూమికై యసత్యవచనంబు లాడువానికి సర్వంబు నశించునని పలికెను.
హంస యిట్లు వచించినవాక్యంబు లాలించి ప్రహ్లాదుండు విగతకల్మ
షుండై విరోచను నాలోకించి, విరోచనా! ఈసుధన్వుండు నాకంటెను
నీకంటెను శ్రేష్ఠతముండు. ఆంగిరసుండగు నీతనితల్లి బిడ్డలగన్నస్త్రీల
కెల్లరకును శ్రేష్ఠమైనది. కావున నీవు పరాజితుండవైతివి. నీప్రాణంబుల
కీసుధన్వుం డధిపతియయ్యెను. అని పలికి సుధన్వు నాలోకించి, బ్రాహ్మ
ణోత్తమా! నాకీవిరోచనుం డొక్కరుండే పుత్త్రుండు. వీఁడు మృతినొం
దిన నావంశ మంతరించును. దాన లుప్తపిండోదకులై మాపూర్వు
లధోగాములగుదురు. కావున నీవు మాకులంబునెడఁ గరుణించి యీ
విరోచనుని ప్రాణంబులు నిలిపి నాకుఁ బుత్త్రదానం బొనరింపు మని
యభ్యర్థించెను. అపుడు సుధన్వుండు మిగులఁ బ్రీతుండై, రాజా! నీవు
ధర్మంబునే వచించితివి. కామవశుండవై యనృతమాడక యథార్థము
వచించితివి. కావున దుర్లభుండగు నీపుత్త్రుని మరల నీకిచ్చితిని. నాచే
మరల నీయఁబడిన నీపుత్త్రుండు విరోచనుండు నీవుచెప్పినధర్మంబు నను
సరించి యీవివాదమునకుఁ గారణమగు కేశినికిడ నాపాదంబులు ప్రక్షా
ళనం బొనరించి ధర్మంబు నిలుపుఁగాక, యనిపలికి యథేచ్ఛం జనియెను.

కావున రాజా! నీవు భూమికొఱకై యనృతమాడఁదగదు.
పుత్త్రునికై యనృత మాచరించి సుతులతోడ నమాత్యులతోడను
నాశ మొందకుము. దేవత లెవ్వనిని గోపాలుఁడు పశువులంబోలెఁ గఱ్ఱ
చేఁబూని రక్షింపరు. వా రెవనిని రక్షింపఁదలంతురో వానికి మంచి
బుద్ధిని గలిగింతురు. పురుషుండు కల్యాణంబు లాకాంక్షించువాఁడై
సత్కార్యంబు లాచరించుకొలఁదియు నాతనికి సర్వార్థంబులును సిద్ధించు
చుండును. వేదాధ్యయనం బొనరించినపురుషుండైనను మాయలచే
బ్రవర్తించుమాయావియైనచో వాని నావేదంబులు రక్షింపవు. ఱెక్కలు
వచ్చినపక్షులు కులాయంబులు వీడిపోవునట్లు ఛందస్సులు మాయావి
యగుపురుషుని విడిచిపోవును. రాజద్వేషంబు, స్త్రీపురుషులవివాదము,
దుష్టంబగుత్రోవయు వర్జ్యంబులని యార్యులు వచింతురు. సాముద్రికా

శాస్త్రంబునం బ్రజలవంచించువానిని, ముందు దొంగతన మాచరించు చుండి యిప్పుడు వణిగ్వ్యాపార మారంభించినవానిని, పాశంబులు శలాకలు మొదలగువానిచే శకునాదులు పరీక్షింతునని చెప్పి ప్రజల వంచించువానిని, వైద్యవృత్తిచే జీవించువానిని, శత్రువును, మిత్రుని, స్తుతిపాఠకుని వీరినేడుగుర నెప్పుడు నధికారపదవులం దుంపరాదు. లోకగౌరవప్రదంబగు మానాగ్నిహోత్రము మానమౌనము మానాధ్యయనము మానయజ్ఞంబు ననునాల్గుకర్మములు విధిననుసరించి యాచరించిన సుఖంబు నొసంగు. అవియే విధివిహీనంబుగ నాచరింపఁబడునేని, మహాభయంబు లాపాదించును. ఇంటికి నిప్పురగుల్కొలుపువాఁడు, విషముపెట్టి చంపువాఁడు, కుండాసియన్నము భుజించి జీవించువాఁడు, సోమంబు విక్రయించువాఁడు, ఆయుధంబుల నిర్మించువాఁడు, నక్షత్రముల సూచించి ఫలాఫలములు దెల్పువాఁడు, మిత్రద్రోహం బొనరించువాఁడు, పరదారసంగమాసక్తుండు, భ్రూణహత్య యొనరించువాఁడు, గురుభార్యతో వ్యభిచరించువాఁడు, బ్రాహ్మణుండయ్యు మద్యము ద్రాగువాఁడు, అతితీక్ష్ణస్వభావముగలవాఁడు, అశుచియగువాఁడు, దైవభక్తిలేనివాఁడు, వేదంబుల నిందించువాఁడు, గ్రామపురోహితుండు, వ్రాత్యుండు, కర్షకుండు, సామర్థ్యముగలవాఁడయ్యు రక్షింపుమని శరణుసొచ్చిన యార్తుని రక్షింపక వాని హింసించువాఁడును వీరెల్లరును బ్రహ్మహత్యఁ నొనరించినవానికి సమానులగుదురు. గడ్డివేసికాల్చిన బంగారము మంచిచెడ్డ లెఱుంగఁబడును. సద్వృత్తంబున ధర్మంబు తెలియును. వ్యవహారంబున సాధుత్వాసాధుత్వము లెఱుఁగఁబడును. భయం బాసన్నంబైనపుడు శూరుండు తెలియఁబడును. అర్థకృచ్ఛ్రంబులందు ధీరుండు ప్రకటీకృతుండగును. గొప్పయాపదలందు మిత్రులు శత్రులు దెలియఁబడుదురు. ముదిమి రూపంబు నపహరించును. ఆశ ధైర్యంబును దొలఁగించును. మృత్యువు ప్రాణంబుల హరించును. అసూయ ధర్మాచరణమును బోనాడును. క్రోధంబు సిరి నెడబాపును. దుర్జనసేవ శీలంబును బాడుసేయును. కామము సిగ్గును బోఁగొట్టును. గర్వంబు సర్వంబు నశింపఁజేయును. కోపముగలవాని కర్థంబులు సిద్ధింపవు. నృశంసునకు స్నేహితులు దుర్లభులగుదురు. క్రూరునకు భార్యయు, సుఖాభిలాషగలవానికి విద్యయుఁ, గామవశంగతునకు లజ్జయు,

నలసునకు సిరియు, మాట నిలుకడలేనివానికి సర్వంబును దుర్లభంబులై యుండును సిరి మొదట మంగళము గలుగ జనించును; ప్రాగల్భ్యము వలన వృద్ధి నొందును; సమబుద్ధిచే పాదుకొనును; సంయమంబువలనఁ బ్రతిష్ఠితంబై యుండును. ప్రజ్ఞయు, సత్కులసంజననము, దమము, శాస్త్రార్థజ్ఞయ నము, పరాక్రమము, మితభాషిత్వము, శక్తిననుసరించి చేయుదానము, చేసినమేలు మఱవకుండుటయు ననునెనిమిదిగుణంబులచేఁ బురుషుండు సర్వోత్తరుండై వెలుంగును. మహానుభావంబుగల యీగుణంబులనెల్ల నొక్కగుణము బలాత్కారముగా మించుచున్నది. అది యేదంటేని రాజు మనుజుని సత్కరించెనేని యాసత్కారమనుగుణ మీగుణంబుల నెల్ల మీఱి విలసిల్లును. ఈయెనిమిదిగుణంబులును మనుష్యలోకంబు నందున్నను స్వర్గలోకంబునకు నిదర్శనంబు లయియుండును. వీనిలో నాలుగు సత్పురుషులతో నిత్యసంబంధముగలవి. వానిని సత్పురుషులు మహాప్రయత్నంబున భజింతురు. యజ్ఞంబు, అధ్యయనము, దానము, తపము, సత్యము, క్షమ, దయ, లోభరాహిత్యము ననునవి యెనిమిది గుణంబులును ధర్మంబున కెనిమిదిత్రోవలై విలసిల్లుచున్నవి. వీనిలో మొదటినాలుగు పరుల మెప్పుకొఱకును గావింపంబడుచుండును; రెండవనాలుగు మహాత్ములయందుఁదక్క నితరులయెడ నుండవు. ఏసభ యందు వృద్ధులుండరో యది సభయేకాదు. ఎవరు ధర్మము పలుకరో వారు వృద్ధులుగారు. దేనియందు సత్యముండదో యది ధర్మం బనఁ బడదు. కపటంబుతోఁగూడినది సత్యంబును గాదు. సత్యము, రూపము, శ్రుతము, విద్య, కులీనత్వము, సత్స్వభావము, బలము, ధనము, శౌర్యము, చిత్రవచనము ననుపదియు స్వర్గకారణంబులై యుండును. పాప మాచరించినవాఁ డపకీర్తినొంది పాపఫలమునే యనుభవించును. పుణ్యమాచరించువాఁడు సత్కీర్తిగలిగి పుణ్యఫలంబు లనుభవించును. కావున బురుషుండు నియతుండై పుణ్యంబునే యాచరింపఁదగును. పాపమొకప్పుడు నాచరింపరాదు. పాపంబు మాటిమాటి కాచరించి నచోఁ బ్రజ్ఞ నశించును. ప్రజ్ఞ నశించినమానవుండు బాపంబునే యెల్ల పుడు నాచరించుచుండును. పుణ్యమును మాటిమాటికి నాచరించుచో నంతకంతకుఁ బ్రజ్ఞ వర్ధిల్లును. ప్రజ్ఞావంతుఁ డెప్పుడును బుణ్యకార్యం బులే సల్పుచుండును. పుణ్యంబు నాచరించుచు సత్కీర్తి గడించిన

మానవుండు పుణ్యలోకంబు లనుభవించును. కావున, నరుండు శ్రద్ధతో నెల్లప్పుడును బుణ్యకార్యంబులఁ జల్పుచుండవలయును. అసూయాగ్రస్తుండును, మర్మచ్ఛేత్త, నిష్ఠురుండు, వైరమొనరించువాఁడు, శఠుండును నెప్పుడును సుఖము నొందరు. మాటిమాటికిఁ బాపంబులాచరించుచుందురు. అసూయారహితుండు కృతప్రజ్ఞుండును నెల్లపుడు శుభకార్యంబు లాచరించుచు నెల్లపుడును సుఖ మనుభవింతురు. ఎల్లయెడలఁ బ్రకాశింతురు. ఎవఁడు ప్రాజ్ఞులవలనఁ బ్రజ్ఞనుమాత్రమే గ్రహించునో వాఁడు ప్రాజ్ఞుండగును. ప్రాజ్ఞుండు ధర్మార్థములుపొంది సుఖంబుగ వర్ధిల్లును. సర్వకార్యంబులను బగటియంద యాచరించి రాత్రి సుఖంబుగ నిద్రింపవలయును. సంవత్సరమున కుపయోగించు కార్యంబులెనిమిదిమాసంబులంద నిర్వర్తించి వర్షకాలంబున సుఖం బనుభవింపఁదగును. వృద్ధుం డయినపుడు సుఖం బనుభవించుటకుఁ దగు కార్యంబులు పూర్వవయసునంద సమాచరింపవలయును. మరణానంతరమునఁ బరలోకంబున సుఖించుటకు వలయు కార్యంబులు బ్రతికియున్నంతకాలము చేయుచునే యుండవలయును. అన్నంబును జీర్ణమయిననే ప్రశంసింతురు. యౌవన మతిక్రమించిన భార్యను గౌరవింతురు. శూరుండు సంగ్రామవిజయం బందెనేని మెత్తురు. సంసారముత్తరించిన యోగిని వినుతింతురు. అధర్మార్జితంబగు ధనంబుచే నేఛిద్రమును గప్పఁ బ్రయత్నింతురో యాఛిద్రం బెన్నఁడును గప్పఁబడదు. సరికదా పైనిద్దానివంటి ఛిద్రంబు లనేకములు బయలుదేఱును. ఆత్మవంతులకు గురుండు, దురాత్మలకు నరపాలుండు, శరీరమం దడఁగియుండుపాపంబులకు యముండును శిక్షకులు. ఋషులు నదులు మహాత్ములయొక్క కులములు స్త్రీల దుశ్చరితములు ననువాని యుత్పత్తిస్థానములు దెలియుట దుష్కరము. క్షత్రియుండు బ్రాహ్మణపూజాభిరతుండును, వదాన్యుండును, జ్ఞాతులయెడ ఋజువృత్తిగలవాఁడును, మంచిశీలముగలవాఁడు నయ్యెనేని, భూమిని బెద్దకాలంబు పాలింపఁగల్గును. శూరుండును, విద్యావేదియు, సేవాభిజ్ఞుండు నగు మువ్వురుపురుషులు భూమిని సువర్ణపుష్పంబుల గ్రహింతురు. బుద్ధిచేఁ జేయంబడుకర్మంబు లుత్తమంబులు. బాహువులచే నొనరింపఁబడునవి మధ్యమంబులు. జంఘాబలంబుచే నొనరింపఁబడునవి యధమంబులు. దుర్యోధనునందు, మూర్ఖుఁ డగుశకునియందును

దుశ్శాసనునందును, గర్ణునందును రాజ్యభారముంచి నీ వైశ్వర్య మనుభవింప నెట్లు దలంచుచున్నాఁడవు? పాండవులు సర్వసుగుణసంపన్నులు; నీయందుఁ బితృభావముంచి గౌరవించుచున్నారు. అట్టిపాండవులయెడ నీవు పుత్రప్రేమముంచి ప్రవర్తించుట శ్రేయస్కరము.

మఱియు నియ్యెడ నొక్కయితిహాసంబు సాధ్యులకు నాత్రేయునకును జరిగినసంవాదము గలదు. దాని నెఱింగించెద; సావధానుండవై యాలింపుమని యిట్లు చెప్పందొడంగె. తొల్లి సంశితవ్రతుండై హంసరూపంబునఁ జరించుచున్నయాత్రేయమునిపుంగవుం గాంచి సాధ్యులు మహర్షి! మేము సాధ్యులము. నిన్నుఁగని మేము బహుమానింప సమర్థులము గాకున్నారము. నీవు శాస్త్రంబులచేతను బుద్ధిచేతనుగూడ మిగుల ధీరుండవని మాకుఁ దెలియును. కావున విద్వల్లక్షణంబు నెఱింగించునుదారమగువాక్యంబు లెఱింగింపుమని పలికిరి. వారిమాట లాలించి యాహంసంబు సాధ్యులారా! యీకార్యంబు నాకుఁ దెలియును. మీకుఁ దెలిపెద నాకర్ణింపుఁడు. ధైర్యముశాంతి సత్యధర్మానువర్తనముగలవాఁడై హృదయంబునంగల గ్రంధినెల్ల దీసివైచి ప్రియాప్రియంబుల సమంబుగ నరయునది. ఎవ్వరేని దనయందు నిందమోపి యాక్రోశించినను శాంతిపరాయణుండై కోపము నొందఁగూడదు. శాంతిపరునియం దడఁగిపోయిన కోపమే నిందకుని దహించివైచి వానిసుకృతమునెల్ల శాంతిపరున కొసంగును. పరులనెన్నఁడును నిందింపరాదు. పరుల కవమానము సేయరాదు. మిత్రద్రోహంబు నీచులసేవించుటయుఁ గావింపఁగూడదు. అభిమానపరుండును హీనవ్యాపారముసుగలవాఁడును గాఁగూడదు. కఠినంబు నమంగళంబు నగువాక్యంబును బలుకఁగూడదు. రూక్షంబు లగు వాక్యంబులు మర్మంబు లగునెమ్ముకలను హృదయంబునను ప్రాణంబులను నాటి పురుషుని దహించివైచును. కావున ధర్మపరుం డెల్లపుడునురూక్షంబగు నమంగళవాక్యంబును విడుచునది. మర్మముల వేధించువాఁడును, బరుషుండును, రూక్షవాక్యంబులు పలుకువాఁడును, మనుజులను మాటలనెడుబాణములతో బాధించువాఁడును జనులలో నలక్ష్మీస్థానము లగుదురు. వానిముఖమునందే యలక్ష్మియు మృత్యువును వసించియుండును. శాత్రవుండు మిక్కిలి వాఁడిగలిగి యగ్నివలెను సూర్యునివలెను దాహశక్తిగలబాణంబులచేఁగొట్టినపుడు శత్రువునకు లొంగి మృత్యువశమయి

నసుకాక పరునిమీఱి జయించినను నట్టివాఁడు సుకృతమునే పొందును. సజ్జనుని సేవించినను దుర్జనుని సేవించినను దపశ్శాలినిభజించినను జోరుని భజించినను నాటకిమందలి తెఱలు రంగవశమున మాఱునట్లు పురుషుఁడును దానుగావించు సేవావశంబున మాఱిపోవును. ఎప్పుడును దానతివాదము గావింపను గూడదు. ఒరులచేఁ జేయింపనురాదు. ఎవండును దనకు దెబ్బతగులనిదే యితరులను గొట్టఁగూడదు. పరులచేఁ గొట్టింపను గూడదు. ఎవఁడు పాపాత్మునినైతము వధించుట కిచ్ఛగింపఁడో వానిని దేవతలును గౌరవింతురు. ఏమాటనైనఁ బలుకుటకంటెఁ బలుకకుండుటయే లెస్స. ఒకవేళఁ బలికినను సత్యముపలుకుట దానికంటెను మంచిది. ప్రియవాక్యంబులు పలుకుట దానికంటె నుత్తమము. ధర్మయుక్తంబగుమాటలాడుట యన్నిటికంటెను మంచిది. ఎట్టిపురుషులతో సావాసమాచరించునో యెట్టిమనుజుల సేవించునో తాను నట్టివాఁడే యగును. పురుషుండు తానెట్టివాఁడుగావలయునని కోరునో యట్టివాఁడే యగును. ఏయేకార్యంబు లాచరింపక మఱలియుండునో యాయాపాపంబులవలన విముక్తుండగును. ఎల్లకార్యంబులవలన మఱలినచో వానికణుమాత్రమైన దుఃఖముండదు. వాఁడొకనిచే జయింపఁబడఁడు. ఒకనిని జయింపను దలంపఁడు. ఎవరితోడను వైరమొందఁడు. ఎవరికిని బ్రతిఘాతంబు గావింపఁడు. నిందయందుఁ బ్రశంసయందును సమస్వభావంబు గలిగియుండును. వానికి దుఃఖంబును హర్షంబును రెండును సంభవింపవు. అతండెప్పుడు నెల్లరకును వృద్ధినే యపేక్షించును. ఎవరికిని నాశ మభిలషింపఁడు. సత్యవాక్యములుపలుకును.మృదుశీలుండును దాంతుండునునగును. ఎవఁ డిట్లు ప్రవర్తించునో వాఁడుత్తమపురుషుం డనంబడును. మధ్యమపురుషుండు త్యాగంబులేని ఉత్తమాటలచే సాంత్వనంబు గావింపక యిచ్చెద నని ప్రతిజ్ఞ చేసినది యిచ్చును. పరులయొక్క లోటుపాట్లను బాగుగఁ దెలిసికొనును. దుష్టమైనశాసనముగలవాఁడు, ఉపహతుండు, అభిశప్తుండు, మన్యుపరవశుండు, కృతఘ్నుండు, ఎల్లరతోడను విరోధించువాఁడును నధముండగు. వాని కివియకళలు. కల్యాణంబును నష్టమందుట, గురుజనంబులందు నైతము విశ్వాసములేకుండుట, మిత్త్రుల నిరాకరించుటయు నధమపురుషునిలక్షణంబులు. ఐశ్వర్యకాముండగు నరుండు సంతతము నుత్తములనే సేవింపవలయును. ఒకప్పుడు కార్య

వశేంబునమాత్రము మధ్యముల సేవింపవచ్చును. ఎన్నండు సథముల సేవింపరాదు. అసద్వ్యలంబువలనను నిత్యాభ్యుదయమువలనను బ్రజ్ఞ చేతను బురుషకారంబుచేతను గూడ, విత్తంబు లార్జింపవచ్చును. ఐనను, వానికిఁ గీర్తిమాత్రము లభింపదు. మహాకులములప్రవర్తనమును లభింపదు." అని విదురుం డిట్లు వచింప నంబికానందనుండు మహాకులంబులను దేవతలు మిగుల గౌరవింతురనియు, మహాకులవంతులు ధర్మార్థనిత్యులు బహుశాస్త్ర వేదులు నని వినుచున్నాఁడను. ఆమహాకులంబులన నేవియో నాకెఱింగింపు మనినంత విదురుం డిట్లనియె. తపంబు, దమము, బ్రహ్మజ్ఞానము, క్షాంతి, యజ్ఞము, వివాహము, సాంత్వనము, అన్నదానము ననునవి మహాత్ముల సద్గుణములు. అవియ మహాకులంబు లనంబడును. ఎవరిప్రవర్తన మెన్నండును జలనములేక యుండునో, యెవరిసంతానము చిత్తనైర్మల్యమున ధర్మ మాచరించునో, యెవ్వ రెల్లవేళలఁ గీర్తికాములై యుందురో, కులమం దాధిక్యము వాంఛింతురో, అనృత మెన్నండును బలుకరో, వారు మహాకులంబు లనంబడుదురు. యజ్ఞములాచరింపకుండుట, యశాస్త్రీయంబు లగు వివాహంబులాడుట, వేదాధ్యయనంబుగావింపకుండుట, ధర్మము నతిక్రమించుట యనుదుష్కార్యములచేఁ గులంబులు చెడిపోయి పేరుపోఁగొట్టుకొనును. దేవద్రవ్యంబు హరించుట, బ్రాహ్మణద్రవ్యంబు దొంగిలించుట, బ్రాహ్మణులమీఱి చరించుటయు ననుపాపకార్యంబులవలనఁ గులంబులు నశించును. బ్రాహ్మణులను బరిభవించుట, వారియం దపవాదము లారోపించుట, ఒరులు తనకడ దాఁప నుంచిన ధనంబు తిరిగి వారికీయక యపహరించుట యనుదుష్కార్యంబులవలనఁ గులంబులు నశించును. విద్యలతోడను, సత్పురుషులతోడను, ధనంబులతోడను, గులంబులను వ్యవహారంబుగలిగినది. అయినను సత్ప్రవర్తనము లేకుండెనేని కులముఁను పేరు గలుగదు. స్వల్పధనంబు గలవయ్యును సత్ప్రవర్తనము నెడయకుండెనేని కులసంజ్ఞనొంది మహాకీర్తి నొందును. ప్రవర్తనం బతిప్రయత్నంబున రక్షింపవలయును. ధనంబులు వచ్చుచుఁ బోవుచు నుండును. ధనంబున క్షీణుండయినను సద్వృత్తముగలిగియుండెనేని క్షీణుండుగాఁడు. వృత్తంబు లేకుండెనేని వాఁడు హతుండే యగును. గోవులు, పశువులు, తురంగములు, సుసమృద్ధంబగుకృషి, మొదలగుసంపద లెన్నియున్నను, వృత్తహీనంబు లయ్యె

నేని కులంబులు వృద్ధినొందనేరవు. వైరకర్తయు పరద్రవ్యాపహారణుం
డగురాజు, మిత్రద్రోహి, కపటి, యసత్యవాది, పితరులకు దేవతలకు
నతిథులకు నర్పింపకయే ముందుగా భోజనముసేయువాఁడును కులనాశ
మునకుఁ గారణంబులై కులఘ్ను లనంబడుదురు. బ్రాహ్మణుల హింసింప
కుండువాఁడు, బ్రాహ్మణుల ద్వేషింపకుండువాఁడు, కృషిని వృద్ధిగావించు
వాఁడును గులంబులందుండి కులవృద్ధికిఁ గారణంబులగుదురు. తృణంబులు
భూమి బలము సూనృతవాక్యంబును సత్పురుషుల గేహంబులం దెప్పు
డును ఛేదము లేక యుండును. ధర్మాత్ములు పుణ్యకర్ములు నగువారు
శ్రద్ధచేఁ దీసికొనివచ్చి సత్కార మాచరించి తృణాదులను వృద్ధినొందిం
తురు. రథనిర్మాణంబునకు యోగ్యం బగుస్యందనవృక్షంబు సూక్ష్మంబైన
నైనను మహాభారమును వహించుటకు సమర్థమైనది. ఇతరవృక్షము
లట్లు భారవహనక్షమములు గాఁజాలవు. అట్లే మహాకులంబులం దుద్భ
వించిన పురుషులు మహాభారంబులవహించి కీర్తిగందురు. ఇతరమనుష్యు
లట్లు భారంబు వహింపంజాలరు ఎవండు కోపంబున భయపెట్టునో
వాఁడు మిత్రుండుగాఁడు. ఎవనివిషయమున శంక జనించునో వాఁడును
మిత్రుండుగాఁడు. ఎవనియందుఁ దనతండ్రియందువలె విశ్వాస ముద
యించునో వాఁడే మిత్రుం డగును. ఇతరులు సంగాతగాండ్రుమాత్ర
మగుదురు; మిత్రులు గాఁజాలరు. ఎవ్వఁడు బంధువుకాకున్నను మిత్ర
భావంబునఁ బ్రవర్తించునో వాఁడే నిక్కం బగుమిత్రము; వాఁడే
చుట్టము; వాఁడే గతి; వాఁడే పరాయణము. చలచిత్తునకు వృద్ధులసేవిం
పనివానికి భ్రాంతచిత్తునకును మిత్రసంగ్రహము దుష్కరమైయుండును.
నీరెండిపోయినసరస్సులను హంసములు విడిచి చనునట్లు చలచిత్తుని
అనాత్మజ్ఞుని నింద్రియలోలుని నర్థంబులు వీడిపోవును. కారణంబు లేకయు
కోపింతురు. నిమిత్తంబు లేకయ యనుగ్రహింతురు. పారిప్లవం బగు
మేఘంబుభంగి నిట్లు గావించుట కాపురుషులస్వభావంబు. మిత్రులచే
సత్కారములుపొందియు లాభములుపొందియు నెవ్వరు మిత్రకార్యం
బులయెడ నుపేక్షింతురో యట్టివారు చచ్చిన నాకృతఘ్నులకళేబరం
బుల నక్కలును దినవు. ధనమున్నను లేకున్నను మిత్రులను బ్రార్థించు
చునే యుండవలయును. ప్రార్థనాశూన్యులయినచో మిత్రుల బలాబలంబు
లెఱుంగఁజాలరు. సంతాపమున రూపంబు నశించును. సంతాపమువలన

బలము భ్రష్టంబగును. సంతాపంబున జ్ఞానంబు క్షీణించును. సంతాపము వలన వ్యాధులును జనించును. శోకంబున నేఫలంబును లభింపదు. సరి కదా శరీరతాపంబుగూడ సంభవించును. శోకాకులుని గాంచి శాత్రవులు ప్రహర్షింతురు. కావున రాజా! నీవెంతమాత్రమును శోకమందకుము. జనుండు పుట్టుచును జచ్చుచు నుండును. మరలమరల వృద్ధియు క్షయము నొందుచుండును మాటిమాటికి నితరులను యాచించుచును యాచింపఁబడుచు నుండును. ఇతరులగూర్చి శోకించుచును నితరులచే శోకింపఁబడుచునుగూడ నుండును. సుఖదుఃఖంబులు, శుభాశుభంబులు, లాభాలాభంబులు, జననమరణంబులును గ్రమముగా వచ్చుచునేయుండును. ఈద్వంద్వంబు లొక్కటివెనుక నొకటి వచ్చుచుఁ బోవుచు నుండునదే కాని వీనిలో నొక్కటియేనియు స్థిరంబుగ నుండదు. కావున ధీమం తెన్నండును వీనియందు హర్షింపనురాదు; దుఃఖింపను గూడదు. కన్నులు, చర్మము, చెవులు, నాలుక, నాసిక, మనంబు ననునేనింద్రియంబులును మిక్కిలి చంచలములైనవి. వీనిలో నొక్కటి నేయేవిషయంబుల యెడ వృద్ధినొందునో యాయావిషయంబులందుఁ బురుషునిబుద్ధి క్షయించి పోవును. జలఘటమునకు రంధ్రముపడెనేని నీరంబు కారకుండునా? కావునఁ బురుషుం డింద్రియములఁదృష్టికై యత్నింపక వానిని లెస్సగాఁ నిరోధింపవలయును.

విదురుఁ డిట్లు చెప్పినవాక్యంబు లాలించి ధృతరాష్ట్రుండు మరల నాతనితో నాచే మిథ్యోపచరితంబై శరీరంబున రుద్ధం బగునధర్మాగ్ని యుద్ధంబున నాతనయుల భస్మం బొనరించును. నా కీప్రపంచంబెల్ల నిత్యము భయప్రదంబుగ నున్నది. నామనం బెల్లవేళ భయాకులంబై యున్నది. కావున భయదూరం బగుదానిని నాకుఁ దెల్పుమని పలికెను. అపుడు విదురుండు మరల నిట్లు చెప్పందొడఁగె. విద్యాతపంబులకంటెను నింద్రియనిగ్రహంబుకంటెను లోభసంత్యాగంబుకంటెను నీకు శాంతిని గల్గించునది వేఱొక్కటిలేదు. పురుషునకు బుద్ధిచే భయంబు నశించును; తపంబున సద్గురుశాస్త్రాదులు బొందును; గురుశుశ్రూషచే జ్ఞానము పొందును. యోగంబున శాంతి ప్రాపించును. మోక్షకాము లగువారు దానంబులవలని పుణ్యంబుల వేదాధ్యయనంబువలని సుకృతంబును నాశ్రయింపక రాగద్వేషంబుల దూరీకరించి చరింతురు. లెస్సగా నొనర్చిన

యధ్యయనంబు, భయము లేక యొనర్చినయుద్ధంబు, సుకృతంబగు కర్మము, తీవ్రముగా నిర్విఘ్నముగఁ గావించినతపంబు ననువానిఫలంబులు వానిని జేసినయనంతర మనుభవింతురు. సుఖంబు లనుభవించుటయే యీ సత్కార్యములకెల్లను ఫలమైయొప్పును.భిన్నబుద్ధులగువారు పరార్థ్యంబు లగునాస్తరణంబులు గలశయనంబుల నధివసించియు నిద్రనొందఁజాలరు. స్త్రీలయందైనను రతిని బొందరు. సూతులు మాగధులు స్తుతించు చున్నను వారికి సంతసముగలుగదు. వారెన్నండును ధర్మం బాచరింపఁ జాలరు. వారలకెన్నండును సుఖంబు లేశమేని కలుగదు. వారల కెందును గౌరవంబు ప్రాప్తింపదు. వారలకు శాంతి రుచింపదు. చెప్పఁబడినవాక్యం బులు పథ్యంబులయినను వారి కిష్టములుగావు. వారల కలబ్ధం బగు లాభంబును లబ్ధం బగుదానిరక్షణంబును జేకూరవు. భేదబుద్ధులకు వినా శముకంటె వేఱుగతిలేదు. క్షీరాదిసంపత్తి గోవులందుఁ గల్గును. బ్రాహ్మ ణునియందుఁ దపంబు స్థిరంబై యుండును. స్త్రీలయందుఁ జపలత్వముం డుట సహజము. జ్ఞాతివలన నెప్పుడును దప్పక భయముగల్గును. దీర్ఘంబు లగుతంతువులును బహుళంబు లగు తనువులును సమానంబులై యుం డును. ఇవి బహుత్వమువలన బహ్వాయాసంబుల ననుభవింపవలసి వచ్చును. అని యార్యులు వక్కాణింతురు. ఎంతుకట్టెలవలె జ్ఞాతులును వేఱుసేయఁబడిన ధూమాయమానులుగ గలిసియున్న జాజ్వల్యమా నులు నగుదురు. ఎవండు బ్రాహ్మణులందు వనితాజనములందు జ్ఞాతు లందు గోగణంబులందును శూరత్వంబు సూపునో వాఁడచిరకాలంబునఁ బండినతాటిపండువలె నధఃపతితుండగును.ఒంటిపాటుననున్న వృక్షంబెంత బలముగలదియు గొప్పదియు నయినను దానినిగాలి సమూలంబుగఁబెఱికి వేయఁజాలియుండును. సంఘంబులుగ వనంబులందున్న వృక్షంబులన్నో యన్యోన్యాశ్రయణబలంబున నెంతవడిగాడ్పులనైనను సహించి సుప్ర తిష్ఠితంబులై యుండును. ఇట్లే సద్గుణవంతుండయినను నొంటరిగా నున్నమనుజుని వైరులు సుఖముగ సమున్మూలింతురు. అన్యోన్యసముప ష్టంభంబునను నన్యోన్యాశ్రయణంబునను చెఱువులందుఁ గలువలువలె జ్ఞాతులు వృద్ధినొందుదురు. బ్రాహ్మణులు, గోవులు, జ్ఞాతులు, శిశువులు, స్త్రీలును, వధ్యు లెన్నఁడును గారు. వారి నెన్నండును హింసింపరాదు. తా నెవ్వరియన్నంబున జీవించుచున్నాఁడో వారి నెన్నఁడును వధింప

రాదు. శరణుసొచ్చినవానినిగూడ నెన్నండును హింసింపరాదు. వీరలు
మహాపరాధంబు లొనరించిరేని వారిని విడిచివేయుటమాత్రమే వారికి
నిష్కృతియగును. అంతియకాని బ్రాహ్మణాదుల నెన్నఁడును జంపఁగూడదు.
మనుష్యుం డెప్పుడును సాధనమాత్రంబగునుగాని వానివలన గుణంబు
లేశంబునుండదు. అనాతురత్వమే లేకున్న రోగులు మృతులకు సమానులే
కదా? వ్యాధిలేకయే సంభవించునదియు కటుకమయినదియు శిరోవేద
నంబు గూర్చునదియు బాపసంబధంబుగలదియుఁ దీక్ష్ణంబు నుష్ణంబు
నగునదియు నగుమన్యువనుమహావిషంబును సజ్జనులుమాత్రమే దిగ
ద్రింగఁగలరు. కాపురుషు లెన్నఁడును దాన నడంచి యుంపఁజాలరు.
మహారాజా! నీ వామన్యువును దిగమ్రింగుము. దానివలన నీకు శాంతి
లభించును. రోగగ్రస్తులు ఫలంబుల నాదరింపరు. వారలకు విషయంబు
లందు తత్త్వమెన్నండును గోచరముగాదు. రోగులు నిత్యంబును దుఃఖా
క్రాంతులే యగుదురు. వారు ధనభోగంబులనుగాని సౌఖ్యంబులను
గాని యనుభవింపఁజాలరు నీవు మున్ను నేఁజెప్పినమాట లాదరించి
యిప్పు డారీతి నాచరించితివికావు. ద్యూతంబున బరాజితయగు ద్రౌపది
నాలోకించి దుర్యోధనుని ద్యూతంబువలన మఱలింపు మనియుఁ బండి
తులు ద్యూతంబుగర్హింతురనియు నేనెంత చెప్పినను నామాట లాదరింపఁ
వైతివి. ఏబలంబున మృదువగువారలతో విరోధింతురో యాబలము
బలంబుగాదు ధర్మసూక్ష్మంబుల నెఱింగి సేవింపవలయును. క్రౌర్యంబున
నార్జింపఁబడినసిరి యెప్పుడును ప్రధ్వంస మొందియే తీఱును. మృదు
మార్గంబున సంపాదింపఁబడినలక్ష్మి పుత్రపౌత్రులకును ననుభవయోగ్యమై
యుండును. నీతనయులు దుర్యోధనాదులు పాండవులను గాపాడు
దురుగాక. పాండుతనయులు నీతనయుల రక్షింతురు. కౌరవులెల్లరు
నేకారిమిత్రులు నేకకార్యులు సమృద్ధులునై సుఖంబున జీవింతురుగాక.
నీవ కౌరవులకెల్లరకును మూలస్తంభంబవై యున్నావు. నీయంద కురు
కులసంపదలెల్ల నాయత్తంబులై యున్నవి. నీయశంబును రక్షించుకొను
తలంపుననైనను బాలురు వనవాసాయాసితులు నగు పాండవులఁ జేరఁదీసి
కాపాడుము. రాజా! నీవు తప్పక వేగముగఁ బాండునందనులతో సంధి
కావింపుము. నీయంతరంబును పరులు ప్రార్థింపకుందురుగాక. పాండవు

లెల్లరు సత్యమందు నిలిచియున్నవారు నీవును దుర్యోధనుని సత్యము
నందు నిలుపుము. అని వచించి మఱియు నిట్లని వచింపం దొడంగె.

రాజా! ఎవ్వఁడు శాసింపరానివానిని శాసించునో, యెవ్వండు
స్వల్పమాత్రంబుననైనను సంతసించునో, యెవ్వఁడు స్త్రీలను లెస్సగా
రక్షించునో, యెవ్వఁడు శత్రుసేవచేనైనను సుఖమొందునో, యెవ్వఁడు
హద్దులేక శత్రువులసేవించునో, యెవ్వఁ డడుగరానిపదార్థంబు లడు
గునో, యెవ్వఁ డాత్మశ్లాఘన మొనరించుకొనునో, సత్కులసంజాతుఁ
డయ్యు నెవ్వఁ డకార్యంబు లాచరించునో, దుర్బలుండయ్యు బలవంతు
నితో నెవ్వఁడు నిత్యవైరముగలిగియుండునో, తనమాట నమ్మనివారి
కెవ్వఁడు బోధించునో, యెవ్వఁ డకామ్యంబు లగువస్తువులఁ గామిం
చునో, ఎవ్వఁడు కోడలి యుపహాసంబుల కానందించునో, కోడలివలన
నాపదలు వాసియు దానికడనే మానంబు చూపువాఁ డెవ్వఁడో,
యెవ్వఁడు పరదారలందు గర్భనిక్షేపము గావించునో, యెవ్వఁడు మితి
మీఱి స్త్రీల కపవాదములు పలుకుచుండునో, యెవ్వఁడు లాభమొం
దియు నే నెఱుంగనని చెప్పునో, అడిగినపు డిచ్చి మాటిమాటికి నెవఁ
డాదానమును బ్రశంసించుకొనునో, యెవఁడు దుర్మార్గులకడ సాంత్వ
ములు గావించునో, వీరు పదునేడుగురుపురుషులు గగనమును ముష్టి
ఘాతంబులచేఁ బగులఁగొట్టువారలనియు ననామ్యంబగు నింద్రధనువున
బ్రణతముగావించువారనియు గ్రహింపరానిసూర్యకిరణముల గ్రహింపఁ
దలఁచువారనియు స్వాయంభువుం డగుమనువు తొల్లి వచించియుండెను
ఈపదునేడుగురుదుర్మార్గులను పాశహస్తులగు యమకింకరులు నిరయం
బునకుం గొనిపోవుదురు. ఏమనుజుఁ డేకార్యంబున నెట్లు ప్రవర్తిం
చునో వానియం దాకార్యంబునం దితరులు నట్ల ప్రవర్తింపవలయును
ఇదియే పరమధర్మము. మాయాచారులయెడ మాయతోడను సాధ్వా
చారులందు సాధుమార్గంబునను బ్రవర్తించుటయే యుత్తమధర్మము
ముదిమి రూపంబు నపహరించును. ఆశ ధర్మంబును విలుప్తంబు గావిం
చును. మృత్యువు ప్రాణంబుల హరించును. అసూయ ధర్మాచరణంబున
నశింపఁజేయును. కామంబు లజ్జను దూరీకరించును. అనార్యసేవ సత్ప్ర
వర్తనమును బోఁగొట్టును. క్రోధంబు సిరి నపహరించును. అభిమానంబు
సర్వంబును హరించును. అని విదురుండు పలుక ధృతరాష్ట్రుండు, "మహ

ప్రాజ్ఞా! పురుషుండు నూఱువత్సరంబులు జీవించునని యెల్లవేదంబులును దెల్పుచున్నవికదా? ఆయాయువునెల్లఁ బురుషుండు పూర్ణముగా నొందకుండుటకుఁ గారణంబే"మని యడిగెను. అదివిని విదురుండు నరేంద్రా! అతివాదంబు, నతిమానంబు, నతిపాపంబు, క్రోధంబు, నాత్మపోషణేచ్ఛ, మిత్రద్రోహంబు నను నీయాఱుపాపంబులును దీక్ష్ణంబు లగు కరవాలంబులై జనులయాయువుల నఱకివైచును. మనుజు నీపాపంబులే చంపుచున్నవికాని మృత్యువు చంపుటలేదు. మృత్యువు చంపుననుట ప్రవాదంబుకాని వాస్తవంబుగాదు. ఎవఁడు నమ్మిన చెలికానిభార్యతో వ్యభిచరించునో, యెవఁడు గురుభార్యారతుండగునో, వృషలీపతి యగుద్విజుండెవ్వఁడో, యెవ్వఁడు మద్యపానం బొనరించునో, యెవ్వఁడు గ్రామణిత్వ మాచరించునో, యెవ్వఁడు జనులజీవనోపాధుల నశింపఁజేయునో, యెవ్వఁడు బ్రాహ్మణులచే దాస్యంబుసేయించునో, యెవఁడు శరణాగతుని వధించునో, వారెల్లరు బ్రహ్మహత్య యొనరించినవానితో సమానులగుదురు. ప్రాజ్ఞుండు వీరలతో నెన్నఁడేని సహవాససహాసవాదులొనరించెనేని బ్రాయశ్చిత్త మాచరింపవలయుననియార్యులందురు. గృహీతవాక్యుండు, నయజ్ఞుండు, వదాన్యుండు, పితృదేవాతిథిశేషాన్నము భుజించువాఁడు, ఎన్నఁడు నెవ్వరిని హింసింపకుండువాఁడు, అనర్థకార్యాకులుండు కానివాఁడు, కృతజ్ఞుండు, సత్యభాషణుండు, మృదుశీలుండు నగు విద్వాంసుండు స్వర్గము నొందును. రాజా! ప్రియవాదు లగుపురుషు లీలోకంబున నెప్పుడు నెందును లభింతురు. అప్రియంబైనను బథ్యంబు పలుకువాఁడును వినువాఁడునుగూడ నెందును గానరారు. ఎవ్వఁడుప్రభువుయొక్క ప్రియాప్రియంబు లాలోచింపక ధర్మము నాశ్రయించి రాజునకప్రియంబులైనను బథ్యము లగువచనము లుపదేశించునో వాఁడే నిక్కముగ రాజునకు సహాయుండగును. కులమునెల్ల రక్షించుటకుఁ బాపియగు నొక్కపురుషుని విడువవలయును. గ్రామంబును రక్షించుటకు గులంబునైన విడువవలయును. రాష్ట్రరక్షణమున కొక్కగ్రామమునైన వీడవలయును. తనుదా నుద్ధరించుకొనుట కీపృథివినెల్లను విసర్జింపవలయును. గొప్పదానిని రక్షించుటకై కొలదిదానిని విడుచుట పరమధర్మం బగు. ఆపదలం దుపయోగించుటకై ధనంబు రక్షింపవలయును. ధనములచే భార్యను రక్షింపవలయును. భార్యచేతను ధనము

చేతనుగూడ నాత్మరక్షణంబు గావించికొనవలయును. పూర్వకాలంబున ద్యూతంబు వైరకారణంబుగా నిర్దేశింపఁబడినది. కావున బుద్ధిమంతుండు హాస్యంబునకేని జూదమాడరాదు. ప్రతీపకులధురంధరా! నే నీయర్థంబు ద్యూతకాలంబునందె తెలిపియుంటిని. కాని రోగి కౌషధము రుచింపనట్లు నావాక్యంబు నీకు రుచింపదయ్యె. కాకంబులచే విచిత్రబర్హాంబులగు మయూరంబులనుంబోలె ధార్తరాష్ట్రులచేఁ బాండవులఁ బరాజితులఁగావింప నెంచితివిగా! సింహంబుల వీడి జంబుకంబులం బెంచినట్లు కాలం బాసన్నంబయినపుడు నీవు మిగుల శోకింతువు సుమీ! ఎవఁడు సర్వకాలంబులందును భృత్యునియెడ భక్తునియెడఁ దనహితము గోరువానియెడలను గోపింపకుండునో యట్టిరాజునందు భృత్యులు మిక్కిలి విశ్వాసముంతురు. వాని నాపదలందు విడువక భక్తితో సేవింతురు. ఎప్పుడును భృత్యులకు జీతంబు లీయకుండఁ గ్రొత్తరాజ్యమునుగాని ధనంబుగాని గ్రహింపఁ దలంపఁగూడదు. జీతంబులీయమిచే భోగంబులకు దూరంబైన యమాత్యులు రాజునం దెంతస్నేహంబుగలవారైనను విడిచిపోయెదరు. సకలకార్యంబుల సాధ్యత్వాసాధ్యత్వంబులు తొలుత నిశ్చయించి యాయవ్యయంబుల గణించి వారివారికిఁ దగు వృత్తులు నిర్దేశించి తగినసహాయులను సంగ్రహింపవలయును. సహాయవంతుఁ డెంతటిదుష్కరకార్యంబులనైనను సాధింప సమర్థుండగును. ఎవఁడు రాజు నభిప్రాయం బెఱింగి తొందరపడకుండ సర్వకార్యంబులు నాచరించుచుండునో, యెవ్వఁడు వక్తయై హితులం దనురాగంబుగలిగి యుండునో, యట్టియార్యు నెప్పుడు దయతోఁ జూచుచుండఁదగును. ఎవఁ డాజ్ఞాపించినకార్యము నాదరించి చేయకుండునో, యెవ్వఁడు మాటలుచెప్పినంతన బదులుచెప్పి తిరస్కరించునో, యెవ్వఁడు తాను ప్రాజ్ఞుండనని గర్వించునో, యెవ్వఁడు ప్రతికూలవచనంబులు వలుకునో యట్టిభృత్యు నాక్షణంబునన విడువవలయును. అస్తబ్ధుండు క్లీబుండు దీర్ఘసూత్రుండునుగాకుండి యనుక్రోశంబుగలిగి శ్లక్ష్ణుండు పరులయుపాయంబులకు లొంగనివాఁడు నారోగ్యవంతుండు నుదారవాక్యంబులు గలవాఁడు నగునెనిమిదిసల్లక్షణములు గలదూత యుత్తముఁ డనంబడును. ఎప్పుడును నమ్మి శత్రులయిండ్ల కేఁగరాదు. అకాలమునందు జ్ఞానమును విడువఁగూడదు. రాత్రియందు రహస్యంబుగ వీథులం దుండ

రాదు. రాజు కామించినస్త్రీని నెన్నఁడును గామింపరాదు. ఈకార్యంబు లాచరించిననరుండు నాశ మొందును. మంత్రగతుండు సంసృష్టమంత్రుండు కాపురుషసంగతుండు నగువానికడ నేఁగరాదు. ఎప్పుడును నిన్ను విశ్వసించితినని పలుకరాదు. ఎప్పుడును వ్యాజముగ సకారణంబుగఁ జూపుచుండవలయును. ఘృణాత్ముండు, రాజు, జారవనిత, రాజభృత్యుఁడు, కొడుకు, సోదరుఁడు, విధవ, చంటిబిడ్డ, తల్లి, సైనికుఁడు, ఐశ్వర్యంబుగోలుపడినవాఁడు ననువారితో నెన్నండును వ్యవహారం బాచరింపరాదు. వారలతో వ్యవహారముచేసినచోఁ దనధనము మరలఁ దనకు లభింపదు. ప్రజ్ఞ, సత్కులసంజననము, శాస్త్రాధ్యయనము, దమము, పరాక్రమము, మితభాషిత్వము, శక్తికొలఁదిదాన మొనరించుట, చేసిన మేలు మఱవకుండుటయు ననునెనిమిదిగుణంబులచేఁ బురుషుండు మిగులఁ బ్రఖ్యాతినొంది వెలుంగును. ఈగుణంబులన్నిటికంటె నుత్తమమయినది రాజసత్కారము. రాజు యుక్తాయుక్తంబు లెఱింగి యోగ్యుల సత్కరించినచో నాతనికీర్తి దిగంతముల వ్యాపించును. స్నానశీలునకు బలము, రూపము, స్వరవర్ణవిశుద్ధి, సుస్పర్శము, సుగంధము, విశుద్ధత్వము, సిరి, సౌకుమార్యము, ఉత్తమస్త్రీలు ననుపదిలాభంబులు గలుగును. మితముగా భుజించువానికి నారోగ్యము, నాయువు, బలము, సుఖము, కలుషరాహిత్యము, సంతానమును లభించును. వానిని బహుభోజి యని యెవ్వరు నాక్షేపింపకుందురు. పనిచేయుట యందు సోమరియగువాఁడు, తిండిపోతు, లోకముతో విరోధించువాఁడు, పెక్కుమాటలు ప్రేలువాఁడు, నృశంసుఁడు, దేశకాలంబు లెఱుంగనివాఁడు, ఉద్ధతవేషము ధరించువాఁడు నగువారలను గృహమునందు వసింపనీక వెడలఁదఱుమవలయును. దాన మొనరింప నిచ్ఛలేని వానిని, నిందించుస్వభావముగలవానిని, శాస్త్రాధ్యయనంబుగావింపని వానిని, వనవాసాయాసుని, ద్యూతోపజీవిని తన్నుతానే గౌరవించుకొనువానిని, నిష్ఠూరుని, కృతవైరుని, కృతఘ్నుని నెంతయార్తినొంది నప్పుడైనను యాచింపఁజనదు. క్లేశకర్మాభిరతుని, అతి ప్రమాదంబులు గలవానిని, నిత్యము ననృతభాషణములాడువానిని, దృఢభక్తిలేని వానిని, అనురాగవర్జితుని, బలవంతుఁడ ననుకొని గర్వించువానిని, నీ నరాధము లార్వుర నెప్పుడును సేవింపఁజనదు. సహాయంబు లర్థంబుల

తోడను నర్థంబులు సహాయములతోడను నిత్యసంబంధముగలిగియుండు టచే వీనిలో నొకటి యేదిలేకున్నను రెండవది సిద్ధింపదు. పుత్రులను బడసి వారలకు ఋణములేవియు లేకుండఁజేసి వారల కేదో యొక్క వృత్తిని గల్పించి పుత్రికలనెల్ల నుచితులగుభర్తల కొసంగి తానరణ్యముల కేఁగి మునివృత్తినున్న వాఁడు సుఖంబును గీర్తిని బడయును. నరపాలుం డెప్పుడును సర్వభూతంబులకు హితంబును దనకు సుఖావహము నగుకర్మంబు నాచరింపవలయును. అట్టికర్మంబె సకలార్థములు చేకుఱుటకు ముఖ్యసాధనంబై యుండును. వృద్ధి, ప్రభావంబు, తేజము, సత్వము, అభ్యుత్థానము, నిత్యోత్సాహము, నేపురుషునకుండు నాపురుషునకు వృత్తిలేదనుభయ మెన్నండు నుండదు. రాజా! పండితులతోడివిరోధము బహుదోషాకరంబని యెఱుంగుము. పండితవిరోధంబునకు దేవతలు దేవేంద్రుండునుగూడ భయమందుదురు. పుత్రులతోడివైరము నిత్యము భయముగలిగించునది. దానివలనఁ గీర్తినాశమును శత్రువులు హర్షించుటయు సంభవించును. భీష్మునియొక్కయు, నీయొక్కయు, ద్రోణునియొక్కయు, యుధిష్ఠిరునియొక్కయుఁ గోపంబు ప్రవృద్ధంబయ్యె నేని లోకంబునెల్ల నంతరిక్షమం దుదయించిన ధూమకేతువుం బోలి దహించును. నీతనయులు నూఱుగురును గర్ణుండును బాండవులేవురును గలిసిమెలసియుండి యీసాగరాంబర మగు మహీమండలము నెల్లఁ బాలింతురుగాక. నీతనయులు వనమువంటివారలు. పాండవులు పులులవంటివారు. పులుల నడవులనుండి వెడలనీ వేఁడునట్లును, నడవిని పులులు లేనిదానినిగాను జేయకుము. వ్యాఘ్రంబులచే వనంబును వనంబున బులులును సురక్షితంబులై యుండును. పులులులేనియడవి నిర్మూలింపఁ బడుటయు, వనమువిడిచివచ్చినపులుల ననాయాసంబున వధించుటయు సుకరంబగును. పాపాత్ములు పరులదుర్గుణంబు లెన్ను నంతటిపట్టుదలతో వారిసుగుణంబుల నెన్నఁదలంపరు. మహార్థంబులు సిద్ధింపఁగోరు నేని ముందుగా ధర్మకార్యాసక్తుండై యుండవలయును. స్వర్గలోకంబు నమృతంబు విడువనట్టు లర్థసిద్ధి ధర్మంబు నెన్నండును బాసియుండదు. ఎవనిమనంబు పాపంబులవలన నివృత్తంబై సుకృతంబునందు బద్ధాదరంబగునో వాఁడు ప్రకృతివికృతి యగుసర్వంబు నెఱుంగఁజాలును. ఎవ్వఁడు కాలానుగుణంబుగ ధర్మార్థకామంబులు సేవించునో వాఁడు

పరలోకమందు నీలోకమునందునుగూడ ధర్మార్థకామము లనుభవించును. ఎవఁడు పొంగిపచ్చు క్రోధహర్షంబుల వేగము నణఁచియుంచునో యెవ్వఁ డాపదలందు మోహామందకుండునో వాఁడు సకలసంపదలకును స్థానమై యుండును. రాజా! పురుషుల కైదువిధము లగుబలంబులుండును. బాహుబలం బందు మొదటిది. అమాత్యలాభం బనునది రెండవది. ధనలాభంబు మూఁడవది సహజమైనది పితృపితామహుల వలన సంభవించినదియు నగుసత్కులసంజననమనునది నాల్గవబలము. ఈ బలంబులనెల్ల సంగ్రహించినవాని ప్రజ్ఞాబల మనునది యైదవబలము. అది యెల్లబలంబులకు నుత్తమమైనది. గొప్పవారికి నపకారంబు సేయం దలంచి వారితో వైరంబుగొని తాను దూరస్థుండననియుఁ దనకు భయము లేదనియుఁ దలంపం జనదు. స్త్రీలు రాజులు సర్పంబులు స్వాధ్యాయము ప్రభువులు శాత్రవులు భోగంబులు నాయువు ననువస్తువులను బ్రాజ్ఞుం డెవ్వండును దనయధీనములని నమ్మరాదు. ప్రజ్ఞయనుబాణంబునఁ గొట్టఁబడినజంతువునకు ప్రాణముమాన్పఁగల వైద్యులు లేరు. మందులును లేవు. హోమంబులు, మంత్రంబులు, మంగళకర్మంబులు, అథర్వణతంత్రంబులు, నగదతంత్రములును, సిద్ధవైద్యులునుగూడనాబాధమాన్పఁజాలరు. రాజా! సర్పంబులు, నగ్నియు, సింహములు, కులపుత్రులు ననువారి నెన్నండు నవమానింపంజనదు. వా రతితేజస్వు లగుటం జేసి యవమానమాచరించినవానిని దప్పక దహింపక విడువరు. దారువులందుగూఢంబై తేజోరూపం బగునగ్ని యుండును. ఏచను బరులు రగుల్కొలుపకయే తనంత నాయగ్ని యొకప్పుడును బ్రజ్వలింపదు దారువుల మథించి యెప్పు డగ్ని నుజ్జ్వలింపఁ జేయుదురో, యంతఁ బూర్వ మాదారువులం దడంగియున్న యాయగ్నియే యాదారువును వనంబును నితరజంతువులను గూడ నతిశీఘ్రంబున నత్యుగ్రంబుగ దహించివైచును. అట్లే సత్కులసంజాతులు పావకసమానతేజస్వులై యుందురు. వారు కష్టాలం దగ్నివోలె నిర్వికారులై క్షమావంతులై యుందురు. సుతులతోఁగూడిన నీవు లతవంటివాఁడవు. పాండవులు మహాద్రుమంబులంబోలువారు. మహాద్రుమంబుల నూఁత గొనక లత యెన్నండును వృద్ధినొందఁ దనుట నిక్కముకదా? నీతనయులు వనమనియుఁ, బాండవులు వనమందు వసించుసింహములనియు నెఱుంగుము. సింహములు విడిచిన వనంబు

నశించుననియు, వనంబుబాసిన సింహములు వధింపఁబడుననియునుగూడ బాగుగా నెఱుంగుము.

పెద్దలు గృహంబునకు వచ్చినంతనే పిన్నలప్రాణంబులు మీఁది కెగసిపోవును. పిన్నలు పెద్దల కాచరించు ప్రత్యుత్థానాభివాదములచేఁ దిరిగిపోయినప్రాణముల నొందుదురు. అభ్యాగతుం డగు సాధువునకుఁ బీఠమిచ్చి జలంబులఁబాదప్రక్షాళనంబుగావించి కుశలప్రశ్నంబు గావింప వలయును. తరువాతఁ దనస్థితిని గప్పి వానియనుమతంబుగ బాగుగఁ బరీక్షించినయన్నంబు గుడువం బెట్టవలయును. ఎవ్వనిగృహమునం దుత్తము లగువా రుదకము మధుపర్కము గోవును స్వీకరింపఁజాలరో వానిజీవితంబు నిరర్థకం బని యార్యులందురు. లోభంబునఁగాని భయం బునఁగాని కార్పణ్యవశంబునఁగాని యెవ్వఁడు నతిథిపూజ మానరాదు. అతిథిపూజ సేయనివాని బ్రతుకు వ్యర్థము. చికిత్సకుఁడు, బాణకారుఁడు, నష్టబ్రహ్మచర్యుండు, చోరుండు, క్రూరుండు, మద్యపాన మొనరించు వాఁడు, భ్రూణహత్య చేసినవాఁడు, సైనికుఁడు వేదవిక్రయ మొనర్చు వాఁడు ననువా రుదకమాత్రమున కర్హులు కాకున్నను నతిథులుగా వచ్చినపుడు ప్రియంబున నాదరింపఁదగువారు. ఉప్పు, వండినయన్నము పెరుఁగు, పాలు, తేనె, నూనె, నేయి, నువ్వులు, మాంసము, ఫలములు, దుంపలు, శాకము, ఎఱ్ఱనివస్త్రములు, సుగంధవస్తువులెల్లను, బెల్లమును ఎప్పుడును విక్రయింపరాదు. రోషంబు విడిచి కుండపెంచికయందును, గాంచనమునందును సమబుద్ధియై, శోకంబు విడిచి సంధివిగ్రహంబుల దలంపక, నిందాప్రశంసలను గణింపక, ప్రియాప్రియంబులు విడిచి యుదాసీనుఁడువోలె నెవ్వఁడు ప్రవర్తించునో వాఁడు భిక్షుకుం డనం బడును. నివ్వరిధాన్యము మూలములు గారపిండి తోఁటకూర మొద లగునవి భుజించుచు, సంతతము నగ్నికార్యములం దప్రమత్తుండై వన వాసం బొనరించుచు, నతిథిసత్కారము గావించువాఁడు తాపసుం డనఁబడును. పుణ్యాత్ముల కీతఁడు ధురంధరుండై యుండును. బుద్ధిమం తున కపకారంబుగావించినవాఁ డెంతదూరదేశమం దున్నను దప్పక కీడుబొందును. హింసితుం డగుబుద్ధిమంతుని బాహువు లతిదీర్ఘంబులై యాలోకంబెల్లఁ జుట్టిపట్టుట కనువై యుండును. వానితో నాతండు తన్ను హింసించినవానిని దప్పక హింసించును. తన్ను విశ్వసింపనివాని

నెన్నండును విశ్వసింపరాదు. తన్ను విశ్వసించినవానియం దైనను నతి
విశ్వాస ముంపఁజనదు. విశ్వాసమువలన భయము జనించెనేనది మూల
మును గూడఁ బెఱికివేయును. ఎవ్వరియందు నీర్ష్యఁ గొనఁగూడదు.
భార్యను రహస్యముగ రక్షింపవలయును. తనధనంబు భృత్యులకు విభ
జించి యిచ్చుట శ్రేయము. ఇంద్రియముల జయించుట లోకమును
జయించుటకు సాధనము. ప్రియవచనము లమృతసేకముకంటెఁ జల్ల
నివి. మధురవాక్యంబులవలన నెల్లస్త్రీలును వశులగుదురు. ఎన్నఁడును
స్త్రీలకు వశపడఁగూడదు. స్త్రీలు మహాభాగలు, పుణ్యలు, గృహమును
వెలింగించువారు. గృహమునకు స్త్రీలే లక్ష్ములు. కావున, వారి నెల్ల
పుడు నానావిధులఁ బూజించుచు విశేషప్రయత్నంబుల వారిని రక్షింపఁ
దగును. అంతఃపురాధికారము జనకునకును, వంటయింటిపెత్తనము
దల్లికిని, దనతోసమానుఁడగు విశ్వాసపాత్రుఁడగువానికి గోవులరక్షించు
పనియు నేర్పఱింపఁదగును. వ్యవసాయం బరయుట కితరుల నెవ్వరిని
నియమింపక తానుమాత్రమే వెడలుచుండవలయును. భృత్యులచే
వాణిజ్యంబును, సుతులచే నతిథిసత్కారంబును జేయింపఁదగును. నీటి
వలన నిప్పును, బ్రాహ్మణులవలన క్షత్రియకులమును, ఱాలవలన లోహం
బులును జనించుటం జేసి, యగ్నిక్షత్రాశ్మంబులతేజం బెల్లయెడల నవ్యా
హతంబయ్యు స్వజన్మకారణంబులందు మాత్రము బ్రతిహతమై యుం
డును. సత్కులమందు జనించిన మహాపురుషులు శాంతిప్రధానులై
కాష్ఠాంతస్థితమగునగ్నివోలె నిర్వికారులై యుందురు. ఎవ్వనిమంత్ర
మును దనవారు వెలివారుగూడ నెఱుంగఁజాలరో; సర్వతశ్చక్షుం డగు
నారాజు చిరకాల మైశ్వర్య మనుభవించును, కర్మంబులు చేయక
మున్ను జేయునపుడు నెవ్వరికిఁ దెలుపరాదు. కార్యంబులు పరిసమా
ప్తములైనపిదప నెల్లరకును బ్రకటింపందగును. ఈరీతిని ధర్మార్థకామ
కార్యంబు లాచరించువానిమంత్ర మొకప్పుడును భేదింపఁబడదు.
కొండశిఖరమునందుఁగాని ప్రాసాదంబునందుఁగాని నిశ్శలాకం బగు
నరణ్యమునందుఁగాని వసించి రహస్యముగా మంత్రము గావింప నగును.
రాజా! గుప్తముగా నొనర్చినమంత్రమును శాత్రవు లెఱుంగఁజాలరు.
తనకు స్నేహితుండైనను బండితుఁడుకానివానిని, బండితుండైనను నాత్మ
వంతుఁడుకానివానిని బాగుగఁ బరీక్షింపక సచివుఁడుగా నంగీకరింపఁజనదు.

అమాత్యునియర్థప్రాప్తియు మంత్రరక్షణమును నాతఁ డొనరించిన సర్వకార్యంబులును బారిషదులకుఁ దెలుపుచుండవలయును. ఎవనికడ నట్టిమంత్రు లుందురో యట్టినరపతి ధర్మార్థకామంబులొంది రాజసత్తముం డనంబరఁగును. గూఢమంత్రముగల యారాజునకు నిస్సంశయంబుగ సర్వార్థములు సిద్ధించును. అజ్ఞానవశంబున నప్రశస్తంబు లగు కార్యంబు లెవ్వఁ డాచరించునో వాఁ డాకార్యములు నశించుటం జేసి తానును నశించును ప్రశస్తంబు లగుకర్మంబు లాచరించుట సుఖావహము. వాని నాచరింపక పేక్షించుట పశ్చాత్తాపమునకుఁ గారణంబగును. వేదాధ్యయనంబుగావింపని బ్రాహ్మణుండు శ్రాద్ధభోజనంబున కర్హుండు గానిరీతిని, షాడ్గుణ్యమెఱుంగని మనుజుండు మంత్రము వినుట కర్హుండు గాఁడు. స్థానవృద్ధిక్షయంబులు చక్కనెఱింగి షాడ్గుణ్యంబుఁ దెలిసి సత్స్వభావముగల నరపాలునకుఁ బుడమియెల్ల నెల్లకాలము వశపడియుండును. ఎవ్వనిక్రోధహర్షంబులు పొల్లువోక తగినఫలంబు లొసంగునో; తా నొనర్చినకార్యంబులనేని మరలమరల నెవఁడు పరీక్షించుచుండునో; కోశంబు నెవ్వఁడు బాగుగఁ బరిశీలించి యరయుచుండునో యట్టి మహీపాలున కీవసుంధర యెల్లకాలము వసుంధరయే యగును. రాజు రాజలాంఛనమగు ఛత్రంబునను రాజనెడుశబ్దంబునను మాత్రమే తృప్తి నొందదగును. తాను గడించినధనంబు లెల్ల భృత్యులకై వినియోగింపవలయును. తా నొక్కరుండే యెప్పుడు నర్థంబు లనుభవింపఁ దలంపఁగూడదు. బ్రాహ్మణుని ప్రభావము బ్రాహ్మణుఁడే యెఱుంగ సమర్థుండు. భార్యసుగుణము లెఱుంగ భర్తయే యర్హుండు. అమాత్యుని మంచితనము రాజు దెలియనగును. రాజును రాజే యెఱుంగును. వధింపఁదగినశాత్రవుండు చేఁ జిక్కినపుడు వాని నెన్నండును విడువరాదు. వానిని గారాగారంబున బంధించియుంచి వానిబలంబు పరీక్షింపవలయును. వాఁడు బలవంతుఁడయ్యేనేని దప్పక చంపవలయును. వానిని జంపక విడిచినచో వానివలన నచిరకాలమున భయము ప్రాప్తించును. దేవతలు, బ్రాహ్మణులు, రాజులు, వృద్ధులు, బాలురు, రోగగ్రస్తులు ననువారియెడ నెన్నండును గోపింపరాదు. వారివిషయమున జనించిన కోపము నతిప్రయత్నంబున మరలింపవలయును. ప్రాజ్ఞుండు నిరర్థకంబగు కలహంబు గావింపఁగూడదు. మూఢు లట్టికలహంబులు సేయుచుందురు.

నిరర్థకకలహంబులు వర్జించిన లోకమునందుఁ గీర్తిగాంచును. వాని కెన్నఁడు ననర్థంబులు సంభవింపవు. ఎవ్వనిదయ నిష్ఫలంబుగాదో క్రోధంబు నిర్హేతుకంబుగాదో వాని నెల్లరు సేవింతురు. నిష్ఫలానుగ్రహము నిష్కారణకోపముగలనరపాలుని బ్రజలు నపుంసకుం డగుమగని భార్య విడుచునట్లు విడిచెదరు. బుద్ధిబలనమాత్రమే ధనలాభంబు గలుగదు. జాడ్యంబు ననే యసమృద్ధి సంభవింపదు. ప్రాజ్ఞుండు లోకపర్యాయవృత్తాంతము నెఱింగి సంపదలగడించి యసమృద్ధిని బాఱఁద్రోలును. అప్రాజ్ఞుం డట్లు గావింప సమర్థుండుగాఁడు. మూర్ఖుండు విద్యావృద్ధులు వయోవృద్ధులు జ్ఞానవృద్ధులు శీలవృద్ధులు ధనవృద్ధులు మహాకులవృద్ధులు నగువారి నవమానపఱుచును. ప్రాజ్ఞుండు వృద్ధుల కెప్పుడు నవమాన మాచరింపక వినయంబున సేవించును. అనార్యవృత్తముగలవానిని, నప్రాజ్ఞుని నసూయాపరుని,నధార్మికుని,వాగ్దోషము లాచరించువానిని, గ్రోధశీలుని ననర్థములు వేగముగా నాక్రమించుకొనుచు విసంవాదరాహిత్యము, దానము, సమయము నతిక్రమింపకుండుటయు, బాగుగా నుచ్చరింపఁబడినవాక్యంబులు భూతంబులనెల్ల వశపఱుచుకొనును. అసత్యమాడకుండువాఁడు, దక్షుండు, కృతజ్ఞుండు, మతిమంతుండు, ఋజువర్తనము గలవాఁడు నగురాజు క్షీణకోశుండైనను మహాపరివారంబు గలిగి వగఱకజేయుండై యుండును. ధైర్యము, శమము, దమము, శౌచము, కారుణ్యము, నిష్ఠురవాక్యరాహిత్యము, మిత్రద్రోహ మాచరింపకుండుట యనునేడుసుగుణంబులు సంపదల నుజ్జ్వలముల గావించుసమిధలై యొప్పును. సంపదలు భృత్యుల కీయక తా నొక్కరుండ యనుభవించువాఁడును, దోషావిలాత్ముండును, చేసిన మేలు మఱచు వాఁడును, లజ్జలేనివాఁడును నగురాజును సేవింపక విడువవలయును. తాను దోషంబు లాచరించియు నదోషుండగు నరు నెవ్వఁడు నిందించి కోపింపఁజేయునో వాఁడు పామున్నయింటియందుఁ బండుకొన్నవాఁడుంబోలె రాత్రులందు సుఖముగ నిద్రనొందఁజాలఁడు. ఎవరు కోపించినఁ గ్రొత్తరాజ్యము సంపాదింపను ఉన్నదానిని బాలింపను వశముగాదో యట్టివారి నెల్లవేళలందు దేవతలవలెఁ బూజింపవలయును. స్త్రీలయందుఁ బ్రమత్తులందుఁ బతితులందును సమాసక్తంబులగునర్థంబులు సంశయితంబులై యే యుండును. అనార్యులందు సమాసక్తంబులగునర్థంబులు నశ్లే

సిగ్గుపడకుండును. స్త్రీలును ధూర్తుండును బాలుండును నెవ్వరి యుపదేశ కర్తలుగా నుందురో యట్టివారు విపన్నులై ఱాలు మెడగట్టుకొని నదిలోనం దిగువారివలె దుఃఖసాగరంబున మునుంగుదురు. ఎవరు ప్రయోజనంబులందు మాత్ర మాసక్తులై విశేషంబులందుఁ జరింపరో వారు పండితులని చెప్పంబడుదురు. విద్వాంసులు అభిశస్యులం గాను సక్తు లగుదురో వారు సంపన్నులగుదురు. ఎవని దూత్యాదులు శ్లాఘింతురో, యువతులు చారులు స్తుతింతురో, బంధుజన మెవనిని మెత్తురో, వాఁడు చిరకాలము జీవింపక మృతుం డగును. రాజా! మహాధనసమృద్ధుఁ డగు పాండునందనుని విడిచి సర్వైశ్వర్యసమన్వితుండవై శ్వర్యంబెల్ల దుర్యోధనున కిచ్చితివి. ఐశ్వర్యభ్రమమత్తుండగు బలి ముల్లోకములందు నిలువ నీడ గానక యధఃపాతాళంబునకుఁ బోవునట్లు నచిరకాలంబునఁ బరిభ్రష్టుండగు దుర్యోధనునితోం జెలఁగు నీవు నచిరకాలంబున భ్రష్టుండ వయ్యెదవు" అని వచించెను.

ఆపలుకు లాలించి ధృతరాష్ట్రుండు 'మహాప్రాజ్ఞ! పురుషుండు భవాభవంబుల కీశ్వరుండు గాఁడు. సూత్రంబుఁ గట్టినకఱ్ఱబొమ్మవలె వాఁడు విధాత యెట్లాడించిన నట్లాడును. పురుషుం డెప్పుడును దైవంబు నకు వశంవదుండై యుండును. కావున నే నేమి చేయఁగలను? నీవు పలుకువచనంబు లెంతవిన్నను దనివి చనదు. కావున సావధానుండనై వినుచున్న నా కింకను వీనుల విందుసేయుచు మంచివాక్యంబులు చెప్పు' మని యడిగెను.

అంత విదురుండు మఱియు నిట్లు చెప్ప నారంభించెను. రాజా! సరియయిన సమయమున నేకాని యెవ్వరికిని హితోపదేశంబు సేయ రాదు. అసమయంబున నుపదేశించెనేని బృహస్పతియైనను బుద్ధ్యవ జ్ఞానంబు నవమానంబు నొందును. ఒక్కఁడు దానంబొనరించి ప్రియుం డగును. వేఱొక్కరుండు ప్రియవచనంబులచేతనే ప్రియుం డగును. మంత్రమూలబలంబున నింకొక్కరుండు ప్రియుండగును. ఎవ్వఁడు ప్రియుం డగునో వాఁడు ప్రియుండే యగును. ఎప్పుడును ద్వేష్యుండు సాధువర్తనుండుగాని మేధావి కాని పండితుఁడుగాని కాఁజాలఁడు. ఎవ్వరైనను బ్రియునియెడ శుభకార్యంబులును ద్వేష్యులందుఁ బాప కార్యంబులు నాచరించుట నైజము. రాజా! దుర్యోధనుండు పుట్టి

నంతన 'రాజా! వీఁడు బహుపాపాచారుఁ డగును. వీని నవశ్యము విడు
వుము. వీనిని విడువకున్నఁ బుత్రు లెల్లరకు నాశమగును. వీని విడచిన
మిగిలిన నూఱ్వురుపుత్రులు సుఖింతురని నేను జెప్పుచుంటిని. ఏవృద్ధి
చివరకు నాశము నాపాదించునో యట్టివృద్ధి కానందింపరాదు. క్షయ
మైనను బరిణామమున వృద్ధిని గల్పించుచో నట్టిక్షయ మాశింపఁదగి
నది. క్షయ మనఁగా నేదివలన బహునాశము సంభవించునో యదియే
క్షయమని తలంపవలయును. పురుషులు కొందఱు గుణములచే సమృద్ధ
లగుదురు. మఱికొందఱు ధనమువలన సంపన్నులగుదురు. ధనవృద్ధులు
గుణహీనులైనచో విడువఁదగినవారే యగుదురు. మహీపతీ! నీతన
యులు ధనసమృద్ధులేకాని గుణసమృద్ధులు కారు. కావున వారల నవ
శ్యము విడచి సుఖంబును గీర్తిని బొందుము.' అని విదురుఁ డాడిన
మాట లాలించి ప్రజ్ఞాచక్షుండు 'మహాప్రాజ్ఞ! నీవు చెప్పునదెల్ల నుత్తర
కాలశుభావహ మగునదియుఁ బ్రాజ్ఞసమ్మత మగునదియునై యొప్పుచు
న్నది. ఐనను నాతనయుని విడువఁజాలను. జయాపజయంబుల నేను
విమర్శింపను. ధర్మ మెక్కడనుండు నక్కడ జయము నుండుట తప్పదు
కదా' యనియె. అంత విదురుండు మరల నిట్లనియె. మిక్కిలి గుణసం
పన్నుఁడు వినయాన్వితుండు నగువాఁ డొకప్పుడైన భూతములయుప
మర్దమును సుసూక్ష్మమైనదానినే నుపేక్షింపఁడు. పరాపవాదనిరతులై
సతతోత్థితులు పరదుఃఖోదయములందును బరస్పరవిరోధములందును
బ్రయత్నింతురు. వారల దర్శించినను దోషము సంభవించును. వారల
తోడి సహవాసమువలన మహాభయంబు గలుగును. అర్థగ్రహణంబున
బహుదోషంబులు సంభవించును. అర్థప్రదానంబున భయంబు లుద
యించును. ఎవ్వరు భేదోపాయప్రయోగమందు దక్షులో కామాకు
లాత్ములు లజ్జారహితులు శఠులు నగుదురో, యెవ్వరు పాపాత్ములని
ప్రసిద్ధి నొందినవారో వారితోడ సంవాస మాచరింపరాదు. ఇంకను
మహాదోషంబులు గలవారలెల్లరతోడను సంవాస మొనరింపక వారిని
విడువవలయును. నీచులయెడ స్నేహమును మరలించినచో వారియందుఁ
బ్రీతి తనంతతాన నశించును. మఱియు ఫలనివృత్తియు స్నేహమందలి
సుఖంబును నీచుం డెఱుంగంజాలఁడు. క్షయమాసన్నముకాఁగానే యప
వాదములాడుటకు యత్నం బాచరించును. నీచుండు పొరపాటుననే నపు

శోకము సంభవించిన శాంతిని బొందనేరఁడు. నృశంసులు నకృతాత్ములు
నగువారు నీచులతోడి చెలిమిని బాగుగ బుద్ధిచే విచారించి మానుకొనం
దగును. విద్వాంసు లెప్పుడు నట్టినీచులను దూరముగ విడిచెదరు.
ఎవఁడు జ్ఞాతులను దీనులను దరిద్రులను రోగులను దయతో నాద
రించునో వాఁడు పశుపుత్రధనధాన్యాదులవృద్ధిని ననంతశ్రేయం
బులు నొందును. తనసౌఖ్యంబు నెవ్వఁ డాశించునో వాఁడు తప్పక
జ్ఞాతులను రక్షింపవలయును. కావున రాజా! నీవు నీజ్ఞాతివృద్ధిని కుల
వృద్ధిని గావింపుము. జ్ఞాతులకు సత్కారంబు లాచరించువాఁడు సకల
శ్రేయంబు లనుభవించును జ్ఞాతులు గుణహీనులైనను విడువక రక్షింప
వలయును. గుణవంతు లగుపాండవులను జేరఁదీయు మని చెప్పనేల? వా
రెల్లప్పుడును నీదయ నాకాంక్షించుచున్నవారలు. రాజా! వీరలగుపాండు
నందనులయెడఁ బ్రసాదము నొందుము. వారలు సుఖంబుగ జీవించు
టకుఁ గొన్నిచిన్నగ్రామములుమాత్ర మిమ్ము. అట్లొనరించిన వార
లెంతయు సంతసించి నీకండయై యుందురు. నీకు జగంబులందు విమలం
బగుయశంబును లభించును. వృద్ధుండ వగు నీవు నీకుమారులను బాగుగ
శాసింపవలయును. నేను వారల కెప్పుడును హిత ముపదేశించుచుండ
వలయును. న న్నెప్పుడును నీహితునిగానే యెఱుంగుము. శుభాకాంక్షి
యగువాఁడు జ్ఞాతులతో నెప్పుడును విగ్రహం బాచరింపం జనదు.
జ్ఞాతులతోఁగూడియే శుభంబు లనుభవింపం దగును. సంభోజనము సంక
థనము పరస్పరసంప్రీతి యనునవి జ్ఞాతులతోఁ గావింపఁదగును. విరోధ
మెన్నండును జేయరాదు. జ్ఞాతు లాపదలనుండి తరింపఁజేయుదురు.
వారే దుఃఖములందు ముంచివేయుదురు. సద్వ్యవహారము గలజ్ఞాతులు
తరింపఁజేయుదురు. దుర్వ్యవహారపరాయణు లగుజ్ఞాతులు దుఃఖమున
ముంచెదరు. నీవు పాండవులయెడ సువృత్తుండ వగుము. పాండవుల
తోఁగూడిన నిన్నే శత్రువులును ధర్షింపఁజాలరు విషముపూసిన చేతులు
గల మృగయునిఁజేరి మృగము మృతినొందినట్లు శ్రీమంతు డగు నెవని
నాశ్రయించి యేజ్ఞాతులు నశింతురో యాజ్ఞాతులపాపంబు లెల్ల శ్రీమం
తునే జుట్టుకొనును. రాజా! యుద్ధానంతరమైనను పాండవులు నిహతు
లైరని యో సుతులు హతులైరని యో విన్న నీ కనంత మగుతాపము
సంభవించుట నిక్కము. ఆసంగతి బాగుగ నిపుడ యాలోచించి

కొనుము. ఈజీవితంబు నశ్వరంబు. ఏకర్మం బాచరించిన మంచమెక్కి
నపుడు నిద్రలభింపక పరితాపంబుగలుగునో యట్టిపాపకార్యం బావి
యంద చేయక విడుచుట యుక్తము. నీతిశాస్త్రప్రణేత భగవంతుండగు
శుక్రుం డొక్కరుండే యపకారి యనం జనదు. లోకంబున నెల్లరు నప
నయంబ కావించుచున్నారు. అయినను దత్కాలోచిత మగు నాలోచన
మును బుద్ధిమంతులు గావింపవలయును. రాజా! మున్ను దుర్యోధ
నుండు వారలయెడఁ గావించినపాపకార్యంబుల కెల్లఁ గులవృద్ధుండ వగు
నీ విపుడు నిష్కృతి గావింపవలయును. వారలనర్హపదంబునఁ బ్రతిష్ఠించి
నీవు కల్మషరహితుండ వయ్యెదవు. మనీషులెల్లరు నీ వట్లు గావించిన
మిగుల సంతసించి నిన్నుఁ బూజింతురు. ఎవ్వఁడు ధీమలసదుక్తులను
బాగుగ నాలోచించి ఫలవంతములగువాని నాదరించి కార్యంబులు నిర్వ
యించునో వాఁడు చిరయశంబు గడించును. గొప్పనేర్పరు లుపదేశించిన
దైనను జ్ఞానము సమ్యగుపయుక్తముగానిచో విపరీతఫలంబు లొసంగును.
తెలియఁదగుదానిని దెలియకున్నను, దెలిసియు బాగుగ నాచరింపకున్నను,
నది వ్యర్థమేయగును. నేను నీకెంతయో మేలుచెప్పితిని కాని నీవు దానిని
విన్నను నాచరింపను లేవైతివి. వాపోదయఫలం బగుకార్యంబు నెవ్వఁ
డారంభింపకుండునో యావిద్వాంసుం డెల్లభంగుల నభివృద్ధినొందును.
ఎవ్వఁడు పూర్వము చేసినపాపమును విమర్శింపక దానినే యనుసరిం
చునో యాదుర్బుద్ధి యగాధంబు విషమంబు నగు పంకంబునంబడును.
మంత్రభేదంబునకు ద్వారంబు లగు నీయాఱింటిని బ్రాజ్ఞుండు బాగుగ
నెఱింగియుండవలయును. అర్థసంతతికాముం డగువాఁడు నిత్యంబు
వాని నతిప్రయత్నంబున రక్షింపంజనును. మదము, స్వప్నము, అవి
జ్ఞానము, ఆత్మసంభవ మగునాకారము, దుర్మంత్రులయందు నమ్మకము,
అకుశలుం డగుదూతయందలి విస్రంభము ననునవి మంత్రభేదంబునకు
ద్వారంబులు. వీనిని బాగుగ నెఱింగి యెవ్వఁ డెప్పుడును వీనిని మూసి
యుంచునో వాఁడు ధర్మార్థకామంబు లనఁబడు త్రివర్గము నాచరించుట
యందు దక్షుండై శత్రువుల కందరానిపదము నధిష్ఠించును. బృహ
స్పతికిఁ దుల్యుండైనను శాస్త్రంబులు చదువకయు వృద్ధులసేవింపకయు
ధర్మార్థముల నెఱుంగఁజాలఁడు. సముద్రమందుఁ బడిపోయినవస్తువు నష్ట
మే యగును. మాటవిననివానికిఁ గావించినయుపదేశము నోటినొప్పిని,

గలిగించును గాని ఫలప్రదము గాఁజాలదు. అనాత్మజ్ఞుఁడు చదివిన శాస్త్రంబులు నష్టంబులు. అగ్ని లేనిబూడిదలో వ్రేల్చినహోమము నష్టమే యగును. మేధావి యగుపురుషుండు మతిచేఁ బరీక్షించి బుద్ధిచే మాటిమాటికి సంపాదించి వినియుఁ జూచియు బాగుగఁ దెలిసికొని ప్రాజ్ఞులతో మైత్రి నాచరింపఁదగును. వినయం బపకీర్తిని హరించును. పరాక్రమం బనర్థంబుల దూరీకరించును. క్షమ క్రోధంబును బోఁగొట్టును. ఆచారంబు దుర్లక్షణమును నిరాకరించును. భోగోపకరణసామగ్రి, జన్మస్థానము, నివాసగృహము, ఆచారము, భోజనము, వస్త్రము ననువానిచేఁ గులంబును బరీక్షింపవలయును. ఉపస్థితం బగు కామంబునకు నిర్ముక్తదేహాభిమానంబుగలవాఁడైనను బ్రతివాద మాచరింపఁ జాలఁడనుచోఁ గామాభిరక్తుని మాట వేఱ చెప్ప నేల? ప్రాజ్ఞులనుపసేవించువాఁడు, విద్యాసంపన్నుఁడు, ధర్మాభిరతుండు, ప్రియదర్శనుండు, మిత్రవంతుండు, యోగ్యవచనుండు నగుమిత్రుని రాజెన్నఁడును విడువక పాలింపం దగును. దుష్కులీనుండు గాని సత్కులసంజాతుండు గాని యెవ్వఁడు మర్యాద నతిక్రమింపఁడో ధర్మంబు నపేక్షించునో మృదుశీలుండుగ నుండునో హ్రీనిషేవణుం డగునో వాఁడు సత్కులసంజాతులు నూర్వుర కంటె నుత్తముండు. ఏయిద్దరకు చిత్తంబుతోడఁ జిత్తంబును, రహస్యంబుతో రహస్యమును, బ్రజ్ఞతోఁ బ్రజ్ఞయును సమంబుగఁ గలసియుండునో వారిమైత్రి యెన్నండును నశింపకుండును. దుర్బుద్ధియు నకృతప్రజ్ఞుండును తృణచ్ఛన్నకూపోపమానుండు నగుదుష్టునిఁ బ్రాజ్ఞుం డెల్లభంగుల విడువవలయును. అట్టి దురాత్మునితోడిమైత్రి యచిరంబునన నశించును. అవలిప్తులు, మూర్ఖులు, రౌద్రులు, సాహసికులు, ధర్మాపేతులు నగునరులతో నెప్పుడును మైత్రి సేయరాదు. కృతజ్ఞుండు, ధార్మికుండు, సత్యవచనుండు, నక్షుద్రుండు, దృఢభక్తియుక్తుండు, జితేంద్రియుండు, తన స్థితినతిక్రమింపనివాఁడు నగుమనుజుని మిత్రునిఁగా గ్రహింపఁదగును. ఇంద్రియంబుల స్వేచ్ఛగాఁ బోనీయక కట్టియుంచుట మృత్యువు కంటెను గష్టకార్యము దుష్కరము నగును. అత్యంతము నింద్రియముల నిరోధించుట దేవతలకైనను దుష్కరము. సర్వభూతంబుల యెడ మృదువుగా నుండుట, అసూయారాహిత్యము, క్షమ, ధైర్యము, మిత్రుల నవమానింపకుండుటయు నాయుష్కరంబు లని ప్రాజ్ఞులు వచిం

తును మంచిచెడ్డలను దేశకాలములఁ గార్యమును దృఢ మగుమతిచే నెవ్వాఁడు మరల భాగసేయఁజాలునో వాఁడు సత్పురుషుఁ డనం బడును. అకాపురుషులకుఁ గాని యే. దైవమువలన నుత్తరకాలమున సంభవించు నాపదలకు సైతము ప్రతీకార మెఱింగి వర్తమానంబు లగు కార్యంబులయెడ స్థిరనిశ్చయుఁడు నై వర్తించి జరిగిన కార్యముల యనం తర మేకార్య మొనరింపవలయునో తెలిసికొని యెవ్వాఁడు చరించునో వానియర్థంబు లెప్పుడును నశింపవు. కర్మంబునను మనమునను వాక్కు నను దేని నత్యంతము సేవించుచుండునో యది యే వాని నపహరిం చును. కావున పురుషుండు మనోవాక్కాయకర్మంబులఁ బాపకా ర్యంబు లాచరించుట మాని యెప్పుడును శుభంబులనే యాచరింపం దగును. మంగళాలంబనము, యోగము, శ్రుతము, ఉత్థానము, ఆర్జవము, సజ్జనుల నెల్లప్పుడు దర్శించుట యనునవి సకలసంపదల నొసం గును. అనిర్వేదంబు సిరికిని లాభంబునకును శుభంబునకును మూల కారణం బగును. నిర్వేదరహితుండు మహాత్ముం డగును. అనంతం బగు సుఖంబుకూడ ననుభవించును. ప్రభవిష్ణునకు సర్వకాల సర్వావస్థలం దును క్షమకంటె సంతృప్తిదమును పథ్యతరము నగువస్తు వింకొకటి యేదియు లేదు. అశక్తుండు బలములేమిచే నన్నింటిని క్షమించియే యుండును. బలవంతుఁడన్ననో ధర్మంబూహించియే శాంతి వహిం చును. ఎవ్వనికి నిత్యము నర్థానర్థములు సమముగ నుండునో వానికి నిత్యశాంతి కలుగును. ఏసుఖ మనుభవించునపుడు సైతము ధర్మార్థ ములకు హాని సంభవింపకుండునో యట్టికామ మవశ్యము ననుభవింపఁ దగినదే. కేవలము మూఢవ్రత మనుసరించి కామమును బరిహరింప నవసరములేదు. దుఃఖార్తులందుఁ, బ్రమత్తులందు, నాస్తికులందు, నల సులయందు, దమరహితులందు, నుత్సాహశూన్యులందును సిరి వసింప నొల్లదు. దుర్బుద్ధు లగుకాపురుషులు ఆర్జవము గలిగి యార్జవంబునఁ ద్రపాశీలుం డగువానిని శక్తిలేనివాఁడని తలంచి వానిని ధర్షింపఁ జూచెదరు. అత్యార్యుని, అతిదాతను, అతిశూరుని, అతినియమ పరాయణునిఁ, బ్రజ్ఞాభిమానిని సిరి భయంబున సమీపింపదు. సిరి అతిగుణవంతులకడను వసింపదు. అత్యంతగుణరహితులయందు నుండదు. ఈసిరి గుణముల నెక్కుడుగా నభిలషింపదు. నిర్గుణత్వ

నమును గాపాడదు. శుశ్రూషింపబడిన గంధ మూహాపోహలచే నిరిదొక్క-
తనో రొమొక్కటియొక్క నిలిచిపోవుచుండును. వేదాధ్యయన మొన
రించినందులకు నగ్నిహోత్రం బొనరించుటయే ఫలము. శాస్త్రంబును
చేర్చినందుకు సత్స్వభావము సత్ప్రవర్తనము ఫలములు. భార్యను
పెండ్లియాడుటకు రతియుఁ బుత్రోత్పత్తియు ఫలంబులు. ధనమునకు
దానం బిచ్చుటయు దా ననుభవించుటయు ఫలంబులు. ఎవ్వఁ డధర్మం
బున నార్జింపఁబడినధనముచే బరలోకసుఖావహము లగుపదార్థము
లాచరించునో వాఁడు పరలోకమం దాసుఖము ననుభవింపఁజాలఁడు.
కాంతారమందైనను దుర్గమంబు లగు వనములందైనను కృచ్ఛ్రంబు
లగునాపదలందైనను నణకుటకుఁ గత్తులెత్తినప్పుడైనను సత్యవచనులకు
భయ మిసుమంతయు నుండదు. ఉత్థానము, సంయమము, దక్షత్వము,
అప్రమాదము, ధృతి, స్మృతి, పరీక్షించి కార్యంబు లొనరించుటయు
ననునవి కల్యాణమునకు మూలములు. తాపసులకుఁ దపమేబలము. బ్రహ్మ
వేత్తలకు వేదము బలము. దుర్మార్గులకు హింసయే బలము. సద్గుణవంతు
లకు క్షాంతియే బలము. జలములు, ఫలములు, మూలములు, పాలు,
హవిస్సు, బ్రాహ్మణాజ్ఞానిర్వహణము, గురువచనములు, ఔషధములును
నీయెనిమిదియు నీవ్రతంబుల హరించును. తనకేది ప్రతికూలం బగునో
దాని నితరులకుఁగూడ నాచరింపరాదు. సంగ్రహంబుననే ధర్మంబు
ప్రవృద్ధం బగునుగాని కామంబున నధర్మంబు సంభవించును. అక్రో
ధంబుచేఁ గ్రోధంబును, సాధుత్వంబున నసాధువులను లుబ్ధుని దానంబు
నను, సత్యంబున ననృతంబును జయింపవలయును. స్త్రీలయందు ద్యూత
కారునియెడ మందునియందు పిఱికివానియందు చండస్వభావముగల
వానియందు పౌరుషవంతుఁడ నని గర్వించువానియందు చోరునందు
కృతఘ్నునందు నాస్తికునందు నెప్పుడును విశ్వాస ముంపరాదు. అభి
వాదనశీలుండును వృద్ధోపసేవి యగువాని కాయువు, కీర్తి, యశము,
బలము ననునాలుగు వృద్ధిఁబొందుచుండును. అతిక్లేశసాధ్యంబులు ధర్మా
తిక్రమసంపాద్యంబులు శత్రువశంవదత్వసాధ్యములు నగునర్థంబు
లందుఁ బ్రాజ్ఞుం డెన్నఁడు నపేక్ష యుంపఁదగదు. విద్యారహితుం డగు
పురుషుండు శోచ్యుండు. సంతానములేనిదాంపత్యము శోచ్యము.
ఆహారములేనిజనులు శోచ్యులు. రాజులేనిరాష్ట్రము శోచ్యము. శరీర

ధారులకు మార్గమే జర. పర్వతములకు జలము జర. స్త్రీలకు సంభోగరాహిత్యము జర. అబద్ధభాషణము మనమునకు జర. వేదంబుల కనామ్నాయంబు మలంబు. వ్రత రాహిత్యము బ్రాహ్మణునకు మలము. బాహ్లీక దేశంబులు భూమికి మలంబు. పురుషున కసత్యము మలము. పతివ్రతకుఁ గుతూహలము మలము. ప్రవాసము స్త్రీలకు మలము. బంగారమునకు మలము వెండి. వెండికి మలము సత్తు. సత్తునకు మలము సీసము. సీసమునకు మలము మలమే. పండుకొనుటచే నిద్రను జయింప వశము గాదు. కామంబున స్త్రీలను జయింప వశపడదు. సమిధలచే నగ్నిని జల్లార్పఁదరముగాదు. పానంబున మద్యంబును జయించుట కలవిగాదు. మిత్రుని దానంబున జయింపవలయు. యుద్ధంబున శత్రువుల గెలువవలయు. భార్యల నన్నపానంబులచే వశపఱచుకొనఁదగును. ఎవ్వఁ డిట్టు లాచరించునో వానిజీవితము సఫలమగును. రాజా! లోకంబున వేలు వందలు జనులు జీవించుచునే యున్నవారు. నీవును లోకంబున జీవింపకపోవు. జీవమాత్రమునకై యిచ్ఛపలదు. దానిని విడువుము. భూమియందుండు వ్రీహి, యవలు, హిరణ్యము, శిశువులు, స్త్రీలు, నెల్ల పదార్థంబులు గూడ నొక్కనికిఁ జాలవు. ఈవిషయంబు బాగుగ నాలోచించిన పురుషుం డెన్నఁడును మోహపరవశుఁడు కాకుండును. రాజా! మరల మరలఁ జెప్పుచున్నాఁడను నామాటలాదరించి నీతనయులే యగు దుర్యోధనాదులందును బాండవులందును గూడ సమబుద్ధి గలిగియుండుము. నీకు వారలెల్లరును సమానులే కదా? కావున వారలందు సమబుద్ధినుంచుట సకల శ్రేయంబులకు నాస్పదం బగును.

ఎవ్వఁడు సజ్జనులచేఁ బూజింపఁబడునట్లు సంగము లేనివాఁడగుచు శక్తికొలఁది నర్థంబుల సంగ్రహించునో వాని కచిరకాలంబున మహాఖ్యాతి లభించును. సజ్జనులు సంతసించి రేని సుఖము నొసంగుటకు సమర్థులగుదురు. అధర్మయుక్తంబగు మహాధనంబునేని వ్యామోహంబువీడి యెవఁడు నిరాకరించునో వాఁడు మహాదుఃఖంబులనైత మహాయాసంబున వీడి కుబుసంబూడ్చినసర్పమువలె సుఖంబు లనుభవించును. అనృతంబున నుత్కర్షంబు గావించుట రాజుకడఁ గొండెములు సెప్పుట గురువున కలికనిర్బంధముగావించుటయు ననుమూఁడు కార్యంబులు బ్రహ్మహత్యకు సమానములు. అసూయకంటె సర్వాత్మనా మృత్యు వింకొకటి లేదు.

ఆవిషాదంబే సిరిని వధించునుపాయము. శుశ్రూషారాహిత్యము, త్వర,
ఆత్మశ్లాఘనమును విద్యకు శత్రువులనంబెవి. అలసత్వము, మదము,
మోహము, చపలత్వము, గోష్ఠి, వినోదాసక్తి, స్తబ్ధత్వము, అభిమానము,
త్యాగపరాయణత్వము ననునేడుగుణంబులు విద్యార్థులకు దోషంబులు.
సుఖం బాశించువానికి విద్య రానేరదు. విద్యార్థి యగువానికి సుఖము
దుర్లభం బగును. సుఖము లాశించిన విద్యను విడువవలయును. విద్యనే
యాశించుచో సుఖంబుల కాసపడరాదు. ఎన్ని కాష్ఠంబులు వైచినను
నగ్నికిఁ దృప్తిజనింపదు. నదు లెన్నివచ్చికలసినను మహోదధికి సంతసము
జనింపదు. ఎన్నిభూతములఁ జంపినను మృత్యువునకుఁ దృప్తి కలుగదు.
పురుషు లెందఱైనను స్త్రీలకుం దృప్తి కలుగదు. ఆశ ధైర్యంబును
హరించును. మృత్యు వసమృద్ధిని హరించును. క్రోధంబు సిరిని నశింపఁ
జేయును. లుబ్ధత్వము కీర్తినిఁ బోనాడును. పాలనంబు సేయకుండుట
పశువులను జెఱుచును. క్రోధపరవశుం డగు బ్రాహ్మణుం డొక్కరుండేని
రాష్ట్రంబునెల్ల సమయించును. రాజా! మేకలు కాంస్యము రజతము
విషంబు నపహరించుపక్షియు శ్రోత్రియుండు వృద్ధుం డగు జ్ఞాతియుఁ
బేదఱికమనుభవించు కులీనుండును నీగృహమందెల్లపుడును విడువక
వసింతురుగాక. మేక, వృషభము, చందనము, వీణ, ముకురము, తేనె,
నేయి, లోహములు, తామ్రభాజనంబులు, శంఖము, సాలగ్రామము,
గోరోచనము, సకలవిధంబు లగు ధాన్యంబులును, దేవబ్రాహ్మణా
తిథిపూజలకై గృహములందు సేకరించి యుంపవలయునని మనువు
వచించియున్నాఁడు. రాజా! నీకు మఱియు నొక్కవాక్యం బెఱింగించు
చున్నాఁడను. ఈవాక్యంబు సర్వోత్తమంబు. మహావిశేషమునైనది.
నీవు కామంబునఁగాని లోభంబునఁగాని భయంబునఁగాని తుదకుఁ బ్రాణ
హేతువువలనఁగాని ధర్మంబు నొకప్పుడును విడనాడకుము. ధర్మంబు
నిత్యమైనది. సుఖదుఃఖంబు లనిత్యంబులు. జీవుండు నిత్యుఁడు. వీని
ధాతు వనిత్యము. నీవు నిత్యంబుల గ్రహించి యనిత్యంబుల విడువుము.
దాన నీకుఁ బ్రతిష్ఠ యధికముగా లభించును. నీవు సంతతము సంతో
షము నొందుము. సజ్జనులకు సంతోషము పరమధర్మముగదా? మహా
బలవంతులు మహానుభావులు నగునరపతు లెందఱో ధనధాన్యపూర్ణం
బగువసుంధరనేలి రాజ్యంబుల విడిచి భోగంబుల విసర్జించి యంతకునకు

నశ్వరులై యీలోకంబుఁ బాసి చన్నవారలు. వారల నీవు బాగుగ స్మరిం
పుము. అతిదుఃఖంబులు సహించి పెంచినకుమారుండు మృతుం డయ్యె
నేని వానిని విడిచిరే యెల్లరు నిండ్లకేఁగుదురుకదా? తల విరియఁబోసి
కొని వానిని కూర్చి కరుణంబుగ నేడ్చుచుండురు. పిదప వానిని జితా
గ్నియం దొక్కకట్టెవలె వైచి దహించి పైతురు. మృతుండగువాని
ధనం బితరు లనుభవింతురు. శరీరధాతువులను బక్షులు నగ్నియు భక్షిం
చును. వాఁడు పుణ్యపాపంబులు రెంటినిమాత్రము విడువక తనతోఁ
గొనిపోవును. ఫలపుష్పంబులు లేనివృక్షంబులను బక్షులు విడిచినట్లు
జ్ఞాతులు, సుతులు, మిత్రులు నెల్లవారును మృతుని విడిచిపోయెదరు.
అగ్నిదగ్ధుం డగుపురుషుని నాతఁ డొనరించినకర్మమాత్రము విడువక
యనుగమించును. కావునఁ బురుషుఁ డెల్లభంగుల ధర్మంబు సమాచరింప
వలయును. ఈలోకంబున కూర్ధ్వంబునను స్వర్గలోకంబునకుఁ గ్రిందను
మహాభయంకరం బగు నంధతమసము గలదు. అది యింద్రియముల నెల్ల
మిక్కిలి మోహంబులు గావించును. రాజా! నీవు దానిని బాగుగఁ దెలిసి
కొనుము. ఆచీఁకటి నిన్నుఁ దాఁకకుండుఁగాక. నేఁ జెప్పువచనంబు నీవు
బాగుగ విని యాప్రకారంబునఁ జరింపఁగల్గితివేని నీవు గొప్పయశము
వొందఁగల్గుదువు. నీకు నీలోకంబునను బరలోకంబునను గూడ భయ
మింతయు నుండదు. రాజా! ఆత్మ యనువస్తువు గొప్పనది. దానికి పుణ్యంబు
తీర్థము; సత్యమే దాని కుదయము; ధైర్యము దానికూలంబులు; దయ
దానితరంగములు. దానియందు స్నాన మాచరించిన పుణ్యకర్ముండు పవి
త్రుండగును. ఆత్మ యెల్లపుడును బుణ్యమగునదియు లోభరహితమనియు
నెఱుంగుము. కామక్రోధంబులను నక్రంబులు పంచేంద్రియంబులను
నగాధజలంబునుగలనదిని ధైర్యమనునౌక నాశ్రయించి జన్మంబులను
దుర్గంబులఁ దరింపుము. ప్రజ్ఞావృద్ధుండు ధర్మవృద్ధుండు స్వబంధువు విద్యా
వృద్ధుండు వయోవృద్ధుండు నగువారలను గార్యాకార్యంబు లెల్లెడలఁ
బూజించి ప్రసన్నులఁగావించి యెవ్వఁడు కార్యాకార్యంబు లడుగునో
వాఁడెప్పుడును మోహ మొందఁడు. ధైర్యంబున శిశ్నోదరంబుల రక్షింప
వలయును. కాలునేతులను గన్నులచేఁ గాపాడవలయును. మనంబుచేఁ
గన్నులను జెవులను గాచుకొనవలయును. కర్మమున మనంబును వచనం
బును రక్షింపవలయును. నిత్యము యథాకాలముగ స్నానాచమనాదు

లైనవాఁడు నిత్యాగ్నిహోత్రపవిత్రి, నిత్యస్వాధ్యాయనిరతుండు, పతితాన్న వివర్జితుండు, సత్యవచనుండునై గుర్వాజ్ఞానుసారముగ కర్మంబు లాచరించు బ్రాహ్మణుం డొకప్పుడును బ్రహ్మలోకంబును విడువఁడు. వేదాధ్యయనం బొనర్చి యగ్నులరేర్చి యజ్ఞంబులచే వేల్పులకుఁ దృప్తిగావించి న్యాయంబునఁ బ్రజలఁ బాలించి సంగ్రామంబున నసువులువాసిన క్షత్రియుండు స్వర్గమొందును. గోబ్రాహ్మణుల రక్షింప వెడలి శస్త్రహతుండగు వాఁడు స్వర్గలోకంబు వెలుంగును. వైశ్యుండు వేదంబులు నేర్చి బ్రాహ్మణులకు రాజులకు నాశ్రితులకు నుచితకాలంబుల ధనంబు విభజించి యిచ్చుచుఁ బుణ్యంబగు త్రేతాగ్నిగంధ మాఘ్రాణించి స్వర్గమందు దివ్యసుఖంబు లనంతములుగ ననుభవించును. శూద్రుండు బ్రహ్మక్షత్రవైశ్యులను గ్రమంబుగ న్యాయానుసారంబుగఁ బూజించుచు సంతసమందెనేని పాపంబులెల్ల విడిచి స్వర్గసుఖంబు లొందును. రాజా! చాతుర్వర్ణ్యంబున కుచితం బగుధర్మంబులు నీకెఱింగించితి. వానికి హేతువు లెఱింగించెద నాకర్ణింపుము. పాండునందనులును క్షాత్త్రధర్మంబునకు వెలియగుచున్నారు. రాజా! వారలను నీవు రాజధర్మంబులందు నియోగింపుము. అని విదురుండు పలికిన నంబికానందనుండు విదురా! నీవు నన్నెల్లపుడు బోధించుచునే యుంటివి నీ వెట్లు పల్కుచుందువో యట్లే నా మనంబుగూడ యత్నించుచుండును. పాండవులనుగూర్చి నేను మంచి యాలోచనము లెన్నిగావించినను దుర్యోధనునిఁ దలంచినంతన నా యాలోచనములన్నియు నంతరించిపోవుచున్నవి. దైవంబు నతిక్రమించుట కేభూతంబునకును వశపడదు. దైవమే యెల్లయెడల బలవత్తరమైనది. పురుషప్రయత్న మెందును గొఱగానిది. నే నేమి చేయంగలను. శ్రద్ధతో నీవచనంబు లాచించుట నాకుఁ బ్రీతికరంబై యుండును. నీ వింతకుమున్ను చెప్పనివిషయంబు లేవేనున్న నాకు వానినెల్ల సవిస్తరంబుగ వినిపింపుమని పలికె.

## సనత్సుజాతీయము

ఆమాట లాలించి విదురుండు రాజా! నే నెఱింగినవెల్ల నీకుఁ దెలిపియుంటిని. పురాణుండగు సనత్సుజాతుండు మానవునకు మరణంబు లేదని వచించెను. అతండు హృదయసంశ్రితంబులగుగుహ్యంబులను

ప్రకాశంబులనుగూడ నీకెఱింగింపం జాలువాఁడు. ఆసనాతనుండు బుద్ధిమంతులకెల్లఁ బ్రవరుండై యున్నవాఁడు అని పలికెను. అదివిని యాంబికేయుండు విదురా! సనత్సుజాతుండు చెప్పఁగల యర్థంబులు నీవెఱుంగవా యేమి? నీకుఁ బ్రజ్ఞాశేషంబు గలదేని నీవ వచింపుమని పలికెను. అపుడు విదురుండు రాజా! నేను శూద్రయోనిసంజాతుండ నగుటం జేసి యింతకుమున్ను జెప్పినదానికంటె నధికంబుగఁ జెప్పఁజాలను. సనత్సుజాతుని బుద్ధి శాశ్వతమైనదని నేనెఱుంగుదును. బ్రాహ్మణయోనిసంజాతుం డగువాఁ డెట్టిగుహ్యార్థంబులనైనను వచింపం జాలును. అట్లు చెప్పుటకు దేవతలెంతయు గర్హింపకుందురు. శూద్రయోనిసముద్భవుండు గుహ్యంబులెఱింగించినచో దేవతలు గర్హింతురు. కావుననే నీకు సనత్సుజాతుం డుపదేశించునని యంటినని పలికెను. ఆమాటలు విని యాంబికానందనుండు విదురా! పురాణుం డగు సనత్సుజాతుని దర్శించుట మహాకష్టము ఈదేహంబున నిక్కడనయుండి తత్సమాగమలాభం బొందునుపాయముండెనే నెఱింగింపు మనియె. అపుడు విదురుండు నిశ్చలమనస్కుండై క్షణమాత్రము ధ్యానించినంత భగవంతుం డగు సనత్సుజాతుండు వారికట్టెదుటఁ బ్రత్యక్షం బగుడు విదురుండు వినయవినమితాంగుండై లేచి ముకుళితకరకమలుండై సాష్టాంగదండప్రణామంబు లాచరించి యామహాత్మున కర్ఘ్యపాద్యాదిసత్కారంబు లాచరించి సుఖోపవిష్టుంగావించి యిట్లు విన్నవించె. మహాత్మా! యీధృతరాష్ట్రుం డధ్యాత్మవిషయంబున నొక్కసంశయం బందియున్నవాఁడు. ఆసంశయంబు నివారింప నాకలవి కాదు. దానిని దయతో నీరాజునకు దెలుప వేఁడెద. దాని విని యీనరపాలుండు సర్వదుఃఖముల దూరీకరింపఁగలఁడు. మఱియు దాని వినుట వలన నీతనికి లాభాలాభంబులు ప్రియద్వేష్యంబులు జరామృత్యువులు భయామర్షంబులు క్షుత్పిపాసలు మదోద్భవంబులగునరతియుఁదంద్రయుఁ గామక్రోధంబులు క్షయోదయంబులును దూరంబులై పరమానందంబు లభింపంగలదని విన్నవించెను.

విదురుం డట్లు పలికినయనంతరము ధృతరాష్ట్రుండు సనత్సుజాతుని వివిక్తస్థలమునం బూజించి యాతనికి సవినయంబుం నంజలి మోడ్చి భగవానుఁడా! మృత్యువనున దొకటి లేదని నీవు చెప్పితివని విదురుఁడు తెలిపియుండెను. దేవాసురులు సంతతము మృత్యువశులు

గాకుండుటకై బ్రహ్మచర్యవ్రతం బాచరించుచుందురనియు వినియుంటిని. దేవతలతలంపు మృత్యువు కలదనియే. నీవన్ననో మృత్యువు లేనే లేదని యనుచున్నావు. నాకు దేవతలు నీవు నుభయులును బూజ్యులే. పరస్పర విరుద్ధములగు నీరెండుపక్షములును సత్యంబులు గానేరవుగదా? కావున వీనిలో నసత్యమేదియో సత్యమేదియో దయతో నెఱింగించి నాసంశయంబు వాపుమని ప్రార్థించెను. అంత నామునీంద్రుండు చిఱునవ్వునవ్వి, రాజా! నీప్రశ్న ముచితము. పరస్పరవిరుద్ధంబులని నీవన్న రెండుపక్షంబులకును విరోధములేకుండ బోధింతును అని పలికి యిట్లు చెప్ప నారంభించెను "రాజా! కర్మాచరణంబున మృత్యుభయములేదని కొందఱందురు. మఱికొందఱు మృత్యువనునది లేనే లేదని యందురు. ఇందలి సత్యం బెఱింగించెద వినుము. సృష్ట్యాదినుండియు మృత్యువు గలదనియు లేదనియు రెండుపక్షంబులు గలవు. అనాత్మయం దాత్మయనునభిమానమే మృత్యువని కొందఱనుచున్నారు. ఆయభిమానంబునే మోహమని యందురు. స్వాభావికం బగు బ్రహ్మభావంబువలనఁ జ్యుతులగుటయే మృతులగుటయని నాయభిమతంబు. ఆచ్యుతినే ప్రమాదమని యందురు. ప్రమాదరహితత్వమే యమృతత్వము, ప్రమాదమున నసురులు పరాజయంబును బొందిరి. అప్రమాదంబున దేవతలు అమృతత్వముం గాంచిరి. లెస్సగ నాలోచించిన నిదియ మృత్యువుగాని యింతకంటె వేఱుమృత్యువెందును గానరాదు. శార్దూలంబు జంతువులపైఁబడి చంపునట్లు మృత్యువు జంతువులపైఁబడి చంపితినుట యెన్నఁడు నెందునుం గానము. మృత్యువున కొక్కయాకార మున్నట్లును గానరాదు. ఈయర్థంబు తెలియనేఱనికొందఱు విషయవిషంబునఁ జైతన్యమువాసినవారై నా చెప్పినప్రమాదంబుకంటెను వేఱుగ నొక్కమృత్యువు కలదని వచింతురు. ఆమృత్యువునే యముఁడని వారలందురు. మఱియు సత్కార్యములు గావించినవారియెడ శివుండును, దుష్కార్యము లొనర్చినవారియెడ నశివుండు నగుచు నాతండు పితృలోక మేలుచుండునని చెప్పుదురు. ప్రమాదంబు కాలక్రమమునఁ గామక్రోధాహంకారరూపమునఁ బరిణమించును. ఆయహంకారమునకు వశులై మానవులు దమయందు బ్రాహ్మణత్వము క్షత్రియత్వము స్థూలత్వము కృశత్వము మొదలగు నానాధర్మంబుల నారోపించుకొనుచుఁ దత్తదారోపితధర్మానుసారంబుగ

శ్రౌతస్మార్తవిపరీతమార్గంబులఁ జరించుచుందురు; కాని యొక్కండును సమాధిలక్షణంబైన పరమాత్మ యోగంబు గాంచ నేరఁడు. అట్టివార లీలోకము విడుచుచుఁ బరలోకంబున కేఁగుచు సంచితకర్మక్షయం బయినంత మరల నీలోకంబునకు వచ్చుచుందురు. అవిద్యావివశులై జననమరణపరంపరారూపం బయిన సంసారసాగరంబున మునుఁగుచుఁ దేలుచునుందురు. కర్మచే మృత్యునిరాసంబగునను మతిఁగొందఱును జ్ఞానందాత్మకంబయిన వేద్యతత్త్వంబు దెలియఁజాలక భోగంబులమీఁది యాశచేఁ గర్మఫలానురాగసంపన్నులై కర్మములనే యాచరించుచు సంసారమునఁబడి దరిగానక కొట్టుకొనుచుందురుగాని యమృతత్వము గాంచనేరరు. రాగాభిభూతులగుటంజేసి యింద్రియవిషయంబులం దగిలి యుండుటయే మహామోహం బగును. ఇంద్రియవిషయప్రవర్తనంబెల్ల జనులకును సహజంబై యుండును. మానసం బింద్రియవిషయంబులకు వశమయ్యెనేని స్వాభావికంబగు నమృతత్త్వమును మఱచి యవిద్యాకల్పితము లగువిషయంబులనే సేవించుచుందురు. అట్టివారలు కామక్రోధాదివివశులుగావున వారలు మృత్యువునకు వశులగుదురు. ధీరులు భోగంబులు శాశ్వతంబులు గావనియు వానివలన దుఃఖంబులు సంభవించు ననియుఁ దలంచి ప్రతిబోధశాలురై యనాదరంబున నాభోగంబుల విడిచి మృత్యువు జయింతురు. కామముల ననుసరించువాఁడా కామములు నశించినంతఁ దానును వాని ననుసరించియే నశించు. వాని ననుసరింపనివాఁడు జ్ఞానమునఁ బుణ్యపాపములు రెంటిని నిరాకరించి యుత్తమగతి నొందును. అవిద్యాప్రారబ్ధం బయిన మానవదేహమే శ్లేష్మరక్తమలమూత్రాదిపరిపూర్ణంబయి నరకం బనఁబడును. అట్టి యత్యంత జుగుప్సాకరంబు లగు దారపుత్రాది దేహంబులు రమణీయంబులని తలంచి బావిలోఁబడు గ్రుడ్డివారివలె నత్యంతకాంక్షతో నొకరిని జూచి మఱియొకరు పడుచుందురు. అట్టి విషయవిషంబులఁ గన్నుఁ గాననివారు అధ్యాత్మశాస్త్రంబులం జదువకయుఁ దత్త్వ మెఱుంగకయు యాతనలపాలగుచున్నారు. అట్టివారి దేహంబు తృణనిర్మితవ్యాఘ్రంబు చందంబున నిరర్థకం బయినది. క్రోధలోభాదిసమన్వితుండై విషయములఁ బ్రవర్తించుచున్న యాత్మయే పురుషునకు మృత్యువుగాని వేఱొక్కఁడు మృత్యువు గానరాఁడు. ఈవిధంబునఁ దన ప్రమాదంబె మృత్యువగునని యెఱింగిన

క్తిమంతుండు జ్ఞానయోగంబునం జేసి మృత్యువునకు వశపడక స్వరూప
స్థితి నొందుం గావునం గర్మంబె బంధములకుం గారణం బనియు జ్ఞానంబె
మోక్షంబునకు సాధనం బనియును దెలియనగును.

అని పలికినంతం బ్రజ్ఞాచక్షుండు మునిపుంగవా! యజ్ఞంబులు
గావించినచోం బుణ్యలోకంబులు గలుగు ననియు, నదియ పురుషార్థం
బనియు వేదంబు నుడువుచున్న దికదా? అది యెఱింగినవాఁడు కర్మంబు
లాచరింపక యున్నవాఁడునా? కర్మాచరణంబు మృత్యుసాధనంబని మీ రం
టిరే. వేదవిహితాచరణంబువలనే మృత్యువు సంభవించుట విరుద్ధవిషయ
ముగదా యని పలుక నమ్మహామునీంద్రుం డిట్లు పలికెను. రాజా! యజ్ఞం
బులు గావించుటవలనం బుణ్యలోకప్రాప్తి పురుషార్థం బను వేదవచనంబు
అవిద్యాదోషదర్శనంబువలన నధికారభేదముంబట్టి యవిద్వాంసు లగు
వారివిషయంబున వర్తించును. వేదాంతపరిజ్ఞానంబువలన వైరాగ్యంబు
సముపార్జించినవాఁడు బ్రహ్మలోకాదులు సౌఖ్యము లనిభావించి తత్సా
ధనంబులగు కామ్యకర్మములం దాసక్తుండై యుండక యీశ్వరార్పణ
బుద్ధితో నుచితంబులగుకర్మంబుల నాచరించుచు సంసారప్రవృత్తిహేతువు
లయిన విరుద్ధమార్గము లెల్ల విడిచి తనయాత్మనే పరమాత్మగా భావించి
కైవల్యంబు నొందుననియె. దానివిని ధృతరాష్ట్రుండు మునీశ్వరా! యాత్మ
పరమాత్మలకు భేదంబు లేదని నీవచనంబులవలనం దెలియనయ్యెడిని. అట్టి
భేదమే లేకుండినచో జననమరణాదిశూన్యుండై పురాణపురుషుండగు
నాత్మను నాత్మకు సంసారమార్గంబునం బ్రవర్తింపఁగలం బేమి? వాని నా
మార్గమునం బ్రేరించువాఁ డెవ్వఁడు? తనకుఁదాన ప్రవర్తించునుగాని
యితరు లాత్మకుఁ బ్రవర్తకులు లేరంటివేని నానాయోనులందును బ్రవ
ర్తించుట కేది హేతువు? అట్లు ప్రవర్తించు నతనికిం గార్యంబేది? ప్రవ
ర్తింపమానిన నుండుసుఖంబె మేనికలదా? ఈవిషయంబు బాగుగ నెఱిం
గింపు మని పలికిన సనత్సుజాతుండు వాని కిట్లనియె. అంబికానందనా!
కూటస్థుం డొక్కఁడే కాని యాతనియందు భేద మిసుమంతయుం గాన
రాదు. నియోజ్యుఁడు నియోజకుఁడు ననుధర్మభేదంబులవలన భేదము
గల దనరాదు. భేదముగలదందుమేని మహాదోషంబు సంభవించును. పర
మాత్మ యద్వితీయుండే యయినను ననాదియగు నవిద్యాయోగమునం
జేసి బహురూపంబులఁ గానంబడును. మాయకారణంబగుటయే లోకం

బున నాత్మయుఁ బరమాత్మయును వేఱువేఱను భేదవ్యవహారంబు కన్పట్టు
చున్నది. నియోజ్యనియోజకత్వాదిధర్మభేదంబుగూడ మాయాప్రయు
క్తంబయి తోఁచుచున్నది. భేదంబు మాయాకల్పితం బగుటం జేసి మిథ్య
యగును, అభేదమే వాస్తవమని యెఱుంగఁదగును. మాయాంశంబుననే
పరమాత్మకు జగత్కారణత్వము సిద్ధించుచున్నది. అంతియకాని వాస్తవ
మునఁ బరమాత్మకుఁ గర్తృత్వము లేదని వేదవచనంబులు తెలుపుచున్న
వనిన నాంబికేయుండు మహామతీ! లోకమున నెల్లరు నొక్కరీతిని జరిం
పరు. కొందఱు ధర్మం బాచరింతురు. మఱికొంద ఱధర్మావలంబులై
యుందురు. అందు ధర్మ మధర్మమును బాధించునా? అధర్మమే ధర్మమును
బాధించునా? రెండును సమాన మగుబలముగలవియే కావున నా రెండును
ననుభవింపవలసినవేనా? లేక రెంటిని విడువం దగునా యని యడుగ
నామునీంద్రుండు రాజా! నీయడిగినదాని నెఱింగించెద విను మని యిట్లు
పలుక నారంభించెను. ధృతరాష్ట్రా! వేద్యతత్త్వం బెఱింగినవిద్వాంసు
నకుఁ బుణ్యపాపంబులు రెండును జ్ఞానాగ్నిదగ్ధంబులై యనుభావ్యములు
గాకయే పోవును. జ్ఞానహీనుండు పరలోకంబునఁ బుణ్యపాపంబులు
రెంటి ననుభవింపవలసియేయుండును. ఈశ్వరార్పణబుద్ధితోడనే కర్మంబు
లాచరించువిద్వాంసుండు ధర్మంబున నధర్మంబును జయించును. ఒక్క
రాజు తనకంటె బలవంతుండగురాజునుం జూచి తాను వానికంటెను
బలవత్తరుండనయి యధిక రాజ్యసంపదల నొందెదనని తలంచురీతిని,
కర్మాచరణులుగూడఁ దమకంటె నధికకర్మాచరణశీలురం గాంచి వారి
కంటె నుత్తమకర్మంబు లాచరించి వారికంటె నుత్తమసుఖంబుల నను
భవింతు మని తలంచి యొండొరులయెడఁగల యీసుచే నొకరనిమించి
యొకరు కర్మలఁ గావింతురు. ఒండొరుల మీఱుతలంపునఁ గర్మంబులు
గావించినవారు ధూమాదిమార్గంబున స్వర్గలోకముఁ బ్రాపించి నక్షత్రాది
రూపము నొంది వెలుంగుచుందురు. అట్లు పరస్పరస్పర్థ మాని ఫలంబుల
కాసపడకయే విహితకర్మంబు లాచరించువారు కర్మాచరణమహిమంబున
శుద్ధచిత్తులై కార్యకారణాత్మకం బయిన దీనివిడిచి యాధ్యాత్మికం బాధి
దైవతం బాధిభౌతికం బను తాపత్రయంబునకును, సత్త్వంబు రజస్సు
తమస్సు ననుగుణత్రయంబులకును, జాగ్రత్స్వప్నసుషుప్తు లనెడి నవస్థా
త్రయంబునకును గోచరంబుగాని పరమాత్మస్వరూపంబు నాత్మానుసంధా

నంబునంబు నొందుదురు. అట్టి మహాపురుషులు బాహ్యాభ్యంతరజనుల కగోచరులై వర్తింతురు. అన్నపానాదిబహుళంబై యుచితంబును మీఱిన సమ్మానంబుగావింపనిజనులు వసించుతావులందు వారు చరించు చుందురు. తమ్ముఁ బూజించువారిని వారు పూజింపరు. తమ్మెవ్వరు నిందింతురో వారే తమ కుపకర్తలని తలంతురు. ఎవ్వరు బ్రహ్మనిష్ఠాసాధనంబులకు విఘ్నంబు లాపాదింపరో వారియన్నమే భుజింతురు. సర్వసంగపరిత్యాగంబు గావించి స్వీయమహాసుభావం బొరులెఱుంగకుండఁ బ్రచ్ఛాదనముగావించికొని యుందురు. ఆమహాత్ము లెన్నండు నాత్మతాపము నొందరు. పుత్రమిత్రకళత్రాదిసన్నిధానంబుననున్నను, జక్షురాదీంద్రియములకు గోచరంబుగాని పరమాత్మతత్త్వంబునందు సమాధియోగంబె వారికిఁ గర్తవ్యంబు. అట్టితలంపుతో గూఢచర్యల వర్తించువాఁడే బ్రహ్మవిదుఁ డనంబడును. పరమాత్మతత్త్వంబునకు స్థూలసూక్ష్మభేదంబులేదు. క్రియాకర్తృత్వములులేవు. అవిద్యాదోషంబు దాని దరిం జేరలేదు. సరద్వంద్వంబులును దానికి దూరంబై యుండును. అది యెన్నండును క్షుత్పిపాసాదిధర్మంబులం బొరయదు. అదియ యెల్లభూతంబులయంతరములందు సాక్షియై విలసిల్లు. అట్టిపరమాత్మకు దేహద్వయంబును దద్ధర్మంబులు దలంచి కర్తృత్వభోక్తృత్వాదిధర్మంబు లారోపింపరాదు. ఎవ్వఁ డట్లారోపించునో వాఁడు బ్రాహ్మణుఁడు కాఁజాలఁడు. వాఁ డాత్మాపహారి యగుచోరుం డగును. వానిపాపం బింతంతయన శక్యముగాదు. అనాత్మభూతంబు లగు దేహేంద్రియతద్ధర్మములం దాత్మభావంబు తలంపంజనును. అట్లు తలంపనివాఁడు సంసారశ్రమంబులపాలుకాక సుఖించును. వానికిఁ గ్రోధమార్గాద్యుపద్రవంబులు గలుగవు. అతండే శిష్టుం డనంబడును. తాను శిష్టుండే యయ్యును శిష్టుండననిమాత్రము గర్వింపఁదగదు. బ్రహ్మవిద్యనేర్పుటం జేసి సుగుణంబులం బొందియు బ్రహ్మవేత్తనై తినిగదా యని గర్వించి లోకులకు నిజమహిమంబుఁ బ్రకటించువారు లోకులవలనఁ బూజలందుచు పూర్వపరిత్యక్తంబులగుభోగంబులనే క్రక్కినయన్నమునే మరలఁ దినుశునకంబులవలె ననుభవింతురు. అదివారి కనర్థకారణంబు దారపుత్రద్రవ్యాదులపై నభిమానము విడచి వేదచోదితంబులగు నహింసాస్తేయ సత్యశౌచశమదమాదిగుణములఁ బరిగ్రహించి నిజోచితవృత్తినుండువారు బ్రహ్మ

భూతులని యెఱుంగవలయు. ఇంద్రాదిదేవతల ప్రీతికై లెక్కలేనన్ని యాగములు గావించిన యజమానుండును నాయింద్రాదిదేవతలును బ్రహ్మవిదునకు సాటిగాఁజాలరు. బ్రహ్మవిదునిమహత్త్వంబు వర్ణింప నేరికిని దరంబుగాదు. మాన్యులను విద్వాంసులు సన్మానించుటయు నవిద్వాంసు లవమానించుటయు నను రెండుకర్మంబులును నిమేషోన్మేషములవంటివని భావింపవలయు. అట్లు భావించి మానావమానములు సంప్రాప్తంబులగునపుడు మానంబున కుప్పొంగనుగూడదు; అవమానంబునకుఁ గ్రుంగనురాదు. హర్ష ద్వేషంబులు రెండును విడచి మౌనంబున నుండుటయే మాన్యులధర్మము. మానము మౌనము రెండునుగలిసి యెక్కడ నుండవు. మానం బీలోకంబునన యుండును. మౌనంబు పరలోకంబున నుండును. మానంబునకు గోచరంబగు ప్రపంచమున వర్తించుచు స్వర్గాదిసాధనంబులగు నుత్తమకర్మంబులు గావించువారికిఁ బరమశ్రేయోమార్గమును నిరోధించుసిరి లభించును. దానింగాంచి హర్షించి భోగంబులం దాసక్తులగువారికి బ్రహ్మానందమనుసిరి దుర్లభంబగును. సత్యము, ఆర్జవము, హ్రీ, దమము, శౌచము, విద్యయు నను నాఱుగుణములు మానమోహములకు వశముగాకుండ బ్రహ్మానందశ్రీవిభవం బొందించుటకుఁ దగుమార్గంబులు. అవి నానాప్రకారంబులై పొంద నశక్యంబులై యుండుననిన ధృతరాష్ట్రుండు 'మహాత్మా! ఎట్టివానికి మౌనంబు లభించును? మౌనమనఁగ నెట్టిది? తూష్ణీంభావంబున నుండుట మౌనంబని లోకంబున వాడుక. దానివలననే బ్రహ్మప్రాప్తి గల్గునా? కాకున్నచో బ్రహ్మంబు నొందుటకుం దగినమౌనం బెట్టిది? సవిస్తరంబుగ నెఱింగింపు'మనిప్రార్థించిన నాతనికి సనత్సుజాతుం డిట్లనియె.

రాజా! వేదములును మనస్సును దన్నుఁ బొందనేరక మరలి పోవుటవలన బ్రహ్మంబు మౌనం బనంబడుచున్నది. వేదములు బ్రహ్మంబునకు వాచకంబులై మంత్ర ముండును. బ్రహ్మస్వరూపంబు నిమిత్తంబై యుండుటం జేసియే వేదములు సముత్థితంబు లయినవి. బ్రహ్మంబు మహాజ్యోతిర్మయంబుగఁ దోఁచును. అనవుఁడు ప్రజ్ఞాచక్షుండు మునీంద్రా! విధివిహితమార్గంబున నాల్గువేదములధ్యయనం బొనరించినవానికింగూడఁ బాపకర్మంబు లాచరించినఁ బాపఫలంబులు సంభవించునా? వేదాధ్యయనసుకృతంబునఁ బాపఫలంబులు నశించునా? ఈవిషయంబున నామనంబు

సంశయాకులంబై యున్నది. కావునఁ దెలియం జెప్పుమనియె. అంత నా మునీంద్రుం డు రాజా! వేదములు పాపకర్మాచరణునిపాపంబులు తొలంగించి రక్షింపవు. ఇంతియకాక ఱెక్కలువచ్చినపక్షులు గూండ్లనువిడిచి యెగిరిపోవునట్లు వేదంబులు పాపకర్మాచరణుండగువేదాధ్యేతను విడవి తొలఁగిపోవును. అనఁగా ధృతరాష్ట్రుండు మహానుభావా! వేదములు వేదవిదుని రక్షింపకున్నచో వేదాధ్యయనమును వేదార్థవిచారంబును వేదార్థానుష్ఠానంబును గర్తవ్యంబులను వాక్యంబు లసత్ప్రలాపంబు లే యగునుగదా? యని యడుగ నమ్ముని మరల నిట్లని చెప్పందొడంగె. వేదంబులకు స్వర్గాదిసాధనంబయిన యాగాదికర్మముల నాచరించుటయే పరమార్థంబుగాదు. కర్మోపాసనాదులకంటె నతిరిక్తంబయిన బ్రహ్మప్రాప్త్యు పాయంబు నెఱింగించుటయే వేదంబులకుఁ బరమార్థంబు. ఆయర్థంబు చక్కనెఱింగినవారలను వేదంబులు రక్షించును. ఈజగంబు మాయా కల్పితంబులగు నామరూపాదివిశేషములతోఁ గూడియున్నదిగాని వేఱు గాదని వేదంబులును వేదవిదులగు మహామునులును దెలుపుచున్నారు. కృచ్ఛ్రచాంద్రాయణాది వ్రతంబులును దపంబును జ్యోతిష్టోమాదియజ్ఞం బులు గావించుటయును నీశ్వరునిప్రీతికొఱకే యని వేదములు దెలుపు చున్నవి. అట్లు కర్మముల నాచరించునతండు కర్మాచరణమహిమంబునఁ బుణ్యంబునొందినవాఁడై పాపముపోనాడి జ్ఞానప్రకాశితచిత్తుఁడానం దాద్వితీయబ్రహ్మస్వరూపుండగును. అట్లుగాక స్వర్గాదిఫలంబులనాశించి కర్మంబు లాచరించువాఁడు పరమాత్మ స్వరూపసాక్షాత్కార మొంద నేరక పాపపుణ్యఫలంబుల ననుభవించుటయందే యాసక్తుండై సంసార చక్రంబునం బరిభ్రమించుచుండును. ఈలోకంబున ఫలంబు లపేక్షించి కావించినతపంబునకు ఫలంబు పరలోకంబున ననుభవింపంబడును. బ్రహ్మ విచారతత్పరులగు వారితపం బత్యంతఫలంబంతంబై యుండును. తక్కిన వారు గావించినతపంబునకు యథోక్తఫలంబుమాత్రమే చేకూరుననిన ధృతరాష్ట్రుండు బ్రహ్మవిచారతత్పరులతపం బత్యంతఫలప్రదంబగుటకుఁ గారణం బేమని యడిగిన సనత్సుజాతుం డిట్లనియె. నిష్కల్మషంబైన తపంబు కేవలంబనంబడును. అదియే యత్యంతఫలప్రదంబై యుండును. సర్వంబునకుఁ దపంబె మూలంబు. తపంబుననే విద్వాంసు లమృతత్వ మొందిరని వచించిన నంబికానందనుండు 'మునీశ్వరా! తపంబునకు

గల్మషం బెయ్యది? ఏది లేకుండిన దపంబు నిష్కల్మషం బనంబడు' నని యడుగ నాపురాణమునిపుంగవుం డాసనత్సుజాతుఁ డిట్లనియె.

రాజా! కామప్రతిఘాతమువలన జనించుచిత్తవిక్షేప మగుక్రోధమును బ్రకృష్టంబగు నాదులందలి యభిలాష మగుకామమును, పరధనముల మీఁది యాసయు న్యాయార్జితవిత్తము నుత్తమపాత్రలం బర్పింపకుండుట యగులోభమును కార్యాకార్యవివేకము లేకుండుట యనుమోహమును విషయరసములఁ దెలియఁగోరుట యనువివిత్సయును, కాఠిన్యమను దయారాహిత్యమును, గుణములయెడ దోషముల నారోపించుటయుఁ, బరులగుణముల సహింపలేకుండుటయు నగునసూయయు, ఆత్మబహుమానం బనుమానంబును, ఇష్టవస్తువులు నశించునెడఁ గలుగుచిత్తక్షోభ మగుశోకమును విషయోపభోగకాంక్ష యగుస్పృహయు, పరుల పచ్ఛదనమున కోర్వమి యనునీర్ష్యయు, పరగుణములఁ గప్పిపుచ్చుతలంపును జుగుప్సయు ద్వాదశదోషంబు లనంబరఁగును. సంభోగబుద్ధి, పరుల కుపద్రవంబుగావించి యుప్పొంగుట, యిచ్చి వగచుట, స్వల్పలాభంబులకైన ననంతావమానంబులుసహించుట, జ్ఞానబలము లేకుండుట, ఇంద్రియవర్గములఁ బ్రశంసనము, గుణవతియు ననన్యశరణయు నగు భార్యతోఁ గలహించుచుండుట యనునవియేడును నృశంసస్తకం బనంబడును. వీనిలో నొక్కటిగల్గినను ననర్థంబు సిద్ధంబే. ఆత్మశ్లాఘాదిదుర్గుణములు గలవారు వీనిం బొందుదురు. తత్త్వార్థసంవేదనము, జ్ఞానము, భూతహిత యథార్థభాషణము, సత్యము, మనోనిగ్రహము, దమము, అధ్యాత్మశాస్త్రశ్రవణము, శ్రుతము, పరులకు మేలొనర్చుట, యమాత్సర్యము, అకార్యకరణమునందలి లజ్జ, హ్రీ, ద్వంద్వదుఃఖముల నోర్చియుండుట, తితిక్ష, పరదోషములఁ బ్రకటింపకుండుట, యనసూయ, అగ్నిష్టోమాదులును, బ్రహ్మయజ్ఞాదులును యజ్ఞములు. సత్పాత్రమునందు విత్తసమర్పణము దానము. విషయంబు లాసన్నంబు లగునెడ నింద్రియంబుల నిగ్రహించుట ధృతి. బహిరింద్రియోపరతి శమము. ఈపండ్రెండుగుణంబులును బ్రాహ్మణునకు మహావ్రతంబులు నాఁబరంగును, వీనిలోఁ గొన్ని యున్నను గ్రమమున జ్ఞానంబుదయించి బ్రహ్మభూతు లగుదురు. వీనిలో దమ మత్యంతదుష్కరంబై యుండును. దమంబునకుఁ బదునెనిమిది దోషంబులుగలవు. వానినెఱింగించెద నాకర్ణింపుము. అయథార్థభాషణ,

మస్సృతము, కొండెములు చెప్పుట, పిశునత్వము, విషయములఁ బొందఁ గోరుట, తృష్ణ, సర్వప్రతికూలప్రవర్తనము, ప్రాతికూల్యము, అజ్ఞానము, తమస్సు, లభించినదానితో సంతోషింపకుండుట యరతి, లోకముల కుద్వేగము గావించుట లోకద్వేషము, ఎక్కడను వినయములేమి యభిమానము, జనులతోఁ గలహించుచుండుట వివాదము, తనప్రాణము రక్షించికొనుటకై యితరులహింసించుట ప్రాణిపీడనము, పరులదూషించుట పరివాదము, నిరర్థకం బగు ప్రలాపం బతివాదము, వ్యర్థంబుగ దుఃఖములఁ జింతించుట పరితాపము. ద్వంద్వదుఃఖంబుల నోర్వఁజాలమి యక్షమ, ఇంద్రియార్థంబులపైఁ జపలబుద్ధి యధృతి, ప్రతిషిద్ధాచరణంబు పాపకృత్యంబు శాస్త్రచోదితంబుగాని జీవహింస హింసయు ననం బడును. ఈపదునెనిమిదిదోషములం దొక్కఁడుండెనేనియు నెలకొనిన దమము సిద్ధింపదు, ఇవియే మదంబునకు సాధనంబులుగావున వీనికి మద దోషంబులనియు వ్యవహారముగలదు. త్యాగగుణ మన్నిగుణములందు నుత్తమంబు. అది యాఱువిధములై యుండు. సిరివచ్చిన సుబ్బకుండుట మొదటిది. విరాగతాత్పర్యంబున నిష్టాపూర్తంబు లాచరించుట రెండవది. కామంబులవిడచుట మూఁడవది. ఇది మహాగుణంబు. దీనినందఱుం బొందఁజాలరు. కర్మప్రాప్తంబులందు ధనత్యాగమునను, గామమూలంబైన యుపయోగమునను బిదప దుఃఖముగలుగునేని వానివలన నలజడిపడకుండుట నాలవది. గుణధనములున్నపుడు అప్రియములు పొసంగినను వ్యథఁజెందకుండుట యైదవది. పాత్రభూతులైన యాచకులకును బుత్త్రాదులనైన నొసంగుట యాఱవది. ఈవిధంబునఁ ద్యాగంబు షడ్విధంబై యుండును. మఱియు సౌహార్దంబునందు నాలుగుణంబులు గలవు. సుహృదులకుఁ బ్రియముగలిగెనేని హర్షం బుదయించును. అప్రియముగలిగెనేని వ్యథ యుద్భవించును. ఈరెండుగుణంబులును, నయాచ్య మగువస్తువైన నిచ్చుఁదలంపు, మేలుచేసియు నాతాత్పర్యముసు గణింపకుండుట, స్వార్జితధనమునే యనుభవించుట, తనపనికి భంగమువచ్చినను మిత్త్రకార్యము నెఱవేర్చుటయు ననుగుణంబులు నాల్గును సౌహార్దగుణషట్కం బనంబరఁగును. ఇవియుండునేని సౌహార్దము పెంపుగాంచును. సత్య, జ్ఞాన, సమాధాన, చోద్య, వైరాగ్యాస్తేయ, బ్రహ్మచర్యసంగ్రహములన నప్రమాదమున కెనిమిదిగుణములు గలవు,

సత్యము సర్వోత్తమము. సర్వలోకములు సత్యమునందే ప్రతిష్ఠితంబులై యున్నవి. అమృతంబు సత్యంబునందే సమాహితంబై యుండెడిని. గృహస్థుండవు నేను జెప్పినగుణములను దోషములను బాగుగఁ బరిశీలించి దోషంబులవిడిచి గుణంబులఁ బరిగ్రహించి యాచరించెనే నాతపము వానికి నిష్కల్మషం బనంబడును. ఇంద్రియనిగ్రహంబు పాపాపహరణంబును బరిశుద్ధంబును జన్మమృత్యుజరావ్యాధినాశనంబనియును దృఢంబుగ నమ్ముము. నిగృహీతేంద్రియుం డెప్పుడును సుఖించును. అని చెప్పిన విని యాంబికేయుండు మునివరేణ్యా! పురాణేతిహాసంబులు పంచమవేదం బనంబడు నను ప్రసిద్ధి కలదుగదా? అవియుఁ జతుర్వేదంబులును నేర్చి పంచవేదులని వ్యవహరింపఁబడువారును జతుర్వేదంబు లధ్యయనం బొనరించువారును వేదత్రయంబు జదివినవారును రెండు వేదంబుల నధ్యయనము గావించినవారును ఏకవేదమే చదివినవారును నన బ్రాహ్మణులలోఁ బలువిధము లగు భేదంబుల వర్తింతురుగదా ? వారిలో నెవ్వ రధికులు? తేటపడం జెప్పుమని యడిగినంత సనత్సుజాతుం డిట్లు చెప్పందొడంగె. సంవిద్రూపంబయిన వేద్యతత్త్వంబు నొక్కదాని నెఱుంగమింజేసి వేదంబులు బహువిధంబుల భిన్నంబులయ్యె. ఈపరమార్థము నెఱుంగఁజాలక యల్పజ్ఞుండు ఋగాదివేదంబుల నధ్యయనం బొనర్చి తాను బ్రాజ్ఞుండని భావించుకొనును. సత్యజ్ఞానానందరూపంబైన బ్రహ్మమువలన విచ్యుతింబొందినవానికి స్వాభావికంబులగు సత్యసంకల్పాదులు వ్యర్థములగును. దానంజేసి యజ్ఞాదికర్మాచరణంబు బహువిస్మృతం బగును. వేద్యతత్త్వంబు నెఱుంగక ఋగ్యజురాదివేదములను బురాణేతిహాసములను జదువువాఁడు బహువాక్యుఁడగును గాని ముఖ్యబ్రాహ్మణుఁడుగాఁడు. మఱియు సత్యాదిలక్షణంబయిన పరమాత్మస్వరూపంబు దెలిసినవాఁడే ముఖ్యబ్రాహ్మణుం డగును. స్వచ్ఛందయోగంబు గలుగుటంజేసి వేదంబులు సర్వార్థములును బోధించును. అయినను నందెయ్యది పరమార్థంబో యేది పరమార్థసాధనోపాయంబో యని బాగుగ విమర్శించి పరమపురుషార్థంబయిన బ్రహ్మవిద్యను దత్సాధనం బగుచిత్తశుద్ధియు దానికిసాధనంబగు యజ్ఞాదివిధానంబులును బరిశీలించి వేదంబులపరమార్థంబు బ్రహ్మవిద్యయే యనియుఁ దత్ప్రతిపాదనంబునంజేసి వేదములు ప్రమాణంబు లయ్యెననియు నిర్ణయింపవల

గును. ఇంతియకాక అవాఙ్మానసగోచరంబగు బ్రహ్మతత్త్వమును దెలుప వేదములకును శక్తిచాలదు. అతిసూక్ష్మంబగుచంద్రకళను వృక్షశాఖను నిమిత్తముగాఁజేసి చూపునట్లు నిత్యపరిపూర్ణానందస్వరూపంబయినపర మాత్మతత్త్వంబు ప్రతిపాదించునెడ వేదంబులు హేతుమాత్రంబులగు నని తత్త్వవేత్త లగునార్యులు వచింతురు. ఈతెఱంగున నాత్మ ప్రతి పాదనప్రకారం బెఱింగినవాఁడు బ్రాహ్మణుఁడుగావున నతండు విష యోపభోగంబులం దాసక్తుండుగాక దేహేంద్రియంబులందును దద్ధ ర్మంబులందును నాత్మభావంబు భావింపక సర్వసంగపరిత్యాగియై యాత్మను బరమాత్మతో ననుసంధింపవలయును. ఇదియే మౌనంబు. ఈవిధంబు నెఱింగినవాఁడేముని యనఁదగునుగాని యడవులనిడుమలంబడి నివసించి నంతమాత్రాన ముని గానేరఁడు. తనకును బరమాత్మకును భేదముదలంపక కైవల్యము నొందిన యతండు మునిశ్రేష్ఠుం డనఁబడును. అనిర్వాచ్యం బయిన పరమాత్మతత్త్వంబే ప్రకృతియోగంబునంజేసి యాత్మరూప ముతోఁ గల్పితంబయిన యీప్రపంచమునందుఁ జొచ్చిసర్వార్థములకు వ్యాకరణంబుగావించుటంజేసి వైయాకరణం బనంబరఁగె. అట్టి పర మాత్మతత్త్వం బెఱింగినవాఁడును వైయాకరణుం డనంబడును. ఆమహా నుభావుం డాత్మజ్ఞానంబున నధికుండుగావున సర్వజ్ఞుండన వన్నెకెక్కుఁను.

అని సనత్సుజాతుండు వచింప ధృతరాష్ట్రుండు మునికులతిల కమా! భవద్వచనోపన్యాసంబు పరమార్థబ్రహ్మవిద్యాప్రతిపాదకంబు ప్రాపంచిక సుదుర్లభంబునై యొప్పును. దానిని బాగుగ నెఱింగింపుమని ప్రార్థించుటయు నామునిప్రవరుం డిట్లు పలికె. నరపతీ! బ్రహ్మంబు త్వర పడి తెలియ నెవ్వరికిని దరంబుగాదు. సంకల్పవికల్పాత్మకం బయినమనంబు సర్వవిషయపరావృత్తంబై యధ్యవసాయాత్మకం బగుబుద్ధియందు లీనం బయినతరువాత విచారింప శక్యం బగునుగాని యితరవిధములంగాదు. గురుప్రసాదంబునొంది వృద్ధిగాంచినవారి కిది సులభంబై యుండును. అందులకు బ్రహ్మచర్యంబు ముఖ్యసాధనము అట్లు బ్రహ్మవిద్య సాధిం చిన వారమృతత్వము గాంతురనుటయు నాంబికేయుండు మునివరేణ్యా! బ్రహ్మవిద్యాజ్ఞానసాధనం బగు బ్రహ్మచర్యంబన నెట్టిదియో వివరింపుమని ప్రార్థింప నాముని రాజున కిట్లనియె. ఆచార్యునిసమీపంబున వసించి

భక్తితో శిష్యుండయి శుశ్రూషాదిరూపంబయిన బ్రహ్మచర్యంబు సలిపి తదనుగ్రహంబున దెలియందగుదానిని దెలిసికొన్న పెద్దలు కామము లందు సక్తులుగాక శాంతిచేఁగొని ప్రారబ్ధలబ్ధం బగు దేహంబునెడ నభి మానంబుమాని సత్యాదిలక్షణలక్షితం బగు పరమాత్మం బొందుదురు. తల్లిదండ్రులవలనఁ గలిగినజన్మంబు జన్మంబుగాదు. ఆచార్యునివలన విద్యావశంబునఁ గలిగినజన్మమే జన్మమని యెఱుంగునది. అట్టిజన్మమే జన్మాంతర నిరాకరణకారణంబగుం గావున శ్రేష్ఠం బగును. అట్టి జన్మంబు నకు కారణభూతుండైన యాచార్యుండు తనకుఁ గావించియన్యదుష్క రోపకారంబుఁ దలపోసి యతని కెన్నండు నెగ్గుసేయఁ దలంపుగొన రాదు. అప్రమాదంబున నిత్యంబు నభివాదనము గావింపవలయును. శిష్యవృత్తి క్రమమున విద్యాగ్రహణంబు గురువునందువలెఁ దత్పుత్ర కళత్రంబులందునైతము భక్తిగలిగియుండుట గురుండు తనకొనరించి నమే లెల్ల వేళఁ దలఁచుచు నిమ్మహాత్ముని ప్రసాదంబునకదా వేద్యతత్త్వం బెఱుంగం గంటిని. సార్థకజన్ముఁడనైతినని భావించి యాతనియెడ నెడ లేనిభక్తితాత్పర్యంబులు గలిగియుండుట మనోవాక్కర్మంబులచే నొక్క విధంబ యగునట్లు ప్రాణధనములనైనను గురువునకుఁ బ్రియముగావిం చుట యను నాలుగుధర్మంబులును బ్రహ్మచర్యమునకు నాలుగుపాద ములు. అట్టి బ్రహ్మచర్యవ్రతం బప్రమాదంబున నడపుచు నాచార్యుని వలనఁ గొంతయుఁ దనబుద్ధివిశేషంబునఁ గొంతయుఁ గాలవశమునఁ గొం తయు సహాధ్యాయులవలనం గొంతయుఁగాఁ జతుష్పదంబులు వెలుంగు నట్లు విద్యను గ్రహింపవలయును. మున్ను జెప్పిన జ్ఞానాదు లగుద్వాదశ మహావ్రతంబులు షడ్విధంబయినత్యాగంబును,అష్టవిధంబయినయప్రమా దంబును, దద్ధర్మపరిపాలనసామర్థ్యంబు నాచార్యయోగంబుననే ఫలిం చును. బ్రహ్మచర్యంబు బ్రహ్మాత్మభావంబున సఫలం బగును. బ్రహ్మచర్యం బున సిద్ధింపనియర్థంబు లేవియు నుండవు. ఎవరి కేదియిష్టం బగునో యది యెల్ల బ్రహ్మచర్యంబువలన సిద్ధించును. బ్రహ్మచర్యవ్రతంబుననే దేవ తలు దేవత్వమునొంది వెలుంగుచున్నారు. ఋషులు లోకపూజ్యులై యలరుటకు బ్రహ్మచర్యంబె కారణంబు. దానివలననే గంధర్వాప్సరసలు రూపంబులు వడసిరి. అదియ సూర్యుఁడు వెలుంగుటకు హేతువు. సక లార్థముల సాధించుటకుఁ దగిన బ్రహ్మచర్యంబు నశ్వరంబు లగుక్షుద్ర

ఫలంబులందు వినియోగింపక శాశ్వతపరమార్థసాధనంబందు వినియో
గించి జ్ఞానమున జ్యోతిస్స్వరూపం బగుపరమాత్మతత్త్వంబు నొందుట
యుచితమని దానిఁబొందఁగ జ్ఞానమార్గంబుదక్క నితరమార్గం బేదియు
సమర్థంబుగాదన విని ప్రజ్ఞాచక్షుండు మహామునీ! పరమాత్మస్వరూపం
బునకు నలుపు తెలుపు పసుపు ఎఱుపు ననురంగులలో నేదైన రంగు
గలదా? దానిరూపం బేదియని యడిగిన నాముని యతని కిట్లనియె. పర
మాత్మస్వరూపమునకుఁ గృష్ణపీతాదివర్ణంబులం దొక్కటియు నుండదు.
నిర్వచింపరాని యాబ్రహ్మంబు పృథివ్యంతరిక్షాదులం దెందును గానం
బడదు. శరీరములం జూడంబడదు. ఋగ్వేదాదివేదంబులందు నగపడదు.
ఐనను జ్ఞానాదు లగుద్వాదశమహావ్రతసంపన్నుండయిన బ్రహ్మవిదున
కాత్మయందే యభిన్నంబుగఁ దోఁచుచుండును. అది సర్వవ్యాపకంబు.
అజ్ఞానావరణరహితులకు మాత్రమే గమ్యంబు. మహత్త్వంబు, అణు
త్వంబు, స్థూలత్వంబు, కృశత్వంబు ననుపరిమాణంబులు దానికి లేవు.
ఈప్రపంచములకెల్లఁ బ్రళయం బైనతరువాత నాబ్రహ్మం బొక్కటియే
నిత్యంబై యుండును. సృష్టికి ముందుగూడ నది యొక్కటియే యుండెను.
దాని నెఱింగినవార లే ముక్తులగుదురు. దేశకాలాదిపరిచ్ఛేదశూన్యుం
డయి నిత్యపరిపూర్ణుం డయినపరమాత్మకంటె భేదంబులేనివాఁ డగుటం
జేసి జీవుండును నిత్యపరిపూర్ణుండు నపరిచ్ఛేద్యుండు నై వెలుంగు.
ఉపాధిభేదంబున మహాకాశఘటాకాశములకుంబోలె జీవాత్మపరమాత్మ
లకు భేదవ్యవహారము గలుగుచున్నదిగాని యది వాస్తవంబు గాదు.
సమాధియోగసమయమునం దపానంబు ప్రాణమందును, ప్రాణము
మనస్సునందును, మనస్సును బుద్ధియందును, బుద్ధినిఁ బరమాత్మయందు
నుపసంహరించి, యోగులు నిర్వాణసుఖంబు లనుభవింతురని యిట్లు
సనత్సుజాతుండు బహుప్రకారంబుల జీవేశ్వరతత్త్వంబు యుక్తిహేతు
సహితంబుగ నుపన్యసించి నిజానుభవమునందు నట్లే తోఁచుచున్నదని
బోధించి, తన్నిరూపణపరుండై నేన నీకుఁ దల్లియుఁ దండ్రియుఁ బితా
మహుండును బుత్రుండును నతీతానాగతవర్తమానంబులును సర్వాత్మయు
నయితినని సర్వారోపంబు ప్రతిపాదించి, యట నాయందు మీరు నహం
పదార్థవిషయంబును లేదని యధ్యస్తాపవాదంబు నిరూపించి, నాకు నేన
యధిష్ఠానంబను; నేనజనన కారణంబను. నేన సర్వాంతరాత్మ నని యివ్వి

ధంబున బ్రహ్మాపరోక్షసాక్షాత్కారం బుపన్యసించి యద్వైతతత్త్వంబు ప్రతిపాదించుచుఁ బ్రజ్ఞాచక్షుండైన ధృతరాష్ట్రునకుఁగల సంశయములు పాపుచున్నంత నెట్టకేలకుఁ బ్రభాతంబయ్యె. అంత దివ్యజ్ఞానమాన సీయుండైన యమ్మునీంద్రుండు ధృతరాష్ట్రవిదురులనామంత్రణం బొనర్చి యథేచ్ఛం జనియె. ధృతరాష్ట్రుం డమ్మునిహితోపదేశంబు తలపోయుచు నిర్విణ్ణచిత్తుండై యుండె. అట వేఁగువేళ నరవిరిసినతమ్మిపూవుల నెఱతావులఁ గొనుచుఁ బుష్పాదులభారంబునంబోలె మెల్ల మెల్లనఁ బిల్లగాలులు వీతెంచె. పాండునందనులసదాచారంబు ధార్తరాష్ట్రుల కింకనుం దెలుప కుండు టుచితంబుగాదని బోధించుతెఱంగున శకుంతసంతానంబుల కలకలరవంబు లెసంగె. సంజయుండు రాయబార మొనరించునెడ నా కొలువు నాలోకించుకుతూహల ముల్లోలమయినరీతిని లోకబాంధవుం డుదయగిరివరశిఖరమునం బొడసూపె.

## సంజయుండు కౌరవసభకు వచ్చుట

అంతట హస్తినగరంబున దుర్యోధనసాహాయ్యార్థంబై యేతెంచి యున్న నానాదేశాగతమహీపాలలోకంబును, ధృతరాష్ట్రుండు మొదలగుకౌరవులును, బాండవులకడనుండి వచ్చినసంజయునివలనఁ బాండవులు తెల్పినసందేశవచనంబు లాకర్ణించుతలంపున ప్రాతఃకాలకృత్యంబు లెల్ల వేవేగ నిర్వర్తించికొని మహార్హాంబరాభరణాదుల ధరించి సుధర్మ కేతెంచుసురగణంబుల ననుకరించుచు ధృతరాష్ట్రుకొలువుకూటంబున కరుదెంచిరి. ఆసభామందిరంబు సుధావదాతంబు విస్తీర్ణంబునై కనకాజిరభూషణంబులతోఁ జంద్రమండలంబు ననుకరించుచుండె. రుచిరంబగు నామందిరప్రాంగణంబులందు చందనద్రవంబు పన్నీరు మొదలగుసుగంధ ద్రవములచేఁ గలయంపి చల్లుట మిక్కిలి సుగంధబంధురంబై యుండె. మందిరాంతరప్రదేశంబున బంగారుతోఁ జేయఁబడినవిదారువులచే నిర్మింపఁ బడినవి, లోహంబున రచింపబడినవి, గజదంతములచే గావింపఁబడినవియు నగువిపులంబులు మనోహరంబు లగునాసనము లమర్పఁబడియున్నవి. వానిపై చిత్రవిచిత్రములగురత్నకంబళములు పట్టుదుప్పటములు బరుపఁ బడి నేత్రానందము గల్పించుచుండె. ఆమహాశోభాకరంబగు సభాంతర మునకు భీష్ముండు, ద్రోణుండు, కృపుండు, శల్యుండు, కృతవర్మండు,

జయద్రథుండు, అశ్వత్థామయుండు, వికర్ణుండు, సోమదత్తుండు, బాహ్లీకుండు, మహాప్రాజ్ఞుం డగువిదురుండు, మహారథుం డగుయుయుత్సుండు నాదిగా మహాసాయులగుకౌరవులసభాస్తారు లగురాజన్యులెల్లరు విచ్చేసి ధృతరాష్ట్రుని కిరుపార్శ్వంబుల నుచితాసనంబుల నుపవిష్టులై యుండిరి. దుశ్శాసనుండు, చిత్రసేనుండు, సౌబలుం డగుశకుని, దుర్ముఖుండు, దుస్సహుండు, కర్ణుండు, ఉలూకుండు, వివింశతి యను రాజులు దుర్యోధనుని బురస్కరించుకొని సభాప్రవేశంబు గావించి, దుర్యోధను నిరుపార్శ్వంబులందు నర్హాసనంబులం దుపవిష్టులై సంజయురాకను నిరీక్షించుచుండిరి. ఆసమయంబునఁ బ్రతీహారి సభామందిరము ప్రవేశించి సంజయుండు ద్వారంబుకడ నిలిచియున్నాఁడని నివేదింప సభాసదులెల్లర యనుమతంబున ధృతరాష్ట్రుండు సంజయునిఁ దోడ్కొనిరమ్మని యానతిచ్చె. అంత సంజయుండు రథావతరణం బొనరించి మహానుభావులగు మహీపాలురచేఁ బూర్ణంబయిన సభామందిరము ప్రవేశించె. వారల కెల్లరకు నుచితరీతుల నభివాదనంబు లొనరించి వారితో రాజన్యులారా! నేను పాండవులకడ కరిగి తిరిగివచ్చినవాఁడను. పాండవులెల్లరును సుఖంబున్నవారు. వారు కౌరవుల నెల్లరను గౌరవసహాయులై వచ్చియున్న యితరనరపతులను వయోనుకూలంబుగ నభివాదనాలింగనాదికుశలంబు నడిగిరి. నేనిక్కడ నాంబికేయునిచే ననుశాసింపఁబడి వెడలి నట్లే వారలతోఁ జెప్పఁదగుమాటలనెల్లఁ జెప్పితినని పలికెను.

సంజయుం డర్జునసందేశము కౌరవుల కెఱింగించుట.

అప్పు డంబికాత్మజుండు రాజులెల్లరు వినుచుండ సంజయునితో సంజయా! నీవు వెడలి నావాక్యంబులు పాండవుల కెఱింగించినందుల కెంతయు నానందంబయ్యె. పాండవు లందఱిసందేశము వెనుక వినఁదగును. ముందుగా యుద్ధదుర్మదుండును, దురాత్మనిర్మథనుండును, అదీనసత్త్వుండునగు ధనంజయుండు మాకెఱింగింపుమని చెప్పినవాక్యంబులఁ దెలుపుము. ఈకూడియున్న రాజలోకంబెల్ల హాని నాలకింతురుగాక యని యానతిచ్చె. అంత సంజయుండు రాజులెల్లరకు నమస్కారం బొనరించి దుర్యోధను వీక్షించి కరకమలంబులు ముకుళించి వినయవినమితాంగుండై యిట్లని చెప్పంజొచ్చెను. మహానుభావులారా! ధర్మనందను

వసుమతినొంది కేశవుండు వినుచుండ ధనంజయుండు నాతో నాడిన వాక్యంబు మీరెల్లరు నాలింతురుగాక. దుర్యోధనుండు విశేషించి సావధానచిత్తంబున నాకర్ణింపవలయు. ధనంజయుండు సర్వవిధముల యుద్ధమునకే సిద్ధపడి దుర్యోధను నుద్దేశించియే యిట్లు చెప్పినవాఁడు. తనబాహువీర్యంబును దలంచికొని యుప్పొంగుచు విత్రాసహాస్యుండై కేశవుని నికటంబున నిలిచి ధార్తరాష్ట్రుం డీవాక్యము లాలించుఁగాక యని ధనంజయుండు పలికె. సంజయా! దుర్వాక్యప్రలాపియగు సూతనందనుండు వినుచుండ నీవాక్యంబులు పలుకుము. అతఁడు మందప్రజ్ఞుండు, కాలవశంగతుండు, అతిమూఢుండునై, యెప్పుడు నాతోడి యుద్ధంబునకు సన్నద్ధుం డగుచుండును. కావున, నారాధేయుండు తప్పక నామాట లాలింపవలయును. మఱియుఁ బాండవులతో యుద్ధమాచరింపఁ గౌరవులకు సహాయులుగా నేతెంచిన నానారాజన్యలోకంబు వినుచుండ నావాక్యంబు సమగ్రంబుగ నమాత్యసహితుం డగు నారాజున కెఱింగింపుము. అనినంత నాకిరీటివాక్యంబులు పాండవులును సృంజయులునుగూడ బాగుబాగని యభినందించిరి. ఆసమయంబున వజ్రహస్తునివాక్యంబుల నాలించి దేవగణంబులంబోలి వారెల్లరు నుల్లాసపరవశులై యుండిరి. లోహితపద్మనేత్రుండగు గాండీవధన్వుండు సర్వవిధంబుల సంగరంబున కుత్సహించుచు మీకుఁ దెలుపుమని నాతో నిట్లనియె.

సూతాత్మజా! అజమీఢుండగు నీయజాతశత్రునిరాజ్యంబు దురభిమానియగు ధార్తరాష్ట్రుండు విడువకుండునేని, పూర్వజన్మంబున ధార్తరాష్ట్రులు గావించినపాపకర్మంబులకెల్ల ననుభవయోగ్యంబగుసమయ మాసన్నంబయ్యెనని నిక్కముగ నమ్ముము. ఆపాపఫలంబు వారింతవఱకెన్నఁడు ననుభవింపలేదు. ఇప్పు డనుభవింపక తీఱదు. కావుననే దురభిమానులగువారు భీమసేనార్జునులతోడను, నకులసహదేవుల తోడను, వాసుదేవునితోడను యుద్ధంబుగావింప నుత్సహించుచున్నారు. ఇంతియకాక, సాత్యకి, ధృష్టద్యుమ్నుఁడు, శిఖండియు, నింద్రకల్పుండగు యుధిష్ఠిరుండును నగువారితోడిసంగరంబున కంగీకరించుచున్నారు. అజాతశత్రున కపథ్యమే కలిగినచో భూమ్యంతరిక్షంబుల నొక్కపెట్టున నిర్దహించునని వారెఱుంగకున్నారు. కాఁబోలును? పాండవులతోడి

యుద్ధంబె సుయోధనుండు నిశ్చయించెనేని పాండవుల కెల్ల యర్థంబులు
సమకూడినట్లే భావింపుము. పాండవులయర్థం బపహరింపఁదలంచి యట్టి
దురవస్థలపాలు గావలదు. దాని నంగీకరింపక యుద్ధమే నిశ్చయించితి
వేని తప్పక యుద్ధంబునకే వత్తుము. ప్రవ్రాజితుండగు ధర్మనందనుండు ధర్మా
చరణపరాయణుండై ఘోరారణ్యంబుల నే యే యిడుములఁబడియుండెనో
దుఃఖతరంబగు నాయవస్థ ధార్తరాష్ట్రుండు సమరంబున సుఖంబు
విడిచి యనుభవించుఁగాక. హ్రీచేతను, జ్ఞానంబుచేతను, తపంబు
చేతను, శౌర్యంబుచేతను, దమంబుచేతను, బలంబుచేతను, ధర్మంబు
చేతను, బాండవులు సురక్షితులై యున్నారు. అన్యాయరతుండు దురా
త్ముండు నగుదుర్యోధనుండు కురుపాండవులనెల్ల నధికరించియున్న
వాఁడు. మాకెల్లరకును రాజగు ధర్మనందనుండు మాయచేఁ బ్రతా
రితుండయ్యు, ప్రణిపాతము, ఋజుబుద్ధి, తపంబు, దమంబు, ధర్మపాలనా
సక్తి మొదలగుసుగుణంబులచేతను, సత్యవాక్యాభిరతిచేతను, మిక్కిలి
క్లేశంబులు ననుభవించినవాఁడయ్యు క్షమించియున్నవాఁడు. పాండవ
జ్యేష్ఠుండు సంశ్రితాత్ముండై సుఘోరంబగుక్రోధంబు బహువర్షంబు
లడఁచికొనియున్నవాఁడు. ఆతండు కోపించి యాకోపంబును గౌరవుల
యం దెప్పుడువిడుచునో యపుడు ధార్తరాష్ట్రుండు యుద్ధంబు నంగీక
రింపకయుండును. గ్రీష్మకాలంబునం బ్రజ్వలితుండగు నగ్నిదేవుండు
విజృంభించి కక్షంబుల నెట్లు దహించునో యట్లే క్రోధోద్దీప్తుండగు
యుధిష్ఠిరుండు ధార్తరాష్ట్రునిసేనలనెల్ల దృష్టిచే దహించివైచును.
ఆసుయోధనుండు అమర్షణుండు భీమవేగుండునగు భీమసేనుండు రథా
రూఢుండై గద కేలంబూని క్రోధంబనువిషంబు గ్రక్కుచు నెదుటఁగన
బడినపుడు యుద్ధచింత మానును. మహాకోపావిష్టుండై సేనాముఖం
బునఁ బరవీరులప్రాణంబు లపహరించుచు నెప్పుడు యమసన్నిభుండగు
భీమసేనుం డగపడునో యప్పుడు సుయోధనుండు భీముని ప్రతిజ్ఞావచనం
బును స్మరించును. కొండలపిండుంబోని యేనుంగులు భీమసేనగదాభిన్న
కుంభంబులై నెత్తురులు గ్రక్కుచు సమరాంగణంబునం గూలిపడుట
చూచినంత సుయోధనునకు యుద్ధాపేక్ష పరాస్తంబగును. మహాసిం
హంబు గోగణంబులమధ్యఁ బ్రవేశించి కసిమసంగువడువున భీమ
రూపుండై భీముండు గద చేతంబూని ధార్తరాష్ట్రులమధ్యమునం

ప్రవేశించి యెప్పుడు శిరంబులు చదుపునో యప్పుడు దుర్యోధనుండు యుద్ధమును విరమించును. మహాభయంబులందును భయమెఱుంగఁడు. కృతాస్త్రుండు. సమరరంగంబుల శత్రుబలంబులఁ జూర్ణంబు గావింపక విడువఁడు. ఏకరథాధిరూఢుండై గదామాత్రాయుధుండై యనేకరథ సంఘంబులను బదాతిసంఘంబులను నుక్కడంపఁగలబలియుండు. అట్టి భీమసేనుండు వేగంబు మెఱయఁ గరాగ్రంబున నేనుంగులంబట్టి బిఱబిఱ త్రిప్పి ధార్తరాష్ట్రనిసైన్యంబు పరశుహతంబగు వనంబుమాడ్కి నెప్పుడు చిందరవందరసేయునో యపుడు ధార్తరాష్ట్రుండు యుద్ధాశ విడుచును. తృణప్రాయగృహంబులు గలగ్రామంబు లగ్ని చూఱగొను నట్లు భీమసేనుండు ధార్తరాష్ట్రుల నొక్కనినేని విడువక సంహరించును. పండినసస్యంబు పిడుగుపడి కాలినట్లు విపులంబగు ధార్తరాష్ట్రుని బలంబెల్లఁ బరాసిక్తంబగును. వీరులు హతులగుటచే భయార్తంబు విముఖంబు నష్టయోధంబు నగుకౌరవసైన్యమును భీమసేనుండు శస్త్రాగ్నిచేఁ గాల్చుచున్నపుడు సుయోధనుండు యుద్ధమున కనుతాపమొందును. రథికులెల్లరకు నధికుండగు నకులుండు చిత్రయుద్ధంబు మెఱయ నుపాసంగంబున జరించుచు నూఱునూఱులుగా రథికులఁగూల్చునపుడే యాదుర్యోధనునకుఁ బశ్చాత్తాప ముదయించును. సుఖోచితుండగు నాతఁ డడవులందు దుఃఖపరంపర లనుభవించినక్రోధంబున జనించిన విషంబు కౌరవసైన్యంబులపైఁ గ్రక్కునపుడు దుర్యోధనుఁడు మిగుల వగవకపోఁడు. ధర్మనందను నాజ్ఞంబూని పార్థివులు ప్రాణంబులపై నాస కూడ విడిచి శుభ్రంబులగురథంబుల నధిరోహించి కౌరవానీకంబు చెల్లాచెదరు గావించునపుడు సుయోధనుండు తనయవివేకంబునకుఁ జింతించును. ఉపపాండవులేవురును బ్రాయంబున శిశువులైనను నస్త్రవిద్యాకౌశలంబున తవరలు. వారలుకూడ బ్రాణంబులయెడ దీపివిడిచి కౌరవసైన్యంబు చుట్టుముట్టినపుడు గాంధారీనందనునకు బుద్ధివచ్చును. గతోద్వాహంబు సకూబరాక్షంబు సువర్ణతారంబునగు గజదంతమయంబగురథంబు నారోహించి యాతతాయియగు సహదేవుండు మ్మార్గణ పరంపరలచే రాజులశిరంబులు పరిపక్వతాళఫలంబులరీతి డొల్లనేయుటం గాంచినఁగాని సుయోధనునకు ననుతాపంబుగలుగదు. మహాభయంకరంబగు సంగరరంగంబున సహదేవుం డెల్లదిక్కులఁ దానయై చరించుచు

లాఘవంబు మెఱయ పగఱమూఁకల చీకాకుపఱచుట చూచినపుడు సుయోధనుండు దురపిల్లుట నిక్కువము. హ్రీనిషేవుండు, నిపుణుండు, సత్యవాది, మహాబలసంపన్నుండు, సర్వధర్మోపపన్నుండు, మహాతపస్వియు నగుసహదేవుండు శకునిం దలపడి తుములంబగుసమరంబున శీఘ్రకారిత్వంబు ప్రకటించి యోధులనెల్ల చించి చెండాడక విడువఁడు సుమా? మహాధనుర్ధరులు, శూరాగ్రేసరులు, నస్త్రవిద్యారహస్యవేదులు, రథయుద్ధవిశారదులు, నగుద్రౌపదీనందనులు ఘోరవిషంబుగల మహాసర్పంబుల భాతి పొలికలన నక్షిగోచరులైనంత నాసుయోధనుండు తాఁజేసిన యకార్యమునకై పశ్చాత్తాపపడును. పరవీరప్రాణనిర్వాపణదీక్షాదక్షుండగు నభిమన్యుండు మేఘుంబు జలధారల వర్షించుమాడ్కి శాత్రవులపై నంపవానగురియుతన్నుఁ జూచినవారు కృష్ణుండో యని యాశ్చర్యభయసంభ్రమంబు లందుచుండ యుద్ధభూమిని బ్రవేశించినపుడు ధార్తరాష్ట్రుఁడు పరితపించును. బాలుండయ్యు మహావీర్యవంతుండు నింద్రప్రతిముండు నగుసుభద్రాత్మజుండు పగఱసేనల మహామృత్యువు చందమున గవిసినపుడు సుయోధనుం డనుతాప మనుభవించును. పిన్న వయసువారయ్యును శీఘ్రతరులు సమరవిశారదులు సింహసమానవిక్రములు నగుభద్రకులు ధార్తరాష్ట్రులను జిందఱవందఱ సేయునపుడు కాని యాదుశ్శాసనాగ్రజునకుఁ బశ్చాత్తాపంబు గలుగదు. మహారథులగు విరాటద్రుపదులు వేర్వేఱుసైన్యములతోడంగూడి ధార్తరాష్ట్రులను వారిసైన్యంబులను దేఱిబాఱఁజూచినంతనే సుయోధనుండు తన యకృత్యమునకుఁ దురపిల్లును. కృతాస్త్రుండగుద్రుపదుండు రథంబారోహించి క్రుద్ధుండై వృద్ధుండయ్యు బలసమృద్ధి దీపిపోక చాపముక్తంబులగు నారాచపరంపరలచే యౌవనవంతులగు యోధులశిరంబులఁ ద్రుంచుటఁ గాంచినపుడు దుశ్శాసనాగ్రజుండు యుద్ధంబున నిరాదరుండగును. పరవీరఘాతియగువిరాటుం డుత్తరుండును నన్నృశంసరూపులగు మాత్స్యులును దన్ను బరివేష్టించి రా శత్రుసేనాసమూహంబులం బ్రవేశించునపుడు గాంధారీనందనుండు మిగుల వనటచెందును. విరాటుని జ్యేష్ఠపుత్రుండు అనృశంసార్యరూపుండు, పాండవుల కార్యంబు నెడ మిగుల నభినివేశముగలవాఁడు నగును త్తరుండు ఘోరరూపుండై పొడచూపినపుడు దుర్యోధనుఁడు యుద్ధంబును దనుతప్తుండగును. ద్రుప

దాత్మజుండగు శిఖండిచేఁ గౌరవులలో మేటిమగండగు శాంతనవుం డసువులు దొఱంగినపుడు మిగిలిన మాశత్రువు లెవ్వరును బ్రతుకఁజాలరని నిస్సంశయముగ నెఱుంగుము. నావచనంబులు సత్యంబులని ముమ్మాటికి నమ్ముము. దివ్యంబులగు నశ్వంబులం బూన్చినరథం బారోహించి శిఖండిచిత్రగతులు మెఱయ భీష్ము నెదుర్కొని రథానీకంబు నెల్ల నలియఁ గొట్టునపుడు ధార్తరాష్ట్రుండు యుద్ధంబునకు విలపించును. సృంజయ సైన్యంబుల కగ్రంబున విభావసుండునుంబోలె దేదీప్యమానుండై ధృష్టద్యుమ్నుండు పొలిచినంత సుయోధనుండు యుద్ధంబునకుఁ బశ్చాత్తాపమొందును. ధృష్టద్యుమ్నునకు నస్త్రగురుండగు ద్రోణుండు పరమ రహస్యంబగునస్త్రం బిచ్చియుండుట మీరు మఱవఁవలదు. పాండవసేనా పతియగు నాద్రుపదతనూజుండు ధార్తరాష్ట్రులనెల్ల శరపరంపరల నలుగఁగొట్టుచు ద్రోణునిమార్కొనునెడ ధార్తరాష్ట్రునకు నను తాపం బుద్భవించును. ఆధృష్టద్యుమ్నుఁ డత్యంతధీమంతుఁడు, మనీషి, బలవంతుఁడు, మనస్వి, శ్రీమంతుఁడు సోమకులం దెల్ల నుత్తముఁడు. కృష్ణుని యాజ్ఞానుసారులగు వారలుదక్క నితరశాత్రవు లెవ్వరు నాతని కెదురై నిలువఁజాలరు.

మఱియు సంజయా! యాసుయోధనునితో నీలోకంబున మాతోడియుద్ధంబు వరింపవలదని మరలమరలఁ జెప్పుము. ఏలనందువా? మా బలంబులందు సాత్యకికూడ నొక్కమహాయోధుండై యున్నవాఁడు. సాత్యకి మహాబలసంపన్నుండు. ఆతనికి ముల్లోకములందును భయమను నది లేదు. అస్త్రవిద్యాకోవిదుండు, మహోరస్కుండు, దీర్ఘబాహుండు, యుద్ధలుబ్ధుండు, యుద్ధవిదులందుఁ బ్రథముఁడు, పరమాస్త్రవేది, తాల వృక్షప్రమాణముగలయాయుధంబు ధరించువాఁడు, మహారథుండు. ఇట్టి గుణంబులుగలశైనేయుండు మేఘంబు జలధారలఁ గురియువడువున శాత్రవులను మార్గణౌఘములముంచెత్తుచు యోధముఖ్యులనెల్ల బాణ పరంపరలఁ గప్పివైచును. ఎప్పుడు సాత్యకి సంగరాంగణంబునం బొడ చూపు నప్పుడ ధార్తరాష్ట్రునకనుతాపంబు జనింపక మానదు. దీర్ఘ బాహుండు దృఢధన్వుండు మహానుభావుండు నగుసాత్యకి యుద్ధా యత్తుండై వచ్చి విజృంభించినంతన సింహంబు గంధం బాఘ్రాణించిన గోగణంబులట్ల శాత్రవులు పలాయనం బాచరింతురు. ఆమహాత్ముండు

గిరులనెల్ల బాణంబులచేఁ జూర్ణంబు గావింపఁగలఁడు. ఎల్లలోకంబుల నేకక్షణంబున సంహరింపం దగువీరుండు. అస్త్రవిద్యయందు మిగుల నేర్పుగలవాఁడు. క్షిప్రహస్తుం డగు నాతండు ప్రతాపంబున దివిస్థితుం డగు దివాకరుండునుం బోలె వెలుంగును. యాదవవృష్ణిసింహం బగు సాత్యకికింగల యస్త్రయోగము చిత్రము శ్లక్ష్ణము సుకృతము భూయ స్తరమునై యొప్పును. ఎట్లుండిన నస్త్రయోగంబు ప్రశస్తంబని యార్యులు మెత్తురో యట్ల సర్వగుణోపపన్నం బగు నస్త్రయోగంబు సాత్యకికిం గలదు. శ్వేతవర్ణవిరోచమానంబు లగు వాల్గుతురంగంబులం బన్నిన మాధవుని రథం బధిరోహించి సాత్యకి సంగరాంగణంబున కరుదెంచి నంతన యకృతాత్ముండు మందుండు నగుసుయోధనుండు పరితాపం బొందును. హేమమణి దేదీప్యమానంబు శ్వేతాశ్వయుక్తంబు వానర కేతువిరాజితంబు నుగ్రంబు నగునారథంబున మాధవుండు నొగల నుండం గాంచి మందుం డగు గాంధారీనందనుండు దురపిల్లును. నాచే విధూయ మానం బగు గాండీవజ్యాతలనిష్పేషంబును భయంకర మగు వజ్రనిష్పే షంబువోలె నెప్పు డాలించునో యపుడు మూఢుం డగు ధృతరాష్ట్ర పుత్త్రుండు దుర్మతియు దుస్సహాయుండు నగుట మిక్కిలి దుఃఖించును. వర్షధారావభగ్నం బగు గోగణంబులమాడ్కి బాణవర్షాంధకారంబున సైనికులనెల్ల నేను ఖండించుచున్నపుడు కాని వానికి ననుతాపంబు గదురదు. మేఘమండలమునుండి పడుచున్నవిపలెనుండి విద్యుత్స్ఫులింగ ములవలె భయంకరరూపముగలిగి శత్రుసహస్రంబులఁ బరిమార్చుచు ఎమ్ములను మర్మములను భిన్న భిన్నములు గావించు గాండీవనిర్ముక్తంబు లగు నాబాణంబులం గాంచినంతన వానిదుర్మదం బడంగును. నిశితాగ్రంబు లగుగాండీవజ్యావినిర్ముక్తంబు లగు సాయకంబులు హయంబులను ద్విర దంబులను దృఢకవచధారు లగు యోధవరుల నవలీలఁ బరిమార్చుచుండ ధార్తరాష్ట్రుండు యుద్ధమ్మున కనుతాపమొందును. పరప్రయుక్తంబు లగుబాణంబులను బాణనికరంబున దుత్తుమురు గావించుచుఁ బగఱ శరీరంబులందు మహాశ్మసారకఠినంబు లగు పృషత్కరంబులు నే నర్పించు నపు డాధృతరాష్ట్రాగ్రనందనునకుఁ బశ్చాత్తాప ముద్భవించును. పక్షులు మహామహీరుహాగ్రంబులందుండు ఫలంబుల రాల్చుచందంబున మద్భుజా దండవినిర్ముక్తంబు లగు విపాఠంబులు యోధులశిరంబులు ధరం గూల్చు

నపుడు మందబుద్ధి యగు సుయోధనుం డసుతాపాకులుం డగును. నాచే నిహతులై రథంబులనుండి గజంబులనుండియుఁ దురంగంబులనుండియుఁ బడి నేలంగూలు మహాయోధుల నాయోధనభూమి నాలోకించునప్పు డా దుష్టబుద్ధి యగు దుర్యోధనుండు పశ్చాత్తాపపరవశుం డగును. నాయస్త్ర మార్గంబున కేతెంచినంతనే కొంచెమైనను సమరకర్మంబు గావింపకయే నశించుధార్తరాష్ట్రుల నాలోకించినపుడు సుయోధనుండు తాపం బొందును. నేను బదాతిసంఘంబులను రథసంఘంబులను నెల్లెడల నోరు తెఱచికొని పరతెంచినకాలాంతకునిమాడ్కి జ్వలితంబు లగుబాణవర్షంబుల సంహరించునపుడు ధృతరాష్ట్రాగ్రనందనుం డనుతాపం బొందును. ఎల్లదిక్కులం దెక్కడఁజూచినఁ దానయై తోఁచురథంబు నధిరోహించి నేను గదనంబు సేయుచుండ రజోధ్వస్తంబుగాండీవనికృత్తంబునై నివ్వెఱ పాటునఁ గాలుసేతులు గదల్పక మూఢంబై యున్న తనబలం బవలోకించినపు డామందుఁడు తనయకృత్యమునకుఁ జింతించును. భయాకులంబై దిక్కులకుఁ బలాయనం బాచరించువారును నికృత్తగాత్రులై మొఱలిడువారును చైతన్యంబు లేక నేలంబడి పొరలువారును, పిపాసార్తులు శ్రాంతులు నగువారునై హతాశ్వనాగప్రవరం బగు ననీకంబు గాంచి సుయోధనుం డనుతాప మొందును. హతంబు హన్యమానంబు నగుచు నార్తస్వరంబు లెలుగించుచు వికీర్ణంబు లగు కేశాస్థికపాలసంఘంబులు గల చమూనికరం బవలోకించి యతఁడు పరితపించును. వాజిపేయం బను మహాయాగంబునఁ బడునేడుపశువులు విశసింపఁబడును. నేను గావించురణమహాయాగంబున నన్ననో నసంఖ్యాకంబు లగు వివిధపశువులు విశసింపఁబడునని తెలియుము. ఎప్పుడు రథంబునందుఁ బ్రజ్వలించుగాండివమును వాసుదేవుని దివ్యం బగుపాంచజన్యంబును దివ్యహయంబులను అక్షయతూణీరంబులను దేవదత్తంబును నన్ను నాలోకించునో యప్పు డాసుయోధనుండు మిగుల ననుతాప మనుభవించును. దస్యుసంఘంబులం జదుపుచు యుగాంతమునం దన్యయుగమును బ్రవర్తింపం జేయు నగ్నిమాడ్కి కౌరవేయులనెల్ల నొక్కుమ్మడి నేనుదహించుచుండ నప్పుడ సపుత్రుం డగు ధృతరాష్ట్రుండు పశ్చాత్తాప మొందును. క్రోధవశుండు నల్పచేతనుండు నగు గాంధారేయుండు తమ్ములతో సైన్య

ములతో భృత్యులతో బ్రమత్తైశ్వర్యుండై దర్పంబెడలి వధంబు బ్రాపించునపుడు పశ్చాత్తాప మనుభవించును.

తొల్లి యొక్కదినంబున బూర్వాహ్ణకాలంబున సంధ్యావందనాంతంబున జపం బాచరించి గృహంబునకు మరలరానున్న నాకొక్క బ్రాహ్మణుండు సమీపించి పార్థా! నీవిపు డొకదుష్కరంబగు కార్యంబు గావింపవలసియున్నది. నీవిపుడు యుద్ధమున శత్రుసంహారము గావింపవలయునని చెప్పెను. ఇంద్రుండుకూడ నైరావతంబు నారోహించి వజ్రాయుధంబు కేలంబూని నీకు ముందుగా నడచుచు శత్రుసంహారంబు గావించును. సుగ్రీవంబను హయోత్తమంబుం బూన్చినరథం బధిరోహించి నీవెనుకభాగంబున వాసుదేవుండుకూడ వచ్చి సహాయకం బాచరించును. కావున వేవేగరమ్మని పలికెను. ఆమాటలాలించి యావిప్రుండు మహేంద్రుడుగాఁదెలిసి వజ్రపాణియగు నాతనివలననాదస్యుసంఘయుద్ధంబున వాసుదేవుని నాకు సహాయుఁడుగా వరించి కృష్ణుని సహాయము వడసితిని. ఈకార్యంబు దేవతలెల్లరు నాకొఱకుగా నిర్మించిరని తలంతును. కృష్ణుండు సంగరంబు గావింపకున్నను మనంబున నెవ్వనికి జయం బభిలషించునో యాపురుషుండు మహేంద్రుండును సకలదేవతలు నొక్కమొగమైవచ్చినను శాత్రవులనెల్ల జయించును. తేజస్వియు నత్యంతశూరుండునగు కృష్ణు నెవ్వఁడు జయింపఁ దలంపుగొనునో యామూఢుఁడు అప్రమేయం బగు మహోదధిని బాహుబలంబునఁ దరింపఁ దలంచెనుటయే యగును. ఎవ్వఁడు మహోన్నతంబు శ్వేతపర్వతంబును గరతలంబున భగ్నంబుగావింప నెంచి ప్రహరించునో వానిచేయి వ్రేళ్లతోడను గోళ్లతోడను చిదికిచివికి నశించునుగాని, యాపర్వతంబున కణుమాత్రంబేని లోపంబు గలుగదు. వాసుదేవుని యుద్ధంబున గెలువఁ జూచుమూర్ఖుండు మహాజ్వాలాభీలం బగునగ్నిని బాహుబలంబునఁ జల్లార్చుటకును బాహువులచేఁ జంద్రసూర్యులగతి నివారించుటకును దేవతాగణాభిరక్షితం బగునమృతంబు నపహరించుటకును దలంచును. వాసుదేవుండు మున్ను భోజులనెల్ల నేకరథంబున జయించి బలాత్కారంబుగ వారలనెల్ల వారించి యశోజాజ్వల్యమాన యగు రుక్మిణిని గైకొనివచ్చి భార్యగావించికొనియె. కృష్ణునివలన నామెయందు మహాబలపరాక్రమాభిశోభితుం డగు ప్రద్యుమ్నుం డుద్భవించెఁ మఱియు

గాంధారులనెల్ల బరాజితులం గావించి నగ్నజిత్తుని కుమారులనెల్ల నిరవశేషంబుగ జయించి వారలచే బద్ధుం డగుసుదర్శనరాజపుంగవుని విడిపించెను. దేవతలకెల్ల శిరోభూషణం బగు నీవాసుదేవుం డభయప్రస్తులై శరణాగతులైన నగ్నజిత్పుత్రు లుపదగా నర్పించిన నాగ్నజితిని బరిణయంబై వెలుంగుచున్నవాఁడు. మఱియు నామహానుభావుండు కవాటనగరంబునం బాండ్యమహీపాలు నోర్చె. కళింగనరపతులతోడ దంతవక్త్రునిం బరిమార్చె. ఈతండు దగ్ధంబుగావించిన వారాణసీనగరం బనేకవర్షంబు లనాథయై పాడుపడియుండె. దుర్యోధనుండు నిషాదరాజగు నేకలవ్యుని జయింప నేరకిని దరంబుగాదని తలంచుచుండెడివాఁడు. అట్టి యేకలవ్యు నీతఁడు శైలాకారంబున నెదిరించిన జంభదానవుని బురందరుండు పరిమార్చినతెఱంగున నఱచేత నొక్కప్రహారంబునఁ బరలోకంబున కనిచె. దుష్టాత్ముండు నుగ్రసేనునితనయుండు నగుకంసుని వృష్ణ్యంధకవీరులెల్లరు వెఱగందిచూచుచుండ బలదేవద్వితీయుండై కేశపాశంబుంబట్టి నేలకీడ్చి పిలుకుమార్చి యుగ్రసేనునకు రాజ్యం బొసంగె. జనార్దనుండు మాయాకోవిదుం డగు సౌభరాజగుసాల్వుండు గగనంబుననుండి మాయాకదనం బొనరింప నశ్రమంబున వాని డీకొనియె. సౌభద్వారంబున సాల్వునిచేఁ బ్రయుక్తం బగు శతఘ్నిని చేతులతోఁ బట్టి విఱిచెను. ఇట్టి మహాబలు నెవ్వఁ డెదుర్కొనంగలఁడు? ఘోరంబు నసహ్యంబు నగు ప్రాగ్జ్యోతిషంబను నసురులమహానగర మొండు గలదు. ఆపురంబునేలు నరకుం డనుభూసుతుం డగు నసురుండు మాయచే నదితి వలన మణికుండలము లపహరించికొనిపోయెను. మృత్యుభయ మెఱుంగనిదేవతలెల్లరును దేవరాజసమేతులయ్యు వానిధాటి కోర్వఁజాలరైరి. అప్పుడు వారలెల్ల వాసుదేవుని మహాపరాక్రమంబును నవర్ణనీయం బగు నస్త్రవిద్యానిపుణత్వమును నీతనిప్రకృతియు నెఱింగి యీతని నాదస్యుల వధింప నియోగించిరి. స్వాధీనసిద్ధి యగువాసుదేవుండు సురలప్రార్థనం బాలించి నరకోన్మూలనంబు వారలకుఁ బ్రతిశ్రుతంబు నేసె. నరకసంహారాభికాంక్షియై యీతండేగి నిర్మోచనమనుపురంబున నాఱువేలరక్కసుల నుక్కడంచి, సుతీక్ష్ణంబు లగుక్షురంబులచే నిర్మింపబడినపాశంబుల విచ్ఛేదంబుగావించి, సేనానాయకుం డగు మురాసురుం బరిమార్చి నిర్మోచః ప్రవేశించె. ఆనగరంబునందు యతిబలుం డగు నీవిష్ణునకు మహ

బలుం డగునరకునితో ఘోరయుద్ధంబు ప్రవృత్తంబయ్యె. నరకుండు కృష్ణనిహతుండై ప్రాణంబులవీడి వాతోన్మథితం బగు కర్ణికారద్రుమంబు వోలె నేలంగూలెను. సాటిలేని ప్రభావంబు గలవాసుదేవుండు భౌముం డగునరకుని మురుని బరిమార్చి మిగిలిన రాక్షసులనెల్ల దూరంబుగఁద్రోలి మణికుండలములఁగైకొని సిరియుఁ గీర్తియు నవారణవరింపఁదిగివచ్చెను. అట్లతండు కావించిన భీమంబు సుదుష్కరంబు నగుకర్మం బాలోకించి దేవతలెల్లరును ముదితహృదయులై యుద్ధంబులందు శ్రమంబు లేకుండు నట్లును, ఆకాశంబునను జలంబులందును గమననిరోధంబు గలుగక విక్రమంబు గలుగునట్లును శస్త్రంబులు గాత్రంబున నాటకుండునట్లును వరంబు లొసంగిరి. ఈవిధంబున వాసుదేవుండు, సురలచే వరంబులు గైకొని కృతార్థుండై యున్నవాఁడు. మహాబలుం డగువాసుదేవునం దిట్టి గుణసంపద యెపుడు నెడయక వసించును. పరులకోర్వ శక్యముకాని వాఁడు విష్ణుండు అనంతవీర్యుండునగు నీవాసుదేవుని జయింపఁ దలంచు చున్నదుర్యోధను నేమనవచ్చును ? దురాత్ముం డగు సుయోధనుం డెల్ల పుడు నీతని జులకనఁ జూచుచుండును. జనార్దనుండు మామొగంబులు సూచి వానియకార్యంబులెల్ల సైరించుచున్నాఁడుకాని లేకున్న నీపాటి కెన్నఁడో యాతఁడు యమలోకంబునఁ బ్రాంతకాపై యుండెడివాఁడే. నాతోడను గృష్ణునితోడను గలహం బాచరించి పాండవులమమత్వ మెడలింపఁదలంచిన సుయోధనుండు సంగరాంగణంబున నప్పుడే వాస్తవం బెఱుంగంగలఁడు.

నేను బితామహుండగు శంతనునందనునకును, వద్ధుండగు నాంబికేయునకును, నాచార్యుం డగుద్రోణునకును, నాచార్యపుత్రుఁ డగునశ్వత్థామకును, నప్రతియోధుం డగు కృపునకును నమస్కరించి, మారాజ్యంబ కోరువాఁడనై సమరంబుకావించెద. ధర్మచారియై యెవ్వండు పాండవులతో యుద్ధంబుగావించునో వానికి ధర్మంబుననే నిధనంబు ప్రాప్తంబయ్యెనని యెఱుంగుము. ఉత్తమ రాజపుత్రులమగు మేము నృశంసులచేఁ గపటద్యూతంబున నోటుపడి దీర్ఘకాలంబుఘోరారణ్యములందు వసించియు నొక్కయేఁ డజ్ఞాతచర్యగావించియుఁ బ్రతిజ్ఞ నిస్తరించితిమి. పాండవులు ప్రాణంబులతోడనే యుండ నాధార్తరాష్ట్రులు రాజ్యంబు స్వాయత్తంబుగావించికొని యెట్లు సుఖింపఁగల్గుదురు? మహేంద్రుఁడాదిగ

దేవతలెల్ల సహాయులైరా ధార్తరాష్ట్రులు మమ్ము జయింపఁగల్గిరేని ధర్మాచరణంబుకంటె నధర్మాచరణమే బలవత్తరమగును. అపుడు పుణ్య మనునది లోకంబున లేకయేపోవునని నిక్కముగఁ దలంపవచ్చును. ఆ దురాత్ముండు మాపౌరుషంబు కర్మబద్ధం బని తలంపఁడేనియు మమ్ము విశిష్టులుగా దలంపఁడేనియు నాదురాత్ముం డగు సుయోధనుని సానుబంధం బుగ నేనొక్కరుండన వాసుదేవద్వితీయుండనై వధింతును. ఈమా కార్యంబు విఫలంబుగాదేనియు, సుకృతంబుగూడ నిష్ఫలంబుగాకుండు నేని యిప్పుడు మాకు రాజ్య మీయకుండుటయు నప్పు డట్లు బన్నములుగుడుపుటయు నాలోచించిన ధార్తరాష్ట్రునకుఁ దప్పక పరాజయం బును వధంబు నాసన్నంబై యున్నదని తోఁచుచున్నది. మీకందఱకుఁ దెలియునదియే మఱలఁ జెప్పుచున్నాఁడను. యుద్ధమే నిశ్చితం బగునేని ధార్తరాష్ట్రు లనుశబ్దమేనశించును. యుద్ధంబున కాయత్తంబుగాక వేఱు పాయంబులం బ్రయత్నించిరేని గౌరవులు క్షమభాజను లగుదురేమో కాని యుద్ధంబునఁ గౌరవుఁ డొక్కండైనను మిగిలియుండఁడని నమ్ముఁడు. నేను కర్ణునితోఁగూడ ధార్తరాష్ట్రులనెల్లరఁ బరిమార్చి సమగ్ర మగు కౌరవరాజ్యంబును స్వాధీనంబుగావించికొందును. ఇప్పుడు మీ కుచితం బని తోఁచిన తెఱంగున నిష్టకార్యంబు లాచరించికొనుఁడు. ధనమున కనుగుణంబుగ నిష్టంబు లగుభోగంబు లనుభవించి సుఖింపుఁడు. మాకడ బహుశాస్త్రవేదులు, సాంవత్సరికులు, జ్యోతిశ్శాస్త్రపారంగతులును, నక్షత్ర యోగంబులందు నిశ్చయంబెఱింగినవారు నగు బ్రాహ్మణోత్తములు గలరు. సచ్ఛీలవంతులు సత్కులసంజాతు లగువారు మాకావించుపూజల కలరి మాకు విజయంబుగలుగ దీవించుచున్నారు. ఉచ్చావచంబగు దైవ యుక్తం బైన రహస్యంబును, దివ్యంబులగుశకునంబులను దెలుపుచున్న వారు, మృగపక్షిసంఘంబులు మాకు శుభంబును సూచించుచున్నవి. దివ్యంబు లగు నుత్పాతంబులును, మృగసంఘంబులును, ముహూర్తంబు లును కౌరవులకును సృంజయులకును మహాక్షయంబు నెఱింగించుచు, పాండవులకు విజయము దెల్పుచున్నవి. సంసిద్ధార్థుం డగు నజాతశత్రుం డును శత్రునిగ్రహమున కంగీకరించినశ్లే యపరోక్షవిద్యుం డగు జనార్ద నుండు ననుమతించుచున్నవాఁడు. వృష్ణిసింహుం డెన్నండును సంశయ ముఘు. గావింపండుగదా? నేనుగూడఁ బ్రమాదంబువీడి బుద్ధిచే ధార్త

రాష్ట్రనిధన మవశ్యము కాఁగలదని తలంచుచున్నాఁడను. నాకిప్పుడును బురాణంబగు జ్ఞాననేత్రంబు గలదు. అది యిసుమంతయు వ్యథితముగా లేదు. ధార్తరాష్ట్రులు యుద్ధంబున కాయత్తులైరేని వారు తప్పక నశింతురు. గాండివంబనాలబ్ధమయ్యు విజృంభించుచున్నది. అనాహతయయ్యు జ్యావల్లిక కంపించుచున్నది. నాబాణంబులు వానియంత నవియ తూణీరమునుండి వెలువడి పైకి నెగయుచున్నయవి. ప్రసన్నం బగుఖడ్గంబు కోశంబు వెలువడుచున్నది. పాము జీర్ణం బగు తనకుబుసంబు వీడి పైకి వచ్చువడువున నాఖడ్గంబు కోశంబువెలువడి వచ్చుటయే మాకు విజయంబు సిద్ధమని యెఱింగించుచున్నది. నాధ్వజంబున "కిరీటినీరథం బెప్పుడాహవం బొనరించును." అను రౌద్రరూపంబు లగువాక్యంబులు వినఁబడుచున్నవి. రాత్రులందు గోమాయువులు మందలుమందలుగా వచ్చి కూయుచున్నవి. అంతరిక్షమునుండి రక్షస్సులు పడుచున్నవి. మృగంబులు సృగాలంబులు నీలకంఠంబులు వాయసంబులు గృధ్రంబులు బకంబులు తరక్షువులును నాశ్వేతహయయుక్తం బగురథంబునకు వెనుకఁబడుచున్నవి. కావునఁ దప్పక నాకు విజయంబు లభించును. నిదాఘమం దగ్ని విజృంభించి వనంబులు దహించుచాడ్పున నేనొక్కరుండన బాణవర్షంబులఁ బఱపి సకలరాజలోకంబుల నెల్లయోధులను యమలోకంబున కనిచెద. స్థూణాకర్ణం బగుపాశుపతమహాస్త్రంబును నాకు దేవరాజనుగ్రహించిన బ్రహ్మాస్త్రంబును సంధించి వేగవంతంబు లగు నాశీవిషోపమంబులైన బాణంబులం బఱపి ప్రజలనెల్లర సంహరింతును. కౌరవు లొక్కరైన మిగులకుండఁ బరిమార్చి పిదప శాంతివహింతును. ఇదియ నాపరమ నిశ్చితంబు. నా యీస్థిరనిశ్చయంబు కౌరవుల కెఱింగింపుము. ఎన్నఁడును బరాజయం బన నెఱుంగక దేవతలనైన దలపడి విజయమందెడి పాండవులతో నాధృతరాష్ట్రసూనుండు కలహము వాంఛించుచున్నవాఁడు. సంజయా చూడుము వానిమోహ మెట్లున్నదో! వృద్ధుం డగు శంతనునందనుండు కృపుండు ద్రోణుండు నశ్వత్థామ విదురుండు నెట్లాలోచించి కార్యంబు నిశ్చయించిన నట్లే యగుఁ గాక. కౌరవు లాయుష్మంతులై యుందురుగాక యని ధనంజయుండు దుర్యోధనున కెఱింగింపుఁడని నాతోఁ బలికెనని చెప్పి సంజయుండు మిన్నకుండె.

సంజయుం డట్లు చెప్పినవాక్యంబు లాలించి యాంబికేయుండు

సంజయా ధర్మాధర్మప్రవర్తకుండు దుష్టసంహారణదీక్షాపరతంత్రుండు నగు జనార్దనుం డేమివచించె నని తెలుపుమని యడుగుటయు నాతఁడు మరల నిట్లు చెప్పనారంభించెను. ఆగుల్ఫప్రదేశంబుగ వంగి ప్రయతుండనై యంజలిమోడ్చి నరసింహు లగు కృష్ణార్జునులశుద్ధాంతంబు ప్రవేశించితిని. ఆమందిరంబున నకులసహదేవులుగాని, యభిమన్యుండుగాని ప్రవేశింపరాదు. అందు కృష్ణార్జునులు ద్రౌపది సత్యభామయు రహస్యగోష్ఠి నెఱపుచుండిరి. కృష్ణార్జును లిరువురును మధ్వాసవక్షీబులు వరచందనభూషితులు వరమాలాధారులు వరకౌశేయవసనులు వరాభరణభూషితులునై వెలుంగుచుండిరి. ఆమందిరం బనేకమణిగణవిభాసితంబు, సౌవర్ణాసనసనాథంబు నానాస్తరణసంస్తీర్ణంబునై దేదీప్యమానం బగుచుండె. జనార్దనుండు సత్యభామ యంకము తలగడగాఁ బరుండియుండె. ఆమహాత్మునిపాదంబు లర్జునుండు తొడలపై నిడుకొనియుండె. ఆసమయంబున నేను గన్పించుటయు నర్జునుండు ముదితహృదయుండై దాసీజనంబు కొనివచ్చిన కాంచనపాదపీఠంబు నాకొసంగి నన్ను దానిపై నుపవేశింపుమనియె. నేను దానిపైఁ గూర్చుండక చేతితో దానిని స్పృశించి నేలపైని గూర్చుండితి. ఊర్ధ్వరేఖాంకితములు శుభలక్షణవిరాజమానంబులు నగు నర్జునునిపాదంబు లుత్తమస్త్రీ లిరువురు పట్టుకొనియుండిరి. నా యొనరించిన కర్మంబులందు లేశమైనఁ గల్మషంబు లేమిం జేసియే స్త్రీరత్నసహితులయ్యు రహస్యంబున నాతో వాసుదేవార్జునులు సంభాషించిరి. అపుడు నా కత్యంతాశ్చర్యంబువొడమి కన్ను లానందవారిపూరితంబులయ్యె. ఒడలు హర్షపరవశత్వంబున బులకరించె. శ్యామలగాత్రులు, మహాదేహులు, తరుణులు, నాగంబులంబోలి బుసకొట్టుచున్నవారునై, యేకశయ్యాగతులై యున్నవారిం గనినంతన నామనంబు భయవిహ్వలంబయ్యె. అప్పు డాపురుషపుంగవుల నిరువుర నాలోకించి నరనారాయణు లిరువురు నెవ్వనియాజ్ఞాకరులై యున్నారో యట్టి యజాతశత్రుని సంకల్పములం దలభ్యమగున దొక్కటియు నుండఁబోదని చింతించితిని. అన్నపానాచ్ఛాదనాదులచే సత్కృతుల నందితిని. అనంతరము సందేశమూమహాత్ములకు నివేదించితిని. అపుడు ధనంజయుండు ధనుర్ధరణోచితం బగుపాణితలంబున యశస్వి యగు కేశవునిపాదంబు నెత్తుటయు దివ్యభూషణభూషితుం డగువాసుదేవుం డింద్రధ్వజప్రతీకాశుండై యుంచుక

లేచి చింతామణిభద్రసింహాసనాసీనుండగు వాసవుండువలె శయనంబున నుపవిష్టుండై నన్నుద్దేశించి యిట్లు పలికెను. సంజయా! నీవాసభామందిరంబునం గల రాజలోకంబునకెల్ల నిట్లు తెలుపుము. ఆచార్యుండును గురుపితామహుండును వినుచుండ వారితో మీరర్థంబులెల్ల పార్థులందు విడిచి కామజంబులగు సుఖంబులెల్ల ననుభవింపుఁడు. ప్రియులకుఁ బ్రియ కార్యంబులెల్ల నాచరింపుఁడు. ధర్మరాజు జయమునకై తొందరపడుచున్నవాఁడు. వివిధంబులగుయజ్ఞంబుల గావించి దక్షిణల నొసంగుఁడు. పుత్రులతోడను భార్యలతోడను వివిధవిలాసంబులఁ గ్రీడింపుఁడు. మీకెల్లరకు మహాభయం బుపస్థితంబై యున్నది. దుశ్శాసనుండు తలఁబట్టి యీడ్చి తెచ్చి కొలువుకూటంబున వలువయీడ్చునవసరంబున దూరంబుననున్న నన్నుద్దేశించి 'కృష్ణాకృష్ణా' యని యేడ్చినయేడ్పు నాహృదయంబునఁ బ్రవృద్ధం బగు ఋణభారంబై తోఁచుచున్నది. తేజోమయంబు దురాధర్షంబగు గాండివంబును గేలం గీలించి నేను సంయాత్రికుండుగా నున్నపార్థునితో మీకు వైరంబు జనించె నని నుడువుటయు నామాట లాలించిన నామేను భయంబున జడప్రాయం బయ్యె. నీపుత్రుండన్నో యంతకంతకు లోభంబునకు వశుం డగుచున్నాఁడేకాని శమింపలేదు. మందుండగునాతండు సోమేంద్రసదృశు లగువాసుదేవార్జునులమహాత్త్వ మెఱుంగకున్నాఁడు. దీనికంతకును నీవే గతియని భీష్మద్రోణులు గొలిచి యుండుటయుఁ, గర్ణుండు ప్రగల్భములాడుచుండుటయుఁ గారణంబులై యున్నవి.

## భీష్ముండు నరనారాయణులచరిత్రం బెఱింగించుట

సంజయుం డిట్లు వచించుటయు శాంతనవుండు సభాసదు లగు రాజులెల్లరు వినుచుండ సుయోధనున కిట్లనియె. వత్సా! సుయోధనా! తొల్లి యొక్కదినంబున బృహస్పతియు శుక్రుండును నగ్నియు నాదిత్యులును సాధ్యులును సప్తమహర్షులును విశ్వావసుం డను గంధర్వుండును నప్సరోగణంబులును బ్రహ్మలోకంబున కరిగి లోకవృద్ధుం డగు పితామహునకు నమస్కరించి యాతని బరివారించి యుపాసించుచుండిరి. ఆసమయంబున నెల్లరమనంబులను దేజంబులను దమతేజంబున నాకర్షించుచున్నారో యనునట్లు దేవతలకెల్లఁ బూర్వులగు నరనారాయణులను

మహర్షు లాసభ నతిక్రమించి వెడలిరి. అదిచూచి బృహస్పతి విస్మయా విష్టచిత్తుండై విధాతతో మహాత్మా! యిపు డిట్లు వెడలినవార లెవ్వరు? లోకపితామహుండ వగు నీకు నమస్కారమేని గావింపక యుపేక్షించి వెడలిరే? వారి నాలోకించిన మహాశ్చర్యంబు మాకుఁ బొడముచున్నది. వారలవృత్తాంతం బెఱింగింపుమని వేఁడుటయుఁ గమలాసనుండు చిఱు నగవు మొగంబునందోప సురాచార్యున కిట్లనియె.

భూమ్యాకాశములను దమశరీరకాంతులచే వెలింగింపఁజేయుచు నిపు డీమార్గమున వెడలిన మహానుభావులు నరనారాయణు లనుమహర్షులు. ఈతపస్వులు మహాబలులు. తమతపంబుచే నూర్జితులైనవారు. వీరిబలపరాక్రమములకుఁ గొలఁదికానరాదు. వీరు భూలోకంబునుండి యిపు డీలోకంబునకు వచ్చియున్నవారు. వీరు తపంబున లోకంబుల నెల్ల ధరించుచున్నవారు. దేవగంధర్వపూజితు లగు నీపరంతపులసుర వినాశమునకై రెండుగా భిన్నంబు లగు శరీరంబులుగలవారై వెలుంగు చున్నవారని పలికెను. ఆమాట లాలించి పురందరుండు సురాచార్యుని బురస్కరించికొని దేవగణంబులతోఁగూడ నామహర్షులు తపంబొనరించు స్థలమున కరిగి వారిరువురకుఁ బ్రణామం బాచరించి రాక్షసులతోఁ దాము గావించుమహాసమరంబున సాహాయ్యంబుగావింప యాచించెను. వారు ప్రసన్నులై సురేంద్రుని ప్రార్థనం బాలించి దివౌకసులతోఁగూడి వచ్చి మహాసమరంబున నసురులనెల్లఁ బరిమార్చిరి. నరుండు పౌలోము లను గాలఖంజులను వందలువేలుసంఖ్యగల రాక్షసులను సంహరించెను. జంభుం డగుదానవుండు నరుని గ్రసింప యత్నింప నాతండు బిఱబిఱ తిరుగు రథమ్మునందుండి యొక్కకోలచే వాని నేలం గూలనేసెను. ఇతండు సాగరపారంబునందు హిరణ్యపురంబు నిరోధించి యందు వసించియున్న నివాతకవచులను రాక్షసుల నఱువదివేల నొక్కరుండ బరి మార్చె. మరియు వేలకొలఁదిగ దేవతలెత్తివచ్చిన వారలనెల్ల నింద్రు నితోఁగూడ జయించి యగ్నిదేవుని దృప్తుని గావించెను. నారాయ ణుండు నట్లే యనేకు లగుదుష్టదానవుల సంహరించియున్నాఁడు. ఆనర నారాయణులే యిపు డర్జునవాసుదేవాహ్వయంబుల దుష్టవినాశంబున కాయత్తులై వచ్చియున్నారు. వాసుదేవార్జునులు దేవతలకును బూర్వు లగునరనారాయణులని బాగుగఁ దెలియఁదగును. వీరల నీమానుష

లోకంబునకాదు; ఏలోకంబునందు నెవ్వరు జయింపఁజాలరు. దేవతల తోడి సురేంద్రుండైనను వీరిదాఁటి పోఁజాలఁడు. ఈకృష్ణుండు సాక్షాత్తుగ నానారాయణుండే. ఫాల్గునుండు నానరుండే. నారాయణుఁడు నరుండు ననునామంబులు శరీరంబులుగలిగి యొక్కసత్వమే భిన్నరూపంబునఁ జరించుచున్నది. వీరు తపోబలంబున నక్షయలోకంబు లనుభవింతురు. ఎక్కడెక్కడ యుద్ధంబు సంభవించునో యక్కడక్కడ వీరలు జనించి దుష్టులఁ బరిమార్చి శిష్టుల రక్షించుచుందురు. కావున మీారెల్లరును గర్మంబు నెల్లపుడును గావింపుం డని నారదుండు వృష్ణిసంఘంబుల కొకసమయంబునఁ దెలిపియుండెను. శంఖచక్రగదాహస్తుం డగు వాసుదేవుని గాండీవంబు కేలంబూని యస్త్రంబుల సంధించుచున్న యర్జునుని నేకరథంబున నెప్పు డాలోకింతువో యపుడు నావచనంబు నవశ్యము స్మరింపంగలవు. నామాటలు నీవాదరింపవేని గురుకులంబునకు నాశం బాసన్నం బైనదని యెఱుంగుము. సుయోధన! నీబుద్ధి యర్థంబునకును ధర్మంబునకు నెడసియున్నది. నావాక్యంబు లిపుడు నీవు విననొల్లవేని ముస్ముందు పెక్కుయోధులు మడసిరని విందువు. నీ వెందఱెన్నివిధంబులఁజెప్పినను వినక ముగ్గురమాటమాత్రమ యాలంబించుచున్నావు. దుర్జాతియు గురుశాపదగ్ధుండు నగుకర్ణుండును, మాయావి యగుశకునియు, క్షుద్రుం డగునీయనుజుండు దుశ్శాసనుండు నేదిచెప్పిన నదియపరమార్థంబని స్వీకరించుచుందువు. అల్పబుద్ధులు, నీచులు, కార్యాకార్యవివేకశూన్యులు నగువారు నిన్ను వశముగావించికొని, రాజలోక వినాశంబునకు సమకట్టియున్నవారలు. నీవు వారిమాటలఁ దృణీకరించి కురుపాండవనిధనంబు నివారింపుము. అని పితామహుండు పలికినంతఁ గర్ణుండు రోషారుణితనేత్రుండై 'శాంతనవ! నీవు నన్నుద్దేశించి పలికిన పలుకులు కరం బనుచితంబులై యున్నవి. జీవితమునం దాసగలవాఁ డెవ్వండు నాయెదుర నిట్టివాక్యంబులు పలుకనోపఁడు. నే నెల్లవిధముల రాజధర్మంబున నిలచియున్నవాఁడను. నేనే నాస్వధర్మము నించుకంతేని విడువలేదు. నాయం దేదోషంబుగలదని నన్ను నిందించెదవు. ఈయున్న ధార్తరాష్ట్రు లెవ్వరును నాయెడ లేశమేని దుర్వృత్తంబు కని విని యెఱుంగరు. నేను మనోవాక్కాయకర్మంబులచే నెప్పుడును ధార్తరాష్ట్రునెడ దోషంబుగావించి యెఱుంగను. నేనొక్కరుండన యాహవం

బున సర్వపాండవులను వధింపఁగలను. తొలుతనుండియు మహావిరుద్ధు లగువారలతో శమంబుగావించుట యెట్లు పొసంగును? ఈధృతరాష్ట్ర మహీపాలున కెయ్యది ప్రియంబో దానినెల్ల నే నాచరించితీఁజెదను. అట్లే దుర్యోధనుని హితంబును సర్వవిధముల నాచరింతును. ఈతండు రాజ్యంబున సమాహితుండుగదా?' యనియె.

కర్ణుం డిట్లు వచింప శాంతనవుండు మరల ధృతరాష్ట్రున కిట్లనియె, 'రాజా! యీకర్ణుండు పాండవుల వధింతునని బలుమాఁటలిట్లు ప్రేలుచుండునే కాని వీఁడు మహాత్ము లగుపాండవులకు కలామాత్రమైనను సాటిగాఁడు. నీతనయులుగావించు ననయంబున కెల్ల నీసూతపుత్త్రుని దుర్బుద్ధియే కారణం బని యెఱుంగుము. దుర్మతియు దుర్జాతుండు నగు వీని నాశ్రయించి నీతనయుండు మహాబుద్ధిబలపరాక్రమసంపన్నులు దేవపుత్త్రులు నగుపాండవుల నవమానించినవాఁడు. ఆపాండవు లొక్కరొక్కరుఁగావించిన సుదుష్కరం బగుకర్మలలో నీతఁ డెప్పు డెట్టికార్యంబు గావించియున్నాఁడు? విరాటనగరంబున ధనంజయుండు విక్రమించి తన ప్రియానుజుని సంహరించినపుడు వీఁడేమిచేయఁగలిగెను? పాండవులెల్లరును మహావీరులు శూరులు సర్వాస్త్రకోవిదులు. వారలెల్లరును స్వస్వపరాక్రమంబు మెఱయించి మహాయశంబు గడించియున్నవారు. వారలు తం పడిరేని సకలదేవతల నోడించి వారలయైశ్వర్యం బపహరింప వలంతులు. వా రెన్నండును జయంబు విడనాడువారుగారు. అప్పుడు కౌరవులెల్లరు నొక్కుమ్మొగ్గరంబుగా సన్నద్ధులై యుండ ధనంజయుండు మహాయోధులెల్లర తలచీరలు నపహరించియుండెనుగదా? ఈవాచాలుం డగు సూతపుత్త్రుఁ డాసమయంబున నక్కడనుండ లేదాయేమి? ఇప్పు డింత ప్రగల్భంబులాడు సూతపుత్త్రుండు ఘోషయాత్త్రావసరంబున నీతనయుని గంధర్వులు కట్టి కొనిపోవునపు డేమిచేయఁగలిగెను? ఆసమయంబున భీమసేనుండు నర్జునుండు నకులసహదేవులేకదా తమతమ పౌరుషంబు మెఱయ గంధర్వులఁ బరాజితులం గావించి నీతనయునియుసుఱులం గాపాడినవారు. రాజా! చూచితివికదా! యీసూతపుత్త్రుని మిథ్యాప్రలాపంబులు. వీఁడు వాక్యంబులకే కాని కార్యంబులకుం జాలఁడు. వీని యాలోచనం బాలింపక మంగళంబగుమార్గంబున జను' మని పలికె.

అంత భారద్వాజుం డగుద్రోణుండు శాంతనవునివాక్యంబు లాదరించి

ధృతరాష్ట్రునితో 'మహారాజా! యీశాంతనవుండు నుడివినదంతయు సత్యంబు. దీనికి సంశయింపం బనిలేదు. భీష్ముండు వచించినరీతి నవశ్యము నీవాచరింపుము. అర్థలుబ్ధు లగుదురాత్ముల వాక్యంబులు నీవాలింపకుము. నేను మున్నుగూడఁ బాండవులతో వైరము వలదనియు చెలిమిసేయు మనియుఁ బెక్కుమాఱులు వచించియుంటిని. అర్జునుండు తనతో నాడిన మాటలని సంజయుండు చెప్పినవచనంబులెల్ల వాస్తవంబులైనవి. పాండవ మధ్యముండు తప్పక చెప్పినతెఱంగునఁ జేయువాఁడు. ఈత్రిలోకంబు లందు నాతని కీడగు ధనుర్ధరుండు లేఁడనియె. ఆమాట లాలించియు భీష్మద్రోణు లిర్వురవచనంబులు ననాదరించి ప్రజ్ఞాచక్షుండు సంజయు దిక్కు మొగంబై వానిని బ్రశ్నింపఁదొడంగెను. భీష్మద్రోణులను గౌర వింపకయు వారితో యుక్తముగ భాషింపకయు వారిమాట లాదరింప కయు ధృతరాష్ట్రుండు సంజయుని బ్రశ్నింపఁదలంచినంతన సభాసదు లగు రాజులెల్లరును దక్కుంగలకౌరవయోధులును దమజీవితంబులయెడ నిరాశులైరి.

అట్లు భీష్మద్రోణులవాక్యంబులకుఁ బ్రత్యుత్తరంబీయక యంబికా నందనుండు సంజయునితో మనకు సహాయంబుగావింప బహుళంబు లగు సేనలు వచ్చియున్నవని విని ధర్మపుత్రుం డేమనియెను? నీవతనితో మాటాడునపు డతనిచేష్ట లెట్టివిగా నున్నవి? భ్రాతలందును బుత్రు లందు నెవ్వ రీతని యాజ్ఞకై నిరీక్షించుచుందురు? ఎవ్వ రాతనిని యుద్ధంబువలదని వారింతురు? ఎవ రాతనికి శాంతిని బోధింతురు? మహా ప్రాజ్ఞుం డగు ధర్మనందనునకు మంద ప్రజ్ఞులగు వీరునికారంబు గావించి యాతనికోపం బుద్దీపితంబు గావించిరి. అని పలుకుటయు సంజయుం డి ట్లనియె. రాజా! పాంచాలురు పాండవులు నాజ్ఞాప్రతీక్షులై యా పాండునందను మొగం బెప్పుడు నిరీక్షించుచుందురు. ఆతం డెల్లవారల నాయాకార్యంబులందు నియోగించుచుండును. పాండవులయుఁ బాంచా లురయు రథసంఘంబులు వేలువేలుగ బారులుతీఱియుండి యాతని ననుగమించుచు నభినందించుచుండును. నభోమండలంబునం దుద యించుచున్న బాలభానుబింబంబుంబోలెఁ దేజోరాశియై యొప్పట్టు నా కౌంతేయాగ్రజుని బాంచాలురు మిక్కిలి వినయంబున సేవింతురు. వేయేల? యాలమందలు గొఱ్ఱెలమందలు గాచుకొను గ్రామ్యజనులు

మొదలగుపాంచాలమాత్స్య కేకయాదినాగరకులపటలంబుం గల జనులెల్లరు
నజాతశత్రుని బ్రాణాధికంబుగఁ బ్రేమించి కొల్చుచుందురు. బ్రాహ్మ
ణాంగనలు రాజపుత్రికలు బాలికలు నింకను దక్కినవర్ణంబులకు మార
జనంబులెల్లరును బాలక్రీడావినోదంబులందలి ప్రొద్దుపుచ్చువారుమహో
త్సాహంబున ధర్మనందను స్కంధావారంబు విలోకింప నేతెంచుచుందు
రనియె. అంత ధృతరాష్ట్రుండు సంజయా! పాండవులు ధృష్టద్యుమ్నుని
తోడను సోమకులబలంబుతోడను మనపై నెట్టు లెత్తిరాఁదలఁచిరో
చెప్పుమనియడిగెను. ధృతరాష్ట్రుం డట్లడిగినంతన గవల్గణాత్మజుం డగు
సంజయుండు దీర్ఘంబుగ నిశ్వసించి యేదో యాలోచించుచుఁ దనమనం
బునకు దైవికం బగు నిమిత్తంబు తోఁచుటచే మూర్ఛితుండై యిలా
తలంబునం బడియెను. అదిచూచి విదురుండు మహారాజ! సంజయుండు
మూర్ఛితుండై నేలఁబడియున్నవాఁడు అతనినోట మాటరాకున్నది.
ప్రజ్ఞ సన్నగిల్లినది. చేతనం బెడసినట్లు పడియున్నవాఁడని చెప్పెను.
అపుడు ధృతరాష్ట్రుండు మహారథు లగుపాండునందనుల సంజయుం
డాలోకించియుండెఁగదా! అప్పుడు వీనిమనంబు వారివలన మిగులను
ద్వేగమందియుండఁబోలుననియె. సంజయుం డట్లు మూర్ఛితుండై కొంత
వడికి తెలిసి చిత్తంబు స్వస్థపఱుచుకొని కురుసభాసదులెల్లరు నాకర్ణింప
నంబికానందనున కిట్లనియె. రాజా! వార లేబలంబుచూచి కౌరవుల
కెదురు నిలువఁగలరో యాలకింపుము. మహావీరాధివీరుం డగు ధృష్ట
ద్యుమ్నునితో మీపైకిరా నిశ్చయించియున్నారు. రోషంబుననేని
భయంబుననేని లోభంబుననేని యర్థాశచేనేని హేతువాదంబుననేని
సత్యం బొక్కపుడును వీడనిమహానుభావుం డెవ్వాఁ డట్టియజాతశత్రుని
మున్నిడుకొని వారు కౌరవసేనల మార్కొందురు. ఏధర్మభృదగ్రేస
రుండు ధర్మమునందుఁ బరమప్రమాణమో యట్టి ధర్మనందనుధర్మం
బూఁతగొని వారు కౌరవులపై కెత్తివచ్చుచున్నవారు. బాహుబలంబున
నీపృథివీతలంబున నెవ్వనికి సాటిలేదో; ధనుర్మాత్రసహాయుండై సకల
రాజలోకంబును జయించి వశపఱుచుకొనిన మహాశూరుం డెవ్వాఁడో;
కాశీవంగమగధకళింగనరపతుల నెవ్వఁ డశ్రమంబున నోర్చి జయంబు
చేకొనియెనో యట్టి మహావీరుండు యోధాగ్రేసరుం డప్రమేయ
బాహుబలపరాక్రమశాలి యగు భీమసేనునితో మీపై నెత్తిరానున్న

వారు. ఎవ్వనిబాహుబలంబున సాహసంబున నల్వురుమానవులు జతు
గేహంబునుండి వెలువరింపఁబడిరో; మహాఘోరాకారుండు ప్రాకర్ముండు
నగు హిడింబుఁ డనుపురుషాదుని నేబల్విదుం డశ్రమంబున మడియిం
చెనో; పాండవులకు దుఃఖసాగరంబున మహాద్వీపమై యెవ్వఁడు
వెలుంగుచుండెనో; యట్టివృకోదరునితో వారు గౌరవులపైకి వచ్చు
చున్నవారు. సింధురాజు యాజ్ఞసేని నపహరించినపుడు విక్రమించి
సైంధవుని బరాభవించి ద్రౌపది నెవ్వఁడు కాపాడెనో యావాయునంద
నునితోఁగూడి వారు మీపై నెత్తివత్తురు. వారణావతంబున లక్క
యిల్లు దగ్ధంబగుచుండ నిద్రాపరవశు లగుపాండవుల మేల్కొలుపకయే
వారలనెల్లర నేవీరుండు విడిపించెనో యట్టిమహాబలశాలి మహాబలనంద
నునితో వారు మీసేనల మార్కొననున్నారు. పాంచాలికిఁ బ్రీతిగలి
గింప విషమంబు ఘోరంబు నగు గంధమాదనపర్వతంబు నధిరోహించి
నాగాయుతప్రతిమం బగు భుజబలంబున యక్షుల ననేకుల నిర్జించి
సౌగంధికప్రసూనం బాహరించి యేవీరుండు జగంబులఁ గీర్తిగడించెనో
యట్టి భీమసేనుభుజాదండంబుల నాశ్రయించి పాండవులు కౌరవుల
నెదిరింపనున్నవారు. ఏమహావీరుండు తనకుఁ గృష్ణుండు సహాయుండుగా
జాతవేదసుని బ్రీతునిం గావింప నెల్లదేవతలతోడంగూడి సమరాంగణ
మున విజృంభించిన జంభారి నెదిరించి పరాజితుం గావించి యశంబున
మించెనో యట్టి ధనంజయుని బురస్కరించికొని వారు సమరసన్నా
హంబు గావించుచున్నారు. ఎవ్వండు దుశ్చరం బగు తపం బాచరించి
సకలచరాచరంబుల కజేయుం డగు నీశ్వరుని మహాహవంబునం బ్రీతుం
జేసి బ్రహ్మాదిదేవతలకు నలభ్యంబగు నాపరమేశ్వరుని కరస్పర్శసుఖంబు
వడసి యెందును బరాజయం బెఱుంగనిపాశుపతమహాస్త్రం బాత్మా
ధీనము గావించికొనియెనో యట్టి కిరీటితోఁగూడి వారు మీపై నెత్తి
వచ్చుచున్నారు. ఎవ్వండు మహాసాహసంబు మెఱయ ఖాండవవనంబు
గాల్చు నవసరంబున లోకపాలకుల నెల్లరను వశపఱచుకొనియెనో
యాయర్జును నాలంబించి వారు మిమ్మెదుర్కొననున్నవారు. మ్లేచ్ఛగణ
పరిపాలితంబును దురాసదంబునగు పశ్చిమదిక్కు నెవ్వఁ డేకరథారూ
ఢుండై జయించెనో; చిత్రయుద్ధంబు నం దెవ్వని కీముజ్జగంబుల సాటి
యగువారు లేరో; ఎవ్వం డతిప్రమాణం బగు ధనువు ధరించి యత్యంత

దక్షనీయుండై యొసంగునో యట్టి మాద్రీనందనుండు నకులుండు ముందునడువఁ బాండవులు మిమ్ము డీకొనం దలంచుచున్నవారు. కాశ్యులను మగధులను వంగులను గాళింగుల నేకరథంబున జయించి మించిన మేటిమగండు సహదేవునితో మీసేనల వారు తుత్తుములు గావింపనున్నారు. ఎవ్వనికి అశ్వత్థాముండు ధృష్టకేతుండు రౌక్మిణేయుం డగు ప్రద్యుమ్నుండు రుక్మి యనునలువురుదప్ప వీర్యంబున సమాను లగు మానవు లెవ్వరుం గలుగరో యట్టి సహదేవునితో మిమ్ము మార్కొందురు. రాజా! యాసహదేవునితోడియుద్ధంబు కౌరవులకు మహాత్యయంబనియ యెఱుంగుము. తొల్లి కాశిరాజున కాత్మజయై జనించి భీష్ముని వధింపఁగోరి దుశ్చరం బగు మహాతపం బొనరించిన యంబ యను కన్యకయే మఱుజన్మమందును శాంతనవుని వధింపఁ దలంపుగలదై ద్రుపదునింట కాతనికి దనయయై జన్మించె. జన్మంబున స్త్రీయయ్యు దైవికంబుగఁ బురుషరూపమునొంది శిఖండియనుపేర నున్నది. ఆశిఖండి స్త్రీపురుషుల గుణాగుణంబు లెఱుంగునట్టితరు లెవ్వరు నెఱుంగరు. ఆతండు యుద్ధదుర్మదంబున నొక్కరుండు నేఁగి కళింగదేశము లెల్ల జయించె. ఒక్కయక్షుండు భీష్మనిధనాకాంక్షియై యాతనిస్త్రీరూపంబు తాను గైకొని తనపురుషరూప మిచ్చెను. మహేష్వాసుండు రౌద్రుండు నగు నాశిఖండిని సహాయునిగాఁగొని పాండవులు మీపైకి వచ్చుచున్నారు. మహాధనుర్ధరులు రౌద్రులు నగు కేకయనరపతు లేవురుసోదరులు మహాశూరులు నాముక్తకవచులునై యున్నవారు. పాండవులు వారితోఁ గూడి మీమూఁకల జీకాకుపఱుపరానున్నవారు. దీర్ఘబాహుండు క్షిప్రహస్తుండు ధృతిమంతుండు సత్యవిక్రముండు వృష్ణిసింహుండు నగు యుయుధానునితోడ మీకు సమరంబు గాఁగలదు. అజ్ఞాతవాసకాలంబునం బాండవులకు శరణంబైన మహావీరుండు శూరుండు నగు విరాటునితో మీకు సమరాంగణంబున సమాగమంబు గానున్నది. వారాణసీపతి యగు కాశిరాజు పాండవులకు సహాయుఁడుగా నేతెంచియున్నవాఁడు. మహాయోధుం డగు నాతనితోడ మీపై నెత్తివచ్చుచున్నారు. శిశువులైనను దుర్జయు లగు ద్రౌపదేయులు క్రుద్ధంబులగు నాశీవిషంబులుంబోలె మీయెడ విషంబులు గ్రక్కుచున్నవారలు. వారలతో మిమ్ముఁ బాండవు లెదుర్కొన సమకట్టియున్నవారు. వీర్యంబునఁ గృష్ణు

నడువడిఁ దపంబున ధర్మనందనునకును సమానుండగు నభిమన్యుండు సంగరంబునఁ గౌరవకులంబు నిరవశేషంబుగావింప నుత్సహించుచున్న వాఁడు. పాండవు లాతనితో మిమ్మెదిరింపనున్నవారు. అసమానవీర్యుండు మహాయశుండు సమరదుర్జయుండు నగుశిశుపాలతనయుండు ధృష్ట కేతుండుతోడరా మీపైఁ బాండవు లెత్తివత్తురు. దేవతలకు దేవేంద్రు డునుంబోలెఁ బాండవుల కాశ్రయుండగువాఁడగు వాసుదేవుండు దక్షౌ హిణీపరివృతుండై పాండవులకు సహాయుండుగా వచ్చియున్నవాఁడు. ఆవాసుదేవుని ప్రాపునఁ బాండవులు మిమ్ముఁ దలపడియెదరు. చేదిపతికి సోదరుండు శరభుండు కరకర్షునితోఁ గూడి పాండవులం జేరియున్న వాఁడు. వారలిరువురు సహాయులుగాఁ బాండవులు మీపై నెత్తిరా నున్నవారు. జరాసంధతనయుండగు సహదేవుండును జయత్సేనుండును యుద్ధంబులం దప్రతిరథులై యొప్పుచున్నవారు. వారు పాండవ కార్యం బెల్లవిధముల సమకూర్ప నిశ్చయమునసున్నవారు. మహాతేజుం డగు ద్రుపదుండు మహాబలపరివృతుండై పాండవులకై తనప్రాణంబు లనే నర్పింప వెనుదీయకున్నాఁడు. అతఁడుమాత్రమే కాక యింక ననేకు లగుమహావీరులు ప్రాచ్యదేశీయులును త్తరదేశీయులు నగువారు పందలు వేలుగాఁ బాండవులకు సాహాయ్యంబుగావింప వచ్చియున్నవారు. వారల నెల్లఁ దోడుగాఁగొని ధర్మనందనుండు కౌరవుల జయింప నిశ్చయించి యున్నవాఁడు.

### ధృతరాష్ట్రుండు భీమునిబలంబునకుఁ జింతించుట

అనుటయు నంబికానందనుండు భీమసేనుబలంబు దలంచి భయ విహ్వలుండై కొంతవడి నిశ్చేష్టుండై యుండి తెలివొంది సంజయునితో నిట్లనియె. సంజయా! నీవిపుడు పేర్కొనినమహోత్సాహు లగు వీర పుంగవులెల్లరు నొక్కతలయును, భీమసేనుం డొక్కరుం డొక్కతల యునై యున్నవారు. భీమసేనుఁ దలంచికొన్న మాటిమాటికి నాకు మహాభయంబు గలుగుచున్నది. ఆతండు క్రుద్ధుం డయ్యెనని వినినది మొదలుగ మహారురువగు వ్యాఘ్రంబువలనుంబోలెఁ బరిత్రాసాకులుం డనై రాత్రులందు నిద్రపోకుండ బాధ ననుభవించుచున్నాఁడను. ఎప్పుడును దీర్ఘంబు నుష్ణంబు నగునిశ్శ్వాసము నన్ను విడువకున్నది.

సింగంబునకుఁ గురంగము జడియువడువునఁ బాండవసింహంబగు వృకో దరునకు నేను భయపడుచున్నవాఁడను. వాసవసమానతేజశ్శాలియగు నతనికి సమానుండగు ప్రతియోధుని మనసైన్యమునం దొక్కనిగానను. పాండవమధ్యముండు మహామర్షణుండు, దృఢవైరుండు, మర్మములు నొచ్చునట్లు పరిహసించువాఁడు, సోన్మాదుండు, ఉర్ధ్వదృష్టియుండు, మహా భైరవస్వనుండు, మహావేగుండు, మహోత్సాహుండు, మహాబాహుండు, మహాబలుండు నైయున్నవాఁడు. అఘోరపరాక్రముండగువాయుతన యుండు మందులగునాతనయులనెల్ల యుద్ధంబునఁ బరిమార్పక విడు వఁడు. కౌరవపుంగవుండగు వృకోదరుండు మహాభైరవాకారంబగు గద చేఁబూని దండపాణియగు నంతకుండుంబోలె నాతనయుల గళగ్రాహం బుగఁ బట్టికొని చంపక విడువఁడు. ఎనిమిదియంచులుగలిగి ఘోరాకా రంబై కాంచనాలంకృతంబగు నాకాలాయసగదను మనంబున బ్రహ్మదం డంబువోలెఁ జూచుచున్నాఁడను. క్షుద్రమృగంబులతోడి యుద్ధంబునఁ బ్రవృద్ధబలంబగుకంఠీరవం బెట్లుచరించు నట్లు నాబలంబులందు పాండవ సింహంబగు భీముండు విజృంభించును. క్రూరవిక్రముం డగువాఁ డొక్క రుండే నాపుత్రులకెల్లరకు మృత్యువై యున్నవాఁడు. బహుభోజనుం డగువాఁడు. బాల్యంబునుండియు నాతనయులకు విప్రతీపుండై యున్న వాఁడు. వానిరభసంబు తలంచికొనిన నాహృదయంబు కంపమానంబగు చున్నయది. దుర్యోధనాదులగు నాతనయులెల్లరు బాల్యంబునందు సైతము వానితోడి క్రీడాయుద్ధంబులం దనేకవిధముల మర్దింపఁబడిరి. వానిహస్తంబునకును వారణతుండంబునకును భేద మించుకయు నుండదు. నాతనయులు నిత్యంబు వానిబలంబునకే భయపడుచున్న వారు. ఇప్పుడు జనించినఖేదంబునకెల్ల వాఁడే కారణంబై యున్నవాఁడు. సంగరరంగంబున పదాతిగజతురంగంబుల సైన్యంబులనెల్ల గ్రసించుచు క్రోధమూర్ఛితుండగు భీమసేనుం డెప్పుడు నాయెదుర గన్పడుచున్నట్లు భయపడుచుందును. భీమపరాక్రమసంపన్నుండగు వృకోదరుఁ డస్త్ర వ్యాపారంబున ద్రోణునకు నర్జునునకును సమానుండు. వేగంబున వాయుదేవునంతటివాఁడు. క్రోధంబున లయకాలరుద్రునకుఁ బ్రతిరూ పంబై పరఁగువాఁడు. అట్టి భీమసేనునాహవంబున నెదిరించి నిలువఁగల మేటిమగఁ డెక్కడను గానరాఁడు. సంజయా! యట్లు భీము నెదిరించి

నిలుపఁగలవాఁ డొక్కఁడుం డెనేని మన కది యతిలాభంబగును
స్వామీ! నీవట్టికోరిక నెఱింగితేని దెలుపుము. అక్రూరపరాక్రముండగు
వృకోదరుండు బాల్యంబుననే బహుపరాక్రమంబు మెఱసి నాతనయుల
నెల్లర మర్దించెఁగదా! ఇపుడు నిరవశేషంబుగ వారల సంహరింపక విడు
చునా? ఎవ్వండు బాహుబలాతిరేకంబున భీమబలుల యక్షులను రాక్ష
సులను జయించెనో వానిని మానవుం డెట్లు సైరింపఁగలఁడు? వాఁడు
బాల్యంబుననైతము నామాటపైని నిలిచినవాఁడుగాఁడు. ఇప్పుడన్ననో
దుర్మార్గులగు నాపుత్రులచేఁ బలువిధము లగు క్లేశము లనుభవించి మిక్కి
లిగ నమర్షాతిరేకంబున నున్నవాఁడు. వాఁడు రోషపరవశుండై రెండు
ప్రక్కలుగా బ్రద్దలైన నగునుగాని యొరులవశమునమాత్ర ముండఁడు.
తిర్యగ్దర్శనుండును సంహతభ్రూవుండునగు వృకోదరుండు శాంతినొందుట
కేదేని మార్గంబుగలదా? వాఁడుమిగుల శూరుండు. శూరత్వమున కను
రూపంబగుబలము, బలంబున కనుగుణంబగు గౌరవర్ణము, దానికను
రూపంబగు తాలప్రమాణౌన్నత్యముంగలిగి వాఁడు చూపఱకు వెఱగు
పుట్టించును. అర్జునునికంటెను నౌన్నత్యమునందు ప్రాదేశమాత్ర మధి
కుండు. వాఁడు జవంబున దురంగంబులను, బలంబునఁ గుంజరంబులను
మీఱును. వానివాక్యంబు లవ్యక్తంబులు. తేనెవంటికన్నులుగలవాని
బల మింతంతనగాదు. బాల్యంబునంద వ్యాసభట్టారకుండు భీమసేనుని
రూపంబును వీర్యంబును యథాతథంబుగ నాకెఱింగించియున్నవాఁడు.
రౌద్రబుద్ధియుఁ గ్రూరపరాక్రముండునగు వృకోదరుండు క్రోధపరవశుం
డయ్యెనే నాయసదండంబున రథంబులను గజంబులను నరులను దురం
గంబులను పిండిపిండిగను ముద్దముద్దగను నలుగంగఁగొట్టక విడువఁడు.
అమర్షణశీలుండు నిత్యసంబుద్ధుండు యోధాగ్రేసరుండు నగుభీమసేను
నకుఁ దొల్లి యనేకవిప్రతీపంబులాచరించి వాని విమనస్కుఁ గావించితిని.
నిష్కర్ణము, ఆయసము, స్థూలము, సుపార్శ్వంబు కాంచనాలంకృతంబు
నగువాని గదాదండ మొక్కొకప్రహారంబున నూఱులను వేలను జదు
పును. ఆగదాదండమును నాతనయు లెట్లు సైఁపఁగల్గుదురు? సంజయ!
అపారంబు నప్లవము నగాధము శరవేగితంబు దుర్గంబు నగుభీమసేన
మయంబగు మహాసాగరంబుఁ దరింప నాతనయు లాశించుచున్నవారు.
నేనెంత మొఱపెట్టినను వారలు వినకున్నవారు. ఆబాలిశులు మంచిచెడుగు

లెఱుంగక తామే పండితులమని గర్వించుచున్నారు. మధుదర్పనుండగు వృకోదరుని విషమంబగు ప్రపాతంబును వార లెఱుంగమిం జేసియే, నర రూపమృత్యువగు నాతనితోడి సంగరంబున కిచ్చగించుచున్న వారు. సింహంబున కాహారంబులగు మృగంబులమాడ్కి నాతనయులు నిశ్చయంబుగ భీమసేనుకోపానలంబున కాహుతియగునట్లు విధాత ప్రేరించుచున్నవాఁడని తలంచెద. చతుష్కిష్కుపు పడ శ్రీమహాతేజశ్శాలిని దుఃఖసంస్పర్శయునగు గద చేబూని వృకోదరుండు యుద్ధంబునకేతెంచిన నాతనయులకు జీవితంబు దుర్లభంబే యగును. గదాదండంబు నుద్దండంబుగఁ ద్రిప్పుచు హస్తిమస్తకంబులు వ్రక్కలుసేయుచు సృక్వంబుల నాలుకతో నాకుచు మాటిమాటికిఁ గ్రోధజంబగు నేత్రోదకంబు విడుచుచు మహాభైరావారావంబున నేనుంగులఁ బీనుంగులు గావించుచు మహాగజంబులఁ జూచి గర్జించుచు రథమార్గం బవగాహించి శ్రేష్ఠయోధులఁ బ్రహరించుచు వీరవిహారంబు చలుపు నావృకోదరునిఁ జూచినంతన మండుచున్నదవాగ్నిగనిన మృగములట్ల నాసైనికులు సమరాంగణము వీడి పఱతురు. మహాబాహుండగు నాతండు యుద్ధరంగంబున వీథుల నిర్మించుచు సేనలఁ జెల్లాచెదరుసేయుచు గదాదండంబు ధరించి నృత్యంబొనర్చుచు యుగాంతమును జూపుననుటకు సంశయములేదు. పుష్పితంబులగు ద్రుమంబులు విఱుచు మత్తకరీంద్రంబుమాడ్కి సైనికుల భంజించుచు నావృకోదరుండు నాతనయుల నెదిరించును. గంగాప్రవాహంబు వేగాతిశయంబునఁ దీరంబునందలి మహామహీరుహంబులఁ బెల్లగించికొనిపోవురీతి నావృకోదరుండు రథంబులను రథికులతోడను, దురంగంబులతోడను, సారథులతోడను శూన్యంబులుగావించి ధ్వజంబులువిఱిచి రథికులను సారథులను గుఱ్ఱంబులను జదుపుచు నాతనయులసేనలఁ జీకాకుపఱుచును. భీమసేనభయార్దితులై నాతనయులు భృత్యులు సహాయులుగా నేతెంచినరాజులును నిశ్చయముగ మృతినొందుదురు. ఈవృకోదరుండు వాసుదేవుండుతోడై రాఁగా నంతఃపురంబు ప్రవేశించి పరభయంకరుండగు జరాసంధనరపాలుని సంహరించె. జరాసంధుండు సామాన్యుండుగాఁడు. ధీమంతుండు మగధదేశాధీశ్వరుండునగు జరాసంధుఁ డీభూమినెల్ల నేకచక్రంబుగఁ బరిపాలించిన బలియుండు. భీష్మప్రతాపము నాలంబించి కౌరవులును నీతిసహా

యులగుట జరాసంధునకు వశులై యుండలేదుకాని తక్కినరాజలోకం బెల్ల నాతనికిఁ బాదాక్రాంతమయ్యెం. కౌరవులు యాదవులును వశపడ కుండుటకు దైవికంబగుకారణం బేదియో యుండియుండును. అట్టిబల వంతులకు మేటివారయగు జరాసంధుని దలపడి యాయుధము చేబట్ట కయే కేవలబాహుబలంబునఁ బిలుకుమార్చిన భీమసేనుబలంబు కొలం దియే? దీర్ఘకాలసమాసక్తంబగు కోపవిషంబును భీమసేనుండు సర్పము విషముగ్రక్కునట్లు నాతనయులందుఁ గ్రక్కక మానఁడు. దేవసత్తముం డగు మహేంద్రుండు వజ్రంబున దానవులఁ జక్కడంచుమాడ్కి భీమ సేనుండు గదాపాణియై నాతనయుల సంహరించును. అవిషహ్యుండు నవార్యుండు తీవ్రవేగపరాక్రముండు నగుభీమసేనుండు మిగుల నెఱ్ఱని కన్నుల నిప్పుకలు గ్రుమ్మరించుచు నాతనయులపైకి లంఘించి వచ్చుచు న్నట్లే చూచుచున్నాఁడను. వాఁడు గదవిడిచి ధనువు చేకొనక రథ వర్మంబులు విసర్జించి కేవలము బాహుమాత్రసహాయుండై యుద్ధమొన రించుచున్నను వాని నెవరి నిలువఁగలబలియు లెందును లేరు. భీష్ముండు ద్రోణుండు శారద్వతుండగుకృపుండు నేనును మాత్రమే యాభీముని బలపరాక్రమంబులు చక్కనెఱింగినవారలము. పురుషోత్తములగువారు ఆర్యవృత్తంబు బాగుగనెఱింగినవారలై సంగరాంతంబుగావింపందలంచి మదీయంబులగుసేనాముఖంబుల నిలిచియున్నవారు. సంజయా! పాండు నందనులకు విజయము నిక్కమనియెఱింగియుఁ దనయుల నివారింపఁజాల కున్నాఁడను. పురుషకారంబుకంటె నెల్లవిధంబుల దైవంబు బలీయంబని దీనివలనఁ దెలియనగుచున్నది. మహాధనుర్ధరులగువారలు పురాతనంబగు నైంద్రంబగుమార్గంబు ననుసరించుచున్నవారు. వారు తుములంబగు సమరంబునఁ బ్రాణంబులనేని విడుతురుగాని పార్థివుల కర్హంబగుయశం బెంతమాత్రమును గోల్పోవరు. ఈభీష్మద్రోణకృపులకుఁ బాండవులును గౌరవులును సమానులే యైయున్నవారు. వీరెల్లరును భీష్మునకుఁ బౌత్రులు, కృపద్రోణులకు శిష్యులు నైయున్నారు. స్థవిరులగు నీముగ్గు రును మేము దొల్లిగావించినయాశ్రయము దానము నిష్టము మొదలగు వాని కపచితిగావించుటకై మాత్రమే యార్యవృత్తంబు నెఱింగి మా బలంబులందున్నవారుగాని వారి కీరెండుపక్షంబులందు నొక్కండును విరోధి గానరాఁడు. శస్త్రంబు ధరించి క్షత్రధర్మంబు గాపాడుక్షత్రియు

నకు యుద్ధంబున నసువులు విడుచుట పరమధర్మమని యార్యులు వక్కాణింతురు. పాండవులతోడి యుద్ధంబునకై సిద్ధపడియున్న యీ రాజలోకంబు నెల్ల నాలోకించిన నాశోకంబు ద్విగుణీకృతవేగంబునఁ బొంగి పొరలి వచ్చుచున్నయది. ఇప్పు డుపస్థితంబగు విషయమును దెల్పు విదురుండు మొదటనే యనేకభంగులఁ బలవించియున్నవాఁడు. సంజయా! యెల్ల పురుషుఁడు జ్ఞానము దుఃఖనిఘాతము గావించునని నమ్మఁజాలను. అజ్ఞానమైనను బలవత్తరమయ్యెనేని జ్ఞానంబు నణఁచివేయునని నాతలంపు. సర్వసంగపరిత్యాగం బొనరించినమహాత్ములు సైతము లోకసంగ్రహము నాలోచించినవారై దుఃఖంబులచే దుఃఖితులును సుఖంబులచే సుఖితులు నగుచున్నవారు. అట్టియెడఁ బుత్త్రులందు భార్యలందు బంధువులందు నత్యంతమోహావేశముగల ప్రాకృతజనులు వేలకువేలుగ నజ్ఞానవశంబున దుఃఖములపాలగుట యాశ్చర్యకర మెట్లగును? సంజయా! యిప్పు డీ ప్రాణసంశయావహంబగు నీసమయంబున నాకు సుఖప్రదమగు నుపాయ మేది? ఆలోచించినకొలఁదియుఁ గౌరవులవినాశమే నాకంటికగపడుచున్నది. కౌరవులకు సంభవించినయీయాపదకెల్ల ద్యూతంబు కారణంబయ్యె. ఐశ్వర్యకాముండై మందమతియగు సుయోధనుం డీ పాపకార్యము గావించినాఁడు. అత్యంతశీఘ్రగామియగు కాలమువలన జనించుపర్యాయధర్మముగా దీనిని నమ్ముచున్నాఁడను. చక్రంబునందున్న నేమి యొకపరి క్రిందికి నొక్కపరి మీఁదికి వచ్చునట్లే మనుజునకును సుఖదుఃఖంబులు పర్యాయంబున ననుభావ్యంబులై యుండును. వీనిని దప్పించుకొనుట కెవ్వరికిని దరంబు కాదు. సంజయా! నేనిప్పు డేమి చేయుదును? నెందుఁ జొత్తును? ఎట్టికార్యంబు నేయుదును? ఈనాతనయులెల్లరును గాలవశంగతులై నశింప నేను జూడఁజాలను. పుత్త్రశతంబు నిహతం బగుడు. స్త్రీలరోదనస్వరంబు లాలించుటకంటె మరణంబు శ్రేయంబు. స్వేచ్ఛచే మరణమొందుటకైన నశక్తుండనుగదా? నిదాఘసమయంబున సమిద్ధుండగు హుతాశనుండు వాయుప్రేరితుండై తృణపుంజంబుల నేర్చురీతిని గదాహస్తుండగు పాండవమధ్యముండు ధనంజయునితోఁగూడివచ్చి నాతనయులను నెల్లసైన్యములను దహింపక విడువఁడు.

ధృతరాష్ట్రుం డష్టపుత్రాపాయము చింతించి దుఃఖించుట

ఏవ్వఁడు మృషావాక్యం బెన్నఁడు నుచ్చరింపఁడో, యొక్కప్పు
డేని మనమెవ్వని యనృతవాక్య మాలింపలేదో, యెవ్వనికి సీరాధిపీనం
డగు నర్జునుండు యోధుండై యున్నవాఁడో, యట్టిధర్మనందనునకుఁ
ద్రైలోక్యంబు వశమం దుండుట నిశ్చయము. ఆగాండీవధన్వునకుఁ బ్రతి
రథుండై యాతని నెదిరింపఁ గలవీరుం డెవ్వం డుండునో యని రాత్రిం
దినంబులు నిద్రాహార రహితుండనై చింతించుచున్నవాఁడనయ్యు నిర్భ
య మొందఁజాలకున్నాఁడను. హృదయవిదారణంబు లగు కర్ణనాళీకంబుల
నవిచ్ఛిన్నంబుగ నేయుచు సవ్యసాచికిసముం డగు ప్రతిభటుం డొక్కరుం
డును గానరాఁడు. వీరవరేణ్యులు, మానవోత్తములు, కృతాస్త్రులు,
బలవదగ్రేసరులు, సమరంబులం దపరాజితులు నగు ద్రోణుండును గర్ణుం
డును ధనంజయు నెదిరింప సమర్థులేయైనను వారియెడ గొప్పసంశయము
గలదు. ఎట్లును నాకు విజయంబు దుర్లభంబే యగును. కర్ణుండు ఘృణా
కరుండును బ్రమాదశీలుండునై యున్నాఁడు. ఆచార్యుండన్ననో
ముదుసలియు ధనంజయునియెడ శిష్యవత్సలత గలగురుండునై యు
న్నాఁడు. బలవంతుండు దృఢధన్వుండు జితక్లముండు నగుపార్థుం డెంతటి
తుములసమరమైనఁ గావింపఁజాలును. అతఁ డెన్నండును సమరంబులఁ
బరాజయం బెఱుంగఁడు. పాండవులెల్లరును మహాస్త్రవేదులు, మహా
శూరులు, మహాయశంబుగన్నవారలు. వారలు దేవలోకాధిపత్యంబేని
విడిచెదరుగాని యెన్నండును జయంబు విడుచువారుగారు. భీమార్జును
లిరువురుగాని యర్జును డొక్కరుండుగాని వధంబు ప్రాపించిన మనకు
శాంతి లభింపవచ్చుననుట నిక్కువంబ. అయిన నర్జునుని సంహరింపం గల
వాఁడు లేనేలేదు. సరికదా వాని జయించువాఁడైన లేకుండుటయు
నిశ్చయము. ఇతరు లెందరో యస్త్రవేదులు గలరు. వారొక్కప్పుడు
జయించుటయు నొకప్పుడు జయింపఁబడుటయుఁ గలదు. కాని ఫల్గు
నున కెన్నండును విజయమే కాని పరాజయంబు వినరాదు. ధనంజ
యుండు తొల్లి ఖాండవదహనంబున ముప్పదిమూఁడుకోట్ల వేల్పుల
జయించి వీతిహోత్రుని. దృప్తునిం గావించెఁగాని యాతనికిఁ బరాజ
యంబు గలుగలేదు. ఆతని శీలంబునకు వృత్తంబునకు ననుగుణుం డగు

శ్రేయంబులకుఁ గారణంబనియు హాసంజేసి, మనకెల్లరకు నధికం బగు శాంతిచేకూరునని యు నాకుఁ దోఁచుచున్నది. మీరాసంగ్రామ యుద్ధంబు విడుచుట యిష్ట మగునేని మేము శాంతికై ప్రయత్నింతుము. మన మెల్లరము క్లేశంబు లనుభవింపుచుండ ధర్మనందనుం డుపేక్షింపఁ జాలఁడు. అధర్మాచరణుండ నగు నన్నే యీపాపంబులకెల్లఁ గారణంబుగా నిందించును.

### సంజయుండు ధృతరాష్ట్రుని నిందించుట

అనిన విని సంజయుండు ప్రజ్ఞాచక్షునితో మహారాజా! నీవు వచించినదియెల్ల సత్యమైనది. క్షత్రంబునకు యుద్ధంబునందు గాండీవంబు వలనఁ దప్పక పరాభవము సంభవించును. సవ్యసాచిమహిమం బెఱింగిన నీవంటిధీరుండు నైతము మోహవశంబునఁ బుత్రునకు లొంగిపోయి యకార్యంబు సేయుటమాత్రము మిగుల శోచ్యమైనది. మాటిమాటికి నపరాధంబు లొనర్చు నీపాపకార్యంబులు కాలవశంబులన వలనుగాదు. నీవు తొలుతటినుండియుఁ బాండవులకు నికారంబులు గావించుచునే యున్నవాఁడవు. మనుజులకు జనకుండు శ్రేష్ఠుం డగుగురుండు. వాని తరువాత సమ్యక్ప్రణిహితాత్ముం డగు సుహృదుండు గురుండన నొప్పును. కాని ద్రోహం బొనరించువాఁ డెన్నండును గురుం డనంబడఁడు. ఇది గెలువఁబడినది, యిది లభించినది యనువాక్యంబులు నీతనయులవలన వినుచు ద్యూతకాలంబున బాలునివలె నవ్వితివేకాని నీతనయుల వారింపవైతివి. పార్థులను నీతనయులును గర్ణుండును బరుషవాక్యంబు లాడు నపుడు నుపేక్షించియే యుంటివి. నీతనయులు రాజ్యంబెల్ల జయింతు రని పొంగిపోతివేకాని ప్రతాపంబుమాట తలంపవైతివి. రాజా! నీ పిత్ర్యం బగురాజ్యంబు కురుజాంగలభూములుమాత్రమేకదా? అయి నను బాండునరపాలుండును నాతనిపుత్రులును వీర్యంబున జయించిన భూమినెల్ల నీవ వశముగావించికొంటివి. పార్థులు తమబాహువీర్యంబున జయించినభూమినెల్ల నీకు నివేదించిరి. అట్టిభూమినెల్ల నీవు స్వబలార్జితం బైనదానియట్లాలోచించుచున్నవాఁడవు. గంధర్వరాజుచేఁ బట్టువడి తీరంబుగానని యాపత్సాగరంబున మునింగియున్న నీతనయులను గరుణాళుం డగు ధర్మనందనుండు విడిపించి పుచ్చెనుగదా? ద్యూతంబున

వారు నిష్కృతులైనప్పుడు ప్రవ్రజించి యడవుల కేఁగునప్పుడు నీవు పరిహసించినావో లేమాటిమాటికిఁ బ్రేలితివి కదా? అర్జునుండు నిశితాగ్రంబులగు శరవ్రాతంబుల వర్షింప సన్నద్ధంబులైనను నింకిపోవునని మాంసపిండశకలములను జెప్పనేల? ధనుష్కులకెల్ల నర్జునుండు శ్రేష్ఠుండు. గాండివంబు ధనుస్సులకెల్ల నుత్తమంబు. సర్వభూతంబులకును వాసుదేవుండు ప్రభువుండు. ఆయుధంబులకెల్ల సుదర్శనచక్రంబును ధ్వజంబులకుఁ గపిధ్వజంబు నుత్తమంబులై వెలుఁగును. అట్టి యుత్తమపరికరంబులతోఁ గూడినరథంబు సంగరాంగణంబునఁ గాలచక్రంబుంబోలెఁ బరిభ్రమించుచుఁ గౌరవులకెల్ల నాశంబు గూర్పకమానదు. ఎవ్వనికి భీమార్జునులు యోధులుగా నుందురో వానిదే యీనిఖిలమహీమండలంబు నగును. ఆపుణ్యపురుషుండే రాజగును. భీమసేనుబాహుబలంబుచే నిహతంబై దుఃఖసాగరంబున మునుంగుచున్న సైన్యంబు నాలోకించి దుర్యోధనుండాదిగ గౌరవులెల్లరు క్షయంబొందుదురు. భీమార్జునులవలన నత్యంతభీతచిత్తులగు నీతనయులును వారిననుసరించి వచ్చిన యితరరాజులును విజయం బెంతమాత్రము బొందఁజాలరు. మాత్స్యులు నిన్నిపుడు పూజింపకున్నారు. పాంచాలురు కేకయులు సాల్వేయులు శూరసేనులు నాదిగాఁగలరాజులెల్లరు నిన్నవమానించుచున్నారు. వీరెల్లరును బార్థుని వీర్యంబు జక్కనెఱింగినవారగుటంజేసి యిప్పు డాతనినిసమాశ్రయించి యున్నావారు. వారు ధర్మనందనునందలి భక్తిచే నీతనయులతో విరోధించుచున్నవారు. ఎప్పుడు నెవ్విధంబునను జంపఁగూడనివారును ధర్మాత్ములు నగు పాండవుల కనేకాపకారంబు లొనర్చి నీతనయుండు వారల నిగులఁ గ్లేశపెట్టినవాఁడు. ఇపుడుగూడ వారల నత్యంతము ద్వేషించుచున్నవాఁడు. పాపాత్ముం డగుదుర్యోధనుని వానియనుచరులను సర్వోపాయంబులను నియమింపకున్న గీడుమూఁడును. నీతనయునిగూర్చి నీవు లేశమాత్రమునను శోకింపరాదు. ఈయర్థంబు నేను నీతనయుఁడున్న సమయంబునను లేనిసమయంబుననుగూడ చెప్పియుంటిని. ద్యూతకాలంబునందు నేనును ధీమంతుం డగు విదురుండు నెంతయో చెప్పియుంటిమి. నీవు కార్యకరణంబున కసమర్థుండువోలె విలపించిన లాభమేమి గలుగును? ఈవిలపించుటకుఁ బ్రయోజనం బింతయుఁగానరాదు.

## దుర్యోధనుండు తండ్రికి తనబలం బెఱింగించుట

సంజయుం డిట్లు నుడివినంత సుయోధనుండు లేచి తండ్రికి నమస్కరించి యిట్లనియె. మహారాజా! మీరు లేశమాత్రంబేని భయమందవలదు. మమ్ములఁగూర్చి మీరు శోకింపనువలదు. మేము బలవంతులగు శాత్రవులనైనను సమరంబున జయించుటకు సమర్థులమైయున్నవారము. మధుసూదనుండు వనవాసంబుగావించు పాండవులకడకు మహాబలపరివృతుండై యేగెను. పరరాష్ట్రావమర్దనక్షమం బగు మహాబలచక్రంబుతోఁగూడి కేకయులు ధృష్టకేతుండు పార్షతుం డగు ధృష్టద్యుమ్నుండు మొదలగువీరులును నింక నితరు లగు ననేకదేశాధీశ్వరు లగు రాజులును బాండవులంజేరిరి. వారెల్లరు నింద్రప్రస్థంబునకు నాతిదూరంబున సమాగమం బొనరించిరి. వారెల్లరు నందు సమావేశమై కౌరవులను నిన్ను ననేకభంగుల నిందించిరి. వల్కలాజినధరుండై మునివోలె నున్నధర్మనందనుని వారెల్లరును సేవించుచుండిరి. వారలలోఁ గృష్ణుండు మిగుల పాండవపక్షపాతంబున నున్నవాఁడు. వారెల్లరును దిరిగి రాజ్యంబు సంపాదించుటయే యభిమతకార్యంబుగా నిర్ణయించికొనిరి. అట్లు రాజ్యము సంపాదించుట కనువుగా సానుబంధుండ వగునిన్ను బరిమార్పవలయుననియు నిశ్చయించిరి. నే నీవృత్తాంతం బెఱింగి భీష్మద్రోణకృపాచార్యుల కెఱింగించితిని. వారలు జ్ఞాతిచ్ఛేదభయంబున భయమందినవారుగాని బలహైన్యంబున భయమందువారుగారు. పాండవులు సమయంబుననుండుటయు భయంబుననేకాని వేఱొండుగాదు. వాసుదేవుండు మనకెల్లరకును వినాశంబు గావింప నున్నవాఁడు. విదురుడొక్కండుదక్కఁ దక్కినవారినెల్ల వధింపనే వారు నిశ్చయించిరి మఱియు ధర్మజ్ఞుం డగు నిన్నుఁగూడ జంపకుండుటకుఁ దలంచిరి. జనార్దనుండు విదురుని నిన్నువిడిచి మిగిలినమమ్మెల్లర సంహరించి యీకౌరవులరాజ్యంబెల్ల యుధిష్ఠిరున కర్పింప నూహించియున్నవాఁడు. ఇట్టి సమయంబున మన మాచరింపఁదగినయుత్తమకార్యము భయంబున లోఁగియుండుటయా? లేక ప్రాణంబు లఱచేతనిడి దిక్కులకుఁ బరువెత్తుటయా? ప్రాణములం దాసపీడి పరులఁదలపడిపోరుటయా? ఏది యుచితం బగును? వారల నెదిరించి యుద్ధం బొనరించుచో మనకుఁ దప్పక పరా

జయంబుగల్గును. రాజులెల్లరును యుధిష్ఠిరునకు వశవర్తులై యున్న వారు. మనకన్ననో రాష్ట్రంబులు విరక్తంబులై యున్నవి. మిత్రులు కోపావిష్టులై యున్నారు. పార్థివులెల్లరును స్వజనంబులును మనల యథేచ్ఛంబుగ ధిక్కరించుచున్నవారు. ప్రణిపాతంబునందు దోషంబు లేశంబును గానరాదు మన మొనరించినసంధి శాశ్వతముగా నిలిచియుండునుగదా? ప్రజ్ఞానేత్రుండగు నిన్నుద్దేశించియే నేను మిగుల వగచుచున్నాఁడను. పాపము! నీవు నాకై యనేకదుఃఖంబు లనుభవించి యున్నాఁడవు. ఇప్పు డనంత మగుదుఃఖము నీకాసన్నంబై యున్నది. మహారాజా! నీతనయులుగూడ నాప్రీతికై పరుల నవమానించియుండిరి. ఈవిషయ మింతకుమున్ను నీవెఱింగినయదియ. కురుకులంబునెల్ల సమున్మూలించి పాండవులు ధృతరాష్ట్రుండు నాతనితనయులు నొనరించిన యపకారంబులకుఁ బ్రత్యపకారంబు గావింతురు. ఈవిషయంబులెల్ల మదిని దడవి నేను మిగులఁ జింతించుచుండ ద్రోణుండు భీష్ముండు కృపుండు నశ్వత్థామయుండును నన్నూఱడించి యిట్లనిరి. పరులు మనపై నెత్తివత్తురని నీవెంతయు భయమందవలవదు. యుద్ధసన్నద్ధుల మగు మనల జయించుటకుఁ బాండవులకు వశముగాదు. మేమొక్కొక్కళ్లము సకలపార్థివుల జయింప సమర్థులమైయున్నారము. శాత్రవులు వారియిచ్ఛ ననుసరించి యెత్తివత్తురుగాక. నిశితంబు లగుశరపరంపరలచే వారలదర్పంబెల్ల నడలింతుము. తొల్లి యీభీష్ముం డొక్కరుండ సకలరాజలోకంబును బరాజితంబు గావించియుండె. తండ్రి మృతుండైనయనంతర మేకరథారూఢుండై సర్వపార్థివుల నీతండు జయింప వారలందఱు నీతనిఁ దాఁటి కోర్వఁజాలక శరణాగతులైరి. అట్టిభీష్ముం డిప్పుడు మాతోఁ గూడ నున్నవాఁడుకదా? కావున శాత్రవుల జయించుట మనకెల్లవిధముల సుకరంబై యున్నది. నీవు భయపడకుము. అని యతితేజశ్శాలులగు వీరా కాలంబున నిశ్చయించిరి. ఇంతకుమున్న శాత్రవులపృథివి యెల్ల మనకు వశమైయున్నది. కావున నిపుడు వారలు యుద్ధంబున మనల జయింతురనుట కల్ల. మనకుఁ బగవారగుపాండవు లిపుడు ఛిన్నపక్షులు హీనవీర్యులు నై యున్నవారు. భూమియెల్ల మనకే వశపడి యున్నది. మనతో నేకార్థంబు గలవారును సమానసుఖదుఃఖములుగలవారు నగు పార్థివులనేకులు మనకు సాహాయ్యం బాచరింప వచ్చియున్న

వారు. వారలెల్లరు నాకొఱకై ప్రజ్వలించు నగ్నియం దైనను నగాధం బగు మకరాలయముఖం దయినను నిశ్శంకముగ నుఱుకనున్నారు. పరులబలంబు వినినంతన భయాతురుండవై విలపించు నిన్నుంగని యెల్లరు నున్మత్తుండని పరిహసించుచున్నవారు. వీరలెల్లరును దమలో నొక్కొక్కరే పాండవులెల్లరను జయింప సమర్థులమని తలంచుచున్నవారు. నీవు భయంబు వీడి నీమనంబు పదిలపఱచుకొనుము. నాసైన్యంబు జయింప నాపురందరునకేని దరంబుగాదు. స్వయంభువుం డగు బ్రహ్మదేవుండును దీనిని క్షయమొందింపఁజాలఁడు. యుధిష్ఠిరుండు పట్టణమును వీడి యేనుగ్రామంబుల యాచించుచున్నవాఁడు. అట్లడుగుట కాతండు సైన్యంబునకును నాప్రభావంబునకును వెఱచుటయే కారణమని నీకుఁ దోఁపలేదా? నీ వాకుంతీతనయుం డగు వృకోదరు నొక్కపెద్దగా తలంచి వెఱగందుచున్నాఁడవే కాని నీ వాతనియెడ నూహించినదియెల్ల మిథ్యకాని యథార్థముగాదు. నీవు నాబలంబును వాస్తవంబుగ నెఱుంగవు. గదాయుద్ధమందు నాకీడగు యోధుం డీలోకంబున నెందును లేఁడు. నన్నింతవఱకు మించినవాఁడును లేఁడు. మించఁగలవాఁడును బుట్టఁబోఁడు. నేను గురుకులంబున జాలకాలము వసించి విద్యగడించితిని. కావున భీమునివలనఁగాని యితరునివలనఁగాని భయమందఁబనిలేదు. నేను బలదేవునికడ గదాయుద్ధ మభ్యసించుతఱి నామహాత్ముండు దుర్యోధనునకు సముం డగు గదాయోధుం డెందునుండఁడని నిశ్చయించియుండెఁగదా? నేను గదాయుద్ధంబున సంకర్షణునకు సమానుండను బలంబున నభ్యధికుండను. నాగదాప్రహారంబు నాభీమసేనుం డొకప్పుడును సైఁపఁజాలఁడు. నేను క్రోధపరవశుండనై యొక్క గదాప్రహారం బిచ్చితినేని దానివలననే భీముండు యమలోకంబున కతిథియై చనుట నిక్కము. మఱియు రాజా! నాకుఁ జిరకాలమునుండియు వృకోదరునితో గదాయుద్ధంబుగావింప వేడుకకలదు. ఆమనోరథంబు చిరకాలమునకు సిద్ధించినదని సంతస మగుచున్నది. నాచే గదాప్రహారంబు దిని వృకోదరుండు భిన్నసర్వాంగసంధియై నేలంబడి యసువులం బాయును. పర్వతంబులకెల్ల నుత్తమం బగు హిమవత్పర్వతంబైనను నా గదాప్రహారంబున వేనవేలుముక్కలుగా చితికిపోవును. ఆసంగతి వృకోదరుండు నెఱుంగును. వాసుదేవార్జునులుగూడ గదాయుద్ధమ్మున దుర్యో

ధనుఁ డసమానుండని యెఱుంగుదురు. కావున భీమసేనువలన నీమనం బున జనించినభయంబు వీడి సంతసమున నుండుము. నేను ముమ్మాటి కిని వృకోదరుని సంగరాంగణంబున బరిమార్తును. నేను వృకోదరుని సంహరించినవెనువెంటనే యనేకంబులగు రథంబు లర్జును ముట్టడించును. వానికి సమానులు వానికంటె నధికులు నగు ననేకయోధు లొక్క మాఱుగ నాతనిపైఁ బడియెదరు. భీష్ముండు, ద్రోణుండు, ద్రోణతన యుండు, కృపుండు, భూరిశ్రవుండు, కర్ణుండు, ప్రాగ్జ్యోతిషాధిపుండు, శల్యుఁడు, జయద్రథుండు మొదలగువార లొక్కఁడొక్కఁడే పాండ వులనెల్లర సంహరింప వలంతులు. వీరలెల్ల రొక్కుమ్మడి విజృంభించిరేని వారల యమసదనంబున కంపక మానరు. సమగ్రం బగు నీరాజసైన్యం బెల్ల నొక్కపార్థుని జయింపఁజాలకుండుటకు హేతువేదియుఁ గాన రాదు. భీష్ముండు, ద్రోణుండు, కృపుండు నొక్కసారి ప్రయోగించిన శర వ్రాతంబు నాటి యవశుండై నేలంగూలి ధనంజయుండు తప్పక యమ సదనంబునకు జనును. శతసహస్రసంఖ్యాకంబు లగు భీష్మునిశరపరంపరల చేతను ద్రోణాశ్వత్థామకృపాచార్యుల మార్గణానీకంబులవలనను ధనం జయుండు తప్పక యమసదనంబున కరుగును. పితామహుండగు గాంగే యుండు శంతనునికంటెఁగూడ నధికుండు. బ్రహ్మర్షిసదృశుండగు నీతండు దేవతలకును సుదుస్సహుండై యొప్పును. భీష్ముని జంపఁగలుగువాఁ డెవ్వఁడును లేఁడు. స్వేచ్ఛతోడన మరణంబు గలుగునని యాతనికిఁ దండ్రి వరమొంగయున్నవాఁడు. ద్రోణుండు బ్రహ్మర్షిపుంగవుండగు భరద్వాజునివలన ద్రోణియం దుద్భవించినవాఁడు. ద్రోణునివలనఁ బర మాస్త్రవేది యగు నశ్వత్థామ జనించినవాఁడు. ఆచార్యముఖ్యుం డగు నీకృపుండు గౌతమునివలన నుద్భవం బందినవాఁడు. ఈతండు శరస్తం భంబున నుద్భవించినవాఁడు. ఇతం డవధ్యుండని నాతలంపు. అశ్వత్థా ముని జననియు జనకుండు మేనమామయు ముగ్వురు నయోనిజాతులై పరంగుచున్నవారు. శూరుం డగు నాతండెల్లకాలము మదర్థసంపాదనా వ్యగ్రుండై యున్నవాఁడు. మహారాజ! దేవకల్పు లగు నీమహారథులెల్ల రును సమరంబున నమరేంద్రునకునైతము దుర్జయులై బాధచేయక విడువరు. వీరలలో నొక్కొక్కరుని దేఱిచూచుటకు నర్జునుం డోపఁ డన్నచో వీరెల్లరుం గూడి ధనంజయుని బరిమార్చుటకు సంశయ మేమి

కలఁడు? కర్ణుండును భీష్మద్రోణకృపాచార్యులకు సమానుండై నెగడు చున్నాఁడు. ఆతం డస్త్రవిద్యాదానం బొనరించిన పరశురామునిచే, "నాకు సమానమైనవాఁడ" వని గౌరవింపఁబడినవాఁడు. సహజంబు లగు కుండలంబు లతిరుచిరంబులై చెవిఁదోఁచ నెప్పుడు వెలుంగుచుండెడివి, సురేంద్రుండు శచీదేవికై వానిని యాచించి తీసికొనినవాఁడు. అమోఘంబు పరమభయంకరంబు నగు మహాశక్తి నీతని కనుగ్రహించిన వాఁడు. కర్ణునికడ నాశక్తియుండ నర్జునుం డెట్లు జీవింపఁగలఁడు? మహా రాజా! యఱచేతిలోనిపండువోలె నాకు విజయం బెల్లభంగుల సిద్ధమై యున్నది. శాత్రవులకుఁ బరాజయంబు సుస్పష్టంబుగ నగపడుచునే యున్నది. భీష్ముం డొక్కపగటిలోఁ బదివేవురుయోధులఁ బరిమార్పం గలఁడు. అతనితోడ నెల్లభంగుల ద్రోణాత్మజకృపులు సమానులైన వారలేకదా? సంశప్తకు లగురాజులబృందంబు "మేమర్జుననైన వధించె దము. లేక యర్జునుండే మమ్ము వధించుఁగాక" యని యర్జును వధించు టకై దృఢమగుపట్టుదల గలిగియున్నవారు. అట్టిరాజు లనేకలుండఁగా నీవు వ్యథనొందుట కేమి హేతువు? భీమసేనుండు నిహతుండైన పిదప యుద్ధంబుగావింపఁగల వీరుఁ డాపాండవబలంబునం దేఁడీ ? నీ వెఱింగిన నొక్కని వచింపుము. పాండవు లేవురుసోదరులును, ధృష్టద్యుమ్నుండు సాత్యకియుమాత్రమే పాండవులబలంబునంగల సారము. మనబలమం దన్ననో భీష్మద్రోణకృపులును, నశ్వత్థాముండు, కర్ణుండు, సోమ దత్తుండు, బాహ్లికుండు, ప్రాగ్జ్యోతిషాధిపుం డగు భగదత్తుండు, శల్యుం డు, సావంత్యుండు, జయద్రథుండు, దుశ్శాసనుండు, దుస్సహుండు, దుర్ము ఖుండు, శ్రుతాయువు, చిత్రసేనుండు, పురుమిత్రుండు, శల్యుండు, భూరిశ్రవుండు, నీతనయుం డగువికర్ణుండు మొదలగువార నేకులు మహా యోధులు గలరు. మఱియుఁ బదునొండక్షౌహిణులసైన్యంబు నాకుఁ గలదు. పరులకో యేడక్షౌహిణులబలము మాత్రమే కలదు. కావున విజయము నాకుఁ దప్పక లభించును. బలంబు త్రిభాగహీనంబై యున్న యెడ శాత్రవుని దలపంవలయునని బృహస్పతి నొడివియున్నవాఁడు. రాజా! నాబలంబులు పరబలంబులకంటె మూఁడురెట్లధికంబులై యున్నవి. పరులబలంబు బహువిధంబుల గుణహీనంబని యెఱింగితిని. మాబలంబన్ననో గుణోదయము బహుగుణంబునై యొప్పుచున్నయది.

ఇవియన్నియు బాగుగ నెఱింగి పాండవులు న్యాయ్యులనియు, మన
మన్యాయ్యులమనియుం దెలిసి నీకుంగల మోహంబు దూరంబున విడువుము.
అని పల్కి సంజయునితో ప్రాప్తకాలంబుల నెఱుంగంగోరి యిట్లనియె.

### దుర్యోధనుండు సంజయుని పాండవుల నిశ్చయం బెఱింగింపుమనుట

సంజయా! యాధర్మాత్ముండు రాజులతోంగూడు నేడక్షౌహిణుల
బలంబు సేకరించినవాఁడుగదా? ఆతండు యుద్ధం బెట్లుగావింప నిశ్చ
యించినాఁడో తెలుపుమని సుయోధనుం డడుగుటయు గవల్గణనం
దనుం డిట్లనియె. రాజా! ధర్మనందనుండు మిగుల ముదితహృదయుండై
యుద్ధంబునకు సన్నద్ధుం డగుచున్నవాఁడు. భీమసేనార్జునులును నకుల
సహదేవులునుగూడ యుద్ధంబన్న నత్యంతసంతోషమందుచున్నవారే
కాని యెవ్వరును భయపడలేదు. కౌంతేయుం డగు ధనంజయుండు
మంత్రబలం బెఱుంగంగోరి దివ్యం బగురథంబు నొక్కపరి నాహ్వానించి
యంత నది దిక్కులనెల్లం బ్రభాపటలంబులచే వెలింగించుచు మెఱుపుల
తోడి మేఘంబువోలె నాసన్నంబై చూపఱకు భయసంభ్రమంబులు
గూర్చెను. దాని నాలోకించి ప్రహర్షపరవశుండై కొంతవడి ధ్యానించి
పిదప నన్నుద్దేశించి సంజయా మాకు విజయంబు గలుగుననుట కిది యొక
తార్కాణము. మావిజయంబున కిది పూర్వరూపంబు. దీనిని బాగుగ
నాలోకింపుమని పలికెను. నేనును దాని నాలోచించి బీభత్సుండు చెప్పిన
దెల్ల సత్యంబనియే నమ్ముచున్నాఁడను. అని వచింప దుర్యోధనుండు
సంజయా! నీవు మిగుల బేలవలె నగపడుచున్నాఁడవు. అక్షపరాజితులై
రక్షణంబులేక దిక్కఱియున్నవారల నూరక ప్రశంసించెదవు. కానిమ్ము.
ధనంజయునిరథంబునకుం బూన్చినతురంగంబులు ధ్వజంబు మొదలగు
వాని వివరంబు లెఱింగింపుమనియె. అంత సంజయుం డిట్లు వచింపందొ
డంగె. ప్రభూ! విశ్వకర్ముం డగుత్వష్ట దేవేంద్రునింగూడి బహుచిత్రంబు
లగురూపంబులు గల్పించె. ఆతండు దేవమాయచే ననేకవిచిత్రంబు
లగురూపంబుల నాధ్వజంబునం గల్పించె. మహాధనంబులు దివ్యంబులు
విశిష్టంబులు లఘువులు నగునారూపంబుల నిరూపింప నలవిగాదు.
మారుతాత్మజుం డగుహనుమంతుండు భీమసేనునికిఁ బ్రియంబుగావించు
వాఁడై యాధ్వజంబున దనప్రతికృతిని స్థాపించును. యోజనమాత్రాం

తరముగల యాధ్వజంబు దిక్కులనెల్లఁ దిర్యగూర్ధ్వభాగంబుల నిరోధిం చెను. వృక్షంబుల మధ్యంబున వెడలునప్పుడైన నది శాఖాంతరంబుల లగ్నంబుగాకుండ భౌమనుండు మాయచే దాని నొనరించెను. ఆకాశం బున నింద్రధను వెట్లు తేజరిల్లునో యట్ల యదియు ననేకవర్ణంబు నతి చిత్రంబునై చూడ్కులకు మిఱుమిట్లు గొలుపును. దానిరూపం బనేకా కారంబులుగ నగపడును. అగ్నితోఁగూడినధూమంబు చిత్రవిచిత్రంబు లగు ననేకరూపంబులతో దివి కెట్లేఁగునో; యట్లే విశ్వకర్మనిర్మితం బగు నాధ్వజంబుగూడ నెందును నిరోధంబులేనిదై ప్రకాశించుచుండును. ఆరథంబునఁ జిత్రరథుం డనుగంధర్వరాజు బహుమానంబుగా నొసంగిన దివ్యంబులు శ్వేతవర్ణంబులు నగు తురంగంబులు పూన్పఁబడియున్నవి. వాతవేగంబులగు నాదివ్యాశ్వంబులు భూమియం దంతరిక్షంబునందు దివియందు నెందును నష్టులేకుండఁ బరువెత్తఁగలవు. దత్తవరంబగు నశ్వ శతంబు మరలమరల నిహతమయ్యు మరలమరలఁ బూరింపఁబడుచందం బున దంతవర్ణంబులు నతిమాత్రదేహంబులునగు దివ్యాశ్వంబులు రథం బున యోజింపఁబడినవై యాతనిబలంబునకు సమానంబగురూపంబు లతో విరాజిల్లుచున్నవి. ఋక్షప్రఖ్యంబులగు భీమసేనునియశ్వంబులు వాయుతుల్యవేగంబులు రథంబునఁ బూన్పఁబడినవి. కల్మాషాంగములు తిత్తిరిచిత్రపృష్ఠంబులునగు నాయశ్వంబులు ప్రీతుండగుఫాల్గునునిచే వృకోదరున కొసంగంబడినవి. సహదేవుని తురంగంబులుగూడ నన్నల తురంగములకుఁ దీసిపోనివై మహాతేజంబున విలసిల్లుచున్నయవి. మాద్రీనందనుం డగునకులునిరథంబున మహేంద్రదత్తంబు లగునశ్వం బులు బూన్పఁబడును. వృత్రశత్రుం డగుసురేంద్రునితురంగంబులుం బోలెఁ బాండవులతురగంబులన్నియు వాయుసమానవేగంబులు మహా బలవంతంబులు తుల్యవయోరూపవిక్రమంబులునై దేవదత్తంబులై వెలుంగుచున్నయవి.

**సంజయుండు పాండవసహాయు లగురాజుల ప్రభావంబు సెప్పుట**

అనుటయు సాంబికేయుండు సంజయా! ధర్మనందనుప్రీతికై యేతెంచి నాతనయునిసైన్యంబులతో యుద్ధంబుగావింప సిద్ధులైన రాజు లెవ్వరెవ్వ రెట్టివారో యెఱింగింపుమని యడుగుటయు నాతం డిట్లు

వచ్చెను. రాజా! రాజులకెల్ల మేటి యగువృష్ణిసింహుడు వాసుదేవుం డాపక్షంబున నున్నవాడుగదా? మఱియు నంధకవృష్ణివీరు లగు చేకితా నుండు యుయుధానుండు సాత్యకియు వేఱువేఱ నక్షౌహిణులతోడ నేతెంచియున్నవారు. వారలెల్ల మహాబలవంతులు మహారథులునై, ధర్మ నందనునకై ప్రాణంబులనైతము పరిత్యజింప నున్నవారలు. అక్షౌహిణీ బలంబుతోడను బదువురుతనయులు ధృష్టద్యుమ్నుండు మొదలుగ సత్య జిత్ప్రముఖులతోడను శిఖండిని సేనానాయకుంగావించి ద్రుపదుం డే తెంచియున్నవాడు. శంఖుండు నుత్తరుండునను నిరువురుతనయులతో మదిరాక్షపురోగములగు సూర్యదత్తాదివీరులతోఁగూడి విరాటుండువచ్చి పాండవులం గలసియున్నవాఁడు. ఆతనిసోదరులు తనయులు నియమించిన సైన్యం బక్షౌహిణీపరిమితంబై యుండె. జరాసంధతనయుండగు మాగ ధుండును చేదిభూనాథుండగు ధృష్టకేతుండును వేఱువేఱ నొక్కొక్క యక్షౌహిణిబలంబులతోఁ జనుదెంచిరి. లోహితకధ్వజులు సోదరులునగు కేకయరాజులేవురు నొక్కయక్షౌహిణిబలంబుతోఁ బాండవులంగలసిరి. రాజా! నీతనయులతోఁ బోరి పాండవులకు జయంబుగూర్ప నేతెంచిన వీరులగువీరల నేనక్కడ గాంచితిని. మానుషంబు, దైవంబు, గాంధర్వంబు, నాసురంబునగు వ్యూహంబులమర్మంబులెల్ల బాగుగ నెఱింగిన ధృష్ట ద్యుమ్నుండా సేనలకెల్లఁ బ్రధానుండై యున్నవాఁడు. శాంతనవుం డగు భీష్ముండు శిఖండికి భాగంబుగఁ గల్పింపఁబడియె. వానికి విరాటుండు మాత్స్యయోధులతోఁగూడ సహాయుండై యుండును. పాండవాగ్రజు నకు మద్రనాథుండగు శల్యుండు భాగంబుగఁ గల్పింపఁబడియె. వారిరు వురకు నంతరము విషమమని యక్కడివారు కొందరనిరి. దుర్యోధ నుండు వానియనుజులు వారితనయులు మఱియుఁ బ్రాచ్యులుదాక్షిణా త్యులునగురాజులెల్లరును భీమసేనుభాగంబుగా నిర్దేశింపఁబడిరి. వైకర్త నుండగుకర్ణుం డర్జునునిభాగంబుగఁ గల్పింపంబడియె. ఇంతియకాక యశ్వ త్థాముండు వికర్ణుండు సైంధవుండగుజయద్రథుండు నింకను భూమియం దజేయులమనియు శూరులమనియుఁ దలంచువీరు లర్జునునకే భాగంబుగ నిర్ణయింపఁబడిరి. మహాధనుర్ధరులగు కేకయరాజపుత్రు లేవురును గేకయ రాజులతోడనే యుద్ధంబుగావింప నున్నవారు. మఱియు మాలవదేశా గతులు సాల్వకదేశీయులును త్రిగర్తులలో ముఖ్యులగు సంశప్తకులును

గూడ వారలకే భాగముగాఁ గల్పింపఁబడిరి. దుర్యోధను తనయులును, దుశ్శాసనాత్మజులును సభిమన్యునిభాగంబుగా నిర్దేశింపఁబడిరి. మహా ధనుర్ధరులు సువర్ణవికృతధ్వజులు నగు ద్రౌపదీతనయులును, ధృష్టద్యుమ్నుండు మొదలగువీరులును ద్రోణు నెదిరించి సంగరంబు గావింపనున్న వారు. చేకితానుండు సోమదత్తునిద్వైరథం బగు యుద్ధంబునం దలపడఁ దలంచియున్నవాఁడు. భోజుం డగుకృతవర్మనియుయుధానుండు జయింప నుత్సహించుచున్నవాఁడు. మాద్రీనందనుం డగు సహదేవుండు సమరం బున సంక్రందనునకు సాటిరాఁదగువాఁడు నీశ్యాలుం డగుసౌబలుని తన భాగంబుగా నెన్నుకొనియె. శకుని తనూభవుం డగు నులూకుండును సారస్వతగణంబులును నకులునిభాగంబుగా రచింపంబడిరి. మఱియు నితరు లగుసంగరాంగణాగతరాజులనెల్లరఁ బాండునందనులు బరిమార్ప నిశ్చయించిరి. రాజా! యిట్లీవిధంబునఁ బాండవబలంబులకు నీబలంబులెల్ల భాగంబులుగాఁ గల్పింపఁబడినవి. ఈసమయంబున నేది యుచితంబో యేది కార్యంబో దాని నాచరింపుము. అని సంజయుండు వలుక విని ప్రజ్ఞాచక్షుం డిట్లు విలపింపందొడంగె. దుర్ద్యూతంబునఁ బాండవుల నవ మానించిన నాతనయుల కింక జీవితంబు దుర్లభంబే యగును. బలవంతు లకు మేటి యగుభీమునితో యుద్ధంబున కియ్యకొన్నవారలకు జీవితం బెట్లు నిలుచును? ఈతోడువచ్చినరాజులెల్లరు గాలధర్మంబున బ్రోక్షి తులైయున్నవారై పతంగములు పావకునందుఁబడి మ్రందినట్లు గాండీ వాగ్నిం బ్రవేశించి మడియుదురు. మహాత్ములగువారలతోడ విరోధంబు గావించుటంజేసి నాసైన్యమెల్ల చెల్లాచెదరై భంగమందుట నిశ్చ యము. పాండవులచే భజ్యమానంబగు నాసేనను రక్షింపఁగలవా రెవ్వరు నుండరు. వారెల్లరును శూరులు, నతిరథులు, కీర్తిమంతులు, ప్రతాప వంతులు, సూర్యపావకుల కీడగుతేజంబుగలవారు. వారల కాహ వమ్మునఁ బరాజయ మ్మెన్నండును గలుగదు. వారలకు యుధిష్ఠిరుండు రాజు, నేత. వాసుదేవుండు గోప్త. మహావీరు లగు ధనంజయవృకోదరులు వారలకు యోధులు. నకులుండు, సహదేవుండు, ధృష్టద్యుమ్నుండు, సాత్యకియు, ద్రుపదుండును, ఉత్తమౌజుండు, యుధామన్యుండు, దుర్జ యుండు, శిఖండియు, విరాటతనయులును, ఛత్రదేవుండును, కాశి రాజులు, చేదిరాజులు, మత్స్యరాజులు, సృంజయులు, విరాటాత్మజుండు,

బభ్రుండును, పాంచాలురు, భద్రకులు మొదలగుమహావీరు లెల్లరును బాండవులకు వశులై యున్నవారు. వారల యనుమతిలేనిదే యింద్రుం డైనను భూమిని నిలుపఁజాలఁడు. వారలు బలాతిశయంబునఁ బర్వతం బులనేని పగులఁగొట్టఁగలధీరులు. అమానుషప్రతాపవంతులు, సర్వగుణ సంపన్నులు నగునామహానుభావులతో మందమతి యగు నాతనయుండు పోర సమకట్టియుండుట కాలవిలసితముకాక మఱేమగును? సంజయా! నేనెంతగా మొఱయిడి సెప్పినను వాఁ డాలకింపనోపకున్నాఁడు, ఎంత చెప్పిన వాఁడాలింపక యుద్ధంబ కావింప నిశ్చయించినాఁడు. అనుటయు దుర్యోధనుం డిట్లనియె. రాజా! మేమును బాండవులు నొక్కజాతియం దుద్భవించినవారలమే. మేమిరువురము నొక్కభూమియంద నివసించు చున్నారము. అట్టియెడ నీవు పాండవులకే తప్పక జయము లభించునని యెట్లు తలంచెదవు? పితామహుండు, ద్రోణుండు, కృపుండు, నశ్వత్థా ముండు, కర్ణుండు, జయద్రథుండు, సోమదత్తుండు మొదలగుమహా తేజశ్శాలు రగు వీరు లెందఱో మనబలంబునఁ గలరు. సకల దేవగణంబు లతోఁగూడిన దేవేంద్రుండైనను వీరలఘాటి కోర్వఁజాలఁడనుచోఁ బాండవులు వీరి నెట్లు జయింపఁగలరు? ఆర్యులు, శూరులు, శస్త్రధారి ప్రవరులు నగురాజు లెందఱో నాకొఱకుఁ బ్రాణంబులేని విడువ సిద్ధు లై యున్నవారు. వీరు దప్పక పాండవుల వధింప సమర్థులు. నాకు సహా యులుగా వచ్చియున్న రాజులను చేఁజిచూచుటకైనను బాండవులకు శక్తిచాలదు. సపుత్రమిత్రులగుపాండవులను సమరంబున నోర్చుటకు నేనెంతయుఁ బరాక్రమింతును. హరిణశాబకంబులం బాణంబులతో నిరో ధించునట్లు నాసైన్యంబులందలిరాజులెల్లరు నాప్రియంబ కర్తవ్యంబుగా నెంచినవారై బాండవులను బాఱఁద్రోలంగలవారు. అతిసంఖ్యం బగు రథవంశంబునను మామకంబులగు శరవ్రాతంబులను బాంచాలురును వులును పోరువిడిచి పరువెత్తకమానరు.

అని పచించుటయు నాంబికేయుండు సంజయా! నాతనయుండు వెఱ్ఱియెత్తినవానివలెఁ బ్రలాపించుచున్నాఁడు. ధర్మరా జగు యుధిష్ఠి రుని యుద్ధంబున గెల్వ వీనితరంబుగాదు. ధర్మజ్ఞులు, మహాత్ములు, మహా శూరులు నగుపాండవుల బలపరాక్రమంబులు భీష్ముండు బాగుగఁ దెలిసి యున్నవాఁడు. కావుననే యాతండు పాండవులతోడి కయ్యంబున

కియ్యకొనకున్నాఁడు. వినను సంజయా! వారలవిచేష్టితంబు నాకు మరలఁ జెల్పుము. హవిస్థానంబున నగ్నిని వృద్ధినొందించువడువున నెవ్వం డా మహాతేజస్వు లగు పాండునందనుల క్రోధం బుద్దీపితంబు గావించుచున్నాఁ డో చెప్పుమనియె. అదివిని సంజయుం డి ట్లనియె. మహారాజా! ధృష్ట ద్యుమ్నుం డెల్లపుడును వారల నుద్దీప్తులం గావించుచుండును. అతండు పాండవుల నుద్దేశించి "మీరు యుద్ధంబున కెంతమాత్రము వెఱవకుఁడు. తప్పక యాహవం బాచరింపుఁడు. ధార్తరాష్ట్రులతోఁ గలసివచ్చినపార్థి వుల నెల్లరఁ దుములం బగునాహవంబున సానుబంధముగ నేనొక్కరుండన వధింతును. తిమింగిల ముదకమందుండెడి మత్స్యంబుల నాహరించువడు వున నేను సకలం బగు రాజలోకంబు నాశస్త్రముఖంబున గ్రసించెదను. వేల మకరాలయంబు నిరోధించునట్లు భీష్మద్రోణద్రౌణికృపకర్ణాదుల నేను నిరోధింతును. కావున మీరు తప్పక యుద్ధంబునకు సన్నద్ధులగుఁ" డని పలికిన ధృష్టద్యుమ్ననకుఁ బాండవాగ్రజుం డిట్లనియె. మహా వీరాగ్రణీ! నీధైర్యంబు వీర్యంబును బాంచాలురును బాండవులునుగూడ జక్కఁగ నెఱుంగుదురు. మమ్ములనెల్ల నీవ సంగ్రామమున నుద్ధరింప వలయు. క్షత్రధర్మంబున నవస్థితుండ వగు నీవొక్కరుండవ కౌరవబలం బుల నెల్లఁ బరిమార్ప సమర్థుండవని నేనెఱుంగుదును. కౌరవులు యుద్ధో త్సాహంబునవచ్చి సమరాంగణంబున నిల్చునపుడు మన కేది యుచితంబో యావశ్యకంబో యట్టికార్యంబులెల్ల నాచరింపుము. సంగ్రామంబున భంగమొంది పోరువిడిచి పాఱి శరణాగతులగుశాత్రవులయెడ నెవ్వాఁడు దయదలఁచి కాపాడునో యట్టిపౌరుషశాలిని సహస్రంబులచేనైనఁ విలువందగునని పెద్దలందురు. నీవు మహావిక్రమశాలివి, శూరుండవు, వీరుండవు, సంగరాంగణంబున భయార్తులఁగావ సమర్థుండవు. అనిపలికి నంత, ధృష్టద్యుమ్నుండు నాతో నిట్లనియె. సంజయా! సుయోధనునకై యుద్ధంబుగావింప నుత్సహించు రాజన్యులెల్లరతోడను, సుయోధనుని యోధులెల్లరతోడను, బాహ్లీకునితోడను, ప్రతీపాన్వయులెల్లరతోడను, శారద్వతుండు సూతనందనుండు ద్రోణుండు అశ్వత్థామ జయద్రథుండు దుశ్శాసనుండు వికర్ణుండు దుర్యోధనుండు భీష్ముండు మొదలగువారల తోడను, "మీరలు శీఘ్రంబుగ ధర్మాత్ముం డగు ధర్మనందనుని బహు మానపూర్వకంబుగ శరణువొందరేని దేవగుప్తుం డగు ధనంజయుండు

మిమ్మెల్లర నవశ్యము వధింపక విడువఁడు. తూర్ణంబుగ రాజ్యంబెల్ల ధర్మాత్మజుని కర్పింపుఁడు. లోకవీరుండగు నాతనివలన మీకు వలసినదానిని బ్రార్థించి పుచ్చికొనుఁడు. సత్యవిక్రముండగు సవ్యసాచి కీడగుయోధుం డీభూతలంబున నెందునుం గానరాఁడుగదా? గాండీవధన్వికి దైవంబులచే దివ్యం బగురథం బీయఁబడియున్నదిగదా? కావున వానిని మానవు లెన్నఁడును జయింపనోపరు.

## ధృతరాష్ట్రుండు దుర్యోధనుని గర్హించుట

అనుటయు నాంబికేయుఁడు పెద్దగా విచారించి యిట్లనియె. ధర్మనందనుండు కుమారవయసునుండియు క్షత్రతేజంబునను బ్రహ్మచర్యంబునను బేరెన్నికగన్నవాఁడు. నేనెంతపలవించుచున్నను నామాట లాదరింపక మందాత్ములగు నాతనయు లాతనితో డీకొనఁ దలంచుచున్నవారు. భరతసత్తముండవగు సుయోధనా! నీవు నామాట నాదరించి యుద్ధప్రయత్నంబు మానుము. పెద్దలెప్పుడును యుద్ధంబును బ్రశంసింపరు. సామాత్యపుత్రమిత్రుండవగు నీవు జీవించుటకు రాజ్యమ్మున సగపాలుచాలును. పాండునందనులకును యథోచితంబుగఁ గొంతరాజ్యమిమ్ము. ధర్మసంహితంబని కురుపుంగవులెల్లరు నీకార్యంబును మెత్తురు. నీవు పాండవులతో శాంతి నభిలషించితేని తప్పక వారిపాలు వారికిచ్చి నీరాజ్యంబు నీవనుభవించుట లెస్స. అట్లు కావింపక నీసైన్యబలంబునే యాలోచించితివేని దప్పక నీకువినాశం బాసన్నంబైనదనియే నమ్ముము. నీ వజ్ఞానంబున నీయర్థం బెఱుంగ లేకున్నాఁడవు. నేను యుద్ధం బెంతమాత్రము నంగీకరింపను. బాహ్లికుండును సంగరంబున కనుమతింపఁడు. మఱియు భీష్ముండు, ద్రోణుండు, కృపుండు, నశ్వత్థామయు, సంజయుండు సోమదత్తుండు, శల్యుండు, సత్యవ్రతుండు, పురుమిత్రుండు, జయుండు, భూరిశ్రవుండు మొదలగుప్రాజ్ఞులు మహావీరులు నగువారలెవ్వరును యుద్ధంబున కంగీకరింపకున్నారు. పరులబాధలం బొరయకుండ కౌరవుల రక్షించుచున్న మేటిజోదులెల్లరు యుద్ధంబున కియ్యకొనకున్నవారు. నీవుగూడ వారలయభిమతం బనుసరించి యుద్ధప్రయత్నంబు విడువుము. వత్సా! నీవు నీయంతటన యుద్ధంబునకు సిద్ధపడినవాఁడవుగావు. దుర్మార్గులగుకర్ణుండు, దుశ్శాసనుండు, శకునియు నిన్ను దుర్మార్గంబునఁ బ్రేరించు

చున్నవారు. నీబుద్ధికిఁ గళ్మలం బాపాదించి నీచే నీదుష్కార్యంబులు వారలు చేయించుచున్నవారలు. కావున నీవు వారిమాటలు నిరాకరించి ప్రజ్ఞావయోవృద్ధులమతంబు ననుసరించి యుద్ధంబు విరమింపుమని వచించె. అవివిని సుయోధనుండు తండ్రీ! నేను నీయందుఁగాని ద్రోణాశ్వత్థామలందుఁగాని భారముంపలేదు. మఱియుసంజయుండు, భీష్ముండు, కాంభోజుండు, కృపుండు, బాహ్లికుండు, సత్యవ్రతుండు, పురుమిత్రుండు, భూరిశ్రవుండు మొదలగువారి సాహాయ్యంబుగూడ నా కక్కఱలేదు. నిన్నును నీబుద్ధి ననుసరించు నితరులయందుఁగూడ నీభారము మోపను. మిమ్మెవ్వరినే నాలంబించి నేను యుద్ధంబునకుఁ బాండవుల నాహ్వానించు నపుడుకదా మీమాటలు నేనాదరించుట. తండ్రీ! నేను కర్ణుండు నిరువురముమాత్రమే యీరణయజ్ఞమ్ముగావింప దీక్షగొనియున్నవారము. ఈయజ్ఞంబున యుధిష్ఠిరుండు యజ్ఞపశువు, రథంబు వేది, ఖడ్గంబు స్రువంబు, గద స్రుక్కు, కవచము సదస్సు, చాతుర్హోత్రంబు తురంగంబులు, శరంబులు దర్భలు, యశంబు హవిస్సు. ఆత్మయజ్ఞంబగురణంబున వైవస్వతునకుఁ బ్రీతిగావించి శాత్రవులనెల్ల జయించి విజయలక్ష్మీపరివృతులమై తిరిగివత్తుము. నేను గర్ణుండు దుశ్శాసనుండు మువ్వురము మాత్రమే సమరంబునఁ బాండవబలంబులనెల్ల నోర్చి జయంబు గొందుము. నేనుబాండవులఁ బాఱఁద్రోలి యీపృథివినెల్ల నేలెద నొండె, నన్నుఁ జంపి పాండవు లీభూమి నేలెదరొండె. అంతియకాని నేనును బాండవులు నుభయులము జీవించియుండుటమాత్రము పొసఁగదు. నా జీవితంబు రాజ్యంబు సకలధనంబులును విడిచెదనుగాని పాండవులతో నొకప్పుడేని గలసిమెలసి పొత్తుగూడి యుందుననుట కల్ల. సుతీక్ష్ణం బగు సూదిమొన మోపుటకు వలనగునంత పరిమాణముగలభూమి నైనను బాండవుల కీయను.

అని సుయోధనుండు వలుకుటయు నంబికానందనుం డితరులగు పుత్త్రులను మిత్త్రులను రాజుల నుద్దేశించి విలపించుచు నిట్లనియె. తండ్రులారా! మిమ్మెల్లరఁజూచి నాకు మిగుల శోకం బుదయించుచున్నది. దుర్యోధనుం డింక నాకు లేఁడు. ఆమందు ననుసరించిన మీరును దప్పక యమసదనంబున కరుగువారలే యయియున్నవారలు. మహాబలిష్ఠంబగువ్యాఘ్రంబు రురుకదంబంబులనడుమఁ జొచ్చి పెచ్చు

పెరిఁగి వానినెల్ల గసిమసంగునట్లు పాండవులు కౌరవసైన్యంబులందుఁ బ్రవేశించి మేటిజోదులనెల్ల నేఱి యేఱి వధింతురు. యుయుధానుండు దీర్ఘంబులగుబాహువులచే భారతసైన్యంబునెల్ల వ్యస్తంబు గావించి సీమంతినిని కేశపాశంబులం బట్టి యీడ్చినట్టు లీడ్చును. నాకుం జూడ యుద్ధప్రయత్నంబు మిక్కిలి విషమంబై తోఁచుచున్నది. సంపూర్ణం బగు పార్థునిబలంబు మాటిమాటికిఁ బూరించుచు మాధవుండు విజృంభించును. శైనేయుండు బీజంబులు చల్లువడువున శరపరంపరలఁ బరపును. సేనాముఖంబులందు భీమసేనుండు నిరర్గళవీరవిహారంబు గావించును. మిగిలినయోధులెల్లరు నకుతోభయం బగు ప్రాకారం బాశ్రయించునట్లు వృకోదరు నండజేరి వీరవిహారంబు చల్పుదురు. భీమసేనాభిహతంబులై గిరిసన్నిభంబు లగు మత్తేభంబులు విశీర్ణదంతంబులు భిన్నకుంభంబులునై నెత్తురులు గ్రక్కుచు కులిశాహతంబులగు పర్వతప్రవరంబులు వోలె సంగ్రామరంగంబున గూలునపుడు భీమసేనునివలని భయంబున నావాక్యంబులు స్మృతిపథంబునకు రాకతప్పవు. సుయోధనా! వృకోదరుండు రథంబుల భంజించి ద్విరదంబులఁ బరిమార్చి యనీకంబులెల్లఁ జీకాకుపఱుచునపుడు నావాక్యములు స్మరింతువు. కార్చిచ్చు వనంబుల నేర్చురీతిని మారుతాత్మజుండు పెచ్చుపెరిగి యోధులఁ బరిమార్చునపుడు నామాటలు తలంపునకువచ్చును. పాండవులవలన మీకెల్లరకు మృత్యు వాసన్నంబై యున్నది. భయంకరం బగు నాహవంబున కేనంగీకరింపను. మీరలు శాంతినొంది సుఖింపుఁడు. నామాట లాలింపరైతిరేని భీమసేనుగదాదండంబున నిహతులై శాశ్వతం బగుశాంతి నొందెదరు. పరశుపాతితంబై కూలిపడిన మహారణ్యంబుభాతి భీమసేనసంహృతంబై కురుబలంబెల్ల నేలంగూలినపుడు నావాక్యంబులఁ దలంచెదవు. అని పలికి యక్కడి రాజలోకంబుతోడఁ గొంత ప్రసంగించి సంజయుని దిక్కు మొగంబై సంజయా! మహాత్ము లగువాసుదేవధనంజయులు నీసందేశం బాలించి యేమి బదులువల్కిరో యది యెఱింగింపుమనుటయు నాతండు మహారాజా! కృష్ణార్జునులు రహస్యమందిరంబున నుండ నేను వారిని దర్శించినపుడు వారిరువురు పలికినవాక్యంబులు మున్న యెఱింగించి యుంటి ననియె.

సంజయుం డట్లుపల్కుటయు నాంబికేయుండు వాసుదేవార్జునుల మాటలతత్త్వంబు విమర్శించి, గుణదోషంబుల సూక్ష్మంబుగ విమర్శించి, తనతనయుల విజయంబుగూర్చి సూక్ష్మంబుగనాలోచించి, యొక్కనిశ్చయం బేర్పరించికొని, దైవమానుషంబు లగు శక్తులచేతను దేజంబునను బాండవు లధికులనియుఁ, దనతనయు లల్పతరులనియు నిశ్చయించి, దుర్యోధనున కిట్లనియె. దుర్యోధనా! నామనంబునంగలచింత యెంతపోనాడుదమన్నను బోకుండ నున్నది. నేను దీనినెల్లఁ బ్రత్యక్షంబున ననుభవించి చెప్పుచున్నాఁడనేకాని యనుమానాది ప్రమాణంబుల నాశ్రయించిపలుకలేదు. సకలజంతువులు నాత్మజులందు మిగుల స్నేహంబు గలిగియుండుటయు, నాత్మజులకుఁ బ్రియంబుల నాచరించుటయు, లోకప్రసిద్ధంబు సహజంబు నగు విషయమే. అట్లే తమకుపకార మొనరించినవారలకుఁ బ్రత్యుపకారం బొనరించుటయు స్వాభావికంబగువిషయమే. ధనంజయుండు ఖాండవదహనసమయంబున నొనరించినయుపకృతిని దలంచి యగ్నిదేవుండు తప్పక పాండవులకు సాచివ్యంబు నెఱపును. ఆతం డీయుద్ధంబున ధనంజయునకును భీమునకును సాహ్యంబుగావించితీఱును. పాండవులు తమతమయంశంబులవలన జనించుటంజేసి ధర్ముండు మొదలగు దేవతలెల్లరు బాండవులకు సాహ్యం బాచరించుట నిక్కము. వారలు పాండవులకు భీష్మద్రోణకృపాదులవలనిభయం బింతయుఁ గలుగకుండ వజ్రపంజరంబున గాచెదరు. దేవతలతోఁగూడినపార్థుల నాలోకింపనైన మనకు శక్యంబుగాదు. వారెల్లరును మహావీరులు దివ్యాస్త్రకోవిదులునై దేవతలకు నజేయులైయుండ మానవులు వారితో నెట్లు దొడరంగలరు? ధనంజయునకు గాండీవంబు దురాసదం బగు దివ్యధనువు గలదు. వరుణదేవుం డిచ్చినశరపూర్ణంబు లగు నక్షయతూణీరంబులు గలవు. ధ్వజంబున వానరాకారంబును దివ్యంబు నగు కేతనంబు గలదు. వానిరథంబునకు సరియగురథ మీచతురంతమహీమండలంబున నెందును లేదు. మహామేఘనిర్ఘోషంబును మహాశనిపాతసన్నిభంబు నగు రథనేమిస్వనం బాలించినంతన శాత్రవులు యమసదనంబున కరుగుదురు. ఈలోకంబెల్ల నతిమానుషవీర్యుండని ధనంజయుని దలంచు. రణాంగణంబున దేవతలనైతము ధనంజయుండు జయించునని లోకం బెఱుంగును. ఏనూఱుబాణంబు లేకఘాటిని నిమేషాంతరమాత్రంబున సంధించియు

దూరంబున బలిసియుఁ బగలు నొంచు ధనంజయున కీలోకంబున కా లోకంబునను సాటియగు వీరుం డుండఁబోఁడు. భీష్ముండు ద్రోణుండు కృపుండు నశ్వత్థాముండు శల్యుండు నింక మధ్యస్థు లగు రాజు లెల్లరును నభిమానుషంబులగు పరికరంబులతోడ యుద్ధంబునకు సన్నద్ధులై యున్న కిరీటిని జయించుట కేరికిని శక్యంబుగాదని పలుకుచున్నవారు. బాహువీర్యంబునఁ గార్తవీర్యునకు సాటియగు సవ్యసాచి యొక్కవేగంబున నైదునూర్ల బాణంబులం బ్రయోగించును. మహాధనుర్ధరుండు మహేంద్రోపేంద్రసమపరాక్రముండు నగు బీభత్సుండు భావిమహాహవంబున నెల్లరను వధించునని నాకు భయంబు జనించుచున్నయది. ఈ భయంబున నహర్నిశంబు చింతాకులుండ నగుటం జేసి నాకు నిద్రాహారంబులు దూరంబులై మిగులఁ గ్లేశంబు లనుభవించుచున్నవాఁడను. కౌరవులకు శాంతిగల్గునుపాయం బెంత వెదకినను గానరాకున్నయది. కౌరవులకు గొప్పక్షయోదయం బాసన్నంబై యున్నది. శమంబుకంటె నీకలహంబు నంత మొందించునుపాయము గానరాదు. తండ్రీ! నాకెల్లవిధంబులఁ బాండవులతోడిశమం బహితంబుగ నగపడుచున్నది. విగ్రహంబు సర్వానర్థంబులకు మూలంబై సర్వనాశంబు గావించును. కౌరవుల కంటెఁ బాండవు లెల్లవిధముల నధికబలవత్తరులని నమ్ముచున్నాఁడను.

### దుర్యోధనుండు తండ్రికిఁ దన ప్రతాపం బెఱింగించుట

ప్రజ్ఞాచక్షుం డిట్లు వచింప రోషంబున నయనంబు లెఱ్ఱబాఱ నత్యమర్షణుండగు సుయోధనుండు విపులం బగుకోపాటోపంబునం గటంబులదరఁ దండ్రి కిట్లనియె. తండ్రీ! పాండవులు దేవసచివులనియు, వారికి దేవతలు సాహ్యంబుగావింతురనియు, నీవు వచించినమాట కేవల మసత్యము. నీమనంబున నాభయంబు విడువుము. కామద్వేషసంయోగంబు నిర్జించుటవలనను లోభద్రోహంబులఁ ద్యజించుటవలనను సకలంబు లగుభావంబుల నుపేక్షించుటవలనను దేవతలు దేవత్వ మొంది విరాజిల్లుచున్నవారు. ఈయర్థంబు మహాతపస్వులు రగు ద్వైపాయనుండు నారదుండు జామదగ్న్యుం డగురాముండును మున్ను నాకుఁ దెలిపియుండిరి. దేవత లెన్నఁడును మానవులంబోలి కామక్రోధలోభద్వేషంబులయెడఁ బ్రవర్తింపరు. అగ్నియు వాయుదేవుండును సురేం

ద్విగుణంబు గావించుచు నిట్లనియె. నేను మిథ్యావచనంబులాడి పరశు రామునివలన బ్రహ్మమయంబగు నస్త్రగ్రామంబెల్ల సంపాదించితిని. నా యసత్యం బెఱింగి యాతం డంతకాలంబున నాయస్త్రవిద్య నాకు జ్ఞాపక ముగకుండదని శపించెను. మహర్షిపుంగవుండగు నాగురునిచే మహా పరాధంబు గారణంబుగ శపింపఁబడితిని. ఆమహర్షిప్రవరుండు కోపించె నేని తిగ్మం బగుతేజంబున ససాగరం బగు నవనితలంబెల్ల భస్మీకరించు సామర్థ్యముఁగలవాఁడు. నేనును శాపంబిచ్చినయనంతరంబు మిగుల శుశ్రూషగావించి యాతనిమనంబు ప్రసన్నంబుగావించితిని. నాశుశ్రూష కును బౌరుషంబునకును సంతసించి యామునీంద్రుండు మరలఁ దన శాపంబు నివృత్తంబు గావించెను. కావున నానేర్చినయస్త్రమంత్రంబు లన్నియు నాకు స్వాధీనంబులై యున్నవి. ఆయస్త్రంబులచే నాకు మిగుల సామర్థ్యంబు గలదు. ఈసమరభారంబంతయు నేనొక్కండన వహింతును. ఆజామదగ్న్యమహర్షి ప్రసాదంబున నిమిషమాత్రంబున పాంచాలురను గరూషులను మాత్స్యులను పుత్రపౌత్రభృత్యులతోడఁ బాండవులను వధించి శస్త్రంబుచే నార్జింపఁబడిన యుత్తమలోకంబు లందెదను. పితామహుండు ద్రోణుండు నిఁకనుంగల నరేంద్రులెల్లరు నీసమీపంబున నుండనిమ్ము. ప్రధానం బగుబలంబు గైకొని నేనొక్కరుం డన సంగరాంగణంబున కేఁగి పార్థులఁ బరిమార్చివత్తును. ఈభారంబు నాయదియని వచించుటయు శాంతనవుండు వానివచనంబుల కసహ్యపడి వాని కిట్లనియె. కర్ణా! కాలపరీతబుద్ధివై యేల యిట్లాత్మశ్లాఘనంబు గావించికొందువు? ప్రధానుండు నిహతుండైనంతన ధార్తరాష్ట్రులెల్లరు వధింపఁబడుదు రనువిషయం బెఱుంగకున్నవాఁడవు. ఖాండవవనంబు ధనంజయప్రీతికై దహింపఁజేయునపు డర్జునుం డొనరించినయమానుష వీరకృత్యంబు నీ వెఱుంగుదువుకదా? ఎఱింగియు నిట్లేల పనికిమాలిన మాటలాడెదవు? నీవును నీబంధువులును బాగుగఁ దెలివొంది యాత్మల నియమించికొను టొప్పును. భగవంతుండగు త్రిదశేశ్వరుండు శక్తి నొసంగెనని గర్వించుచున్నాఁడవా? సమరాంగణంబున గేశవుం డా శక్తిని దునుకతునుకలుగాఁ దనచక్రంబుచే గావించును. మరియు సర్ప ముఖంబగు నీబాణంబును నీ వెంతగా మాల్యగంధాదులర్పించి యర్చించు

చున్నసు నది సమరతలంబున గిరీటిచే నిహతంబై సీతోఁగూడి నాశం బొందును. కర్ణ! బాణుని నరకాసురుని మురాసురుని వధించినవాసు దేవుండు ధనంజయుని సమరంబునఁ గాన సున్నాఁడు. ధనంజయుండన్న నీబోఁటివారు నీకంటె నధికులునగు పెక్కండ్రు శాత్రవుల నుక్కడం చినమహావీరుండు. వారియుర సామర్థ్యం బెఱింగియు నీవిట్లు ప్రగల్భము లాడుట కాపురుషలక్షణంబుగాక మఱేమగునని పలికెను. ఆపితా మహుఁవచనంబు లాలించి కర్ణుండు లజ్జావమానంబులు ముప్పిరిగొన రోషాకులుండై యిట్లనియె. వృష్ణివీరుండగు వాసుదేవుండు శాంతనవుం డిపుడు వచించినట్లంతవాఁడేకాక యంతకు నధికం బగుమాహాత్మ్యంబు గలవాఁ డగును. దానికి సంశయ మందనక్కఱలేదు. కాని పితా మహుండు నన్నిట్లు దుర్వాక్యంబులాడుటమాత్రము తగదు. ఇంతటి పరుషవాక్యంబు లాడినందులకు ఫలం బాతండు వినుఁగాక. నేనిదే శస్త్రంబుల సన్న్యసించుచున్నవాఁడను. పితామహుండు జీవించియుండు నంతవఱకు నేను శస్త్రంబు ధరింపను. సమరంబున నాతండు స న్నెపు డును జూడఁజాలఁడు. పితామహా! నీవు శాంతినొందినపిదప సకలరాజ లోకంబు నాప్రభావం బాలోకించును. అని పలికి మహాధనుర్ధరుండగు కర్ణుం డాసభాస్థలి వీడి తనగృహంబున కరిగెను. అపుడు వెడనగవుతోఁ బితామహుండు సుయోధనున కిట్లనియె. సూతసూనుండు సత్యప్రతి జ్ఞుండుకదా? అంతటిమహావీరుండే సమరభారంబువహింపకున్న నిం కెవ్వరు వహింపఁగలరు? భీమసేనుండు వ్యూహంబులకుఁ బ్రతివ్యూహంబులు గల్పించి తాళఫలంబులరీతిని యోధులశిరంబులు రాలఁగొట్టునపు డెల్ల రము లోకక్షయం బాలోకింతుముగాక. ఆవంత్యుండు కాళింగుండు జయద్రథుండును చేదిధ్వజుండు బాహ్లికుండు నుండఁగా వేవురను బది వేవురను శాత్రవయోధుల నిలాతలంబున నేన కూల్చెదననుట మిథ్యా వచనంబుకాదా? భగవంతుండగు పరశురామునితోడ వీఁడు బ్రాహ్మ ణుండనని చెప్పి యస్త్రగ్రామంబు నేకరించెను. దానివలనన వీనిధర్మంబు తపంబునుగూడ వినష్టంబులయ్యె. అధమపూరుషుండగు వీఁడు సమర భారంబువహించునని నమ్ముటకంటె వేఱు వెఱ్ఱితనముండదు అని వచిం చెను.

### దుర్యోధనుండు భీష్మునిఁ దూలనాడుట

కర్ణుం డట్లు శస్త్రసన్న్యాసంబు గావించి నిర్గమించుటయు దుర్యోధనుండు వ్యాకులుండయ్యుఁ గోపాటోపంబున భీష్మునితో నిట్లనియె. పితామహా! నీవు లోకజ్ఞుండవు, వృద్ధుండవునై యున్నావు. మేమెల్లరమును జన్మంబునఁ దుల్యమైనవారలమే కాని మాకు భేదమేమియు లేదు. మేమెల్లరము మానవజన్మమెత్తినవారలమే. అట్టియెడ నీవు పార్థులకే తప్పక జయమగుననియు, మన కపజయంబు వాటిల్లుననియు నెట్లు తలంచుచున్నవాఁడవు? మాకందఱకును వీర్యంబు పరాక్రమంబు వయస్సు ప్రతిభ శాస్త్రాధ్యయనము అస్త్రంబులు యోధయుగ్యంబులు శీఘ్రత్వము కౌశలమును దుల్యంబులై యే యున్నవి. మేమెల్లర మొక్కజాతియందయుద్భవించితిమి. అట్టిపరాయుభయపక్షంబులందును బాండవులకే విజయంబుగల్గునని యెట్లు ఊహించుచున్నవాఁడవు? నేను నీయందుఁగాని ద్రోణకృపాశ్వత్థామలందుఁగాని బాహ్లికునందుఁగాని యితరులగు రాజులందుఁగాని యాశయుంచి యుద్ధంబునకుఁ బ్రయత్నింపలేదు. నేనును వైకర్తను డగు కర్ణుండును దుశ్శాసనుండును బరాక్రమించి సమరంబున పాండవు లేవుర వధించెదము. అనంతరము వివిధంబులగుమహాయజ్ఞంబులొనరించి భూరిదక్షిణ లొసంగి బ్రాహ్మణుల సంతృప్తులఁగావించెదము. గోవులును దురంగములు ధనంబులు నసంఖ్యాకంబులుగ నొసంగి విప్రప్రీతిగావింతుము. హరిణశాబకంబులం బాశంబున బంధించునట్లు నాకారణంబున జలంబున నౌకలేక బాహువులచే నీఁదునట్లు పరులు రథనాగసమాకులంబగు సంగరాంగణంబునఁ జిక్కియున్నపుడెల్లరు నాలోకింతురుగాక. నాచే నట్లు భంగమొందినపుడు పాండవులు దర్పంబువిడిచి సౌమ్యమార్గంబునంజరింపంగలరు. కేశవుండు నపుడు గర్వంబువిడుచును. అనినంత విదురుండు సుయోధనునితో నిట్లనియె. వత్సా! ఈలోకంబున దమంబు విశేషంబగు నిశ్శ్రేయససాధనంబని నిశ్చితదర్శులగుప్రాజ్ఞులు వచింతురు. బ్రాహ్మణునకు విశేషించి దమ మావశ్యకము. అదియ వానిసనాతనధర్మము. వానికి దానంబు క్షమయు యథావిధిగ నలవడును. దమంబు దానంబు తపంబు జ్ఞానంబు నధ్యయనంబును వానికి విహితంబులు. దమంబువలనఁ దేజంబు పెంపొందును. దమంబు పవిత్రంబులకెల్ల నుత్తమం

బగునని. తేజంబు వృద్ధినొందిన విపాప్ముండు మహత్త్వ నొందును. భూతం
బులకెల్ల నదాంతులవలన రాక్షసులవలనంబోలె భయంబు జనించు
చుండును. అదాంతులఁ బ్రతిషేధించుటకె క్షత్త్రం బుత్పాదింపఁబడి
యున్నది. నాల్గాశ్రమములందును దమం బుత్తమవ్రతంబని పెద్దలందురు.
దమంబునకు లక్షణం బెట్టిదంతయు నాకర్ణింపుము. క్షమ, ధైర్యము, ఏ
భూతములకు నెట్టిహింసయు గావింపకుండుట, సర్వభూతంబులందును
సమబుద్ధి, సత్యవాక్యనిరతి, ఋజుప్రవర్తనము, ఇంద్రియనిగ్రహము,
మృదుశీలత్వము, హ్రీనిషేవిత్వము, మనస్థైర్యము, కార్పణ్యము లేకుం
డుట, పరిరంభము విడనాడుట, సంతోషము, శ్రద్ధాళుత్వము ననుసద్గు
ణంబు లేపురుషునియం దుండునో యాతండు దాంతుం డనఁబడును. కా
మంబు, లోభంబు, దర్పంబు, మన్యువు, నిద్ర, ఆత్మశ్లాఘనము, మానంబు,
ఈర్ష్య శోకంబునను దుర్గుణంబు లెన్నఁడును దాంతునియెడ నుండవు. జిహ్మ
వ్యాపారము శఠబుద్ధియు లేక దాంతుం డెప్పుడును విశుద్ధుండై యుం
డును. దేనియందు నత్యాశ లేకుండుట అల్పంబున సంతోషించుట
కామంబుల నాశింపకుండుటయు దాంతునిగుణంబులు. దాంతుం డెప్పు
డును సముద్రంబువోలె గంభీరాశయుండై విలసిల్లును. సద్వృత్తము
సత్స్వభావంబునుం గలిగి ప్రసన్నచిత్తుండగు పురుషుం డాత్మవిదుండై
భూలోకంబున సమ్మానంబును బరలోకంబున బుణ్యగతులు నొందును.
ఎవనివలన సర్వభూతంబులకు భయంబు గలుగకుండునో వానికి సర్వ
భూతంబులవలనను భయంబు గలుగదు. అట్టి మనుజోత్తముండు పరి
ణతప్రజ్ఞుండని పరికీర్తింపఁబడును. సర్వభూతహితుండు మిత్త్రుండగును.
వానివలన జనుల కెన్నఁడు నుద్వేగంబు గలుగ నేరదు. ప్రజ్ఞాతృప్తుండు
సముద్రంబువలె గంభీరుండై ప్రశాంతింగాంచును. శాంతిపరాయణు
లగుదాంతులు కర్మంబున దేని నాచరించిరో యేది పూర్వులచే నాచ
రింపఁబడినదో దాని నాలంబించి సమ్మోద మొందుదురు. ఎవ్వండు నైష్క
ర్మ్యం బగువాసంబు నధిష్ఠించి జ్ఞానంబున దృప్తినొంది యింద్రియముల
నిగ్రహించి కాలంబు ననుసరించి చరించునో వాఁడు ముక్తినొందుట
కర్హుం డగును. ఆకాశమునం దెగురు విహంగములయడుగుజాడ లెట్లగ
పడవో యట్లే ప్రజ్ఞానతృప్తుం డగు మునీంద్రుని మార్గంబు నైతము

గాంచ శక్యముగానిదై యుండును. ఎవ్వండు గృహంబులువిడిచి మోక్షం బును కోరునో వానికిం దేజోమయంబులు శాశ్వతంబులు నగులోకంబులు సులభంబు లగును.

మఱియు నీయర్థంబున నొక్కయితిహాసంబు గలదు. దానిని వచింతు నాలింపుమని యిట్లు చెప్పందొడంగె. పూర్వకాలంబున నొక్క కిరాతుండు శకునంబుల వధించి జీవించువాఁ డొక్క కాననంబునఁ బక్షు లంబట్టుటకై వలపన్ని యదూరంబున దాను చెట్లచాటున దాఁగియుం డెను. ఆవలయం దెప్పుడు జోడు విడువక సంచరించు రెండుపక్షు లొక్కమాఱుగఁ దగుల్కొనినవి. ఆవిహంగములు వలలోఁ దగిలియు భీతిల్లక యాజాలంబు నెత్తుకొని మింటికెగసి పాఱిపోవం దొడంగెను. కిరాతుండు నది చూచి యాశ్చర్యవిషాదము లందిక యాపక్షు లేయే మార్గంబులఁ బఱవెత్తుచున్నవో యాయామార్గంబులఁ దానును నేలఁ బరువెత్తుచుండెను. అట్లాకాశంబునఁ బక్షులును నేలఁగిరాతుండుఁ బర్వెత్తు చుండుట యాశ్రమస్థుండగు నొక్కముని మాధ్యాహ్నిక కర్మకలా పంబు నిర్వర్తించుచు నాలోకించెను. ఆలోకించి యాముని విస్మయాధీన మానసుండై యాకిరాతు నుద్దేశించి "ఓరీమృగవ్యాధా! నీచెయిదంబు చూడ నాకాశ్చర్య ముదయించుచున్నది. విహంగము లాకాశంబున నెగురుచుండ నీవు వాని ననుసరించి పరువులెత్తుచుంటివే? నీకు శరీరా యాసంబుదక్క లాభమేమైననుండునా" యని యడిగెను. దానికాబోయ "మహామునీ! నేను మూర్ఖుండనై వ్యర్థంబుగ నీపక్షుల ననుసరించుచున్న వాఁడనుగాను. నాతలం పాలింపుము. ఈవిహంగములు రెండు. అవి తగుల్కొని యెత్తుకొనుపాశం బొక్కటిమాత్రమే. అవి రెండు పరస్పర వివాదంబుమానియున్నంతవఱ కాపాశంబును బక్షులు నాకు దుర్లభం బులే. కాని యవి యొండొరులతో వివాదపడునే నప్పుడు నాకవియుఁ బాశంబుగూడ లభించు"నని వచించి వానిని యథాపూర్వంబుగ ననుసరిం చియే వెళ్లెను. కొంతదూరమేగినపిదప నాపాశంబునకై యారెంటికిని వివాదంబుదయించుటయు నవి మృత్యుసమ్మితంబులై పరస్పరంబు ఘోరం బుగఁ బోరుచు నేలంబడినవి. అప్పుడాచాటున మఱగియున్న మృగయుండు మెల్లఁగ వచ్చి యారెంటిని బట్టి చంపి తనపాశంబుతోఁ గూడ నింటికిం జనియె. విజ్ఞాతు లర్థంబులనిమిత్తంబుగఁ దమలోఁ దాము విరోధింతురో

వా రావిహంగంబులవలె వినాశ మొందుదురు. జ్ఞాతులు పరస్పరసంప్ర శ్నము సహభోజనము సరసకథాలాపములు సమాగమంబు నెల్లప్పుడు గావింపవలయునే కాని విరోధం బెన్నండును గావింపరాదు. ఎవ్వారు మంచిమనంబులతో యుక్తకాలములందు వృద్ధుల నుపాసింతురో వారు సింహంబులచే రక్షింపఁబడునరణ్యంబువోలెఁ బరుల కప్రధృష్యులై యుందురు. ఎవరు సర్వకాలము ధనమును మాత్రము సేకరించికొని తాము దాని నుపభోగింపకయు నొరుల కీయకయు దీనులవలె నుండురో వారు తమచేతులతోఁ దామే తమయైశ్వర్యం బెల్ల శాత్రవుల కర్పించిన వారయ్యెదరు. కొఱకచ్చులవలె జ్ఞాతులుగూడఁ గలసియున్నచోఁ బ్రజ్వ లింతురు. దూరంబుగ నెడసియుండినచోఁ బొగయుదురు. మఱియు మేము కన్నులారఁ జూచినయర్థం బొం డీసమయంబున వచించెదను. దానినిగూడ విని నీవు నీయభిమతం బెట్లట్లాచరింపందగును. మేము దొల్లి యొకప్పుడు కిరాతులతోఁగూడి గంధమాదనగిరివరంబున కరిగి తిమి. దేవసమానులగు విద్యాజంభకవార్తికులను బ్రాహ్మణోత్తములు గూడ మాతో నేతెంచిరి. ఆపర్వతేంద్రంబునం దెల్లెడల లతాకుంజం బులు మనోహరంబుగఁ బ్రవృద్ధంబులై యుండె. మహౌషధులచే నాగిరి మిక్కిలి వెలుంగుచుండెను. సిద్ధులు సాధ్యులు గంధర్వులు నాగిరిసాను వులయందు స్వేచ్ఛాసంచారము గావించుచుండిరి. అక్కడ నొకవిష మం బగు మరుప్రపాతంబునందు గొప్పతేనెపెఱ యొకటి మాకన్నుల కగపడినది. మహాకుంభపరిమాణం బగు నాతేనెపెఱ కుబేరున కత్యంత ప్రీతిపాత్రము. దానిచుట్టును క్రూరంబులగుసర్పంబు లుండి యామధువు నితరులకందకుండఁ గాచుచుండినవి. ఆతేనె త్రాగినమనుజుండు జరామరణ వర్జితుం డగుననియు నేత్రహీనునకు దివ్యంబగుదర్శనశక్తిలభించుననియు వృద్ధుం డామధు వానిన యౌవనవంతుం డగుననియు మాతో నున్న జంభసాధకబ్రాహ్మణులు వచించిరి. ఆమాట లాలించి మూఢు లగుకిరాతు లామధువున కాశపడి దానిని దీసికొనుటకై పాములచే భయంకరమగు నాకొండలోయలోఁ బడి నశించిరి. వారలు కేవలము మధువునందా సక్తినే యాలోచించిరి గాని యాలోయవలనివిషమం బాలోచింపరైరి. దానివలన వార లెల్ల నజ్ఞానంబున దురాశాప్రేరితులై మడిసిరి. మూర్ఖు లగు నాకిరాతులవలె, సుయోధనుండును ధనంజయునితో యుద్ధమాచ

రింప నుత్సాహపడు చున్న వాఁడేకాని యాతనిమహిమం బెఱుంగఁజాల
కున్న వాఁడు. సవ్యసాచికిం గలవిక్రమంబుగాని తేజంబుగాని సుయోధను
నెడ లేవు. ఆకిరీటి యేకరథంబున నారూఢుండై భూమినెల్ల జయించిన
వాఁడు. భీష్మద్రోణకృపాశ్వత్థామాదిమహావీరు లాతనిధాటి కోర్వఁజాలక
విరాటనగరంబున మహాపరాజయంబంది వెనుకకు మరలివచ్చిరి. ఆపరా
జయం బింతలోనే మఱపునకు వచ్చినదా? ధృతరాష్ట్రా! మహావీరుండగు
ధర్మనందనుండు నీప్రేమకుఁ బ్రతీక్షించి క్షమ నాలంబించియున్నాఁడు.
అతఁడు కనుసన్నయొనర్చెనేని ద్రుపదుండు విరాటుండు ధనంజయుం
డును క్రుద్ధులై గాలితోఁగూడిన యగ్నులవలెఁ గౌరవుల నిశ్శేషంబుగ
దహించివైచెదరు. అంబికానందనా! ధర్మనందనుని నీయంకంబునఁ జేర్చి
లాలింపుము. వారలిరువురును యుద్ధంబునకే సిద్ధపడిరేని విజయం
బెవ్వరికగునో యెవ్వఁ డెఱుంగును? యుద్ధసిద్ధి చంచలమైనదికదా?

### ధృతరాష్ట్రుఁడు సుతునకు హితము గఱపుట

విదురుం డిట్లు పలికినంతఁ బ్రజ్ఞాచక్షుండు సుయోధనుతో నిట్ల
నియె. దుర్యోధన! నీకు నేఁజెప్పుమాటలను బాగుగ నాలోచించికొనుము.
నీవు త్రోవ తెలియని బాటసారివోలె నుత్పథంబున మోహావేశంబునఁ
జరించుచున్న వాఁడవు. పాండుపుత్రు లేవురతేజంబు నీవు తొలంగింపఁ
గోరుట లోకంబులు ధరించుపంచభూతంబులతేజం బపనయింపఁగోరుట
వలె మిగుల దుష్కరమైనది. ఒకప్పుడు భూతంబులు తేజుమాసినను
మాయవచ్చునుగాని పాండునందను లెన్నండును దేజంబు లేశంబును
విడువరు. కౌంతేయాగ్రజుండగు యుధిష్ఠిరుండు పరమంబగుధర్మం
బాశ్రయించియున్న వాఁడు. ఆతండు మహాపరాక్రమవంతుండు. ఆతనిని
సమరంబున నెదిరించిన జచ్చుటయేకాని యాతని నీవెన్నఁడును జయిం
పఁజాలవు. అసమానబలపరాక్రమోపేతుం డగు భీమసేనునిఁ దర్శింపఁ
జూచుట చిన్న చెట్టు మహావాయువు నెదిరించినట్లే యాత్మవినాశకారణం
బగును. గిరివరంబులందు మేరుపర్వతం బుత్తమంబైనట్లు ధనుర్ధరులకెల్ల
మేటివీరుండగు గాండీవిని దలపడుటకు బుద్ధిమంతుం డెవ్వఁడే నిచ్ఛగిం
పఁడు. పాంచాలరాజాత్మజుం డగు ధృష్టద్యుమ్నుండు నశింపఁజేయ
కానిశాత్రవు లుందురా? దేవతానాథుండు పిడుగులవిడుచుచందంబున

నాతండు శాత్రవులపై బాణంబులు ప్రయోగించుతఱి నిలువఁగలవీరు
లెవ్వరు? అంధవృష్ణిబలంబులందు సాత్యకి గొప్పవె రెన్నికగన్న జోదు.
ఆతండు పాండవేయులహితంబుగోరిన సేనలనెల్లఁ బరిమార్చును. పుండరీ
కాక్షుం డగు శ్రీకృష్ణుండు ప్రతిమానంబున ముల్లోకములను మీఱి
యున్నవాఁడు. వానితో యుద్ధం బొనర్పఁగల వీరుఁ డేడీ? ఆవాసుదేవు
నకు భార్యలు పుత్త్రులు బంధువులు ఆత్మ యీపృథివీతలంబెల్ల యు
నొక్కయెత్తును, ధనంజయుం డొక్కరుం డొక్కయెత్తునై యుండును.
దుర్ధర్షుండగు వాసుదేవుండు నియతచిత్తుండై ధనంజయునెడ నుండును.
కావున ధనంజయునిబలం బీపృథివిం గలవీరులెల్ల రొక్కటిగాఁగూడియు
సహింపఁజాలరు. తండ్రీ! సజ్జనులమాట లాదరించి మంచిమార్గంబునఁ
బ్రవర్తింపుము. నీయర్థంబున బద్ధాదరులగుసుహృదుల మన్నింపుము.
వృద్ధుండు పితామహుండు నగు శాంతనవుని మన్నించి యాతనియను
మతంబునఁ జరింపుము. కౌరవుల కర్థకాముండ నగు నామాటల నాదరిం
పుము. ద్రోణుని కృపుని వికర్ణుని బాహ్లికుని నావలెనే గౌరవించి వారి
యుపదేశంబుల గ్రహింపుము. వీరెల్లరు ధర్మవేదులు. మీయందును
బాండవులందును సమానంబగు స్నేహంబుగలవారు. పక్షపాతరహితులు.
మొన్న మొన్నన విరాటనగరంబున నీవు నీయనుజులు చూచుచుండఁ
గనే నీబలంబు గోవుల వీడి చెల్లాచెదరగుట నీవెఱుంగవా? మఱియు
నానగరంబున భీమసేనుం డొక్కరుండ నిరాయుధుండయ్యుఁ గీచకు
నుపకీచకులను బెక్కురఁ బరిమార్చుట నీవెఱుంగవా?అర్జునుండుభీముండు
నొక్కఁడొక్కఁడే వేర్వేఱ నిట్టి యమానుషకార్యంబు లాచరించిరి
కదా? వారెల్లరు నొక్కయైనచో సాధింపరానియర్థంబు లుండునా?
కావున వత్సా! నీవీసంగతుల బాగుగ నాలోచించుకొని నీసేనల నశింపఁ
జేసికొనక పరిపాలించికొనుము. అని పుత్త్రునితోడం బలికి మహాప్రాజ్ఞుండు
మహాభాగుండు నగుధృతరాష్ట్రుండు మరల సంజయున కిట్లనియె.

సంజయా! ఇంకను మిగిలియున్న సందేశంబు దెలుపుము. వాసు
దేవుం డట్లు పలికినయనంతరంబు ధనంజయుం డేమి వచించె నది వినంగ
నామనం బాతుర మగుచున్నది. కావున నాతనివాక్యంబులు సమగ్రం
బుగ వినిపింపు మనియె. అది విని సంజయుండు మరల నిట్లు చెప్పనారం
భించె. మహారాజా! కృష్ణుండు వచించినయనంతర మాతండు విను

చుండ ధనంజయుం డిట్లనియె. సంజయా! పితామహుండు, ధృత రాష్ట్రుండు, ద్రోణుండు, కృపుండు, కర్ణుండు, బాహ్లికుండు, ద్రోణనంద నుండు, సోమదత్తుండు, శకుని, దుశ్శాసనుండు, శలుండు, పురమిత్రుండు, వివింశతి, వికర్ణుండు, చిత్రసేనుండు, జయత్సేనుండు, అవంతిదేశాధీశ్వ రులు, సోదరులు, విందానువిందులు, కౌరవుండగుదుర్ముఖుండు, సైంధ వుండు, దుస్సహుండు, భూరిశ్రవసుండు, భగదత్తుండు, జలసంధుండు ననుమహావీరులను మఱియుఁ గౌరవులకుఁ బ్రియం బాచరింప సమకట్టి వచ్చి పాండవప్రతాపాగ్నింబడి శలభంబులువోలె నసువులవీడుటకై యుత్సాహపడుచున్నవారును పాండవాగ్నిలోఁ ద్రెళ్లుటకు ధార్త రాష్ట్రునిచే నానీతులు నగురాజులనెల్ల యథాన్యాయంబుగ వందనాలిం గనకుశలసంప్రశ్నంబుల నావచనంబుగఁ గావింపుము. పాపకారులకెల్ల నిధానంబు నత్యమర్షణుండు దుర్బుద్ధి పరమపాపాత్ముండు లుబ్ధాగ్రేసరుం డునగు ధార్తరాష్ట్రునితో నెల్ల రాజు లాలింపుచుండ వానిమంత్రులు బంధువులు నెల్లరును వినుచుండ నిట్లు చెప్పుమని పలికి యనంతర మమ్మ హాత్ముండు ధర్మార్థసహితంబగు నీవాక్యంబు చెప్పెను. సంజయా! నీవు యదుప్రవీరుం డగు వాసుదేవుండు పలికినవచనంబును సావధానంబుగ నాలించితివే కదా? ఆమాటలవలెనే నామాటలఁగూడ సకలరాజలో కంబు నాకర్ణింపుచుండ వినిపింపుము. రథవేగోత్థితంబగు మహాప్రచండ వాయువుచేఁ బ్రజ్వలించుమహాశరాగ్నియందు నస్త్రబలాపహారి యగు గాండీవస్రువంబున హోమంబుఁగావింప నవసరంబు గలుగకుండున ట్లెల్ల రును బ్రయత్నింపుండు. అమిత్రహంతయగు యుధిష్ఠిరుని స్వాంశంబగు రాజ్యభాగంబు మీ రీయకుంటిరేని నిశితశరపరంపరలచే హస్త్యశ్వరథ పాదాతంబును చతురంగబలంబులతోఁగూడఁ బితృలోకంబున కనిచెదనని వచించె. ఆమాట విని నేను ధనంజయునికడ సెలవంది చతుర్భుజునకు నమస్కారంబుగావించి నీసమీపంబునకు వారలసందేశంబెఱింగింప జవ నంబగురథంబున నరుదెంచితి నని వచించెను.

### వ్యాసుండు ధృతరాష్ట్రునికడ కేతెంచుట

సంజయుం డట్లుపలికినవాక్యంబులు దుర్యోధనుం డాదరింప కుండుటయు మిగిలినసభాసదులు తూష్ణీంభావంబు నొందుటయు రాజు

ల్లెల్లరు దమకవశ్యము యుద్ధంబు తప్పదని యెఱింగి యాసనంబులు వీడి
లేచి తమశిబిరంబుల కరిగిరి. రాజులెల్లరు నరిగినపిదప రహస్యంబున
నంబికాత్మజుండు తనతనయులకు విజయం బాశింపుచు సంజయా!
పాండవుల బలంబును వారి నిశ్చయంబును మరల వినిపించుము నీవు మన
సేనలనెల్ల బాగుగ నెఱింగినవాఁడవు. పాండవుల బలంబుగూడ నీవు
చక్కఁగ నెఱింగితివి. రెండుబలంబుల సారాసారంబులు నీకుఁ బాగుగఁ
దెలియును. ధర్మార్థనిపుణుండవును ధర్మార్థనిశ్చయుండవు నగు నీ వుభయ
బలంబులందు నెవ్వరు బలవంతులు, నెవ్వరు లఘుతరులు నై యున్నవారో
తెలుపుము. యుద్ధంబున కెవ్వ రత్యుత్సాహపడుచున్నవారు? ఎవ్వరు
వెనుదీయుచున్నవారు? వాని యాథాతథ్యంబు వచింపు మని యడిగె.
అంత సంజయుండు రాజా! రహస్యస్థలంబున నే నేమియు నీకుఁ దెలుపఁ
జాలను. రహస్యంబున నావాక్యంబు లాలించితివేని నీకుఁ దప్పక యసూ
య జనించును. నీతండ్రి యగు వ్యాసభట్టారకుని భార్య యగుగాంధారి
నిరువుర నిక్కడకు రప్పింపుము. ధర్మాధర్మములు గార్యనిశ్చయంబు
నెఱింగినవా రిరువురును నీకసూయజనించినను దానిని వారింపఁగలరు.
వారలిరువురసన్నిధిని బాండవకేశవుల యభీప్సితంబు సకలంబు నీకు
నివేదింతును అని పలికినంత ధృతరాష్ట్రుండు తలంచిన నాక్షణంబ వ్యాస
భట్టారకుండును బిలువఁబంచిన గాంధారియువచ్చి విదురునిచే సభా
ప్రవేశంబుఁగొంది సుఖాసనంబుల నుపవిష్టులై యుండిరి. అందఱును
యథార్హంబుగఁ గూర్చుండఁ గృష్ణద్వైపాయనుండు ధృతరాష్ట్రుని
మనోగతంబును సంజయు నభిమతంబు నెఱింగినవాఁడగుట సంజయు
నితో వత్సా! యీయాంబికేయుం డేదియడిగిన దానినెల్ల నిస్సంశయం
బుగ నీవెఱింగినదెల్ల వచింపుము. నీవు వాసుదేవార్జునుల తత్త్వంబెల్ల
బాగుగ నెఱింగినవాఁడవు. నీవలన ధృతరాష్ట్రుం డెల్లవిషయంబు
లెఱుంగుఁగాక యని యాజ్ఞాపించె.

### సంజయుండు కృష్ణునిమహత్త్వంబు దెల్పుట

కృష్ణద్వైపాయనుం డానతిచ్చినంతన సంజయుండు హర్షపర
వశుండై కొంతవడి ధ్యానించి వ్యాసునకు నమస్కరించి యిట్లు
చెప్పందొడంగె. మహారాజ! వాసుదేవార్జునులు పరమార్చితులగు

మహాభాగులు. వారు సర్వభూతంబులకు హితమాచరించుపొంటె నీలోకంబున నవతరించినవారు. ఆవాసుదేవునిచక్రంబు సుదర్శనం బనం బడునది వ్యామమాత్రాంతరముగలదియై మాయచేఁ బ్రవర్తించుచున్నది. అయ్యది కౌరవులయెడ గ్రుద్ధంబును బాండవులందు బ్రీతంబునై యున్నది. తేజఃపుంజావభాసితం బగు నాచక్రంబువలననే బలంబులసారాసారంబు లెఱుంగఁబడును. మహాబలుం డగు మాధవుండు నరకుని శంబరుని గంసుని శిశుపాలుని నింకను ఘోరకష్టుల ననేకులను లీలామాత్రంబునన పరిమార్చె. పురుషోత్తముం డగు వాసుదేవుండు సంకల్పమాత్రంబున నీపృథివి నాకాశంబును స్వర్గంబునుగూడ నాత్మవశము గావించును. ఇంద్రియవశంబుగల యాతఁడే జగంబులన్నింటికి విశిష్టుండు. రాజా! నీవు పాండవులబలంబుల సారాసారంబులు పదేపదే యడుగుచున్నాఁడవుగావున దాని నిపుడు నేను సమగ్రంబుగ వచించెద. సావధానుండవై యాకర్ణింపుము. ఈచరాచరాత్మకం బగు సకలజగంబు నొకయెత్తు జనార్దనుం డొక్కయెత్తు. ఈరెండుపక్షముల బలాబలంబులరయుచో నెల్లజగంబులకంటె వాసుదేవుండే సారవత్తరుండై యున్నవాఁడు. జనార్దనుండు మనస్సంకల్పమాత్రంబున నీజగంబులన్నియు భస్మంబుగావింపంగలఁడు. జగంబులన్నియు నొక్కుమ్మడిగ వచ్చెనేనియు వాసుదేవుని దేఱిపాఱి చూడఁజాలవు. ఏయెడ సత్యంబు ధర్మంబు హ్రీయు నార్జవంబు నెడబాయకయుండునో యక్కడ సకలచరాచరశుభవిధాతయగు గోవిందుండు వసించియుండును. అతం డెక్కడనుండిన జయం బక్కడన యుండుట నిక్కము. జనార్దనుండు క్రీడాపరాయణత్వమునంబోలె పృథివ్యంతరిక్షంబులను దివంబును స్వస్వకార్యంబులందుఁ బ్రవర్తింపంజేయుచున్నాఁడు. ఆమహాత్ముండు ధర్మనిరతు లగు పాండవులను సత్రంబుగా నొనర్చి యధర్మనిరతులు మూఢులు నగు నీతనయుల దహింప నిచ్చగించుచున్నవాఁడు. ఆవాసుదేవుండే యాత్మయోగంబునఁ గాలచక్రంబును జగచ్చక్రంబును యుగచక్రంబును ద్రిప్పుచుండును. కాలంబునకు మృత్యువునకు స్థావరజంగమాత్మక మగు ప్రపంచమునకెల్ల నాతండే యధినాథుండై వెలుంగుచున్నవాఁడు. ఈయర్థంబు మిగుల సత్యమని యెఱుంగుము. సర్వజగంబునకుఁ బ్రభుండయ్యును ప్రాకృత మానవుండువోలెఁ దానును గర్మములఁగావింపుచుండును, అట్లు కర్మంబు

లాచరించుచు మాయాయోగంబునంజేసి లోకంబుల వంచించుచుండును. ఎవ్వారు సర్వవిధంబుల నా కేశవునే శరణుసొచ్చి సేవింతురో వారలంపజికి మోహంబు రావెఱచును.

అని పలుకుటయుఁ బ్రజ్ఞానేత్రుండు సంజయా! సర్వలోకమహేశ్వరుండగు వాసుదేవునితత్త్వంబు నీ వెట్లెఱుంగఁగల్గితివి? నే నెఱుంగఁజాలమి కేది హేతువు? ఈసంశయంబు నన్ను బాధించుచున్నది. కావున స్పష్టముగ వివరింపు మని యడిగెను. అంత సంజయుండు మరల నిట్లు వచించె. రాజా! నీవు విద్యాదూరుండవై యుంట వాసుదేవు నెఱుంగఁజాలవైతివి. నేను విద్యావంతుండను గావున నెప్పుడు నాతనితత్త్వంబు నాలోకించుచుందును. నీవు విద్యావిహీనుండవు తమోధ్వస్తుండవు నగుటంజేసి మధుసూదను నెఱుంగంజాలకున్నాఁడవు. నేనన్నో విద్యచే త్రియుగుండును గర్తయు నకర్తయు భూతంబులఁ బుట్టించి రక్షించి చంపువాఁడునగు మధుసూదను నెఱుంగఁగల్గుదు ననియె.

అంతట ధృతరాష్ట్రుండు సంజయా! నీవు నిత్యము జనార్దనునందుంచుభక్తి యెట్టిది? త్రియుగుండగు మధుసూదను నీవెట్లు తెలియఁగల్గితివని యడిగెను. సంజయుండు రాజా! నేనెన్నండును మాయను సేవింపను. వ్యర్థంబగుధర్మం బెన్నండు నాచరింపను. భక్తిచే శుద్ధభావంబునొందినవాఁడనై శాస్త్రవిచారంబువలన జనార్దను దెలిసికొనుచుందు నని వచించెను. అదివిని యాంబికేయుండు సుయోధనా! మనకాప్తుండగుసంజయుండు వచించువాక్యంబు లాలించితివికదా? నీవును హృషీకేశుని శరణుపొందుము. కేశవుని శరణుసొచ్చిన నాతం డభీప్సితంబులెల్ల సమకూర్చునని పల్కుటయు సుయోధనుండు తండ్రీ! భగవంతుండగు దేవకీనందనుండు లోకంబులఁ బరిమార్ప నిశ్చయించియేయున్నను నాతండు ధనంజయునకు హితుండగుట నే నాతని శరణొందఁజాల నని పలికె. అంత ధృతరాష్ట్రుండు గాంధారీ! నీతనయుండు సుదుర్మతియై వక్రంబుగఁ జరించుచున్నవాఁడు. వీఁడు ఈర్ష్యాళువు, దురాత్ముండు, అభిమానియునై యెవ్వరు చెప్పినను వినక పెద్దలమాటలు మీఱుచున్నవాఁడు. అని వచింప గాంధారరాజనందన సుయోధనుతోఁ బుత్రా! నీవైశ్వర్యంబు నాశించి దుష్టాత్ముండవగుచున్నాఁడవు. వృద్ధులశాసనంబులు తిరస్కరించుచున్నాఁడవు. ఐశ్వర్యంబు జీవితంబు నీజనకుని నన్నును

విడిచి బాలిశుండవై దుర్మార్గుల కానందముగూర్చుచు మాకు శోకంబు సమకూర్చుచు భీమసేననిహతుండవై పాలికలనఁ బడునప్పుడు నీజనకుని వాక్యంబులు తలంచుకొందువు అని పలికె. వ్యాసభట్టారకుండును ధృతరాష్ట్రా! నీవు కృష్ణునకు మిగులఁ బ్రియమైనవాఁడవు. నీకు సంజయుండు సందేశహారకుండై యున్నవాఁడు. ఈసంజయుండు నీకెల్లశ్రేయంబులు నందించును. ఈతండు పురాణుండు పరాత్పరుండు నగు హృషీకేశుని బాగుగ నెఱుంగును. వాసుదేవుండు తనకెవ్వ రేకాగ్రచిత్తంబున శుశ్రూషగావింతురు వారల కేభయంబులు రాకుండఁ గాచును. విచిత్రవీర్యాత్మజా! క్రోధహర్షసమన్వితులును కామమూఢులునై యెవ్వరు స్వకీయంబులగు ధనంబులనుపాశంబులఁ దగుల్కొని సంతోషించుచుందురో వారలు యమునకు వశులై సకలయాతనల ననుభవింతురు. ఒక గ్రుడ్డివాని చేయూఁతగాఁగొని యితరులగుగ్రుడ్డివారలెల్ల చనిచని కూపంబునంబడునట్లు మోహాంధు లొకరి ననుసరించి యొకరు సంసారాంధువునంగూలి నరకయాతన లనుభవింతురు. వాసుదేవుని దెలియుటన్నదో మనీషులెల్లరు నరుగునేకాయనంబగు సన్మార్గము. ఆమహాత్ము నాలోకించినమహాత్ముండు మృత్యువు నతిక్రమించును. వాఁడెంతయు బంధంబు లొందఁడని వచించె. అది విని ధృతరాష్ట్రుండు సంజయా! యే మార్గంబునఁ బ్రవర్తించిన హృషీకేశుఁ గాంచి యుత్తమంబగు సిద్ధి నొందఁగలనో యట్టియకుతోభయంబగు మార్గంబు నాకెఱింగింపు మనియె. అంత సంజయుండు రాజా! యకృతాత్ముండగుమానవుండు కృతాత్ముండగు జనార్దను నెన్నండు నెఱుంగంజాలకుండును. ఇంద్రియ నిగ్రహంబుకంటె నాత్మక్రియోపాయము వేఱొక్కటిలేదు. ఇంద్రియంబులనెల్ల జయించి కామంబులఁ బరిత్యజించిన వాసుదేవు నెఱుంగనగును. అప్రమాదము అహింసయు జ్ఞానంబునకుఁ గారణంబులైనవి. రాజా! నీవు మహాప్రయత్నంబున నింద్రియనిగ్రహంబు గావింపు. నీవెన్నఁడును దంద్రాళుండవుగాకుము. నీబుద్ధిని చ్యవనంబులేకుండ నిలుపుము. ఇట్టు లొనరించిన జ్ఞానంబు దలుగునని బ్రాహ్మణులు వచించుదురు. ఇంద్రియధారణంబుకంటె నుత్తమం బగుజ్ఞానసాధనం బెదియు నుండదు. ఇదియే జ్ఞానంబును ముక్తులగుమనీషు లరుగుమార్గము నని తెలియుము. ఇంద్రియనిగ్రహంబు గావింపనిమానవు లెప్పుడును గేశవుని దెలియఁ

జాలరు. ఇంద్రియవశంబుగలయోగి యోగమంబులవలనఁ బరతత్త్వం బెఱింగి తత్త్వంబునఁ బ్రమోదమందుచుండు నని వచించెను.

వాసుదేవనామనిర్వచనము

అదివిని యంబికాత్మజుండు సంజయా ! నాకు మరల నాపుండరీకాక్షునితత్త్వం బెఱింగింపుము. ఆతనినామంబులు కర్మంబులు నెఱింగి యాతని భజింతుననియె. అంత సంజయుండు రాజా ! వాసుదేవునిశుభం బగు నామనిర్వచనంబు నే వింటిని. నేను దానివలన నెఱింగినవిషయం బేదనఁ; గేశవుం డప్రమేయుండని, సర్వభూతంబులందును వసించుటం జేసి వాసుం డనంబడును. దేవతలకును యోని యగుట దేవుం డనం బరఁగు. ఈరెండుపదంబులవలన వాసుదేవుం డనుపేరు ప్రసిద్ధంబయ్యె. లోకంబులందెల్ల బృహద్రూపుండు గావున విష్ణుం డయ్యె. మౌనంబునను, ధ్యానంబునను, యోగంబునను మాధవు నెఱుంగుము. సర్వతత్త్వమయుండగుటచే మధుహంతయనియు, మధుసూదనుండనియుఁబ్రసిద్ధుం డయ్యె. కృషి యన భూమిణ యనునక్షరంబునకు నిర్వృతియని యర్థము. ఆరెండు శబ్దంబులయోగంబున కృష్ణుం డనంబడును. పుండరీకం బన నిత్యంబు నక్షయంబు పరంబు నగుధామంబు. తద్భావంబునఁ బుండరీకాక్షుండయ్యె. దస్యులకు సంత్రాసంబు గల్పించుటంజేసి జనార్దనుం డనంబడును. సత్త్వంబువలన చ్యవనం బొందమియు సత్త్వహీనంబు లేకుండుటయుఁ గారణంబులుగా సాత్వతుం డనఁజెల్లును. ఆర్షభుండగుట వలన బుషభేక్షణుండయ్యె. తల్లిగర్భంబువలన జనింపకుండుటవలన నజుండని చెప్పంబడును. దేవత లెల్లరు నాతనివలనఁ బ్రకాశించువారగుటంజేసి యాతనికి దామోదరుం డనునామంబు చెల్లును. హర్షంబునను సుఖంబునను సుఖైశ్వర్యంబువలనను హృషీకేశుం డనంబడును. భూమ్యంతరిక్షంబుల దనబాహుయుగళంబున భరించుటంజేసి మహాబాహుండనఁ బ్రసిద్ధుండయ్యె. ఎప్పుడును నధోక్షయంబు లేమింజేసి యధోక్షజుం డనునామంబు ప్రసిద్ధంబయ్యె. నరులకెల్ల గారణం బగుటం జేసి నారాయణుం డనం బ్రఖ్యాతినొందె. లోకంబులఁ బూరించుట చేతను సదనంబునను బురుషోత్తముండయ్యె. సత్తు నసత్తు నగుప్రపంచమునకుఁ బ్రభవుండు నంతకుండు నగుటయు సర్వంబు నెల్లపుడు నెఱింగి

పోషించుటయుఁ గారణంబులుగ నీతని మహర్షులు సర్వపదంబున వ్యవహరింతురు. కృష్ణుండు సత్యమందు నిలిచియున్నవాఁడు. అతనియందు సత్యంబు సుప్రతిష్ఠితమై యున్నది. సత్యంబుకంటెను సత్యం బగుటం జేసి గోవిందునకు సత్యం బని పేరును గలదు. విక్రమంబున విష్ణుదేవుం డనియు, జయంబువలన జిష్ణుం డనియు, శాశ్వతుండగుటవలన ననంతుం డనియు, గోవుల నెఱుంగుటం జేసి గోవిందుండనియు వాసుదేవుండు ప్రసిద్ధుం డయ్యె. అతత్త్వంబును దత్త్వంబుగాను, దత్త్వంబు నతత్త్వంబుగాను గావించుచునాతండు జగంబుల మోహితంబులు గావించుచుండును. భగవంతుం డిట్టివాఁడని చెప్పుట కెవ్వరికిఁ దరంబగును? ధర్మనిత్యుండగు మధుసూదనుం డానృశంస్యం బాశించి శాంతి గావించువాఁడై మనకడ కచిరకాలంబున వచ్చునుగదా? అప్పు డాతనిం గాంచి సంభాషణాదిపూజ లొనర్చి కృతార్థుండవు కాఁ గల వని వచించెను.

అది విని ధృతరాష్ట్రుండు ప్రహర్షపులకితాంగుండై యిట్లనియె. సంజయా! వాసుదేవుండు మనపాలి కేతెంచి సభాంగణంబున నున్నపు డాతని గన్నులారఁ గాంచుధన్యు లెంతటిభాగ్యవంతులోకదా? పరమం బగుదేహంబుచే వెలుంగుచు దిక్కులు బ్రదిక్కులు వెలింగింపుచునున్న యీజనార్దను గాంచుభాగ్యమునాకుఁ గలుగఁదయ్యెఁగా! పాండవులకుఁ బరమహితంబును సృంజయులకు సుఖాపాదకంబు లోభాభిభూతులకు గర్హణీయంబున నింద్యంబు ఆయువు చెల్లినమూఢుల కగ్రాహ్యరూపంబు నగువాక్యంబు నుచ్చరించు నావాసుదేవునిఁ జూచువార లెంతటి ధన్యులో! ఆతనిం జూచువారికన్నులే కన్నులు. ఇతరంబులు పుట్టబొరియలు. సముదయం బందుచున్నవాఁడు సాత్వతుండు, లోకైకవీరుండు, లోకనాయకుండు, యాదవప్రవరుండు, శాత్రవనిహంత, పరబలక్షోభణుండు, శాత్రవులయశంబుల గ్రసించువాఁడు నగుమధుసూదను నాలోకించు మహాత్ములభాగ్యంబునకుఁ గొలఁదికలదే? మహాత్ముండు, శత్రుహననుండు, మానవవరేణ్యుండునై యనృశంసరూపంబగు వాక్యంబు వలుకుచు నాతనయులమోహాకులులం గావించు వృష్ణివీరుని గౌరవులెల్లరు నాలోకింతురుగదా? ఆవాసుదేవుండు సనాతనతముండగు మహార్షిసత్తముండు, విపశ్చిదగ్రేసరుండు, వాక్యంబులకు సముద్రుండు, యతులకుఁ గలశప్రాయుండు, ఆతండ యరిష్టనేమి, గరుడుండు, సుపర్ణుండు,

హరియుఁ, బ్రజలకు భువనంబులకు నిలయంబై నవాఁడు, సహస్రశీర్షుండు, పురాణపురుషుండు, ఆదిమధ్యాంతరహితుండు, అనంతకీర్తిపరిశోభితుండు, శుక్రంబునకు ధాత, అజుండు, నిత్యుండు, పరాత్పరుండు నగు నాతనినే శరణంబు వేఁడెదను. త్రైలోక్యనిర్మాణకరుండు, దేవాసురులకు నాగరాక్షసులకు జననకారణంబును, నరాధిపులకును విద్వాంసులకుఁ బ్రధానుండు నగు నాయింద్రానుజుని శరణంబు వేఁడెద నని వచించి భక్తిపరాధీనమానసుండై వాసుదేవుని ధ్యానించుచుండె.

### ధర్మనందనుండు కృష్ణుని కౌరవులకడకుఁ బంపుట

సంజయుం డుపప్లావ్యంబు విడి హస్తిపురంబున కరిగినవెనుక ధర్మనందనుండు సర్వసాత్వతులకు నధినాథుం డగు దాశార్హు నాలోకించి వినయంబు నయంబు మెఱయ నిట్లనియె. మిత్రవత్సలుండ వగు వాసుదేవా! ఇదే మిత్రుల కనుకూలం బగుసమయం బాసన్నంబై యున్నది. ఈయాపత్సముద్రమునుండి మ మ్ముద్ధరించుటకు నీకంటె వేఱొకసమర్థుండు లేఁడు. మాధవా! నిన్ను సహాయునిగాఁ బొందియేకదా మోఘదర్పితుం డగు ధార్తరాష్ట్రుని వానిమంత్రులతోఁగూడ సమరంబునఁ బరిమార్చ నాశించుచుంటిమి. నీవు వృష్ణివీరుల కేయాపదలు బొరయకుండ నెట్లు రక్షింతువో యట్లే పాండవులనుగూడ నీభయంబువలనఁ గాపాడుము. అని పలుకుటయు వాసుదేవుండు ధర్మనందనా! ఇదే నేనెల్ల విధంబుల నీయర్థంబు గూర్పనున్నాఁడను. నీవు చెప్పఁదలంచినదాని నవిశంకంబుగం జెప్పుము. నీచెప్పినకార్యంబెల్లఁ గాదనక గావింతుననిపలికె. అంత యుధిష్ఠిరుం డిట్లు వచించె.

మాధవా! సంజయుండు నాతో నుడివినపలుకులన్నిటిని నీ వాలకించితివికదా? ఆమాటలవలన ధృతరాష్ట్రుండును నాతనితనయుండును జేయఁదలంచినకార్యంబెల్లఁ దెల్లమయ్యెఁగదా? దానివలన ధృతరాష్ట్రుని మతంబు విదితం బయ్యెఁగాదే. సంజయుఁడు విదృతాంతర మగు ధృతరాష్ట్రునియాత్మయని యెఱుంగ నగును. దూత యెన్నండును జెప్పిన మాటలన చెప్పునుగాని యితరంబు వలుకఁడు. ఇతరంబు వలికెనేని దప్పక వధ్యుం డగును. పాపుం డగునాలుబ్ధుండు దుష్టమగుమానసంబున జరించుచు నాతఁడు విషమం బాచరించుచు మాకు రాజ్యం బొసంగ

కయే మాశాంతిని వాంఛించుచున్నవాఁడు. ఆధృతరాష్ట్రుని శాసనంబు ననుసరించి పండ్రెండువత్సరంబు లరణ్యంబులందు నొక్కయే డజ్ఞాతంబుగను వసించి పడరానిబాధలు పడియుంటిమి. ధృతరాష్ట్రుండు ప్రతిజ్ఞ ననుసరించి వర్తించుసత్యసంధుం డని నమ్మి యాబాధ లనుభవించితిమి. మేము లేశమాత్రంబైనఁ బ్రతిజ్ఞ నతిక్రమింపలే దనుట బ్రాహ్మణులెల్లరు నెఱుంగుదురు. వృద్ధుండయ్యు రాజుగానుండియు ధృతరాష్ట్రుండు స్వధర్మం బాలోచింపకున్నవాఁడు. పుత్రవశంవదుండును పుత్రప్రేమబద్ధుండును నగుటం జేసి మందుం డగు సుయోధను ననుసరించుచున్నవాఁడు ఆతండు సుయోధనునభిమతం బనుసరించుచు లోభాకృష్టచిత్తుండై తనకుఁ బ్రియంబును మాకు నహితంబు నాచరించుచున్నవాఁడు. నేను దుపకు నాజననికిఁగాని మిత్రులకుఁగాని సుఖంబు చేయఁజాలనైతిని. మాధవా! ఇంతకంటెను దుఃఖతరం బేమికల్గును? కాశిరాజులు చేదిభూనాథులు పాంచాలనరపతులుమత్స్యమహీధవులు నీవును మాకుఁ బ్రాపైయున్నను అవిస్థలము వృకస్థలము మాకంది వారణావతమునను నాల్గుగ్రామంబులును నేనవదేదే నొక్కటియుఁగలిపి యైదుగ్రామంబులుమాత్రమే నే నడిగితిని మాకైదుగుర కైదునగరంబులుగా నీయైదుగ్రామంబులుగాని యిమ్మని ప్రార్థించితి. మన మెల్లరము నశింపకుండ మే మాయైదుగ్రామంబులందు వసింతు మని జెప్పితిని. దుష్టాత్ముం డగు ధార్తరాష్ట్రుం డాయైదుగ్రామంబులనేనిచ్చుట కిష్టము జూపకున్నవాఁడు. వాఁడు కేవలము తాన యీపృథివికెల్ల నాథుండ నని తలంచుకొనుచు మాకీస్వల్పగ్రామంబులనే నియ్యకుండుటకంటెను దుఃఖతరం బేది కలదు? సత్కులసంజాతుం డయ్యుఁ వృద్ధుండయ్యుఁ బరవిత్తములం దత్యాశగొనియెనేని వానిలోభంబు ప్రజ్ఞానమును హరించును ప్రజ్ఞ హతంబయ్యెనేని హ్రీనాశమొందును. హ్రీవినష్టం బగుడు ధర్మంబు భంగమొందును. ధర్మభంగంబున సిరి నశించును. సిరి నశించిన పురుషుండు సర్వనాశమొందును. పురుషునకు దారిద్ర్యముకంటె వేరువధంబు లేదు గదా? నిర్ధనుండగుపురుషుని జ్ఞాతులు, మిత్రులును, పూవులు పండ్లులేని వృక్షంబును విడిచిచను పక్షులవలె విడచిపోవుదురు. కావున దారిద్ర్యమే మరణమని యంటిని. ఉన్మత్తుని బతితుని గతప్రాణుని విడచినట్లు నిర్ధనుండగుపురుషుని విడిచి జ్ఞాతులు తొలఁగిపోవుదురు. నిర్ధనత్వంబుకంటెఁ

బాపీయంబగు నవస్థలే దని శంబరుండు మున్న నుడివియుండెను. నిర్ధను నింట ప్రాతగకాలమందుఁగాని మధ్యాహ్నకాలమందుఁగాని భోజనంబు గొనరాదుగదా? కావుననే ధనము పరమం బగుధర్మం బనియు, ధనము నందె యెల్లలోకంబులు ప్రతిష్ఠితంబులై యున్న వనియుఁ జెప్పుదురు. లోకంబున ధనవంతునిజీవితమే జీవితము. నిర్ధనులగుమానవులు హతు లనియే వ్యవహరింపంబడుదురు. ఎవ్వ రేనొక్కమానవునిధనంబు నప కర్షించిరేని వారు తమబలంబువలన నామానవునిధర్మంబు నర్థంబుఁ గామంబును దుద కానరునిగూడ మథించినవా రగుదురు. ఈనిర్ధనా వస్థనొంది కొందఱు మరణంబునుగూడ వరించియుండిరి. కొందఱు గ్రామంబులకుఁ గొందఱు నాశంబునకుఁ గొందఱు గాననంబులకు నీ దారిద్ర్యమనుభవింపలేక చనిరి. కొందఱు దారిద్ర్యంబువలన నున్మాదము నొందుదురు. కొందఱు శత్రువశంబునొంది దాస్యంబు నెఱపుదురు. దారిద్ర్యము పురుషునకు మరణముకంటె నధికతర మగు నాపదయే యైయున్నది. పురుషునకు ధర్మకామనిమిత్తంబు ధనమేకదా? పురుషు నకు మరణంబు తప్పని సరియగుట లోకమార్గంబై యున్నది. సకల భూతంబులకును మరణంబు శాశ్వతంబై యనతిక్రమణీయంబైనది. కృష్ణా! ప్రకృతిచే నిర్ధనుఁడగు మానవున కంతగా బాధలు కలుగకుం డును. భద్రం బగుసిరి ననుభవించి పెద్దకాలంబు సుఖంబుగ వృద్ధినొందిన వానికి దారిద్ర్యము సంభవించినచో వానిబాధలు చెప్పఁదరముగానివై యుండును. వాఁడు తనయపరాధంబున నైశ్వర్యంబు గోల్పడియు మహా వ్యసనంబులందియింద్రుండు మొదలగు దేవతల నిందించునేకాని తనకుఁ దానే దారిద్ర్యప్రదాతయని తెలిసి తన్ను తాను నిందించుకొనఁడు. వానిని మంచిమార్గంబునఁ బ్రవర్తింపఁజేయుటకు సకలశాస్త్రంబులును సమర్థములు గాఁజాలవు. వాఁ డెప్పుడును భృత్యులయెడఁ గోపంబువహిం చును. మిత్రులయం దసూయ కలిగియుండును. వానికి మాటిమాటికి మన్యువు జనించుచుండును. మన్యువశంబున మఱియు మూఢుం డగును. మోహాదశాపన్నుండగు వాడించుకయు సంకోచించక క్రూరకార్యంబు లాచరింపఁగడంగును. పాపకర్మాభిరతుండగువానిచే సంకరము పోషింపఁ బడును. సంకరంబువలన నరకంబు ప్రాపించును. పాపాత్ములకెల్ల నర కమే పరాకాష్ఠ యగును. పురుషుండు మంచిచెడ్డల బాగుగఁ దెలియ

కున్నచో నరకంబుపాలగును. వాఁడు ప్రబోధము గలిగియుండుటయే ప్రజ్ఞయే. ఎవ్వాఁడు ప్రజ్ఞచేఁ బాగుగఁ దెలియునో, వాఁడెల్లసంకటము లను దరించి సుఖింపఁగల్గును. ప్రజ్ఞాలాభంబున బురుషుండు శాస్త్రంబు లనే యాలోచించుచుండును. శాస్త్రనిష్ఠగలవాఁడు ధర్మంబునే తప్పక యాచరించుచుండును. వానికి హ్రీయుత్తమంబగు నంగంబై యుండును. హ్రీమంతుం డెల్లపుడును బాపంబును ద్వేషించును. వానికి సంపద లభి వృద్ధంబులగును. వాఁడెంతకాలంబు శ్రీమంతుండై యుండునంతకాలంబు ధర్మనిత్యుండై యుండును. వాఁడు ప్రశాంతాత్ముండు కార్యయోగ వహుండునై యెల్లప్పుడును సుఖించుచుండును. వాఁడొకప్పుడును నధర్మ మునందు బుద్ధి చొఱనీయకుండును. పాపకార్యంబు లెన్నండు నాచ రింపఁడు. హ్రీహీనులకును విమూఢచిత్తులకును స్త్రీకైనను బురుషున కైనను శూద్రునకుంబోలె ధర్మంబునం దధికారంబు లేదు. హ్రీమం తుండు దేవతలను బితరులను నమస్కరించి భజించుచుండును. వాని కాత్మసాక్షాత్కారం బలవడును. దానివలన నాతఁ డమృతత్వమ్ము నొంది కీర్తిఁగాంచును. పుణ్యకార్యంబు లాచరించువారి కిదియ పరమ ప్రాప్యంబై యున్నది. ఈయర్థంబు నాయందు నీ వాలోకించితివి కదా? నేను రాజ్యంబువలన బరిభ్రష్టుండనై దుఃఖంబు లగు నెట్టియవస్థ లను భవించుచున్నాఁడనో నీకుఁ దెలియునుగదా? కావున మేము న్యాయం బగుమార్గంబున మాకు రాఁదగినసిరి నేకారణంబులఁజేనైనను విడువ నొల్లము. మాసిరికై మేము ప్రయత్నించునపుడు మాకు వధంబైనను నుత్తమంబే యగును అందు మేమును గౌరవులును బ్రశాంతులమై సమవృత్తి నెల్లసంపదల నొంది సుఖించుట యుత్తమంబమగుపక్షము. మేముబలంబు మెఱసి కౌరవులనెల్ల సంహరించి యారాజ్యంబులెల్ల స్వాయత్తంబు గావించుకొనుట రౌద్రకర్మక్షయోదయం బగు నధమ పక్షంబు. కృష్ణా! అనార్యులు అసంబద్ధులనగుశత్రువులనేని వధింపఁ గూడదనుచో మాకు సంబంధులకువీరిని సంహరించు టధమపక్షంబు గాకుండునా? కౌరవులు మనకు జ్ఞాతులు. వారియెడ నున్నవారనేకులు మాకు సహాయులును గురువులునై యున్నారు. వారలఁ బరిమార్చు టత్యంతపాపిష్ఠకార్యంబు. యుద్ధంబున శుభం బేమి కలుగును? మొట్ట మొదట క్షత్రియధర్మంబే పరమపాపిష్ఠంబైనది. మే మున్ననో క్షత్రి

యులమై యున్నారము. ధర్మంబైన నధర్మంబైనను మాకు క్షత్త్రధర్మంబె గాపలయును. ఇతరంబగువృత్తి నాలంబించుట మిగుల గర్హ్యం బగును. శూద్రుండు శుశ్రూష గావించుట, వైశ్యుండు క్రయవిక్రయవ్యాపారంబు నెఱపుట, క్షత్త్రియులు వధంబున జీవించుట, కపాలంబు బూని భిక్షాచరణంబు బ్రాహ్మణులకును బరమ ధర్మంబులై యున్నవి. క్షత్త్రియుండు క్షత్త్రియుల వధించుట, మత్స్యంబు మత్స్యముల గ్రసించి జీవించుట, శ్వానంబు శ్వానంబును వధించుటయు నా యాజంతువులకు సహజం బగుధర్మంబులై యున్నవి. కృష్ణా! యుద్ధంబునందు నిత్యమై కలియుండును. సంయుగంబునఁ బ్రాణంబులు నశించును. బలంబును నీతిని నాధారముగా గొని జయంబు పరాజయంబు గల్గుచుండును. భూతంబులకెల్ల నాత్మేచ్ఛానుసారంబుగ జీవితంబుగాని మరణంబుగాని సంభవింపనేరవు. అకాలంబున సుఖంబేని దుఃఖంబేని దుష్ప్రాపంబగును. ఒక్కండే పలువుర వధించుచుండుటయుఁ, బలువు రేకీభవించి యొక్కని వధించుచుండుటయు లోకప్రసిద్ధంబులై యున్నవి. కాపురుషుండు శూరుని వధింపఁ గల్గును. కీర్తిహీనుండు సత్కీర్తిశోభితుని వధించును. ఎప్పుడు నిరువురకును జయంబు గలుగదు. పరాజయంబు గూడ నిరువురకు సంభవింపదు. ఒక్కఁడు జయించుటయు నొక్కఁడు పరాజయం బొందుటయు యుద్ధమర్యాదయై యున్నది. పరాజయంబు మరణంబుకంటె నధికం బని నే తలంచెద. విజయమందినవానికి నైత మపచయంబు తప్పని సరియే యై యున్నది. కొందఱు మానవులు తుదకుఁ దమకు హితు లగువారిని గూడ వధింతురు. పుత్త్రులను భ్రాతలను వధించి దుర్బలుం డై యున్న వాఁడు విజయ మొందినను నచిరంబునన శత్రువశంబునొందక మానఁడు. వానికి జీవితంబునం దెల్లవేళల నిర్వేదంబు జనించుచుండును. ఎవ్వరు ధీరులు హ్రీమంతులు కరుణావేదులు నార్యులునై కీర్తిగాంతురో యట్టి వారే తప్పక వధింపఁ బడుచుందురు. అల్పమానవులు విడవఁ బడుదురు. కావున శాత్రవుల వధించినను నిత్యంబున బశ్చాత్తాపంబున సుఖంబు దుర్లభం బగును. ఇంకను యుద్ధంబువలన గలుగుపాపం బొక్కయును బంధంబై విడువక యనుసరించి వర్తించుచుండును. మఱియు నెవ్వఁడో యొకండు మిగిలియుండును. హతశేషుం డగువాఁడు బలంబు నాపాదించి కొని యెల్లరు నిశ్శేషం బగునట్లు సంహరించును. మఱియు వాఁడు

వైరంబు నంతంబొందించుటకై సర్వనాశంబు గావించుటకుఁ బ్రయత్నించును. జయంబువలన వైరంబు వృద్ధం బగును. పరాజయం బందినవాఁడు దుఃఖంబు ననుభవించును. కావున జయపరాజయములు రెంటను సుఖం బుండదు. ప్రశాంతచిత్తుండు జయపరాజయంబులు రెంటిని విసర్జించి సుఖంబుగ నిద్రించును. జాతవైరుం డగుపురుషునకు సుఖనిద్ర యెన్నండును గలుగదు. పామున్నయింటిలో నివసించుమాడ్కి వాని మనం బెప్పుడును సుఖం బెఱుంగక యుండును. ఎవ్వఁడు సర్వనాశంబు గావించునో వానికిఁ గీర్తి నశించును. వాని యపకీర్తిని సర్వభూతంబులు నుద్ఘోషించు చుండును. వైరంబు లెంతకాలంబు ధరింపఁబడియు నుపశమించుట చూడము. కులంబునఁ బురుషుం డుండెనేని వానికి హితోపదేష్టలును లభింతురు. కేశవా! వైరంబుచేత వైరం బెన్నఁడును జల్లారదు. అగ్నియందు హవిస్సు వ్రేల్చిన నగ్ని యెట్లు ప్రజ్వలించుచుండునో యట్లే వైరంబున వైరంబు పెంపొందునేకాని యొకప్పుడును నశింపదు. వైరంబు గలవారి కెన్నండును శాంతి లభింపదు. వారు నిత్యంబు నంతరంబుల నన్వేషించుచునే యుందురు. అంతరాన్వేషణపరాయణుల కెన్నండు నీదోషంబు దుర్నివారంబై యుండును. పురుషకృతం బగుమనోవ్యాధి యెక్కుడు బలీయం బై నిత్యంబు హృదయమును దహించుచుండును. కావున దానిని వీడుటవలననొండె, మరణంబుననొండె శాంతి లభించునుగాని వేఱువిధంబున శాంతి చేకూరదు. శాత్రవులనెల్ల నొక్కఁడు మిగులకుండ మూలంబు పెఱికివేసినను శాంతి లభించును. మాధవా! ఫలనివృత్తి యెప్పుడును వృద్ధివలనఁ గలుగవలయునే కాని నృశంసతరం బై యుండరాదు. త్యాగంబువలనఁ గలుగుశాంతియే యుత్తమశాంతి యనంబడును. త్యాగంబులేనిశాంతి వధంబే యగును. విజయంబు సంశయం బగుటను శాత్రవులకును మాకునుగూడ సముచ్ఛేదం బవశ్యంభావియగుటను మేము శమంబు విడువఁజాలము. కులక్షయంబునకు మే మంగీకరింపఁ జాలము. ఎల్లభంగులఁ బ్రయత్నంబు లొనరించి యుద్ధంబు నాకాంక్షింపనున్న మాకుఁ బ్రణిపాతంబుననే శాంతికలుగునదియే యుత్తమశాంతి యగును. సాంత్వం బెప్పుడు ప్రతిహతం బగునప్పుడు యుద్ధంబు సిద్ధమైయేయున్నది. అప్పుడు పరాక్రమింపక విడుచుట లోకవిరుద్ధ మగును. సామమార్గంబును బ్రతిహతంబు

గాపించుచో దారుణంబు సంభవింపక తీఱదు. కుక్కలు పోరాడునెడం గల్గు దారుణ ఫలితంబునుంబోలెఁ బండితులు యుద్ధంబు నిందింతురు. తోఁకలాడించుట, మొఱుగుట, ప్రతివాక్యంబులు నొండొరుల మీఱుట, పండ్లు పటపట గొఱుకుట, యిగిలించుటయు కుక్కరంబుల పోరాటమందు సంభవించును. వానిలో నేది బలవంతమో యది యితరంబుల జయించి యామిషంబు భుజించును. మనుష్యుల యుద్ధంబునందు నీచెప్పంబడిన వికృతకార్యంబులన్నియు సంభవించును గాని విశేషం బేమియు నుండదు. బలవంతులకు దుర్బలులయెడ ననాదరంబును విరోధంబును నెల్లభంగుల సిద్ధంబై యుండును. ప్రణిపాతవంతుఁ డెప్పుడును దుర్బలుండుగా నాలోచింపం బడును. తండ్రియు రాజును వృద్ధుండును నెల్లవేళలఁ బూజ్యులు. ఆహేతువున ధృతరాష్ట్రుండు మాకు మాన్యుండును బుణ్యుండు నై యున్నవాఁడు. ధృతరాష్ట్రునకన్నను పుత్రస్నేహం బత్యధికం బై యున్నది. అతండు తనపుత్త్రునకు వశమై మా ప్రణిపాతంబును నిరాదరించును. కావున నీసమయంబున మేము చేయఁదగు కార్యం బేదియో తెలుపుము. మే మర్థంబునను ధర్మంబునను హీనులము గాకుండవలయును. ఇట్టి చిక్కు కార్యంబులందు నీకంటెను మేలగువాని నెవ్వని నే నడుగఁగలను? నీవు మాకెల్లవిధంబులఁ బ్రియుండవు. ఎప్పుడును మాప్రియంబ కోరువాఁడవు. సర్వకార్యంబులగతులు నీవు చక్క నెఱుంగుదువు. సర్వనిశ్చయంబులతత్త్వం బెఱింగిన నీవంటివాఁడు మాకితరుఁ డెవఁడుగలఁడు? కావున నీవ యిప్పుడు మే మాచరింపవలసినకార్యంబు తెలుపుమని యడిగె.

ధర్మనందనుం డట్లడుగుటయుఁ బుండరీకాక్షుండు ధర్మనందనున కిట్లనియె. రాజా! మీరుభయులు నాకు సమానులై యున్నారు. మీ యిరువురశ్రేయంబు సమకూర్ప నేను గౌరవులపాలి కరిగెదను. మీ యర్థంబునకు భంగంబు రాకుండ నాసభయందుఁ గౌరవులకు శాంతిగలిగించితినేని నాకు విశేషం బగుపుణ్యంబు లభించును. నాప్రవర్తనమునకు మహాఫలంబు చేకూఱును. మృత్యుపాశావపాశితు లగు కౌరవులను సృంజయులను బాండవులను ధార్తరాష్ట్రులను వీరువారననేల నీ భూమండలంబునెల్ల మృత్యుపాశంబులనుండి తప్పించినవాఁడ నగుదునని వచించె. అదివిని ధర్మనందనుండు కృష్ణా! నీవు కౌరవులకడ కరుగుట

నాకింతయు నభిమతంబు గాదు. సుయోధనుండు లేశమాత్రంబైన నీ సాక్ష్యంబు నాదరించి సన్మార్గము నకు రాడు. అక్కడ కూడినరాజలోకం బెల్ల దుర్యోధనవశం బై వానియాజ్ఞ నెఱవేర్ప సిద్ధంబుగా నున్నది. దుర్మార్గు లగువారలమధ్యంబునకు నీవరుగుట నాకెంతమాత్రము నిష్టంబు గాదు. నీకిసుమంతయేని బాధ కలుగునెడ మాకు ద్రవ్యంబుగాని దేవత్వంబుగాని సుఖంబుగాని దివవకు సర్వామరాధిపత్యంబుగాని ప్రీతికరంబు గాదు. కావున నీవక్కడకు వెళ్లవలదని పలికె. ఆమాటలాలించి శ్రీకృష్ణుండు ధర్మనందనుతో నిట్లు వచించె. యుధిష్ఠిరా! దుర్మార్గుం డగు దుర్యోధనుని పాపాచరణంబు నేనెఱుంగుదును. అయినను మనము ముందుగ శమంబునకై ప్రయత్నింపనిచో లోకంబున రాజలోకం బెల్ల మనల నిందించును. సకలపార్థివులు నొక్కటియైనను నాకు సరిరారు. సింగంబునెదుట మృగంబులు నిలువలేనట్లు సంగరంబున నాయెదుట రాజులెవ్వరు నిలువంజాలరు. నాసంగతి వారెల్లరు నెఱుంగుదురు గావున నట్టిపాపచింత నాలోచింపకనే యుందురు. ఒకప్పుడు వారట్టి దుర్బుద్ధిచే నా కేదైనం గీడుగావింపం దలంచిరయేని నాక్షణంబ కౌరవుల నెల్ల నిర్దహించివైచెదను. పృథానందనా! నే నక్కడ కరుగుట యెప్పుడును నిరర్థకంబు కాంజాలదు. పెక్కుభంగుల మన కర్థప్రాప్తియే చేకుఱును. కాకున్న చివఱకు నవాచ్యత్వమైనను సిద్ధించును. కావున నే నెల్లవిధంబుల నక్కడ కరుగుటయే యుచితం బని వచించె. అపుడు యమనందనుండు మరల నిట్లనియె. కృష్ణా! నీకు రుచించినదానిని గాదనుటకు నే నెంతటివాఁడను? భద్రంబుగఁ గౌరవులపాలి కరుగుము. కార్యంబు నెఱవేర్చి స్వస్తిమంతుండవై నీవు తిరిగిరమ్ము. నీవు కౌరవుల పాలి కరిగి వారల కెల్లభంగుల శమంబు గలిగింపుము. మేమెల్లరము నన్యోన్యవైరంబులు విడిచి స్నేహంబున సుఖించునట్లుచేయుట నీయధీనంబై యున్నది. నీవు మాకు సోదరుండవు. అర్జునునకు నెచ్చెలివి. మాకెల్లరకును బ్రియతముండవు. సౌహార్దంబు పెంపున నీయందు మాకు విశంక లేశమాత్రంబును లేదు. నీవు శుభంబుగ మాయర్థంబు సంపాదింపుము. నీవు మమ్ములను బరులను సకలార్థంబులును సంభాషణౌచిత్యంబును బాగుగ నెఱుంగుదువు. మాకెల్లరకు నేయది హితంబగునో యదియెల్ల నీవు సుయోధనుకడ నాడుము. ఏయది ధర్మోప

పన్నంబు మాకు హితంబు నగునో దానినెల్ల వచింపుము. నీయిచ్చవచ్చి నట్లుగ సమయంబు ననుసరించి సాంత్వంబుగాని భీషణంబుగాని పలుకుము. ఇట్లు పలుకుమని నీకు బోధింప నే నెవండను? నీవ యెల్లయర్థంబులు సిద్ధంబు గావించుకొని సభంబున కమ్మనియె.

## కృష్ణుండు యుధిష్ఠిరునకుఁ దనయభిమతం బెఱింగించుట

అంతట ధర్మనందనునితో జనార్దనుండు మరల నిట్లనియె. ధర్మనందనా! సంజయునివాక్యంబు వింటిని. నీ వాతని కెఱింగించినమాటలు కూడ నాలించితిని. నీయొక్కయు వారలయొక్కయు నభిప్రాయంబులు చక్కఁగ నెఱింగితిని. నీబుద్ధి ధర్మంబు నాశ్రయించియున్నది. వారలమనంబుల వైరంబు నాశ్రయించియున్నవి. యుద్ధంబు గావింపకుండ శాంతిమార్గంబున నేమిలభించినను నదియ నీకు బహుమతం బగును. కాని యిది క్షత్రియునకు నైష్ఠికం బగుకర్మంబుగాదు. ఋషులెల్లరును క్షత్రియుం డెన్నండును భైక్షం బాచరింపరాదని తెలుపుదురు. క్షత్రియునకు సంగ్రామంబున విజయంబైనను వధంబైనను విధాతృనిచే నిర్దేశింపఁబడిన సనాతనం బగు ధర్మము. క్షత్రియున కిదియ స్వధర్మంబు. కృపణవృత్తి యాతని కెందు నుచితంబుగాదు. యుధిష్ఠిరా! కార్పణ్యంబు నాశ్రయించుటచే జీవించుటయే దుర్లభం బగును. ధార్తరాష్ట్రులు అత్యాశాపరులు. ఇతరులతో బాగుగ స్నేహముచేసినవారు. దీర్ఘకాలసహవాసమువలన మిత్రసంగ్రహంబు బాగుగఁ గావించుకొనియున్నవారు. వారికి బలమధికంబుగఁ గలదు. కావున వారలు నీతోడి సామ్యంబు నొందునట్లు గావింప నుపాయం బేదియును లేదు. భీష్మద్రోణకృపాదులు వారిపక్షంబున నుండుటం జేసి వారధికబలవంతులమని గర్వించుచున్నవారు. నీవు వారలను మార్దవంబున నెంతకాల ముపచరింతువో యంతకాలము వారు నీరాజ్య మపహరించి యనుభవించుచునే యుందురు. అనుక్రోశంబునంగాని కార్పణ్యంబునంగాని ధర్మార్థంబుల కారణంబునంగాని ధార్తరాష్ట్రులు నీవాంఛితంబు నీడేర్పరు. ఇదియకారణంబుగా ధార్తరాష్ట్రుండు కోపంబున నీయెడ దుష్కరాపకారంబు గావించియు నిసుమంతయేని పశ్చాత్తాప మొందకయున్నవాఁడు. పితామహుండు ద్రోణుండు విదురుండును బ్రాహ్మణులు సాధువ్యాపారము గల

కడకు నేమంగుల కడను నిశాముఖంబులందు మృగంబులును విహంగం బులును ఘోరంబు లగునాదంబులు గావించుచున్నవి. మఱియు నగ్ని వర్ణంబులు బహుఘోరంబులు నగు ననేకంబు లగురూపంబు లగపడు చున్నవి. ఈఘోరంబులు మనుష్యలోకక్షయంబుగావించును. అంతకుం డీరూపంబున వచ్చెనని యే తలంపనగును. శస్త్రంబులు యంత్రంబులు కవచంబులు రథంబులు గజంబులు తురంగంబులును మనకు యుద్ధం బాసన్నం బయ్యెనని సూచించుచున్నవి. నీ యోధులెల్లరు యుద్ధంబు నకుఁ గృతనిశ్చయులై యేనుంగులు గుఱ్ఱంబులు రథంబులును నాయత్తం బులు గావించికొని యుందురుగాక. నీవును సంగ్రామంబునకు వలయు సకలసన్నాహంబులు నాచరింపుము. నీవు తొల్లి యనుభవించియు ద్యూతంబున నోడిన సమృద్ధం బగు రాజ్యంబును దుర్యోధనుండు జీవించి యుండునంతవఱకు నీ కీయమి నిశ్చయంబు. కావున వలసిన సన్నాహం బాచరింపు మని వచించె.

## భీముండు శాంతి కూర్పు మని కృష్ణునితోఁ జెప్పుట

అట్లు జనార్దనుండు పలుకుటయు భీమసేనుండు కృష్ణునితో 'కృష్ణా! నీవు కౌరవులసభ కరుగు టెంతయు సముచితం బైయున్నది. నీ వక్కడి కరిగి యెల్లరాజులు నాకర్ణింప సుయోధనునితో నెట్లయినను శాంతికలుగునట్లు సామవచనంబులు పలుకుము. వానిని యుద్ధముమాట చెప్పి భయపఱుపకుము. అమర్షణుండు జాతసంరంభుండు శ్రేయోద్వేషి మహామానియు నగుసుయోధనునికడ సామవాక్యంబులే పలుకఁదగును. వాఁడు స్వభావమునఁ బాపసత్త్వుండు. దస్యులతో సమానంబగుచిత్తంబు గలవాఁడు. ఐశ్వర్యమదోన్మత్తుండు, పాండవులకు మహావైరంబు గావిం చినవాఁడు, దీర్ఘాలోచనము లేనివాఁడు, నిష్ఠురాలాపనిరతుండు, పెద్దల నాక్షేపించువాఁడు, క్రూరపరాక్రముండు, దీర్ఘక్రోధుండు, వినయంబు నకు దూరమైనవాఁడు, పాపాత్ముండు, నికృతిపరాయణుండును నగుటం జేసి చావునకైన నంగీకరించునుగాని తనపట్టినపట్టు వీడుట కంగీకరిం పఁడు. అట్టి దుర్మార్గునితో శమంబు పరమదుష్కరం బని తలంచెదను. స్నేహితులకును గర్హణీయుఁడు. ధర్మత్యాగి, యనృతప్రియుఁడు నగు వాఁడు హితులవాక్యంబులను మనంబులనుగూడ నిరాకరించును.

వాఁడు మనుష్యలోకంగతుండును దుస్స్వభావుండు నగుటంజేసి స్వభావంబు వలననే వాఁడు పాపంబు నాచరించు చుండును. తృణంబులచేఁ గప్పఁబడినపామువోలె వాఁడెప్పుడును క్రూరకార్యంబు నాచరించుటకే ప్రయత్నించును. దుర్యోధనునిసైన్యమును, శీలము, స్వభావము, బలము, పరాక్రమమును నీవు బాగుగ నెఱింగినవాఁడవుకదా? మున్ను గౌరవుల మగు మే మెల్లరము బుత్త్రమిత్త్రాదులతోఁ గూడి దేవతలవలె సంతసించుచుండి యుంటిమి. అట్టికౌరవు లిపుడు వేసవికాలంబునఁ గార్చిచ్చుచే నడవులు కాల్పఁబడునట్లు దుర్యోధనుని క్రోధంబుచే దహింపఁబడుచున్నవారు. సుహృదులతోడను బంధువులతోడను జ్ఞాతులనెల్ల సముచ్ఛేదంబుగావింప రాజులు పదునెనమండ్రుగలరు. అసురంబులగు తేజంబులు సమృద్ధంబులై వెలుంగుచున్నవో యన ధర్మంబు నవసానకాలంబునఁ గలి జనించినది. హైహయులలో నుదావర్తుండు, నీపులలో జనమేజయుండు, తాళజంఘులలో బహుళుండు, కృమికులులలో నుద్ధతుం డగువసువు, సువీరులలో నజబిందుండు, సురాష్ట్రులలో రుషర్ధికుఁడు, బలీహులందు అర్కజుండు, చీనులందు ధౌతమూలకుండు, విదేహులందు హయగ్రీవుండు, మహౌజసులందు వరయుండు, సుందరవంశులందు బాహుండు, దీప్తాక్షులందు పురూరవుండు, చేదిమత్స్యుల సహజుండు, ప్రవీరులందు వృషభధ్వజుండు, చంద్రవత్సులందు ధారణుండు, ముకుటులందు విగాహనుండు, నందివేగులందు సముండు నను రాజు లుద్భవించి జ్ఞాతిసుహృద్బంధు సముచ్ఛేదంబు గావించిరి. కులపాంసను లగు నీయధమపురుషులు యుగాంతమునందు జనించియుండిరి. నీచకర్ముండు పాపచరితుండు నగు దుర్యోధనుండును మాకులంబున యుగాంతమున సంభవించిన కులాంగారమై యుండనోపును. కావునను దురాత్మునికడఁ బరుషంబులాడక మెల్ల మెల్లగ మృదువచనంబులు పలుకవలయును. ఉగ్రపరాక్రముండగు వానికడ నుగ్రంబులు వలుకక ధర్మార్థసంహితంబులు కామానుబంధబహుళంబులు నగువాక్యంబు లాడం దగును. కృష్ణా! మాభరతాన్వయంబునకు రానున్ననాశము నివారింప మేమెల్లరము నాదురాత్ముని కధశ్చరులమై వినతులమై వాని ననుసరింతుము. మాధవా! మాకుఁ గౌరవులతో నుదాసీనవృత్తియైన గలుగునట్లు కార్యంబు నెఱవేర్పుము. కురుకులంబున నొక్కయాపద వాటిల్లకుండున ట్లెల్లభంగుల నాలోచింపుము.

వృద్ధుం డగుపితామహునితోడను వానిసభాసదులెల్లరతోడను ప్రాణులెల్లరకును సౌహృదంబు పెంపొందవలయుననియు ధార్తరాష్ట్రుఁడు ప్రశాంతుఁడు గావలయుననియు వచింపుము. నేనిట్లు శాంతికోరుచున్నవాఁడను. ధర్మాత్మజుండును శాంతినే ప్రశంసించుచున్నవాఁడు. అర్జునుండును యుద్ధంబు నాశంసింపలేదు. అర్జునుండు మిక్కిలి దయార్ద్రహృదయుండుకదా?'

## కృష్ణుండు భీమసేనున కుత్తేజనంబు గలిగించుట

అట్లు భీమసేనుండు వచింప నాలించి మహాబాహుం డగు వాసుదేవుండు మిగుల నాశ్చర్యాధీనమానసుం డయ్యె. భీమసేనునం దిట్టి మార్దవోపహతం బగు వాక్యం బింతకు మున్నెన్నండును వినం బడలేదు. అతఁడట్లు మృదువాక్యంబులు పలుకుట కొండలు చులుకనయైనట్లును పావకుండు శీతలస్పర్శుం డైనట్లును గృష్ణుండు తలంచెను. గాలి యగ్ని నభివృద్ధంబు గావించినట్లు కేశవుండు వృకోదరు నుత్తేజింపఁజేయుచు మహాతీవ్రంబు లగువాక్యంబుల నిట్లు పలికె. భీమసేనా! నీవెల్లపుడును యుద్ధంబునే ప్రశంసించువాఁడవయ్యు నిపు డిట్లేల దయార్ద్రహృదయుం డవై మెత్తనిమాట లంటివి? వధాభినందు లగుధార్తరాష్ట్రుల మర్దించుటయేకదా నీకెప్పుడు నభిమతం బగునది? నీవు దుర్యోధనునందలి కోపంబున నిద్రవోందక మెలకువగొనక మోఁకాళులపై శిరంబిడి యెల్లపుడు చింతించు చుండువాఁడవుకాదే? ఎప్పుడును ఘోరంబు నమంగళంబు నశాంతంబు నగువాక్యంబులు పలుకువాఁడవు. ఎప్పుడు నగ్నివలె వేడి యగునిట్టూర్పు విడచుచు స్వకీయం బగుతేజంబుననే సంతప్తుండవై యప్రశాంతమనస్కుండవై సధూమం బగుననలంబువోలెనుండు వాఁడవు. భారంబుచే నలసినదుర్బలమానవుండువోలె నెప్పుడు నేకాంతమందు నిశ్శ్వసించుచుఁ బండియుండెడివాఁడవు. నీవాస్తవం బెఱుంగనిజను లనేకులు నిన్నున్మత్తునిగాఁగూడఁ దలంచియుండిరి. నిర్మూలంబులగు వృక్షంబులఁ బెకలించి విదల్చుగజంబువోలెఁ బాదంబులతో భూమిని నదల్చుచు బరువెత్తుచుండువాఁడవు. వనంబున బ్రాహ్మణులతోడ నొకప్పుడును సంతసించినవాఁడవు కావు. ఎప్పుడును రహస్యమందే కాలము పుచ్చువాఁడవు. రాత్రిగాని పగలుగాని యెప్పుడు నానంద మెఱుంగవు.

కాఠిన్యంబు లేకయే సహాస్యంబుగను నవ్వుచు నేడ్చుచు నుండెడివాఁడవు. మోఁకాళులపై నిటికంబిడుకొని చిరకాలంబు కనులు మూసికొనియుండు వాఁడవు. కనుబొమలు ముడిపడఁజేయుచుఁ బెదవుల గఱచుచు నెప్పుడు నగపడువాఁడవు. వృకోదరా! ఈచేష్టలన్నియు మన్యువశంబున జనించినవికదా? సహస్రాంశుండు తొలుతఁ దేజఃపుంజము నెల్లయెడలఁ బ్రసరింపం జేయుచు నుదయించును. అనంతరము తేజుమాసి రశ్మిమాత్ర ప్రకాశుండై యస్తమయం బందును. అట్లే నీవును బ్రవర్తించితివి. నేను సత్యంబు చెప్పుచుంటినిగాని యనృత మెంతమాత్రము బలుకలేదు. నామాటలం దించుకయు వ్యతిక్రమంబు లేదు. అమర్షణుం డగు దుర్యోధనుని నేను గదచే వధించెదనని గద చేఁబూని భ్రాతృమధ్యంబున శపథంబు గావించువాఁడవుకదా? అట్టి నీమానసం బిప్పుడు శమంబు నభిలషించుట యాశ్చర్యముగాదా? అహహ! యుద్ధము యుద్ధమని పలవరించినవారి మనంబులు యుద్ధకాలం బాసన్నం బగుతఱి విప్రతీపంబు లయియున్నవి. వృకోదరా! నీకు వాస్తవంబుగ గొప్పభయ ముదయించినది. అయ్యయో! స్వప్నాంతమందును జాగరాంతమందును విపరీతంబు లగు నిమిత్తంబులం గాంచుచుండుటం జేసి నీవు శాంతి నభిలషించుచున్న వాఁడవు. అకటకటా! నపుంసకుండువోలె నీయందున్న పౌరుషంబు నించుకంతేని దలంపకున్నావు? నీవు మిగుల భయమొందినవాఁడ వగుటం జేసి నీమనంబు వికృతం బై పోయెను. నీమనంబు మిగుల వేపమానం బగుచున్నయది. మనంబు చివుక్కుమనుచున్నది. నీకూరుస్తంభంబు సంభవించినది. దానివలన నీవిపుడు శాంతి నాశంసించుచున్నాఁడవు. మారుతాత్మజా! చలాచలం బగుమానవులమనంబు నిత్యమైనదికదా? వాతవేగ ప్రచలితం బగు శాల్మలీఫలంబు చివరనున్న తొడిమవలె మానవుల స్వభావంబు నశాశ్వతం బైనది. గోవుల యంభారవంబువోలె నీమానుష బుద్ధియు పాండుపుత్త్రుల మనంబులను నావలేనిశోకసాగరంబున ముంచివేయుచున్నది. భీమసేన! నీవిట్లు నీ బలంబునకును ప్రవర్తనంబునకు నను రూపంబులుగాని తేలికమాటలాడుట జూడ పర్వతంబులు నడచుచున్నట్లు నాకు మహాశ్చర్యంబు జనించుచున్నది. నీవు నీపూర్వకార్యంబులను జన్మించినకులంబును బాగుగఁ దలంచికొని లెమ్ము. విషాదంబు నొంద

కము. స్థైర్య మవలంబింపుము. నీకు గ్లాని యెంతమాత్రము ననురూప
మయినదిగాదు. క్షత్త్రియుండు స్వతేజంబున సంపాదించినదానినేకాని
యితరం బనుభవింపఁడు. అని పలికె.

### భీమసేనుని కోపము

వాసుదేవుం డట్లు పలుకుటయు నిత్యమన్యుండు నమర్షణుండు
నగుమరున్నందనుండు బాగుగఁ బరువెత్తు నశ్వంబువలె నాతనితో నిట్ల
నియె. కృష్ణా! నేనొక్కకార్యంబుగావింపఁ దలంప నీవు వేఱొక్కతెఱం
గున నన్నాలోచించుచున్నవాఁడవు. నాకు యుద్ధంబునం దాసక్తిలేక
పోలేదు. దీర్ఘకాలసహవాస మొనరించినవాఁడవగుటవలన నాసత్త్వంబు
నీవు బాగుగ నెఱింగియుండుదువు. మిక్కిలిలోఁతగుహ్రదంబున నీఁదుచు
హ్రదంబులోఁ దెఱుంగనివానివలె నీవు నెంతకాలము నాతోడ వసించి
నను నాబలం బెఱుంగఁజాలవైతివి. కావుననే తగనిమాటలాడి నన్ను
నిందించుచున్నాఁడవు. మాధవా! నన్ను భీమసేనుం డని యెఱింగియు
నెవ్వండు నీవాడినట్టు లననురూపంబు లగుమాటలాడును? నేనిదె చెప్పు
చున్నాఁడను. నావాక్యంబు లాలింపుము. నాబలంబును బౌరుషంబును
సాటిలేనివి. నన్ను నేనే చెప్పికొనుట యెల్లభంగుల ననార్యకర్మంబగును.
నీయతివాదంబులచే నన్ను వేధించుటం జేసి నాశక్తి నేన ప్రశంసింపవలసి
వచ్చినది. ప్రజలకెల్ల నివాసస్థానంబులగు భూమ్యంతరిక్షంబులు రెండును
క్రోధాకులంబులై యొండొంటిఁదాక నుంకించినను సచరాచరంబు లగు
నారెంటిని నేను రెండుబాహువులచే నాపియుంచెదను మహాపరిఘం
బులంబోని నాబాహువుల యంతరం బాలోకింపుము. నాబాహువులకుం
జిక్కినవాఁడెవ్వఁడును దప్పించుకొని వెడలఁజాలఁడు. హిమవంతుఁడే
కానిమ్ము. సముద్రుండే కానిమ్ము. బలభేదనుం డగు వజ్రధరుండే కానిమ్ము.
నాచేతికిఁ జిక్కినవానిని వారివారి బలమెల్ల మెఱసియు రక్షింపఁజాలరు.
పాండవులయెడ నాతతాయు లగుయుద్ధార్హక్షత్త్రియులనెల్ల నేలపైఁ
బడఁగొట్టి యఱకాల నణఁచియుంచెదను. అచ్యుతా! నీవు నావిక్రమం
బెఱుంగనివాఁడవు గావుకదా? ఎంతమందిరాజులు నాచేఁ బరా
జయం బంది వశమయిరి? పోని మ్మింతకుమున్ను నన్ను నీవు బాగుగ
నెఱుంగకున్నను జరుగనున్న విగాఢం బగు యుద్ధంబున నాపరాక్రమం

బెఱుంగఁగల్గుదువు. కృష్ణా! మానుచున్న ప్రాణంబును మరల రప్పించి నట్లు పరుషవాక్యంబులచే నన్ను నిందించుచుంటివి. నేను నాబుద్ధి కొలఁదిని వచించుచున్నాఁడను. ఎల్లవిధముల నే నధికుండ నని యెఱుంగుము. యుద్ధమారంభమువొంది వైశసం బగుదినంబునందు నాచేఁ జదుపఁబడిన మాతంగములను రథములతురంగసాదులను, మఱియు నితరు లగు రాజులను జూచెదవుగాక. ఈచరాచరంబులనెల్ల వికర్షించు నన్ను నీవును లోకంబు నాలోకింతురుగాక. నాయంగంబులు సన్నంబులుగా లేవు. నామనంబు కంప మొందుటయు లేదు. ఈలోకంబెల్లఁ గ్రుద్ధంబయి యొక్కటిగ నేతెంచినను నాకు భయంబుగలుగదు. ఐనను సౌహ్రాదంబునను దయచేతను నట్లు శాంతవచనంబులు పల్కితిని. మాభరతాన్వయంబునకు నాశం బావహింపరాదను తలంపుననే యెన్ని క్లేశంబులైనను సహించియుంటిని.

అట్లు భీమసేనుండు వచించుటయు జనార్దనుండు చిఱునవ్వు మొగంబునఁ దోప నాతని కిట్లనియె. వృకోదరా! నీభావంబు దెలియ నే నిట్లంటినేకాని ప్రణయరాహిత్యంబునఁగాని ఆక్షేపంబునఁగాని పాండిత్యప్రకటనంబునకుఁగాని క్రోధంబునఁగాని నిందించుతలంపునఁగాని యిట్లన్నవాఁడనుగాను. నేను నీమాహాత్మ్యంబును నీబలంబును బాగుగ నెఱుంగుదును. నీవు కావించినయమానుషకార్యంబులన్నియు నేనెఱింగియుంటిని. నిన్నెన్నఁడును బరాభవింపను. నీవు నీయందున్నకల్యాణంబు నెంతగా భావింతువో నేనంతకు వేయిమడుంగు లధికమయినదేయని భావించుచుందును. నీవు సకలరాజన్యులచేఁ బూజింపఁబడిన యుత్తమరాజవంశంబున జనించితివి. నీబాంధవులస్నేహితులు సత్యాధికతేజోధనులని కీర్తిగాంచిరి. నీవును వారలకనురూపుండవై నెగడుచున్నవాఁడవు. వృకోదరా! మానవులు సంశయాపన్నం బగు దేవమానుషధర్మంబుల యాథార్థ్యమెఱుంగంగోరియు నొక్కనిశ్చయం బధిగమింపఁజాలరు పురుషున కర్థసిద్ధియం దేది హేతు వగునో యదియ యాతని వినాశంబునకును హేతువగుచున్నది. కావునఁ బురుషుం డాచరించు కర్మంబులెల్ల సందిగ్ధములైయే యుండును. దోషంబు లెఱింగిన కవులచే నొక్కవిధంబుగఁ జూడంబడిన కార్యంబులు వాయుదేవుని వేగంబులువోలె వేఱొకవిధంబునం బ్రవర్తిల్లుచుండును. సుమంత్రి

తంబు సునీతంబునై న్యాయంబున నుపపాదింపఁబడిన మానుష్యకం బగు కర్మంబు దైవంబువలన విరుద్ధం బగుటయుఁ గలదు. దైవికం బయినను నకృతం బగుకర్మంబు పౌరుషంబున నిహతం బగును. శీతంబు నుష్ణంబు వర్షంబు క్షుత్పిపాసలును మానుషంబున నివారింపఁబడుచున్నవి కదా? పూర్వజన్మసంచితం బగు ప్రారబ్ధకర్మంబుకంటెను వేఱగు పురుషుని స్వయంకృతకర్మమువలన జన్మాంతరమున నిరోధంబు గలుగదని వేదంబులు వక్కాణించుచున్నవి. పాండవా! ఈలోకంబునకుఁ గర్మాచరణంబుకంటె వేఱగు జీవనోపాయం బగు వృత్తియేదియును లేదని తలంచి కర్మంబు లాచరింపవలయును. దానివలన దైవమానుషంబులు రెంటను ఫలంబు లభించును. ఎవ్వఁ డిట్లు నిశ్చయించియుండునో వాఁ డెప్పుడును పౌరుషం బాలంబించి కర్మల గావించుచునే యుండును. వానికి ఫలసిద్ధి లేనియెడ దుఃఖంబుగాని ఫలప్రాప్తి యగునపుడు ప్రహర్షంబుగాని సంభవింపవు. వృకోదరా! శాత్రవులతోఁ బోరునపుడు విజయము తప్పక సిద్ధించు ననిమాత్రము నమ్మరాదని నానిశ్చయము. ఎపుడును హీనకాంతికలవాఁడుగాఁగూడదు. విషాదంబుగాని గ్లానికాని వొందరాదు. ఈవిషయంబు నీకు మరలఁజెప్పుచున్నాఁడను. సావధానుండవై యాలింపుము. నేనెల్లి ధార్తరాష్ట్రునిసమీపంబున కరిగి మీయర్థంబునకు భంగంబు గలుగకుండు తెఱంగున శాంతిగావింపఁ బ్రయత్నింతును. వారలొకప్పుడు శాంతి నాలంబించిరేని నాకత్యధికం బగుకీర్తి లభించును. మీకామంబును సిద్ధించును. వారలకు నుత్తమం బగు శ్రేయంబు లభించును. ఒకప్పుడు వారు పట్టినపట్టు విడువక నామాటలాదరింపక యుపేక్షించిరేని దప్పక ఘోరం బగుపోరు జరుగుటతప్ప వేఱుపాయం బేదియును లేదు. యుద్ధంబ తప్పనిసరియగునేని భీమసేన! నీయంద యాభారంబెల్ల సమాహితంబై యున్నది. అర్జునుండు ధురంధరుండై యుండును. ఇతరజనంబు, వోఢవ్యం బగును. నేను బీభత్సునకు సారథ్యంబునెఱపెదను. వాయునందనా! యిట్లు ప్రవర్తించుట యర్జునునికామంబు సుమీ! నేను నాయంతట యుద్ధం బెప్పుడు నాకాంక్షింపను. కావున నేను నీమతి నెఱుంగఁగోరి నిన్నట్లు క్లీబంబు లగుపరుషవాక్యంబు లాడితిని. దాన నీతేజంబు సముద్దీపితం బయ్యె.

### అర్జునుండు తనయభిప్రాయం బెఱింగించుట

అట్లు వాసుదేవుండు పలికినయనంతరంబు కుంతీసుతమధ్యముండు తన యభిమతం బెఱింగించువాఁడై వాసుదేవునితో నిట్లు వచించె. జనార్దనా! కురుసభయందుఁ జెప్పవలసిన సందేశంబెల్ల ధర్మనందనుండు తెలిపియేయున్నవాఁడు. కౌరవులు శాంతినొల్లరని నీవు తలంచుచున్నట్లు నీవాక్యంబులవలన నాకుం దోఁచుచున్నది. ధార్తరాష్ట్రుని లోభంబునఁగాని మాకు సంభవించిన దైన్యంబునంగాని వారు శాంతి నంగీకరింపకుండుట సంభవింపవచ్చును. నీవు పురుషునిపరాక్రమంబున ఫలంబుగాదని తలంచినను కర్మంబులుగావింపక యపౌరుషంబున ఫలోదయంబు గాఁజాలదు. యుద్ధం బాశింపనని నీవు వచించినవాక్యం బట్టులే యగును. అయ్యది యసాధ్యంబే యైనను దాని నట్లుపేక్షింపం జనదు. మా కవసాదకమని దానిని దలంచినను దాని నుపేక్షింపంజనదు. ఫలోదయంబు లేకున్నను గర్మంబు లాచరించుటయే మనుజులకు విధి. కర్మంబు లెస్సగా నాచరింపఁబడుచోఁ దప్పక ఫలం బొసంగును. మాకుఁబరులతో నెట్లు శమంబుగలుగునో యట్లు ప్రవర్తింపుము. కౌరవులకును బాండవులకునుగూడ నీవు త్తముఁడవగు స్నేహితుండవు. దేవతలకును రాక్షసులకునుగూడ బ్రజాపతి సమానసుహృదుండేకదా? నీవు కౌరవులకును బాండవులకునుగూడ నిరామయంబు సంపాదింపుము. మాకు హితం బగుకార్యంబు సంపాదించుట నీకు దుష్కరంబుగాదని తలంతును. నీవు గావించిన కార్యంబెల్ల నుచితంబై యుండును. నీవక్కడ కరుగుటవలనఁ గూడఁ మేలేకలుగును. వీరపుంగవా! దురాత్ముం డగుదుర్యోధను విషయమున నీవు గావింపఁదలంచినదెల్ల నట్లజరగును.మాకువారలతోడి చెలిమి యైనను సరియే లేదా! నీవేమి చేయందలంచిన నదియే యగుఁగాక. నీవాలోచించినకార్య మేదియో యదియే మాకుఁ గరణీయం బగును. దుష్టాత్ముం డగుసుయోధనుండు కొడుకులతోడను బాంధవులతోడను వధింపఁబడకుండుఁగాక. ఉపమర్షితంబగుసిరి ధర్మనందనున కభిమతంబు గానేఱదు. మధుసూదనా! దుర్ద్యూతపరాయణుం డగు సుయోధనుండు ధర్మిష్ఠంబగుసుపాయ మేదియుఁ గానక నృశంసతరం బగు నుపాయంబున మాసంపద లపహరించినవాఁడు క్షత్త్రియుల కులంబున నుద్భవంబందిన

## నకులుండు తనయభిప్రాయం బెఱింగించుట

దేవకీనందనుం డట్లు పలుకుటయు నకులుం డాతని కిట్లనియె. మాధవా! ధర్మజ్ఞుండగు ధర్మరాజు బహువిధంబులగు వాక్యంబులు పలికియున్నవాఁడు. వాని నెల్ల నీవాలించియుంటివి. ధర్మనందనుమతం బెఱింగి భీమసేనుండు శమంబును బాహువీర్యంబునుగూడఁ బ్రఖ్యాతంబులు గావించినవాఁడు. అట్లే ఫాల్గునుండును వచించె. వారలు చెప్పినమాటలు గూడ నీవు వినియుంటివికదా? నీవును బలుసారులు నీయభిమతం బెఱింగించియుంటివి. వీని నెల్ల నతిక్రమించి నీవు పరులమతంబు బాగుగ నెఱింగి యప్పటి కెట్టు లవసరంబైన నట్లు గావించుట తగును. ఆయానిమిత్తంబులం దేయది ప్రాప్తకాలమో యదియే మతంబగును. మన మొక్కరీతిని నిశ్చయించిన యర్థంబు వేఱొకరీతిని బ్రవర్తించును. పురుషోత్తమా! లోకంబున మానవులు చంచలచిత్తులు. మేము వనవాసం బొనరించుతఱి నొకరీతి బుద్ధు లుత్పన్నములైనవి. అజ్ఞాతవాసం బొనరించుతఱి మఱొకరీతి బుద్ధులు జనించినవి. ఇపు డెల్లర కగపడుచుండ నింకొకరీతి బుద్ధు లుదయించుచున్నవి. వార్ష్ణేయ! మాకుఁగూడ నిపుడు రాజ్యము నెడ నున్నంతయాశ వనవాసకాలంబునఁ గలుగలేదుసుమా! మేము వనవాసంబువలన మరలినవార్త విని నీప్రసాదంబున నీ యేడక్షౌహిణులబలంబులు సమాగతంబులైయున్నవి. అచింత్యబలపౌరుషంబులుగల నీమహాయోధులు శస్త్రములధరించి రణంబునకాయత్తంబగుడు వీరల నాలోకించి యెవ్వఁడు భయపడకుండఁగలఁడు? నీ వాకౌరవుల సభయందు నాసుయోధనుగూర్చి తొలుత సామంబునను దరువాత భయంకరముగను సంభాషణంబు నెఱపుము. మందుం డగు నాసుయోధనునకు వ్యథకలుగనివిధంబునఁ బలుకుము. యుధిష్ఠిరుని భీమసేనుని నపరాజితుం డగు బీభత్సుని సహదేవుని నన్నును నిన్నును రాముని మహావీర్యుండగుసాత్యకిని సహాత్ముండగువిరాటుని నమాత్యసహితుం డగు ద్రుపదుని చండపరాక్రమవంతుండగు ధృష్టద్యుమ్నుని మహావిక్రమశాలియగుకాశిరాజును చేదిదేశాధీశుండగుధృష్టకేతుని నింకను మనపక్షంబుననున్న మహాయోధులను నెదిరించి యెవ్వండు మాంసశోణితంబులతో నుండంగలండు? మహాబలా! నీవక్కడికి వెళ్లినంతమాత్రము

ననే ధర్మరాజున కిష్టంబగునర్థంబు నిస్సంశయంబుగ సాధింపఁగల్గుదువు. నీవు చెప్పినంతన విదురుండు భీష్ముండు ద్రోణుండు బాహ్లికుండు నేది యుత్తమశ్రేయమో దాని నెఱుంగంగలరు. వారలుగూడ ధృతరాష్ట్ర మనుజేంద్రు ననునయింపంగలరు. పాపసమాచారులగు సుయోధనుని వానిమంత్రులనుగూడ వారనునయింపఁగలుగుదురు. అర్థంబు వినువాఁడు విదురుండును కార్యంబు దెలుపువాఁడవు నీవునై యుండఁ జెడిపోయిన కార్యంబునేని చక్కఁబఱుచుట కేసంశయంబును లేదు. కావునఁ దప్పక కార్యంబు సఫలంబుగాఁగలదని వచించె.

### సహదేవుండు తనమతం బెఱింగించుట

అనంతరంబు సహదేవుం డిట్లనియె. జనార్దనా! ధర్మరాజు వచించినదెల్ల మిగులఁ బూజ్యం బగుసనాతనధర్మంబై యొప్పుచున్నది కాని నీవుమాత్రము తప్పక యుద్ధంబే జరుగునట్లు ప్రయత్నింపుము. ఒకప్పుడు కౌరవులు పాండవులతో శమంబు వాంఛించిరేనియు నీవు దప్పక యుద్ధంబే జరగునట్లు గావింపుము. కృష్ణా! నాఁడు పాంచాలి యట్లా సభలో క్లేశం బనుభవించుట చూచిన నాకు యుద్ధంబుగావింపక సుయోధనునెడ గలకోపాగ్ని యెట్లు చల్లాఱును? భీమార్జునులును ధర్మరాజును ధార్మికులేయైనను గానిమ్ము. నేనుమాత్ర మెల్లధర్మంబుల వీడి సమరంబున వానితోడ యుద్ధంబ కావించెద ననియె. అంత సాత్యకి మహాబాహూ! యీసహదేవుండు సత్యంబు వచించెను. దుర్యోధనుని వధించి ననే నా కాకోపము శాంతించును. చీరాజినధరులయి పాండవులు వనంబున క్లేశంబు లనుభవించునెడ వారల నాలోకించిన నీకును గోప ముదయించినదే? దాని నిపుడు మఱచితివా? కావున రణకర్కశుండు శూరుండు నగుసహదేవుండు వచించినదే యెల్ల యోధులకును సమ్మతంబగువచనము కావునఁ దప్పక యుద్ధంబు చేయూర్పు మనియె. అపుడు యుయుధానుండు నాయర్థంబు నట్లే వచింప నక్కడియోధులెల్లరు భయంకరంబులగు సింహనాదంబులు గావించిరి. సకలంబగుసైన్యంబు నావాక్యంబు నభినందించిరి. సాత్యకిని సాధువాదంబులతో హర్షింపఁ జేయుచు నాతనివచనంబుల నెంతయుఁ బ్రశంసించిరి.

## ద్రౌపది కృష్ణునితోఁ దనయభిమతంబు దెల్పుట

రాజులెల్లరు నట్లు సాధువాదంబులు గావించినంతఁ బాంచాల
రాజనందన శోకకర్శితయై వాసుదేవున కిట్లనియె. ఆద్రౌపది తొలుత
సహదేవుని సాత్యకిని బొగడి ప్రశమశాంతవృత్తినున్న భీమసేను నాలో
కించి మిగుల దుఃఖించెను. అనంతరమశ్రువులు కనుగొనలనుండి రాలు
చుండఁ గృష్ణునితో నిట్లనియె. మధుసూదన! నీవు సకలధర్మంబులు
నెఱింగినవాఁడవు. పాండవులు నికృతిచే రాజ్యభ్రంశము సుఖనాశము
బొంది వనంబునకుఁ బంపఁబడుట నీవెఱుంగనిది కాదుగదా? దీనికంతకును
ధృతరాష్ట్రునిపుత్త్రుండగు దుర్యోధనుండును వానిమంత్త్రులును గార
ణంబనుటయు నీ వెఱుంగనిది గాదు. ధృతరాష్ట్రునిపంపున సంజయుం
డరుగుదెంచి రహస్యంబున ధర్మనందనున కెఱింగించినవాక్యంబులును
ధర్మనందనుండు మరల సంజయునకుఁ జెప్పినమాటలును నీవు వినియుం
టివికదా? అవిస్థలంబు వృకస్థలంబు మాకంది వారణావతము నేనవదేదే
నొక్కటియుఁ గలిపి మాకేవుర కేనుగ్రామంబులుమాత్ర మిచ్చినఁజాలు
నని సుయోధనునకు వానిమిత్త్రులకు నెఱింగింపు మని యుధిష్ఠిరుండు
సంజయునితోఁ బల్కియుండెను. సంధినాశించి శ్రీమంతుండగు ధర్మ
నందనుం డిట్లు వచింప నట్లును నాదుర్యోధనుండు గావింపఁడయ్యె.
కృష్ణా! సుయోధనుండు రాజ్యం బీయక యెన్నివిధంబుల సంధినిశ్చయించి
నను దాని నంగీకరింపవలదు. మహాబాహూ! పాండవులు సృంజయులతోఁ
గూడి ఘోరంబగుధార్తరాష్ట్రునిబలంబులెల్ల వధించుటకుఁ జాలుదురు.
సామంబునఁగాని దానంబునఁగాని వారలయెడ నర్థంబుసిద్ధింపదు కావున
మధుసూదనా! వారలయెడ నించుకయుఁ గృప వహింపంబనిలేదు. ఏ
శాత్త్రవులుసామంబునఁగాని దానంబునఁగాని చక్కంబడరో వారియందు
దండమే ప్రయోగింపందగును. అట్లు దండింపకున్న మనజీవితంబు
రక్షించుకొనుటయే దుష్కరంబగును. కావున గౌరవులందు శీఘ్రంబుగ
మహాదండంబు ప్రయోగింపవలయును. నీవును సృంజయులు సహాయు
లుగాఁ బాండవుల కీకార్యంబు సుకరంబయియున్నది. పాండవుల
కిదియ సమర్థంబగునది. ఇదియ నీకును యశంబుగూర్చును. దాని నాచ
రించినచో నెల్లక్షత్త్రంబునకును సుఖం బావహిలును. క్షత్త్రియుండు

లోభియగుక్షత్త్రియునివధించుట క్షత్త్రధర్మము. క్షత్త్రధర్మాభిరతుండగు క్షత్త్రియుండు లోభాసక్తులగు నితరులను గూడ వధింపవలయును. ఎల్ల పాపంబులందును దండింపఁదగని బ్రాహ్మణునిమాత్రము దండింపఁదగదు. బ్రాహ్మణుండు సర్వవర్ణంబులకును గురువై యున్నాఁడుగదా? కావున వానిని వధింపక యితరవిధంబుల శిక్షింపవలయును. అవధ్యుని వధించిన నెట్లు పాపంబు సంభవించునో యట్లే వధ్యుని వధింపకున్నను మహా పాపంబు సంభవించును. వధ్యునివధింపనిదోషంబు నీకు సంభవింపకుండు లాగున గార్యంబు నెఱవేర్చికొనిరమ్ము. పాండవులును సృంజయులు నెల్లనైనికులును నీయభిమతంబ యాచరింప సిద్ధంబుగనున్నవారు. జనార్దనా! నీయెడంగలచనవునఁ బునరుక్తంబేయైనను మరల వచించుచున్న దానను వినుము. కేశవా! యీచతుస్సాగరపరీతభూతలంబున నన్నుం బోలుస్త్రీ యెందేనిగలదా? ద్రుపదునికుమారికను. వేదిమధ్యంబున బ్రభవించితిని. ధృష్టద్యుమ్నునకుఁ జెలియలను. కృష్ణా! నీకు నెచ్చెలిని. అజామీఢవంశంబున మెట్టినదానను. పాండుమహీపాలునికోడలను. పంచేంద్రులకు సాటియగు తేజంబుగల పంచపాండవులకును భార్యను. మహావీరులగుపాండవు లేవురవలన నాకేవురు మహావీరులగుకుమారు లుదయించి వృద్ధినొందుచున్నవారు. కృష్ణా! నీ కభిమన్యుం డెట్లు మేనయల్లుఁడో వారు నట్లేధర్మంబున మేనయల్లుండ్రయిరి. ఇట్టి నేను తలఁబట్టి యీడ్వఁబడి సభామధ్యంబున నత్యంతక్లేశం బనుభవించితిని. ఆసమయంబున నాభర్త లగుపాండవులు చూచుచు నేమియుఁ జేయఁజాలకుండిరి. పాండునందనులు పాంచాలుర వార్ష్ణేయులఁగూడ జీవించియుండఁగానే నేనాపాపాత్ములకు దాసినై సభామధ్యంబునకుఁ గొనిపోఁబడితిని. అప్పుడు పాండవులెల్లరు నమర్షంబుఁ బోనాడి కేవలము శూన్యదృష్టులతో నాలోకించుచుండ నేను నిన్నుద్దేశించి కృష్ణా! రక్షింపుమని మనంబునఁ జింతించితిని. అపుడ శ్వశురుండు నాతోఁ బాంచాలీ నీకు వరంబొసంగెదను. నీ కభిమతంబగువరంబు వేఁడు మని వచించె. నేనును బాండవులు దాస్యంబునుండి విడివడునట్లును రథంబులు నాయుధంబులుం గొనియుండునట్లును గోరఁగ నట్లే వారు వనవాసంబునకు విడువంబడిరి. కృష్ణా! యిట్టిదుఃఖంబులెల్ల నీవెఱుంగనివి కావుగదా? జనార్దనా!

నాభర్తలను జ్ఞాతులను బాంధవులను దయతోఁ గాపాడుము. కృష్ణా! నేను ధృతరాష్ట్రునకును భీష్మునకుఁగూడ కోడలనగుదును. అట్లయ్యును వారియెదుట నేను బలాత్కారంబున దాసిగాఁ గావింపఁబడితిని. పార్థుం డెంతటిధనుర్ధరుండైననేమి? భీమున కెంతబలమున్ననేమి? దుర్యోధనుండు నాకట్లు పరాభవముగావించి క్షణకాలంబేని జీవించియుండఁ గూడదు. వీరలబలం బెందులకుం గొఱగానిదగుట వాఁడింకను జీవించియే యున్నవాఁడు. కృష్ణా! నాయందు నీకు దయగలదేనియు నేను నీ కనుగ్రహింపఁదగుదాన నగుదునేనియు ధార్తరాష్ట్రులందు నీకోపం బెల్లఁ బ్రసరింపఁజేయుము. అని వచించి మృదుసంహారంబు వృజినాగ్రంబు సుదర్శనంబు సునీతంబు సర్వగంధాధివాసితంబు సర్వలక్షణ సంపన్నంబు మహాభుజంగసన్నిభ కాంతిమంతంబు నగు కేశపాశంబు వామహస్తంబునఁ బట్టుకొని పుండరీకాక్షునిసమీపంబున కరుదెంచి యశ్రుపూర్ణేక్షణయై దీనస్వరంబున మఱియు నిట్లనియె. కృష్ణా! పరులతోడి సంధివాక్యంబు లాడునపుడును సర్వకార్యంబులందును నీ నా కేశపాశంబును స్మరింపుచుండుము. భీమార్జునులు కృపణులై సంధి కోడంబడిరేనియు వృద్ధుండగు నాజనకుండు పుత్రులతోడను మిత్రామాత్యులతోడనుగూడి యుద్ధంబు గావించును. నాసహోదరులు మహారథులు. నాతనయు లేవురును మహావీర్యసంపన్నులు. వారల కభిమన్యుండు సహాయుండగును. వీరెల్లగౌరవులతో యుద్ధం బాచరింతురు. శ్యామంబగు దుశ్శాసనుని భుజంబు నఱకఁబడి పాంసుధూసరంబై యుండ నేను జూచిననేకాని నాహృదయంబున కెట్లు శాంతి చేకూరును. ప్రదీప్తంబగు పావకంబుంబోలె నభివృద్ధం బగుకోపంబును హృదయంబునందిడి కాలంబు నిరీక్షించుచుండఁ బదుమూఁడేండ్లు కడచి చనినవి. మహాబాహుండగు భీమసేనుం డిపుడు ధర్మంబునే యాశించినంత యాతనివాక్యంబులను శల్యంబులచేఁ గ్రుచ్చఁబడి నాహృదయంబు వేయివిధంబుల వ్రక్కలగు చున్నది యనిపల్కి బాష్పగద్గదకంఠియై యొడలు కంపమొంద నుచ్ఛస్వనంబున నేడ్చెను. వేఁడియగు నయనసలిలధారలచే స్తనంబుల నార్ద్రంబులు గావించుచున్న ద్రౌపదిం గాంచి వాసుదేవుండు సమాశ్వాసంబు గావించుచు నిట్లనియె. ద్రౌపదీ! అచిరకాలంబుననే భరతాంగన లెల్లరు నేడ్చుచుండ నాలింతువుగాక. నీవిపు డేడ్చినంతకంటె వేయిరెట్లధికంబుగ

వారు జ్ఞాతులు బాంధవులు మిత్రులు బలంబులును వధంబు ప్రాపింపఁ
బరిదేవనంబు గావింతురు యుధిష్ఠిరుని నియోగంబునను విధినిర్మితం బగు
దైవంబునను నేను భీమార్జుననకులసహదేవులతోఁగూడి నీ యభిమతంబు
తప్పక నెఱవేర్చెదను. కాలపరిపాకం బంది ధార్తరాష్ట్రులు నావాక్యంబు
లాదరింపరేని రణాంగణంబున నిహతులై నేలంగూలి నక్కలకుం గుక్క
లకు నాహారంబు గాఁగలరు. శైలాధిరాజగుహిమవంతుండు కదలనిమ్ము,
మేదిని వేయివ్రక్కలుగానిమ్ము. అంతరిక్షంబు నక్షత్రంబులతోఁగూడి
నేలం గూలనిమ్ము. ఏది యెట్లయినను నావాక్యంబుమాత్ర మెన్నండును
మోఘంబు గానేరదు. నీకు సత్యంబుగఁ బ్రతిజ్ఞ చేయుచున్నవాఁడను.
నీవు కన్నీరు మానుము. అచిరకాలంబున శాత్రవులనెల్లఁ బరిమార్చి
జయలక్ష్మీసమావృతు లగు నీపతుల నాలోకింతు వని వచించె.

## కృష్ణుని ప్రయాణసన్నాహము

అప్పు డర్జునుండు కృష్ణునితో నిట్లు పలికెను. మాధవా! కురు
కులంబునకెల్ల నీవ యుత్తమసుహృదుండవు. రెండుపక్షంబులవారికిని
సమానసంబంధివియు దయితుండవు నై యున్నాఁడవు. పాండవులకును
గౌరవులకుఁగూడ నీవ యనామయంబు గూర్పవలయు. శాంతి గలిగించు
టకుఁగూడ నీవే సమర్థుండవు. నీ విక్కడనుండి యరిగి కౌరవసభలో
నమర్షణుండగు నాసుయోధనుతో శాంతికై చెప్పఁదగురీతినెల్లఁజెప్పుము.
ధర్మార్థోపపన్నంబు మంగళంబు ననామయంబు హితంబు నగు నీవచనంబు
నాతఁ డాదరింపఁడేని కాలవశంబు నొందఁగలఁడు. అనిన విని వాసు
దేవుండు ధనంజయా! నేనెల్లవిధంబుల ధర్మసమ్మతంబును కౌరవులకు
మనకుఁగూడ ననామయంబు హితంబు నగుకార్యంబ యాచరింతును.
అట్టికార్యంబు సాధించుటకై యిదె ధృతరాష్ట్రునికడ కరుగుచున్న
వాఁడ నని పలికెను.

అనంతరము శరదృతువు అంతమొంది హేమంతము ప్రారంభ
మగుచుండుతఱిఁ గార్తికమాసంబున రేవతీనక్షత్రయుక్తం బగుదినం
బున చీఁకటులు దిగంతములకుఁ బాఱ విమలుం డగుసూర్యుం డుద
యించువేళ మైత్రముహూర్తంబున దివాకరుండు మృదుదీప్తిగలవాఁడై
యుండుసమయమున స్ఫీతంబు లగుసస్యంబులచేఁ నత్యంతసుఖం బగు

కాలంబున సర్వసమర్థుం డగు సాత్వతప్రవరుండు పుణ్యంబు లగు మంగళ వాద్యఘోషములును సూనృతంబు లగు బ్రాహ్మణుల స్వస్తివచనంబులును నాకర్ణించి ప్రతీతులగు మహర్షుల స్తవంబు లాలించి మేల్కొను వాస వుండువోలె మేల్కాంచి పూర్వాహ్ణమందుఁ గావింపఁ దగు కార్యంబు లెల్ల నిర్వర్తించి స్నానం బొనర్చి శుచియై యలంకారములఁ దాల్చి సూర్యభగవానుని నగ్నిభట్టారకునిని స్తుతించి మ్రొక్కెను. అనంత రము వృషభంబును సోఁకయందు స్పృశించి బ్రాహ్మణుల కభివాదనం బొనర్చి యగ్నికిఁ బ్రదక్షిణం బాచరించి యెదుటఁ గల్యాణం బగు శకు నంబుల నాలోకించి ధర్మనందనుండు వచించినవాక్యంబుల స్మరించి యాసనాసీనుండగు శైనేయునిం బిలిచి యాతనితో నిట్లనియె. సాత్యకీ! రథంబున శంఖంబు చక్రంబు గదయు నుంపుము. ఇంకనుపాసంగం బులు శక్తులు మొదలగుసర్వాయుధంబులును బదిలంబుగ రథంబునం బెట్టుము. దుర్యోధనుండు పరమదుర్మార్గుండు. వానికంటెను దుష్టు లగు కర్ణుండును సౌబలుండును వానికిఁ దోడైయున్నవారు. బలవంతుండై నను బురుషుండు శాత్రవుని దుర్బలుం డని యవజ్ఞ సేయరాదు. కావున నాయుధంబులు రథంబునం బెట్టుమనుటయు వాసుదేవు నభిమతం బెఱింగి యాతనిరథం బాయత్తంబు గావింపం దొడంగిరి. కాలాగ్నివోలె వెలుంగుచు మార్గంబున నడచుసూర్యమండలంబువోలె విరాజమానం బగు నారథంబునకు చంద్రసూర్యులవలెఁ బ్రకాశించుచక్రయుగళంబున ద్విగుణం బగుశోభ కలిగెను. అర్ధచంద్రులు బూర్ణచంద్రులు మత్స్యం బులు మృగంబులు పక్షులు వివిధంబు లగుపుష్పంబులును మణిరత్నము లచేఁ జిత్రింపఁబడిన యారథంబు నయనానందకరంబయ్యె. విశాలంబై సుందరం బగు నాయరదంబు తరుణాదిత్యమండలంబుమాడ్కిఁ జూడ నొప్పె. దానియంగంబులెల్ల మణిహేమంబులచే విచిత్రంబులై యల రారుచుండె. అందమగు ధ్వజంబు సుందర మగుపతాకయు నారథంబునఁ బ్రతిష్ఠింపఁబడియె. దృఢమగు నుపస్కరంబును వ్యాఘ్రచర్మాస్తరణం బునుగల యాతేరు పరుల కనాధృష్యంబై వెలింగె. శాత్రవులకు యశో హరంబును యదువులకు నానందసంధాయకంబు నగు నాశకటంబున శైబ్యసుగ్రీవమేఘపుష్పవలాహకంబులను తురంగంబులు పూన్పఁబడినవి. ఆయశ్వంబులు సుస్నాతంబులై సర్వసంపత్సంపన్నంబులై ప్రకాశించు

చుండినవి. కృష్ణునిమహిమంబు నతిమాత్రంబుగ వృద్ధినొందించు నా రథంబున ధ్వజంబునఁ బతంగరాజపతాక నెలకొల్పంబడియె. మేరుశిఖరంబుంబోలె నత్యున్నతంబు నత్యధికప్రభాభాసమానంబు నగు నారథంబును నాకాశమునందుఁ జరించువిమానంబునుంబోలె శౌరి యారోహించె. అనంతరము సాత్యకినిగూడ రథంబున నెక్కించికొని దుందుభినిర్ఘోషంబునుంబోలిన యారథనేమినిర్ఘోషంబున భూమ్యాకాశంబులు ప్రతిధ్వనులీనఁ బురుషోత్తముండు పయనమయ్యెను. మాంగళ్యంబులగు మృగపక్షిసంఘంబులు ప్రదక్షిణానులోమంబులై వాసుదేవు ననుసరించి నడచె. సారసంబులు హంసంబులును నెల్లెడల మాంగళ్యార్థపదంబు లుచ్చరించుచు మధుసూదను ననుసరించె. మంత్రాహుతిమహాహోమంబులచే ప్రేల్వఁబడునగ్నిదేవుండు ప్రదక్షిణశిఖలతో ధూమంబులేక ప్రజ్వలించె. వసిష్ఠుండు, వామదేవుండు, భూరిద్యుమ్నుండు, గయుండు, క్రథుండు, శుకుండు, నారదుండు, వాల్మీకుండును, మరుతుండు, కౌశికుండు, భృగుండును, దేవతలును, బ్రహ్మర్షులును, యదుసుఖావహుండగువాసుదేవునకుఁ బ్రదక్షిణం బాచరించిరి.

ఇట్లు మహర్షిగణంబులచేతను సాధుసంఘంబులచేతను బూజితుండై జనార్దనుండు కురుపుంగవులసదనంబగు హస్తిపురంబునకు బయలుదేఱె. ప్రయాణంబై యరుగుచున్న యాతని నంపకము పెట్టుటకై ధర్మనందనుండు, భీమసేనుండు, నర్జునుండు, నకులసహదేవులు, చేకితానుండును, విక్రాంతుం డగు ధృష్టకేతుండును, ద్రుపదుండు, కాశిరాజు, మహారథుం డగు శిఖండియు, ధృష్టద్యుమ్నుండును, విరాటుండు, నాతని తనూజులును నెల్లకైకయులును మొదలగుక్షత్రియులెల్లరు కొంత దూరంబు వెంటనడచిరి. అప్పుడు కృష్ణు ననుసరించివచ్చిన యుధిష్ఠిరుండు సకలరాజన్యులసన్నిధానంబున వాసుదేవునితోడ నిట్లనియె. ఏ మహానుభావుండు కామంబునను క్రోధంబునను అర్థాభిలాషంబునను భయంబునను నిసుమంత యన్యాయంబునను వర్తింపఁడో, యేధీరుండు స్థిరబుద్ధి యని ప్రశంసింపంబడునో, యెవ్వాండలోలుపుండన నెగడుచుండువాఁడో ధర్మజ్ఞుండు ధృతిమంతుండు ప్రాజ్ఞుండు నని యెవ్వని నార్యులు నుతింతురో; యేమహాత్ముండు సర్వభూతంబులకు నీశ్వరుండును దేవతలకును దేవుండును సనాతనుండునై విరాజిల్లుచుండునో; సర్వగుణ

సంపన్నుండును శ్రీవత్సాంకితుండునై యేసుందరాకారుండు వెలుం
గునో యట్టివాసుదేవుని బిగ్గఁగౌఁగిలించికొని కుంతీసుతాగ్రజుం డిట్లని
సందేశంబు వచించె.

మాధవా! మాజనని యగు కుంతి బాల్యంబునుండియు మమ్ముల
మిగుల గారాబంబుతోడఁ బెంచినది. అబలయయ్యు నామె యెల్లప్పుడు
నుపవాసంబులు దపంబుసల్పుచు నెల్లప్పుడును మాకు శుభంబులు గోరు
చుండును. దేవతలను నతిథులను బూజించుటయు, గురువులకు శుశ్రూష
లొనరించుటయు నామె కత్యంత ప్రియకార్యంబులు. ఆమెకు మాయం
దెంతయో ప్రీతియు వాత్సల్యమును గలవు. మాకు సుయోధనునివలని
భయం బిసుమంతయు గలుగకుండ మిగుల జాగరూకతతో మమ్ములనెల్లఁ
గాపాడెను. తరింప శక్యముగాని సాగరంబువలన నౌక తరింపఁజేయు
నట్లు మృత్యుసంబాధమువలన మమ్ములను గాచినది. దుఃఖంబుల కనర్హ
యయ్యు మానిమిత్తంబున లెక్కలేనిబాధ లనుభవించినది. అట్టి మాజ
నని ననామయం బడుగుము. పుత్రశోకంబున మిగులఁ గుములుచున్న
యామె నధికంబుగ నూఱడింపుము. మమ్ములనెల్ల బేర్వేరం బేర్కొని
నమస్కరించి కౌఁగిలించికొనుము. పెండ్లియైనది మొదలత్తవారింట ననే
కంబులగుదుఃఖంబు లనుభవించియున్నది.ఇంక ననుభవించుచునేయున్నది.
కృష్ణా! దుఃఖంబులన్నియుఁ గడచి మాజననిని నేను సుఖపెట్టుకాల
మెప్పుడైన వచ్చునా? మే మడవులకు వచ్చునపుడు పుత్రప్రేమచే నత్య
ధికదుఃఖపరవశయై యేడ్చుచు మావెంట నరుదెంచునామెను విడ
చియే మేము వనంబుల కరిగితిమి. ఆమె నిశ్చయంబుగ దుఃఖంబులచే
మృతినొందియుండును. ఆమె జీవించియేయున్నను బుత్రవ్యసనంబులచే
గాఢంబుగ నార్తినొందుచుండును. ఆమె దుఃఖంబులు పోవునట్లు నీ
వామె నాశ్వాసింపుము. అభివాదనం బాచరించినయనంతరం బామెను
నామాటలుగ ననామయం బడుగుము. మరియుఁ గురుకులజ్యేష్ఠుం డగు
ధృతరాష్ట్రునకును, వయోవృద్ధు లగు నితరరాజన్యులకును, భీష్మునకు,
ద్రోణునకుఁ, గృపునకు, మహారాజగుబాహ్లీకునకు, ద్రోణాత్మజునకు,
సోమదత్తునకును, దక్కుంగల భరతాన్వయులకును వృద్ధమధ్యబాలాది
వయోనుకూలంబుగ నభివాదనాలింగనకుశలప్రశ్నాదిమర్యాద లాచ
రించి నావాక్యంబుగ కుశలం బడుగుము. కౌరవులకు మంత్రధార

కుండు, మహాప్రాజ్ఞుం డగాధబుద్ధిమంతుండు మర్మజ్ఞుండు నగువిదురుని నాకుగా నాలింగనం బాచరింపుము. అనిపలికి రాజులమధ్యంబునఁ గృష్ణు నిచే ననుజ్ఞాతుండై యాతనికిఁ బ్రదక్షిణం బాచరించి మరలెను. తరు వాత నర్జునుండు కృష్ణునితో వెడలుచునే తనకు నెచ్చెలియుఁ బురుషు లలో నుత్తముండును బరవీరహంతయు నపరాజితుండు నగుమాధవు నితో నిట్లనియె. కృష్ణా! మొన్న మనమంత్రనిశ్చయసమయంబున సకల రాజులసన్నిధానంబున నర్ధరాజ్యంబు మనకుఁగావలయు నని నిర్ణయింపఁ బడుట యెఱుంగుదువుగదా? ఆసుయోధనుం డవమానించుతలంపు దలంగఁబెట్టి సత్కారపూర్వకంబుగ నిచ్చెనేని నాకత్యంతప్రియం బగును. ధార్తరాష్ట్రులు మృత్యుముఖంబువలన విడివడుదురు. వారలకు మహా భయంబుతొలంగును. ఉపాయంబుల నెఱుంగఁజాలనిమూర్ఖుం డాధార్త రాష్ట్రుం డట్లుగావింపక వేఱొకవిధంబున మెలంగెనేని నిశ్చయంబుగఁ గౌరవుల కెల్లరకును నాశనంబుగావించెద ననియె. సవ్యసాచి యిట్లు పలు కుటయు వృకోదరుండు మహాహర్షంబునొందెను. మఱియుఁ గ్రోధవశం బున నాతనియొడలు కంపమొందం దొడంగె. మహాభైరవారావంబుఁ గావించె. ధనంజయునివచనం బాలించినంత నాతనికిం గలిగినయుత్సాహం బింతంత యనరానిదై యుండెను. ఆతఁడు గావించుసింహనాదంబు లాలించి ధనుర్ధరులెల్లరు భయాతిరేకంబున గడగడ వడంకిరి గుఱ్ఱంబులు నేనుంగులును భయంబున మూత్రపురీషోత్సర్గంబు గావించెను. అర్జునుం డిట్లు తననిశ్చయంబును వాసుదేవున కెఱింగించి యతనిచే ననుమతుండై యాతని గౌఁగిలించికొని మరలివచ్చెను. అంత సకల రాజులును జనార్దను సెలవంది తిరిగివచ్చిరి.

### కృష్ణుండు మార్గంబున మహర్షుల నాలోకించుట

ఇట్లు పాండవులను రాజులనెల్లరను విడచి కృష్ణుండు పవన జవనంబు లగు తురంగంబులం బూన్చిన యరదంబెక్కి వెడలఁజొచ్చెను. దారకునిచేఁ దోలఁబడు నాశైబ్యసుగ్రీవమేఘపుష్పవలాహకంబులను తురంగంబులు ఆకాశంబులు గ్రసించునట్లును మార్గంబును ద్రావివైచు నట్లును మిగుల వేగంబునం బరువెత్తుచుండినవి. అట్లు ప్రయాణంబు సాగించుచు మార్గమధ్యంబున మార్గంబున కిరుప్రక్కల నిలిచియున్న

వారును బ్రహ్మవర్చసంబున నత్యధికంబుగ వెలుంగుచున్నవారు నగు మహర్షుల నాలోకించి రథంబు నిలిపి జనార్దనుండు భువి కవతరించెను. ఆతఁ డాఋషులకెల్ల నభివాదనం బాచరించి వారలనెల్ల నధికంబుగఁ బూజించి వారల కిట్లనియె. మహర్షిపుంగవులారా! లోకంబులకెల్లఁ గుశలంబకదా? మీధర్మంబుల కంతరాయము లేకుండ బాగుగ జరగుచున్నవా? బ్రాహ్మణులశాసనంబు నాదరించి మిగిలినక్షత్రియవైశ్య శూద్రులు మెలంగుచున్నారా? పితరులకు దేవతలకు నతిథులకును బూజలు చక్కఁగా జరుగుచున్నవా? అని కుశలప్రశ్నమ్మడిగి మఱియు నిట్లనియె. భగవంతు లెక్కడ బయలుదేఱితిరి. మీ రెంతవఱకు వెడల వలసియున్నది? భగవంతులారా! మీర లేకార్యంబునకై వేంచేయుచున్నవారు. దాసుండ నగు నేను మీకొనరింపవలసినపని యేదేనిగలదా? ఏప్రయోజనమునకై మీ రిట్లరుదెంచితిరి? మీరలు మహీతలంబునకు రాఁగతంబేమి. యని యడుగుటయునారదుం డాదిగాఁగలయాశంసితవ్రతు లగు మహర్షులెల్లఁ గేశవునికిఁ బ్రతిసత్కారంబులు గావించిరి. అథర్వుండు, సప్తమాలి, దేవలుండు, అర్వావసువు, సుజానుండు, మైత్రేయుండు, శునకుండు, బలి, బకుండు, దాల్భ్యుండు, స్థూలశిరుండు, కృష్ణద్వైపాయనుండు, ఆపోదధౌమ్యుండు, ధౌమ్యుండు, ఆణిమాండవ్యుండు, కౌశికుండు, దామోష్ణీషుండు, త్రిషవణుండు, పర్ణాదుండు, ఘటజానుకుండు, మౌంజాయనుండు, వాయుభక్షుండు, పారాశర్యుండు, శాలికుండు, శీలవంతుండు, అశని, ధాత, శూన్యపాలుండు, అకృతవ్రణుండు, శ్వేతకేతుండు, కోహాలుండు, రాముండు, మహాతపుండు ననునామహర్షులు కృష్ణునిఁ జూచి మిగుల నానందించిరి. కృష్ణుం డట్లు ప్రశ్నించినంత జామదగ్న్యుండు వాసుదేవుని సమీపించి కౌఁగిలించికొని యిట్లనిపలికె. మధుసూదనా! పుణ్యంబు లాచరించినదేవర్షులును బహుశ్రుత లగుబ్రాహ్మణులును రాజర్షులును నింకనుంగల తపస్వులు రెల్ల నిన్ను సమ్మానించుచున్నారు. వీరెల్లరును బూర్వు లగు సకలదేవతలను రాక్షసులను జూచియున్నవారు. భూమియందుఁగల రాజలోకంబెల్ల నొక్కచోఁ గూడియుండఁగాఁ జూడవలయునని వీరికిఁ గోరికగలదు. కౌరవులసభయం దెల్లరు సభాసదులు రాజులు. నీవు సత్యస్వరూపుండవు. జనార్దనుండవు. కావున నాసభమిక్కిలి ప్రేక్షణీయంబై యొప్పును. దానిం

జూడ మాకెల్లరకు వేడుకయగుచున్నది. రాజులెల్ల రాకక్షింపుచుండ నీవు కౌరవులకుఁ జెప్పుధర్మార్థసహితంబు లగుమాట లాలింపఁ గోరు చున్నారము. నీవచనంబులకుఁ గౌరవులు పల్కు ప్రతివచనంబులుగూడ నాలింతుము. భీష్మద్రోణాదులును మహామతియగువిదురుండును యాదవ శార్దూలంబవగు నీవు నాసభయందుఁ గలిసికొందురుగదా? దివ్యంబులు సత్యంబులు హితంబులు నగు నీవాక్యంబులును గౌరవులవాక్యంబులు నాలింతుము. ఇప్పుడు మాయెల్లరచే నాపృష్టుండవైతివి. మరల నీదర్శనం బొనరింతుము. నిర్విఘ్నంబుగ నేగుము. మరల సభయందు నిన్నాలో కింతుము. దివ్యంబగునాసనంబున నాసీనుండవై బలతేజంబులచే వెలుంగు నిన్నుం గాంచి మానయనంబులు సఫలంబులు గావించికొందు మని పచించె. అట్లు మహర్షులచే ననుజ్ఞాతుండై యరుగుచున్న దేవకీనందనుని బరవీరభయంకరు లగు మహారథులు సకలసమరసన్నాహంబులు మెఱయ శస్త్రపాణులై పదువురును, కాలిభటులు వేవురును, దురంగసాదులు వేవురు ననుసరించి వెడలిరి. మఱియుఁ ద్రోవయందు భుజించుటకు వలయు భోజ్యపదార్థంబులు బహుళంబుగాఁగొని యనేకు లగుసేవకులును నను సరించి వెడలిరి.

## కృష్ణుండు వృకస్థలంబున రాత్రి విడియుట

యాదవసింహం బగు వాసుదేవుం డట్లు కదలి యరుగునపుడు కౌరవుల కశుభంబుదెలుపు దుశ్శకునంబు లనేకంబులు ప్రాదుర్భవించె. మేఘంబులేకయే యాకసంబున మెఱుపులుపొడసూపె. పిడుగులుపడియె. అత్యధికముగ వర్షంబుగురిసె. ప్రాఙ్ముఖంబుగఁ బ్రవహించుసింధునది మొదలగు నేడుమహానదులు ప్రత్యఙ్ముఖంబుగఁ బ్రవహింపందొడంగె. దిక్కులన్నియు విపరీతంబులై యేర్పఱుప శక్యంబుగాకుండె. అగ్నులు వెలుంగఁజొచ్చెను. పృథివీతలంబు గడగడవడంకె. నూతులనుండియుఁ గుండలనుండియు నీరుపొంగి పైకిఁ బ్రవహించె. జగంబెల్లఁ జీఁకటులు గ్రమ్మి యేవస్తువులు నేర్పఱింపరాకుండెను. ధూళిచేఁ గప్పంబడి దిక్కులు విదిక్కులు గానరావయ్యె. భీకరంబు లగు నినదంబు లంతరిక్షంబునం జెలంగె. ఆకాశంబున తలలేనిమొండెము లెగురందొడంగె. సర్వదేశంబు లందు నీయుత్పాతంబులు భయంకరంబులై చూపట్టె. హస్తినపురంబున

దక్షిణపశ్చిమాంతరాళంబుననుండి మహాప్రచండం బగు గాలివీచి పట్టణం బెల్ల నల్లకల్లోలముగావించె. పరుషంబును పిడుగులంబోని బెడిదంపు జప్పుడునుంగల యామహావాయువు మహావృక్షంబులఁ బెల్లగించి నేలం గూల్చె. వృష్ణిపుంగవుం డగు మధుసూదనుం డేయేస్థలంబుల కరిగె నా యాపట్టులందు సుఖస్పర్శంబు ప్రదక్షిణంబు నగుమందమారుతంబు వీవం బొడంగె. ఆతనిరథంబుపైని గమలంబులు మొదలగుమాంగళ్యంబు లగు కుసుమంబులు వర్షించె. మార్గంబు నిమ్నోన్నతంబుగాక సమంబై సుఖప్రయాణంబై యొప్పె. మార్గంబున గుళంబులు కంటకంబులు లేకుండె. వసుప్రదుం డగు వసుదేవనందనుని మార్గంబున నెడనెడ బ్రాహ్మణప్రవరులు లాజంబులు పుష్పంబులు జల్లి యాతనికి మధు పర్కం బొసంగి మహార్థవంతంబు లగు నాశీర్వాదంబు లొసంగి విలువ గలమణికనకాంబరాదులఁ గానుకలిచ్చి సత్కరించిరి. స్త్రీలందఱును ద్రోవయందు గుంపులుగూడి సుగంధభరితంబు లగువన్యకుసుమంబుల సర్వభూతహితాభీరతుం డగు నాతనిపై వర్షించిరి. వాసుదేవుండు సర్వ సస్యసంపన్నంబు సుఖనివాసయోగ్యంబు రమ్యతరంబు పరమధర్మిష్ఠంబు నగుశాలిభవనంబు నతిక్రమించి కురుపాలితదేశంబులం బ్రవేశించె. బహుపశుసంపదలతో నిండియుండుగ్రామంబులును మనోహరంబులు హృదయానందకారణంబులు నగుపురంబులును వివిధంబు లగురాష్ట్రం బులు నతిక్రమించె. ఆదేశంబులు నిత్యసంతోషము గలిగి భారతులచేఁ బరిపాలింపఁబడుచుండెను. దానియందు వసించుజను లెన్నండును శత్రు భయం బెఱుంగరు. వారేవ్యసనంబుల పొంతంబోవువారుకారు. ఉపప్లా వ్యంబునుండి మధుసూదనుండు బయలుదేఱినవార్త విని యాజను లెల్లరు నాతనింజూచువేడుకలలర మార్గంబున గుంపులుగుంపులుగాఁ జేరి దేశాతిథియై వచ్చినయామకుందున కర్హంబులగుపూజలఁగావించి సత్క రించిరి. మార్గంబున నట్లు సత్కారంబులందుచు నాదిత్యుండు కిరణం బులవేఁడిమితఱిగి యెఱ్ఱనికాంతితో నపరదిక్కున వేలాడుసమయంబున మధుసూదనుండు వృకస్థలంబున కరిగి తనయనుచరుల నాలోకించి నేటి రాత్రి యిక్కడవిడిసి యెల్లి తేపకడ పయనంబు సాగింత మని యాన తిచ్చె. ఆయానతి నాలించి యాతనియనుచరు లక్కడ విడిదిగావించిరి. ఒక్కక్షణంబులో వివిధంబు లగు నన్నపానంబులు సేకరించిరి. అపుడు

జనార్దనుండు రథం బవతరించి శౌచకృత్యంబులు యథావిధిగ నిర్వ ర్తించి రథంబు విడువంబంచి సంధ్యాకాలకృత్యంబు లాచరించె. దారు కుండును దురంగంబుల కళ్లెంబు లెడలించి శాస్త్రీయవిధానంబున వానికి బరిచారంబులు గావించి యోక్త్రంబులాదిగాఁ గల్గుబంధనంబులెల్ల సడ లించి వానిని విడిచెను. ఆగ్రామంబునంగల బ్రాహ్మణులు ప్రధానులు నార్యులు సత్కులసంజాతులు శ్రీమంతులు బ్రాహ్మవృత్తి నాలంబించు వారును ముకుందునికడ కేతెంచి యాశీర్వాదంబులు మంగళాలంభనం బులుం గావించి యథాన్యాయంబుగ నాతని బూజించిరి. వార లామహా త్ముని విధివిధానంబున నర్చించి యాతనికి మహాసమృద్ధంబులగు తమ గృహంబులు నివేదించిరి. వాసుదేవుండు వారల నెల్ల నభినందించి వారలసత్కారంబు లంగీకరించి వారితోడ వారలగృహంబుల కరిగి చూచి మరల విడిదికేతెంచె. ఆవిడిదియందు దామోదరుండు బ్రాహ్మణు లకు సుమృష్టంబు లగునన్నపానంబులచేఁ దృప్తిగావించి తానును వార లతోఁగూడి భుజించి యారాత్రి నక్కడ సుఖంబుగ గడిపెను.

## ధృతరాష్ట్రుండు వాసుదేవునిమార్గం బలంకరింప నానతిచ్చుట

అంత నక్కడ నాంబికేయుండు దూతలవలన మధుసూదనుం డరుగుదెంచుచున్నవాఁడని యెఱింగి మహాభుజుం డగు భీష్ము ద్రోణుని సంజయుని విదురుని దుర్యోధనుని వానిమంత్రులను బిలిపించి వార లతో హర్ష పులకితసర్వావయవుండై యిట్లనియె. వింటిరే. నేఁడద్భుతంబు మహాశ్చర్యంబు నగు నొక్కవార్త యేతెంచినది. ప్రతిగృహంబునను స్త్రీలు వృద్ధులు బాలకులు నాశ్చర్యంబుగఁ జెప్పికొనుచున్నవారు. చత్వ రంబులందును సభాంగణంబులందును జనులు బరస్పరసత్కారంబులతో డను బృథగ్వాదంబులతోడను నీవార్త చెప్పుకొనుచున్నవారు. మహాబల పరాక్రమసంపన్నుం డగు దాశార్హుండు పాండవకార్యార్థియై మనపురం బున కేతెంచుచున్నవాఁడఁట! ఆతండు మన కెల్లవిధంబుల మాన్యుండు పూజనీయుండు నై యున్నవాఁడు. ఆతనియందు లోకయాత్ర సుప్ర తిష్ఠితంబై యున్నది. ఆతం డెల్లభూతంబులకు నధీశ్వరుండై వెలుంగు చుండును. జనార్దనునందు ధైర్యము వీర్యము శౌర్యము నౌదార్య మును బ్రజ్ఞయుఁ దేజంబును స్థిరంబులై యుండును. నరశ్రేష్ఠుం డగు

మద్గృహము దుర్యోధనుమందిరంబుకంటె నుత్తమం బగునది. దాని నిప్డు సకలాలంకారంబులచే నలంకరింపుఁడు. రుచిరాకారంబు లగు ప్రాసాదంబులచే సుపశోభితంబగు నామందిరము సర్వర్తుసుఖావహంబై యుండును. ఆగృహంబున నాయెడను దుర్యోధనునెడనుం గలరత్నంబు లెల్లనుంచి యలంకరింపుఁడు. ఆయదుసింహంబున కేదేని యర్హం బగు దానినెల్ల నిస్సంశయంబుగ నొసంగుఁడు అని వచించె.

### విదురుఁడు ధృతరాష్ట్రునిభేదోపాయంబు నిరసించుట

అదివిని విదురుండు ధృతరాష్ట్రున కిట్లనియె. రాజా! నీవు ముల్లోకములందు బహుమతుండవును సత్తముండవునై యున్నవాఁడవు. పశ్చిమంబగు వయస్సునుండియు నీవిషమం బగుసమయంబున నిట్లు వచించి నందులకు నిన్నెంతయు మెచ్చవచ్చును. శాస్త్రంబువలనను దర్కంబు వలనను నీవు సుస్థిరుండ వగు వృద్ధుండవని నాతలంపు. నీవు లోకంబు నకు సంభావితుండవును సమ్మతుండవునైతివి. సూర్యునందు చంద్రమండలసన్నిభంబులగు కిరణంబులును సముద్రంబున మహాతరంగములు నెట్లు ప్రసిద్ధంబులై యుండునట్లే నీయందు ధర్మంబు సుప్రతిష్ఠితంబగు నని ప్రజలు నమ్ముచున్నవారు. లోకంబు నిత్యము నీగుణౌఘములచే సంభావితంబయ్యెను. నీవు నీగుణంబులరక్షించుకొనుటయందు జాగరూకుఁడవై ప్రయత్నింపుము. ఆర్జవంబునొందుము. బాల్యస్వభావం బవలంబించి నాశ మొందఁబోకుము. రాజా! పుత్రులను పౌత్రులను సుప్రియులగుమిత్రులను గృష్ణున కెదురుగాఁ బంచి యతిథిసత్కారంబుగావించు టెంతయు సముచితంబై యున్నది. కృష్ణుం డింతయ కాదు; మహీమండలం బెల్ల నర్పించి సత్కరించినను దగువాఁడే. నీవు ధర్మంబు నాలోచించి కాని కృష్ణునకుఁ బ్రియమాచరింపవలె ననుతలంపునంగాని యాతని కీసత్కారంబులుగావింపలేదని నేనెంచుచున్నవాఁడను. సత్యంబుగ నా మనంబు నీయెడ శంకించుచున్నయది. నిక్కంబుగ నీభూరిసత్కారంబు లెల్ల మాయామయంబులు గపటంబులు నని నాకుఁ దోఁచుచున్నయవి. రాజా! నీవు బాహ్యంబులగు నొనర్చుకర్మంబులచే నీయం దడంగియున్న నిగూఢం బగుభావంబున నేను జక్కఁగ నెఱుంగఁగల్గుచున్నవాఁడను. పాండవు లేవురు నేను చిన్న గ్రామంబులనుమాత్రమే వాంఛించుచున్న

వాఁడు. అనియేని వారల కిచ్చుతలంపు నీకు లేదు. వారల కేవిధంబునను శాంతికల్పింపకున్నాఁడవు. మహాప్రాజ్ఞుండగు వార్ష్ణేయు నర్థంబున మోహపుచ్చి హరింపఁదలంచుచున్నాఁడవు. ఈయుపాయంబునఁ గృష్ణుని బాండవులవలన భేదింపఁజూచుచున్నాఁడవు. విత్తంబునంగాని యుపచారంబుల వలనంగాని ధనంజయునివలనఁ గృష్ణుని వేఱుసేయుట కెవ్వరికిని వశంబు గాదు. కృష్ణునియొక్క మాహాత్మ్యంబు నేనెఱుంగుదును. అర్జునున కాతనియెడఁ గలదృఢభక్తినిఁగూడ నెఱుంగుదును. ప్రాణతుల్యుం డగు ధనంజయుని వాసుదేవుం డెన్నఁడు నేకారణంబులనుంగూడ విడువం డనియు నెఱుంగుదును. అసంపూర్ణజలకుంభమును బాదప్రక్షాళన క్షమంబగుజలంబును గుశలప్రశ్నంబునుం దక్కఁ దక్కిన నీకావించు సత్కారంబు లేవియు నాజనార్దనుం డంగీకరింపఁడు. మానార్హుండగు నీమహాత్మునకుఁ బ్రియం బగు నాతిథ్యమేదియో దానినే కావింపఁ బ్రయత్నింపుము. ఎల్లభంగుల నాతండు మానార్హుండు. ఆతండు కల్యాణంబు నాశించుచుఁ గౌరవులకడ కేతెంచుచున్నవాఁడు. ఆతఁ డేకార్యంబున నీపాలి కరుగుదెంచుచున్నాఁడో యాకార్యంబుగావించి యతని యభీష్టం బర్పింపుము. దాశార్హుండు నీకును నీతనయునకును బాండవులకును శమం బభిలషించుచున్నవాఁడు. కావునఁ దప్పక యాతనివచనం బాదరింపుము. ఆతఁడు వచించినట్లు నిస్సంశయంబుగఁ బ్రవర్తింపుము. రాజా! నీవు పాండవులకుఁ దండ్రివి. వారు నీపుత్త్రులు. నీవు వృద్ధుండవు. వారు శిశువులు. వారలయందు నీవు పితృభావంబు నెఱపుము. వారలు నీయందుఁ బుత్త్రకృత్యంబులు నెఱపుచునే యున్నవారు.

### దుర్యోధనుండు కృష్ణునకు సత్కారం బాచరింపవలదనుట

అట్లు విదురుండు పలికినవాక్యంబు లాలించి సుయోధనుండు తండ్రి కిట్లనియె. జనకా! శ్రీకృష్ణువిషయంబున విదురుండు వచించిన దెల్లను సత్యంబే కాని యందసత్యము లేశమేని లేదు. జనార్దనుఁడు పార్థులయెడ మిగుల ననురాగముగలవాఁడు. పార్థులవలన నాతని భేదించుట కెవరికిని దరముగాదు. అనేకరూపం బగుధనంబును సత్కారయుక్తంబుగ జనార్దనున కిచ్చెదనని నీవంటివే యాధన మాతని కీయవలదు. ఇపుడు మనము సత్కార మాచరించుటకు దేశంబుగాని

కాలంబుగాని యనుకూలంబులుగావు. దేశకాలపాత్రంబుల విచారింపకయ దానంబుగావించు టుచితంబుగాదు. మనమిప్పు డాతని నర్చించితిమే నాతం డదియెల్ల మనము భయవిహ్వాలులమై చేయుకార్యములుగా నాలోచించును. దానివలన మన కవమానంబుగూడ జనించును. ఏ కార్యంబువలన నవమానంబు గల్గునో యాకార్యంబు క్షత్రియుం డెన్నండు నాచరింపంజనదు. మూఁడులోకములకు నారాధ్యుం డగు కృష్ణుండు మనకర్చనీయుండనుట నిస్సంశయమే. అయిన నిప్పు డాతని నర్చించుటమాత్రము కార్యగతికి విరుద్ధమని నాతలంపు. మనకును బాండవులకును విగ్రహంబు ప్రారంభమైయే యున్నది. అది యిపుడు విగ్రహంబుమానుటవలన నించుకయు శాంతింపదు. అనునంత భీష్ముండు ధృతరాష్ట్రు నాలోకించి యాతని కిట్లనియె. అంబికాత్మజా! జనార్దనుండు సత్కృతుండయినను నసత్కృతుం డయినను గూడఁ గోపించువాఁడు గాఁడు. కేశవున కెవ్వరే నవమాన మొనర్చిరేనియు మరల నాతఁడు వారల నవమానింపఁదలంపఁడు. వాని కవమానం బాచరించుట దగదు. వానికవమానంబు గూర్చుటయు నశక్యము. నీవు మనంబున నేకార్యం బొనరింపవలయునని యెంచితివో దాని నవశ్యము నాచరింపుము. ఆతం డేకార్యం బాచరింప మనంబున నిశ్చయించునో దాని నన్యథాకరింప నెవ్వనికిని దరంబుగాదు. ఆమహాబాహుం డేది వచించునో దాని నిశ్శంకముగ నాచరింపందగును. వాసుదేవునిమూలంబున శీఘ్రంబుగనే పాండవుల శాంతపఱుపుము. ధర్మాత్ముం డగువాసుదేవుండు ధర్మంబు నర్థ్యంబు నగువాక్యంబునే వచించును. దాని కించుకేని సంశయింపఁబనిలేదు. నీవును నీబాంధవులు జనార్దనునకుఁ బ్రియం బగురీతిని జరించుట కురుకులంబునకు శ్రేయస్కరంబగును. అని వచింప సుయోధనుండు మరల నిట్లనియె. శాంతనవా! నీవు మాకెల్లరకును బితామహుండవు. అయిన నాయభిమతంబు బాగుగ వినుము. ఈసకలం బగుభూమండలంబెల్లఁ బాలింప నేను సమర్థుండను గానేమి? బ్రతికియున్నంతకాలము పాండవులతోఁగలిసియుండియే దీని ననుభవింపవలయునా? ఆహా! ఇవెక్కడి మాటలు. ఇదే నామనోనిశ్చయం బాలింపుము. నేనిప్పు డొక్కమహాకార్యంబు గావింపఁదలంచితిని. పాండవులకుఁ బరాయణం బగు జనార్దను నిక్కడ కేతెంచినపుడు బంధించివైచెదను. వానిని బంధించినంతనే

వృష్ణులును భూమియుఁ బాండవులునుగూడ నాకు విధేయులై చరింతురు. ఆజనార్దనుండు ప్రాతఃకాలంబున నిక్కడకు రానున్నాఁడు కదా? మనయాలోచనంబులు కృష్ణున కెట్లును దెలియకుండను, మన కించుకంతయు నపాయంబు లేకుండునట్లును దగునుపాయం బెఱింగింపుము.

ఘోరంబు కృష్ణునియెడం గావింపఁదలంచిన విషయంబు సుయోధను వలన విని ధృతరాష్ట్రుండును నాతనిమంత్రులును మిగుల వ్యథితచిత్తులైరి. అపుడు ధృతరాష్ట్రుండు సుయోధనుతో "వత్సా! నీవు ప్రజాపాలకుండవై యుండియు నిట్లనుట దగదు. ఇది సనాతనం బగుధర్మంబునకు విరుద్ధం బగుకార్యము. హృషీకేశుండు దూతగా నరుదెంచుచున్నవాఁడు. మఱియు మన కాతండు ప్రియుం డగుబాంధవుండు. కౌరవుల కెన్నఁడు నాతఁడు పాపంబు లేశమాత్రమే నాచరింపలేదు. అట్టియెడ నాతని బంధించు టుచితంబగునా" యనియె. అనంతరము శాంతనవుండు "ధృతరాష్ట్రా! అతిమందమతి యగు నీతనయుండు మిగుల విపరీతుండై యున్నవాఁడు. వాని నెంతగా ప్రార్థించినను మంత్రులతోఁగూడి యనర్థంబులనే గోరుచున్నవాఁడుగాని యర్థంబులపొంతఁ బోవకున్నాఁడు. ఇట్టి యున్మార్గగామిని పాపునుబాపానుబంధుని నీవుకూడ హితులవాక్యంబుల నెల్లఁ దృణీకరించి యనుసరించుచున్నవాఁడవు. దుర్మతి యగు వీఁడక్లిష్టకర్ముం డగుకృష్ణు నెదిరించి క్షణకాలంబున సహాయులతోఁగూడ నశించును. పాపుండు నృశంసుండు పరిత్యక్తధర్ముండు దుర్బుద్ధియు నగు వీని యనర్థాశ్రితంబు లగువాక్యంబులు విననొల్లను కావున నేనిదె యిచ్చటు వీడిపోవుచున్నాఁడ" నని పలికి సత్యపరాక్రముండు భరతశ్రేష్ఠుండు విద్యావయోవృద్ధుండు నగుశాంతనవుండు కోపభరం బాపలేక యచ్చోటువాసి వెడలిపోయెను.

### శ్రీకృష్ణుఁడు హస్తినపురంబు ప్రవేశించుట

అంత నక్కడ వృకస్థలంబున హృషీకేశుండు రాత్రి సుఖసుప్తుండై ప్రాతఃకాలంబున శకుంతసంతాననినాదంబులు వందిమాగధస్తుతిపాఠంబులు బ్రాహ్మణవేదపారాయణంబులు సెలంగుచుండ మేల్కాంచి కల్యకృత్యంబులు నిర్వర్తించి హస్తినపురంబునకుఁ బ్రయాణం బయ్యె. ప్రయాణసన్నాహంబున నున్న మధుసూదనుని వృకస్థలనివాసు లగు

బ్రాహ్మణాదిజనంబులెల్లరు నగారి మాతసి సాగసంపుటకుఁ గొంత దూరము వెంటనడచిరి. జనార్దనుండు బ్రాహ్మణులకును దీనులకును ధన కనకమణివసనాదు లొసంగి సత్కరించి వారలచే నసుమతుండై రథా రోహణంబుగావించి హస్తినపురంబునకుఁ బయనంబయ్యె. కృష్ణుండు వచ్చుచున్న వార్త నాలించి దుర్యోధనుండుదక్క నెల్లరు ధార్తరాష్ట్రులును భీష్మద్రోణాదివృద్ధులును నానాలంకారభూషితులై రథంబు లధిరోహించి యెదురుగాఁ జనుదెంచిరి. హృషీకేశు నాలోకించుకుతూహలంబున పౌరులెల్లరును స్త్రీలు బాలురు వృద్ధులును నానాభూషణభూషితులై రథంబులు వాహనంబులునెక్కి కొందఱును పాదచారులై కొందఱు నెదురుచనుదెంచిరి. శ్రీకృష్ణుండు మార్గంబున ధార్తరాష్ట్రలను భీష్ముని ద్రోణుని గలిసికొని వారలచే యథార్హంబుగ సత్కృతుండై వారలతోఁగూడ నగరంబునకుం జనియె. కష్ణుని సమ్మానించుటకై పురంబు సకలాలంకరణములచే నలంకృతమై కన్నులపండువు గావించుచుండె. రాజమార్గంబులందు విచిత్రంబు లగు మణిగణంబులచేఁ దోరణమాలికలు నిర్మింపంబడియె. పురంబునంగల జనంబులు బాలురు స్త్రీలు వృద్ధులు మొదలగువారెల్లరు గేశవు నాలోకించుకోరికలచే రాజమార్గంబున కిరుప్రక్కల బారులుదీర్చి నిలిచియుండిరి. గృహంబులం దొక్కనరుండైనఁ గానిపింపఁడయ్యె. గృహంబులెల్ల నుత్తమాంగనలచే నావరింపఁబడి హృషీకేశునితోఁగూడ నడచుచున్నవియో యనఁ జూపట్టె. అట్టియెడ వాసుదేవునిరథంబునకుం బన్నినయుత్తమాశ్వంబులాజనసంబాధంబుగల రాజమార్గంబున నించుకయు నదరుబెదరులేక విచిత్రగమనంబున రాజమందిరంబు దరియం జనియె. పుండరీకాక్షుండు పాండువర్ణంబు లగు ప్రాసాదమాలికలచే రమణీయం బగుధృతరాష్ట్రభవనంబు సమీపించి, రథావతరణంబుగావించి మూఁడుకక్ష్యలు పాదచారియై యతిక్రమించి ధృతరాష్ట్రుకొలువుకూటంబు ప్రవేశించె. గోవిందుండు సభాప్రవేశంబుగావించినంతన ప్రజ్ఞాచక్షుం డాసనంబు నుండి లేచి నిలువంబడియె మఱియు భీష్ముండు ద్రోణుండు కృపుండు సోమదత్తుండు బాహ్లీకుండు మొదలగువారెల్లరు నాసనంబుల వీడి నిలచి జనార్దనుని బూజించిరి. మాధవుండు తొలుత భీష్ముని ధృతరాష్ట్రుని గుశలప్రశ్నంబులచే గౌరవించి యనంతరము వయస్సు ననుసరించి యెల్ల

రాజుల సుచితరీతుల గౌరవించెను. పదంపడి ద్రోణుని గృపుని ద్రోణాత్మజుని సోమదత్తుని బూజించెను ధృతరాష్ట్రుం డాజ్ఞాపింపఁ బరిచారకు లూర్జితంబు మణిగణాలంకృతంబు నగు కాంచనమయం బగు నాసనంబును దెచ్చి గోవిందున కీయ నతఁ డం దుపవేశించె. తరువాత ధృతరాష్ట్రనిపురోహితులు జనార్దనునకు గోవును మధుపర్కంబు నుదకంబు నర్పించిరి. ఇటు లతిథిపూజలచే సత్కృతుండై వాసుదేవుండు కౌరవుల తోడఁ జుట్టఱికంబుసల్లాపంబులతోఁ గొంత ప్రొద్దు కడపెపుచ్చెను. అనంతరము ధృతరాష్ట్రునికడ సెలవంది యారామునిరంబు వెలువడి బయలుదేఱి రమ్యం బగువిదురుమందిరంబున కేతెంచె. విదురుండును సకల కల్యాణవస్తుజాలంబులతో జనార్దనున కెదురువచ్చి విధివిధానంబున నాతనిం బూజించె. కృష్ణున కాతిథ్యంబు నెఱపినయనంతరము విదురుండు ప్రియపూర్వకంబుగఁ బాండవులెల్లర కుశలంబును బ్రశ్నించె. వాసుదేవుండును ధర్మార్థనిత్యుండు సుహృదయుండు గతరోషుండు నగు విదురునకుఁ బాండవుల క్షేమంబును వారలయభిమతంబును సవిస్తరంబుగ నెఱింగించె.

## కృష్ణుండు కుంతీదేవికడ కరుగుట

వాసుదేవుండు విదురోపగమనానంతరము మధ్యాహ్నసమయంబునఁ దనతండ్రికిఁ జెలియలగు కుంతీదేవిసదనంబున కరిగె. తనమందిరంబున కరుదెంచిన ప్రసన్నాదిత్య తేజస్కుం డగు మధుసూదనునికంఠంబు గౌఁగిలించికొని కుంతీదేవి తనతనయులఁదలంచి ముక్తకంఠంబుగ రోదన మాచరించె. సత్వవంతు లగు తనతనయులతోఁగూడి వసించెడికృష్ణుని జూచినంతన యామెకుఁ గన్నీరుమున్నీరై పర్వెను. అనంతరము కుంతి కృష్ణునకు యథోచితసత్కారంబు లాచరించి యాసనంబునఁ గూర్చుండ నియోగించి బాష్పగద్గదకంఠియై ముఖంబు పరిశోషంబొందుచుండ నాతని కిట్లనియె. కేశవా! పాండవులు బాల్యంబునుండియు గురుశుశ్రూషణమునం దత్యంతాభిరతిగలవారు. వారలొండొరులయెడ నత్యంత ప్రీతిగలిగి సమానం బగుచిత్తవృత్తిగలిగి మెలంగుచుందురు. జనంబు నేలఁదగువారు. నికృతిచే రాజ్యభ్రంశ మొంది యడవుల కంపఁబడిరి. వారలు వినీతంబు లగు క్రోధంబు హర్షంబుగలవారు. బ్రాహ్మణ్యులు సత్య

వాక్యములు. సుఖంబును బ్రియంబును బరిత్యజించి యేడ్చుచున్న నన్నిట విడిచి వనంబున కేఁగిరి. వారలు వనంబున కరుగుచు నాహృదయంబును గూడ సమూలంబుగఁ వెంటఁగొనిపోయిరి. నేనిక్కడ హృదయశూన్య నై యుంటిని. వనవాసానర్హు లగుపాండవులు సింహవ్యాఘ్రవరాహ వారణమహాభయంకరం బగు విపినంబున నెట్లు నివసించియుండిరోకదా? బాల్యంబునన పితృవిహీను లగువారలను నేనెల్లపుడు నెల్లప్రియముల లాలించి పెంచితిని. వా రాయరణ్యంబులందు మాతాపితృహీనులై యెట్లు దుఃఖంబు లనుభవించియుండిరోకదా? బాల్యంబునుండియుఁ బాండవులు ప్రాతఃకాలంబులందు శంఖారావంబులు భేరీనినదంబులు వేణునిస్వానంబులు వీణారవంబులు మొదలగుమంగళధ్వనులాలించి నిద్ర విడిచి మేల్కాంచువారు. బ్రాహ్మణులెల్లరును సూర్యోదయావసరంబున స్వస్తిపుణ్యాహంబులఁజదువుచుఁ బాండవుల నాశీర్వదించెడివారు. మత్త వారణంబుల ఘీంకారంబులు నుత్తమాశ్వంబుల హేషారవంబులు రథ నేమినినాదంబులు నాలించి నిద్ర మేల్కాంచువారు. మహాత్ము లగు బ్రాహ్మణోత్తముల మంగళవచనంబులచే మేల్కని వారికి వస్త్రంబు లలంకారం బులు నభిమతంబు లగుధనంబులు నొసంగి పూజించెడివారు. అర్చనార్హు లగువారలెల్ల నర్చితులై మంగళస్తవంబులచే స్తుతించుచుండ ప్రాసా దాగ్రంబుల రంకవాజినపరిస్తృతంబులు మహార్హంబులు నగు శయనం బులంబండికొని మేల్కాంచెడివారు. మహావనంబునఁ గ్రూరంబు లగు శ్వాపదంబుల నినాదంబు లాలించుటంజేసి నిద్రబొందకయే యుందురు. భేరీమృదంగనినాదంబులచేతను శంఖారవంబులచేతను వేణుగానంబుల చేతను మధురంబు లగుస్త్రీలసంగీతకంబులచేతను వందిమాగధసూతుల స్తుతిపాఠంబులచేతను మేల్కాంచినమహాత్ములు ఘోరంబు లగుకాంతా రంబులందు శ్వాపదంబులరుతంబులచే నెట్లు మేల్కాంచిరో? హ్రీమం తుండు సత్యనిరతుండు ధృతిమంతుండు దాంతుండు నెల్లభూతం బులయెడ ననుకంపగలవాఁడు నగుయుధిష్ఠిరుండు కామద్వేషంబుల వశంబుగావించుకొని సజ్జనాచరితం బగుమార్గంబునం బ్రవర్తించుచున్న వాఁడు. అంబరీషుండు మాంధాత యయాతి నహుషుండు భరతుండు దిలీపుండు శిబి యౌశీనరుండు మొదలగుపురాతనులగు మహారాజులకుం గూడ వహింపశక్యముగాని ధర్మభారమును వహించుచున్న వాఁడు.

ధర్మనందనుండు శీలవృత్తసంపన్నుండు. ధర్మాధర్మవేది. సత్యవాక్యప్రతి
పాలనుండు. సర్వసుగుణంబులవలనఁ ద్రిలోకరాజ్యంబునకుంగూడ
రాజుగాఁ దగువాఁడు. ధర్మాత్ముండు. ఎన్నండు నెవ్వని ద్వేషించి
యెఱుంగనివాఁడు. శుద్ధజాంబూనదనిభాంగుఁడు. కౌరవులెల్లరయందును
శాస్త్రంబునను సత్ప్రవర్తనంబునను శ్రేష్ఠతముండు. ప్రియదర్శనుండు,
దీర్ఘభుజుండు నగు నాయుధిష్ఠిరుం డెట్లున్నవాఁడు? ఆతనికి క్షేమమా?
పదివేలయేనుంగులకు సమానం బగుబలంబుగలవాఁడు, వాయువేగసమా
నవేగంబుగలవాఁడు, మహాబలపరాక్రమోపేతుండు, నిత్యంబును నమ
ర్షణుండు, సోదరులకుఁ బ్రియుండు, సోదరప్రియాచరణనిరతుండు నగు
భీముండు సుఖంబున్నవాఁడుగదా? ఆమహాబలుండు కీచకుని వాని
జ్ఞాతులతోఁగూడ వధించె. క్రోధవశుండై హిడింబుని బకుని పరిమార్చె.
శూరుండగునాతండు పరాక్రమంబున దేవేంద్రునంతటివాఁడు. బలంబున
వాసుదేవునకు సాటియగువాఁడు. క్రోధంబున మహేశ్వరు ననుకరించు
వాఁడు. యోధులకెల్ల నుత్తమోత్తముఁ డగు భీమసేనుండు క్రోధంబు
బలంబు నమర్షంబును దిగద్రావి జితాత్ముండై యగ్రజునిశాసనంబున
మిగుల వినతుండై యున్నవాఁడుగదా? వాఁడు తేజోరాశి, మహా
త్ముండు, అమితౌజస్కులకెల్ల వరిష్ఠుండు. చూచుటకునైతము భయం
కరమగువాఁడు. జనార్దనా! ఆపరంతపుం డగుభీమసేనుం డెట్లున్నవాఁడు?
మహాపరిఘబాహుం డగు నాపాండవమధ్యమునకు నేమమేకదా? కేశవ!
మనయర్జునుండు రెండుచేతులుమాత్రముగలవాఁడయ్యు వేయిబాహు
వులుగల కార్తవీర్యార్జునున కీడురాఁదగువాఁడు. ఒక్కయూపున నే
నూఱుబాణంబుల నొక్కుమ్మడిం బ్రయోగింప సమర్థుఁడు. శస్త్రాస్త్రము
లందు కార్తవీర్యార్జునునకు సమానుండు. తేజంబున నాదిత్యునకు
సదృశుండు. దమంబుల మహర్షి సన్నిభుండు. క్షమాగుణంబున భూదేవికి
సమానుండు. విక్రమంబున మహేంద్రునంతటివాఁడు. మధుసూదన!
సర్వరాజులందును గౌరవుల కెవ్వండు బాహువీర్యంబు పెంపున నధి
రాజ్యంబు సంపాదించెనో? పాండవులు నిత్యంబు నెవ్వనిబాహుబలం
బాశ్రయించి వెలుంగుదురో, యెవ్వాఁడు రథికులకెల్లను శ్రేష్ఠుండో,
యట్టిధనంజయుండు సత్యవిక్రముం డను ప్రఖ్యాతిం గాంచినవాఁడు.
వానిని యుద్ధంబున నెదిరించినశాత్రవుం డెన్నండును బ్రాణంబులతోఁ

దిరిగి రాఁజాలఁడు. ఎవ్వండు సర్వభూతంబులను జయింప సమర్థుండో, యెవ్వాని జయింప నింద్రాదులకునైనఁ దలవి కాదో, దేవగణంబులకు వాసవుండుంబోలెఁ బాండవులకెల్లఁ దాశ్రయంబైనవాఁడు నగుధనంజయుండు నీకు భ్రాత నెచ్చెలియు నై యున్నవాఁడు. ఆధనంజయుం డిప్పు డెట్లున్నవాఁడో యెఱింగింపుము. మధుసూదనా! సహదేవుండు సకలభూతంబులందు దయావంతుండై హ్రీనిషేవణుండై వెలుంగుచుండును. ఆతం డెఱుంగనిమహాస్త్రంబు లుండఁబోవు. వాఁడు మృదుస్వభావుండు సుకుమారుండు ధార్మికుండునై నాకు మిగులఁ బ్రియుండై యున్నవాఁడు. మహాధనుర్ధరుం డగు సహదేవుండు యుద్ధంబుల నెట్టివీరులనే నక్రమంబున జయింపంగలపరాక్రమంబు దేజరిల్లుచుండు. వాఁ డెప్పుడును సోదరుల శుశ్రూషించుటయం దత్యంతాభిలాషముగలవాఁడు. ధర్మార్థంబులం దత్యంతకౌశలంబుగలవాఁడు వాసుదేవా! సహదేవునియెడ నాతనియన్నలుగూడ నెల్లవేళలం దెడ తెగని ప్రీతి చూపుచుందురు. కల్యాణప్రవర్తనుం డగు నాతనిసత్ప్రవర్తనము నన్నెల్లపుడును బూజించుచుందురు. జ్యేష్ఠోపచయనాభిరతుండు, వీరుండు, యోధుల కగ్రేసరుండు, నాకెల్లపుడు శుశ్రూషలొనరింప నాసక్తిగలవాఁడునగు సహదేవుండు కుశలంబున నున్నవాఁడా? సుకుమారుండు శూరుండు దర్శనీయుండు నల్వురుసోదరులకు బహిశ్చరం బగు ప్రాణం బగువాఁడు ప్రియుండు చిత్రయుద్ధవిశారదుండు నగునకులుండు కుశలమా? మహేష్వాసుండు మహాబలుండు నాచే సుఖంబుగం బెంపఁబడినవాఁడు నగునకులుండు కుశలంబుననున్నవాఁడా? సుఖోచితుండు దుఃఖంబుల కనర్హుండు సుకుమారుండు మహారథుండు నగునకులుని జనార్దనా! మరలఁ జూచెదనా? కృష్ణా! కనురెప్పలుద్భవించువయసున నకులుని విడిచితిని. ఇంతదనుక వానిని మరలఁ జూడకయే జీవించియున్నదానను. నేనెంత కఠినహృదయను? జనార్దనా! పుత్రులెల్లరకంటెనుగూడ ద్రౌపది నాకుఁ బ్రియతరయగునది. ఉత్తమకులంబున జనించినది. అతిలోకసౌందర్యరాశి సర్వసుగుణంబులచే నొప్పుచున్నది. పుత్రలోకంబువలన బతిలోకంబు నాకాంక్షించునది. సత్యవచనాభిరత, ప్రియు లగుపుత్రులను బరిత్యజించి పతులనే యనుసరించినది. మహోన్నతం బగుకులంబునఁ బ్రభవించినది, సర్వకామంబులచే సుపూజితయైనది. ఆదిగర్భేశ్వరి, సర్వ

కల్యాణాస్పదయు నగు ద్రౌపది యిపుడెట్లున్నదో తెలుపుము. శోకాకులు
నగ్నికల్పులు మహాప్రహారాభిరాములు నగు నేవురుమగలతోడం గూడి
ద్రౌపది దుఃఖంబు లనుభవించుచున్నదా! హా! విధివిధానం బెవ్వరికి
నలంఘ్యముగదా? ముకుందా! పదునాలుగవవత్సరంబునందును పుత్రాది
బంధువులతో శూన్యయైనద్రౌపది నింకను జూడఁజాలనైతినే! ఎంతటి
దుఃదృష్టవంతురాలను. వాసుదేవ! పురుషుండు పుణ్యకర్మంబులచే
సుఖం బనుభవింపఁజాలండని నేను నిక్కముగఁ దలంచుచున్న దానను.
ఏలయందువా? లోకోత్తరసత్ప్రవర్తనంబుగల ద్రౌపదియే సుఖం బను
భవింపనోపనపుడు పుణ్యంబులవలన సుఖంబు లభించునని నమ్ముట
యెట్లు? వార్ష్ణేయా! నాకు ద్రౌపదికంటె నర్జునుండుగాని యుధిష్ఠి
రుండుగాని భీమసేనుండుగాని కవలవారుగాని ప్రియతములుగారు.
ద్రౌపది నాఁడట్లు సభకుఁ గొనిరాఁబడినపు డనుభవించినమహాదుఃఖము
నంతకుమున్నుగాని తరువాతఁగాని యెన్నండు ననుభవించి యెఱుం
గను. అనార్యుండు క్రోధలోభానువర్తనుండు నగుసుయోధనుండు
స్త్రీధర్మనిరతయు శ్వశురసమీపవర్తినియు నగుద్రౌపదిని సభామధ్యంబు
నకు రప్పించినపుడు ఏకవస్త్రయైనదానిని సభాసదులెల్లరు నాలోకిం
చిరి. ఆసభాస్థలంబున ధృతరాష్ట్రుండు బాహ్లికుండు సోమదత్తుండు
కృపుండు ద్రోణుండు మొదలగువారెల్లరు నాద్రౌపది నాలోకించి
మిగుల శోకించియు నేమియుఁ జేయఁజాలక యామెపరాభవంబు నివా
రింపఁజాలక మిన్నకుండిరి. మాధవా! ఆసభయందున్నవిదురు నొక్కని
మాత్రము నేనెంతయుఁ బూజింతును. ఎవ్వండేని వృత్తంబున నార్యుం
డగుంగాని, ధనంబునను విద్యచేతను నార్యుండు గానోపండు. మహా
బుద్ధిమంతుండు గంభీరుండు మహాత్ముండు నగు నావిదురుని సచ్ఛీలము
లోకంబులనెల్ల ధరించి వెలుంగుచున్నయది.

అని యిట్లుపలికి కుంతీదేవి మాధవు నాలోకించి సంతసించిన
దయ్యుఁ బుత్రశోకాకులయై నానావిధంబు లగుదుఃఖంబుల నాతనికిఁ
దెలిపెను. అచ్యుతా! పూర్వు లగుదుష్టరాజులచే నాచరింపఁబడిన
యక్షద్యూతంబును మృగవధంబును వీరలకు సుఖంబుల నొసంగునా?
అమంగళం బగుమార్గంబున సర్వమంగళగుణాలయ యగుద్రౌపది శ్వశురు

లెల్ల నధివసించియున్న కొలువుకూటంబునకుఁ దీసికొనిరాఁబడుటయు, నక్కడ ధార్తరాష్ట్రులామెను నానాక్లేశంబుల గుడుపుటయుఁ దలంచు కొన్నవాహృదయంబు మిగుల దహింపఁబడుచున్నయది. నాతనయులను నగరంబు వెడలనడఁచుటయు వనంబుల వసింపంబంపుటయు మొదలగు నానాదుఃఖంబులకును నేన నివాసభూమినై యున్నదానను. వాలు రగు నాతనయు లజ్ఞాతచర్యఁగావించునపుడు నేనుగూడ వారలతోఁగలసి యుంటినేని నాకింతదుఃఖంబు గలుగకుండెడిది. దుర్యోధననికృతు లగు వారు ప్రతిజ్ఞ యొనరించిన ట్లరణ్యవాసంబు నజ్ఞాతవాసంబు నెఱపి యున్నవారు, ఇపుడు పదునాల్గవవత్సరంబు జరగుచున్నయది. దుఃఖానుభవంబు వలనఁ బాపంబులన్నియు నశించినవి. కావున మేమింక సుఖంబులనే యనుభవింపంగలము. కృష్ణా! నేను బాండవులకంటె ధార్తరాష్ట్రులనెన్నండును భేదబుద్ధితోఁ జూచి యెఱుంగను. నాకు వారియుభయయందును సమానప్రేమం బెప్పుడునుం గలదు. ఆసత్యం బునంజేసి నీవును పాండవులును శత్రువధం బాచరించి విజయలక్ష్మిని జేకొని యీయుద్ధంబు నిస్తరించినయనంతరం బరోగులు నక్షతులునగు మిమ్ముల నాలోకింతును. మాధవా! పాండవులను బరాజయించుట కెవ్వరికిని దరంబుగాదు. పాండవులబలపరాక్రమాదిసామగ్రి యెల్ల నట్టిది. కేశవా! నేను సుయోధనునిగాని నాయాత్మనుగాని గర్హింపను. సదాన్యులు యాచకులకు ధనము నర్పించురీతిని నన్నుఁ గుంతిభోజున కర్పించిన నాజనకుని మిగుల నిందించెదను. నీమేనమామ యగు నాజనకుండు బాల్యంబునఁ గందుకక్రీడాపరాయ ణనై బంతిచేఁబట్టియున్న నన్నుఁ దననెచ్చెలి యగు కుంతిభోజున కిచ్చి వేసెను. కృష్ణా! చూచితివా? బాల్యంబువఁ దండ్రియు నన్ను నికృతి పాలుగావించె. అపు డత్తవారును నాకు నికారంబు లాచరించిరి. ఇట్టి నేను బుట్టిబ్రతుకుటవలన ఫలంబేమిగలిగె? నాజీవితం బెప్పుడును దుఃఖ భాజనంబైయే యున్నది. మాధవా! సవ్యసాచి పురిటిశిశువై యుండ నొక్కరే యశరీరవాణి నాకిట్లనియె. నీతనయుండు భూమినెల్ల జయిం చును. వీనియశంబు స్వర్గంబునందును గానంబుసేయంబడును. మహా యోధనంబునఁ గౌరవులనెల్ల సంహరించి రాజ్యంబు వశంబుగావించికొని ధనంజయుండు తనసోదరులతోఁగూడ నశ్వమేధంబులు మూఁడాచ

రించును. అని వినిపించిన యాకాశవాణికి నేఁడు గోపింపను. ధర్ముం డగు వేధకునమస్కారము. మహాత్ముండగుకృష్ణున కెల్లప్పుడు నమస్కరింతును. ధర్మం బీలోకంబులెల్ల ధరించియున్నది. ధర్మంబ ప్రజలనెల్లఁ బాలించుచున్నది. వార్ష్ణేయా! ధర్మంబనున దొక్కటి యుండెనేని నాకాశవాక్యంబు పల్కినట్లు నీవు నదియొల్ల సంపాదింపఁగలవు. నేను బుత్రులతో వియోగమందియుండుటవలన శోకంబు నన్ను దహించునట్లు వైధవ్యంబునఁగాని యర్థహీనత్వమువలనఁగాని శోకంబు జనింపలేదు. శస్త్రధరులకెల్ల వరేణ్యుం డగుగాండీవధన్వునిముఖంబు బాలోకింపకున్న నాహృదయంబునకు శాంతి యెక్కడిది? ఈపదునాల్గవవత్సరమందుఁ గూడ యుధిష్ఠిరుని ధనంజయుని వృకోదరునిఁ గవలవారినిఁ జూడ నోచనైతినే? లోకంబున జీవనాశంబొందినవారలకు వారిసంబంధులు శ్రాద్ధం బొనరింతురుకదా? వాస్తవంబున పాండవులకు నేనును నాకు వారును మృతులైనట్ల తలంపవలయును. మాధవా! నావచనంబులుగ నాధర్మనందనున కిట్లు తెల్పుము యుధిష్ఠిరా! మహాసంపన్నంబగు నీధర్మంబెల్ల వ్యర్థంబుగ క్షీణించుచున్నది. పుత్రా! ధర్మంబును వమ్ముగావింపకుము. పరుల నాశ్రయించి జీవించునాఁడు దానిజీవితంబు నింద్యంబు కదా? కార్పణ్యంబువలనఁ బ్రాపించినజీవితంబుకంటె బ్రతికియుండక చచ్చుటయే యుత్తమం బగునది యని పలుకుము. మఱియు ధనంజయునితోడను నిత్యోద్యుక్తుం డగు వృకోదరునితోడను క్షత్రియపుత్రి వీరుల నెందులకుఁ గాంచునో యద్దానికిఁ దగుకాల మిప్పు డాసన్నంబై యున్నది. లెస్సగ నాసన్నంబైనకాలంబును వృథాగా మించఁబెట్టితిరేని మీరు లోకసంభావితులరయ్యును నృశంసంబాచరించినవార యగుదురు. నృశంసయుక్తులు మీరైతిరే నింక నెన్నండును మీముఖంబులు చూడక మిమ్ముల విడిచెదను. కాలంబు సమీపించినపుడు ప్రాణంబులేని విడువందగును. గావున మీరు యుక్తకాలంబును వ్యర్థముగఁ బుచ్చవలదని చెప్పుము. తరువాత మాద్రీనందను లగు నకులసహదేవులతో "మీర లెప్పుడును క్షత్రధర్మనిరతులరు. మీమీజీవితంబుల కాసపడుటకంటెను విక్రమసముపార్జితంబు లగు భోగంబుల కాశించుట మంచి" దనుము. పురుషోత్తమా! క్షత్రధర్మాధిష్ఠితుం డగు పురుషునకు

విక్రమోపార్జితంబు లగు నర్థంబు లత్యంత ప్రీతిదాయకంబులై చెలం
గును. మహాబాహూ! నీవిక్కడినుండి పాండవులకడ కేఁగినపు డర్జును
నితో "నీవు ద్రౌపది చెప్పినప్రకార మామెమార్గంబునఁ జరింపు" మని
నావాక్యంబులుగాఁ జెప్పుము. ఆభీమార్జునులు క్రుద్ధులై రేని యమునకు
సదృశులై దేవతలనుగూడ నేలంగూల్తు రనువిషయంబు నీవు నెఱింగిన
విషయమే కదా? ద్రౌపది యట్లు సభామధ్యంబున నవమానంబొందింపఁ
బడుట దుశ్శాసనుండును సూతసూనుండును నట్లు పరుషంబులు వలుకు
టయు నాభీమసేనార్జునులకే మహావమానంబై యున్నది. మనస్వి యగు
వృకోదరుని దుర్యోధనుండు కౌరవులెల్లరు జూచుచుండఁగ నవమా
నించి పరుషంబులాడినదానికి ఫలం బచిరకాలంబునన తప్పక చూడఁ
గలఁడు. వృకోదరుం డెన్నండును వైరం బాసాదించి శాంతించువాఁడు
గాఁడు. ఎంత చిరకాలంబునకైనను భీమసేనునివైరంబు చల్లారదు.
వాఁడు తనశత్రువుల యంతంబుగావింపక యేశాంతినొందఁడు. రాజ్యంబు
నపహరించు టంత దుఃఖకరముగాదు. జూదంబున నోడుటయు నంత
దుఃఖజనకముగాదు. పుత్రు లడవులకుఁ బంపఁబడుటయు నాకంతఁగా
దుఃఖంబు గల్పింపలేదయ్యె. యౌవనమధ్యస్థురా లగు ద్రౌపది యేక
వస్త్రయై సభకుఁ దీసికొనిరాఁబడి మిక్కిలి పరుషంబులగు మాటలచే
నవమానింపఁబడుటకంటె దుఃఖతరంబు లేముండును? ద్రౌపది వనితల
కుచితంబు లగుధర్మంబులం దెల్లపుడు నభిరతయైయుండును. క్షత్రధర్మా
చరణపరాయణత్వము దానికలంకారము. నాథులు తనయెదుటనే
యున్నను నాసమయంబున ననాథయై విలపించెను. మాధవా! నా
తనయులెల్లరు ధార్మికులును మహాపరాక్రమవంతులునై యున్నవారు.
నీవు మాకెల్లరకు నేడుగడవై యున్నవాఁడవు. బలవంతులకు శ్రేష్ఠుం
డగు రాముండును మహారథుం డగు ప్రద్యుమ్నుండును మాకుఁ బెట్టని
కోటలై యున్నవారు. మీయెల్లరప్రాపు నాశించియు, దుర్ధర్షుం డగు
వృకోదరుండును యుద్ధంబులం దపలాయనుండగు ధనంజయుండును
జీవించియుండుట నాలోచించియు, నేనిట్టిదుఃఖంబులెల్ల నోర్చుకొని
యుంటిని.

### కృష్ణుఁడు కుంతీదేవి నూరడించుట

అని పలుకుటయు వాసుదేవుండు పుత్రవ్యాఘులచేఁ బరిష్వక్తయై మిగుల శోకించు తనమేనయత్త యగు కుంతి నిట్లని యాశ్వాసించె. అత్తా! నీవంటినారీరత్నం బీలోకంబున నెందుఁ గలదు? నీవు మహారాజగుశూరునకుఁ గూఁతువై పుట్టి యాజమీఢునికులంబు మెట్టితివి. మహాకులీన వగు నీవొక్క హ్రదమునుండి వేఱొక్క హ్రదమునకుఁ జనుగంగాప్రవాహంబువోలె నుత్తమం బగుకులంబునం బ్రవేశించితివి. నీవు సకలైశ్వర్యంబుల సకలకల్యాణంబు లనుభవించితివి. నీభర్తచేఁ బరమంబగు పూజలంది నెగడితివి. నీవు మహావీరునకు భార్యవై వీరాగ్రేసరు లగు తనయులం గాంచితివి. సకలగుణంబులకు నాలయంబైన దానవు. నీవంటిమహాప్రాజ్ఞురాలు సుఖదుఃఖంబుల సహింపకున్న నితర కాంతలమాట చెప్పనేల? నిద్రాతంద్రలు క్రోధహర్షంబులు క్షుత్పిపాసలు హిమాతపంబులు మొదలగుద్వంద్వంబులనెల్ల నిర్జించి నీతనయులు నిత్యంబు వీరసుఖంబునం దభిరతులై యున్నవారు. పార్థులు గ్రామ్యసుఖంబులెల్ల వీడి వీరసుఖంబులంద యభిరతులైయున్నారు. మహోత్సాహులు మహాబలవంతులు నగుపాండవులు స్వల్పంబున సంతుష్టిం బొందువారు కారు. ధీరులంతంబులనే సేవింతురు. గ్రామ్యసుఖనిరతులన్ననో మధ్యంబునే సేవింతురు. ఉత్తమంబు లగు పరిక్లేశంబు లనుభవించియు మానుషంబు లగుబాధలనెల్లు నతిక్రమించి వారలు అంతంబులంద రమించిరిగాని మధ్యంబులం దెన్నఁడును రమించినవారుగారు. అంతప్రాప్తినే యార్యులు సుఖంబని వచించిరి. అంతంబులయొక్క మధ్యంబునే దుఃఖమనియుఁ జెప్పిరి. పాండవులు ద్రౌపదితోఁగూడి యెల్లరు నీకభివాదనం బాచరించి వారలయెల్లరకుశలంబు నివేదించి యనంతరము నిన్ననామయం బడిగిరి. ఆరోగులును సిద్ధసర్వార్థులు నగువారల నచిర కాలంబునన చూచెదవు. సర్వలోకంబునకు నీశ్వరులును శత్రువుల జయించి వీరలక్ష్మీసమాలింగితులును నగుపాండవులను స్వల్పకాలంబునన చూచెదవు. నీవు మదింగలవిచారంబుఁ దిగఁద్రావి సుఖంబుండుమనియె. అదివిని కుంతి మరల నాతని కిట్లనియె. మహాప్రాజ్ఞ! వారలకెల్ల నేయదిపథ్యంబు హితంబునగునో; నీవేయేకార్యంబు లెట్లెట్లాచ

రింపందలంచితివో వానినెల్ల నట్ల యాచరింపుము. ఎల్లభంగులను ధర్మలోపంబును నిష్కృతియుఁ గలుగకుండ వారలఁగాపాడుభారము నీయంద నిలిచియున్నది. కృష్ణా! నీప్రభావంబును సత్యనిరతియు మహాకులీనత్వంబును నేనెఱుంగుదును గాదె? మిత్రులకు వ్యవస్థ నిశ్చయించుటయందును బుద్ధివిక్రమంబులందును నీవ మాకుఁ బ్రమాణభూతుండవు. నీవ మాకులంబున ధర్మంబవు. నీవే సత్యంబవు. నీవే మహాతపంబవు. నీవ మాకులంబునకు రక్షకుండవు. నీవ మహాబ్రహ్మంబవు. నీయంద సర్వంబును సుప్రతిష్ఠితంబై వెలుంగు చున్నయది. నీవెట్లు వచించిన నట్లే యెల్లవిషయంబులును సత్యంబులై చెల్లును. నీమాట లెన్నండు నసత్యంబులు గావు. అపరాజితా! కౌరవులకుఁ బాండవులకు నెల్లలోకంబులకును నీవ. సకలచరాచరప్రపంచకంబునకును నీవ గతివై విరాజిల్లుచున్నవాఁడవు. నీయొక్క ప్రభావంబును బుద్ధికౌశలంబును నట్టివై విలసిల్లుచున్నవి యని వచించె.

### కృష్ణుండు దుర్యోధనుకడ కరుగుట

అంతటఁ గృష్ణుండు గుంతీదేవిచే ననుజ్ఞ వడసి యామెకుఁ బ్రదక్షిణం బాచరించి దుర్యోధనుమందిరంబునకుఁ బ్రయాణంబయ్యె. ఆసుయోధనుమందిరంబు పరమలక్ష్మీనిలయంబై దేవేంద్రునిమందిరంబు ననుకరించుచుండె. అందు నానావిధమణిగణాలంకృతంబులగు నాసనంబులు విచిత్రంబులై చూపట్టుచుండె. మూఁడుకక్ష్యలుగడచి కృష్ణుండు మేఘమండలంబువోలె నత్యున్నతం బగునదియు మేరుగిరి శిఖరంబువోలె విచిత్రంబు లగుకాంతులవెలుంగునదియు సకలశోభాకరంబు నగు ప్రాసాదం బధిరోహించె. ఆసౌధోపరిభాగంబున ననేకరాజులును గౌరవులును బలసికొలువ రత్నసింహాసనంబున నాసీనుండై యున్న సుయోధను నాలోకించెను. దుర్యోధనుసమీపంబున యథార్హంబులగునాసనంబుల నాసీనులై యున్న దుశ్శాసనుని గర్ణుని సౌబలుని జూచెను. దుర్యోధనుండును మధుసూదనుండు మందిరంబున బ్రవేశించినంతన యాతనిఁ బూజించువాఁడై మంత్రులతోడంగూడి యాసనంబునుండి లేచి నిలువంబడియె. వాసుదేవుండు తొలుత దుర్యోధనునిఁ బిదప నాతనిమంత్రులను గుశలప్రశ్నంబులచే సంభావించి యనంతర

మక్కు డనున్న రాజులనెల్ల వయస్సు ననుసరించి యభివాదనాలింగనాదు
లచే సంభావించెను. జాంబూనదమయంబు సుపరిష్కృతంబు వివిధా
స్తరణాస్తీర్ణంబునగు పర్యంకంబున జనార్దనుం డుపవేశించె. సుయోధ
నుండు జనార్దనునకు గోవును మధుపర్కంబు నుదకంబును దనగృహం
బులను రాజ్యంబును నివేదించెను. అంతకుమున్న కృష్ణుం డరుదెంచు
నని విన్నధృతరాష్ట్రుండు సర్వరత్నవిభూషితంబై సర్వతోభద్రం బనఁ
బడునాసనమును గృష్ణునికొఱకు చేయించెను ఆయాసనంబున నా
సీనుండై ప్రసన్నాదిత్యతేజుం డగు గోవిందుని సకలరాజులును గౌర
వులును బరివారించి యథోచితాసనంబుల నుపవేశించియుండిరి. అనంత
రము కౌరవాగ్రజుండగు సుయోధనుండు వృష్ణిసింహంబగు కేశవుని
భోజనంబునకు నిమంత్రణం బొనరించె. దానికి గోవిందుం డంగీకరింప
కుండె. అది చూచి సుయోధనుం డించుక ఖిన్నుండై కర్ణునితో నాలో
చించి వానిచే ననుమతుండై కౌరవులెల్లరు నాలించుచుండ మృదు
పూర్వంబుగాను శఠోదర్కంబుగాను గృష్ణున కిట్లనియె. జనార్దనా! నీ
కొఱకై యతిప్రయత్నంబున నాయత్తంబులుగావించిన యన్నంబులు
పానంబులు వసనంబులు శయనంబులును నీవేల యంగీకరింపకున్న
వాఁడవు? నీ వుభయులకును సాహాయ్యం బిచ్చియుంటివి. ఉభయులకును
హితం బాచరించువాఁడవు. మఱియు ధృతరాష్ట్రున కత్యంత ప్రీతి
పాత్రంబవు చుట్టంబవు నై యున్నవాఁడవు. నీవు ధర్మార్థంబులతత్త్వం
బెల్ల బాగుగ నెఱింగియున్నవాఁడవు. అట్టినీవు మేమర్పించిన సత్కా
రము లంగీకరింపక నిరాకరించుటకుఁ గారణమేదియో వినఁగోరుచున్నాఁ
డనని పలికెను. ఇట్లు సుయోధనుండు వలుక వాసుదేవుండు భుజంబెత్తి
మేఘగంభీరనిస్స్వనంబున నాతనికి అలఘూకృతంబు నగ్రస్తంబు ననిర
స్తంబు నసంకులంబు హేతుమంతంబునగు వాక్యజాలం బిట్లని వచించె.
దూతలు .తమవచ్చినకార్యము లెస్సగా నెఱవేఱనేని బిదప భోజనం
బులు పూజలు పరిగ్రహింతురు గావున నేనేతెంచినకార్యం బనుకూలం
బుగ నెఱవేఱినయనంతరము నీవును నీమంత్రులు నన్నర్చింతురుగాక
యనుటయు సుయోధనుండు జనార్దనా! నీవు మాయెడ నయుక్తంబు
లాలోచించుట పాడిగాదు. నీవు కృతార్థుండవైనను సరియే కాకున్నను
సరియే. నిన్ను మే మర్చించుటకుఁ బ్రయత్నించుటయే మావిధి. నిన్ను

పూజింపకయుండుట మాకిష్టముగాదు. పురుషోత్తమా! మేమిట్లు ప్రీతి పూర్వకంబుగ నొనర్చుపూజలఁ బరిగ్రహింపకుండుటకుఁ గలకారణ మేమో మా కెఱుకపడకున్నయది. గోవిందా! మాకు నీతోడ వైరంబుగాని విగ్రహంబుగాని లేదు. నీ వీయర్థంబు బాగుగ నాలోచించి యిట్టి వాక్యంబు లాడకుందువుగాక యని పలికె. ఆమాట లాలించి వాసుదేవుండు సుయోధనుని వానిమంత్రులను దేఱిపాఱఁజూచి చిఱునగవు మొగంబున దళుకొత్త నిట్లనియె. సుయోధనా! కామంబుననుగాని, సంరంభంబునఁగాని, ద్వేషంబునఁగాని, యర్థకారణంబునఁగాని, హేతువాదంబునఁగాని, లోభంబునఁగాని యెన్నండును ధర్మంబు విడువను. అన్నంబులు ప్రీతియున్నపుడె భుజింపఁదగు. ఆపత్కాలమందును నన్నంబులు భుజింపఁదగును. నీవు మాయెడలఁ బ్రీతియుక్తుండవు గావు. మే మాపద్గతులమునుగాము. శాత్రవులయన్నంబు భుజింపనుగూడదు. శాత్రవున కిన్నంబిడుటయుఁ దగదు. రాజా! నీవు పాండవులను ద్వేషించుచున్నవాఁడవు. నాకుఁ బాండవులు ప్రాణంబులేకదా? నీ వకారణంబుగ నే పుట్టినది మొదలుగఁ బాండవులను ద్వేషించుచున్నవాఁడవు. వారలెల్లపుడును బ్రియానువర్తులును సకలసద్గుణోపపన్నులునై యున్నవారు. అట్టివారి నకారణంబుగ ద్వేషించు టెంతయు నయుక్తంబు. పాండునందను లెప్పుడును విడువక ధర్మమార్గంబున జరించుచుండువారలు. వారల నెవ్వరేని యొక్కయధర్మం బాచరించినవారని చెప్పఁగలవా రుందురా? వారల నెవ్వఁడు ద్వేషించునో వాఁడు నన్నుఁగూడ ద్వేషించువాఁడే యగును. ఎవ్వఁడు వారల ననుచరించునో వాఁడు నన్ను ననుచరించువాఁడే యగును. ధర్మచారులగుపాండవులతో నేకాత్మత్వమొందినవానిఁగా నన్నెఱుంగుము. ఎవ్వఁడు కామక్రోధానువర్తియై యజ్ఞానంబున విరోధింపందలంచునో; యెవ్వఁడు గుణవంతులను ద్వేషించునో వాఁడు పురుషాధముం డనఁబడును. ఎవ్వఁడు కల్యాణగుణవంతులగు జ్ఞాతులను లోభంబునను మోహంబునను నిరాకరించునో యట్టివాఁడు యాత్మనిగ్రహంబు క్రోధజయంబు లేక యచిరకాలంబున సర్వనాశం బొందును. ఎవ్వండు తనహృదయంబున కప్రియులైనను గుణసంపన్నులగుజ్ఞాతులకుఁ బ్రియం బాచరించి వారల వశ్యులుగావించుకొనునో వాఁడు చిరకాలముఁ గీర్తిప్రతిష్ఠల నొందును. దుష్టాభిసంహితంబగు నీ

యన్నంబెల్ల భుజింపక విడువఁదగినదనియే నేను నిశ్చయించుకొంటిని. విదురుం డొక్కం డిచ్చినయన్నంబుమాత్రము భుజింపఁదగినదని నామ నంబునకుఁ దోఁచుచున్నయది. కావున నీయన్నంబు భుజింపుమని నన్ను నిరోధింపకుమని పలికి యామందిరమునుండి వెడలివచ్చెను. అక్కడ నుండి బయలువెడలి మహాత్ముండగువిదురునిగృహంబునకు బయలు దేఱెను. అట్లు వాసుదేవుండు బయలుదేఱినంతన ద్రోణుండును కృపుం డును భీష్ముండును గౌరవులును నాతని ననుసరించి విదురునిగృహంబున కరుదెంచి తమతమగృహంబులు రత్నంబులు నివేదించిరి. అంతట వాసు దేవుండు వారలనెల్లఁ బ్రీతియుక్తం బగుచిత్తంబున నాదరించి "మీర లెల్లరును మీమీగృహంబుల కరుగుఁడు. మీరు కావించినసత్కారం బుల కెంతయు సంతసించుచున్నవాఁడ ననిపలికి వారలను స్వగృహంబుల కనిచె. వారలరిగినయనంతరము విదురుండు మహాప్రయత్నంబున శుచి యగునవియు రుచ్యములునగు వివిధాన్నపానంబులును గొనివచ్చి కృష్ణు నకు నివేదించె. మధుసూదనుండు తొలుత బ్రాహ్మణుల కన్నపానాదు లొసంగి తృప్తులంజేసి వేదవేత్తలగువారల కమితంబుగ మణికనకాంబ రాదుల దక్షిణలొసంగి పదప దేవతలతోఁగూడి దేవేంద్రుం డమృతం బారగించుకరణిఁ దనయనుచరులతోడ నానాయన్నంబు భుజించెను.

## విదురుండు దుర్యోధనునిదుష్టబుద్ధి కృష్ణున కెఱింగించుట

భోజనానంతరమున బడలికదీఱ విశ్రమించినజనార్దనునితో రాత్రివేళ విదురుం డిట్లనియె. కేశవా! నీవిప్పు డిటకువచ్చుట మంచిపని గాదని నేను దలంచుచున్నవాఁడను. జనార్దనా! దుర్యోధనుండు మందా తిమందుండు. అర్థధర్మముల రెంటి నతిక్రమించి చరించుచున్నవాఁడు. అతిసంరంభముగలవాఁడు. మానఘ్నుండు మానకాముండు నగువాఁడు. వృద్ధులశాసనంబు లాదరింపక యుల్లంఘించి చరించుచున్నవాఁడు. వాఁడు ధర్మశాస్త్రంబులఁగూడ మీఱి ప్రవర్తించుచున్నవాఁడు. మూఢుండు దురాత్ముండునగువాఁడు ప్రగ్రహాగతుండునుంబోలె శ్రేయం బుల నాలింపఁడు. కామాకృష్టచిత్తుండు ప్రాజ్ఞమానియు మిత్రద్రోహ పరాయణుండు నగువాఁడెల్లరను నెల్లయెడలనుశంకించుచునే యుండును. వాఁడు సత్కార్యంబు లేవియు నాచరింపశక్తిలేనివాఁడు. వాఁడు కృత

ముఖరవంబునఁ జెప్పవలయునా? నీవు సకల దేహవంతులకు నంతరాత్మవై యుంటివి కావున నీవ దాని నెఱుంగుదువని వచించెను.

కృష్ణుండు తనరాకకుఁ గారణంబు విదురునకుఁ జెల్పుట

ఇట్లు పలికిన విదురువాక్యంబు లాలించి వాసుదేవుం డిట్లనియె. మహాప్రాజ్ఞా! కార్యాకార్యవిచక్షణుం డగు మహాప్రాజ్ఞుం డెట్లు వచించునో; నీవంటియుత్తమశీలుం డెట్లు పలుకునో యట్ల నీవును నాకుస్నేహపూర్వకంబుగఁ జెప్పితివి. నీయందు ధర్మార్థంబులును సత్యంబు నెట్లు స్థిరంబులై యున్నవో యట్ల వాని కనుగుణంబుగనే వచించితివి. తల్లిదండ్రులు హిత ముపదేశించురీతిని నీవును హితం బుపదేశించితివి. నీవు చెప్పినదెల్ల సత్యంబును గాలానుగుణంబును యుక్తంబునై యున్నది. నీవు చెప్పినదెల్లఁ దప్పక యట్లే జరిగితీఱును. దానికి సంశయములేదని నేను నెఱింగియే యిట్లు వచ్చితిని. నావచ్చినకారణం బేదియో తెలిపెదను. సావధానంబుగ నాలింపుము. విదుర! ధార్తరాష్ట్రునిదౌరాత్మ్యంబును నిక్కడి క్షత్రియులెల్లరును నాకు విరోధులగుటయును బాగుగ నెఱింగియే నేనిక్కడ కరుదెంచితిని. విపులం బగు నీపృథ్వీతలంబునం గల యశ్వంబులకును నేనుంగులకును మృత్యుపాశంబులు దూరీకరించినచో నుత్తమం బగుధర్మంబు లభించును. ధర్మకార్యంబునకుఁ బ్రయత్నించి తత్ఫలం బనుభవింపకున్నను ధర్మకార్యప్రయత్నమువలననే యుత్తమపుణ్యం బొందుట నిశ్చయము. మనంబున బాపకర్మంబును జింతించియు నద్దానిని గర్మంబున గావింపకున్నచో నాపాపఫలం బనుభవింపరని ధర్మవిదులు వక్కాణింతురు. విదురా! నేను మాయలేకుండ శాంతిగావించుటకు శక్యమయినంతవఱకుఁ బ్రయత్నింతును. కురువులను సృంజయులకును సంగ్రామంబున నాశంబుగలుగకుండ నేను వారిరుపక్షముల వారికి శాంతిగల్పింపఁ బ్రయత్నించెదను. ఈయాపద కేవలము కౌరవుల యంద యుద్భితంబయినదని నాతలంపు. దీనికిఁ గర్ణుండును దుశ్శాసనుండును గారణంబై యున్నవారు. మిగిలినవారెల్లరును వారిరువుర ననుసరించుచున్నవారు. వ్యసనంబున గ్లేశం బనుభవించుమిత్రు నెవ్వఁడు యథాశక్తిగ ననునయింపఁడో వాఁడు నృశంసుండని పెద్దలందురు. తన్ను కేశపాశంబుపట్టి తాడనంబొనరించువఱకును మిత్రుని నకార్యం

బొనరింపకుండ వారించుచునే యుండవలయును. వాఁడు బలంబు నను సరించి ప్రయత్నం బొనరించుచో జనులకు నింద్యుండు గాకుండును. కావున ధర్మార్థసమర్థంబు శుభంబు ధర్మార్థోపపన్నంబు హితంబు నగు నావాక్యంబు ధార్తరాష్ట్రుండు వానిమంత్రులును బరిగ్రహింపం దగును. నేను నిష్కపటంబుగఁ బాండవులకును గౌరవులకును భూమిం గలయెల్లరాజులకును హితం బాచరించుటకే ప్రయత్నింతును. హితం బాచరించుటకుఁ బ్రయత్నించుచున్న నన్ను ధార్తరాష్ట్రుండు శంకించునే నదియ చాలు. నాకదియ పరమప్రీతికరంబు. దానివలన నాబుణవిముక్తి గాఁగలదు. జ్ఞాతుల కన్యోన్యము భేదంబు జనించినపు డేమిత్రుండు సర్వప్రయత్నంబుల మాధ్యస్థ్యం బొనరింపఁడో వాఁడు మిత్రుఁడు గానేరఁడని పెద్దలందురు. అధర్మిష్ఠులు మూఢులు నగునాశాత్రవులు నన్నుద్దేశించి "కృష్ణుండు సమర్థుండయ్యు యుద్ధసంరబ్ధు లగు కురుపాండవుల మరలింపక యుపేక్షించె." నని నిందింపకుందురు. ఇరుపక్షంబుల వారికి నర్థంబు సాధింప వచ్చినవాఁడనై నాయోపినంతప్రయత్నం బాచరించి వెడలిపోయిన నాకుఁ బ్రజలయందు నిందగలుగకుండును. బాలిశుం డగు సుయోధనుండు ధర్మార్థయుక్తంబగు నావాక్యం బాదరింపక పరిహరించెనేని వాఁడు కాలవశంబును బొందంగలండు. పాండవులయర్థంబునకు భంగంబువాటిల్లకుండ కౌరవులకు యథాశక్తిని శాంతినిగల్గించితినేని నాప్రవర్తనంబు పుణ్యంబై నెగడును. కౌరవులును మృత్యుపాశంబులనుండి విడివడుదురు. కావ్యంబు ధర్మారామంబు నర్థవంతంబు నహింస్రంబు నగు నాచెప్పినవాక్యంబును ధార్తరాష్ట్రులు శమంబునకై గ్రహింతురా? నన్ను వారు గౌరవించి యాదరింతురా? సింగంబు నెదుట నితరమృగంబులు నిలువలేనట్లు నాయెదుట నీసమాగతులయి యున్న యోధులతోఁగూడి కౌరవపక్షంబునందలి రాజులెల్లరును నిలువఁ జాలరు కావున నీవించుకయుఁ సంకోచింపవలదని పలికి మహోన్నతంబు మృదులంబు నగు శయ్యాతలంబున బండుకొనెను.

## శ్రీకృష్ణుడు కౌరవసభకు వచ్చుట

మహాబుద్ధిమదగ్రేసరు లగు శ్రీకృష్ణుండును విదురుండు నిట్లు మాటలాడుకొనుచుండఁగనే యారాత్రి గతించినది. ధర్మార్థకామ

యుక్తంబులు విచిత్రంబు లగునర్థంబులు పదంబులు నక్షరంబులును గల
వియునగు వాసుదేవునివాక్యంబులు మహాత్ముం డగువిదురుం డాకర్ణించు
చునేయుండెను. విదురుం డనురూపంబులగుకథల వచించుచుండ నను
రక్తుండై కృష్ణుం డాలించుచుండెను. వారిప్రసంగము లెప్పటికిని ముగి
యనేలేదు. ఒండొరులసంభాషణమున వారికిఁ దృప్తికలుగనేలేదు. అంత
టనే మంగళంబు నక్షత్రసంపన్నంబు నగు నారాత్రి కడచి చనియెను.
అపుడు సర్వలక్షణలక్షితులు సుస్వరసంపన్నులు నగుసూతులు మాగధు
లును శంఖదుందుభినిర్ఘోషంబులతోడఁ గృష్ణుని మేల్కొలిపిరి. అంత
సర్వసాత్వతులకుఁ బుంగవుం డగు దాశార్హుండు శయనంబువిడిచి లేచి
ప్రాతఃకాలకృత్యంబులెల్ల నిర్వర్తించెను. స్నానంబాచరించి సంధ్యా
వందనంబుగావించి సావిత్రి జపించి యగ్నుల వ్రేల్చి యప్పుడ యుద
యించుచున్నయాదిత్యున కుపస్థానంబు గావించె. అనంతరము దుర్యో
ధనుండు సౌబలుం డగుశకునియు, నేతెంచి యపరాజితుం డగు దాశా
ర్హుండు సంధ్యావందనము గావించుచుండఁగనే యాతనితో ధృత
రాష్ట్రుండు సభాస్థలంబున నీరాకకై వేచియున్నవాఁడని తెలిపిరి.
భీష్ముండు మొదలగుకౌరవులును సర్వపార్థివులును దేవలోకంబున నమ
రులు దేవేంద్రునికై నిరీక్షించునట్లు నీరాకఁ గోరుచున్నవారని తెలి
పిరి. జనార్దనుండు పరమమృదులంబు లగు సామవచనంబుల వారి నభి
నందించి యాదిత్యబింబంబు విమలంబగునంత బ్రాహ్మణులకు హిరణ్యంబు
గోవులు కనకాంబరంబులు తురంగంబులు విచిత్రంబు లగుమణిగణంబులు
నసంఖ్యముగా నొసంగెను. ఇట్లు బ్రాహ్మణుల కభిమతంబు లగుదానంబు
లొసంగియున్నంత రథచోదకుం డగు దారుకుం డేతెంచి నమస్కారం
బొనరించి రథంబు సజ్జంబుగావింపంబడినదని నివేదించెను. లోకప్రసిద్ధం
బగు నారథంబు మిగుల విరాజిల్లుచుండెను. దానికి శైబ్యసుగ్రీవమేఘ
పుష్పవలాహకంబులను తురంగంబులు బూన్పఁబడియుండెను. శైబ్యంబు
చిలుకఱెక్కలవంటి శరీరచ్ఛాయగలది. సుగ్రీవంబు కింశుకపుష్పసవర్ణ
మగుకాంతిగలది. మేఘపుష్పంబు మేఘసన్నిభగాత్రంబు. వలాహకంబు
పాండురవర్ణాభిరామంబు. శైబ్యంబు వలపటను సుగ్రీవంబు దాపటను
మేఘపుష్పవలాహకంబులు వానివెనుకను బూన్పఁబడియెను. విశ్వకర్మ
నిర్మితం బగుశిఖరంబుగలదియు రత్నజాలవిభూషితంబును నగుధ్వజయష్టి

యారథంబునం బ్రతిష్ఠితంబై మిగుల వెలింగెను. ఆధ్వజాగ్రంబున విల
యాదిత్యమండలంబును స్పృశించుచున్నచందంబున భుజంగవైరి యగు
వైనతేయుండు ప్రకాశించుచుండె. ఆపతంగేశ్వరుని శరీరకాంతిచే
నారథంబు మిగులఁ బ్రకాశించుచుండెను. రశ్మిజాలంబులచేతను
బతాకావళులచేతను కనకమయం బగు కేతుదండంబుచేతను నారథ
వరంబు కల్యంబున నుదయించుసూర్యబింబంబు ననుకరించి వెలుంగు
చుండె. గరుడధ్వజవితానంబులును గనకగవాక్షశోభితాంగణంబులును
దండమార్గవిభాగంబులును విశ్వకర్మనిర్మితంబులై యాయరదంబునం
బొల్పుచుండె. ప్రవాళమణికాంతులు ముక్తావైడూర్యశోభలు గలిగి
కింకిణీశతసంఘుంబులు నీలజాలాంతరంబులును, కనకమయంబులగు
కమలినీలితలు జాంబూనదమయంబు లగు పాదపంబులు వ్యాఘ్రసింహ
వరాహంబులు గోవులు మృగంబులు నానావిధంబు లగు పక్షినివహం
బులు తారకలు సూర్యచంద్రబింబంబులు హిరణ్యనిర్మితంబులగు గజం
బులును చిత్రవిచిత్రంబు లగు శిల్పకౌశలంబులు మెరయ నాతేర విరాజ
మానంబు లగుచుండె. కూచికావృత్తిసంధులందు వజ్రాంకుశవితానం
బులు నిర్మింపంబడెను. సముచ్ఛ్రితం బగు మహానాభియు మేఘగంభీర
నిస్స్వనంబును కింకిణీసంఘవిశోభితంబును నుత్తమహాయయుక్తంబు
నగుమహారథంబు దీసికొని దారుకుం డేతెంచెను. సజ్జంబై రథం బుప
స్థితంబగుట యెఱింగి జనార్దనుండు వైశ్వానరునకును బ్రాహ్మణులకును
బ్రదక్షిణనమస్కారంబు లాచరించి కౌస్తుభరత్నంబును ధరించి మహా
శోభాభిరాముండై కౌరవులచేఁ బరివారింపఁబడి వృష్ణివీరు లంగరక్షకులై
చెలంగ రథం బారోహించెను. ప్రాణవంతులకెల్ల నుత్తముండును బుద్ధి
మంతులకుఁ బ్రవరుండు నగువాసుదేవు ననుసరించి విదురుండును రథా
రోహణంబు గావించె. సుయోధనుండును శకునియు వేఱొక్కరథం
బారోహించి జనార్దను ననుగమించిరి. సాత్యకి కృతవర్మ మొదలగు
వృష్ణివీరులరథంబులు వారివెనుక ననుసరించి వచ్చుచుండె. ఇంక ననేకు
లగురాజులు గజంబుల నధిరోహించియుఁ దురంగంబుల నారోహించియు
వారివెనుక రాఁదొడంగిరి. హేమాలంకారయుక్తంబులు నుత్తమాశ్వం
బులచే నుహ్యమానంబులు నగువారల చిత్రంబు లగురథంబులు స్నిగ్ధం
బులగునినాదంబులతో నెంతయు నొప్పియుండెను. అట్లు రాజలోకం

బుచే నరుగతుం డగుజనార్దనుండు సమ్మార్జనసంసేకంబులచే శాంతం బగు ధూళిగలరాజమార్గంబు ప్రవేశించె. ఆతండుమహాపథంబున కరుగుటయు నేకపుష్కరంబులు శంఖంబులు మొదలగువాద్యంబులు మ్రోగింపం బడియె. సింహపరాక్రములు సర్వలోకప్రవీరులు నగుయువలు శౌరిరథం బును చుట్టుకొనినడచిరి. ఇతరులు బహుసహస్రసంఖ్యాకులగు పౌరులు విచిత్రంబులు నద్భుతంబులగు వసనంబులు ధరించి అసిప్రాసాద్యాయుధ ములధరించి కృష్ణునకు ముందు నడచిరి. ఐదువందలయేనుంగులును వేల కొలందినరదంబులును నపరాజితుండగు దాశార్హునివెనుక ననుసరించి వచ్చుచుండె. కౌరవులపురంబు నీక్షింప వేడుకగల జనార్దను నాలో కింపఁ బురజనులెల్లను స్త్రీలు బాలురు వృద్ధులునాదిగ నెల్లవారును రాజమార్గంబునందు నిలిచి యాతని నాలోకించిరి. కొందఱు నారీమణులు వీథివేదికలందు నిలిచియుండిరి. కొందఱు వనితలు ద్వారదేశంబులం దుండిరి. మార్గమందెల్లెడల నిండియుండిన జనంబులచే భవనంబు లెల్ల నడచుచున్నవో యన విలసిల్లుచుండె. దామోదరుండు కురునగరనివాసి జనంబులచేఁ బూజలందుచు మధురంబులగు కథలాలించుచు నాయాజ నంబుల కుచితరీతిని బ్రతిపూజలు గావించుచు మెల్లమెల్లఁగ రాజమం దిరమున కరుగుదెంచె. కేశవు ననుసరించివచ్చిన జనంబులెల్లరును సభా మందిరంబు సమీపించి శంఖవేణువీణారవంబుల భోరుకొల్పిరి. ఆని స్స్వనం బాలించి సభాంతరంబునంగల రాజన్యులెల్లరును కృష్ణుం డేతెంచుచున్నవాఁడని తెలిసి హర్షపరవశత్వంబునఁ బ్రకంపంబు నొందిరి. మేఘనిర్ఘోషగంభీరంబగు కృష్ణునిరథనిర్ఘోషం బాలించి కృష్ణుండు సమీపించెనని వారలెల్లరును మిగుల సంతసించిరి. సర్వసాత్వతప్రవరుం డగు జనార్దనుం డాసభాద్వారంబు దఱిసి కైలాసశిఖరంబున కెనయగు నరదం బవతరించి నవమేఘప్రతీకాశంబు మహాతేజోజాజ్వల్యమానంబు మహేంద్రసభాసంకాశంబునగు నాసభం బ్రవేశించె. ఒక్కకేల విదు రుని వేఱొక్కకేల సాత్యకిని బట్టుకొని యాదిత్యుండు జ్యోతిర్మండలం బులనెల్లఁ గాంతిచే నాచ్ఛాదించుచందంబున గౌరవులనెల్లఁ దనతను కాంతులచేఁ బ్రచ్ఛాదించుచు సభాప్రవేశంబుగావించె. కృష్ణునకుముందఱి భాగంబునఁ గర్ణదుర్యోధనులును వెనుకభాగంబునఁ గృతవర్మ మొదలగు వృష్ణివీరులును సభాప్రవేశంబు గావించిరి. ధృతరాష్ట్రుని బురస్కరించి

కొని భీష్ముండు, ద్రోణుండు, కృపుండు, బాహ్లికుండు మొదలగుసభా సదులెల్లరు గృష్ణుని బూజించువారై యాసనంబులవీడి లేచి నిలువం బడిరి. కృష్ణుండు సమీపంబున కరుదెంచుపఱికుసు బ్రజ్ఞాచక్షుండు భీష్మ ద్రోణులతో నిలిచియుండ నాసభాస్థలింగల రాజలోకంబెల్ల లేచి నిలిచి యుండెను. ధృతరాష్ట్రుని నియోగంబున కృష్ణునికై నిర్మింపఁబడిన జాంబూనదపరిష్కృతంబగు సర్వతోభద్రాసనంబున నాతఁ డాసీనుం డయ్యె. వాసుదేవుండు మొగంబున జిఱునగవు దళుకొత్త ధృతరాష్ట్రుని భీష్మద్రోణులను నింకను దక్కుంగలపార్థివులను బలుకరించి గౌరవిం చెను. సభాసదులెల్లరును దమసభ కభ్యాగతుండగుజనార్దనుని మహోన్న తంబులగుసపర్యలుగావించి పూజించిరి. ఆసమయంబున నంతరిక్షంబున నేతెంచునారదాదిమహర్షులం గాంచి వాసుదేవుండు శాంతనవునితో మెల్లన "మహాప్రాజ్ఞా! వీరే నారదాదిమహర్షులు. రాజసభ దిలకింప నరు దెంచుచున్నవారు. వారల కాసనంబులు నర్ఘ్యపాద్యంబులు నొసంగి యుచితసత్కారంబులచే నిమంత్రణంబు గావింపవలయును. వారలు కూర్చుండకమున్నుగా నెవ్వరును గూర్చుండఁదగదు. భావితాత్ము లగు నామునులకెల్ల శీఘ్రంబుగఁ బూజల నొనరింపం బంపు" మనియె. అట్లు వచించినంతన శాంతనవుండు సభాద్వారంబున నుపస్థితులగు మహా మునుల నాలోకించి త్వరితుండై యాసనంబులఁ దెమ్మని భృత్యుల నియో గించె. అప్పుడు భీష్మునానతింగొని పరిచారకులు కాంచననిర్మితంబులు మణిగణఖచితంబులు విచిత్రంబులు విపులంబులు నగుమహాసనంబుల నాసాదించి తెచ్చి మునులకు నివేదింప వారెల్లరు నాయాసనంబుల నుప విష్టులై యుండిరి. తరువాత ధృతరాష్ట్రునిపురోహితులు పాద్యార్ఘ్యం బులుగొనివచ్చి మహర్షిపుంగవుల కర్పించి యథావిధిగఁ బూజించిరి. ఋషు లాసనంబుల నాసీనులైనపిదప వాసుదేవుండు నితరపార్థివులును దమతమయాసనంబులం దుపవిష్టులైరి. దుశ్శాసనుండు సాత్యకికి మహోత్తమంబగు నాసనం బిచ్చెను. వివింశతి కృతవర్మునకుఁ గాంచనం బగు నాసనంబిడియె. కృష్ణున కనతిదూరంబున మహాత్ము లగుకర్ణదుర్యో ధను లిరువురు నేకాసనంబునం గూర్చుండియుండిరి. గాంధారరాజగు శకుని గాంధారవీరులు బరివేష్టింప తనతనయుండు దాను నొక్కయాస నంబునను నుపవిష్టుండయ్యె. విదురుండు శుక్లం బగునజినంబున నాస్తీర్ణం

బగుమణిపీఠంబున వాసుదేవు నాసనంబును స్పృశించుచు నాసీనుం డయ్యె. ఆరాజులెల్లరు చిరకాలంబునకుఁ గృష్ణు నాలోకించి యమృత పానంబునం దృప్తిగాంచనట్లు తృప్తినొందరైరి. అతసీపుష్పసంకాశ మగు తనుచ్ఛాయ గలమాధవుండు పీతాంబరపరిధానుండై బంగారు పొదిగినయింద్రనీలమణిపోల్కి విలసిల్లె. ఆసభాసదులెల్లరమనంబులు గోవిందునందు లగ్నంబులగుటం జేసి తూష్ణీంభావంబునొందిరి. ఆసభా స్థలిం గలపురుషు లెవ్వరు నేమియుఁ బలుకకుండ నిశ్శబ్దంబుగ నుండిరి.

## జనార్దనుండు ధృతరాష్ట్రునకు సంధివచనంబులు చెల్పుట

యథోచితంబులగునాసనంబులం దుపవిష్టులై రాజులెల్లరు నిశ్శబ్దం బుగ నున్నంత, ఘర్మాంతజీమూతనిర్ఘోషంబు ననుకరించుకంఠరవంబున జనార్దనుండు సభాసదులెల్లరు నాకర్ణింపుచుండ ధృతరాష్ట్రునితో నిట్లు వచింపనొడంగె:. భారతాగ్రణీ! మీరులకు నాశనంబుగలుగకుండఁ గౌర వులకును బాండవులకును శమంబు సంపాదించుటకై నిన్ను యాచింప నే నీయెడ కరుదెంచితిని. రాజా! నీవు నిశ్శ్రేయసంబు నొడఁగూర్చు వాక్యంబు లితరుల నడుగఁబనిలేదు. నీవెఱుంగఁదగినయర్థంబులెల్ల బాగుగ నెఱింగియే యుంటివి. ఈకురుకులంబు సకలరాజకులంబులం దును శ్రేష్ఠంబై యున్నది. శాస్త్రాభ్యాసంబు సద్వృత్తంబు కృప యను కంప కారుణ్యము అహింస మొదలగుసద్గుణంబులచే నీవంశం బుత్త మోత్తమంబై వెలుంగుచున్నయది. ఋజుబుద్ధియు క్షమయు సత్యం బును గౌరవులందు విశేషంబుగఁ గలవు. అట్టిసుగుణంబులచే నీమహా కులంబు వెలుంగుచుండ నీకతంబున నీవంశంబున నొకచెడుగు పొడ సూపుట యుచితంబుగానేరదు. నీవు కౌరవులకెల్లరకును బ్రవరుండవై యున్నవాఁడవు. బాహ్యంబునను నాభ్యంతరమునను దుష్కార్యంబు లాచరించువారలకెల్ల నీవు శిక్షకుఁడవై యున్నవాఁడవు. దుర్యోధ నుండు మొదలగునీతనయులు ధర్మార్థంబులరెంటిని నిరాకరించి చరించు చున్నవారు. వారలు కేవలము నృశంసులంబోలి ప్రవర్తించుచున్న వారు. అశిష్టులు గతమర్యాదుల లోభోపహతచేతస్కులునై వారలు కేవలము దుష్కార్యంబు లాచరించుచున్నవారు. నీబంధువులందును అందును ముఖ్యులగు నీతనయులందే యిట్టి యవినయంబుండుట నీ

వెలుంగుము. మహాఘోరంబగు నీయాపద కౌరవుల యందు సముత్థి
తంబై యున్నది. దీనిని నివారింపక యుపేక్షించినచోఁ బృథివియందుఁ
గల ప్రజలకెల్ల నాశంబు సంభవించును. నీవు తలంచితివేని యీయాపద
నివారించుట సుకరంబ యగును. కౌరవులకును బాండవులకును శమంబు
గూర్చుట దుష్కరంబుగాదని నాతలంపు. ఎల్లభంగుల శమంబు నీకును
నాకును స్వాధీనంబై యున్నది. నీవు నీతనయులను దుష్కార్యంబుల
వలన మఱలించి సన్మార్గంబున నిలుపుము. నేను బాండవులకోపంబు వాపి
వారిని బ్రకృతిస్థులఁ గావింతును. నీపుత్త్రులు సన్న్యాయంబు గలవా
రెల్లరును నీయానతి మీఱఁ జరించుట పాడికవా? వారు నీశాసనంబునఁ
జరించుట వారలకే హితంబును బలసంపాదనంబు నగును. వారట్లు
వర్తించుట నీకును హితంబె. పాండవులకు నత్యంతహితంబ యగును.
నీవెల్లవిధంబులను బుత్త్రులను శాసించి వైరంబు వినాశహేతువని
బాగుగ నాలోచించి సంధి కావింపుము. నీవు శమంబు గావించితివేని
భారతులెల్లరును నీకే సహాయులగుదురు. పాండవులచే నభిరక్షితుం
డవై ధర్మార్థంబులకు హాని రాకుండఁ గాపాడుకొనుము. మహాబలపరా
క్రమవంతులగు పాండవుల జయింప నెవ్వరికిని వశంబుగాదు. మహాత్ము
లగు పాండవులచే నభిరక్షితుండవగుచో నిన్ను జయించుట కెవ్వరికిని
దరంబుగాదు. దేవతలతోఁ గూడిన దేవేంద్రునకేని నిన్నెదిరింప శక్యంబు
గాదనువో నితరపార్థివులమాట చెప్పనేల? భీష్ముండు, ద్రోణుండు,
కృపుండు, కర్ణుండు, వివింశతి, యశ్వత్థామ, వికర్ణుండు, సోమదత్తుండు,
బాహ్లికుండు, సైంధవుండు, కళింగుండు, కాంభోజుండు, సుదక్షి
ణుండు, యుధిష్ఠిరుండు, భీమసేనుండు, ధనంజయుండు, నకులసహ
దేవులు, మహాతేజుండగు సాత్యకి, యుయుత్సుండు మొదలగువీరులెల్ల
నిన్ను గొలిచియుండ వీరలతో యుద్ధంబు గావింప నెంచు విపరీతాత్ముం
డెవ్వఁడుండును? పరంతపా! నీవు కురుపాండవు లుభయులతోఁ గూడి
యుంటివే నీలోకంబునకెల్ల నీశ్వరత్వంబును శాత్రవులకప్రధృష్యత్వము
నొంది వెలుంగంగలవు. నీతో సమానులగు రాజులెల్లరును నీతోడ విరో
ధంబు పరిత్యజించి సంధి గావించుకొందురు. నీకెల్ల శ్రేయంబులు సమ
కూర్తురు. నీవు పుత్త్రులు పౌత్త్రులు పితరులు సోదరులు స్నేహితులు
మొదలగు బంధువర్గంబుచే నెల్లెడల నభిరక్షింపఁబడుచు నీ వీమహీతలం

బెల్ల నప్రతిహతాజ్ఞంబుగ శాసింపంగలవు. వీరలను బురస్కరించికొని సత్కరించి తొల్లి యెట్లు సకలమహీమండలంబు పాలించితివో యట్లే యిపుడును నిర్వక్రపరాక్రమంబున నిఖిలమహీతలంబు నేలఁగలవు. ఈసమావేశమైయున్న రాజులతోడను పాండవులతోడను నీతనయుల తోడనుగూడి యితరులగు నాశాత్రవులనెల్ల ననాయాసంబుగ జయింపఁ గలవు. పాండవులతోడ సంధిగావించికొనుట కేవలము నీకు స్వార్థ మనియే తలంపుము. నీతనయు లగుపాండవులతోడను వారిమంత్రుల తోడను నీవు సంధిగావించికొంటివేని పాండవుల నీకఖిలం బగుమహీ మండలంబును జయించి స్వాధీనముగావింతురు. అపుడు నీవు భూలోక సామ్రాజ్యంబెల్ల నేకచ్ఛత్రంబుగఁ బాలింపఁగలవు. మహారాజా! యుద్ధమునందు వినాశం బధికతరముగఁ జూపట్టుచున్నది. రెండుపక్షం బులకును వినాశహేతువగుసంగ్రామంబునసే ధర్మముగలదని నీ వాలో చించుచున్నవాఁడవు? మహాహవంబున నీతనయులుగాని పాండవులు గాని వధింపఁబడుచో నీకేమి సుఖము లభించునో చెప్పుము. పాండవు లును నీతనయులునుగూడ మహాశూరులు, కృతాస్త్రులు నైయున్నారు. వారలలో నెవ్వరును యుద్ధంబునకు వెనుకాడువారుకారు. వారల మహాక్షయంబు సంభవింపకుండ రక్షింపుము. యుద్ధంబే సిద్ధించినచో కౌరవులనుగాని పాండవులనుగాని యందఱను జూడఁజాలము. రెండు పక్షంబులందలి రథికులు శూరులు నొండొరుల వధించుటచే ననేకులకు నాశము తప్పదు. పృథివీతలంబునంగల రాజులెల్లరు నిరుపక్షంబులయం దును సమావేశంబై యున్నవారలుకదా? వీరల కమర్షంబు జనించినఁ బ్రజలనెల్ల నశింపంజేయుదురు. రాజా! యీలోకంబునెల్లఁ గాపాడుము. ప్రజలను నశింపనీయకుము. తొలునొల్త నీవు ప్రకృతినొంది వికారంబు మానితివేని మిగిలినకార్యంబెల్ల సుఖంబున జక్కంబడును. పాండవు లును గౌరవులునుగూడ విశుద్ధచరిత్రులు వదాన్యులు హ్రీమంతులు ఆర్యప్రవర్తనులు పుణ్యవంశసంజాతులు. వార లన్యోన్యసహాయులై బ్రతుకునట్లు గావింపుము. మహాభయంబువలన వారలఁగావుము. ఈ కూడియున్న నరపాలురెల్లరునుశుభంబుగనొండొరులఁగూడికొని యొక్క పంక్తిని గూర్చుండి భుజించి సంతోషంబున గృహంబుల కరుగుదురు గాక. వసనంబులు పుష్పదామంబులు మొదలగువానిచే సత్కారంబు

లావి యీరాజులెల్లరు నమర్షంబులు వైరంబులును వీడి తమతమగృహం
బుల కేఁగి సుఖింతురుగాక. తొల్లి పాండవులయందు నీకెంతటిప్రేమం
బుండియుండెనో యంతటి ప్రేమానురాగంబులనే యీయాయుష్యాశేష
కాలం బుపస్థితం బగుసమయంబునఁగూడ నుంచికొని వారలతోడ సంధి
గావింపుము. వారలు బాల్యంబున పితృవిహీనులగుట నీవ వారలఁ బెంచి
పెద్దవారింగావించి విద్యాబుద్ధులుగఱపితివికదా? న్యాయంబు ననుసరించి
వారలను నీతనయులను బాలింపుము. వారలకు వ్యసనంబులు సంభవిం
చినసమయములందు నీవకదా రక్షింపందగువాఁడవు. నీకంటెను జ్యేష్ఠ
పిక్కు వారికేఁకలదు? నీవు ధర్మంబును నర్థంబును నశింపఁజేసికొన
కుము. పాండవులెల్లరును నీకు నమస్కారం బొనరించి ప్రసన్నునిం
గావించి యిట్లు పలికిరి. "రాజా! నీశాసనంబు ననుసరించి మేము మా
యనుచరులును మితిలేనిదుఃఖంబులెల్ల ననుభవించితిమి. పండ్రెండు
దీర్ఘంబులగుసంవత్సరంబు లడవులందు గడపితిమి. పదుమూఁడవయేఁడు
జనసంకులం బగుజనపదంబున నజ్ఞాతవాసంబుగావించితిమి. మాతండ్రి
యన్నమాటతప్పక ప్రతిజ్ఞ నిలుపునను నాశచే నిట్టిక్లేశంబులెల్ల సహించి
తిమి. మేము ప్రతిజ్ఞ నిసుమంతయు నతిక్రమింపలేదు. మేము ప్రతిజ్ఞ
నెట్లు నిర్వర్తించినదియు బ్రాహ్మణు లెఱుంగుదురు. మేము మాప్రతిజ్ఞను
నెఱవేర్చితిమిగావున నీవును నీయాడినమాటయందు నిలువుము. మేము
మాభాగంబగు రాజ్యభాగంబునుబొంద నాశించి నిత్యక్లేశంబుల నను
భవించితిమి. నీవు ధర్మంబు నర్థంబును బాగుగ నెఱింగినవాఁడ వగుట
మమ్ములఁ బ్రేమంబున గాపాడందగును. నీయందు మాకుఁగలగురుత్వ
బుద్ధిచే లెక్కలేనన్నిక్లేశంబు లనుభవించియుంటిమి. నీవు తల్లివలెను
దండ్రివలెను మాయందు దయయుంపందగును. గురువున కేదిగౌరవం
బగువృత్తియో దానిని నీవు మాయెడ నాలంబింపుము. మేమును
శిష్యోచితధర్మంబులు నీయందు నెఱపెదము. మేముత్పథంబు ద్రొక్కి
నెడ మమ్ములను దండ్రియేకదా సన్మార్గంబున నిలుపఁదగువాఁడు. మమ్ము
లను మంచిమార్గంబున నిలిపి నీవు నీస్వధర్మంబున బ్రవర్తింపుము." అని
నన్నుద్దేశించి పలికి యనంతరం బిక్కడఁగూడియున్న సభాసదుల కిట్లని
పలికిరి. ధర్మజ్ఞులరగు మీరెల్లరు సభాసదులై యుండ నొక్కచెడుగు
సంభవించుట దగుదు. ఏసభయందు ధర్మ మధర్మంబుచేతను సత్యం

లందుఁగాని శూద్రులందుఁగాని యొక్కండైనను గలఁడా' యని యడుగుచు వీరోక్తి క్తుండై యీమహీమండలం బెల్లసంచరించుచుండువాఁడు. ఆతండు మహాదర్పంబున మత్తుండై యితరమేదియు నాలోచింపక యీ విషయమే యెల్లపుడు నుద్ఘోషించుచుండెను. విద్యావిశారదులు నక్రుపణస్వభావులు నగుబ్రాహ్మణు లాతనికి భయంపడక యాతఁ డట్లాత్మశ్లాఘనము గావించుకొనుట శ్రేయోహాని నాపాదించునని పలుమార్లు నిషేధించియుండిరి. ఆసార్వభౌముం డిట్లు బ్రాహ్మణులు నిషేధించినను లక్ష్యపెట్టక వారుపదేశించినహితంబు గ్రహింపక మాటిమాటికి ని ట్లడుగుచునే యుండెను. మహాతపశ్శాలురు వేదవ్రతసమన్వితులు మహాత్ములు నగుబ్రాహ్మణులు అత్యభిమానవంతుండు నైశ్వర్యమదాంధుండు నగు రా జిట్లు పదేపదే గర్వోక్తులాడుటకుఁ గోపించి రాజా! యుద్ధంబులందుఁ దామిరువురే యయ్యు ననేకుల నెవ్వరు జయించిరో యాయిర్వురకు నీవెన్నండును లేశమైనను సమానుండవుగాఁజాలవని పల్కిరి. అది విని యాఁరాజన్యుండు వాఁరలతో "ఆవీర లిర్వురు నెవ్వరు? ఎక్కడ జన్మించిరి? వారాచరించుకర్మంబు లెట్టివి? వారినివాసస్థలం బెయ్యది? వారివృత్తాంతము నాకు సకలంబు నెఱింగింపుఁ" డని యాబ్రాహ్మణోత్తముల నడిగెను. అంత బ్రాహ్మణు లారాజన్యునకిట్లనిరి. రాజా! నీవడిగితివి కావున నానరవీరు లిరువురవృత్తాంతము నెఱింగింతు మాకర్ణింపుము. నరుండు నారాయణుండు నను మహామునులు మానుషలోకంబున కేతెంచియున్నవారని మేము వినియున్నవారము. వారిరువురును దపంబుననకాక బలంబునను మిగులఁ బ్రఖ్యాతిగాంచినవారు. నీకిచ్చవొడమెనేని వారిరువురతో యుద్ధంబు గావింపుము. వారిపుడు గంధమాదన శిఖరీంద్రంబున ననిర్దేశ్యంబు మహాఘోరంబు నగుతపంబు గావించుచున్నవారు. నీకు శక్తిగలదేని నుత్సాహంబు వొడమెనేని వారికడ కరిగి వారితో యుద్ధంబు గావింపుమని వచించిరి. అదివిని దంభోద్భవుండు బ్రాహ్మణులవచనంబులు సహింపఁజాలక షడంగపరిపూర్ణం బగు మహాసైన్యంబుగూర్చుకొని విషమంబు ఘోరంబు నగు గంధమాదన పర్వతంబున కరిగి యపరాజితు లగు నానరనారాయణులు తపంబు సేయు ప్రదేశంబును వెదకుచు వనాశ్రితులై తపం బొనరించువారిని సమీపించెను. పురుషోత్తము లగు నాపురాణమునులు లిరువురును తుత్పిపాసలచే

మిగులఁ గృశించియుండిరి. రక్తమాంసములులేక నరములు కనఁబడుచుం
డెను. శీతవాతాతపంబులచే మిగులఁ గర్శితులై యుండిరి. అట్టి యా
మునుల నిరువురను దర్శించి వారికి నమస్కారంబులొనరించి యారాజ
న్యుండు వారిఁ గుశలప్రశ్నంబు గావించెను. ఆమునులును దంభోద్భవు
నకు ఫలంబులు మూలంబులు నాసనంబు నుదకంబును విధివిధానంబున
నొసంగి సత్కరించి యాతని యోగక్షేమంబులందుఁ గుశలప్రశ్నం
బడిగి "రాజా నీవిక్కడ కేకార్యంబునకై వచ్చినవాఁడవు? నీకు మా
వలనం గాఁదగు కార్యం బేది? నీమానసంబున నేది వాంఛించి యేతెంచి
తివో తెల్పుము. అవశ్యము నీకాంక్షితంబు సమకూర్తు" మని పల్కిరి.
అంత నా రాజు తానక్కడకు వచ్చుటకుం గలకారణంబు మొదటినుం
డియు సవిస్తరంబుగ నిట్లని యెఱింగించె. "మహర్షిప్రవరులారా! నా
యీబాహువులచే నెల్లమహీమండలంబు జయించితిని. శాత్రవులనెల్లఁ
బరాజయం బొందించి వశులఁగావించుకొంటిని. భూలోకంబున నాతోఁ
బోరంగలమానవుం డెవ్వండును నాల్గువర్ణంబులందును లేఁడు. యుద్ధా
భావంబున నాబాహువులు తీటఁబట్టియున్నవి. మీరు బలశాలురనియు
యుద్ధవిశారదులనియు బ్రాహ్మణులవలన నాలించి మీతోడ యుద్ధంబు
గావించుట కీపర్వతం బధిరోహించి యీమీయాశ్రమంబునకు వచ్చి
తిని. ధర్మవేదు లగు మీరు నాకు యుద్ధంబున నాతిథ్యం బొనరింపఁ
గోరెద. ఇదియ మీరు నాకుఁ జేయంగలసత్కార"మని వచించె. అంత
నాయిర్వురును "రాజా! యీయాశ్రమంబునఁ గ్రోధంబుగాని లోభంబు
గాని తలసూపనేరవు. ఈయాశ్రమంబున యుద్ధం బనుశబ్దమే యుండ
నిచో శస్త్రంబు లెట్లువచ్చును? ఇక్కడ నెన్నండును నార్జవంబు లేకుం
డుట సంభవింపదు. ఈయాశ్రమంబున నీవు యుద్ధంబు కాంక్షించుట
తగదు. మహీతలంబున ననేక రాజన్యులు బలపరాక్రమసంపన్నులు
గలరు. నీవు వారలకడ కేఁగి నీయిచ్చకువచ్చినవారితో యుద్ధంబు
గావింపు"మని పల్కిరి. ఆనృపాలుండు వా రెంతగా వలదని వారించినను
నెంతగా క్షమించినను నెంతగా సాంత్వన మాచరించినను వినక
యుద్ధంబు నభిలషించుచు మరలమరల నాతాపసుల యుద్ధంబున కాహ్వా
నం బొనరించెను. అంత నామును లిరువురలో నరుండు కొంచెము
కుపితుండై పిడికెడుదర్భల చేతంబట్టుకొని "క్షత్రియ! నీవు యుద్ధంబు

వలదని యెంతచెప్పినను వినక నిర్బంధించితివి. రమ్ము. యుద్ధం బొనర్పుము. నీవు నీసర్వశస్త్రంబులను సంధానించికొనుము. నీసైన్యంబెల్ల నాయత్తంబు గావించికొనుము. నీకింక నెన్నండు యుద్ధాభిలాషంబు లేకుండ నీదర్పంబెల్లమాయింతు" నని పలికెను. అపుడు దంభోద్భవుండు "తాపసా! నీ వీయస్త్రంబు మాయందు యుక్తమైనదిగాఁ దలఁచుచున్నవాఁడవా? కానిమ్ము. దానితోడన నేను నీయుద్ధంబుగావింతును. నేను యుద్ధంబునకై కదా యిక్కడి కరుదెంచితి" నని పలికి సైనికులతోడం గూడి యాతాపసుని వధింపం దలంచి యాతనిపై సంతతశరములధారావర్షంబుభాతిఁ బఱపెను. ఘోరంబులు పరమర్మవిదారణంబులు నగు నా దంభోద్భవుని బాణవర్షంబులెల్ల సఱకుకొనక తాపసకులాగ్రణి యగు నరుండు వానిబాణంబులెల్ల నిషీకంబులచేఁ బ్రతిహతంబులు గావించె. మఱియు నానరపాలునిపై నైషీకాస్త్రంబు ప్రయోగించె. ప్రతిసంధానంబున కనువుగాని యాయస్త్రం బద్భుతంబై వెలుంగుచు నారాజునకు నాతనిసైనికులకును మిగుల వేదనం గలిగించెను. ఆతాపససార్వభౌముండు పరమర్మవిభేదనదక్షుండై రాజసైనికులకన్నులు కర్ణంబులు ఘ్రాణంబులును దర్భలచే బాధించి మాయచే వారలనెల్ల భయభ్రాంతుల గావించెను. ఆయస్త్రప్రభావంబున దర్భలచే నావృతంబై తెల్లనికాంతిచే ధగధగమెఱయు నాకాశంబు నాలోకించి దంభోద్భవుండు భయవిహ్వలుండై యామహర్షి పాదంబుల వ్రాలి రక్షింపుమని వేడుకొనియె. శరణాగతత్రాణపరాయణుం డగు నరుం డమ్మహీపతియెడ దయగలిగి తనయస్త్రం బుపసంహరించికొని యాతని కిట్లనియె. "రాజా! నీవు బ్రహ్మణ్యుండవు, ధర్మాత్ముండవు నగుము. మరల నెన్నండు నిట్టి దురుసుతనము గావింపకుము. క్షత్రధర్మంబు నాలోచించినచో నీవంటి లఘుమానసుండు పరపురంబుల జయింపంజాలఁడు. నీవుదర్పసమావేశంబున నెవ్వారి నాక్షేపింపఁ దలంపకుము. నీకంటె నల్పుండుగానీ యధికుండుగానీ యెవ్వని నాక్షేపింపకుండుట నీకు శ్రేయస్కరంబు. పార్థివాగ్రణీ! ప్రజ్ఞ బాగుగా సంపాదింపుము; లోభంబు దూరంబుగావింపుము. అహంకారంబు నిరాకరింపుము. ఆత్మజ్ఞానివై యుండుము. దమంబు క్షమంబు మృదుత్వంబు సౌమ్యత్వంబునుం గలిగి ప్రజనెల్లఁ గన్నప్రజల మాడ్కి లాలించి పాలింపుము. బలాబలంబు లెఱుంగకయే యెవ్వారి

నెన్నండు నధిక్షేపింపకుము. మాచే ననుజ్ఞాతుండవై తివి. నీకు శుభం బులు గలుగును. నీగృహంబున కరుగుము. మఱల నెన్నండు నిట్టిచులు కనికార్యంబు లొనరింపకుము. మావాక్యంబులుగా బ్రాహ్మణులనెల్లఁ గుశలం బడుగుము. నీవింక నరుగు” మని పలుకుటయు నారాజున్యుండు మహాత్ము లగు నామహర్షి ప్రవరుల పాదంబుల వ్రాలి ననుస్కారం బొన రించి వారికి వలగొని తనగృహంబునకు సైన్యసమేతుండై తిరిగివచ్చెను. నాటనుండియు నానరపాలుండు దర్పంబువీడి కేవల ధర్మపరాయణుండై ప్రజలం బాలించె.

అంబికానందనా! మున్ను నరుం డొక్కరుండు మాత్రమే యిట్టి మహాభయంకరం బగుకర్మంబు గావించి మించె. నారాయణుండన్ననో యసంఖ్యాకంబులగు సుగుణంబు లనేకంబులచే నరునికంటె నత్యధి కుండు. కావున మహాధనుశ్శ్రేష్ఠం బగుగాండీవంబున నస్త్రంబు సంధింపఁ బడకమున్న మదమానంబు లుజ్జగించి యాధనంజయుని శరణు పొందుము. కాకుదకంబు శుకంబు నాకంబు నక్షిసంతర్జనంబు సంతా నంబు నర్తకంబు ఘోరంబు ఆస్య మోదకంబు ననుమహాస్త్రంబు లెనిమి దింటిచేఁ బ్రహరింపఁబడిన మానవు లెల్లరుఁ దప్పక మరణంబు నొందు దురు. కామంబు, క్రోధంబు, లోభంబు, మోహంబు, మదంబు, మానంబు, మాత్సర్యంబు, నహంకారంబు ననునెనిమిదిగుణంబు లా యెనిమిదిమహాస్త్రంబులకును బర్యాయంబులై యుండును. ఈయెనిమిది మహాస్త్రంబులచేఁ బాఁడితు లగువా రున్మాదంబు, నష్టసంజ్ఞాత్వము, విచేతనత్వము, నిద్రప్లవనము, ఛర్దిమూత్రణంబు, రోదనంబు, హాస నంబు ననుబాధలం బొంది నశింతురు. సర్వలోకంబులకు నిర్మాత, సకల లోకంబులకు నీశ్వరుండు, సమస్తధర్మవిదుండు నగునారాయణుం డర్జు నునకు బంధువై యుండుటంజేసి యాధనంజయుండు సంగరంబుల దుస్సహుండై వెలుంగును. త్రిలోకైకవీరుం డగు నాకపిధ్వజుని నాజిష్ణుని జయింప నీమూఁడులోకంబులందు నెవ్వండు సమర్థుండగును? ఆకిరీటికి సాటి యగుయోధుండు భూతభవిష్యద్వర్తమానంబులందు లేనేలేఁడు. పార్థునందుఁగల గుణంబుల గణింపఁ దరంబుగాదు. జనార్దనుఁ డతని కంటె నధికుండు. నీ వాకుంతీనందనుం డగు నర్జునుని జక్కఁగ నెఱుంగు దువుకాదే? తొల్లి మహాతపంబొనర్చిన నరనారాయణు లనుమహర్షులే

ష్ణు డర్జునుండు కేశవుండు ననునామంబుల దేహాంతరంబులతో నవ తరించియున్న వారు. పురుషోత్తము లగు నాపురాణమునులే యీకేశవా ర్జునులని నీవెఱుంగుచో నావాక్యంబులు శంకింపకుందువు. రాజా! నీవు ధర్మ్యంబు నార్యంబు నగుమతి నాలంబించి పాండవులతో సంధి గావింపుము. భేదంబు వినాశకరంబని నీవెఱుంగంగల్గితివే నెల్లవిధంబుల శమంబుగావింపుము. యుద్ధంబునం దించుకయు మనం బుంపకుము. కురుశ్రేష్ఠా! మీకులంబు భూలోకంబున మిగులఁ బొగడొంది వెలుంగు చున్నయది. నీవిపుడు దూరదృష్టి వీడి కులంబునకుఁ గొఱంతకలుగ జేయక దాని నెప్పటియట్ల సర్వోత్కర్షంబునఁ బ్రకాశింపనిమ్ము. నీకు సకలశుభంబులు గలుగుఁగాత. శమంబువలన నీస్వార్థంబ సిద్ధించునని నమ్ముము.

కణ్వుండు దుర్యోధనునకు హితం బుపదేశించుట

జామదగ్న్యుం డిట్లుపలికి యూరకున్నంత సభాసదు లెల్లరునాలింపఁ గణ్వుం డనుమహర్షిసత్తముండు దుర్యోధను నుద్దేశించి యిట్లు హితం బుపదేశింపందొడంగె. వత్సా! సుయోధనా! లోకపితామహుం డగు బ్రహ్మదేవుం డెట్లట్ల నరనారాయణులను మహర్షిప్రవరులుగూడ క్షయ వ్యయంబులు లేక విరాజిల్లుచున్నవారు. ఆదిత్యులందఱిలోను విష్ణు వొక్కండే సనాతనుండును, నజయ్యుండు, నవ్యయుండు, శాశ్వతుండు, జగత్ప్రభుండు, జగదీశ్వరుండునై ప్రకాశించువాఁడు. చంద్రుండును, దివాకరుండు, పృథివి, సలిలము, వాయువు, అగ్ని, యాకాశంబు నెల్ల గ్రహంబులును దారాగణంబులెల్లను నిమిత్తమరణత్వంబున నుండు. జగంబులు క్షీణించునపు డీచంద్రసూర్యాదులుకూడ లోకత్రయంబు తోడన క్షయం బొందును. అవియెల్లను మఱల లోకంబులతోడన సృజింపబడుచుండును. వానికి జననమరణంబు లనపాయంబులై యుండును. మనుష్యులు, మృగములు, పక్షులు, నింకను జీవలోకంబునఁ జరించుతిర్యగ్యోనులు ముహూర్తమరణంబులై యుండును. ముహూర్త మరణముగలజంతువులందు నరపాలురు మహైశ్వర్యంబు లనుభవించి యాయువు క్షీణించినంతన మృతినొంది తాము గావించిన సుకృత దుష్కృతంబు లనుభవించుటకుఁ దిరిగి తరుణులై జన్మింతురు. ఈ

యర్థము నీవు చక్కఁగ నెఱింగి ధర్మనందనునితో సంధిగావింపఁ బ్రయ
త్నింపుము. పాండవులును, గౌరవులును గలసియుండి యీవసుంధరా
వలయమునెల్లఁ బాలించుట యుక్తంబగును. సుయోధనా! నేనే బలవం
తుండనని తలంపంబోకుము. బలవంతులకంటె నధికబలవంతు లగపడు
చునే యుందురు. బలవంతులమధ్యను బలంబు బలంబుగానేరదు. దేవ
విక్రము లగు నాపాండవులెల్లరు నత్యధికబలవంతులై మెఱయుచున్న
వారు. తనకుమారి కనురూపవరు నన్వేషించు మాతలిచరిత్రంబు
నీపట్టున నీవు తెలియందగును. దాని నెఱింగించెద సావధానుండవై
యాకర్ణింపుము.

### మాతలికథ

కలఁడుకదా! త్రిలోకాధినాథుం డగు దేవేంద్రునకు మాతలి
యనువాఁ డొకఁడు రథచోదకుండు. వానికి లేకలేక యొక్కకన్యా
రత్నం బుద్భవించెను. దానిరూపలావణ్యంబులు లోకంబులం బ్రసిద్ధం
బులైయొప్పె. దేవరూపిణి యగు నాకన్య గుణరూపిణియనుపేర వ్యవ
హరింపంబడుచుండె. సౌందర్యసంపదచేతను, నంగసౌష్ఠవంబునను, లావ
ణ్యాతిశయంబునను నాబాల లోకంబునంగల స్త్రీలనెల్ల మించి వెలుంగు
చుండె. తల్లిదండ్రులు మిగుల గారాబంబునం బెంప నాబాల బాల్యం
బతిక్రమించి యౌవనంబుం బ్రాపించె. అపుడు మాతలియు నాతనిసహ
ధర్మిణి యగుసుధర్మయుఁ దమకూఁతునకు వివాహంబుగావింపఁ దలం
చిరి. మాతలి కన్యకుం దగువరుల విమర్శించుచు నిట్లు వచించె. అలఘు
శీలవంతులు, మహోన్నతాశయులు, యశోవంతులు, మృదుసత్వులు
నగుపురుషులయింట కన్యలు జనించుట మిక్కిలి గష్టమైనది. సత్పురుషు
లకుఁ గన్యక జనించినచో మాతృవంశము, పితృవంశము, భర్త
వంశము ననుమూఁడుకులంబులను సంశయితంబులు గావించును. మాను
షస్వాభావికం బగుదృష్టిచే మానుషదేవలోకంబులు రెంటను జరించి
వెదకితినికాని నాకంటి కనురూపుం డనఁదగువరుం డొక్కరుండును
లభింపలేదు. అనిపలికి యాతండు దేవతలను, దైత్యులను, గంధర్వు
లను, మానవులను బహుళంబుగ నున్నగుణవంతులనుగూడ దనకన్యకుం
దగినవరులుగా నంగీకరింపండయ్యె. వారలనెల్లరను నిరాకరించి భార్య

తోఁగూడ బాగుగ నాలోచించి నాగలోకంబున కేఁగి యందుఁ దగు వరు నన్వేషింప నిశ్చయించి యాతండు భార్య కిట్లనియె. దేవతలందును, మానవులందును గుణకేశికి సముం డగు రూపశాలియు, గుణవంతుండు నగువరుండు నాకగపడ లేదు. నా గులయందెల్ల విధముల దానికనురూపుం డగువరుండు లభించుట నిక్కువము. కావున నేనిదె నాగలోకంబున కేఁగి వరు నన్వేషించెదనని పలికి సుధర్మకుఁ బ్రదక్షిణం బాచరించి కన్యకను స్కంధంబునం దిడుకొని మహీతలంబున కవతరించె.

మాతలి యట్లు కన్యకం దోడ్కొని యేఁగుచుండ నారదుండు వరుణదేవునిదర్శింప నేఁగుచు మార్గమధ్యంబున నాతనిం గాంచి యాతని కుశలసంప్రశ్నంబుగావించి, "యింద్రసారథీ! నీవెక్కడ కిపు డరుగుచున్నవాఁడవు? నీస్వకార్యంబుగావింప నేఁగుచున్నవాఁడవా? లేక శతక్రతునానతిపై నేదే నొక్కపనిఁబూని యరుగుచున్నవాఁడవా?" యని యడిగె. దానివిని మాతలి తనకార్యంబు సమగ్రంబుగ నివేదించి వరుణునిపాలి కరుగుచున్నాఁడ నని బదులుసెప్ప నారదుండు "మాతలీ! నేను నిప్పుడు వరుణునిదర్శించుటకే వెడలుచుంటిని. మనమిరువురము కలసియే యేఁగుదము. సలిలమందున్నలోకంబు లాలోకింప నేను నిప్పుడ స్వర్గంబు నుండి యవతరించితిని. వసుధాతలంబెల్ల నీకుఁజూపి యందందుఁగలవిశేషంబు లెల్ల నెఱింగింతును. ఆలోకంబున వరులనెల్ల నన్వేషించి యనురూపుం డగువరుని సంపాదింతము ర"మ్మని పలికి వారిరువురును భూమిలోనికిం బ్రవేశించి యందు లోకపాలకుం డగువరుణదేవుని దర్శించిరి. వారిరువుర నాలోకించినంతన వరుణదేవుండు ప్రత్యుత్థానాదిసత్కారంబు లాచరించి నారదునకు దేవర్షుల కుచితం బగువిధానంబునను శతక్రతున కుచితం బగురీతిని మాతలికినిఁ బూజల నాచరించెను. వరుణునిచే వారిరువురును మహార్హం బగు నతిథిసత్కారంబు వడసి తమవచ్చిన కార్యంబు నివేదించి యాతనిచే ననుజ్ఞాతులై నాగలోకం బెల్లెడల సంచరించిరి. నారదుండు భూమ్యంతర్భాగంబున నివసించు సకలభూతంబుల ప్రవర్తనంబు లెఱింగినవాఁ డగుట మాతలి కాయావిషయంబు లెల్లఁ దెల్లం బగునట్లు వివరించి చెప్పందొడంగె.

వరుణలోకవృత్తాంతము

మాతలీ! పుత్రపౌత్త్రులతోఁ గూడియున్న యపాంపతిని దర్శించి యుంటివికదా? ఇదే యాతని నివాసస్థానంబు సర్వసమృద్ధులు గలిగి సర్వతోభద్రంబై వెలుంగుచున్నయది. వీఁడె మహాప్రాజ్ఞుండు సలిలాధినాథుం డగు వరుణునితనయుండు. వీఁడు శీలంబునను వృత్తంబునను శౌచంబునను నెల్లరకంటె నధికుండు. వీఁడుగో వీని నాలోకింపుము. ఈపుష్కరేక్షణుండు వానిపుత్త్రుండు పుష్కరుం డనువాఁడు. వీఁడు మహారూపవంతుండు, దర్శనీయుండును. సోమునిపుత్త్రి వీనిని బతిగా వరించినయది. ఆకన్యకకు జ్యోత్స్న యనియుఁ గాళియనియు నామంబులు ప్రసిద్ధంబులై యొప్పె. రూపంబున నిందిరాదేవి శాకన్య రెండవదియై యున్నది. అదితికి జ్యేష్ఠపుత్త్రుండు శ్రేష్ఠుండు కృతుం డనువాఁడు ప్రసిద్ధుండేకదా? వీరలనెల్ల నాలోకింపుము. ఇదియె సర్వంబును గాంచనంబున నిర్మింపంబడిన వరుణునిభవనంబు. సురపతిసఖా! దీని నధిగమించుటం జేసియే సు లు సురత్వముం బొందిరి. ఇవే యిక్కడ దీప్యమానంబు లగు దివ్యంబు లగు నాయుధంబులు గలవు. ఈయాయుధంబులెల్ల దైతేయులవి. దేవతలచే దైతేయులు పరాజయంబంది తమతమ యాయుధంబుల నిక్కడ విడిచి చనిరి. దైతేయులరాజ్యంబెల్ల దేవతలు హరించిరి. క్షయరహితంబులగు నీయాయుధంబులెల్ల నిక్కడ వివర్తమానంబులై యున్నవి. అనుభావప్రయుక్తంబులగు వీనినెల్ల దేవతలవజితంబులు గావించిరి. మాతలీ! యీలోకంబున రాక్షసజాతులును దైత్యజాతులును సర్వదైవతనిర్మితంబు లగు దివ్యప్రహరణంబులు నుండెడివి. ఇదే వారుణహ్రదంబు. దీనియం దగ్ని మహాజ్వాలాభీలంబై యొప్పుచుండును. ఇదిగో విధూమంబై జ్వలించునగ్నిచేఁ బరివృతం బగు వైష్ణవం బయినచక్రంబు. ఇదె గాండీమయం బగు మహాచాపంబు. లోకసంహారసంవృతం బగు దీనిని దేవతలు నిత్యంబు నతిప్రయత్నంబున రక్షించుచుందురు. దీనివలనన గాండీవం బనుధను వుద్భవించినది. ఈచాపంబు కార్యం బాసన్నంబయినప్పు డాయాబలంబుల ధరించుచుండును. సహస్రంబులు శతంబులు నాదిగాఁగల్గుబలంబుల నిది నిత్యంబు ధరించియుండును. రాక్షసులందును రాజులందును శాసింప శక్యముగానివారలనెల్ల

నీచాపంబు శాసించును. బ్రహ్మవాదియగు బ్రహ్మదేవుండు తొలుత నీ చండంబగు కాండాసనంబును సృజించె. ఈయొక్కశస్త్రంబును నరేంద్రులమహాశస్త్రంబులకెల్ల సమానంబయి రాజచక్రంబులనెల్ల నవలీల జయింప సమర్థంబయియున్నది. మహోదయంబను దీనిని జలేశ్వరుండగు వరుణదేవునితనయులు ధరించుచుందురు. ఇదే సలిలాధినాథుని దివ్యంబగుఛత్రంబు ఛత్రగృహంబున విలసిల్లుచున్నది. ఇయ్యది జీమూతంబు వోలె నెల్లయెడల శీతంబగుసలిలంబు వర్షించుచున్నయది. చంద్రకిరణంబులవలె నిర్మలంబగు నీగొడుగునీరు చీఁకటిచే నావృతంబై కంటి కగపడకుండును. మాతలీ! ఇంక నీలోకంబునఁ జూడందగువింత లనేకములు గలవు. నీకుఁ గార్యత్వర యధికంబై యుంట వానినెల్ల నాలోకింప సమయంబుగాదు. కావున వేగంబ యిచ్చటువాసి యేఁగుద మని పలికెను.

## పాతాళలోకవృత్తాంతము

అంతట వారిరువురును బాతాళంబున కరిగిరి. అయ్యెడ నారదుండు మాతలి కిట్లనియె. సురసారథిసత్తమా! ఇదే పాతాళం బనుపురవరంబు. ఇయ్యది నాగలోకంబునకు నాభిస్థానంబున నున్నది. దీనియందు దైత్యులు దానవులు నెప్పుడును సేవించుచుందురు. భూలోకంబునందలి జంగమంబులగుజంతువు లెవ్వియేని జలప్రవాహంబుతోడ నీప్రదేశంబునకు వచ్చుచో నవి భయపీడితంబులై మహానాదంబులు గావించుచుండును. ఇయ్యెడ నాసురంబగుమహానలంబు నిత్యంబు నుదకంబుల నాహరించుచుఁ బ్రజ్వలించుచుండును. ఆయనలంబు వారిభక్షణం బనువ్యాపారంబున నాత్మపోషణంబుగావించుకొనుచు వెలుంగుచున్నది. దేవతలు శాత్రవుల జయించి యమృతప్రాశనంబుగావించి యాయమృత మిందు దాఁచియుంచిరి. దానివలననే చంద్రునకు వృద్ధియు క్షయంబును సంభవించుచున్నవి. ఇక్కడనుండియే హయగ్రీవుం డగునాదిత్యుండు సుపర్ణుండనువాఁడు ప్రతిపర్వంబునందును వాక్యంబులచే జగంబుల బూరించుచు నుదయించుచుండును. ఆవాక్యంబులధ్వనికి సమస్తంబు లగుజలమూర్తులును మిగుల వేగంబున నంకుఁబడుచుండును. కావుననే పాతాలము (మిగుల వేగమున జలముపడునది) యనునామం బీపురంబున కన్వ

ర్థంబయ్యె. జగంబులకు హితం బాచరింపంగోరి యైరావతం బీపురంబున నధికంబుగ జలంబు నిజశుండంబున గ్రహించి మేఘములయందు విడచును. ఆజలంబునే మహేంద్రుండు వర్షరూపంబున భూమిపై విడచును. నానావిధాకారంబులు ననేకరూపంబులు నగుతిమి లీపురంబున నుదకంబులందుఁ బ్రసరించుచంద్రకిరణముల నాహరించి జలంబులందుఁ జరించుచుండును. ఇక్కడ సూర్యాంశువులచే భిన్నులై పగలు మరణించినజంతువులు పాతాలతలంబు నాశ్రయించి రాత్రి మరల జీవించుచుండును. చంద్రుం డుదయించుచు నెల్లెడలఁ దనకిరణంబులను బాహువులచే నమృతంబు స్పృశించి మృతులగుదేహధారులను దనకరంబులచేఁ దాఁకి మరల జీవింపంజేయుచుండును. ఈయెడనే వాసవునిచే హృతసర్వసంపదలుగలదై తేయులు బద్ధులై ధర్మనిరతులు కాలపీడితులునై యున్నవారు. ఇక్కడన భూతపతియనునామంబుగల సర్వభూతమహేశ్వరుండు సర్వలోకంబులకు హిత మాచరించువాఁడై యుత్తమంబగుతపం బాచరించెను, ఇక్కడ స్వాధ్యాయామ్నాయకర్శితులగు విప్రులు మహర్షులు గోవ్రతంబు నాలంబించి ప్రాణంబులవిడిచి స్వర్గంబున నివసింతురు. ఎక్కడనో యొక్కెడఁ బండుకొనియుండి యేదియో యొకపదార్థం బయత్నలభ్యం బగుదానిచే శరీరధారణంబుగావించుచు యేదేనివల్కలంబుననో వసనంబుననో శరీరాచ్ఛాదనంబు గావించుకొనుచుఁ బ్రాణాంతమువఱకుఁ బరమేశ్వరుని ధ్యానించుచుఁ గాలముగడపుట గోవ్రతంబు నాఁబరఁగును. ఇయ్యెడన సుప్రతీకం బనుదేవగజంబువంశంబున నైరావతంబను గజరాజంబును వామనంబు కుముదంబు నంజనంబు ననుదేవగజంబులు నుద్భవించినవి. ఈపురంబున నీకిష్టుండగువరుండు లభించునేమో చూడుము. నీకభిమతుండగువాఁ డిందుండెనేని నేను వానికడకరిగి యత్నంబున వానిని వరించి తెత్తును. మాతలీ! చూచితివా! ఈ జలంబులు దుంపఁబడినయండ మెట్లు సిరిచే వెలుఁగుచున్నదో! ఇయ్యది ప్రజలకెల్ల నిసర్గంబు గలుగువఱకుఁ జిట్లనైనఁ జిట్లదు; ప్రసరింపనైనఁ బ్రసరింపదు. ఇయ్యది పుట్టుటగాని నశించుటగాని యెవ్వరు నెఱుంగరు. దీనితలిదండ్రులనే నెవ్వరు నెఱింగినవారు లేరు. అంతకాలంబున నీయండంబువలనన మహానలం బుద్భవించి సచరాచరంబు లగుమూఁడులోకంబులను దహించును. అన విని మాతలి నారదునితో నాకీయెడ వరుం

జెవ్వాఁడును రుచింపలేదు. మఱియొకదెసకు వెడలుదము. వేగముగఁ బదమని పలికె.

## హిరణ్యపురవృత్తాంతము

అంత నారదుండు మాతలితోఁ గూడి హిరణ్యపురంబున కరిగి యాపురం బాతనికిం జూపి యిట్లనియె. పురందరాశ్వచోదకా! యిదె హిరణ్యపురంబని ప్రసిద్ధిగన్న మహాపురవరంబు మాయాశతవిశారదు లగు దైత్యులు దానవులు నిందు నివసింతురు. విశ్వకర్ముం డగుమయుండు పాతాళంబున కధోభాగంబున దీని నతిప్రయత్నంబున మనంబుచే నిర్మించె. తొల్లింటినుండి యీపురంబున శూరులు దత్తవరులు నగుదానవులు మహామాయలు సహస్రవిధంబులుగ నాచరించుచు నివసించుచున్నవారు. వీరలజయింప నింద్రుండు యముండు వరుణుండాదిగ దేవతలుగాని యితరులుగాని సమర్థులుగారు. కాలఖంజులను నసురులును, విష్ణుపదోద్భవులగునైఋతులును, బ్రహ్మపాదసంభూతులగు యాతుధానులును, మహాదంష్ట్రాకరాళురు భీమవేగులు వాతవేగపరాక్రములు మాయావీర్యోపసంపన్నులు నగువారిందు నివసించుచున్నవారు. యుద్ధదుర్మదులగునివాతకవచులను దానవుల నీవెఱుంగుదువుకాదె? శతక్రతుండైనను వీరల బాధింపఁజాలఁడనుటయు నీవెఱుంగుదువుకదా? మాతలీ! నీవును నీతనయుండగు గోముఖుండును దేవరాజగు శచీపతియు నాతనితనయుండు జయంతుండును బలుమాఱు వీరిచే భంగంబునొంది తిరికదా? బంగారము వెండి మొదలగువానిచే నిర్మింపఁబడినవారలమందిరంబుల నాలోకింపుము. విధియుక్తంబు లగుకర్మంబులచే నుపగతంబులగు నీభవనంబులు మనోహ్లాదకరంబులై యొప్పుచున్నవి. కొన్ని వైడూర్యమణిచిత్రంబులు, కొన్ని ప్రవాళరుచిరంబులు, కొన్ని సూర్యకాంతమణిగణారుణంబులు, కొన్ని చంద్రకాంతశిలాధవళంబులు, కొన్ని వజ్రసారోజ్జ్వలంబులు, కొన్ని పద్మరాగరక్తంబులునై వీరలమందిరంబులు విలసిల్లుచున్నవి. కొన్ని మంటిచే నిర్మింపఁబడినవి; కొన్ని ఱాలచే నిర్మింపఁబడినవి; కొన్ని దారువులచేఁగట్టఁబడినవియునై ప్రకాశించుచున్నవి. కొన్ని సూర్యమండలంబుంబోలు రూపంబులుగలవి. మఱికొన్ని ప్రజ్వలించునగ్నింబోలినవియునై యొసంగుచున్నవి. అవియెల్ల మణిగవాక్షవిచిత్రితంబులు మహా

న్నతంబులు మహోద్యృఢంబులు నై పొలుపారుచున్నవి. రూపంబునను ద్రవ్యంబునను గుణంబునను సిద్ధంబులును బ్రమాణగుణవంతంబులు నగువీని నిట్టి విట్టివని నిర్దేశింప శక్యంబుగాదు. అల్లవె దైత్యుల యుద్యానవనంబులు. అవియె రత్నవంతంబులు మహార్హంబులు నగు దానవులశయనంబులు నాసనంబులు భవనంబులును వెలుంగుచున్న యవి. జలదాకారంబు లగు క్రీడాపర్వతంబు లవియే. అవిగో తోయ ప్రస్రవణంబులు. అల్లవె కామంబు ననుసరించి పుష్పంబులు ఫలంబులు నొసంగుమహీరుహంబులు. అయ్యవి కామానుసారంబుగ నొక్కయెడ నుండి వేఱొకతావునకు సంచరించుచుండును. మాతలీ! ఈపురంబునం గలవారలలో నొక్కం డెవ్వండేని నీకభిమతుం డగువరుం డుండునా? లేక భూమియొక్క యధోభాగంబునంగల మఱియొకదిక్కున కరుగుదమా? నీయిష్టం బెయ్యదియో తెలుపుమని పలికె. ఆమాట లాలించి మాతలి దేవర్షిప్రవరా! నేనెన్నండును దేవతలకు విప్రియం బాచరింపందలం పను. సోదరు లగు దేవదానవులు నిత్యానుషక్తం బగు వైరముగలవారు గదా? అట్టియెడ నాయొడయనికి శాత్రవు లగువారలతో నేనెట్లు సంబం ధముగావింతును? పదము వేఱొకతావున కరుగుదము. దానవుల నాలో కింప నాకభిప్రాయంబు లేదు. నీమనం బనంతవిధంబుల హింసారతం బని నేనెఱుంగుదును. అని వచించెను.

## గరుడలోకవృత్తాంతము

అపుడు నారదుండు కొంతదవ్వరిగి యక్కడ నొక్కలోకంబు చూపి మాతలితో నిట్లనియె. ఇది పన్నగాశనంబు లగుసుపర్ణంబు లను పక్షులలోకంబు. ఈపక్షులకు విక్రమంబునంగాని గమనంబునంగాని భార వహనంబునంగాని యించుకంతయుం బరిశ్రమంబుండదు. సుముఖుండు సునాముండు సునేత్రుండు సువర్చసుండు సురుచి సుబలుండు నను నామంబులు గలవైనతేయుని తనూజు లార్వురీలోకంబును బాలించు వారు. వినతాకులకర్త లగువారిచే ననేక కులంబులు వర్ధితంబులై యొప్పు చున్నవి. పక్షిరాజువంశంబునంబుట్టిన శాఖోపశాఖలు వందలువేలుగ నభివృద్ధినొందియున్నవి. కశ్యపునివంశమం దుద్భవించిన యీపక్షికులంబు లెల్ల మహైశ్వర్యంబులతో నొప్పారుచున్నవి. వీరలెల్లరును సుశ్రీ

యుక్తులు; శ్రీవత్సలాంఛనులు. వీరెల్లరును సిరినిబొందుతలంపున మహా బలంబులు ధరించియున్నవారు. వీరు కర్మంబున క్షత్రియులై యున్న వారు. దయ యన నెట్టిదో యెఱుంగక వీరు పాముల భక్షించుచుం దురు. జ్ఞాతిసంక్షయకారకు లగుటం జేసి వీరలకు బ్రాహ్మణ్యంబు దుర్లభం బయ్యె. వీరలలోఁ బ్రధాను లగువారలనామంబులుమాత్రము వక్కా ణింతు నాలింపుము. మాతలీ! విష్ణుదేవునిచేఁ బరిగ్రహింపంబడిన యీ కులంబు మిగుల శ్లాఘ్యతమంబైనది. వీరలకు విష్ణుండే దైవతము. విష్ణుండే పరాయణము. వీరలహృదయంబులం దెల్లవేళ విష్ణువు నివసించి యుండును. వీరల కెల్లవేళ విష్ణుండే గతి. సువర్ణచూడుండు, నాగా శనుండు, దారుణుండు, చండతుండకుండు, అనిలుం, డనలుండు, విశా లాక్షుండు, కుండలిపంకజితుండు, వజ్రవిష్కంభుండు, వైనతేయుండు, వారుణుండు, వాతవేగుండు, దిశాచక్షుండు, నిమిషుం, డనిమిషుండు, త్రివారుండు, సప్తవారుండు, వాల్మీకిదీపకుండు, దైత్యద్వీపుండు, సరి ద్ద్వీపుండు, సారసుండు, పద్మకేతనుండు, సుముఖుండు, చిత్రకేతుండు, చిత్రబర్హుం, డనఘుండు, మేషహృత్తుండు, కుముదుండు, దక్షుండు, సర్పాంతకుండు, సప్పభోజనుండు, గురుభారుండు, కపోతుండు, సూర్య నేత్రుండు, చిరాంతకుండు, విష్ణుధర్ముండు, కుమారుండు, పారిబర్హుండు, హరిసుస్వరుండు, మధుపర్కుండు, హేమవర్ణుండు, మాలయుండు, మాతరిశ్వుండు, నిశాకరుండు, దివాకరుండు ననువార లీపక్షిలోకం బునం బ్రధానులు. గరుడాత్మజు లగువీరలు ప్రాదేశమాత్రంబున నాచే నెఱింగింపంబడిరి. కీర్తిమంతులలోఁ బ్రధానులనుమాత్రమే చెప్పితిని. వీరలలో నెవ్వఁడేని నీకు రుచించిన సరియే. లేకున్న నీకభిమతుం డగు వరించుదేశంబునకు నిన్నుం గొనిపోయెదనని పచించి యాతని కిష్టుం డగువరుం డాలోకంబున లేమి యెఱింగి యాతనితోడ రసాతలంబు నకుం జని యాలోకం బాతనికిఁ జూపి యిట్లని చెప్పందొడంగెను.

## రసాతలవృత్తాంతము

సురసారథీ! ఇదె రసాతలంబనులోకము. పృథివీతలంబుననున్న లోకంబులం దిది యేడవది. ఈలోకంబునందు యమృతంబుతోఁగూడ నుద్భవించిన గోమాత సురభి యున్నది. ఈకామధేనువు పృథివీసారసంభ

వంబును నాఱురసములసారంబువలన నుద్భవించిన యేకరసంబు నగు ననుత్తమమగుక్షీరంబు స్రవించుచుండును. తొల్లి పితామహుం డమృతముద్రావి యత్యంతతృప్తుండై సారంబు నుద్గీర్ణంబుగావింప దాని వలన ననిందిత యగు నీధేను వుదయించె. దానిక్షీరధార మహీతలంబునం బడుచోట క్షీరనిధి యనుపేరుగల యొకమహాహ్రదంబు జనించె. ఆహ్రదంబు కామధేనుపయఃపూరితంబగుట నత్యంతపవిత్రం బయ్యె. ఆహ్రదంబు నాల్గుతీరంబులందును జేరినఫేనంబు నాహరించుచు ఫేనపు లనుమునిసత్తము లిందుఁ దపంబు గావించుచుందురు. ఫేనమాహారం బుగా స్వీకరించుటంజేసి యామునులకు ఫేనపులనునామంబు జగ త్ప్రసిద్ధంబయ్యె. ఆమును లాచరించుమహోగ్రం బగుతపంబునకు దేవ తలు నిత్యోద్వేగంబు నొందియున్నవారు. ఈకామధేనువు సంతానం బగు నాల్గుధేనువులు నాల్గుదిక్కుల నివసించుచు భూమిని ధరించి యెల్ల దిక్కులను గాచుచున్నవి. సురూప యనుసౌరభి పూర్వదిక్కును, హంసిక యనుధేనువు దక్షిణదిశను, సుభద్ర యనుసౌరభేయి వరుణ పాలితం బగుపశ్చిమదిశను, మహానుభావ యగువిశ్వరూప యనుమా హేయి యుత్తరదిశను ధరించుచున్నవి. ఈధేనువులపయస్సుతో సమ్మి శ్రితం బగుక్షీరంబును క్షీరసాగరంబున నుంచి మందరపర్వతంబును గవ్వంబుగావించి దేవతలును దానవులుం గలిసి వాసుకినిఁ దఱిత్రాడుగా నొనరించి మహాబలంబున మథించిరి. అపు డాక్షీరసాగరంబువలన వారు ణియు లక్ష్మియు నమృతంబును అశ్వంబులకు రాజగు నుచ్చైశ్శ్రవం బును మణులలో నుత్తమం బగు కౌస్తుభంబును నుద్భవించె. సుధా హారులకు సుధను స్వధాహారులకు స్వధను నమృతాహారుల కమృతంబును గామధేనువుక్షరించుచుండును. రసాతలంబున నివసించుటవలనఁ గలుగు సుఖంబు నాగలోకంబునఁగాని స్వర్గంబునఁగాని విమానంబునఁగాని త్రివిష్టపంబునంగాని వసించుటవలన లభింపంజాలదని తొల్లి రసాతల నివాసులచే గానంబుసేయఁబడిన గీతంబులుగూడఁ గలవు. ఈలోకం బత్యంతపవిత్రంబును సుఖావాసంబునై యొప్పుచున్నది.

### భోగవతీపురవృత్తాంతము

ఇదే కాంచితివా భోగవతీపురంబు. దేవరాజపాలితం బగు నమ రావతీపట్టణం బెట్లుత్తమంబై చెల్లుచున్నదో యట్లే వాసుకిపాలితం బగు

నీపురంబును సర్వోత్తమంబై విలసిల్లుచున్నయది. ఈలోకంబుననే నాగేంద్రుం డగు శేషుండు వసించుచున్నవాఁడు. ఆ శేషుండు మహాతపం బొనరించి లోకముఖ్యుండై తనసహస్రఫణామండలంబున నీసకల భూమండలమును వహించియున్నవాఁడు. శ్వేతాచలనిభాకారుండును దివ్యాభరణభూషితుండును జ్వాలాజిహ్వుండును మహాబలసంపన్నుండు నగు శేషుండు వేయిశిరంబులతో వెలుంగుచుండును. ఈలోకంబున సురసాతనయులు నానావిధాకారులు నానావిధభూషణోజ్జ్వలగాత్రులు నగునాగులు నివసించియుందురు. మణిస్వస్తికచక్రాంకులు కమండలు లక్షణులు రౌద్రస్వభావులు నగు నాగులు వేలకొలఁదిగ నిందు నివసిం తురు. కొందఱు వేయిశీర్షంబులుగలవారు. కొంద ఱేనూరుశిరంబులు గలవారు. కొందఱు నూఱుమూర్ధంబులుగలవారు. కొందఱు మూఁడు తలలుగలవారు. కొందఱు రెండుమూర్ధంబులుగలవారు. కొంద ఱేను ఫణంబులుగలవారు. కొంద ఱేడుపడగలుగలవారు నై మహావిశాలంబు లగుఫణామండలములు పర్వతంబులంబోలు మహాకాయంబులును గలిగి చూపఱ కాశ్చర్యభయసంభ్రమంబులం గొల్పుచుండుదురు. ఇందు పెక్కు వేలుప్రయుతంబులు నర్బుదంబులు సంఖ్యగల యేకకులసంజాతు లగు నాగులు గలరు. వారలలో నుత్తము లగువారి నెఱింగింతు నాలింపుము. వాసుకి, తక్షకుండు, కర్కోటకుండు, ధనంజయుండు, కాళియుండు, నహుషుండు, కంబళుం, డశ్వతరుండు, బాహ్యకుండుండు, మణినాగుండు, నాపూరణుండు, ఖగుండు, వామనుండు, నైలపత్త్రుండు, కుకురుండు, కుకణుం, డార్యకుండు, నందకుండు, కలశుండు, పోతకుండు, కైలాస కుండు, పింజరకుండు, నాగుం, డైరావతకుండు, సుమనస్కుండు, సము ఖుండు, దధిముఖుండు, శంఖుండు, నందుం, డుపనందకుం, డాప్తుండు, కోటరకుండు, పద్మండు, మహాపద్మండు, శిఖావంతుండు, నిష్ఠూరికుండు, తిత్తిరిహస్తిభద్రుండు, కుముదుండు, మాల్యపిండకుండు, పుండరీకుండు, పుష్పుండు, ముద్గరపర్ణకుండు, కరవీరుండు, పితరకుండు, వత్తుండు, సంవృత్తుండు, పిండరుండు, బిల్వపత్త్రుండు, మూషికాదనుండు, శిరీష కుండు, దిలీపుండు, శంఖశీర్షుండు, జ్యోతిష్కుం, డపరాజితుండు, కౌరవ్యుండు, ధృతరాష్ట్రుండు, కుహూరుండు, కృశకుండు, విరజస్కుండు, ధారణుండు, సుబాహుండు, ముఖరుండు, జయుండు, బధిరుం,

డంధుండు, విశుండు, వరసుండు, సురసుండు మొదలగువారు బహు సంఖ్యాకులు కశ్యపునివంశంబునం జనించినవారు గలరు. మాతలి! వీరలలో నెవ్వఁడే నొక్కఁడు నీమనంబునకు రుచించినవరుం డగునేని చెప్పుము. నేనేఁగి యెంతప్రయత్నంబైన నొనరించి వానిని నీకల్లునిగా నొనరింపఁగలనని వచించెను. నారదుం డట్లు వచింప మాతలి మనంబు నిశ్చలంబు గావించి యెదురనున్న నాగులనెల్ల బాగుగ నాలోకించి వారి సల్లక్షణావలక్షణంబుల బాగుగ విమర్శించి ప్రీతియుక్తమానసుండై యెదుటనున్న యొక్కనాగకుమారుం జూపి నారదునితో దేవర్షి సత్తమా! కౌరవ్యునకు నార్యకునకు నెదుర నిలిచియున్నపిన్నవాఁ డెవ్వఁడు? వీఁడు మహాద్యుతిమంతుఁడు. దర్శనీయలక్షణసంపన్నుండు నగునీతఁ డేకులంబున జనించినవాఁడు. వీనితండ్రి యెవ్వఁడు? తల్లి యెవ్వతె? ఏభోగవంతునివంశంబు నీతండు వెలుంగంజేయుచున్న వాఁడు? ప్రణిధానంబు నసురూపంబునను శరీరసౌష్ఠవంబునను యుక్తం బగు ప్రాయంబునను నీతండు నామనంబునకు నచ్చినవాఁడు. ఈతఁడు గుణకేశికిఁ దగువరుండు. కావున వీనియాథాతథ్యం బెఱింగింపుమని పలికె. అంత నారదుండు మాతలి ప్రీతుండయ్యెనని తెలిసి వానిజన్మ వృత్తాంతంబెల్ల సమగ్రంబుగ దెలిపెను. మాతలీ! యీతం డైరావత కులంబున జనించినసుముఖుం డగునాగరాజు. ఆర్యకునకుఁ బౌత్రుండు. వామనునకు దౌహిత్రుండు. ఈతనితండ్రినామధేయంబు చికురుఁడని యందురు. ఆతండు మొన్న మొన్న నే వైనతేయునిచేఁ బంచత్వం బొందె నని వచింప మాతలి ప్రీతుండై మునిపుంగవా! యీసుందరాకారుఁడు నాకనుకూలుం డగునల్లుం డగును. కావున నీవు వీని నొప్పింపఁ బ్రయ త్నింపుము. వీనియెడల నాకత్యంతానురాగము జనించుచున్నయది. నాగోత్తముం డగునీతనికి నాప్రియదుహిత నర్పించి కృతకృత్యుండఁ గాఁగలనని పలికెను.

## సుముఖుం డనునాగున కింద్రుండు చిరాయుం బొసంగుట

ఆమాతలివచనంబు లాలించి నారదుం డార్యకుని సమీపించి యాతనితో నిట్లనియె. నాగరాజా! నాతోఁగూడ వచ్చియున్నయీతండు మాతలి యనువాఁడు. ఇంద్రునకు సారథి. మహేంద్రునకు ధయితుం

డగునెచ్చెలి. శుచియు శీలగుణసంపన్నుండు తేజస్వి వీర్యవంతుండు బల వంతుండు నగునీతండు శతక్రతునకు నెచ్చెలియు మంత్రియు సార థియుంగూడ నై యొప్పుచున్నవాఁడు. యుద్ధంబులందు వాసవునకుఁ గొంచెము తక్కువ యగు ప్రభావంబుగలవాఁడు. సహస్రాశ్వయుక్తం బగు సంక్రందనస్యందనంబు నాహవంబులం దీతండు మనంబుననే దోలు చుండును. ఈతండు తొలుత నశ్వంబులచే జయింప ననంతరముఁ మహేంద్రుండు బాహువులచే జయించును. తొలుత నీతండు శాత్రవులఁ బ్రహరింప ననంతరము బలభేదనుండు ప్రహరించును. ఈతని కొక్కకన్యారత్నంబు వరారోహయు రూపలావణ్యాదులందు సాటి లేనిదియు సత్యశీలగుణోపేతయు నగునది గుణకేశి యనుపేరుగలది కలదు. దాని కనురూపుం డగువరు నన్వేషింప నీతండు సచరాచరంబు లగు మూఁడులోకంబులు సంచరించి వెదకి యెందునుంగానక యిక్కడ నీపౌత్రుండు సుముఖు నాలోకించి ప్రీతమానసుండై తనకూఁతున కనుకూలుం డగువరుండు సుముఖుండే యని నిశ్చయించియున్నవాఁడు. కావున భుజగోత్తమా! నీకు మాతలితోడిచుట్టఱికం బిష్టంబయ్యెనే నాతనికన్యను నీపౌత్రునకు భార్యగా గ్రహింప యత్నింపుము. విష్ణు కులంబున లక్ష్మి ప్రవేశించినట్టులు నగ్నివంశంబునఁ స్వాహాంగన మెట్టి నట్లును నీపౌత్రునకుఁ బత్నియై గుణకేశి నీకులంబు నలంకరించుఁగాక. నీపౌత్రునకై నీ వీగుణకేశిని బ్రతిగ్రహింపుము. వాసవునకు శచీదేవి వలె సుముఖునకు నీకన్య సమానగుణాలంకారయైనది. వీఁడు పితృ హీనుండయినను గుణంబుల నహీనుండగుట నీతని వరునిగా వరించు చున్నారము. మఱియు నీయందు నైరావతనాగరాజునందు మాకుఁ గలబహుమాన మీసంబంధమున కధికప్రోత్సాహము గల్పించుచున్న యది. శీలంబు శౌచంబు దమంబు మొదలగుసుముఖుని సద్గుణంబులచే నీసురేంద్రసారథి మిగులఁ బ్రీతుండై యున్నవాఁడు. ఈతండు తనంత తావచ్చి కన్య నీయఁదలంచినవాఁడు. కావున నీవును నీమాతలి కర్హ రీతిని గౌరవం బాచరించి యాతని యభీప్సితంబు నెఱవేర్తువుగాక. అని నారదుండు పలుక నార్యకుండు ప్రహర్షతరంగితాంతరంగుం డయ్యు నాననంబున దైన్యంబుదోపఁ దనపుత్రునిచావు మనుమనిబ్రతు కనుస్మరించి నారదునితో నిట్లనియె. దేవర్షిపుంగవా! నీవచనంబు బహు

మానింపం దగినదయ్యె నాకు బహుమతంబు గాకున్నయది. శతక్రతు నికి హితుం డగు నీమాతలితోడివియ్య మెవ్వాని కభిమతంబు గాకుండును? అయినను నాపౌత్రునకుఁ గారణంబు దుర్బలంబగుటచే మిగులఁ జింతాకులుండనై యున్నవాఁడను. వీనికి దేహకర్తయగు నాతనయుండు చికురుండు మొన్నమొన్న నే వైనతేయునిచే భక్షింపంబడియె. వాని మరణంబున మేమెల్లర ముల్లంబులం బొగులుచున్నవారము. వైన తేయుండు నాపుత్రుని జంపి తిని వెడలునపుడు "ఈమాసంబున చికు రుని భక్షించితిని. మఱుమాసంబున వీనితనయుండగు సుముఖుని జంపి తినియెద"నని పలికి వెడలిపోయినవాఁడు. ఆగరుడుం డన్నదియట్ల కావిం చును. ఆతనినిశ్చయంబు మేమెల్లరము నెఱుంగుదుము. కావున నాతన యునిమరణంబునను మనుమనికి మరణంబు సమీపంబున నుండుటను నాహర్షంబెల్ల నశించి శోకాకులమానసుండనై యున్నవాఁడను. అట్టి నేనిప్పు డీసంబంధముగోరివచ్చిన మీవచనంబు లెట్లాదరింపఁగలనో నీవ యాలోచించి నన్ను మన్నింపుమని పలికెను. ఆమాటలాలించి యించుక ధ్యానించి మాతలి యాతని కిట్లనియె. మహానుభావా! నే నీవిషయం బున నొక్కబుద్ధి విచారించితిని. నీపుత్రునికొడుకగు సుముఖుని నేనల్లు నిగా వరించితిని. ఈపన్నగోత్తముండు నాతోడను నారదునితోడను గూడినవాఁడై త్రిలోకాధినాథుండగు వాసవునికడ కేతెంచి యాతని దర్శనం బాచరించుఁగాక. మిగిలినకార్యంబెల్ల నేన కావించి యీతనికి సమగ్రంబగు నాయువు చేకూర్చెద. సుపర్ణుండు వీనిజోలికి రాకుండ యత్నంబుగూడ నాచరింతును. అభిమతకార్యసాధనంబునకై సుము ఖుండు నాతోఁగూడ దేవేశ్వరునికడ కరుదెంచుఁగాక. నీకెల్లశుభం బులు లభించుఁగాక. అనిపలికి యాయార్యకు ననుమతింబడసి సుము ఖునిఁ దోడ్కొని మహారాజస్కులగువార లెల్లరతోడఁ బురందరునికడ కేతెంచెను. వారలెల్లరును దేవరాజునికటంబున కరుగునప్పు డచ్చట విష్ణుండు దేవేశ్వరునితోడ నిష్టసల్లాపంబులు నెఱపుచు వారి కగపడియె. ఆచతుర్భుజునకు నమస్కారంబుగావించి మాతలి తానుద్దేశించిన యెల్ల వృత్తాంతము నివేదించెను. అదివిని దయార్ద్రహృదయుండై జనార్ద నుండు పురందరునితో నిట్లనియె. శతక్రతూ! సుముఖున కమృతంబిమ్ము. వాని సమరులతో సమానుని గావింపుము. మాతలియు నారదుండు

సుముఖుండును నీవలన వారు వారు వాంఛించిన యీకామంబు నీవలనం బ్రాపింతురుగాక. అనిపలికిన బురందరుం డించుక యాలోచించి వైన తేయునిపరాక్రమంబు స్మరించి భయమంది విష్ణునితో నీవే సుముఖున కమృతమిమ్మని వచించె. అంత విష్ణుండు సంక్రందనా! చరాచరంబులగు సకలలోకంబులకు నీవ యధినాథుండవు. నీవిచ్చుచో నీయకుండనాపఁ గలవాఁ డెవ్వఁడుండును? కావునఁ దప్పక యాతని కమృతం బిమ్మనియె. అపుడు వాసవుండు సుముఖున కుత్తమంబగునాయువు నొసంగెనుగాని యమృతంబుమాత్ర మీయఁడయ్యె. ఆసంక్రందనునివలనఁ జిరాయువును వరంబుగాగ్రహించి సుముఖుండు గరుడభయంబువలన సంభవించినదుర్ముఖత్వంబు బాసి సుముఖుండయ్యె. పిదప నాతండు మహావిభవంబున మాతలినందనగుణకేశిని బరిణయంబై పరమసంతోషంబునఁ దన గృహంబున కరిగె. నారదుండు నార్యకుండును గృతకృత్యులై దేవేశ్వరు ననేకవిధంబులఁ బూజించి తమతమయిచ్ఛానుసారంబుగ నరిగిరి.

## గరుడగర్వభంగము

అంత నక్కడ సుపర్ణలోకంబున గరుడుండు మాతలియు నారదుండును సుముఖుని దోడ్కొని దేవేంద్రుని దర్శించుటయు దేవేంద్రుఁ డానాగున కాయువు నొసంగుటయు నెల్లవృత్తాంతంబు నాకర్ణించి తన పక్షంబులవలన జనించినమహావాయువుచేఁ ద్రిభువనంబుల నిరోధించుచుఁ బరమక్రుద్ధుండై వాసవునికడకుఁ బరువెత్తివెడలెను. ఆగరుడుండు వాసవు నాలోకించి కోపాతిరేకంబునఁ గన్నుల నిప్పులుగ్రక్కుచు మహారౌద్రంబగుగంభీరస్వనంబున నాతని కిట్లనియె. భగవంతుఁడా! అవజ్ఞానంబున నాయాహారంబు ప్రతిహతంబు గావించితి వేల? సర్వభూతంబుల నిసర్గంబులు నాలోచించి సర్వభూతేశ్వరుండగు విధాత నాకు విధించినయాహారంబు నీవే కారణంబునఁ దిరుగఁద్రోసితివి? నేనామహానాగంబును భక్షింప వరించితిని. నేను దానికిఁ బ్రతిజ్ఞకూడఁ గావించియుంటిని. ఆమహానాగంబుచే నేను బహుకుటుంబమును బోషింపవలసియున్నది. ఈనాగం బిట్లు నాచేఁ దప్పిపోయినచో నితరుని హింసింప నామనం బంగీకరింపదు. దేవరాజా! నీయిచ్చవచ్చినట్లును మదీయాహారంబుతో నాటలాడుచున్న వాఁడవు. నేనును నాపరిజనంబులు నిప్పుడే ప్రాణంబులు విడిచెదము. నేను

నాభృత్యులు పుత్త్రపౌత్త్రులును దప్పక మరణమొందెదము. దానివలన నీవు మిక్కిలిగ నానందింపుము. బలవృత్త్రవిఘాతీ! దీనికిఁగూడ నే నధికముగ నష్టుండనై యే యున్నాఁడను. నేను ముల్లోకంబుల కధినాథుండ నయ్యు నొకనికి దాస్యంబు నెఱపుచున్నాఁడనుగదా? నీవు మాదుగఖంబులకెల్ల మూలమైయుండ విష్ణుండు నాచే దాస్యంబుగావించికొనుటకుఁ గారణంబని నేననంజాలను. త్రైలోక్యరాజ్యంబెల్ల నీయందకదా శాశ్వతంబై నిలిచియున్నది. నాకును దక్షునితనయ జనని. కశ్యపుండే నాకును జనకుండు. నేనుగూడ నీలోకంబులనెల్ల బలంబున వహించుటకుత్సాహపడుచున్నవాఁడను. విపులంబగు మదీయబలంబు సకలభూతంబులకును దుస్సహంబైనది. దైతేయుల నిగ్రహించువిషయమున నేనును మహాకర్మంబు లనేకంబు లొనరించియుంటిని. శ్రుతశ్రీ, శ్రుతసేనుండు, వివస్వంతుండు, రోచనాముఖుండు, ప్రస్తుతుండు, కాలకాక్షుండు మొదలగుదైత్యులను నేను వధించియుంటిని. నీయనుజుం డగువిష్ణునకు ధ్వజస్థానంబున నుండుటయు యత్నంబున నాతనికిఁ బరిచర్య లొనర్చుటయు నాతనిని మూపునవహించుటయుఁ గారణంబులుగ నన్నొక నీచునట్లవమానించుచున్నాఁడవు. నాకంటె భారంబువహించువాడును బలవంతుండును నితరుఁ డెవ్వండు గలఁడు? నే నత్యధికబలవిశిష్టుండ నయ్యు బంధువులతోఁగూడ నీతనిని మోయుచున్నాఁడను. నీవు నాకవజ్ఞానం బాచరించి నానోటికందినయాహారంబు నపహరించుటంజేసి నీవలనను నీయనుజన్ముండగు నీవిష్ణునివలనను నాగౌరవంబెల్ల నశించినది. అదితివలన జనించిన యీయమరులందఱిలోను నీవు బలంబున బలవత్తరుండవుకదా? నేను నాఱెక్కలయందలి యొక్కభాగంబుచేతన నిన్ననాయాసంబుగ మోయఁజాలుదును. ఇప్పుడు బలాధికుం డెవ్వఁడో నీవ యాలోచింపుము. అని యిట్లు రోషావేశంబున మైమఱచి పలుకుటయుఁ గర్వోద్రిక్తంబు లగువానివాక్యంబులు నైపక శంఖచక్రగదాధరుండగు జనార్దనుం డిట్లనియె. గరుడా! నీవు కేవలము వివేకవిహీనుండవై మిగుల దుర్బలుండవయ్యు నీవే మహాబలశాలివనుకొనుచున్నాఁడవు. నేనిక్కడ నుండఁగా నాయెదుట నే నిన్ను నీవు పొగడుకొనుట వెఱ్ఱితనమగుచు. నాదేహంబువహించితినని నీవు గొప్పగాఁ జెప్పికొనుచున్నావు. అది కేవల మనుచితము నసత్యమును. నాదేహంబును వహిం

చుట కీమూఁడులోకంబు లొక్కటిగాఁ గూడినను సమర్థములుగావు. నేననాశరీరంబును నిన్నుఁగూడ ధరించుచున్నాఁడను. నామాటయందు నీకునమ్మకముగలుగదే నిదే నాయపసవ్యంబగు నీయొక్కబాహువును నీ వొక్కపరి మోయుము. దాని నొక్కదానిని నీవు మోయఁగలిగితివేని నీవింతగాఁ బొగడికొన్నను సఫలంబగును. అని వచించి విష్ణుండు తన యెడమచేతిని గరుడునిమూపుపై నుంచెను. అట్లు విష్ణుండు బాహు వుంచుటయు నాభారంబు వహింపంజాలక నష్టచేతనుండై గరుత్మం-తుఁడు క్రిందఁబడియెను. సపర్వతనదీనదంబగు భూమండలంబెల్ల నెంత బరువై యుండునో యంతబరు వాయొక్కచేతియందే కలదని గరు డుండు నిశ్చయించెను. అచ్యుతుండును దనబలంబున నాయండజేశ్వరు నధికంబుగఁ బీడింపందలంపమిచే నాపతంగపుంగవునకు జీవంబు నిలిచి యుండెఁగాని విష్ణుం డొక్కింతబలంబున నడంచెనేని విహంగనాథుండు మృతినొందవలసినవాఁడే యగును. మహాభారంబు వహింపంజాలక పతంగపుంగవుండు నోరుతెఱచి శరీరంబు శిథిలమై చేతనాభ్రంశ మొంది విహ్వలుండై ఱెక్కలుసెదర నల్లల్లఁ గొట్టుకొనుచుండెను. ఆతం డట్లు వికలుండై గర్వంబు దూరంబుగావించి తెలివిమెఱయ శిరంబున మురమర్దనునకుఁ బ్రణామం బాచరించి దీనుండై యిట్లు విన్నవించె. భగవానుఁడా! ఎల్లలోకంబులసారంబునకు సమానం బగుసారంబుగల నీ బాహువులీలచే నాపై నుంచినను వహింపఁజాలక నలంగిపోయియుంటిని. నేను విహ్వలుండను నష్టచేతనుండనునై యుంటిని. నాబలంబు దర్పం బును రూపఱియె. గావున నీధ్వజంబునవసించు నాయెడఁ బ్రసాదము వహింపుము. పరమంబగు నీబలం బెఱుంగనేఱక నేనట్లు కాఱులుప్రేలితిని. నీబలంబు వాస్తవం బెఱుంగకయే నిన్ను వహించుమాత్రమున నాబలం బన్యులకంటె నత్యధికంబని తలంచితిని. నాయజ్ఞానంబు సైచి నన్నుఁ గరుణింపుమని దీనంబున బ్రార్థించెను. ఆప్రార్థనం బాలించి దయార్ద్రహృదయుండగు విష్ణుండు గరుడునియెడఁ బ్రసన్నుండయ్యె. గరుడా! నీవింక నెన్నండు నిట్టియవివేకంబు లాచరింపకుమని పలికి యిదె సుముఖనాగంబు దీనికి శతక్రతుం డిచ్చినవరంబు మన్నించి దీనిని హింసింపక దీనితోఁగూడి సంచరించుచుండుము. ఇదియ నీగర్వభంగ మునకు చిహ్నంబై యుండునని తనపదాంగుళిచే నెదురనున్న సుము

ఘుని గరుడునియురంబున బడవైచె. గరుడుండును వాసవానుజు నానతి తలందాల్చి నాటఁనుండియు సర్పంబునుగూడఁ దనకడనుంచికొని వర్తించు చుండె. సుయోధనా! మహాబలవంతులకెల్లఁ బ్రథముం డగు పన్నగాశనుండునైతము విష్ణుదేవునిచే నిట్లు గర్వనాశమొందెను. నీవును నట్లే మహాబలవంతులగు పాండునందనులయుద్ధభూమిని సమీపించువఱకు జీవంబులు ధరించియుందువు. మహాబలుండగువాయునందనుండు యోధులలోనెల్ల శ్రేష్ఠుండు. ఇంద్రనందనుండగు ధనంజయుండు సంగరంబున నెవ్వనినేని వధింపక విడచునా? విష్ణువు వాయువు మహేంద్రుండు ధర్ముండు నశ్విదేవతలును వారలకుఁ బ్రాపైయున్నవారు. ఆదేవతలే పాండవరూపంబున నవతరించినవారని నమ్ముము. మహాప్రభావులగు నాదేవతలను నీవు దేటిపాటి చూడనైనఁ జూడంగలవా? కావున నీవు విరోధము చాలించి శమంబొందుము. వాసుదేవుం డిపుడు తీర్థంబై మీకులం బుద్ధరింప వచ్చియున్నవాఁడు. ఆతనియానతి దలఁబూని నీకులంబు రక్షించుకొనుము. సర్వలోకంబులను బ్రత్యక్షంబుగ నాలోకించు నీనారదుండు విష్ణుదేవునిమాహాత్మ్యంబు బాగుగ నెఱుంగును. సనాతనుండగు శాంఖచక్రగదాధరుండే యీకృష్ణుండై యవతరించినవాఁడు. కావున నీవీతనిమాట కాదనక గ్రహించి కుల ముద్ధరింపు మని వచించె. ఆవాక్యంబు లాలించి దుర్యోధనుండు కనుబొమముడి వడ వెచ్చనూర్చుచు రాధేయు నాలోకించి పకపక వెడనవ్వునవ్వెను. ఆదేవర్షి యగు కణ్వునిహితవచనంబుల ననాదరంబున నిరాకరించి గజతుండసన్నిభం బగు నూరుకాండంబును గరంబున జఱచుచు నేనీశ్వరునిచే నెట్టివాఁడనుగా సృజింపంబడితినో యట్టివాఁడనే యగుదును. కానున్నదేదియుఁ గాకమానదు. నాగతి యెట్లుపడిన నట్లే నేను బ్రవర్తింతును. మహర్షీ! నీవు పదింబదిగఁ బ్రలాపంబొనరించిన ఫలమేమియని వచించె. దాని కామహర్షిప్రవరుండు కోపించి దురాత్మా! నావచనంబు లాదరింపక యూరువులఁజఱచుచు నన్నవమానించితివి గావున నీవూరుభంగంబున మృతినొందెదవు గాక యని శపించె.

అపుడు జనమేజయజనపాలుండు వైశంపాయనమునీంద్రునితో మహర్షిపుంగవా! అనర్థంబు నజాతనిర్బంధుఁడును, పరార్థంబున నధికలోభావిష్టుండును, అనార్యులచెలిమియం దత్యాదరముగలవాఁడును, మర

వచింపుడు. నే నాపదార్థంబు లర్పించి కృతకృత్యుండనై చనియెదనని పలికెను. విశ్వామిత్రుండును వత్సా! నీవు శుశ్రూషగావించుటచే మిగుల బడలియున్నావు. నీవొనరించినభక్తియ చాలు, మాకితరంబేమియు నక్కఱలేదు నీవు యథేచ్ఛం జనుమనియె. అంత గాలవుండు గురుపుంగవా! దక్షిణలర్పించినవానికి నపవర్గంబు నిరర్గళంబై యుండు. దక్షిణ వలనఁ గ్రతుఫలంబు లభించును. దక్షిణయే శాంతి యనంబడును. దక్షిణ లర్పించువాఁడు స్వర్గంబునఁ బ్రమోదంబందును. కావున నేపదార్థంబు వలయునో యానతిమ్మని మఱల నిర్బంధించి యడిగెను. విశ్వామిత్రుం డెన్నిమాఱులు వలదనిచెప్పినను వినక గాలవుండు వలయునర్థం బానతిమ్మని యడుగుటంజేసి విశ్వామిత్రున కించుక కోపం బంకురించెను. కించిత్కోపంబున విశ్వామిత్రుండు చంద్రునివలె ధవళం బగుశరీరచ్ఛాయగలిగి యొకప్రక్క కర్ణంబు నల్లనికాంతిగలహయంబు లెనిమిదినూఱులు దీసికొనిరమ్మని యాజ్ఞాపించెను.

### గాలవునకు గరుత్మంతుఁడు ప్రత్యక్షంబగుట

విశ్వామిత్రుం డిట్లాజ్ఞాపింప గాలవుం డక్కడనుండి బయలుదేఱి యేమిచేయుటకు నెక్కడకేగుటకును దోఁపక చింతాశోకపరాయణుండై నిలిచినచోట నిలువక పండినతావునం బండక నిద్రాహారంబుల కాసగొనక చర్మంబు నెమ్ములుమాత్రము మిగిలి మిగిలినరక్తమాంసంబు లెల్ల విశోషింప నతికృశుండై దుఃఖంబున నతిమాత్రదహ్యమానాంతరంగుండై యిట్లని విలపించె. నాకు సంపన్నులగుమిత్రు లెందును లేరు. నాకు ధనంబులన నెట్టివో తెలియదు. నాకు ధనసంచయ మెట్లు? చంద్రధవళంబు లగు నష్టశతాశ్వంబులు నాకెట్లువచ్చును? నేను భోజనం బెట్లాచరింపంగలను? సుఖంబులు నాకెట్లు దొరకును? నాకు జీవితంబునెడ శ్రద్ధ కూడ నశించినది. నాజీవితంబునం బ్రయోజనంబేమి? నేను సముద్రపారంబునుంగాని, భూమియొక్కపారంబునుంగాని యధిగమించి యయ్యెడ నాత్మత్యాగంబుగావించెద. నేను జీవించియున్న ఫలం బేమియు లేదుకదా? అధనుండను నకృతార్థుండను వివిధఫలశూన్యుండను ఋణగ్రస్తుండను నగునాకు సుఖమెక్కడిది? మిత్రులధనంబు లనుభవించి వారలతో నిష్టం బగుప్రణయంబుగావించి వారలకుఁ బ్రత్యుప

కారంబు గావింపనేరనివాఁడు జీవించుటకంటె చచ్చుటయే యుత్తమం బయినది. ఏదే నొక్క కార్యంబు గావింతునని నమ్మించి యాకార్యంబు గావింపక యున్నవాఁడు మిథ్యావచనంబులచే దగ్ధుండై యిష్టాపూర్తంబులం గోల్పోవును. అసత్యవచనునకు రూపంబు సంతతి ప్రభుత్వంబును నిలువక నశించును. శుభగతు లసత్యవాది కెన్నండును లభింపవు. చేసిన మేలు మఱచువానికి యశంబు, స్థానంబు, సుఖంబును నెట్లు లభించును? కృతఘ్ను నెన్నండును నమ్మరాదు. కృతఘ్నునికి నిష్కృతి లేనేలేదు. నిర్ఘృణుం డగుపాపాత్ముండు జీవించుటయే కష్టము. అట్టివాఁ డేకార్యంబులు నెట్లాచరింపంగలఁడు? పాపాత్ముండు చేసినయుపకారంబు నశింపఁ జేయుచుఁ దానును దప్పక నశించును. నేను పాపాత్ముండను, గృతఘ్నుండను, గృపణుండను, నసృతుండను నై యున్నవాఁడను. నేను గురువుగారివలన నుపకారమొందియు నాతనికార్యంబుచేసెదనని ప్రతిజ్ఞయొనరించియు నాకార్యంబు సేయంజాలకున్నవాఁడను. నేనెంతటిప్రయత్నంబైన నొనరించి ప్రాణంబుల విడిచెదను. నేనింతకును నెన్నండును దేవతల నేయర్థంబును యాచించియుండలేదు. యజ్ఞసంస్తరమం దెల్ల దేవతలును నాకు మిగుల సమ్మాన మొనరింతురు. నేను దేవతలకెల్ల శ్రేష్ఠుండను, ముల్లోకముల కధినాథుండును గతిలేనివారి కుత్తమగతియు నగువిష్ణుదేవుని శరణంబొందెదను. ఆతనిదయవలన సురాసురులు భోగంబు లనుభవించుచున్నవారు. అవ్యయుండు, యోగిపుంగవుండు నగుకృష్ణున కిదె నమస్కారంబు. త్రిభువనాధినాథుం డగు జనార్దనుండు నాకు సన్నిధిగావించుఁగాక యని ప్రార్థించినంత నాతని కట్టెదుట నాతనికి మిత్త్రుం డగు వైనతేయుండు పొడచూపి యాతని కిట్లనియె. గాలవా! నీవు నాకు మిత్త్రుండవు. నీవు మిత్త్రులకెల్ల నుత్తమం బగుమిత్త్రమవు. నీకుఁ బ్రియం బాచరింపంగోరి నేనిటకు వచ్చితిని. వైభవంబున్నపుడు మిత్త్రునియభిలాషంబు నెఱవేర్పందగును. బ్రాహ్మణాగ్రణీ! నీకోర్కిదీర్పఁగల విభవంబు నాకుం గలదు. వాసవానుజుం డగు శ్రీవిష్ణుండు నీకై నాచేఁ బ్రార్థింపంబడి నాకనుమతిం బ్రసాదించినవాఁడు, కావున నాతోరమ్ము. నీ వెక్కడ కరుగ వాంఛించిన నక్కడకు సుఖంబుగ నిన్ను గొంపోవుదును. దేశాంతరములకేని, భూమ్యంతమునకేని నిన్ను లీలచేఁ గొంపోవనున్నాఁడను. కావున విలంబము సేయక

లభింపనేరదు. బ్రాహ్మణోత్తమా! యియ్యెడ రాక్షసులు వేలకొలంది నివ
సించియుందురు. అకృతాత్ము లీయెడ సృష్టింపంబడిన ప్రతికూలంబులనెల్ల
నాలోకింతురు. ఈదిక్కునమందరగిరికుంజంబులందును బ్రహ్మర్షిగృహంబు
లందును జిత్తబుద్ధుల హరింపంజాలు మధురస్వరంబులతో గంధర్వులు
గాథల గానము సేయుచుందురు. ఈదిక్కునందు గాథలతోఁగూర్చి
పాడంబడినసామంబు లాలించి రైవతుం డనురాజు భార్యలను మంత్రు
లను రాజ్యంబునెల్ల విడచి వనంబున కేఁగెను. యవక్రతాత్మజుం డగు
సావర్ణిమనువు స్థాపించినమర్యాదను సూర్యుఁ డతిక్రమింపకుండ
వెలుంగుచున్నవాఁడు. పులస్త్యకులసంభూతుండు మహాత్ముండు రాక్షస
ప్రభుండు నగురావణుం డీదిక్కునందు మహాఘోరం బగుతపం బాచ
రించి దేవతలవలన నవధ్యత్వంబువడసె. వృత్రుండుకూడ నియ్యెడ
వర్తించుటంజేసి శతక్రతుని భయపెట్టఁగల్గునంతటిబలంబు గలవాఁ
డయ్యె. సకలజంతువుల ప్రాణంబులు నీదిక్కునకు వచ్చి తిరిగి ప్రాణాపాన
వ్యానోదానసమానంబులను నైదుభేదంబులచే జంతువులం బొందును
దుష్కృతంబు లాచరించినవారు లియ్యెడఁ బచింపంబడుదురు. ఇక్కడఁ
వైతరణి యనునది వైతరణంబులను నరకంబులతోఁ గూడియున్నది
ఈలోకంబున సుఖాంత మగునరకయాతనల ననుభవించి పదంపడి
దుఃఖాంతరూపం బగు స్వర్గసుఖము లనుభవింపఁబడును. ఈదిక్కునకు
మఱలి దినకరుండు రసవంతము లగు జలంబుల గురియును. వసిష్ఠాది
సప్తర్షిమండలాధిష్ఠితం బగు నుత్తరదిక్కు నధిగమించి మంచు గురి
యును. నేను మున్నొక్కపరి క్షుధార్తుండనై యాహారంబు నన్వే
షించుచు యుద్ధంబొనరించుచున్న మహాశరీరంబులుగల గజకచ్ఛపము
జంపి భక్షించితిని. సూర్యునివలన జనించినచక్రధనుం డనుఋషి
యీదిక్కునఁ దపం బొనరించును. కపిలదేవుండను ప్రసిద్ధిగన్న యాతని
చేతన సగరతనయులు భస్మావశేషులయిరి. వేదపారంగతులు సిద్ధుల
నగుశివు లనఁబడు బ్రాహ్మణు లీదిక్కున సకలవేదంబుల నధ్యయనం బొన
రించి యక్షయం బగుమోక్షంబు నొందిరి. వాసుకి తక్షకుండు నైరావ
తుండు ననునాగరాజులచేఁ బాలింపంబడిన భోగవతియనుపుర మీ
దిక్కునం గలదు. మరణకాలంబున నీదిక్కునందు సూర్యుండు కృష్ణ
నుండును భేదింపఁజాలనిమహాంధకారంబు పర్వును. నీకు నిక్కడ వె

కుట కనువుగలదు. ఈదిక్కున కనుగ నిచ్చుగలదేని వచింపుము. తీసికొని వెడలెదను. లేదేని పశ్చిమదిక్కు వివరింతు నాలకింపుమని యిట్లు చెప్పం దొడంగె.

### పశ్చిమదిగ్వర్ణనము

మహర్షీ! యీదిక్కు వరుణరాజునకుఁ బ్రియమైనది. సలిలంబుల కధినాథుం డగువరుణున కెల్ల వేళల నివాసభూమియు నుత్పత్తిప్రదేశంబు గూడ నిదియే. సూర్యుండు దివసావసానసమయంబునఁ గిరణంబుల నిక్కడ స్వయముగ విసర్జించును. దానంజేసి యీదిక్కునకుఁ బశ్చిమ యనునామంబు విఖ్యాతంబయ్యె. సలిలంబుల రక్షించుపొంటె జలజంతువులకెల్ల రాజుగా వరుణు నియ్యెడఁ గశ్యపుండు పట్టాభిషిక్తునిం గావించెను. ఈదిక్కునందు వరుణునివశమం దున్నరసంబు లాఱింటిని బానం బొనరించి చంద్రుండు తరుణవయస్కుండై శుక్లపక్షాదియందు చీఁకటుల హరించును. ఈదిక్కునందు వాయుదేవునిచే దైత్యులు బంధింపఁబడి పశ్చాత్కృతులై నిట్టూర్పులువిడచుచు మహావాతంబులచేఁ బీడింపఁబడినవారై నిద్రించిరి. అస్తం బనుపర్వతోత్తమం బీయెడ దనమిత్రుం డగుసూర్యునిఁ బ్రతిగ్రహించును. ఆప్రతిగ్రహంబువలనన పశ్చిమసంధ్య యావిర్భవించుచుండును. దానివలనన రాత్రియు నిద్రయు దివసావసానంబునం గలుగుచుండును. రాత్రియు నిద్రయుఁ బ్రాణుల యాయువునం దర్ధంబు నపహరించును. ఇక్కడ నదితి పాదతలమునందు తలయుంచి సంధ్యాకాలమున నిద్రింప నింద్రుం డామెగర్భంబు ప్రవేశించి గర్భపిండము నేడువిధములుగ భేదించె. ఆయేడుశకలంబులే మరుద్గణంబయ్యె. ఇయ్యెడ హిమవత్పర్వతమూలంబు సముద్రాంతరంబున మునింగియున్న మందరము నొరయుచున్నది. ఎన్ని వేలసంవత్సరంబులు వెదకినను సముద్రంబు నడుగుభాగమును హిమవంతము పాదంబుచివరయు నగపడకుండును. ఈదిక్కునందు కాంచనపర్వతంబునంగల కాంచనకమలంబులకు నిలయం బగుసరోవరంబుతీరంబున కామధేనువు కామక్షీరంబు లొలుకుచుండును. ఈదిక్కునసముద్రాంతరప్రదేశంబున సూర్యచంద్రులం గ్రసింప యత్నించు రాహువుమహాశరీరంబు గోచరం బగుచుండును. అప్రమేయుండు నవృశ్యుండు నగుసువర్ణశిరస్కుండు హరి

రోముండు ననునామంబులం బరగుమహాముని యీదిక్కున సామంబు లెప్పుడును గానంబుసేయుచుండును. ఆసామగానంబు విపులం బగు ధ్వనితో నెప్పుడును వినంబడుచుండును. ధ్వజవతి యనునామంబుగలహరి మేధసునికుమారి యీయెడ సూర్యునిచే నిలువుమని యాజ్ఞాపింపఁబడి యాకాశంబున నిలిచియుండెను. ఈయెడ వాయువు వహ్ని జలంబు నాకాశంబును దమసహజంబై రాత్రిందివంబులు గలుగుశైత్యంబు నుష్ణంబును వీడి సుఖస్పర్శంబులై యుండును. ఈదిక్కునందె సూర్యుని తేజు మఱలిపోవును. ఎల్లజ్యోతులు నీయెడ నాదిత్యమండలముం బ్రవేశించును. జ్యోతిర్గణంబులన్నియు నిరువదియెనిమిదిరాత్రులు సూర్యునితోఁగూడ సంచరించి పిదప సోమసంయోగంబునం జేసి యావిర్భవించుచుండును. ఈదిక్కునందె మహానదులకును సముద్రమునకును బూర్తి సంప్రాప్తంబయ్యె. ముల్లోకములందలిజలంబులు నీదిక్కున వరుణాలయంబున నుండును. పన్నగప్రభుం డగు ననంతునినివేశనం బీయాశను గలదు. ఆదియు నంతంబునుం గనరాని విష్ణునిస్థాన మీకడన కలదు. అగ్నికి సఖుండగుపవనుని నివేశంబు నీదిక్కునందె కలదు. మహర్షి యగు కశ్యపునియొక్కయు మారీచియొక్కయు నివేశనంబు లియ్యెడన కలవు. ధర్మంబునకుఁ దృతీయమార్గం బగు పశ్చిమదిక్కు వర్ణించి చెప్పితిని. ఇక్కడ కరుగ నీకిచ్ఛకలదేని వచింపుము. లేదే నుత్తరదిగ్విశేషంబు లాకర్ణింపుమని వచించి యిట్లుత్తరదిగ్గుణంబులు వర్ణింపందొడంగె.

## ఉత్తరదిగ్వర్ణనము

గాలవమునీ! పాపంబులవలన నుత్తరింపంబడుటవలనను స్వర్గంబు పొందుద్వారంబగుటను నీదిక్కున కుత్కృష్టం బనునర్థంబుగల యుత్తర శబ్దంబు సార్థకంబయ్యె. ఉత్తమంబగుహిరణ్యస్థానంబునకు పశ్చిమపూర్వదిక్కులమధ్యంబున నుండుమార్గంబై యీయుత్తరదిక్కు వెలుంగుచున్నయది. దిక్కులలోనెల్ల శ్రేష్ఠం బగు నీయుత్తరదిక్కునందు సౌమ్యుండుగానివాఁడును నవిధేయాత్ముండు నగుజనుండు వసింపం గాలఁడు. అధార్మికు లీదిక్కున నుండఁజాలరు. ఇక్కడ నారాయణుం డను కృష్ణుండును నరోత్తముం డగుజిష్ణుండును బదరికాశ్రమంబునఁ దపంబు గావించుచున్నవారు. శాశ్వతం బగుబ్రహ్మం బీదిక్కున నివసించును. ఈ

దిక్కునందు హిమవత్పర్వతశిఖరంబున మహేశ్వరుండు నిత్యనివా
సంబు గావించియున్నాఁడు. పురుషుండు ప్రకృతితోఁగూడఁ గ్రీడించుచు
నీదిక్కునందుండును. యుగాంతాగ్నిసమాన ప్రభాశాలి యగునాతనిని
మునిగణంబులుగాని వాసవాదిదేవతాగణంబులుగాని చూడఁజాలరు.
నరనారాయణులిరువురు దక్కగంధర్వయక్షకిన్నరకింపురుషులాదిగ దేవత
లెవ్వరు నాప్రకృతితో విహరించుపరమపురుషుం గానఁజాలరు. ఇయ్యెడ
విష్ణుండు వేయికన్నులు వేయిపాదములు వేయిశిరంబులుఁగలిగి యొక్క
రూపంబున లోకంబులెల్ల మాయచే నాలోకించుచు విలసిల్లుచుండును.
ఈదిక్కునందుఁ జంద్రుఁడు బ్రాహ్మణులకెల్ల రాజుగాఁ బట్టాభిషేకంబు
గావింపంబడియె. బ్రహ్మవిదగ్రణి! యీదిక్కునందు మహేశ్వరుండు గగ
నంబుననుండి యవతరించుగంగను తనజటాజూటంబున ధరించి మానుష
లోకంబున కొసంగెను. మహేశ్వరునిఁ బతిగాఁగోరి పార్వతిదేవి యీ
దిక్కునందు సుదుష్కరం బగుతపం బాచరించె. ఈదిశయందు కామంబును
రోషంబును హిమవన్నగంబు నుమాదేవియు విరాజిల్లి యున్నవారు.
రాక్షసులకు యక్షులకు గంధర్వులకుఁ బ్రభువుగాఁ గైలాసంబునఁ గుబే
రుండు పట్టాభిషిక్తుండయ్యె. ఈదిక్కునందు చైత్రరథం బనురమ్యం
బగుకుబేరోద్యానంబు గలదు. పరమపవిత్రం బగు విఖనోమహర్షియాశ్ర
మం బియ్యెడ నున్నది. దివ్యనదీలలామం బగు మందాకినియు దివ్యమహీ
రుహప్రవరం బగు మందారంబు నీదిక్కునం గలవు. నైఋతులచే రక్షిం
పంబడు సౌగంధికవనం బిక్కడఁ గలదు. కదళీస్కంధం బనంబడు శాద్వ
లంబును సంతానకమహీరుహంబులు నీయాశం బ్రకాశించుచున్న యవి.
నిత్యసంయమవంతులు స్వైరసంచారులు నగు సిద్ధులవిమానంబులు కామ
భోగ్యంబులై యీదిక్కున జరించుచుండును. ఈదిక్కునందు సప్త
మహర్షులును బరమపతివ్రతాతిలకం బగు నరుంధతీదేవియు వసించి
యున్నారు. రాత్రియు పగలు నీయెడన నివసించియుండి లోకంబులం
దెల్లఁ బ్రవర్తించుచుండును. పితామహుం డీదిశయందు యజ్ఞపురుషు
నాసాదించి ధ్రువంబుగ వసించియున్నవాఁడు. ఇక్కడ జ్యోతిర్గణంబు
లును జంద్రసూర్యాదిగ్రహంబులును నిత్యంబును బరివర్తనం బొందు
చుండును, ధామ లనువేరుగల మహామునులు సత్యవాదులు నిత్యంబు
నిక్కడ గంగాద్వారంబును రక్షించుచుందురు. ఆమహర్షుల యాకారం

బులుగాని శరీరంబులుగాని వారు గావించుతపశ్చర్యగాని యెవ్వరు జూడఁజాలకుందురు. ఇయ్యెడఁ గామభోజ్యంబు లగుపరివర్తనసహస్రంబులు ప్రవర్తిల్లుచుండు. మానవు లిక్కడ నేయేరూపంబులం బ్రవేశింతురో దానికంటె నుత్తమంబు లగురూపంబులొంది మార్పునొందుచుందురు. ఈయర్థంబు మహామునిపుంగవు లగు నారాయణుండు నరుండు దక్క నన్యుల కగోచరంబై యుండును. వారిరువురుదక్క హిమపూర్ణంబగు నీదిగంతమున కెవ్వరు వెడలియుండ లేదు. కైలాసం బనుపేరుగల కుబేరునిరజతపర్వత మిందే కలదు. విద్యుత్ప్రభలను ప్రసిద్ధింగన్న యప్సరస్త్రీ లీదిక్కునంద యుద్భవించిరి. తొల్లి మూఁడులోకంబుల నాక్రమించునవసరంబున సనాతనుఁ డగువిష్ణుండు తనపాదంబు నిక్కడ నుంచి విష్ణుపదం బనుస్థానంబు గావించె. ఈదిక్కునంద యుశీరబీజం బనుస్థలంబున మరుత్తుం డను రాజర్షిప్రవరుండు యజ్ఞంబు గావించె. ఆయజ్ఞభూమి కనతిదూరంబున బంగారమున కుత్పత్తిస్థాన మగు జాంబూనదసరోవరంబు గలదు. జీమూతుండను బ్రహ్మర్షిపుంగవుం డీయెడఁ దపం బాచరించుచుండ నాతనిసమీపంబున హిమవంతునియొక్క పవిత్రం బగుబంగారు గని బయలువెడలెను. ఆమహర్షిప్రవరుండు విస్తారం బగుధనంబు బ్రాహ్మణులకు దానంబుగావించి మిగిలినదానిని దనస్వాధీనంబు గావించికొనియెను. ఈయెడ నిత్యంబును దిక్పాలకులెల్లరు నొక్కచోఁగూడి యెవ్వఁడే కార్యంబు గావింపవలయునదియు నిర్ణయించికొందురు. గాలవమహర్షీ! వింటివికదా యుత్తరదిక్కుగుణగణంబులు మహోత్తమంబు లగు నీసుగుణంబులచే నుత్తరదిక్కు దిక్కులకెల్ల నుత్తమంబై పరంగె. సర్వకర్మంబులందు నీయుత్తరాశ యుత్తమంబైనది. మహర్షీ! నీకెల్లదిక్కులును విస్తరంబుగ వర్ణించిచెప్పితిని. నీ వేదిక్కునకేఁగం దలంచితివి? నీవు వాంఛించినదిక్కులెల్ల నీకుం జూప నేను సిద్ధుండనై యున్నవాఁడను. ఈభూమినెల్ల నీకుఁ జూపెద. నావీఁపుపైని గూర్చుండుమని వచించె.

## గాలవుని పరిదేవనము

గరుత్మంతుఁ డట్లు వచింప నాలించి దిగ్దిదృక్షాకుతూహలియై గాలవుండు గరుడున కిట్లనియె. భుజగేంద్రారీ వినతానందనా! సుపర్ణా!

గరుడా! తార్క్ష్యా! యజ్ఞపురుషుని నేత్రంబులు గల యీపూర్వదిక్కునకు నన్ను దొలుతం గొనిపొమ్ము. నీవు తొలుదొలుత వర్ణించిన తొలుతటి దిక్కునకే నన్నుఁ దీసికొని వెడలుము. ఇయ్యెడ దేవతలెల్లను సన్నిధిచేసి యుందురని వచించితివికదా? యజ్ఞంబును ధర్మంబును సత్యంబు నిక్కడ నుండునని చెప్పితివికదా? సకలదేవతలతోడను సమాగమంబందుటకు నాకు వాంఛకలదు. ఆదేవతలనెల్ల దర్శింపఁగోరుచున్నవాఁడను గావున జూడవలయునని యభిలషించుచున్నాఁడను. కావున నియ్యెడకుఁ గొని పొమ్మనుటయు గరుడుండు తనపృష్ఠం బారోహింపుమని యాగాలవున కనియె. అంత గాలవుండు విశాలం బగు వినతానందనుపృష్ఠం బధిరోహించి పైకెగురుట కుపక్రమించె. అట్లు గరుత్మంతుండు పైకెగయ నెగయ భయవిహ్వలుండై గాలవుం డిట్లనియె వైనతేయా! యంతరిక్షంబు నాక్రమించునెడ నీరూపంబు మధ్యందినమార్తాండుండు సహస్రాంశువులచే దుర్నిరీక్ష్యుండైనపగిది చూడ నశక్యంబై యుండె. నీపక్షవేగోత్థితం బగుమహావాయువువలన సమున్మూలితంబులై తరువులు నీ వెనువెంట నేతెంచుచున్న బంధుజనంబు ననుకరించుచున్నవి. సాగరంబులు, వనంబులు, పర్వతంబులు, గ్రామనగరంబులుం గలయుర్వీతలంబెల్ల పక్షవాతంబున నాకర్షించుచున్నట్లు తోఁచుచున్నాఁడవు. సాగరంబు నందలిజలంబెల్ల మీనక్రాదిజలజంతువులతోడ నాకాశంబునకుఁ గొని పోఁబడుపడువున నీపక్షవేగంబున నుప్పరం బెగయుచున్నది. తుల్యరూపంబులు, తుల్యముఖంబులు,నరనాగాశ్వముఖంబులు, గలతిమితిమింగిలములు నీఱెక్కలగాలివలన నలఁగిపోవుచున్నవి. నీపత్రంబులవేగంబు వలన మహార్ణవంబున జనించిన మహారవంబున నాచెవులు చెవుడుపడినవి. నాకేదియు వినఁబడలేదు; కనఁబడలేదు. నాయొడలుసైతము నే నెఱుంగఁజాలకున్నాను. నీవింకను నధికవేగంబున బఱచితివేని నేనవశ్యంబును మృతినొందెదను. కావున నీవు బ్రహ్మహత్యను దలంచి మెల్లమెల్లగ నెగురుము. ఖగోత్తమా! నాకంటికి సూర్యుండు దిక్కులు నంతరిక్షంబు నగపడకున్నయవి. నేను గేవల మంధకారముమాత్రము చూచుచున్నవాఁడను. నీశరీరంబుసైతము నా కగపడకున్నది. ప్రజ్వలించుమహాగ్నికుండంబులంబోలు నీనయనంబులుమాత్రము నాకగపడుచున్నవి. జాతిరత్నంబులువోలె దేదీప్యమానంబు లగు నీరెండుకన్నులు

దక్క నీశరీరంబుగాని, నాశరీరంబుగాని నే గనకున్న వాఁడను. అడు గడుగునకును శరీరమునం దగ్ని యుద్భవించుచున్న యది. ఆయనలంబు నాకన్నులను దృష్టిహీనంబులుగాఁ జేసి మఱల నగపడకుండఁ జేయు చున్నది. వినతానందనా! నీవు వేగంబును దగ్గింపుము. నే నీవేగంబు ననుగమించుటవలన నించుకంతయుఁ బ్రయోజనంబు లేదు. నీవు భూమి కవతరింపుము. నీవేగంబునకు నే నోర్వఁజాలకున్నాఁడను. ఒక్కొక్క కర్ణంబు శ్యామంబై తక్కినశరీరం బెల్ల ధవళాతిధవళంబై విరాజిల్లు నెనమన్నూ ఱుత్తమాశ్వంబులు గురునకు దక్షిణగా నొసంగ నే సంక ల్పించియుంటినిగదా? అట్టియశ్వంబుల నేకరించుటకు నాకు మార్గం బేదియు నగపడకున్నది. అండజాధీశ్వరా! ఆయశ్వంబులు తెచ్చుమార్గంబు గానక యాత్మత్యాగంబుగావింప నేను నిశ్చయించితిని. నాకడ నించు కంతయు ధనంబు లేదు. ధనికుం డగున్నేహితుండేని నా కెవ్వండును లేఁడు. మహాధనంబు సంపాదించి వ్యయించినను గురుదక్షిణసంపాదింప శక్యంబుగాదు. అనిపలికి పరిపరివిధంబుల విలపించుచు దీనమానసుండై యున్న యామునిపుంగవుని ర్వేదం బాలించి వినతాత్మజుండు వెడలుచనే చిఱునవ్వుతో నాతని కిట్లనియె. బ్రహ్మర్షిపుంగవా! నీవు శూన్యుండవై యాత్మత్యాగము గావింపం దలంచుచున్నాఁడవు. కాలంబు కృత్రి మంబు గాదుగదా నీయిచ్చవచ్చినటులు ప్రవర్తించుటకు? కాలమే పరమేశ్వరుం డని యెఱుంగుము. నీవు తొలుతనే నీయాపన్నితంబు నా కెఱిఁగింపవైతివేల? నీకోర్కి యీడేర్చుటకుఁ జాలినంతమహోపాయంబు గలదు. పోనిమ్ము. ఇప్పుడు మించినది లేదు. ఇదియే సాగరసమీపం బున బుషభం బను మహాపర్వతంబున్నది. ఆపర్వతమునం దవతరించి విశ్రాంతిగొని భోజనం బాచరించినపిదప మరలిపోవుదము.

గరుడుని ఱెక్కలూడి తిరిగి మొలచుట

అని పలికి యాగరుత్మంతుం డాపర్వతంబున కవతరించి యాముని కుమారునితోఁగూడ నందందుఁ జరించుచు నొక్కయెడ దుష్కరం బగు తపంబాచరించుచున్న శాండిలియను బ్రాహ్మణబ్రహ్మచారిణిం గాంచె. ఆతపస్వినిని గాంచినంతన గాలవుండును, వైనతేయుండును బాబా నమస్కారంబు లాచరించి యాబ్రాహ్మణిచే స్వాగతంబంది విష్టరంబుల



నాసీనులై యుండిరి. బలిమంత్రోపబృంహితం బగునన్నం బాయిరువు రకును శాండిలి యొసంగ వారు భుజించి నిద్రాపరవశులై యొడలెఱుం గక పండుకొనిరి. అంత నొక్కముహూర్తమాత్రంబున మేల్కాంచి సుపర్ణుండు గమనంబునకుఁ గృతత్వరుండై బ్రహ్మచారిణి, తాపసియు నగునాశాండిలినిఁ జూచి రూపంబున సాక్షాదిందిరాదేవతంబోలె వెలుంగు నాతాపసిని గ్రహింపందలంచినంత నాతనిశరీరంబునందలి యెఱకలన్నియు విశీర్ణంబులై నేలంబడియె. పక్షంబులు తనూరుహంబులును రాలిపోవుటం జేసి ముఖపాదంబులుమాత్రము మిగిలియున్న యావైనతేయుండు కేవ లము మాంసపిండంబుంబోలె చూపట్టెను. అంతం గొంతవడికి గాలవుం డును మేల్కాంచి పక్షివిహీనుండగుగరుడు నాలోకించి యాతనితో వైన తేయా! నీవేల యిట్లు పక్షహీనుండవైతివి? ఇక్కడ కేతెంచుటవలనం గలిగినఫలమా యిది? మరల నీతనూరుహంబు లెప్పుడు జనించును? మన మెంతకాల మిక్కడ నిట్లు పడియుండవలయునో? నీవు మనంబున నేపాపకర్మంబు దలంచితివి? నీవేధర్మంబును దూషించితివి? స్వల్పం బగు నపరాధంబున నింతఘోరంబు సంభవింపనేఱదు. నీవేదే నొక్కమహా పాపంబును మదంబున దలంచియుందువని వచించె. అంత సుపర్ణుండు బ్రాహ్మణోత్తమా! నే నీధర్మచారిణి యగుశాండిలిని బ్రజాపతికడకుఁ గొనిపోవఁదలంచితిని. మహాదేవుండును విష్ణుండును ధర్ముండు యజ్ఞుండు నివసించినయెడన యీతపస్వినిగూడ నివసించియుండు టుచితంబగును గావున నీమె నక్కడకుఁ గొనిపోవ మనంబున నూహించితిని. నేనింత కంటె నేపాపంబు నాచరించియెఱుంగనని పలికి శాండిలితో భగవతీ! నీకుఁ బ్రియం బాచరింపందలంచియే నేనిట్లు మనంబున ధ్యానించితినిగాని దురూహంబున గాదు. నీవియ్యెడ నేకాకినివై యుండుటకు వగచి నే నీతలంపు తలంచితిని. నాకు నీయెడంగలుగుబహుమానంబున నిట్లు తలంచితినే కాని యవమానబుద్ధిచేఁ గాదు. నేనాచరించినది సుకృతంబై నను దుష్కృతంబైనను మహాత్మురాల వగునీవు క్షమింపందగుదువు అని పలుకుటయు నాశాండిలి యాపతగేంద్రద్విజోత్తములయెడఁ గరంబు ప్రియంబంది గరుడునితో గరుడా! నీవు సుపర్ణుండవుగదా? నీవిట్లు భయంపడ నేల? వత్సా! నీవు నాయెడ నించుక నింద గావించితివి. నేను నింద నించుకయేనియు సహింపఁజాలను. పాపాత్ముం డెవ్వఁడు నన్ను

నిందించు వాఁ డెల్ల లోకంబులనుండియు భ్రష్టుండగును. అలక్షణంబు లేవియులేక యనింద్యితవృత్తి నాలంబించి కేవలం బాచారంబు నాలంబించి యీయుత్తమం బగుసిద్ధిని వశముగావించికొంటిని. ఆచారంబు ధర్మంబు నొసంగును. ఆచారంబు ధనము నొసఁగును. ఆచారంబున సిరియు లభించును. అలక్షణంబుల నాచారంబు వధించును. కావున నాచారం బఖిలార్థసాధనంబై యొప్పుచున్నది. ఖగేంద్రా! నీ వీయెడ నుండి నీయిచ్చవచ్చినకడ కేఁగుము. నీపక్షంబులు తనూరుహంబులు నెప్పటియట్ల జనించును. ఇంక నెన్నండును నన్ను నిందింపకుము. నన్నే కాక స్త్రీల నెన్నండును గ్రహింపకుము. నీవు నాశ్రేయంబు నాలోచించి యిట్లు తలంచుటంజేసి పక్షంబులూడినను జీవితమును ధరించియున్నాఁడవు. కేవలము నీమేలు నాలోచించియే నన్ను గ్రహింపఁదలంచియుంటివేని శరీరనాశంబే పొందియుందువు. నీవు దేవదేవుం డగు పరమేశ్వరుని చింతించితివేని నాతనియనుగ్రహంబున నీవు మఱల యథాపూర్వంబుగ ఱెక్కలతోఁగూడి మహాబలవంతుండ వగుదువని వచించె. గరుడుండును శాండిలీవచనప్రకారంబున శంకరుని ధ్యానించి యమ్మహేశ్వరుకరుణం జేసి మహాబలిష్ఠంబు లగుపక్షంబులును తొల్లింటియట్ల సర్వాంగంబులుం బడసెను. పిదప శాండిలిని యథాన్యాయంబుగ నామంత్రణం బొనరించి యాయె యానతిం గాంచి వచ్చినత్రోవన పయనంబై వచ్చెను. ఆతండు శ్రమం బధికంబుగ ననుభవించెనే కాని గాలవున కాకాంక్షితంబు లగు తురంగంబుల సంపాదింపలేకపోయెను. అంత నొక్కమార్గంబున గరుడునితో నేతెంచుగాలవుం గాంచి విశ్వామిత్రుండు వత్సా! నీయంత నీవ నాకు గురుదక్షిణ యొసంగెదనని ప్రతిజ్ఞ యొనరించితివి. ఇదె యాయర్థంబిచ్చుటకుం దగుకాలము. ప్రతిశ్రుతధనంబు నేకరించితివా? ఇంత కాలంబు నీకొఱకై వేచియుంటిని. వలయు నేనింక నధికకాలంబును బ్రతీక్షింతును. నీప్రతిజ్ఞ నెఱవేరునుపాయం బాలోచింపుము. అని పలికి తనత్రోవఁ దాను బనివినియెను. అపుడు గరుత్మంతుండు గాలవు నాలోకించి మహర్షికుమారా! విశ్వామిత్రుండు నొడివినవాక్యంబు లాలించియుంటిని. కావున నిదెకమ్ము. గురుధనంబు సంపాదించువెర వన్వేషింతము. గురునకుఁ బ్రతిజ్ఞాతం బగుధనం బీయక యూరక యుండుటకు వశంబుగాదనిపలికి యాతనితో మఱియు నిట్లనియె.

❧ గాలవుండు యయాతికడ కరుగుట ☙

గాలవా! తొల్లి హిరణ్మయంబు వహ్నిచే నుత్పాదింపంబడి వాయుదేవునిచే శోధింపఁబడినభూమియం దుంపఁబడినదిగావున వహ్ని యనుశబ్దంబునందలి హి యను నక్షరంబును వాయువాచకం బగురణ శబ్దంబును గలిసి హిరణ్యం బనంబరంగె. దానివలన జగంబు పోషింపంబడును. దానివలనన, జీవింపంబడును. గావున ధనమనియు దానికిఁ బేరుగలిగె. కావున ధనంబు మూఁడులోకంబులందును శాశ్వతంబై యున్నది. పూర్వాభాద్రోత్తరాభాద్రానక్షత్రములతో శుక్రవారమునకు యోగంబుగలుగునే నాదినంబున ధనంబు శాశ్వతంబై యుండును. కుబేరునందును ధనముగలదు. శుక్రవారము మానవులకు చిత్తార్జితం బగుధనంబు నొసంగును. అజుండు నేకపాదుండు నహిర్బుధ్న్యుండును ధనదుండును నిత్యంబు ధనంబు నప్రమత్తతం గాచుచుందురు. కావున నెవ్వండును దనకుఁ బ్రాప్తంబుగాని ధనంబు స్వీకరింప శక్యంబుగాదు. ధనంబులేనిదే యశ్వంబులు లభించుటయు దుర్లభంబే. కావున రాజర్షివంశంబున జనించినరాజు నొక్కని ధనంబు యాచింపుము. రాజు పౌరులను బీడించియేని మనలఁ గృతార్థులంగావించును. చంద్రవంశంబునం జనించిన నహుషుని తనయుండు సత్యవిక్రముండు యయాతి యనురాజర్షిపుంగవుండు నాచెలికాఁ డొకఁడు గలఁడు. నాచేఁ జెప్పంబడియు నీచే యాచింపంబడియు నారాజు నీకు వలయుధనంబెల్ల నొసంగును. కుబేరునకుంబోలె నాతనికి నత్యధికం బగు విభవంబు గలదు. ఈరీతిని నీవు దానంబుచేత గురుధనంబు సంపాదింపుము. అని వారిరువురు నిట్లు బాగుగ నాలోచించికొని యొక్కకార్యంబు నిశ్చయించికొని ప్రతిష్ఠానపురంబున నున్న యయాతినరపాలునికడ కరుదెంచిరి. వారలకు యయాతి యథోచితంబుగ నర్ఘ్యపాద్యాదిపూజ లాచరించి వచ్చినకార్యం బడిగినంత వైనతేయుం డాతని కిట్లనియె. రాజా! ఈతండు గాలవుం డనుతపోనిధి, నాకుఁ బ్రాణాధికుం డగుచెలిమికాఁడు. విశ్వామిత్రునకు శిష్యుండై వేలకొలఁదివత్సరంబు లామునీంద్రుని శుశ్రూషగావించె. ఈతండు విద్యాంతమునం దాతనియనుజ్ఞనంది వెడలునపు డాతనికుపకారం బాచరింపం దలంపుగొని భగవానుఁడా! నీకు

యుండె. ఎన్నిసంతానంబులుగన్నను గన్న యనంతరంబు మరల కన్యా త్వంబు నాకావరప్రభావంబునంజేసి సిద్ధించును. నీవీరాజువలన శత ద్వయంబు హయంబులం బరిగ్రహించి నన్నీ రాజన్యున కొసంగుము. ఇట్లే నల్వురురాజన్యులకడ నెనమన్నూఱుహయంబులం గ్రహింపఁ దగును. నాకును నలుగురుతనయులు జనింతురు. ఈరీతిని నీవు నీగురు ధనంబు సంపాదించి ఋణవిముక్తుండవగుదువు. నాప్రజ్ఞ నాలోచించి నీకుఁ దోఁచినయట్లాచరింపుమని పలికె.

ఇట్లుపలికిన మాధవివాక్యంబు లాలోచించి గాలవుండు పృథివీ పాలకుం డగు హర్యశ్వునితో రాజా! ఈకన్యకు నిశ్చితం బగుశుల్కం బెనిమిదినూర్ల హయంబులు. నీవిత్తునన్నవి రెండువందలుమాత్రమే. నీ కడనున్న రెండునూర్లగుఱ్ఱంబుల నొసంగి యీయింతిని గ్రహించి యొక్కతనయునిఁ గన్నపిదప మరల నా కీకన్య నిచ్చివేయుము. అట్లు గావించుట నీకిష్టంబేని నిదె యీకన్యను గ్రహింపుమని వచించె. హర్య శ్వుండు గాలవునివచనంబుల కంగీకరించి యాతని నభినందించి యాతఁ డడిగినహయంబుల నాతని కర్పించి యాకన్యను గ్రహించి దేశకాల సమయంబు లనుకూలంబులై యున్నెడ నాకన్యయం దొక్కతనయునిం గాంచెను. ఆసుతుండు వసువులకంటెను నధికవసువుగలవాఁడగుటంజేసి వానికి వసుపసుమనుం డనుపేరిడియె. ఆవసుమనుండు ధనంబున మిగులఁ బ్రఖ్యాతినొంది యెల్లరకును గాంక్షితం బగువస్తువు నొసంగుచు విశేష కీర్తిగడించి మించెను. అంతం గొంతకాలంబునకు గాలవుఁ డేతెంచి ప్రీతమానసుం డగు హర్యశ్వునివలన నర్చాసత్కారంబులంది యతనితో రాజా! నీ కీమాధవియందుఁ దనయుండు జనించినవాఁడు. ఆబాలుఁడు భాస్కరుండువోలెఁ దేజోరాశియై వెలుంగుచున్నవాఁడుగదా? నేను నింక నితరనరపతులకడ కేఁగి గురుధనంబు భిక్షింప నవసరంబై యున్నాఁ డను. కావున నాకు మాధవిని మరల నిమ్మని యడుగుటయు గాలవున కభిమతంబు లగుహయంబులు తనకు దుర్లభంబులగుటను దన సత్య వాక్యపరతంత్రతవలనను మాధవియం దత్యంతానురక్తుండయ్యు దానిని గాలవునకుఁ దిరిగి యిచ్చివేసెను. మాధవియు మహాదీప్తిమంతం బగు నారాజ్యసంపద నెల్ల విడిచి మరలఁ గన్యయై గాలవు ననుసరించి బయలు దేఱెను. గాలవుండు హర్యశ్వప్రదత్తంబు లగుహయంబుల నాతనికడన

దాఁచ నుంచి తాను మాధవింగొని దివోదాసునికడ కరుగఁదలంచి మాధవి కిట్లనియె.

గాలవుండు మాధవిని దివోదాసున కొసంగుట

మాధవీ! మహావీర్యుండు కాశీదేశాధీశ్వరుండు భీమసేనతనయుండు నగుదివోదాసుండు మహైశ్వరసంపన్నుండును మహావదాన్యుండునై యున్నవాఁడు. ఆతనికడ కరుగుదము. నీవు మెల్లమెల్లన నడచిరమ్ము. నేను లోకవిరుద్ధం బగు కార్యంబున నిన్ను బ్రవర్తింపఁజేయుటకు క్షమింపుము. దుఃఖింపకుము. ఆజననాథుండు మహాధార్మికుండు, సంయమవంతుండు, సత్యనిరతుండునై ఖ్యాతిగన్నవాఁడు. కావున నాతండు నిన్నుఁ బరిగ్రహింపను నాయర్థంబు నెఱవేర్పను సర్హుండని పలికి దాని నొడంబఱిచి దానితోఁగూడి దివోదాసునికడ కేఁగె. దివోదాసుండును మాధవితోఁ గూడ వచ్చియున్న గాలవునకు యథోచితసత్కారంబు లాచరించి గాలవునిచే సంతానమునకై ప్రేరింపఁబడినవాఁడై యాతని కిట్లనియె. గాలవా! నేను మున్న నీవృత్తాంతంబెల్ల వినియుంటిని. నాకు విస్తరంబుగ వచింపంబనిలేదు. నేను నీవృత్తాంతం బాలించినప్పుడ యీయర్థంబు నాకాంక్షించియుంటిని. నీవు లోకంబున నున్న నరనాథులనెల్ల వీడి నాకడ కరుదెంచుటచే నాకు మిగులఁ బహుమానంబుచేకూరె. నీవు నాకడ కరుదెంచిన కార్యంబు తప్పక నెఱవేఱును. దీని కించుకయు సంశయింపకుము. నాకుంగూడ హార్యశ్వునకున్నంతవిభవంబె కలదు. నాపాలంగూడ నిన్నూఱుహయంబులుమాత్రము కలవు. నేను నీమాధవియం దొక్కతనయు నుత్పాదించెదను. నా కీకన్య నిష్టనుటయు నామునీంద్రుండు మాధవి నారాజున్యన కొసంగెను. దివోదాసుండు నాకన్యను విధిపూర్వంబుగఁ బరిగ్రహించెను. విధివిధానంబునం బరిగ్రహించినయనంతరంబు ప్రభావతియందు సూర్యుండు, స్వాహాయందు విభావసుండు, పులోమనందన యగుశచియందుఁ బురందరుండు, రోహిణియందు సుధాంశుండు, ధూమోర్ణయందు యముండు, గౌరియందు వరుణుండు, బుద్ధియందుఁ గుబేరుండు, లక్ష్మియందు నారాయణుండు, మందాకినియందు సముద్రుండు, పార్వతీదేవియందు మహేశ్వరుండు, వేదియందుఁ బితామహుండు, అదృశ్యంతియందు వసిష్ఠాత్మజుం

డగుశక్తియు, అక్షమాల యనునామంబునం బ్రసిద్ధయగు నరుంధతి యందు వసిష్ఠుండు, సుకన్యయందు చ్యవనుండు, సంధ్యయందుఁ బుల స్త్యుండు, పులోమయందు భృగుండు, నదితియందుఁ గశ్యపుండు, రేణు కయందు ఋచీకుండు, హైమవతియందు విశ్వామిత్రుండు, తారయందు బృహస్పతియు, శతపర్వయందు శుక్రుండును, భూమియందు భూమి పతియు, నూర్వశియందుఁ బురూరవుండును, సత్యవతియందు ఋచీకుం డును, సరస్వతియందు మనువును, శకుంతలయందు దుష్యంతుండును, ధృతియందు ధర్ముండును, దమయంతియందు నలుండును, సత్యవతి యందు నారదుండును, జరత్కారువునందు జరత్కారుండును, ప్రతీచ్య యందుఁ బులస్త్యుండును, మేనకయం దూర్ణాయుండును, రంభయందుఁ దుంబురుండును, శతశీర్షయందు వాసుకియు, కుమారియందు ధనం జయుండును, వైదేహియందు రాముండును, రుక్మిణియందు జనార్ద నుండును నెట్లు ప్రీతియుక్తులై క్రీడించి రట్ల మాధవియందు మహానం దంబునం గ్రీడించు నాదివోదాసునకు నావనితయందుఁ బ్రతర్దనుండను నామంబున వంశనిస్తారకుం డగు నొక్కసుతుం డుదయించె. ఆప్రతర్ద నుండు శుక్లపక్షసుధాకరుండుంబోలె దినదినప్రవర్ధమానుం డగుచుండ నొక్కనాఁడు భగవంతుం డగుగాలవుండు దివోదాసునికడ కేతెంచి సత్కృతుండై రాజా! మున్ను వచించినరీతిని మాధవిని నాకింక నొసం గుము. దానికి శుల్కంబుగా నీ వీయందగినతురంగములు నీకడన యుంచుము. అవసరమైనపుడు వచ్చి కొనిపోవుదును. ఇపుడు మిగిలిన హయంబులసంపాదింప నితరుఁ డొక్కరాజన్యుకడ కేఁగెదనని వచించు టయు సత్యాత్మకుం డగు నాదివోదాసుం డాకన్య నాతనికి సమర్పిం చెను.

## గాలవుం డుశీనరునికడ కేఁగుట

అనంతరము సత్యసంగరపరాయణురా లగు మాధవి యారాజ శ్రీనెల్ల విసర్జించి యెప్పటియట్ల కన్యాత్వమొంది బ్రహ్మర్షిప్రవరుం డగు నాగాలవు ననుసరించెను. గాలవుండును మాధవితో నాలోచించి తన కార్యంబు నెఱవేఱు వెరవు పూహించి యాకన్యతోఁగూడ భోజనగరంబున నుశీనరనరపాలునికడ కరిగెను. ఆనరపాలుని సమీపించి గాలవుం డాత

నిచే నర్ఘ్యసత్కారంబులంబడసి యాతని కిట్లులనియె. రాజా! ఈకన్య నీకు వంశకర్త లగు నిరుపురుతనయులం బడయును. ఈకన్యవలన నీ లోకంబునను బరలోకంబునను గూడ నీకు సుఖంబు లభింపంగలదు. సూర్యచంద్రులకు సాటి యగుకుమారుల నిరువుర నీకన్యక గాంచును. దీనికి నొక్కొక్కకర్ణంబును శ్యామవర్ణంబులును మిగిలినశరీరం బెల్ల చంద్రధవళంబును నగునాల్గునూర్లహయంబులు శుల్కంబై యున్నవి. ఈయశ్వంబులు గురువునకు దక్షిణగా సమర్పింతును. దానికై యిట్లు ప్రయత్నించుచున్నాఁడనే కాని యిందు నాస్వార్థ మించుకంతయు లేదు. నీ వీశుల్కం బీయ సమర్థుండవైతి వేని, నిస్సంశయంబుగ దీనిని గ్రహింపుము. రాజర్షి! నీవు సంతానము లేకయున్నావు. కావున బుత్రులం బడయుము. పుత్రులను నావచేఁ బితరులను నిన్నుఁగూడ పుంనామనరకంబు వలనఁ దరింపఁ జేసికొనుము. పుత్రఫలభోక్త యగువాఁడు స్వర్గంబువలన భ్రష్టుండు కాకుండును. పుత్రులు లేనివార లరుగునరకంబుల కాతఁ డరుగఁడు. కావున నీ వీకన్య నవశ్యము బరిగ్రహించి పుత్రులం బడయుమని వచించె. ఆగాలవునివచనంబు లాలించి యుశీనరుండు గాలవున కిట్లనియె. మహామునిపుంగవా! నీచెప్పినవచనంబు లెల్ల నాకర్ణించితిని. విధి బలవత్తరంబుగదా! నామనం బీకన్యకయందుఁ బ్రవణంబై యున్నది. నీచెప్పినలక్షణంబులు గలతురంగంబులు రెండువందలుమాత్రము నా కడగలవు. ఇతరంబు లగుహయంబులన్నో యనేకసహస్రంబులు గలవు. కావున నాయిన్నూఱుగుఱ్ఱంబుల నొసంగి యీకన్యయం దొక్కసంతానముమాత్రము పడయంగలవాఁడను. దీనియందపత్యంబువడసి పుత్రవంతు లేగుసద్గతి కేగెదను మిగిలినయిన్నూఱుహయంబులకును మూల్య మిచ్చితి నేని నీయర్థంబు పూరింతు మన్నను నాకడ నున్నధనం బెల్లఁ బౌరులది కాని నాది కాదు. రాజు సేకరించినధనం బెల్లఁ బౌరజానపదులయుపకారంబులకు వినియోగింపవలయునే కాని యాత్మభోగంబున కుపయోగింపంజనదు. పరకీయం బగుధనంబు దనకామంబునకై యేనరపాలుండు వినియోగించు నాతండు ధర్మంబు గోల్పడి యధర్మిష్ఠుండగును. వాని కీర్తి నశించును. నే నిన్నూఱుహయంబులుమాత్ర మొసంగి యేకాపత్యంబునకై యీకన్యక గ్రహించెద. నాకు దీని నిమ్ము. దేవభోగార్హ యగు నీకుమారియం దేకపుత్రు నుత్పాదించెద ననుటయు గాలవుండు దానికి

సంతసించి యాతనికి మాధవి నొసంగి తాను వనంబునకుఁ దపంబుసేయ నరిగె. ఉశీనరుండును మాధవినిఁ బరిగ్రహించి దానితో గిరికందరంబు లందును నదీనిర్ఝరంబులందు రమణీయంబు లగు హర్మ్యంబులందున బ్రాసాదశిఖరములందును వాతాయనవిమానంబులందును గర్భగృహంబు లందును గృతపుణ్యుండు సిరినొంది సుఖించుచందంబున వివిధోపభోగఁ బులం గ్రీడించెను. అట్లు క్రీడించు నానరనాథునివలన మాధవి పార్థి వులందెల్ల సుత్తముఁడనంబరగు శిబిం గాంచెను. పిదప గాలవుండు వనంబువలన నేతెంచి మాధవినిం దోడ్కొని యొందేని చనువాఁడు ముందఱ వైనతేయుం బొడగాంచెను.

### గాలవుఁడు మాధవిని విశ్వామిత్రున కొసంగుట

వైనతేయుండు మాధవితోఁగూడ నరుగుచున్న గాలవున కుచిత కుశలప్రశ్నంబు లాచరించి మిత్రమా! నీయాప్సితంబు నెఱవేరినదని తలంచెదనని వచించె. దానికి గాలవుండు వైనతేయా! ఇంతకు నాఱు నూఱులహయంబులుమాత్రము లభించినవి. ఇంకను వలయు నర్ధంబున నాలవపాలు సంపాదింపవలసియున్నదని వచించె. అదివిని సుపర్ణుండు దీనుం డగుగాలవుని కిట్లనియె. గాలవా! నీవింక మిగిలినతురంగంబుల కొఱకుఁ బ్రయత్నింపకుము. అవి నీకు లభింపవు. తొల్లి గన్యాకుబ్జాధి పతియగు గాధినరపాలునిపుత్త్రి సత్యవతిని బుచీకుండనుముని భార్యగా వరించెను. గాధియు బుచీకునితో నేకతశ్శ్యామకర్ణంబులును జంద్ర వర్చస్కంబులు నగువేయిగుఱ్ఱంబు లాకన్యకు శుల్కంబుగా నిమ్మని యడిగెను. బుచీకుండు దానికి వల్లెయని యంగీకరించి వరుణాలయంబు నకుం జని వరుణునియనుగ్రహంబున నశ్వతీర్థంబందు వేయితురంగము లను బ్రాపించి గాధినరపతి కొసంగి సత్యవతిని బరిణయంబయ్యె. గాధియు బుండరీకం బనుయాగంబుగావించి యాహయంబులెల్ల బ్రాహ్మణులకు దక్షిణగా నొసంగె. ఆబ్రాహ్మణులవలన హర్యశ్వుండును దివోదాసుండు నుశీనరుండు రెండేసినూఱులగుఱ్ఱంబులను వెలయిచ్చికొనిరి. మిగి లిన నన్నూఱుతురంగంబులు సంతారంబునఁగొని పోవంబడుచు నక్కడ నిక్కడ హరింపంబడినవి. కావున నీయాఱువందలగుఱ్ఱంబులకంటె నెక్కుడుగ నెక్కడను లభింపంజాలవు. ఈకన్యకనే యశ్వంబులకు

హాలుగ విశ్వామిత్రున కర్పింపుము. దానివలన నీఋణభారంబు నివృత్తం బగును. కృతకృత్యుండవై తపం బొనరింపుమనవుడు గాలవుండు వల్లె యని యాతురంగములనెల్ల వెంటనిడుకొని కన్యతోఁగూడ విశ్వామిత్రుని కడ కరిగెను. అట్లు గాలవుండు కౌశికునిసమీక్షించి సాష్టాంగదండప్రణామంబు లాచరించి కరయుగంబు జోడించి శిరంబున ఘటించి యిట్లని విన్నవించె. గురుపుంగవా! యీయిలాతలంబెల్ల నన్వేషింప నన్వేషింప నీయాఱునూఱులగుఱ్ఱంబులుమాత్రము లభించినవి. ఇంక నొక్కతురంగంబైన నెందును లభింపదు. వీనిని బరిగ్రహించి మిగిలినహయంబులకు మాఱుగ నీకన్యం బరిగ్రహింపుము. ముగ్వురురాజర్షులు హయంబులు శుల్కంబుగా నొసంగి యీకన్యయందు ముగ్వురుతనయులం గాంచిరి. నాల్గవతనయుని నీవును దీనియందుఁ గనుము. అట్లొనరించిన నేనము న్నాఱు గుఱ్ఱంబు లొసంగినవాఁడ నగుదును. నీఋణం బీగి యథాసుఖంబుగఁ దపం బొనరింప నేనేగంగలవాఁడ ననివచించె.

విశ్వామిత్రుండు గాలవునివచనంబు లాలించి గాలవునకును గరుత్మంతునకును సత్క్రియలాచరించి వరారోహ యగు నాకన్య నాలోకించి యిట్లనియె. గాలవ! మొదట నాకే యీకన్య నేల యీయవైతివి? కులభావను లగునలువురుతనయులు నాకే జనించియుందురే? పోనిమ్ము. గతజలసేతుబంధమున ఫలమేమి? ఇప్పుడ యీకన్యం బరిగ్రహింతును. తురంగంబులెల్ల నాయాశ్రమంబునఁ జరించుఁగాక యనిపలికి కన్యను హయంబులను గ్రహించెను. మహాద్యుతిమంతుం డగు విశ్వామిత్రుం డాకన్యయం దతిముదంబున రమించుచు నొక్కతనయుని అష్టకుం డను వానిం బడసెను. తనయుండు జనించినంతన కౌశికుండు వానికి నెల్ల ధర్మంబులు నర్థంబులునుగూర్చి చంద్రపురసదృశంబగు తనపురంబున కనిచెను. కన్య నాగాలవునకు మరల నొసంగి తాను దపం బొనరింప వనంబున కరిగెను. గాలవుండును మిగులఁ బ్రీతుండై సుపర్ణునితోఁగూడ నాకన్య కిట్లనియె. మాధవీ! దానపతి యొక్కండును శూరుండు మఱియొకండును సత్యధర్మరతుండు వేఱొక్కరుండును యజ్ఞకర్త మఱియొక్కరుండును నలువురుతనయులు నీ కుద్భవించిరి. నీజనకుండు నీతనయులచేఁ దారితుండయ్యె. నిన్ను గ్రహించిన నలువురుపార్థివులు నాత్మజలాభంబునం దరించిరి. గురుదక్షిణయొసంగి నేను దరింపంగంటిననిఁ

పల్కి దానిని యయాతికి మరల నొసంగి తాను దపం బొనరింప వనంబున కరిగె.

## యయాతి స్వర్గపరిచ్యుతుం డగుట

గాలవుం డరిగినయనంతరంబు యయాతి మాధవికి మరల స్వయంవరంబు గావింపందలంచి యావార్త నరపతులకెల్లరకుఁ దెలియం బంచి గంగాయమునల మధ్యప్రదేశంబున స్వయంవరమంటపంబు నిర్మించి యందు సకలవైభవంబులుమీఱ వరులకై నిరీక్షించుచుండె. పూరుండును యదుండును మాల్యదామంబు చేఁబూనియున్న తమ సోదరిని రథంబున నునిచికొని యాశ్రమంబున కేతెంచిరి. మాధవిని వరించుతలంపున నాగులు, యక్షులు, మనుష్యులు, గంధర్వులు, మృగంబులు, విహంగంబులు మొదలగుప్రాణివర్గంబు లనేకంబు లటకుఁ జనుదెంచియుండె. నానాదేశాగతు లగుమహీపతులును మహాత్ములగు బ్రహ్మర్షులును నాయాశ్రమం బెల్లయెడల నిలిచియుండిరి. అపుడు స్వయంవరాగతు లగువరులనెల్ల నిర్దేశించి తెలుప నాలించి యామాధవి వారలనెల్ల నిరాకరించి తాను వనంబున కరిగి తపం బొనరింప నిశ్చయించికొనియె. అంత నామెరథం బవతరించి బంధువులకెల్ల బ్రణామంబు లాచరించి వారలచే ననుజ్ఞాతయై పుణ్యం బగు నొక్కవనంబున కరిగి యట దపం బొనరింపందొడంగె. ఉపవాసంబులును వివిధంబు లగుదీక్షలును ననేకంబు లగునియమంబులును గావించి దేహంబునకు లాఘవం బాపాదించి మృగరూపంబునొంది వైదూర్యాంకురసన్నిభంబులు మృదువులు నగు గరికపరకలను, తిక్తంబులు మధురంబులు నగు దూర్వాంకురంబులును మెసవుచు సురసంబును పవిత్రంబులు నగుమహానదులశీతంబులు విమలంబుల నగుజలంబులు గ్రోలుచు వ్యాఘ్రములులేనియరణ్యంబులందును దావాగ్నిశూన్యంబు లగువనంబులందును, శూన్యంబు లగుగహనంబులందును మృగంబులకదంబంబులతోఁగూడి, బ్రహ్మచర్యాభిసంవృతం బగు మహాతపంబు గావించె.

అంత నక్కడ యయాతినరపాలుండు బహుకాలంబు పిత్రుపైతామహం బగురాజ్యంబు పూర్వరాజన్యులంబోలి ధర్మంబుదప్పక పాలించి కాలక్రమంబున గాలధర్మంబునొందె. ఆతనితనయులు పూరుం

డును, యదువును వంశకర్తలై రెండు రాజవంశంబుల నిలాతలంబునఁ బ్రతిష్ఠించిరి. ఆపూరుయదువులు వంశంబులఁ బ్రతిష్ఠించుటం జేసి నహుషాత్మజుం డగుయయాతి స్వర్గంబునొంది మహర్షిసదృశుండై స్వర్గమందగ్ర్యఫలం బనుభవించుచు బహుకాలం బానంద మనుభవించె. అంత నొకానొకసమయంబున రాజర్షులెల్లరును మహామునులును నాసీనులై యున్నసభయందు యయాతి మూఢచిత్తుండై గర్వించి నరులను దేవతలను ఋషులను దూలనాడెను. అంతట శతక్రతుండును యయాతిని మిగులఁ గోపించెను. రాజర్షులెల్లరును నహుషాత్మజుని నానావిధంబుల నసహ్యించికొనిరి. ఆనహుషనందను నాలోకించి స్వర్గవాసులెల్లరును దమలోఁదాము వీఁడెవ్వఁడు? ఎవ్వనితనయుఁడు? స్వర్గంబున కెట్లు వచ్చినవాఁడు? ఏకర్మంబున సిద్ధుండయ్యెను? ఎక్కడను దపంబుగావించినవాఁడు? వీనివృత్తాంతం బీస్వర్గంబున నెట్లు తెలియఁగలదు? ఎవ్వనివలన వీనిపూర్వవృత్తం బెఱుంగంబడును? అని విచారింపందొడంగిరి. స్వర్గమందున్నయయాతినిగూర్చి యిట్లు శంకించి స్వర్గద్వారంబుల నభిరక్షించెడి విమానపాలుర నీతనివృత్తాంతం బడిగిన వారును దమ కీతని చరిత్ర మేమియుఁ దెలియదని ప్రతివచనం బొసంగిరి. వారలెంత విమర్శించినను నీతనివాస్తవం బింతయు నెఱుంగరాకుండె. దేవర్షుల కవమానంబు గావించుటం జేసి యయాతి క్షణమాత్రంబునం దనతేజంబెల్ల వినాశం బగుడు హతతేజుండు నిశ్శ్రీకుండునయ్యె.

### యయాతి తనదౌహిత్రుల నాలోకించుట

అనంతరం బాతండు స్థానంబువలన బరిచ్యుతుండును నాసనంబునుండి ప్రచలితుండును నయ్యెను. ఆతనిమనంబు కంప మందసాగెను. ఆతని నెల్లెడల శోకవహ్ని యావరించెను. విజ్ఞానంబెల్ల భ్రంశంబొందె. పుష్పదామంబులు మ్లానంబులయ్యె. ముకుటంబు నంగదంబులును బరిభ్రష్టంబులయ్యె. సర్వాంగంబులును విఘూర్ణమానంబులై స్రస్తంబులయ్యె. ఆభరణంబులు నంబరంబును జాఱిపడియె. దేవలోకనివాసుల నాలోకించుచు మరల నంతలోనే కన్నులు చీకటులుగ్రమ్ముటచే వారిని గానకయు దేవలోకనివాసులకుఁ గానరాకుండ శూన్యం బగు మనంబుతోడ మహీతలంబునకుం బడజొచ్చె. భూమికిఁ బడబోవుచు నాతఁడు

తనమనంబున "నే నేధర్మదూషణంబుగావించితినో; ఏపాపకార్యంబు మనంబున జింతించితినో; నేను మహీతలంబునకుఁ బడుటకు గతం బేమొకో? యని మనంబున జింతించుచుండె. దేవలోకంబున వసించు రాజర్షులు, గంధర్వులు, సిద్ధులు, నప్సరసలు మొదలగువారెల్లరును క్షీణపుణ్యుండై నిరాలంబముగ భూమిపైఁ బడుచున్న యయాతి నాలోకించుచుండిరి. అపుడు పుణ్యముక్షీణించినవారలను భూమిపైఁ బడద్రోయు నొక్కపురుషుం డేతెంచి దేవతాసార్వభౌముని యానతిని యయాతితో రాజా! నీవు మిగుల మదమత్తుండవైతివి; నీమానంబుచేతన నీకు స్వర్గభ్రంశము సంభవించినది. నీవు స్వర్గంబునవసింప నర్హుండవుగావు. నీ ప్రజ్ఞానంబెల్ల నశించె. కావున నీవు భువింబడుమనిపలికి యంతర్ధానం బయ్యె. భూమిపైఁబడుచు నహుషనందనుండు సత్పురుషులమధ్యంబున నాకుఁ బతనంబుగలుగుఁగాక యని ముమ్మాఱువచించి సత్పురుషమధ్యపతనమే తనకు గతిగా ధ్యానించుచుండె. అట్లు ధ్యానించుచు నైమిశారణ్యంబున నలువురు రాజర్షులు సత్కథావినోదంబులం దవిలియుండ వారి నాలోకించి వారిమధ్యప్రదేశంబునంబడియె. ప్రతర్దనుఁడు, వసుమనస్కుండు, శిబియు, నష్టకుండు నను నానల్వురురాజన్యులు నాసమయంబున వాజపేయంబున సురేంద్రునకుఁ దృప్తిగల్పించుచుండిరి. వారు గావించుయాగంబువలన నుత్థితంబైనదియు స్వర్గంబున కనివార్యమార్గం బగునదియు నగుధూమంబు గంధం బాఘ్రాణించుచు మహీతలంబునం బడుచుండెను. భూమ్యాకాశంబుల కేకధారగాఁ బ్రవహించుధూమ మయమహానదివోలెను భూతలంబున కవతరించుగంగవోలెను విలసిల్లు నాధూమంబు నాలంబించి లోకపాలోపము లగు నా పార్థివోత్తములు నల్వురును హోమంబు లాచరించినయగ్నులవలె వెలుంగుచుండ వారిమధ్యభాగంబునంబడియె. సిరిచే దేదీప్యమానుండై నేలంబడుచున్న యాతనిం గాంచి యారాజప్రవరు లాతనితో నీవెవ్వండవు? ఎవ్వనిబాంధవుండవు? ఏదేశంబున కేనగరంబున కధినాథుండవు? యక్షుండవా? దేవుండవా? రాక్షసుండవా? గంధర్వుండవా? ఎవ్వండవు నీవు? నీరూపం బాలోకింప మానుషుండవలె నగపడుచున్నవాఁడవు. మావలన నీకేమి ప్రయోజనంబు గలదు? మాకడఁబడుట కేమి హేతువని యడిగిరి. ఆవచనంబు లాలించి నహుషనందనుండు

పార్థివులారా! నేను యయాతి యనుపేరుగలరాజర్షిని. నాపుణ్యఫలంబు క్షీణంబగుడు భూమిపైఁ బడుచున్నవాఁడను. సత్పురుషుల నడుమబడి యెద నని ధ్యానించుచు మీపన్నిధిం బడితినని వచించె. ఆమాట లాలించి వారు రాజర్షిపుంగవా! నీకాంక్షితంబు సత్యం బగుఁగాక. మే మెల్లరము నార్జించిన క్రతుఫలంబును ధర్మంబును బ్రతిగ్రహించి మఱల నీవు స్వర్గంబున కరుగుమని పలికిరి. దానివిని యయాతి నేను ధనంబు ప్రతిగ్రహింప నర్హుం డగుబ్రాహ్మణుండనుగాను. క్షత్రియుండను. పర పుణ్యంబుల వ్యయపఱుచుటకు నామనం బంగీకరింపకున్న యది యని వచించె. ఆసమయంబున మాధవి మృగరూపధారిణియై యక్కడ కేతెంచుటయు నానలువురురాజన్యులు నామె కభివాదనంబు లాచరించి జననీ! నీవిక్కడ కేమికతంబున నేతెంచితివి? నీకేమికావలయునో యాన తిమ్ము కాదనక. నీశాసనంబు గావింతుము. దపోధనురాల వగు నీతన యుల మగు మాకు నీవానతీయ నర్హురాలవుకదా యని పలికిరి. వార లట్లు పలుక మాధవి కరమ్మానందించుచు యయాతిని సమీపించి యాతనికి నమస్కారంబుగావించి తనతనయులకు మూర్ధాఘ్రాణం బాచ రించి లాలించి యయాతి కిట్లనియె. రాజేంద్రా! వీరు నలువురును నీ దౌహిత్రులు. నాపుత్రులు. నీకుం బెఱవారుగారు. వీరలు నిన్ను దరింపఁ జేయుదురు. నిన్ను దరింపఁజేయుట వీరలకుఁ బురాతనసుకృతంబునం జేకూరె. నేను నీతనయ నగు మాధవిని. మృగరూపంబున దపశ్చర్య గావించుచున్నదానను. నేనును విశేషంబుగ ధర్మోపచయంబుగావించి యుంటిని. దానియందు నర్ధభాగంబు బరిగ్రహింపుము. రాజా! సకల జనులు నపత్యఫలంబు ననుభవించినట్లే దౌహిత్రఫలంబులునైత మనుభ వింతురు. కావుననే జనులెల్లరు దౌహిత్రులఁ గాంక్షింతురు. అనంతర మారాజులు నల్వురును దమజననికి నమస్కారం బాచరించి మాతా మహుం డగుయయాతి కిట్లని వచించిరి. రాజా! మేము నీదౌహిత్రులము. రాజధర్మాభిరతులము. సత్యధర్మపరాయణులము. కావున మాసుకృతంబున నీవు దివంబారోహింపుము. అని యిట్లు వారు వచించినసర్వంబున మేదిని యాపూరింపంబడియెం. ఆసమయంబున నక్కడకు గాలవుం డరుదెంచి రాజా! నీవు నాకు విశేషోపకారంబుగావించినవాఁడవు. నీకవసరమై నపుడు ప్రత్యుపకృతిగావింపక యొప్పరికించితినేని కృతఘ్నుడనగుదును

నేను గొంతతపం బార్జించియున్నవాఁడను. నాతపంబునం దెల్మిదవ పాలు గైకొని తత్సుకృతంబున నీవు దివంబున కరుగుమని వచించె.

సత్యప్రవర్తను లగు నా రాజపుంగవులచేఁ బ్రత్యభిజ్ఞానంబు గావింపఁబడినంతన యయాతి భూమిని స్పృశింపకయే దివంబున కరిగె. అప్పు డాతని సంస్థానంబు దివ్యంబై యొప్పె. జ్వరంబు నమసె. దివ్యమాల్యాంబరధరుండు, దివ్యాభరణభూషితుండు, దివ్యగంధగుణసంపన్నుండు నై పృథివి నంటకయే యంతరిక్షమందు నిలిచె. దానపతి యని లోకంబునం బ్రసిద్ధిగన్న వసుమనస్కుండు తొలుత బిగ్గరగాను, గంభీరముగాను నిట్లనియె. సర్వవర్ణంబులను గర్హింపనిచే నేసుకృతంబు సమార్జించితినో యాసుకృతంబుకూడ నీకొసంగెదను. దానంజేసి నీవు స్వర్గంబున కరుగుము. దానశీలున కేఫలంబులభించునో, క్షమాశీలున కేమిఫలముగలుగునో, యగ్న్యాధానంబున నేమిసుకృతంబు చేకూఱునో యట్టి నాసమార్జించిన యెల్లఫలంబు నీకొసంగెద. దానివలన నీవు దివంబున కరుగుమని వచించె. అనంతరంబు ప్రతర్దనకుండు ధర్మాభిరతుండును, నిత్యంబు యుద్ధశ్రద్ధాళువును నై క్షత్రవంశోచిత మగుయశంబును గీర్తిని సంపాదించియుంటిని. నేను గొంత వీరకృత్యంబు నెఱపియున్నవాఁడను. నా సంపాదించినఫలంబెల్ల నీవు గైకొనుమని వచించె. ధర్మాభిరతుం డగు వానిసత్యంబున నీవు దివంబున కరుగుమనియుఁ బ్రతర్దనుఁడు వచించిన పిదప నుశీనరాత్మజుం డగు శిబి బాలురయందు స్త్రీలయందు వివాహకర్మంబులందు, సంగరంబులందు, నిపాతంబులందును, వ్యసనంబులందును నే నెన్నడు నసత్యంబు పలికి యెఱుంగను. ఆసత్యంబున నీవు స్వర్గంబున కరుగుము. ప్రాణంబులు, రాజ్యంబు, కామసుఖంబులు మొదలగుభోగంబులనేని త్యజింతునుగాని యెన్నండును సత్యంబు విడువఁజాలను. నా సత్యంబున నీవు దివంబున కరుగుము. నాసత్యవ్రతంబునకు ధర్ముండు, నగ్నియు, శతక్రతుండును సంతసించియుండిరి. ఆసత్యంబు నీకొసంగెద. దానిచే నీవు నాకంబున కేగుమని వచించె. అంతఁ గౌశికునివలన మాధవికి జనించిననాల్గవతనయుండు అష్టకుం డనువాఁడు బహుశతయజ్ఞకర్త యగు యయాతితో ప్రభూ! పుండరీకంబులు నూర్లకొలందియు నూర్లకొలఁదిగ గోసవనంబులును, ననేకవాజివేయంబులను నే నాచరించితిని. వానిఫలంబెల్ల నీవు పరిగ్రహింపుము. మఱియు రత్నంబులుగాని, ధనం

బులుగాని, యితరంబు లగుపరిచ్ఛదంబులుగాని క్రతువులం దుపయోగిం
పక మిగుల్చలేదు. ఆసత్యంబున నీవు స్వర్గంబున కరుగుమని వచించె.
యయాతినరపాలుండు నొక్కొక్క దౌహిత్రుండు వచించినంతన
క్రమక్రమంబుగ భూమినివీడి దివంబున కరిగె. యయాతితనయ యగు
మాధవిగర్భంబున నుద్భవించిన యాపార్థివోత్తము లట్లు తమతమ నేక
రించినఫలంబులెల్ల నొసంగి యయాతిని దరింపఁజేసిరి. నాలుగు వేర్వే
రాజవంశములందు జనించినవా రగు నా నలుగురురాజర్షులును స్వర్గ
భ్రష్టుం డగు తమమాతామహుని దిరిగి స్వర్గప్రతిష్ఠితుం గావించిరి.
యయాతినరపాలుండును దౌహిత్రుల నభ్యనుజ్ఞనొంది దివంబున
కరిగె. ఆతండు దివంబున కరిగినంతన నానావిధంబు లగు కుసుమంబులు
నాతనిపై వర్షింపంబడియె. పుణ్యగంధం బగువాయు వాతని సేవించె.
దౌహిత్రఫలనిర్జితంబు, చలనరహితంబు నగు స్థానంబునొంది యయాతి
పరమం బగు శ్రీచేఁ బ్రజ్వలించెను. గంధర్వాప్సరోగణంబులు నృత్తగీత
వాదిత్రంబులచే నాతని నెదుర్కొనిరి. ఆతనికి వేల్పులు దుందుభి
ధ్వానంబులతోఁ బ్రత్యుత్థానంబుగావించిరి. దేవతలు, రాజర్షులు, చార
ణులు నాతని నధికంబుగ స్తుతి యొనరించిరి. దేవత లాతని కుత్తమంబు
లగునర్ఘ్యంబు లర్పించిరి. శాంతుండు, నిర్వృతుండు నగు నాతనితో
బ్రహ్మదేవుండు స్వర్గఫలంబు జితం బయ్యెనని వక్కాణించె. మఱియు
నానలువ యయాతితో రాజా! లోకమం దాచరించినకర్మంబున నాల్గు
పాదంబుల ధర్మంబు నీ వార్జించితివి. ఈలోకంబు నీ కక్షయంబై దీపిం
చును. నీకీర్తియు స్వర్గంబున నత్యధికదీప్తిచేఁ బ్రకాశించును. తొల్లి
నీ వీలోకంబును నీయంతన గోల్పోయితివి. నీయకార్యంబున స్వర్గ
వాసులచేతంబులెల్లఁ దమోవృతంబు లగుటంజేసి నిన్నెవ్వరు నెఱుంగఁ
జాలరైరి. దానంజేసియే నీవు స్వర్గమువలన వెడలనడపఁబడితివి. నీ
దౌహిత్రులు నీయందుఁగలప్రీతిచే నిన్నుద్ధరించుటచే నీవు మరల నిక్క
డకు రాఁగలిగితివి. అచలంబు శాశ్వతంబు పుణ్యంబు ధ్రువంబు నవ్య
యంబు నగుస్థానంబు నీకర్మంబున నిర్జితంబయ్యె. నీ వీశాశ్వతం బగు
స్థానంబొంది సుఖంపంగల్గుదువని వచించె. పితామహుం డట్లుపలికినవచ
నంబు లాలించి నహుషనందనుండు బ్రహ్మదేవున కిట్లనియె. భగవా
నుఁడా! నామది నొక్కసంశయం బుదయించి బాధించుచున్నది. దానిని

ఛేధింప నీవ వలంతివి. లోకపితామహుండ వగు నిన్నుఁ గాదని యింకెవ్వ నిని నే నడుగఁదలంపను. కావున దయతో నీవ నాకు సంశయనిరాసము గావింపుము. బహువర్ష సహస్రంబులు ప్రజలను ధర్మన్యాయంబులతోఁ బాలించుటవలనను ననేకంబు లగుమహాక్రతువులు దానంబులు నొనరిం చుటవలనను నాకు మహాఫలంబు లభించె. అట్టి మహాఫలంబెల్ల నల్ప కాలంబున నెట్లు క్షీణంబయ్యె? నే నేకారణంబున స్వర్గంబువలన బఢ ద్రోయంబడితిని? దేవా! శాశ్వతంబు లగు ననేకలోకంబులు నే నార్జిం చుట నీవ యెఱుంగుదువుకదా? అవియెల్ల నల్పకాలంబునన యెట్లు విన ష్టంబులయ్యె? ఈయర్థంబు తేటపడ నెఱింగింపవే యని ప్రార్థించుటయు జతుర్ముఖుం డిట్లనియె. రాజా! నీవు బహువర్షసహస్రంబులు ప్రజలఁ బాలించియు ననేక క్రతువులు దానంబులు నాచరించియు నేఫలం బార్జిం చితి వాఫలంబెల్ల నీదోషంబునన వినష్టంబయ్యె. దానంజేసి నీవు స్వర్గ భ్రంశ మొందితివి. నీ వభిమానగ్రస్తుండవగుట స్వర్గవాసులచే ధిక్కరిం పఁబడితివి. ఈలోకంబు మానవంతులకు బలదర్పితులకు హింసానిరతు లకు శఠబుద్ధులకు మాయావులకును శాశ్వతంబై యుండదు. రాజా! నీవెప్పుడు నధములగాని యుత్తములగాని మధ్యములగాని యవమానిం పందగదు. మానంబును విడచినవారలకు సమానుం డెవ్వండును నుండఁడు. విషమంబు లగునాపద లొందునెడ నీపతనారోహణంబనుచరిత్రం బెవ్వరు పఠింతురు. వారు కష్టంబులన్నియుఁ గడచి సుఖంబులం గాంతురు. అని వచించి పితామహుం డంతర్హితుం డయ్యెనని వచించి నారదమునీం ద్రుండు మరల నిట్లనియె. సుయోధనా! అభిమానంబునంజేసి యయా తినరేంద్రుం డిట్టియిక్కట్టులకు పాల్పడియె. అతిమాత్రనిర్బంధము గావించుటంజేసి గాలవుం డట్టిపాట్లు అనుభవింపవలసివచ్చె. కావున నీవు హితకాము లుపదేశించినహితంబు నాదరింపుము. ఎన్నఁడును నిర్బంధ మాచరింపఁజనదు. నిర్బంధమే క్షయమున కుదయంబగును. కావున నీవు మానంబును క్రోధంబును విసర్జింపుము. పాండవులతో సంధిగావింపుము. సరంభము విడువుము. నీవు సత్యంబు లగుహితుల వాక్యంబుల గ్రహింపుము. అనృత మాదరింపకుము. సమర్థు లగుపాండ వులతోఁ గలహించితివేని విషమంబు లగునవస్థ లనుభవింతువు. రాజా! ఏదానంబాచరించినను నేపుణ్యకర్మంబుగావించినను నేతపంబుచరించినను

నేయాగంబు గావించినను వాని కెన్నండును నపకర్షంబుగాని నాశంబుగాని కలుగదు. దాని నితరులెవ్వరు ననుభవింపంజాలరు. వానిని గావించిన వాఁడే వానిఫలంబు లనుభవించును. బహుశాస్త్రవేదులు గతరోష రాగనిర్మలులు నగురాజజ్ఞుల యీమహాఖ్యానంబు నెవ్వం డాకర్ణించునో వాఁడు లోకంబున ననేకవిధంబులం బ్రవర్తించుధర్మంబు లెఱింగి త్రివర్గంబునందు మొక్కవోవని ప్రజ్ఞకలవాఁడై భూమి పాలింపంగలఁడు. అని వచించి మిన్నకుండె.

## కృష్ణుండు దుర్యోధనునకు హిత ముపదేశించుట

నారదుం డట్లు వచించి యూరకున్నంత నంబికానందనుండు నారదుని కిట్లనియె. మహాత్మా! నీవు చెప్పినవచనంబులెల్ల సత్యంబులై యొప్పుచున్నవి. నేను నీచెప్పినతెఱంగున నెప్పుడు నభిలషింతును. అయినను సుయోధను శిక్షింప నాకు సామర్థ్యంబు లేకుండుట మిన్నకున్నవాఁడనని పలికి కృష్ణున కిట్లనియె కేశవ! నీవు నన్నుద్దేశించి స్వర్గంబునకు సాధనంబులును లోకంబునకు హితంబులును ధర్మమునకు ద్వారంబులును న్యాయంబునకు నిధానంబులు నగువచనంబులు పలికితివి. తండ్రీ! నేను నావశంబున నుండక పరులకు వశమైయున్నవాఁడను. ఈకావింపఁబడు కార్యంబు లేమియు నా కభిమతంబులు గావు. దుర్యోధనుం డజ్ఞుండు మందుండు శాస్త్రాతిక్రమణుండునై చెడిపోవుచున్నవాఁడు. వాని నను నయింప నీవు యత్నింపుము. సాధుభాషితం బగుహితంబు నీమందుండు వినకున్నవాఁడు. గాంధారి విదురుండు భీష్ముండు మొదలగు నితరసుహృదులును వీనిహితంబుగోరి మంచిమాట లెంతగా వచించినను వీడు సరకు సేయకున్నవాఁడు. పాపబుద్ధియు క్రూరుండు పాపకర్మాభిరతుండు నచేతనుండు దురాత్ముండు నగుదుర్యోధనుని నీవ స్వయముగ సన్మార్గమునకు మరల్పుము. నీవట్లొనరించితివేని సుహృత్కార్యంబు విశేషంబుగ నెఱవేర్చినవాఁడవు కాఁగలవని ప్రార్థించెను. సర్వధర్మార్థతత్త్వవేది యగు వార్ష్ణేయుండు ప్రజ్ఞాచక్షుం డట్లు పలికినవాక్యంబు లాదరించి యమర్షణుం డగు సుయోధనునితో మధురంబు లగువచనంబు లిట్లు పలుకం దొడంగె. కురుసత్తముండ వగుసుయోధనా! ఇదె నావచనంబులు శ్రద్ధధానుండవై యాలింపుము. వీనిని విన్న సానుబంధుండ వగు నీకు విశే

షించి శమంబు లభించును. మహాకులంబునం బ్రసూతుండ వగు నీ వీవా
క్యంబుల నాలించి యెల్లభంగుల సన్మార్గంబునం బ్రవర్తింపందగును. నీవు
బహుశ్రుతుండవు, శీలవృత్తోపసంపన్నుండవు నగుటం జేసి, సర్వగుణంబు
లును నీయెడఁ బ్రకాశించుచున్నయవి. దుష్కులసంజాతులు దురాత్ములు
నృశంసులు నిరపత్రపులు నగువారుమాత్రమే యిట్టియకార్యంబు లాచ
రింతురని నీవు నెఱింగినవిషయమే. లోకంబున సత్పురుషుల ప్రవర్తనంబు
ధర్మార్థంబుల నెడపక కూడియుండును. దుర్మార్గులప్రవర్తనంబన్ననో
దానికి విపరీతంబై ధర్మార్థవిరహితంబై యుండును. నీయందును విపరీతం
బగుప్రవృత్తి పలుమాఱు లగపడుచున్నది. నీకావించు నీదుష్కార్యంబు
లకు మహాఘోరంబు ఫలంబయి ప్రాణహరంబుగాఁగలదు. ఆయనర్థం బని
ష్టంబున నిమిత్తంబునై నివారింప శక్యంబుగాకుండును. ఆయనర్థంబు పరి
హరించి నీకును నీసోదరులకును భృత్యులకును మిత్రులకును శ్రేయంబు
సంపాదింతువుగాక. అధర్మ్యంబు నకీర్తికరంబు నగుకర్మంబువలన నీవు
విముక్తుండవగుము. ప్రాజ్ఞులు శూరులు మహోత్సాహవంతులు నాత్మ
వంతులు బహుశాస్త్రపారంగతులు నగుపాండవులతో నీవు సంధిగావిం
పుము. అట్లు పాండవులతో శమంబందుట ధీమంతుం డగుధృతరాష్ట్రున
కును, పితామహునకును, ద్రోణునకును, మహామతిమంతుం డగు విదుర
నకును, కృపునకు, సోమదత్తునకు, బాహ్లీకునకు, ధీమంతుం డగు నశ్వత్థా
మకు, వికర్ణునకు, వివింశతికి, సంజయునకును, మీజ్ఞాతివర్గంబునకును,
మిత్రులకును మిగుల హితంబును బ్రియంబు నగును. శమంబున జగంబున
కెల్లసుఖంబుగలుగును. నీవు సత్కులంబునం జనించినవాఁడవు. శ్రీమం
తుండవు, శ్రుతవంతుండవు, నన్నృశంసుండవు నై యున్నవాఁడవు. రాజా!
నీతండ్రిశాసనంబున నిలువుము. నీమాతయానతి తలఁదాల్పుము. తండ్రి
యేది వచించునో యది మిగుల శ్రేయంబని యార్యులందురు. మహాపద
లందుఁ జిక్కినవారెల్ల జనకునియానతిని స్మరించి దానివలన నాపదలఁ
దరింతురు. నీతండ్రికిఁ బాండవులతో శమంబు గావించుట మిగుల నిష్టం
బైనది. నీజనకునిమంత్రులెల్లరును బాండవులతోడి సమాగమంబు విశే
షంబుగ వాంఛించుచున్నవారు. కావున నీవును దాని నంగీకరింపుము.
సుహృదులశాసనం బాలించియు నెవ్వండు దాని నాదరింపకుండునో
యట్టిమర్త్యుండు విషఫలంబు భుజించినవాఁడువోలె విపాకసమయంబున

నశించును. ఎవ్వండు నిశ్శ్రేయసం బగువాక్యంబు మోహావేశంబున విన నొల్లఁడో వాఁడు దీర్ఘసూత్రుండు హీనార్థభ్రష్టుండునై పశ్చాత్తాపం బనుభవించును. ఎవ్వండు నిశ్శ్రేయసం బాలించి ముందుగాఁ దనయభి మతంబు విడిచి మిత్రవాక్యంబుల ననుసరించునో వాఁడు లోకంబున సుఖంబు ననుభవింపఁగలఁడు. అర్థకాముని వచనంబు ప్రతికూలంబని యాద రింపకయుఁ బ్రతికూలంబు లగువచనంబు లర్థసాధనంబులని యాదరించియు నెవ్వండు ప్రవర్తించు. వాఁడు శాత్రవులవశంబగును. సజ్జనులమతం బతిక్రమించి దుర్జనులమతంబున నెవ్వఁడు చరించువాఁ డచిరకాలంబున వ్యసనంబులపాలయి మిత్రులకు శోకంబు గల్పించును. ఎవ్వండు ముఖ్యు లగునమాత్యులఁ ద్యజించి విహీనుల నాలంబించునో వాఁడు ఘోరం బగునాపద నొంది యుత్తరింపఁగానకుండును. అసత్సేవి, వృథాచారుండు, సుహృద్వాక్యనిరాకరిష్ణుండు నగువాఁడును, దనవారల ద్వేషించి పరుల నాదరించువాఁడును, చిరకాలంబు భూమిపై మనఁజాలరు. భూమి వారల నచిరకాలంబున బరిత్యజించును నీవు వీరలు నీబంధువులు నగుపాండ వులతో విరోధించి యన్యులవలన రక్షణం బాశించుచున్నాఁడవు. నీహితు లశిష్టులు నసమర్థులు మూఢులునయ్యు, నిన్ను రక్షింపఁగలమని వృథా ప్రగల్భములు పలుకుచున్నవారు. శక్రసమానులు మహారథులు నగుజ్ఞాతులవిడనాడి యితరులవలన రక్షణంబు నీవొక్కరుండవయాశించు చున్నాఁడవుగాని యితరుఁ డెవ్వఁడు నట్లాశింపఁడు. జన్మంబు మొదలుగఁ గౌంతేయుల ననేకభంగుల నిష్కృతిపాలుగావించితివి. ధర్మాత్ము లగుటం జేసి పాండవు లెన్ని బాధలనేని సహించుచున్నవారేకాని నీయెడ నించు కేనియుఁ గోపింపకున్నవారు. నీబాంధవులకుఁ బుట్టుక మొదలుగనే యనే కంబు లగు మిథ్యోపచారంబులుగావించితివి. పాండవులు నీయెడ మిగుల ననురాగంబునం బ్రవర్తించుచున్నవారు. నీవును వారియెడ ననురక్తుండ వగుము. నీముఖ్యబంధువులవిషయంబున మన్యువశుండవు గాకుము. ప్రాజ్ఞు లెప్పుడును ద్రివర్గయుక్తంబు లగుకార్యంబులు గావిం తురు. ఒకప్పుడు త్రివర్గంబు సంభవింపదేని ధర్మార్థంబుల రెంటిని గ్రహిం తురు. వేర్వేఱుమార్గంబుల ధర్మార్థకామంబులు ప్రవర్తించునెడ ధీరుండు ధర్మంబునుమాత్రమే పరిగ్రహించును. మధ్యముం డర్థంబు నాశించును, బాలిశుండు కామంబు ననుసరించును. ప్రాకృతుం డగునరుం డెవ్వఁ

డింద్రియంబుల జయింపనేరక లోభాకృష్టుండై ధర్మంబువిడిచి చరించునో వాఁ డర్థకామంబులఁ బ్రాపించు నుపాయంబు గాంచనేరక నశించును. కామార్థంబుల నెవ్వఁ డాశించు. వాఁడు తొలుత బాగుగ ధర్మంబే యాచరింపవలయును. కామంబుగాని యర్థంబుగాని యొకప్పుడును ధర్మంబు నెడసి యుండవు. త్రివర్గంబునకును ధర్మమే యుపాయంబని యార్యులందురు. ధర్మంబువీడి యర్థకామంబు లభిలషించుట గ్రీష్మంబున నగ్నిని వృద్ధిపొందించినట్ల యగును. నీవు కామార్థంబుల నుపాయంబు వీడియే పొందఁగోరుచున్న వాఁడవు. నీయధిరాజ్యంబు సర్వరాజన్యులందును బ్రఖ్యాతంబై మహాదీప్తితో వెలుంగుచున్నది. వనంబును బరశువ్రన ఛేదించునట్లు నీదురభిలాషం బారాజ్యంబెల్ల ఛేదించును. తనయందు సౌహార్దంబునఁ బ్రవర్తించువారియెడ నెవ్వండు కపటం బాచరించునో వానికిఁ దప్పక పరాభవంబగును. వానిపరాభవంబు నాలించిన నది సిద్ధించుటకు వానిమతి మరలింపకుండుటయే యుత్తమం బగుమార్గము. అవిచ్ఛిన్నమతి యగు పురుషునిమతి కల్యాణంబునం బ్రవర్తించును. ఆత్మవంతుఁడు ముల్లోకంబులం దెవ్వరికి నవమానంబు గావింపరాదు. ప్రాకృతుం డగువాని నే నవమానింపఁదగదనుచో మహోత్తమపరాక్రము లగుపాండవుల నవమానింపవలదని వేఱ చెప్పనేల? జనుం డమర్షవశుండై యుండెనేని మంచిచెడుగు లిసుమంతయుఁ దెలియనేరఁడు. వాఁడు ప్రమాణంబులనెల్ల ఛేదించుచుండును. దుర్జనులతోడిసావాసముకంటెఁ బాండవులతోడిపొందు నీకు మిగుల శ్రేయస్కరం బగునది. ప్రేమంబున వారలతోఁ గలిసియుంటివేని నీకెల్ల కామంబులును సిద్ధించును. పాండవులు భూమినెల్ల జయించి నీకుపభోగార్హ్యగాఁ జేయుదురు. పాండవులను వెనుకనుంచి నీవు దుశ్శాసనుండు, దుర్విషహుండు, కర్ణుండు, సౌబలుండు మొదలగువారివలన నీవు పరిత్రాణం బాశించుచున్నాఁడవు. వారలయం దైశ్వర్యమెల్లనుంచి భూతినొందఁగోరుచున్న వాఁడవు. వీరలెవ్వరును జ్ఞానంబునంగాని, ధర్మార్థంబులంగాని, విక్రమంబునంగాని నీకు సరిరాఁజాలరు. మీరెల్లరు నొక్కటిగాఁగూడినను బాండవులకు సాటిరాఁజాలరు. ఈసమావేశంబయియున్న రాజులెల్లరును సమరాంగణంబున గోపించిన భీమసేనుముఖ మాలోకింప సమర్థులుగారు. ఈసన్నిహితంబైనసమగ్రం బగురాజ

బలంబుగాని భీష్ముండు, ద్రోణుండు, కృపుండు, కర్ణుండు, భూరిశ్రవ సుండు, సోమదత్తియు, నశ్వత్థామయు, జయద్రథుండును, నొక్కొక్కండుగాని, యెల్లరు నొక్కటిగాఁ గూడిగాని ధనంజయు నెదిరించి పోర సమర్థులుగారు. సకలసురాసురలోక్కటిగా నెత్తివచ్చినను కిరీటిని గెల్వఁజాలరు. మానుషులుగాని, గంధర్వులుగాని నరుని జయింపనోపరు. కావున నీవు యుద్ధంబున నాశయుంచుకొనకుము. ఈసమగ్రం బగు రాజ బలంబున నర్జును నెదిరించి పోరి తిరిగి ప్రాణంబులతో నింటి కేఁగంగల సమర్థుం డెవ్వఁడో వెదకుము. ఊరక నీవేల జనక్షయంబుగావింపం దలంచెదవు? ఒక్కయర్జునుని జయించిన బలంబెల్ల జయించినట్లే యగును. కాని యర్జును జయింపంగలవీరుఁ డేఁడీ? ఖాండవప్రస్థంబున దేవతలను, గంధర్వులను, యక్షుల, నసురులను, బన్నగులను ధనంజయుం డశ్రమంబున జయించె. అట్టి వివ్వచ్చు నెదిరించి జయింపంగలవాఁ డెవ్వండు? విరాటనగరంబున నొక్కయర్జునునకుఁ బెక్కురుభీష్మాదికురుబలంబులకును నద్భుతం బగుసంగరంబు ప్రవర్తించెనుగదా? అదియే మనకుఁ జాలిన నిదర్శనంబై యున్నది. సవ్యసాచి దేవదేవుం డగుమహాదేవుని యుద్ధంబున మెప్పించె. అజేయుండు, అనాధృష్యుడు, నచ్యుతుండు నగునర్జునుని యుద్ధంబున జయించుట సుకరంబని తలంచితివా? నాతోఁగూడిన ధనంజయుని బోర నెవ్వఁడిచ్ఛగించును? దేవతానాథుం డగు పురందరుండైన నర్జును నెదిరింపఁజాలఁడు. శ్వేతవాహను జయింపంగలవీరుండు భూమినెల్ల బాహువులచేఁ బెల్లగింపఁగలండు. ఈప్రజలనెల్ల దహించును. దివినుండి దేవతలనెల్లఁ బడఁద్రోయును. నీపుత్రులను, సోదరులను, జ్ఞాతులను, జుట్టంబులను బాగుగఁ జూడుము. భరతసత్తము లగు వీరలనెల్ల యుద్ధంబున నశింపనీకుము. భూమిపై నింకను గౌరవుల మిగిలి యుండనిమ్ము. ఈకులంబు నంతరింపకుండఁ జూడుము. నీవు నీకీర్తినెల్లఁ గోలుపోయి కులచ్ఛేదివనునింద నొందకుము. పాండవులు నిన్నే యావ రాజ్యంబున నిలుపుదురు. మీజనకుం డగుధృతరాష్ట్రుండే మహారాజై యుండును. సుయోధనా! సిరి దానంత నది వచ్చుచుండ నీవు దానిని వారింపకుము. పార్థుల కర్ధరాజ్యంబిచ్చి నీవు మహైశ్వర్య మనుభవింపుము. పాండవులతో సంధిఁగావించి స్నేహితులవాక్యంబు లాక

ర్ణించి మిత్రులతోఁగూడ ముదమందుచుఁ జిరకాలంబు శుభంబు లనుభవింపుము.

## భీష్ముండు దుర్యోధనునకు హితంబు గఱపుట

కేశవుం డిట్లు పలికినవచనంబు లాలించి శాంతనవుం డమర్షణుం డగుసుయోధనున కిట్లు హితం బుపదేశించె. స్నేహితులకు శమంబు గోరి కృష్ణుండు పలికినవాక్యంబులెల్ల నాకర్ణించితివికదా? వత్సా! నీ వావాక్యంబు లనుసరించి ప్రవర్తింపుము. వ్యర్థంబుగ మన్యువశుండవు కాకుము. కేశవునివచనంబులుగావింపనిచో నెన్నండును శ్రేయంబుగాని, సుఖంబుగాని, కల్యాణంబుగాని యనుభవింపంజాలవు. మహాత్ముం డగుకేశవుండు ధర్మబద్ధంబులు, నర్థకారణంబులు నగువచనంబులు పలికె. వానిప్రకారంబుగ నీవు ప్రవర్తింపుము. ప్రజలనెల్ల నీకై నశింపనీయకుము. ధృతరాష్ట్రుండు జీవించియుండఁగనే నీవు దురాత్ముండవై రాజులెల్లరయందు నధికంబుగ జ్వలించు నీరాజ్యలక్ష్మిని భ్రంశంబొందింతువు. అహంకారవశుండవై నిన్ను, నీమంత్రులను, పుత్రులను, సహోదరులను, బాంధవులను జీవితభ్రంశం బొందింతువు. సత్యంబును మహార్థసంపన్నంబు నగుకేశవునివచనంబును నీజనకుండు విదురుండు మొదలగుపెద్దలవచనంబులను మీఱి కులఘ్నుండవును కాపురుషుండవును దుర్మతివిని కుమార్గచారవిని కాకుము. నీతల్లిదండ్రులను శోకసాగరంబున ముంపకుము. కేశవునిమాట లనుసరించి ప్రవర్తింపుము. అని పలికినపిదప నమర్షవశుండై వెచ్చనూర్చుచున్నసుయోధనునకు ద్రోణుం డిట్లనియె. వత్సా! నిన్నుఁగూర్చి కేశవుండు ధర్మార్థయుక్తంబగువాక్యంబులు చెప్పెను. శాంతనవుండును హితం బుపదేశించె. వారిరువురవాక్యంబులు నీవు తప్పక యాదరింపుము. రాజా! వారిరువురును బ్రాజ్ఞులు మహామేధావులు దాంతులు నీకర్థకాములు బహుశ్రుతులునై నీహితంబుఁ బొంటె మంచిమాట లుపదేశించిరి. కావున నావాక్యంబు లనుసరింపుము. కృష్ణుండు, భీష్ముండును నేడి వచించిరి. దాని నవశ్యము ననుష్ఠింపుము. మాధవుని బుద్ధిమోహంబున నవమానింపకుము. నిన్ను యుద్ధంబునకుఁ బ్రోత్సాహపఱుచువా రెన్నండును గార్యంబున కనుకూలించువారుగారు. వైరంబును బరులకంఠంబులందు

యుద్ధంబులందు విడిచెదరు. ప్రజలనెల్లరను బుత్రులను భ్రాతలను జంపఁ
కొనకుము. వాసుదేవార్జును లెక్కడనుందు రక్కడ నమేయం బగు
బలం బుండునని నమ్ముము. నీకు సుహృత్తము లగు కృష్ణభీష్ములయీవచ
నం బాదరింపవేని, బశ్చాత్తాప మొందంగలవు. జామదగ్న్యుం డర్జునుని
గూర్చి కొంతచెప్పియున్నవాఁడుకదా? వా స్తవంబున నర్జునుం డంత
కంటె మిక్కిలి గొప్పవాఁడని యెఱుంగుము. దేవకీనందనుం డగువాసు
దేవుండన్నన్నో దేవతలకును దుస్సహుండని తెలియుము. నీకు సుఖం
బులు ప్రియంబులు నగువచనంబులు పెక్కులు చెప్పనేల? సర్వంబు
నీకెఱింగించితిమి. వాని వినినపిదప నీకెట్లు లిష్టం బగునట్లు కావింపుము.
నీకుఁ బెక్కులు మరలమరలఁ జెప్పుట నాకంగీకృతముగాదని వచించె.
అంతట విదురుండును సుయోధనున కిట్లనియె. దుర్యోధనా! నీవిషయం
బున నేనంతగా శోకింపను. వృద్ధులు నీజననీజనకులు గాంధారీధృతరా
ష్ట్రులనుగూర్చి నేనత్యధికముగ శోకించుచున్నాఁడను. దుర్హృదుండవగు
నీవు వీరికి నాథుండవగుటంజేసి యనాథులై చరింపవలసినవారగుదురు.
వీరు హతమిత్రులు హతామాత్యులునై ఱెక్కలుద్రెగినపక్షులంబోలె
దుఃఖించుచు నిప్పృథివీతలంబున భిక్షాచారులు గాఁగలరు. కులఘ్నుండు
పాపాత్ముండు నగు నీవంటి తనయుం గాంచినఫలంబు వీరి కిదియ యని
వచించుటయు ననంతరమున ధృతరాష్ట్రుం డిట్లనియె. వత్సా! దుర్యో
ధనా! యీవాసుదేవుండు వచించినవాక్యంబులు బాగుగ నెఱుంగుము.
ఆవాక్యంబులు మహాశుభంబులును యోగక్షేమవంతంబులు నవ్యయం
బులునై యొప్పుచున్నవి. నీవు తప్పక వానిని గ్రహించి యాచరింపుము.
అక్లిష్టకర్ముం డగు కృష్ణుండు మనకు సహాయుం డయ్యెనేని, సకలరాజ
లోకంబునందును నిష్టంబు లగునభిప్రాయంబులెల్ల ననుభవింపంగలము.
నీ వీకేశవునితోడంగూడి ప్రేమపూరితుండవై యుధిష్ఠిరునికడ కరు
గుము. భరతులకెల్ల స్వస్త్యయనంబు ననామయంబు నగుదాని నాచ
రింపుము. వాసుదేవుండనుతీర్థంబున శమంబు స్వీకరింపుము. ఇదియె
మంచియదనని తలంచుచున్నాఁడను. దుర్యోధనా! నీవు అనుకూలం
బగు నీసమయంబు మించనీకుము. శమంబు యాచించువాఁడును నీకర్థ
కాముండు నగు కేశవుని నీవు తిరస్కరించితివేని నీకుఁ దప్పక పరాభవంబు
గలుగుననియె.

ధృతరాష్ట్రునివచనంబు లాలించి భీష్మద్రోణులిద్దఱును సమంబుగ వ్యథితులై శాసనాతిగుం డగుదుర్యోధనుని కిట్లు వచించిరి. కృష్ణుండు నర్జునుండును యుద్ధసన్నద్ధులు కాకమున్న గాండీవంబు సజ్జంబు కాకమున్న ధౌమ్యుండు మేధాగ్నియందు శాత్రవబలం బెల్ల హోమం బాచరింపక మున్న యుధిష్ఠిరుండు క్రుద్ధుండై నసైన్యం బాలోకింపకమున్న హ్రీనిషేవుండు మహేష్వాసుండునగు నజాతశత్రునకుఁ గ్రోధం బుదయింపక మున్న యీవైశసంబు శాంతింపవలయును. సర్వసన్నాహంబులు మెఱయ ధనంజయుండును వృకోదరుండును సైన్యంబులందు గోచరింపకమున్న శమంబొందుము. భీమసేనుండు గదాపాణియై సైన్యంబునందు భయం బుత్పాదించుచు వివిధంబులగుమార్గంబులఁ జరింపకమున్న పాండవులతో సంధిగావింపుము. మహావృక్షంబుఫలంబులు రాల్చుకరణిని గజయోధుల శిరంబులు గదచే నేలరాల్పకమున్న వైశసంబు శాంతింపందగును. నకు లుండును సహదేవుండును పార్షతుం డగు ధృష్టద్యుమ్నుండును విరా టుండును శిఖండియు శిశుపాలతనయుం డగుసహదేవుండును కోపా టోపంబున నీసైన్యంబున మహార్ణవంబున బ్రవేశించు నక్రంబులచందం బున బ్రవేశింపకమున్న శాంతి కావింపుము. సుకుమారంబు లగుమహీ పతులయంగంబులందు గృధ్రపత్త్రాలంకృతంబు లగుశరపుంజంబులు ప్రవే శింపకమున్న వైశసంబు శాంతిఁబొందుఁగాక. చందనాగరుదిగ్ధంబులు హారనిష్కవిభూషితంబులు నగుమహాయోధుల వక్షంబులందు మహే ష్వాసులు కృతాస్త్రులు క్షిప్రహస్తులు నగుపాండవబలంబులచే మహా బాణంబులు విడువంబడకమున్న వైశసంబు శాంతించుఁగాక. శిరంబు వంచి యభివాదనం బాచరించు నిన్ను రాజకుంజరుం డగుయుధిష్ఠిరుండు బాహువులుచాచి యాలింగనం బాచరించుఁగాక. మిగుల దక్షుం డగు ధర్మనందనుండు ధ్వజాంకుశపత్త్రాంకంబులచే నలరు నీదక్షిణకరంబు స్కంధంబున నుంచికొనుఁగాక. రత్నంబులు నోషధులునుంగలిగి రత్నాం గుళితలంబు గలకరతలంబున నాథర్వాత్మజుండు నీపృష్ఠంబు తడవుఁగాక సాలస్కంధుండు మహాబాహుండు నగువృకోదరుండు నిన్ను గౌఁగిలించి కొని సామవచనంబులు పలుకుఁగాక. అర్జునుండు నకులుండు సహ దేవుండును ముప్పురు నమస్కరింప వారలను ప్రేమంబున మూర్ధాఘ్రాణం బొనరించి యభివదింపుము. భ్రాత లగుపాండవులతోఁగలసిన నిన్నాలో

కించి యీరాజులెల్లరు సానందబాష్పంబులు విడిచెదరుగాక. రాజులెల్లరరాజధానులందును మీసంపదలు చాటఁబడుఁగాక. భ్రాతలతోఁగూడి యీభూమినెల్ల సోదరభావంబున ననుభవింపుము. నీమనంబునం గలజ్వరంబు విడువుముని వచించిరి.

దుర్యోధనుండు కృష్ణునితో రాజ్యమీయనని తెల్పుట.

ఇట్లు భీష్ముండు మొదలగువారెల్లరు నాకౌరవసభయందు వచించిన ప్రియంబులు తనకప్రియంబులై తోఁప వాసుదేవు నాలోకించి యిట్లనియె. కృష్ణా! నీవు మంచిచెడ్డల నుభయపక్షంబులందును బాగుగ విమర్శించి మాటలాడఁదగును. నన్నే నీవు విశేషంబుగ నవమానించి పలుకుచున్నవాఁడవు. పార్థులు నీకు భక్తివాదంబులు గావించుటంజేసి నీవు మాటిమాటికి నన్ను గర్హించుచున్నవాఁడవే కాని బలాబలంబు లాలోచించి గర్హింపలేదు. నీవు విదురుండు ధృతరాష్ట్రుండు ద్రోణుండు శాంతనవుండును నన్నే గర్హించుచున్నారుగాని యితరుల నెవ్వరిని నిందింపకున్నారు. నేను నాయపచారం బేవిషయంబున లేశంబేని యెఱుంగఁజాలకున్నాఁడను. అట్లయ్యును రాజుతోఁగూడ మీరెల్లరు నన్ను ద్వేషించుచున్నవారలరు. ఎంత యాలోచించినను సూక్ష్మంబైనదానినే నర్థంబు నతిక్రమించిన నాయపరాధము గానరాకున్నయది. మధుసూదనా! పాండవులు ప్రియంపడి ద్యూతంబాడి శకునిచే రాజ్యంబోడినచో నా విషయంబున నేను గావించిన దుష్కార్యంబేది? వారలు ధనంబెల్ల నోటువడి ద్రవ్యంబులేనపుడు వారియంతట వారే వనవాసాజ్ఞాతవాసంబులకుఁ బ్రతిజ్ఞగావించిరి. ఇతరుల కజేయులు జయశీలుర కగ్రగణ్యులు నగుపాండవు లశక్తంబులవలన నోడి వనంబున కరుగుటయందు నేను గావించినయపరాధం బేమిగలదు? అశక్తు లగుపాండవులు ప్రత్యమిత్రులంబోలె నేవో యొక్కయపవాదంబు గల్పించి శాత్రవులతో విరోధింతురు. సృంజయులతోడంగూడి పాండవులు ధార్తరాష్ట్రుల వధింప యత్నించుచున్నవారుగదా? వారలకు మేమేమి యపకారంబు గావించితిమి? ఏయపరాధంబుగావించితిమి? మేముగ్రంబు లగుకర్మంబులచేఁ గాని పరుషవచనంబులచేఁగాని భయంబునఁగాని మానభ్రంశంబొంది శతక్రతునకైనను లొంగువారముగాము. కృష్ణా! శత్రునిబర్హణుండగు

బులే కావించుచున్నవాఁడవు. అట్లయ్యు నే నేయపరాధములు గావింప లేదనుట మోసముకాక మఱేమగును. ఇట్టి దుర్వ్యాపారంబు లాచరించునీవు రాజ్యంబున నెట్లుండఁగలవు? అచిరకాలంబునన రాజ్యంబును సుఖంబునుంగూడ గోల్పోవుదువు. ఇపుడు వారలు వినయంబున నడుగు నపుడు వారితండ్రి రాజ్యంబు వారికీయఁదలంపకున్నవాఁడవు. యుద్ధంబున నిపాతంబంది యైశ్వర్యభ్రష్టుండవై యెల్లరాజ్యంబు పాపలకే యొసంగుదువు. పాండవులయెడ ననేకంబు లగు నకార్యంబులు నృశంసంబులు నాచరించి కపటవర్తనుండవు ననార్యుండవునై యిప్పు డేనేమియుఁ బాప మాచరింపలేదనఁ జెల్లునా? నీమాతాపితరులు భీష్ముండు ద్రోణుండు విదురుండును శాంతిగావింపుమని యెంతబోధించినను నీవు వినకున్నాఁడవు. సంధి కంగీకరింపకున్నాఁడవు. శమంబువలన నీకును ధర్మనందను నకుఁగూడ విశేషం బగులాభంబు ప్రాపించును. నీవు దాని కంగీకరింప కుండుటకు బుద్ధిలాఘవంబుదక్క నింకే హేతువు కలదు? రాజా! మిత్ర వచనంబులు మీఱి సుఖంబు కాలఁద్రోసికొనుచున్నాఁడవు. నీవధర్మ్యంబు నయశస్యంబు నగుపాపం బాచరించుచున్నవాఁడవని పలికెను.

ఇట్లు వాసుదేవుండు వచించి యూరకున్నంత దుశ్శాసనుం డత్యమర్షణుం డగుదుర్యోధనున కి ట్లనియె. రాజా! నీవు నీయంతన పాండవులతో సంధిగావింపవే నీకౌరవులెల్లరు నిన్ను బంధించి పాండవుల కర్పింతురఁట. భీష్ముండు ద్రోణుండును నీతండ్రియుఁ గర్ణుని నిన్ను నన్నును బంధించి ధర్మనందనున కర్పింతురు. కావున నీవవశ్యము వారివచనంబు శిరసావహింపవలసినదే యని సోల్లుంఠనంబుగఁ బల్కుటయు నదివిని సుయోధనుండు క్రుద్ధుండై మహానాగంబువలెఁ బుసకొట్టుచు నాసనంబు నుండి లేచి సభవిడిచి వెడలిపోయెను. విదురుండు, ధృతరాష్ట్రుండు, బాహ్లికుండు, కృపుండు, సోమదత్తుండు, భీష్ముండు, ద్రోణుండు, జనార్దనుండు మొదలగువారినెల్ల ననాదరించి దుర్మతియు లజ్జాహీనుండును నమర్యాదుండును దురభిమానియు మాయాపరాయణుండును నవమాననిరతుండును నశిష్టుండు నగుసుయోధనుండు సభవిడిచి పోయినంతన వానిసహోదరులును నమాత్యులును నితరు లగురాజులును వాని ననుసరించి లేచిపోయిరి. అట్లు క్రుద్ధుండై మంత్రులతోడను సోదరులతోడను సభవిడిచిపోవు సుయోధను నాలోకిం

యాపగానందనుం డిట్లనియె. ధర్మార్థంబుల విడిచి మోహంబున సంరంభము నొందునో వాని కవశ్యంబు వ్యసనంబులు ప్రాప్తంబులగును. వానిశాత్రవులు వానిని బరిహసింతురు. దురాత్ముం డగు నీసుయోధనుం డుపాయంబు లెఱుంగఁడు. మిథ్యాభిమానవంతుండు క్రోధలోభవశుండు నగువీఁ డెట్టును రాజ్యంబున కర్హుండు గానేరఁడు. జనార్దనా! యీక్షత్త్రబృందంబెల్లఁ గాలంబున బక్వం బయినదని తోఁచెడిని. సమస్తం బగురాజసమూహంబును కర్ణాది మంత్రులతోడం గూడ దుర్యోధనునే యనుసరించినది యని పలుకఁ బుండరీకాక్షుండు భీష్మద్రోణప్రముఖుల నీక్షించి యిట్లనియె. కురువృద్ధులకెల్ల నీమహాతిక్రమంబు సంభవించినది. మందుం డగు నీసుయోధనుని మీరెల్లరును శిక్షింపఁజాలక విడచుచున్నారు. ఇట్టియెడ నేఁడె కాలానుగుణం బగు నయ్యదియే కావింపవగునని నాతలంపు. ఉచితం బగుకార్యం బిపుడు గావించిననే శుభంబు లభించును. మీకందఱకును బ్రత్యక్షంబుగనే వచించెద. మీకెల్లరకు నది రుచించెనేని మీయెల్లరు నానుకూల్యంబున దాని గావింపుఁడు. దురాచారుండు ననాత్మవంతుండు నగుభోజరాజుతనయుం డగుకంసుండు తనతండ్రి జీవించియుండంగనే వానిరాజ్యం బపహరించి మృత్యువశుండయ్యె. ఉగ్రసేనసుతుం డగు కంసుని వానిబాంధవులెల్లరును విడిచిరి. నేను జ్ఞాతులకు హిత మాచరింపనెంచి వానినిఁజంపితిని. మరల నాహూతుండు మాచేతను జ్ఞాతుల చేతను సత్కృతుండై భోజరాజ్యంబునకెల్ల నుగ్రసేనుండు రాజు గావింపంబడియె. యాదవులెల్లరు నేకమతిఁబొంది కులంబు రక్షించుటకై యొక్కకంసుని బరిత్యజించి మిగిలినవారెల్లరు నత్యంతసుఖము లనుభవించుచున్నారు. తొల్లి పరమేష్ఠికూడ దేవాసురయుద్ధంబు సిద్ధంబై యున్నయెడ లోకంబులెల్ల రెండుపక్షంబులై నశింపనున్నతఱి నిట్లనియె. అసురులు దైతేయులు దానవులును బరాభవంబొందుదురు. ఆదిత్యులు వసువులు రుద్రులును జయంబంది స్వర్గం బనుభవింతురు. దేవతలు నసురులు మనుష్యులు గంధర్వు లురగులు రాక్షసులు నీయుద్ధంబున నతిక్రుద్ధులై యొండొరుల వధించికొందురు. ఇపుడు సుఖంబున నున్న యీజగంబెల్ల నొక్కక్షణంబున నశించి రూపుమాయును. అని యాలోచించి పరమేష్ఠి ధర్ము నాలోకించి యీదైతేయులను దానవు

లను బంధించి వరుణున కొసంగుమని యానతిచ్చె. బ్రహ్మదేవునియాజ్ఞ ననుసరించి ధర్ముండు దైతేయులను దానవులను దనధర్మపాశంబులచే బంధించి వరుణున కొసంగెను. వరుణుండును, దనవారుణపాశంబులచే వారల బంధించి సాగరాంతర్భాగంబున వారల నునిచి నిత్యంబు మహా ప్రయత్నంబున గాచుచుండును. మీరు నట్లే దుర్యోధనుని కర్ణుని దుశ్శాసనుని శకునిని సౌబలుని బంధించి పాండవుల కర్పింపుఁడు. ఒక్క కులంబునకు హాని రానున్నపుడొక్కపురుషుని దుర్మార్గుని విడిచి కులంబు రక్షించుట యుచితంబు. కులంబువలన గ్రామంబునకు హానికలుగనున్నపు డాకులంబును బరిత్యజింపవలయును. జనపదంబునకు హానికలుగకుండ గ్రామంబును విసర్జింపవలయు. తనకు హానికలుగునని తోచునెడఁ బృథివి నెల్ల విసర్జింపఁదగును. అంబికానందనా! దుర్యోధనుని బంధించి పాండవులతో సంధిగావించుకొనుము. క్షత్రియపుంగవా! నీనిమిత్తంబున నీక్షత్రియులెల్ల నశింపకుండఁ గాపాడుమని పలికెను.

### గాంధారి సుయోధనునకు హిత ముపదేశించుట

కృష్ణుం డట్లు పలికినంతన ధృతరాష్ట్రుండు త్వరితుండై విదురునితో మహాప్రాజ్ఞా! సర్వధర్మజ్ఞా! నీవిప్పుడు దీర్ఘదర్శిని యగుగాంధారి కడ కేఁగి దాని నిక్కడకుఁ గొనిరమ్ము. దానితోడంగూడి యీదుర్మతి యగు దుర్యోధను ననునయించెద. ఆగాంధారి దుర్యోధనుని శాంత పఱుపఁజాలకున్నచో మనకు సుహృదుం డగు కృష్ణునివాక్యంబు లనుసరింతము. లోభాభిభూతుండగు దుర్యోధనునకు గాంధారియొక్కమార్గంబు చూపునేమో! దుర్బుద్ధియు దుస్సహాయుండు నగువానికి హితం బుపదేశించి వానిని సన్మార్గంబునకు మరల్పఁగలదేమో! దుర్యోధనువలన మనకుఁ బ్రాప్తించిన యీమహాఘోరం బగువ్యసనంబు గాంధారి తొలఁగించునేమో! మన కెల్ల యోగక్షేమావహంబు నవ్యయంబు నగువచనంబు నాగాంధారి కావించునేమో! కావున నీవు సత్వరుండవై యేఁగి గాంధారి నిటకుఁ గొనిరమ్మని పనిచె. ఆధృతరాష్ట్రునివచనంబు లాలించి మహామతి యగువిదురుండు త్వరితుండై యంతఃపురంబున కరిగె. గాంధారి కీవృత్తాంత మెఱింగించి యామెను దోడ్కొనివచ్చెను. గాంధారి రాఁగానే యంబికాత్మజుండు గాంధారీ! వీఁడె నీతనయుండు దురాత్ముండై పెద్దలశాసనం బతిక్రమించి యైశ్వర్యలోభాకృష్టుండై యైశ్వ

ర్యంబును జీవితంబును గోలుపడనున్నవాఁడు. మర్యాదయెఱుంగని యాదురాత్ముం డశిష్టుండువోలెఁ బాపాత్ము లగువాని యనుచరులతోడం గూడి సభవిడచిపోయినవాఁడు. మిత్రు లెంతచెప్పినను మూఢుండై వారివచనంబుల లక్ష్యము సేయకున్నవాఁడని వచించె. గాంధారి భర్తృ వాక్యంబు లాలించి మహాశ్రేయంబు నాకాంక్షించునదై యిట్లు వచించె. రాజ్యకాముకుండు నాతురుండును నగుదుర్యోధను నిటకు రప్పింపుము. ధర్మార్థంబులకు భంగంబు గావించునపత్పురుషుండు రాజ్యంబు పాలింప శక్తుండు గానేరఁడు. అవినీతుం డగువాఁ డెల్లవిధములఁ బ్రాప్తంబైన రాజ్యంబునే ననుభవింపంజాలఁడు. మహారాజా! సుతునియం దత్యంత ప్రీతిగలిగిన నిన్నే యిపుడు గర్హింపవలయును. వాని పాపాభిరతి నెఱింగియు నీవు వానిప్రజ్ఞనే యనుసరించుచుండువు. వాఁ డిపుడు కామ క్రోధంబులచే నభిభూతుండై లోభగ్రస్తుండై యున్నవాఁడు. అట్టి వాని నిపుడు దుర్మార్గంబువలన మరలించి సన్మార్గంబునం బ్రవర్తింపఁజేయ నీకుఁ దరంబుగాదు. ఎన్నిచెప్పినను వానిచే రాజ్యం బిప్పింప వశంబు గాదు.మూఢుండు బాలిశుండు దురాత్ముండు దుస్సహాయుండు లుబ్ధుండు నగుదుర్యోధనుండు కావించినపాపంబులఫలంబు ధృతరాష్ట్రుం డను భవించును. ఈతండు మహీపతియయ్యు స్వజనంబులందు భేదం బెట్లుపే క్షించియుండెను? రాజా! స్వజనంబులతో భేదంబునొందిన నిన్నునాయా సంబుగ శాత్రవులు ప్రహరింతురు. మహారాజ! సామంబుననేని భేదం బుననేని సుఖంబుగ నాపదలఁ దరింప ననువైయుండెనేని వానికై స్వజ నంబులందు దండం బేమూఢుండును బ్రయోగింప నాలోచింపండని వచించె. ఆమాట లాలించి విదురుఁ డేగి దుర్యోధనునితో మాతాపిత రులయానతిం దెలిపి వానిని సభకు మరలఁ దీసికొనివచ్చెను. దుర్యో ధనుండును దల్లియానతి నాలించి క్రోధతామ్రాక్షుండై బుస్సకొట్టు పాముపలె మరల సభం బ్రవేశించె. దుర్యోధనుం డాసనంబున నుప విష్టుండైనపిదప నాదుర్మార్గగామి నెంతయు గర్హించుచు శాంతిపఱుచు టకై గాంధారి యిట్లు బోధించె. తండ్రీ! దుర్యోధనా! ఈనావాక్యంబు లాలింపుము. నామాటలు నీకును నీయమాత్యులకును హితంబులైనవి. ఉత్తరకాలమం దివి నీకత్యంతసుఖం బొనఁగూర్చును. దుర్యోధనా! నీజనకుండును, భీష్ముండును, ద్రోణుండును, కృపుండును, విదురుండును.

నీ కెట్లుపదేశించిరో యట్లు ప్రవర్తింపుము. వారివాక్యంబులు తప్పక కావింపుము. నీవు భీష్మునకు నీతండ్రికి నాకుసుంగూడ నపచితిగావించిన వాఁడగుదువు. ద్రోణుండు మొదలగుసుహృదులకెల్ల నీవు శమించుట మిగుల ముదావహంబు. వత్సా! కేవలము నీకామంబుచేతనే రాజ్యంబు వొందుటకుఁగాని రక్షించుటకుఁగాని యనుభవించుటకుఁగాని సాధ్యము గాదు. ఇంద్రియనిగ్రహంబులేనివాఁడు చిరకాలము రాజ్యమనుభవింప సమర్థుఁడు గాకుండును. ఎవ్వం డాత్మను జయించునో వాఁడు చిర కాలము రాజ్యంబు పాలింపఁగల్గును. కామక్రోధంబులు రెండును బురుషు నెల్లయర్థంబులవలనను దూరమునేయును. అంతరశత్రువు లగు కామక్రోధంబులజయించెనా యానరపతి చిరకాలము రాజ్యశ్రీయుక్తుం డగును. రాజ్యం బనునది లోకేశ్వరప్రభుత్వంబు. దీనిని దురాత్ములు పొందియు రక్షింపంజాలరు. మహారాజ్యంబు పాలింప సజ్జనులే యర్హులై యుందురు. గొప్పఫలంబు లందఁగోరువాఁడు తొలుత నింద్రియంబుల వశపఱుచుకొనవలయును. ధర్మార్థములం దింద్రియంబులు నియతంబు లగునేని సమిధలచే నగ్ని ప్రజ్వలించినచందంబున బుద్ధి ప్రవృద్ధంబగును. ఇంద్రియంబు లవిధేయంబులగుచోఁ బురుషుని నశింపఁజేయుటకును సమర్థంబులై యుండును. అవిధేయంబులు నశిక్షితంబులు నగుహయంబులు మార్గమధ్యంబున దుష్టసారథిని జంపుమాడ్కి నవిధేయంబు లగునింద్రియంబులు పురుషునకు నాశంబు చేకూర్చును. తనయాత్మను జయింప కుండనే యెవ్వఁ డమాత్యుల జయింపందలంచునో; యమిత్రులనేని జయింపందలంచునో వాఁడవశుండై హానిబొందును. తొలుదొల్తఁ దన యాత్మనే ద్వేష్యునిగా నెంచి జయింపందగును. తరువాత నమాత్యుల నాపిమ్మట శత్రువులను జయింపఁ దలంపవలయును. అట్లు కావించినవాని జయేచ్ఛ యెన్నండును మోఘంబుగానేరదు. వశ్యేంద్రియుండై యమాత్యులజయించి వికారులయందు దండంబు ప్రయోగించుచు నెవ్వఁ డెల్ల కార్యంబులును బాగుగఁ బరీక్షించి కావించునో వానికి సకలసంపదలు తమంతతాము వశంబులగును. రంధ్రములుగలవలచేఁ గప్పఁబడనిమత్స్యం బులు వలను దప్పించుకొనిపోవునట్లు కామక్రోధంబులు శరీరంబున నుండి ప్రజ్ఞానము నపహరించును. స్వర్గంబుగోరువానిని స్వర్గంబు చేర నీకుండ దేవతలు స్వర్గద్వారంబును గామక్రోధంబులచేఁ గప్పియుం

తుడు. భయస్వభావముగలవాఁడు నుపరాగంబులేనివాఁడు నగుపురుషు నకుఁ గామక్రోధంబు లభివృద్ధినొందును. కామంబును క్రోధంబును లోభంబును దంభంబును దర్పంబు నేభూపాలుండు బాగుగ జయింప నెఱుఁగునో వాఁడే భూమినెల్ల వశపఱుచుకొనును. రాజు సంతతము నింద్రియంబుల జయించుటకుఁ బ్రయత్నం బాచరింపవలయును. అర్థంబు ధర్మంబు శత్రుజయంబు నార్జించెనేని మొదట నింద్రియములనే జయింపవలయును. కామంబునంగాని క్రోధంబునంగాని యెవ్వండు తనబంధువులయెడ నకృత్యంబుగావించునో వాని కెవ్వరును సహాయు లుగానుండ నంగీకరింపరు. శూరులు శత్రునిబర్హణులు నగుపాండవు లతో నేకీభవించి వారలతోఁగూడి యీభూమిని సుఖంబుగ ననుభవిం పుము. తండ్రీ! శంతనునందనుండును ద్రోణుండును నేది వచించి రది యెల్ల సత్యంబుసుమీ! కృష్ణుని ధనంజయుని జయింప నెవ్వరికిని దరంబు గాదు. అక్లిష్టకర్ముండు మహానుభావుండు మహాబాహుండు నగు కృష్ణుని శరణుపొందుము. కృష్ణుండు ప్రసన్నుండయ్యెనే నుభయుల కును సుఖకరుండగును. ప్రాజ్ఞులు విద్యావేదులు నర్థకాములు నగు మిత్రులశాసనంబు లెవ్వఁ డతిక్రమించి చరించు. వాఁడు శాత్రవుల కానందము బంధువులకు దుఃఖంబు నాపాదించును. తండ్రీ! యుద్ధం బునఁ గల్యాణంబుగాని సుఖంబుగాని ధర్మార్థంబులుగాని లభింపవు. యుద్ధంబున విజయంబును నిత్యంబై యుండదు. అట్టియుద్ధంబు నీవం గీకరింపకుము. తొల్లి భీష్ముండును నీతండ్రియు బాహ్లికుండును భేదంబు గలుగుటకు భీతిల్లి భేదంబుగలుగకుండుటకై పాండునందనులకు రాజ్య భాగం బొసంగియుండిరి. వారప్పు డట్లు భాగం బిచ్చుటవలన జనించిన ఫలంబె నీవిపు డనుభవించుచున్నాఁడవు. శూరు లగు పాండునంద నులు శాత్రవులనెల్ల వధించి యీసకలం బగుభూమండలంబు నీతండ్రి కొసంగిరి. దానినే యిపుడు నీ వనుభవించుచున్నవాఁడవు. అరిందమా! పాండునందనులకు యథోచితంబుగ రాజ్యం బొసంగుము. నీవును నీమంత్రులు నింకను రాజ్యం బనుభవింపన గోరితిరేని పాండవులకు సగపాలురాజ్యంబిమ్ము. అమాత్యులతోఁగూడి నీవు జీవించుటకు రాజ్యం బున నర్ధభాగంబు చాలును. నీసుహృదులవచనంబు లనుసరించి చరించితి వేని మహాయశంబొందఁగలవు. శ్రీమంతులు, నాత్మవంతులు, బుద్ధిమం

తులు, జితేంద్రియులు నగుపాండవులతోడి విరోధము మహాసుఖంబుల నెల్ల మంటఁగలపును. సుహృదులయెడఁ గోపంబుమాని యథోచితం బుగ రాజ్యంబు పాలింపుము. పాండునందనులకు వారిభాగం బిచ్చి వేయుము. వత్స! పాండవులకుఁ బదుమూఁడువత్సరంబులు భరింపరాని నికారంబుగావించితివి. అది యింక మానుము. కామక్రోధంబులచే నభివృద్ధం బగు నికారంబు నింక చల్లార్పుము. దృఢక్రోధుం డగుసూత పుత్త్రుండును దుశ్శాసనుండును నీకై పాండుపుత్త్రులయర్థంబులు గ్రహింపఁగోరుచున్నారు. అట్లు గావించుట కెన్నండును శక్యంబుగాదు. భీష్ముండు, ద్రోణుండు, కృపుండు, కర్ణుండు, భీమసేనుండు, ధనంజయుం డును, ధృష్టద్యుమ్నుండును గోపించిరే నీప్రజలకెల్లఁ వినాశము దుర్ని వారంబగును. నీవమర్షవశుండవై కౌరవులనెల్లఁ జంపికొనకుము. నీ కొఱకై యీపృథివియెల్ల వధంబొందుట మంచిదికాదు. మూఢ! నీవు భీష్మద్రోణాదివీరులు యుద్ధంబు గావింతురని యాశించియున్న వాఁడవు కాఁబోలు. నాయాశ యిపుడు నిరాశయే యగును. ఆత్మవేదు లగు వారికి రాజ్యంబు స్థానంబు ప్రీతియు నిరుపక్షంబులందును సమంబైయే యుండును. పాండవులందును నీయందునుగూడ వీరలు తుల్యాను రాగులై యున్నవారు. పాండవులందు మీయందుకంటె నధికంబుగ ధర్మంబుండుట వాస్తవము. రాజపిండాశనముకారణంబుగ వారలు నీకై యుద్ధంబొనరించి జీవితంబులు విడిచిన విడిచెదరుగాని యుధిష్ఠి రుని దేఱిపాఱచూడనైన నోపరు. ఏనరులకును లోభంబులవలన నర్థ సంపత్తిగలుగుట యెన్నండును గని విని యెఱుంగము. కావున నీవు లోభంబు విడిచి పాండవులతో సంధిగావింపుమని వచించె.

### దుర్యోధనాదులు కృష్ణుని బంధింపందలచుట

అట్లు గాంధారి పలికినవచనంబుల ననాదరించి సంరంభంబున దుర్యోధనుండు మరల సభవిడచి పాపచింతను లగుకర్ణాదు లున్నయెడ కరిగెను. అట్లరిగి దురాత్ముం డగుసుయోధనుండు మతాక్షుండు సౌబ లుండు నగుశకునితోఁ మంత్రంబుగావించెను. అపుడు దుశ్శాసనుండు దుర్యోధనునకును గర్ణునకు నిట్లనియె. రాజా! నీవు నీకామంబున బాం డవులతో సంధికావింపవేని కౌరవులెల్లరును నిన్ను బంధించి పాండు

పుత్రున కొసంగెదరు. వైకర్తనుం డగుకర్ణుని నిన్నును నన్నును మువ్వురను భీష్ముండును ద్రోణుండును నీజనకుండును బంధించి పాండవులకు యజ్ఞపశువులుగా నర్పింతురని వచించె. అట్లు దుశ్శాసనుండు పలికిన పలుకు లాలించి దుర్యోధనుండు క్రోధంబున బెద్దనిట్టూర్పు విడిచి వెడ నవ్వునవ్వుచు నేకాంతంబున మరల వారలతో నిట్లు ఆలోచనంబు గావించె. శ్రీప్రకారి యగు జనార్దనుండు ధృతరాష్ట్రునితోడను శాంతనవునితోడను గూడి మనలను దప్పక బంధించితీఱును. ఇంద్రుండు బలిని నిగ్రహించినట్లు మనమే ముందుగా బలాత్కరించి హృషీకేశుని నిగ్రహింతము. వార్ష్ణేయుండు నిగృహీతుం డయ్యెనని వినినంతన పాండవులు మతిచెడి కోఱలువెఱికినపాములంబోలి నిరుత్సాహులగుదురు. మహాబాహుం డగు నీజనార్దనుండే వారలకు సుఖసంధాతయు వర్మంబువోలె రక్షకుండునై యున్నవాఁడు. సర్వసాత్వతులకు శ్రేష్ఠుండగు నీతఁడు బద్ధుండయ్యెనేని పాండవులును సోమకులును నుద్యమంబువిడచి పాఱిపోవుదురు. కావున మనమిక్కడ ధృతరాష్ట్రుఁ డాక్రోశింప నీకేశవు నొక్కని బంధించి మిగిలినశాత్రవులనెల్ల ననాయాసంబుగ దలపడి పోరొనరింతుముగాక. యని దుర్యోధనదుశ్శాసనశకునికర్ణులు నల్వురు నితరుల కెఱుఁగరాకుండ నాలోచించిరి. పాపాత్ములు దుష్టచిత్తులు నగు నాదుర్యోధనాదులయభిప్రాయంబు కనియుఁ బరాభిప్రాయంబు లెఱుంగుటయందు మహాపండితుండు నగుసాత్యకి మిక్కిలి శీఘ్రంబుగ నింగితములవలన నెఱింగెను. కావున నాతం డావిషయంబునకై సభవిడచి వచ్చి హార్దిక్యునితోఁగూడ నాలోచించి కృతవర్మునితో వేగంబుగ సైన్యమును సమరసన్నాహంబు గావింపుము. నీవు సైన్యసన్నాహంబుగావించి నేను కృష్ణున కీవృత్తాంత మెఱింగించివచ్చునంతలో సభాద్వారంబుకడ సిద్ధంబుగనుండుమని వచించె. సింగంపుంగొదమ గిరిగుహాం బ్రవేశించు రీతి నాశైనేయుండు సభామందిరంబు ప్రవేశించి మహాత్ముండగు కేశవున కాదురాత్ములయభిప్రాయం బెఱింగించె. అనంతరము ధృతరాష్ట్రునకును విదురునకుఁగూడ నావార్త యెఱింగించెను. సాత్యకి యాసభవారికెల్ల వినంబడురీతి నిట్లనియె. ఆర్యులారా! వింటిరా యీవింతవార్త? మందులగుసుయోధనాదులు ధర్మార్థకామంబులకు దూరంబును సాధువిగర్హి

సుండవు, పాపభూయిష్ఠుండవును, క్షుద్రు లగుసహాయుల ననుసరించు వాఁడవును, పాపాత్ములతోఁ గూడినవాఁడవునై పాపం బగుకార్యంబు గావింప నెంచుచున్నవాఁడవు. నీవు తలంచినకార్యంబు దుష్కృత్యము నకీర్తికరంబు సజ్జనవిగర్హితంబునై యున్నది. కులపాంసకుం డగు నీవంటిమూఢుండే యిట్టికార్యంబు దలంచునుగాని యితరుం డెవ్వండును దలంపఁడు. అప్రధృష్యుండును, దురాసదుండును నగు నీపుండరీకాక్షుని పాపాత్ములగుసహాయులతోఁగూడి నీవు నిగ్రహింపఁదలంచితివంట! దేవేంద్రుండును దేవతలు నేకమైనను బలాత్కరింప శక్యముగాని వానిని నీవు బలాత్కరింపందలంచుట బాలుండు చంద్రు నందుకొనఁ జేతులుచాచినట్లు పరిహాసపాత్రంబై యున్నది. దేవతలు, మనుజులు, గంధర్వులు, రాక్షసులు, యక్షులు నొక్కటయ్యును వాసుదేవుని సమరంబున సహింపంజాలరు. అట్టి కేశవుని నీవు బాగుగ నెఱుంగఁజాలకున్నాఁడవు. వాయువును చేతితోఁ గ్రహింపఁ దరంబుగాదు. చంద్రుని గరతలంబున స్వీకరింప శక్యంబుగాదు. భూమి శిరంబున వహింప వశంబుగాదు. కేశవుని బలాత్కారంబున గ్రహింప సాధ్యంబుగాదు. అని ధృతరాష్ట్రుండు పలికినపిదప విదురుండును దుర్యోధనున కిట్లనియె. దుర్యోధనా! నీకు హితం బాపాదించు నావాక్యం బాలింపుము. తొల్లి సౌభద్వారంబున ద్వివిదుం డనువానరుం డీకేశవు నెదిరించి శిలావర్షంబున నీకేశవుని ముంచెత్తెను. వాఁడు పరాక్రమంబున నెట్లయిన నీతని గ్రహింపవలయునని యత్నించెనేకాని తుదకేమియుం జేయంజాలక తాన వినాశమొందె. అట్టివానిని నీవు నిగ్రహింపదలంచుట వివేకమగునా? ప్రాగ్జ్యోతిషంబున నరకుం డెల్లదానవులతోఁగూడి యీతని నెదిర్చి నశించె. అట్టివానిని నీవు బంధింపంగలవా? అనేకయుగవర్షాయువుగల యీదామోదరుండు నరకుని నిగ్రహించి వానివశంబున నున్న వేలకొలఁదికన్యల గొనివచ్చి పరిణయంబయ్యె. నిర్మోచనంబున నాఱువేలదానవులను బాశంబులచే బంధించి వధించిన యీతని నీవు బలంబున వశంబు గావింపం జూచుచున్నాఁడవు. ఈతండు శిశువై యున్నయెడఁ బూతన యనుమహారాక్షసిని బరిమార్చె. గోవుల రక్షించుటకై బాలుం డగు నీతండు గోవర్ధనపర్వతంబు గొడుగువలె నెత్తి మోసెను. అరిష్టుండు, ధేనుకుండు, మహాబలుం డగు చాణూరుండు నీతనిచే బాల్యంబున

వధింపంబడిరి. అరిష్టం బాచరించు నశ్వరాజంబును గంసుండు నీతనిచే మడిసిరి. మఱియు జరాసంధుండును, దంతవక్త్రుండును, వీర్యవంతుం డగుశిశుపాలుండును,సహస్రబాహుసంపన్నుం డగుబాణుండును నింకను బెక్కురుగాజులు నీతనిచే సమరంబున నిహతులైరి. వరుణుండును, పావకుండును, బురందరుండునుగూడి పారిజాతంబుహరించు నీతని నెదిరించి నిర్జితులైరి. ఏకార్ణవంబున నిద్రించునపు డీతండు మధుకైటభుల సంహరించె. జన్మాంతరంబునొంది హయగ్రీవుండును వధింపంబడియె. ఈతం డెల్ల కార్యంబులకుఁ గర్తకాని క్రియమాణుండు గాఁడు. పౌరుషంబున నీతండు కారణంబై యుండు. ఈతం డేయేకార్యంబులు గావింపం దలంచు వానినెల్ల యత్నంబు లేకయ యనాయాసంబునం జేయును. ఘోరవిక్రముండు, నచ్యుతుండు నగుగోవిందుని నీవెఱుంగంజాల కున్నాఁడవు. తేజోరాశియు, ననిందుతుండు నగునీతనిని గోపించినకోడె త్రాచునుంబోలె బ్రధర్షింపందలంచి యగ్నింబడుమిడుతలవలె నీవు నీ మంత్రులును వినాశంబొందెదరని వచించెను.

విశ్వరూపసందర్శనము

విదురుం డిట్లు వచించినయనంతరం బాదుర్యోధను నాలోకించి మాధవుం డిట్లనియె. నేనిక్కడ నొంటిపాటున నున్నాఁడ ననునజ్ఞానంబున నన్ను బరిభవించి బంధింపందలంచుచున్నాఁడవు కాఁబోలును. ఇక్కడన నాసమీపమంద సకలం బగుపాండవసైన్యంబును, నంధకవీరులును, వృష్ణియోధులును, నాదిత్యులు, రుద్రులు, వసువులు, ఋషులునుగూడ నున్నవారని పలికి పరవీరహంత యగు నాతం డట్టహాసంబుగావించె. అంత నాతనిశరీరమునం దెల్లెడల నంగుష్ఠమాత్రశరీరులై యెల్లరు విద్యుద్రూపంబులతో నగ్నిజ్వాలలంగ్రక్కుచుఁ బ్రకాశించిరి. ఆతని లలాటంబునఁ జతురాననుండును, వక్షస్థలంబున నేకాదశరుద్రులును, భుజంబులందు నింద్రాదిలోకపాలకులను, ముఖంబున నగ్నియు జనించిరి. మఱియు నాతనిబాహుద్వయంబువలన నాదిత్యులు, సాధ్యులు, వసువులు, నశ్వినీదేవతలు, మరుత్తులు, నింద్రుండు, విశ్వేదేవులు, ఏకరూపంబుగలగంధర్వయక్షరాక్షసప్రముఖులును బ్రాదుర్భవించిరి. మఱియు సంకర్షణుండును, ధనంజయుండును నవతరించిరి. దక్షిణబాహువునందు

గాండీవముధరించిన ధనంజయుండును, వామబాహువునందు హలము సలంబులందాల్చిన బలరాముండును జనించిరి. పృష్ఠభాగంబున యుధిష్ఠిరుండును, వృకోదరుండును, నకులసహదేవులు నుద్భవించిరి. అంధకులును ప్రద్యుమ్నప్రముఖులగు వృష్ణివీరులును, మహాయుధంబుల ధరించి కృష్ణుని పురోభాగంబునం దవతరించిరి. మఱియు శంఖంబు, చక్రంబు, గద, ఖడ్గంబు, శార్ఙ్గంబు, లాగలంబు లుద్యతంబులై యాతనికరంబులం జూపట్టె. ఆతండు సహస్రబాహుండై చూపట్టె. ఆతనిబాహువు లన్నింటియందును నానావిధాయుధంబు లుద్యతంబులై యుండె. వాసుదేవు నేత్రంబులవలన, నాసికవలన, శ్రవణంబులవలన నెల్లెడల మహారౌద్రంబులు, సధూమంబులు నగు పావకజ్వాల లెగసె. రోమకూపంబులవలన మంట లెగయుచుండ సహస్రకిరణుం డగుభానుండుంబోలె వాసుదేవుండు వెలింగె. కృష్ణుండు, సహస్రపాదుండు, శతబాహుండు, సహస్రనేత్రుండు నై ప్రకాశించె. ఆతనిగుల్ఫంబుల కధోభాగంబున నాగలోకంబును, మధ్యభాగంబున మర్త్యలోకంబును నూర్ధ్వభాగంబున స్వర్గలోకంబు నగపడియె. ఆతనినేత్రంబులందుఁ జంద్రసూర్యులును, శిరోజములందు గ్రహతారకానికరంబును సుస్థిరంబులై యుండె. మహానదులును, సాగరంబులు నాతనిస్వేదరూపంబునం బొడచూపె. ఆతని యెమ్ముకలందుఁ బర్వతంబులును, లోమంబులందుఁ దరులతాపుంజంబులును, నిమేషోన్మేషంబులందు రాత్రిందివములును, జిహ్వాయందు సరస్వతియు నగపడియె. మహాత్ముం డగు కేశవుని యాఘోరరూపం బాలోకించి యచ్చటనున్న రాజలోకంబెల్ల భయాకులంబై కన్నులు మూసికొనియె. ద్రోణునకు, భీష్మునకు, విదురునకును, సంజయునకు, మహర్షులకు నాసమయంబున జనార్దనుండు దివ్యం బగుదృష్టి ననుగ్రహించుటం జేసి వార లాదేవదేవుని దివ్యరూపం బాశ్చర్యంబున నాలోకించుచుండిరి. ఆకలకలం బాలించి యాంబికేయుం డిదియేమని ప్రశ్నింపఁ గృష్ణుం డాతనికిని దివ్యనేత్రంబు లొసంగెను. లబ్ధదృష్టి యగుధృతరాష్ట్రుం డమృతముం గాంచినపిపాసితుండువోలె నత్యాశతోఁ గేశవునిరూపం బాలోకించుచుండె. ఆసమయంబున నాకసంబున దివ్యదుందుభులుమ్రోగె. పుష్పవర్షంబులు గురిసె. గంధర్వులు, యక్షులు,

కిన్నరులు మహోరగులు మునులు లోకపాలురు నెల్లదేవతలును వాసుదేవునకు సాష్టాంగప్రణామంబు లాచరించి యంజలిబంధంబులు శిరంబుల ఘటించి యిట్లని స్తుతించిరి. ప్రభూ! నీక్రోధంబు సంహరింపుము. సంహరింపుము. ఆత్మసంస్థితంబగు నీరూపంబునుగూడ నుపసంహరింపుము. నీవిట్లు క్షణకాలం బుగ్రరూపంబున నుంటివేని లోకంబులు లోకపాలకులు దేవగణంబులు నెల్లరును భయంబున వినశింతురు. నీవ యీలోకంబులకెల్లఁ గర్తవు హర్తవు రక్షకుండవు నైయున్నవాఁడవు. స్థావరజంగమాత్మకంబగు నీజగంబెల్ల నీచే వ్యాప్తంబైయుండె. రాజులన నీకడ నేపాటివారు? వారిబల మేపాటిది? వారిపరాక్రమం బన నెంత? వారలవిషయంబున నిట్టిదివ్యరూపంబు ప్రదర్శించితివి. అప్రమేయంబు ననాధృష్యంబు నగునీరూపం బింక నుపసంహరింపుమని దేవతలెల్లరును బ్రస్తుతించిరి.

అప్పుడు ధృతరాష్ట్రుండు కేశవా! పుండరీకాక్షుండవగు నీవ యీ జగంబునకెల్ల హితుండవు. కావున నీవ నాకును బ్రసన్నుండవు కాఁదగును. భగవంతుండా! నాకు నీవు కృపచేసిన యీదివ్యనేత్రంబులను మరల నీవే తీసికొనుము. నాకివి యక్కఱలేదు. ఏలయందువా? మహాభాగ్యవంతంబులై నిన్నుఁ జూచిన నయనంబులతో నితరనీచవస్తువులను గాని మనుజులనుగాని యాలోకింపంజాలను కావున వీని నంతర్హితంబులు గావింపుమనుటయు నాజనార్దనుం డాతని నేత్రంబులను బూర్వరీతి నుండునట్లు గావించెను. ఆసభయందు ధృతరాష్ట్రుండు వాసుదేవుని యనుగ్రహంబున దివ్యనేత్రంబు లొందుట నాలోకించి రాజులు మునులు నెల్లరును మధుసూదనుని నుతించిరి. ఆసమయంబున నీభూమియెల్ల గడగడవడంకె. సాగరంబులు సంక్షోభంబునొందె. అయ్యెడంగూడియున్న రాజలోకంబెల్లఁ బరమాశ్చర్యంబునొందె. అనంతరం బాపురుషోత్తముండు తనదివ్యరూపం బుపసంహరించి తొల్లింటిచందంబున మానుషశరీరంబొంది పిదప సాత్యకిని విదురునిఁ జెఱియొకకేలంబట్టుకొని ఋషులచే నభ్యనుజ్ఞాతుండై బయలుదేఱెను. నారదాదిమహర్షులెల్లరు నంతర్ధానంబందిరి. ఆసమయంబున కోలాహలం బద్భుతంబయ్యె. వాసుదేవుండు బయలుదేఱినంతన గౌరవులు నెల్లరాజులును, శతక్రతుని

చేవతలుంబోలె నమ్మధుసూదను ననుగమించిరి. వెంటఁజనుదెంచు రాజలోకంబులనెల్ల నాలోచింపకయు కోపావిష్టుండై పొగలెగయు ననలంబువోలె మాధవుండు సభామందిరంబు నిష్క్రమించుటయు దారుకుండు దివ్యాశ్వయుక్తం బగురథంబుతో ద్వారంబుకడ నగపడియె. మఱియు నుచితంబు లగురథంబు లధిరోహించి కృతవర్మయు నగపడెను. కృష్ణుండు రథం బారోహించినంతన ధృతరాష్ట్రుండు మరలఁ గృష్ణున కిట్లనియె. మాధవా! నాతనయులయెడ నాకెంతబలముకలదో నీకుఁ బ్రత్యక్షంబుగనే తెలిసినదికదా? నీకుఁ బరోక్షంబగున దేదియునులేదు. కౌరవులకు శాంతివాంఛించుచు దానికై యత్నించు నాప్రయత్నంబులు నభిప్రాయంబులు నన్నియు నీవెఱింగినయవికదా? కావున నావిషయంబున నన్ను శంకింపవలదు. కేశవా! పాండవులయెడ నాకెన్నఁడును బాపంబగు నాలోచనంబులేదు. నేను సుయోధనునకుఁ జెప్పినహితవచనంబులన్నియు నీవాలంచియేయుంటివి. మఱియు నీకౌరవులెల్లరును రాజులెల్లరును నేను నుడివినవాక్యంబు లెఱింగియుండిరి. నేనెల్లవిధంబుల శమంబునకే ప్రయత్నించుచున్నాఁడనని యెఱుంగుమని వచించె. ఆమాటలాకర్ణించి జనార్దనుండు ధృతరాష్ట్రుని ద్రోణుని శాంతనవుని విదురుని బాహ్లికునిఁ గృపునిసుద్దేశించి యిట్లనియె. మహాత్ములారా! ఇప్పుడే కౌరవసభయందు జరిగినవృత్తాంతమెల్ల మీరు కన్నులార గాంచియుంటిరికదా? మందుం డగుసుయోధనుండు రోషపరవశుండై యశిష్టుండువోలె నెట్లు సభవిడిచి పోయినవాఁడో మీరెల్లరు నాలోకించియుంటిరి. మహీపతియగు ధృతరాష్ట్రుండు దనకు శక్తిలేదని వచించుచున్నవాఁడు. నేను వచ్చినపని యింతతోఁదీఱినది. నేనింక యుధిష్ఠిరునికడ కరిగెదను. మీరెల్లరు నాకనుజ్ఞయిండని వచించె. రథారూఢుండై వెడలుచున్న యదుప్రవీరుని భారతులెల్ల ననుగమించిరి. భీష్ముండును ద్రోణుండును గృపుండును విదురుండును ధృతరాష్ట్రుండును బాహ్లికుండును అశ్వత్థాముండును యుయుత్సుండును గృష్ణుని వీడ్కొని తమతమగృహంబుల కరిగిరి. జనార్దనుండును గౌరవులెల్ల నాలోకింపుచుండ మహారథంబు నారోహించి తనతండ్రికిఁ జెలియ లగుకుంతీదేవి నాలోకింప నామెమందిరమున కరిగె.

కుంతి యుధిష్ఠిరునకు సందేశమంపుట

జనార్దనుండు కుంతీదేవికడ కేఁగి యామెకు నమస్కారం బాచరించి కౌరవసభం జరగినవృత్తాంత మెల్ల నామె కెఱింగించెను. దేవీ! నేను గౌరవులసభయందు వంచన లేకుండ గ్రహణీయంబు హేతుమంతంబునగు వాక్యంబు ననేకవిధంబుల వచించితిని. ఋషులును నేనుగూడఁ జెప్పవలసినమాటలెల్లఁ జెప్పితిమి. అయినను ధార్తరాష్ట్రుండు మా మాటలు గ్రహించినవాఁడుగాఁడు. సుయోధనునకు వశంవదమైయున్న యీరాజబృంద మెల్లఁ గాలంబునఁ బరిపాకంబొందియున్నది. ఇదియెల్ల నొక్కక్షణమాత్రంబునఁ బార్థుండను ననలంబుచే దహింపంబడును. కాఁగలది యేదియో కాకమానదుకదా? నేను సత్వరంబుగ పాండవుల కడ కరుగవలయును, నా కనుజ్ఞ నిమ్ము. నీవచనంబులుగ నేను బాండవులకుఁ జెప్పఁదగునర్థం బేదేనున్న నానతిమ్ము. నీవాక్యంబులు నేను నాలోకింతును. అని పలుకుటయు నాయమ వాసుదేవున కిట్లనియె. కేశవా! ధర్మాత్ముండగుయుధిష్ఠిరునితో నామాటలుగా నిట్లు వచింపుము. వత్సా! మహాసంపన్నంబగు నీధర్మంబెల్ల హానిపొందుచున్నయది. దుర్లభంబగుధర్మంబు వ్యర్థంబుగఁ బోనీకుము. అర్థజ్ఞానశూన్యుండగు శ్రోత్రియునిబుద్ధి వేదాక్షరోచ్చారణమాత్రంబున నెట్లు ధర్మంబుమాత్ర మాలోచించునో యట్లే నీబుద్ధియుఁ గేవలధర్మంబునుమాత్ర మభిలషించుచున్నయది. వత్సా! బ్రహ్మదేవునిబాహువులవలన జనించినక్షత్రియులకు బాహుబలంబున జీవించుట విధివిహితంబగుధర్మంబని నీవు బాగుగ నెఱుంగుదువు. క్షత్రియులు ప్రజలఁబాలించుటకై క్రూరంబగు కర్మం బాచరించుట విధిచోదితం బగుధర్మంబు. ఈవిషయంబున నొక్క యుపమానంబు నేను దొల్లి పెద్దలవలన విన్నదాని నాలింపుము. తొల్లి వైశ్రవణుండు మిగులఁ బ్రీతుండై ముచుకుందుం డనురాజర్షి కీపృథ్వీమండలంబెల్ల నొసంగెను. ఆరాజన్యుండుమాత్రము దానిని గ్రహింపక దేవా! నాబాహువీర్యార్జితం బగుసిరినే యనుభవింపఁగోరెదనుగాని యితరులు దయచే నొసంగినసిరి నొల్లనని వచించె. ఆమాట లాలించి వైశ్రవణుండు మిక్కిలి నాశ్చర్యపరవశుండయ్యె. ముచుకుందుండును క్షత్రధర్మంబు ననుసరించి బాహువీర్యంబున భూమి నార్జించి మహా

శ్వర్య మనుభవించె. తమ కేబాధలు లేకుండ రాజుచే సురక్షితు లగు ప్రజ లేయేధర్మంబు లాచరించినను వానియందు నాల్గవపాలు రక్షకుం డగురాజునకు లభించును. రాజుకూడఁ బ్రజాపాలనం బేమరక యాచరించుచు ధర్మం బాచరించునే నాతండు దేవత్వముం బడయును. ఆరాజు అధర్మంబాచరించునేని నరకంబొందును. ఉచితజ్ఞుండగు రాజుచే యథోచితంబుగఁ బ్రయోగింపంబడుదండనీతి చాతుర్వర్ణ్యంబును స్వధర్మములందు నియోగించును. అధర్మంబును దూరీకరించును. రాజు సర్వవిధంబుల నెప్పుడు దండనీతియందుఁ బ్రవర్తించునపుడు కృతయుగంబను శ్రేష్ఠం బగుకాలంబు ప్రవర్తించును. కాలంబు రాజునకుఁ గారణమా! రాజన్యుండు కాలంబునకుఁ గారణమా యని నీవు సంశయింపం బనిలేదు. రాజు కాలంబునకుఁ గారణంబని సత్యంబుగ నమ్ముము. కృతయుగంబునకును త్రేతాయుగంబునకును ద్వాపరంబునకును నాల్గవది యగుకలియుగంబునకును రాజే కారణంబై సృజించువాఁడై యున్నవాఁడు. కృతయుగంబు గావించుటవలన రాజు స్వర్గంబు నత్యంతము ననుభవించును. త్రేతాయుగంబు నిర్మించుటవలన నంతగా నాతండు స్వర్గం బనుభవింపంజాలఁడు. ద్వాపరంబు ప్రవర్తింపంజేయుటవలన గొంతభాగంబుమాత్రము స్వర్గమనుభవించును. కలియుగంబు ప్రవర్తింపంజేయుటచే రాజు నరకంబు నంతంబు లేకుండ ననుభవించును. ఆరాజు దుష్కర్మంబులదుఃఖంబు లనుభవించుచు ననేకసంవత్సరంబులు నరకంబున నివసించును. రాజుదోషంబు జగంబునకును జగత్తుగావించిన దోషంబు రాజునకును సంక్రమించుచుండును. నీ వేవ్యాపారంబున నివసింపందలంచితివో యది రాజర్షుల కుచితంబగువృత్తంబు గానేరదు. వైకల్యంబునొంది యానృశంస్యంబునందు బద్ధాదరుం డగు నరపాలుండు ప్రజాపాలనసంభూతం బగుఫలం బిసుమంతయే ననుభవింపంజాలఁడు. నీ విపు డేబుద్ధిచే జరించుచున్నాఁడవో యాబుద్ధితో జరింపుమని నేను గాని నీజనకుండు పాండునరపాలుండుగాని పితామహుండగు శాంతనవుండుగాని నిన్ను దీవింపలేదు. నీకు నిత్యంబును యజ్ఞంబు, దానంబు, తపంబు, శౌర్యంబు, ప్రజ్ఞ, సంతానము, మాహాత్మ్యము, బలము, ఓజస్సును గలుగవలయునని నేను దీవించుచుండును. మనుజులును దేవతలును నిత్యంబు నారాధింపంబడినవారై యీలోకమందు సుఖకరంబు లగు దీర్ఘాయుష్యము

ధనము పుత్రులు మొదలగుసంపదలను బరలోకశుభకరంబు లగుస్వా హాస్వధాదులను ననుగ్రహింతురు. పితరులును దైవతంబులును పుత్రులకు నిత్యంబు దానంబు నధ్యయనంబును యజ్ఞంబును బ్రజాపరిపాలనంబు నాశాసింతురు. నావాక్యం బధర్మ్యంబైనను ధర్మ్యంబైనను స్వభావంబువలనన యొఱుంగుదువుగదా? అని ధర్మనందనునకుఁ జెప్పి మనిపలికి మఱియుఁ గృష్ణున కిట్లనియె. కేశవా! పాండవులు విద్యావినీతులును సత్కులప్రసూతులు నైయున్నను వృత్తిలేమింజేసి బీడింపఁబడియున్నవారు. దానపతియు శూరుండు నగునరనాథుని క్షుధాతురులు సమీపించి యాతనిచేఁ దృప్తిగాంచుటకంటెను నధికతరం బగుధర్మం బీ లోకంబున నేదేనికలదా? ధార్మికుండు రాజ్యంబుపొంది కొందఱను దానంబునను గొందఱను బలంబునను గొందఱ సూనృతవాక్యంబులను వశంబుగావించుకొనుట యుత్తమక్షత్రియలక్షణంబు. బ్రాహ్మణుండు భిక్షాచరణంబును రాజన్యుండు ప్రజాపరిపాలనంబును వైశ్యుండు వాణిజ్యంబున ధనార్జనంబును శూద్రుం డగ్రవర్ణంబులు మూఁటికిఁ బరిచర్యగావించుటయును స్వధర్మములుగా నాచరింపవలయును. అని పలికి మరల ధర్మనందనున కిట్లు దెలుపు మని వచించె. వత్సా! నీవుత్తమక్షత్రియవంశజాతుండవగుట నీకు భిక్షాచరణంబును గృష్యాదివైశ్యవ్యాపారంబులును నిషిద్ధంబులయ్యె. నీవు క్షతంబువలన త్రాణంబుగావించు క్షత్రియుండవై జనించితివి. బాహువీర్యంబువలన జీవించుటయే నీకుత్తమధర్మంబు. నీతండ్రిపా లగురాజ్యభాగంబు క్లేశనిర్మగ్నంబై యున్నది. దానిని నీవు మరల నుద్ధరింపుము. సామంబునంగాని భేదంబునంగాని దానంబునంగాని దండంబునంగాని యేయుపాయంబుననేని నీతి మెఱయ నీతండ్రిపాలు నీవు వశముగావించుకొనుట యుత్తమంబు. నీవంటి యుత్తమపురుషునిఁ గొడుకుగాఁబడసియు నేను దీనురాలుంబోలెఁ బరపిండ మపేక్షించుటకంటెను దుఃఖతరం బేమి కలదు? నీవు రాజధర్మంబును బురస్కరించుకొని పోరుము. నీపితామహులు నరకంబున ముంపకుము. నీవు తమ్ములతోఁగూడ పుణ్యంబెల్ల గోల్పోయి పాపభూయిష్ఠం బగుగతి నొందకుము.

## విదులోపాఖ్యానము.

అని వచించి మఱియు నిట్లు పలికె. ఈవిషయంబున సనాతనంబును విదులకు నామె తనయునకును జరిగినసంవాదం బనునితిహాసంబు నుదాహరింతురు. ఆయితిహాసం బాలించిన నధికం బగుశ్రేయంబు చేకూరును. తొల్లి సత్కులప్రసూతయై దైన్యం బనుభవించుచు క్షత్రధర్మరతయు దాంతయు నగువిదుల యనునొకరాజవనిత కలదు. ఆమె తన దైన్యంబున నత్యంతకుపితురాలయ్యెను. రాజసభలందెల్ల నామె బహుప్రఖ్యాతివడసినది. ఆమెవాక్యంబు లెల్లరు ననుక్షణమునను స్మరింతురు. బహుశాస్త్రాధ్యయనమున నామె మిగులం బ్రసిద్ధినొందె. ఒకానొకసమయంబున సింధురాజుచేఁ బరాజయమంది దీనచేతనుండై పండుకొనియున్న తనపుత్రుని నాయుత్తమరాజన్య యిట్లు గర్హించె. ఓరీ నీవు నాకుఁ దనయుండవు గావు. నిన్ను నేనుగాని నీజనకుండుగాని కాంచియున్నవారముగాము. నీ వెక్కడనుండియో మాయింటికి దిక్కులేక వచ్చితివి. నీవు మన్యురహితుండవు. నిన్ను పురుషులలో గణింపందగదు. క్లీబసాధనుండవు. బ్రతికియున్నంతకాలము నిరాశుండవైతివి. కల్యాణంబు ప్రాపించుభారంబు వహింపుము. నీ వెప్పుడు నాత్మావమానము గావించికొనకుము. అల్పంబుచే నీయాత్మభరణంబు గావింపకుము. కల్యాణంబగుమనంబు గ్రహించి భయంబువీడి శాత్రవుల సంహరింపుము. కాపురుషుఁడా! లెమ్ము. ఇట్లు పరాజితుండవై పండుకొనకుము. అమిత్రులకానందమును బంధువులకు శోకంబును గూర్చుచు నిర్మనస్కుండవై యిట్లుండకుము. అల్పనది స్వల్పజలంబుననే నిండును. పిడికిలిపట్టిన యంజలి స్వల్పద్రవ్యంబుననే నిండును. కాపురుషుం డల్పంబుననే సంతోషించును. నీవు పాముకోఱ వెఱికితివైనను శీఘ్రంబుగ మృతినొందుము. కాదేని జీవితంబునం దాశయేని వదలి పరాక్రమించి శత్రువుల జయింపుము. శ్యేనంబు బలాబలంబు లాలోచింపకయే తనశాత్రవుల నెట్లు వధించునట్లే నీవును శాత్రవుల ఛిద్రంబు లెఱింగి పరాక్రమించి వధింపుము. నీవు పిడుగడిచిచచ్చినవానివలె నిట్లూరక పడియుండు వేల? కాపురుషా! లెమ్ము లెమ్ము. శత్రునిర్జితుండవై యిట్లు నిద్రింపకుము. నీవు కృపణుండవై నాశ మొందకుము. నీకర్మంబునఁ బ్రఖ్యాతిగాంచుము.

నీవు మధ్యంబునగాని వెనుకనుగాని క్రిందనుగాని నిలిచియుండకుము. అందఱకు నగ్రభాగంబున గర్జించుచు సింగంపుఁగొదమవోలె విలసిల్లుము. జ్వాలారహితంబై పొగయునుముక నిప్పువలె పొగయుచు జీవింపకుము. జ్వాలాభీలంబగుజీవితం బొక్కక్షణంబేని శ్రేయంబు. చిరకాలంబైనను ధూమాయితం బగుజీవితంబు వలదు. ఎవఁ డేనొక్కరాజు నింటఁబుట్టిన గాడిదవలె మృదుండవై యేపనియుం గావింపక యూరకుండకుము. మనుష్యులు గావింపఁదగినకర్మంబెల్లఁ గావించి యుద్ధం బొనరించి యుత్తమం బగుకీర్తిఁబొందెనేని ధర్మంబునకు ఋణపడియుండ నక్కఱలేదు. ఆత్మగర్హణంబుకూడ నక్కఱలేదు. జయంబు లభించినను లభింపకున్నను బండితుఁడు శోకింపఁడు. ఎప్పుడును ననంతరకార్యంబులఁ గాంచుచునే యుండును. ప్రాణంబులే ధనంబుగ నాతఁ డెన్నండు నెంచఁడు. నీవు నీవీర్యంబు భావించి విక్రమింపనైన విక్రమింపుము. లేదేని యెల్లప్రాణులకును నియతంబగు మరణంబునేని బొందుము. ఓరీ! నీవు ధర్మం బిట్లెదుర నుంచికొనికూడ నేకార్యంబునకై జీవింపఁదలంచుచున్నవాఁడవు? క్లీబ! నీయిష్టాపూర్తంబులు కీర్తియు సమస్తంబు వినాశంబొందె. నీభోగమూలంబెల్ల విచ్ఛిన్నంబైన నింకను నీవెందులకు జీవింపఁదలంచుచున్నాఁడవు? నిమజ్జితుండైనను బ్రపతితుండైనను శాత్రవునిజంఘఁబట్టుకొని విడువరాదు. పాతంబొందినవానితోడన తానును బాతంబొందవలయు. లేచెనేని వానితోడన తానును లేచి నిలువవలయును. మూలంబు పరిచ్ఛిన్నంబైన నెప్పుడును విషాదం బొందరాదు. గొప్పజాతిగుఱ్ఱంబువోలె నుద్యమించి ధురము వహింపఁదగును. నీవు సత్త్వంబును మానంబు నాలంబింపుము. నీపౌరుషంబు నీ వెఱుంగుము. నీవునిమిత్తంబుగ నీకులమెల్ల నకీర్తిమగ్నంబయ్యెనని యెఱుంగుము. ఎవ్వనియొక్కచైదంబు లద్భుతంబుగ మానవులు పొగడరో వాని జన్మంబు మనుష్యరాశి పెంపొందుటకుమాత్ర ముపయోగించును. వాఁడు స్త్రీయనికాని పురుషుండనికాని గణింపఁదగఁడు. దానంబున దపంబున సత్యంబున విద్యయందు నర్థలాభమందు నెవ్వనియశంబు కీర్తింపఁబడదో వాఁడు తల్లియొక్క మలప్రాయంబు వాఁడేకాని పుత్త్రుండు కాఁజాలఁడు. శ్రుతంబునను దపంబునను సిరిచేతను విక్రమంబునను నితరజనుల నెవ్వఁడు మీఱియుండునో వాఁడే పురుషుం డనంబడును.

నీవు నీచంబగు కాపాలవృత్తి నాలంబింపరాదు. భిక్షాచరణంబు నృశం స్యంబు నకీర్తి కాలవాలంబు నగునని. దుఃఖం బగుదీనిని గాపురుషులు మాత్ర మాలంబింతురు. శాత్రవుల కానందము గల్పించుచుఁ గృశుండై లోకంబువలన దిరస్కారంబొందుచు నాసనంబులు వసనంబులు లేక యుండువాఁడును స్వల్పంబు లభించినను దానితోడనే మహాలాభంబు గలిగినట్లు సంతసించువాఁడును హీనుండు నల్పజీవనుండు నల్పుండు నగు బంధువునుబొంది బంధువు లెట్లు సుఖింపంగల్గుదురు? మేము భోజనంబు లేక నశింతుము. రాష్ట్రంబు వదలి ప్రవాసంబులకేని యేఁగెదము. సర్వ కామంబులు మాకు భ్రష్టంబులైనవి. మేము స్థానభ్రంశం బొందితిమి. దరిద్రులమైతిమి. సజ్జనులయెడ నవల్గుకారియు కులవంశనాశనుండు నగు కలిని బుత్రుం డనుమిషచే నేను గంటిని. అమర్షశూన్యుండు నిరుత్సా హుండు నిర్వీర్యుండు శత్రుసంతోషప్రదుండు నగునీయట్టితనయు నేయాఁడుదియుఁగనకుండుఁగాక. నీవు కేవలముధూమాయమానుండవు కాకుము. విశేషంబుగఁ బ్రజ్వలింపుము. పరాక్రమించి శాత్రవుల వధిం పుము. క్షణంబుగాని ముహూర్తంబుగాని శాత్రవులశిరంబులందు వెలుం గుము. అమర్షవంతుండు నక్షముండైనంతమాత్రముననే పురుషుండనం బరఁగును. క్షమావంతుండు నమర్షశూన్యుండు నగునేని వాఁడు స్త్రీ యనికాని పురుషుండనికాని చెప్పంబడఁడు. సంతోషంబు ననుక్రోశం బును సిరి నపహరించును. నిరీహుం డనుత్థానంబును భయంబునుం బొందును. వాఁడెన్నండు నధికఫలంబు లనుభవింపంజాలఁడు. నికృతి పాపంబులగు నీదోషంబుల వీడుము. హృదయం బాయసంబువోలెఁ గఠినంబుగావించి స్వకీయం బగుపౌరుషంబు నన్వేషింపుము. శాత్రవుల సహింపకుండుటచే పురుషుం డనునామం బన్వర్థంబయ్యె. ఎవ్వాఁడు స్త్రీవలె జీవించునో వాఁడు వ్యర్థనాముం డనంబడును. శూరుండు నూర్జితసత్త్వుండు సింహపరాక్రమచరణుండును నగువాఁడు మరణంబు నొందినను బ్రజలు సంతసింతురు. ఎవ్వాఁడు తనప్రియసుఖంబుల వర్జించి సిరికై ప్రయత్నించునో వాఁ డచిరకాలంబునన యమాత్యుల కానంద మాపాదించునని పలికెను. అదివిని యామెతనయుండు 'జననీ! నేను నీకగపడకుండ నశించినపు డీ పృథివియెల్ల వశమైనను నీకేమి లాభము?

నేనులేనిచే నీకాభరణంబులేల ? భోగంబులేమిపనికి? జీవితంబున నేని ప్రయోజనంబేమి?' యని యడిగెను.

అది యాలించి విదుల మరల నిట్లని చెప్పందొడంగెను. తండ్రీ! పరులచే విహీనుండుగాఁ గావింపఁబడినవాఁడు జీవించినను బ్రయోజనం బేమి? మన్యురహితుల కగులోకంబులు నీశాత్రవులకు లభించుఁగాక. ఆత్మపౌరుషంబు నారాధించువారిలోకంబులు మనమిత్రులకు లభించుఁగాక. భృత్యులచే హీనంబుగఁ జూడంబడుచుఁ బరులు దయచే నొసంగు పిండంబు భుజించుచుఁ గృపణులై సత్వహీనులై యుండువారలవృత్తి నీ వెన్నఁడు నాలంబింపకుము. పర్జన్యు ననుసరించి భూతంబులును, శతక్రతు ననుసరించి దేవతలును జీవించుచందంబున స్నేహితులును, బ్రాహ్మణులును నిన్ననుసరించి జీవింతురుగాక. సంజయా! బాగుగఫలించిన మహావృక్షంబువలనఁ బక్షులు జీవించువడువున సర్వభూతంబులు నెవ్వని వలన జీవనంబునొందు నాపురుషుని జీవితంబు సార్థకంబయినది. పురందరునివిక్రమంబువలన వేల్పు లెట్లానందించుచు సుఖంబు గందురో యట్లు బాంధవులెల్లరు నెవ్వనిపరాక్రమంబులచే వృద్ధినొందెద రట్టివానిజీవితంబు ఫలవంతమగునది. ఎవ్వఁడు తనబాహుబలం బాశ్రయించి జీవించునో వాఁ డీలోకంబునం గీర్తియుఁ బరలోకంబున ననంతంబు లగు సుఖంబులును గాంచును.

అని పలికి విదుల తనతనయుం డగు సంజయునకు మఱల నిట్లని హితోపదేశంబు సేయందొడంగె. వత్సా! ఇట్టియవస్థయందు నీవు పౌరుషంబువీడన తలంచితివేని త్వరలోనే హీనపురుషసేవితం బగు మార్గంబు నొందఁగలవు. ఎవ్వఁడు శక్తివంచన కావింపకుండఁ బరాక్రమంబువలనఁ దేజంబు బ్రకటింపకుండునట్టి ప్రాణంబులయెడఁ దీపికలక్షత్రియుఁ నిఁజోరుం డని యెల్లరు నపహాసింతురు. మరణం బాసన్నం బగువానికౌషధము హితంబు కానియట్లు అర్థవంతంబులు గుణవంతంబులు యుక్తియుక్తంబులు నగువాక్యంబులు నీకు రుచింపవు. సింధునరపాలునిజనంబు లంతగా సంతోషము లేకుండ నున్నవారు. వారు వ్యసనపరంపరలకు వశులై దుర్బలులై యున్నవారు. నీ వీసమయంబున నుత్సాహంబు మెఱసి సహాయసంపత్తినిఁ జేకూర్చుకొంటివే నితరులును రాజునందువిముఖులై నీపౌరుషం బాలోకించి నీకు సహాయంబు గావింతురు. అట్టివారలతోఁ

గూడి దుర్గమంబు లగు గిరిదుర్గంబులందు వసించి వానికి వ్యసనంబు ప్రాప్తించుకాలంబు నాకాంక్షించియుండుము. వాఁ డజరామరుండు కాఁడుకదా? ఎప్పుడో యొకప్పుడు వానికి వ్యసనము రాకతీఱదు. నీవు సంజయుం డనుపేరుగలవాఁడవుకదా? ఏదీ! పేరికిఁదగునట్లు నీయందు జయముగానరాదే? నాకొడుకా! నీవు సార్థకనాముండవగుము. వ్యర్థ నాముండవు కాకుము. శాస్త్రంబులు చక్కనెఱింగిన బ్రాహ్మణుం డొక్క రుండు బాలుండ వగు నిన్నాలోకించి "వీఁడు గొప్పకష్టదశ లనుభవించి మరల వృద్ధిఁబొందునని వచించినాఁడు. ఆ బ్రాహ్మణునివచనంబులు తలంచి కొని మరల నీకు విజయంబు లభించునని యాశించుచున్నదానను. కావు ననే మరలమరల నీకింతగాఁ జెప్పుచున్నదానను. ఎవ్వనియర్థనిర్వృత్తి యం దితరుల కాపేక్ష్యయనంబుగలుగునో వాని కవశ్యముగా నర్థ సిద్ధియగుసు. నీతియం దర్థానుసారంబుగఁ బ్రవర్తించువాని కర్థంబులు సిద్ధింపకుండునా? పూర్వులకును నాకును సమృద్ధియే కానిమ్ము, అసమృద్ధియే కానిమ్ము. అని లాభాలాభంబుల గణింపక యుద్ధంబున నుత్సహింపుము. ఎంతమాత్రము యుద్ధప్రయత్నంబు వీడకుము. ఎవ్వనియింట రాత్రి యందును బగలును బ్రాతఃకాలంబునను భోజనంబు లభింపదో యంత కంటె పాపిష్ఠం బగు నవస్థలేదని మున్ను శంబరుండు వచించియుండె. దారిద్ర్యమనునది పతిని బుత్రులను వధించుటకంటెను బరమదుఃఖం బైనది. అది మరణంబునకు మాఱురూపంబే యగును. నేను మహాకులం బునం బ్రభవించినదానను. పూర్ణం బగు నొక్కహ్రదమునుండి వేఱొక హ్రదంబునకుఁ బోలె నీయింటికి వచ్చితిని. నేను ప్రజలందీశ్వరత్వంబు నెఱపితిని. సర్వకల్యాణంబు లనుభవించితిని. భర్తచే మిగుల మన్నన లందితిని. చెలికత్తియలనడుమ మహార్ఘాభరణంబులు దాల్చి మహార్ఘాం బరములు ధరించిన నన్ను జెలికత్తియలెల్ల రానందంబునం జూచిరి. సంజయా! దుర్బలలమైయున్న నన్ను నీభార్య నెప్పు డాలోకింతు వపుడు నీజీవితంబు ప్రయోజనరహితంబగును. దాసకర్మంబుగావించు భృత్యులను, నాచార్యులను, ఋత్విజులను, బురోహితులను, మమ్ము లను నీవు వృత్తిరహితుండవై విడనాడితివేని నీవు జీవించియున్న ఫల మేమి? తొల్లింటివలెనే శ్లాఘనీయంబు యశోవర్ధనంబు నగు నీపరాక్ర మం బాలోకింపవేని నాహృదయంబునకు శాంతి యెట్లు చేకూరును?

బ్రాహ్మణుం డర్థించినపుడు లేదని చెప్పవలసివచ్చుచో నాహృదయంబు పగిలి ముక్కలగును. ఇంతకు మున్నెన్నఁడు నేనుగాని నాభర్తగాని బ్రాహ్మణులకు లేదని చెప్పియుండలేదు. మనలనే యితరు లాశ్రయింపఁ దగుపుగాని మన మితరులయాజ్ఞ లాలకించువారము గాఁగూడదు. నే నితరుల నాశ్రయించి జీవింపవలసివచ్చుచో జీవంబు విడిచెదను. అపారంబగుశోకసాగరంబున నాకుఁ బారంబ వగుము. తరింపరానిదుఃఖసాగరంబున నాకుఁ దరణి వగుము. అస్థానంబున స్థానంబు గావింపుము. మృతులమైయున్న మమ్మెల్లరఁబునర్జీవితులఁగావింపుము. నీవు జీవితంబునం దాశయే విడిచితివేని నీశాత్రవులనెల్ల జయింప శక్యంబగును. అట్లు కాక క్లీబం బగు నిట్టియవస్థనే యాలంబింతునంటివేని నిర్వేదం బనుభవించియు మతిచెడియు బ్రతికియుండుటకంటె నీప్రాణంబులు విడుచుటయే యుత్తమంబు. శూరుం డొక్కశాత్రవుని వధించియే ప్రఖ్యాతి నొందును. ఇంద్రుం డొక్కవృత్రునిమాత్రము సంహరించుటచే మహేంద్రుం డనుకీర్తి గడించె. ఆతఁడు మహేంద్రపదవిని సోమపాత్రంబును లోకంబులకెల్లఁ బ్రభుత్వంబు నొక్కశత్రునివధించుట చేతనకదా పొందెను? సంగ్రామంబున దననామంబు వినిపించి దంశితులగుశాత్రవులఁబిలిచి సేనాగ్రంబును బాఱద్రోలి యొక్కపురుషుని సంహరించినను శ్రేయంబే. ఎప్పుడు పురుషుండు మంచియుద్ధంబుచేఁ గీర్తినొందునో యప్పుడ వాని శాత్రవులెల్లరును బ్రవ్యథితులగుదురు. కాపురుషులగు జనులు సైతము రణంబున నవశులై దేహంబులువిడిచి శూరుండు, దక్షుండు నగు నేలికకు సర్వకామంబులు సమృద్ధిగఁ జేకూర్చి తృప్తికలిగింతురు. రాజ్యంబున కుగ్రం బగుభ్రంశమునుగాని, జీవితంబునకు సంశయంబుగాని, లబ్ధుండగుశాత్రవునిగాని శేషించియుంచుట సాధుధర్మ విగర్హితంబగును. రాజ్యంబు స్వర్గద్వారంబుతో సమానంబును, నంతకంటె నధికం బగునమృతంబునకు సాటివచ్చునదియు నై యున్నది. రాజ్యంబునకును, స్వర్గంబునకును నడుమ గలయొక్కమార్గం బాక్రమింపంబడినదని భావించి శాత్రవులందు ప్రజ్వలించుకొఱవివలె నొక్కమాఱు విజృంభింపుము. రాజవగు నీవు రణంబున శాత్రవుల సంహరించి రాజధర్మంబు పాలింపుము. శాత్రవులభయంబు తొలఁగించి కృపణుండవగు నిన్ను నాపరిజనులు దుఃఖాకులులయ్యుఁ, బరులు సంతుష్టాంగు

లయ్యుఁ బరివేష్టింప నేనుఁ జూడఁజాలను. దీనుండువలెనున్న నిన్ను దీనురాలనై నే నాలోకింపఁగలనా? నీవు సౌవీరకన్యలతోఁగూడి పూర్వము వలె నానందించుచు మునుపటియట్ల యెల్లయర్థంబులు ననుభవింపుము. అవశుండవై సైంధవకన్యలకు వశంవదుండవు కాకుము. యౌవనవయస్కుండవు, రూపసంపన్నుండవు, విద్యావ్రతస్నాతుండవు, మహాకులసంజాతుండవు, యశోవంతుండవు, లోకప్రఖ్యాతుండవు నగు నీవే యిట్లు వికారంబొందితివేని మహాభారవహనదక్షుండ వగు నీవ దుర్బలుండువోలె నిట్లుంటివేని మరణంబే యది యని తలంతును. శాత్రవునకుఁ బ్రియంబులు పలుకుచున్న నిన్నాలోకించితినేని పరునివెనుక నరుగుచున్న నిన్నుఁగాంచితినేని నాహృదయమునకు శాంతి లభించునా? ఈకులంబున జనించినవాఁ డెవ్వండు నెన్నండు నితరునివెనుక నడువఁ గూడదు. నీవును బరుల కనుచరుండవై జీవింపఁదలంపకుము. నేను శాశ్వతంబగుక్షత్రహృదయంబును బాగుగ నెఱింగినదానను. పూర్వులు పూర్వతరులును, బరులు పరతరులును వచించినదియు ప్రజాపతి వినిర్మితంబును, శాశ్వతంబు నవ్యయంబు నగు క్షత్రధర్మంబు నేను బాగుగ నెఱుంగుదును. ఇక్కులంబున జనింపనివాఁడని క్షత్రధర్మం బెఱింగిన క్షత్రియుం డెవ్వండును భయంబుననేని, వృత్తి నాశించియేని యెవ్వనికిని నమస్కారం బాచరింపరాదు. మదించినమాతంగంబువోలె మహామనస్వి యగువాఁడు చరింపవలయును. సంజయా! నిత్యంబును బ్రాహ్మణులకును, ధర్మంబునకును నమస్కారం బాచరించుచుండవలయును. ఇతర వర్ణంబులనెల్ల నియమించుచు దుష్టుల నిగ్రహించుచును సహాయవంతుండైనను, నసహాయుండైనను బ్రజలఁ బాలింపందగును.

అనిన విని సంజయుం డామె కిట్లనియె. తల్లీ! నీహృదయంబు ఉక్కుకరగించి పోతపోసిన ట్లతికఠినంబై యున్నది. జననీ! నీకుఁ గరుణంబించుకంతయు లేదు. నీవు వీరప్రజ్ఞవు నమర్షణురాలవునై యున్నదానవు. తల్లీ! క్షత్రసమాచారంబు చాలక్రూరమగునది. పెరవనితవోలె నన్నుఁ గన్నతల్లివయ్యు నిట్టులకరుణంబుగ వచించుచున్నదానవు. తనతనయుని యుద్ధంబునకుఁ బురికొల్పువనిత నీకంటె వేఱొకతె యెందును గానరాదు. నేను నీకు లేకలేక కలిగిన యేకపుత్త్రుండను. నన్నే యిట్లు దయమాలి నీవు పరుషంబులాడుచున్నదానవు. తల్లీ! నేను యుద్ధంబున

మేను వొఱంగినచో నన్నాలోకింపని నీకు జీవితంబునంగాని, యీసకలం బగుపృథివీతలంబునంగాని, యాభరణంబులవలనంగాని, భోగంబులవలనం గాని యేమిప్రయోజనంబు లభించును? నీకుం బ్రియపుత్త్రుండ నగు నేను సంగరాంగణంబున మృతిఁబొందెదనే ననంతరము నీ వేమి చూచి యానందింతువని యడిగెను. అంత విదుల మరల నాతని కిట్లనియె. తండ్రీ! విద్వాంసులు ధర్మార్థంబులకై సర్వావస్థలు ననుభవింతురు. నేను నా ధర్మార్థముల నాలోచించియే నిన్నిట్లు ప్రేరించుచున్నదానను. బాగుగ నాలోచించి పరాక్రమింపందగిన ముఖ్యకాల మిపుడాసన్నంబై యున్నది. నీవు కలరూపు బాగుగం దెలియవైతేని శాత్రవులందుంగాని, నీదేహ మందుంగాని దయవహించి కార్యంబు పాడుసేయంగలవు. కావుననే నీకపకీర్తి సంభవింపకుండ ముందుగనే నే నుద్బోధించుచున్నదానను. సామర్థ్యంబు లేనిదియుం, గారణంబు లేనిదియు నగుప్రేమంబును గాడిద ప్రేమయందురు. గాడిద తనబిడ్డను సామర్థ్యం బాలోచింపకయే, కారణం బారయకయే ముద్దుసేయుచుండును. వత్సా! నీవు సజ్జనులచే గర్హింపం బడినదియు, మూర్ఖులచే నాదరింపంబడినదియు నగుమార్గంబు విడువుము. ఈప్రజలెల్లరు నాశ్రయించునట్టి యజ్ఞానంబు చాలం గలదు. నీవు సద్వ్యాపారం బవలంబించితివేని నాకత్యంతప్రియతముండ వగుదువు. ధర్మార్థగుణయుక్తంబగువృత్తంబుననే నాకుం బ్రీతి జనించును గాని యితరంబున జనింపదు. దైవమానుషబలయుక్తుండవును, సజ్జనచరితుండవు నగుము. అవినీతుండు, సుస్థానహీనుండు, దుర్వినీతుండు, దుర్బుద్ధియుక్తుండు నగుపుత్రపౌత్రనప్తృలతో నెవ్వం డానందించువాని సంతానమువడసిన శ్రమంబు నిష్ఫలంబగును. సాధుకర్మంబు లాచరింపకయు, నకృత్యంబు లాచరించియుం బురుషాధము లీలోకంబున సుఖంబును, బరలోకంబున సద్గతియు నొందంజాలరు. సంజయా! ఈ లోకంబున యుద్ధం బొనరించుటకును జయంబు వడయుటకునే క్షత్త్రియుండు సృజింపంబడినవాఁడు. వానికిఁ గ్రూరకార్యంబు లాచరించుటయుం, బ్రజల నీతితప్పక పాలించుటయుం బరమధర్మంబులు. క్షత్త్రియుండు సమరంబున జయించినను, మరణించినను గూడ నింద్రలోక సుఖంబు లనుభవించును. క్షత్త్రియుండు శాత్రవులనెల్ల వశులంగావించుకొని యనుభవించుసుఖము-పుణ్యం బగునింద్రలోకంబున లేదు. శాత్ర

మహాద్భుతం బగుకర్మంబులంగూర్చి సల్లాపించిరి. వారల్లెరును భూమి మూర్ధప్రాయమై యున్నది. మృత్యుపాశంబులకు వశంబైన యీ భూమండలంబెల్ల దుర్యోధనుని బాలిశకర్మంబున నిరవశేషంబుగ నశించునని నిశ్చయించిరి. మాధవుం డట్లు కర్ణునితోఁగూడ రథారూఢుం డై నగరంబు వెలువడి నిర్జనం బగుమార్గంబున నరిగి యందుఁ గర్ణునితోఁ గూడి పెద్దకాలంబు మంత్రంబుగావించెను. తరువాత రాధేయుని గూడ విసర్జించి జవనంబు లగు నశ్వంబుల వేగంబుగఁ బ్రబోధనంబు గావించె. దారుకునిచే బ్రచోదితంబు లగునశ్వంబులు గగనంబును గ్రసించుచందంబున మనోమారుతవేగలంబుల నతిగమించు వేగంబునం బఱతెంచినవి. మహావేగంబు లగు శ్యేనంబులంబోలి యాతురంగంబులు మహాదూరం బగుమార్గంబెల్ల నతిక్రమించి యతిశీఘ్రంబున నుపప్లవం బునకుం జేరినవి.

### భీష్మద్రోణులు దుర్యోధనునకు మరల హితంబుగఁ జెప్పుట

కుంతి యట్లు కేశవునితోఁ బల్కినపల్కు లాలించి మహారథు లగు భీష్మద్రోణులు శాసనాతిక్రమణుం డగుదుర్యోధనున కిట్లని హితం బుపదేశించిరి. పురుషపుంగవా! కృష్ణునియెదుర గుంతీదేవి వచించిన వాక్యంబు లాలించియున్నాఁడవుకదా! కుంతీదేవి అర్థవంతంబు, నత్యు గ్రంబు, ధర్మంబు నుత్తమోత్తమంబు నగువాక్యంబు వచించినది. ఆ వాక్యంబు వాసుదేవున కెంతయు సమ్మతంబు. పాండవులు తప్పక యా వచనంబుల నాచరింతురు. రాజ్యభాగంబీయక వారేవిధంబునను శాంతి నొందరు. ఆకాలంబున ధర్మపాశాపపాశితు లగువారల కనేకక్లేశంబులు నీవ కల్పించియుంటివి. సభలో ద్రౌపదినిఁగూడ బెక్కుపరుషంబులాడి తివి. వార లాయవమానంబులెల్ల ధర్మాభిరతిచే సహించియుండిరి. కృతాస్త్రుం డగుధనంజయుని, కృతనిశ్చయం డగువృకోదరుని, సజ్యం బగుగాండీవంబును, నక్షయతూణీరంబు లనుదేవదత్తం బగురథంబును, గపిధ్వజంబును, బలవీర్యసమన్వితు లగునకులసహదేవులను, సహాయుం డగువాసుదేవుని నాలోకించుచున్న యుధిష్ఠిరుండు తమపాలు తాము చేకొనక యెట్లు క్షమించును? మహాబాహుం డగునర్జునుం డొక్కరుండ విరాటనగరంబున సర్వసేనాసన్నద్ధులమైయున్న మనలనెల్ల నిర్జించుట

నీవు నాలోకింపవియే యుంటివికదా? మఱియు నివాతకవచులను పేరు గల ఘోరపరాక్రము లగు దానవు లఱువదివేవురు మహాశూరు లాకపి ధ్వజునిచే రౌద్రాస్త్రంబున నొక్కక్షణమాత్రంబున బరిమార్పంబడిరి. కవచంబులు, రథంబులు మొదలగుయుద్ధపరికరంబులు సమగ్రంబుగఁగల మీరలెల్లరును గంధర్వులచేఁ జిక్కియుండ నీవును గర్ణప్రభృతులు నాథనంజయునిచేతన విడిపింపంబడిరికదా? అదియ పాండవులపరాక్ర మంబునకుఁ జాలినంతనిదర్శనంబై యున్నది. భరతశ్రేష్ఠా! నీవు శాంతుండ వగుము. నీసహోదరు లగు పాండవులతో సంధి కావించికొనుము. మహామృత్యువు కోఱలనడుమంజిక్కిన యీపృథివినెల్ల రక్షింపుము. ధర్మనందనుండు నీకు జ్యేష్ఠుం డగుభ్రాత. ధర్మశీలుండు, వాత్సల్యగుణ భూషణుండు, శ్లక్ష్ణవాకుండు, కవిపుంగవుండు, నీవు కిల్బిషంబెల్ల బోనాడి పురుషపుంగవుం డగు నాతని నభిగమింపుము. నీవు శరశరాస నంబులవిడిచి కనుబొమలు ప్రశాంతములుగావించి యాధర్మనందను దర్శించితివేని మనకులంబునకెల్ల శుభంబులు లభించును. నీ వమాత్య సహితుండవై ధర్మనందనునికడ కరిగి యాతని నాలింగనంబుగావించి కొని యథోచితంబుగ నాతని కభివాదనం బాచరింపుము. నీ వభివాద నం బాచరించునపు డాభీమాగ్రజుండు ప్రీతుండై తనకరంబులచే నిన్ను లేవనెత్తిపరిష్వజించుఁగాక. సింహస్కంధంబులుంబోలు మహాభుజంబులు గలవాఁడును యోధుల కగ్రగణ్యుఁడు నగువృకోదరుం డత్యంత ప్రీతుండై తనబాహుద్వయంబుచే నిన్నాలింగనంబునేసికొనుఁగాక. కంబుగ్రీవుండు గుడాకేశుండు పద్మపత్రవిశాలనేత్రుండు నగుధనంజ యుండు నీకభివాదనం బాచరించును. మనుజపుంగవులు నప్రతిమరూప సంపన్నులు నశ్వినీదేవసంభవులు నగునకులసహదేవులు నీకు గురువునకుం బోలె నమస్కరించి పూజలాచరింతురు. దాశార్హప్రముఖులగు నీ రాజన్యులెల్లరును నానందబాష్పంబుల విడిచెదరుగాక. నీవునీభ్రాతలతో సమాగమంబొందుము. దురభిమానంబు విడువుము. నీవును నీసోదరు లతోఁగూడి యీపృథివినెల్లఁ బాలింపుము. యుద్ధోత్సాహంబున నేతెం చిన యీనరపాలురెల్లరు నానందంబున నొండొరులఁ గౌఁగిలించికొని వచ్చినత్రోవల దమతమగృహంబుల కరుగుదురుఁగాక. రాజేంద్ర ! యుద్ధంబు మానుము. నిన్ను వారించుచున్నమిత్రులవచనంబు లాదరిం

పుము. యుద్ధంబున క్షత్రియులకెల్ల వినాశంబు ధ్రువంబుగఁ గాఁగలదు. మనకు గ్రహనక్షత్రాదులు ప్రతికూలంబుగ నున్నవి. మృగంబులు పక్షులును దారుణంబులుగ నున్నవి. క్షత్రనాశనద్యోతనంబు లగు వివిధోత్పాతంబులు జనించుచున్నయవి. విశేషించి మనకు వినాశంబు సూచించు నుత్పాతంబులు చెలరేఁగుచున్నవి. నీసస్యంబెల్ల మండుచున్నకొఱవులచే బాధింపంబడుచున్నవి. నీహయంబులు మొదలగువాహనంబులెల్ల బ్రహర్షశూన్యంబులై యున్నవి. అవియెల్ల నెప్పుడును రోదనం బాచరించువిధంబుగ గన్నీరువిడుచుచున్నవి. నీసైన్యంబులందెల్ల గ్రద్దలు సంచరించుచున్నవి. నగరంబును రాజమందిరంబును దొంటియట్లు వికారవంతంబులై యుండకున్నవి. దిక్కులందు ఘోరంబుగ గోమాయువులు కూతలిడుచున్నవి. నీతండ్రియుఁ దల్లియు నీహితం బాకాంక్షించు మేమెల్లరమును వచించుకార్యంబు లాదరింపుము; శమంబుగాని యుద్ధంబుగాని నీయంద వశపడియున్నది. అరికర్శనా! నీవు నీహితుల వాక్యంబు లాదరించి యాచరింపవైతేని పార్థబాణాభిపీడితం బగు నిజసైన్యంబు నాలోకించి మిగులఁ బశ్చాత్తాపమందెదవు. మహాబలశాలి యగు భీమసేనుని మహానాదం బాలించియు గాండీవజ్యానిస్వనం బాలించియు మావాక్యంబుల తలంచుకొందువు. మావాక్యంబు నీకు విపరీతం బయ్యెనేని నవశ్యంబు మనకు వినాశం బాసన్నంబైయున్నదని యెఱుంగుము అని వచించిరి.

## దుర్యోధనుండు తనమతం బెఱింగించుట

ఇట్లు భీష్మద్రోణులు వక్కాణింప విమనస్కుండై క్రిందచూచుచు మొగము ప్రేలవైచి కనుబొమలు ముడివడ సుయోధనుం డేమియుం బలుకక యున్నకుండె. అతం డట్లు విమనస్కుండైయుండ భీష్మద్రోణు లొండొరుల నాలోకించి మరల నిట్లు సుయోధనునకు వచించిరి. అందు భీష్ముండు రాజా! శుశ్రూషుండు ననసూయుండు బ్రాహ్మణుండు సత్యవచనుండు నగుపార్థు నెదిరించి పోరుటకంటెను దుఃఖతరంబు కలదేయనియె. ద్రోణుండు అశ్వత్థామునందు నాకెట్టివాత్సల్యంబుండు నంతకంటె నత్యధికంబుగ ధనంజయునందుండును. కపిధ్వజునందు నాకత్యంతబహుమానంబును పరమం బగుసన్నతియుఁ గలవు. పుత్త్రుని

కంటెను బ్రియతముం డగు ధనంజయు నెదిరించి యుద్ధంబు గావించుట కంటెను గ్రూరకార్యం బేమియుండును? క్షత్రధర్మంబు మిగులఁ గ్రూరమయినది. క్షత్రజీవితం బతినృశంసము పాపిష్ఠమునయినది. అర్జునునకు సమానుం డగుధనుర్ధరుం డీలోకంబులం దెందును లేఁడు. నాప్రసాదంబు వలన నితరధనుర్ధరులెల్లరకంటె నత్యధికుండై యున్నవాఁడు. మిత్రద్రోహం బాచరించువాఁడును దుష్టస్వభావుండును నాస్తికుండును ఋజువర్తనశూన్యుండును శఠుండును యజ్ఞంబులందు మూర్ఖులు పూజల నంద నేరనివిధంబున సజ్జనులందుఁ బూజలొంద నేరరు. పాపాత్ముం డెన్ని చెప్పినను వినక పాపంబులే యాచరించుచుండును. శుభాత్ముండన్నవో పాపులచే బ్రోత్సహింపంబడియు శుభంబునే యాకాంక్షించును. భరతాగ్రణీ! పాండవులకు నీవెన్ని మిథ్యాచారంబులుగావించినను వారు తరువాత నీకుఁ బ్రియంబే కావింతురు. నీదోషంబు లెప్పుడు నహితత్వమునే కావించును. నీవు కురువృద్ధులచేతను నాచేతను విదురుని చేతను వాసుదేవునిచేతను బెక్కుభంగుల హిత ముపదేశింపంబడియు నద్దానినంగీకరింపకున్నాఁడవు. నాకు బలంబున్నదనుసాహసంబుననే నీవుష్ణకాలం బతిక్రమించినపిదప వర్షకాలంబున నక్రగ్రాహమకరాద్యాభీలం బగు గంగావేగంబువలె దుస్తరం బగుసమరార్ణవంబు దరింపందలంచెదవు. నీవు గుడ్డకప్పుకొన్నవాఁ డితరం బాలోకింప జాలనట్టు లితరుల బలంబు తెలియఁజాలకున్నాఁడవు. త్యక్తంబు గుస్రజంబునుంబోలె యుధిష్ఠిరుని సిరియెల్ల లోభంబున నపహరించితివి. ద్రౌపదీసహితుండును నాయుధధారు లగునసుజులచే బరివేష్టితుండు నగుధర్మనందనుండు వనంబుననున్న నాతని నెదిరించి పోరంగలధీరుం డెవ్వఁ డుండును? ఎవ్వనికి సకలరాజన్యులును వశులై కింకరులై యుందురో యట్టి కుబేరుని రణంబున నెదిరించి ధర్మనందనుండు విజయంబు పరిగ్రహించె. ఆతండు కుబేరు నోడించి కుబేరునిభవనంబున కరిగి దానివలన ననేకంబు లగు రత్నంబులు స్వీకరించినవాఁడు. అట్టి యాతండు వీతం బగునీరాష్ట్రంబు బరిగ్రహించి రాజ్యంబు గావింపందలంచుచున్నవాఁడు. వత్సా! నేనును శాంతనవుండు ననేక దానంబు లాచరించితిమి. అనేకమహాక్రతువు లాహరించితిమి. ధనంబులచే బ్రాహ్మణుల దృప్తులఁగావించితిమి. మేమెల్ల కార్యంబులు చేసియుంటిమి. మాయాయువు చెల్లినదని యెఱుంగుము.

మాకు భోగంబులందుఁగాని యితరధనంబులందుఁగాని లేశంబే నాశ లేదు. కావున పాండవులతో విగ్రహం బాచరించిన మాకేమియు పోవు నది లేదు. నీవన్ననో సుఖంబును రాజ్యంబును మిత్రులను ధనంబులను గోల్పోయి మహావ్యసనం బనుభవింతువు. సత్యవాదినియు ఘోరవ్రత పరాయణయు నగుద్రౌపది యెవ్వనికి నిత్యంబు విజయం బాశాసించు చుండునో యట్టి ధర్మనందనుని నీ వెట్లు జయింపంగలవు? ఎవ్వనికి సర్వ ధనుర్ధరాగ్రగణ్యు లగు మాధవుండు మంత్రియు ధనంజయుండు సహా యుండునై విజృంభింతురో యట్టి యుధిష్ఠిరుని నీ వెట్లు గెలువఁగలవు? ధృతిమంతులు జితేంద్రియులు నగుబ్రాహ్మణులు సహాయులై జయం బభిలషింతురో యట్టియుగ్రతపోనిరతుం డగుధర్మనందను నీ వెట్లోర్వఁ గలవు? భూతి నాశాసించువారు మాటిమాటికి హిత ముపదేశించుట యార్యసమ్మతము. నేను నళ్లే యింతకుమున్న నేకపర్యాయములు చెప్పి నదేయైనను మరలఁ జెప్పుచున్నాఁడను. వ్యసనార్ణవంబున మగ్నులుగా నున్నవారికి సుహృదులు హితం బుపదేశించు టుత్తమధర్మము. వీరు లగుపాండవులతోఁ గయ్యంబు వలదు. కౌరవులవృద్ధి నాకాంక్షించెద వేని వారితో సంధిచేసికొనుము. సుతులతోడ నమాత్యులతోడ మిత్రులతోడంగూడి యమసదనంబున కరుగకుము. అనిపలికి మిన్న కుండె.

కృష్ణుండు కర్ణునితో రహస్యసంభాషణంబు సెలపుట

అనిన విని జనమేజయనరపాలుండు వైశంపాయనమునీంద్రు నాలోకించి మహామునిసత్తమా! రాజపుత్రులతోడను భృత్యులతో డనుంగూడి కర్ణుని రథంబున నెక్కించికొని యరిగిన జనార్దనుం డారాధా తనయున కేమివచించె సూతపుత్రునియెడ గోవిందుం డేయేసాంత్వవచనం బులు ప్రయోగించె? వర్షకాలఘనగంభీరస్వరుం డగునాపద్మనాభుండు కర్ణునితో మృదువాక్యంబులాడెనో పరుషవాక్యంబులాడెనో యదియెల్ల వినవలంతు నానతిమ్మని ప్రార్థించుటయు నామునిప్రవరుండు నిట్లనియె. కృష్ణుండు మృదువులును దీక్ష్ణంబులు నగువాక్యంబుల నాయాసమ యానుకూలంబుగ వచించెను. అయ్యవి ప్రియంబులు ధర్మయుక్తంబులు సత్యంబులు హితంబులు నై యొప్పినవి. ఆవాక్యంబులెల్ల మనోహరం

ములై యెప్పుడు నేమరక హృదయంబున ధరింపందగినవై యున్నవి. వానినెల్ల నేను వరుసగా వక్కాణించెద నాలింపుమని పలికి యనంతర వృత్తాంతం బిట్లని యెఱింగించె.

అంత నక్కడ వాసుదేవుండు కర్ణుని నిర్జనం బగు ప్రదేశంబునకు రథంబునం గొనిపోయి యెవ్వరును వినకుండ రహస్యంబుగ నాతని కిట్లనియె. రాధేయా! నీవు వేదపారంగతులకు బ్రాహ్మణుల నుపాసించియుంటివి. అసూయవిడిచి నియతుండవై బ్రాహ్మణులవలన దత్త్వార్థం బెఱింగితివి. కర్ణా! సనాతనంబు లగువేద వాదంబుల నీకంటె నధికంబుగ నెఱింగినవా రొరులుగానరారు. సూక్ష్మంబులగుధర్మశాస్త్రంబులందు నీవత్యంతము పరినిష్ఠితుండవై యుంటివి. కన్యయందు జనించుతనయులు ద్వివిధంబులం బరంగుదురు. వివాహంబైన యనంతరము పుట్టినవానిపేరు సహోఢుండనియు వివాహమునకుఁ బూర్వమే జనించినవానిపేరు కానీనుండనియు నార్యులందురు. అట్లు కన్యకు జనించినతనయుని కాకన్యను పరిణయం బగువారే తండ్రియని శాస్త్రవిదులందురు. కర్ణా! నీవు కానీనుండవై జనించితివి. నీవు కుంతికి గన్యాత్వమందు జనించితివి. ధర్మంబున నీవు పాండునరపాలునితనయుండవై యున్నవాఁడవు. ధర్మశాస్త్రంబులనిశ్చయంబువలన నీవ తప్పక రాజు కాఁగలవాఁడవు. కావున నీవు నావెంటరమ్ము. నీకుఁ బితృపక్షంబున బాండవులును మాతృపక్షంబున వృష్ణులును బంధువులై యున్నారు. పురుషపుంగవా! నీ వీరెండుపక్షంబులవారి నాదరింపుము. నీవు నాతోఁగూడ నిపుడు వచ్చినబాండవులెల్లరును యుధిష్ఠిరునికంటె మున్నుగా జనించినపాండునందనునిగా నెఱుంగుదురు. పాండవు లేవురును నీపాదంబుల కెఱఁగి నమస్కరింతురు. ద్రౌపదితనయు లేవురును సుభద్రాతనయుండును నీపాదంబులకు నమస్కారం బాచరింతురు. పాండవులకొఱకై యేతెంచియున్న రాజులును రాజపుత్త్రులు నంధకులు వృష్ణులును నీపాదంబుల బీడించి నమస్కరింతురు. కాంచనంబులు రాజతంబులు మార్తికంబులు నగు కుంభంబులందు బవిత్రంబు లగుజలంబుల బూరించి రత్నంబులు నోషధులు నునిచి రాజన్యులు రాజకన్యకలును నీకభిషేకంబు గావింతురు. ద్రౌపదికూడ నైదుకాలంబులందుఁ బాండవులఁబొందుచున్నరీతి నాఱవకాలంబున నిన్ను నుచరించును. సంశ్రితాత్ముండు ద్విజోత్తముండు నగుధౌమ్యుండు

నీయగ్నుల వ్రేల్చుచుండంగలఁడు. చాతుర్వైద్యు లగుద్విజాతులెల్లరు నిప్పుడ నిన్నభిషేకింతురుగాక. బ్రహ్మకర్మావస్థితుం డగుపాండునందనుల పురోహితుండును నట్లే పాండవు లేవురు సోదరులును ద్రౌపదీతనయు లేవురును బాంచాలచేదిభూమీశ్వరులును నేనునుఁగూడి నిన్నీపృథివి కెల్ల రాజుగా నభిషేకింతుము. ధర్మతనయుం డగుయుధిష్ఠిరుండు యువ రాజై యుండుఁగాక. ధర్మనందనుండు శ్వేతం బగువాలవ్యజనంబు చేఁబూని నిన్ననుసరించి రథంబారోహించుఁగాక. మహాబలుం డగుభీమ సేనుండు రాజ్యాభిషిక్తుండవైన నీకు శ్వేతం బగుమహాఛత్త్రంబుపట్టుఁ గాక. కింకిణీశతనిర్ఘోషంబును వ్యాఘ్రాజినపరిచ్ఛన్నంబును నగురథం బున శ్వేతాశ్వంబులంబూన్చి యర్జునుండు నీరథంబున సారథ్యంబు నెఱపును. అభిమన్యుం డెప్పుడును నిన్నెడఁబాయక కార్యకరుండై యుండును. నకులుండును సహదేవుండును ద్రౌపదీతనయు లేవురును పాంచాలురును మహారథుం డగుశిఖండియు నీరథంబువెనుక ననుగమిం తురు. నేనును సర్వాంధకవృష్ణివీరులతోఁగూడి నీవెనుక నడచివత్తును. రాజా! నీకు దాశార్హులును దాశార్ణులును బరివారంబై యుందురు. మహాబాహూ! నీభ్రాత లగుపాండవులతోడంగూడి రాజ్యంబు నిష్కం టకముగ ననుభవింపుము. జపంబులు హోమంబులు నాచరించుచు నానావిధంబు లగుమంగళంబులు ననుభవింపుము. ద్రావిడులును గుంతలు లును నీకు బురస్సరులయ్యెదరు. ఆంధ్రులు తాలచరులు చూచుపులు వేణుపులును నీకగ్రగాములై నడచెదరు. సూతులు మాగధులును బహువిధంబు లగుస్తుతులచే నిన్నుఁ బ్రస్తుతింతురుగాక. పాండవులు వసుషేణునివిజయం బెల్లెడలఁ జాటింతురుగాక. పాండవులతోఁగూడిన నీవు నక్షత్రగ్రహపరివృతుం డగు సుధాంశుండువోలె రాజ్యంబు పాలింపుము. నీజనని కుంతి కానందంబు గూర్పుము. నీమిత్త్రులెల్లరు నానందింతురుగాక. నీశాత్త్రవులెల్లరు వ్యథితు లగుదురుగాక. నీసోదరు లగుపాండవులతోఁ నీకిపుడు సౌభ్రాత్త్రంబు లభించుఁగాక యని వచించె.

### కర్ణుండు వాసుదేవునివచనంబులు నిరాకరించుట

అనినవిని సూతమానుండు వాసుదేవున కిట్లనియె. కృష్ణా! నిస్సం శయంబుగ నాయందలి సౌహార్దంబునను బ్రణయంబునను సఖ్యంబు

నను శ్రేయస్కామత్వమునను నీవాడిన వాక్యంబులెల్ల వింటి? నే నెల్ల యర్థంబులు నెఱింగితిని. నేను నిస్సంశయంబుగ బాండునందనుండనే యగుదును. ధర్మశాస్త్రంబులనిశ్చయంబున నీ వెట్లుతలంచుచున్నవాఁడవో యట్లే నేను ధర్మంబువలన బాండునరపాలునికే తనయుండను. కుంతీదేవి నన్ను నదియందుఁ జాఱవిడువఁగా నధిరథుం డనుసూతుండు నన్నాలోకించి గ్రహించి తనయింటికిం గొనివచ్చెను. మధుసూదనా! యధిరథుం డధికప్రేమంబున దనభార్య యగురాధకు నన్నొసంగెను. నాయందలి ప్రేమచే నారాధ క్షణంబున జన్నులు చేపి స్తన్యంబు స్రవించె. మాధవా! యారాధ నామూత్రంబును బురీషంబును నసహ్యించుకొనక సర్వంబును భరించెను. అట్టివనితారత్నంబునకు నాయట్టిపురుషుఁ డెట్లు పిండవ్యపనయంబు గావించును? ధర్మశాస్త్రంబులందలి ధర్మంబునెల్ల నెఱింగియు సతతంబు ధర్మశాస్త్రశ్రవణాభిరతుండయ్యు నాయట్టివాఁడే మూత్రపురీషంబు లొడళులనింకించుకొని పెంచిన తలిదండ్రులకు బిండలోపంబుగావించిన నింకను ధర్మమన నెట్టిది? సూతుం డగునధిరథుండు నన్నెపుడును సుతుండని తలంచును. నేను నట్లే యాతనిని సౌహృదమ్మున దండ్రియని తలంచుచుందును. మాధవా! యధిరథుండే కదా నాకు జాతకర్మాదిసంస్కారంబు లాచరించినవాఁడు. శాస్త్రదృష్టం బగువిధిచేఁ బుత్రప్రేమచే నాకెల్లసంస్కారంబులును గావించి వసుషేణుం డను నామంబు గావించెను. నేను నాసూతునకుఁ జుట్టంబుల కన్యలనే భార్యలనుగా జేకొంటిని. జనార్దనా! అభార్యలందు నాకు బుత్రులును బౌత్రులునుకూడ జనించి వర్ధిలుచున్నవారు. కృష్ణా! ఆకాంతలయందు నా హృదయము కామబద్ధమై యున్నది. గోవిందా! ఆకామబంధంబును సకలం బగుపృథివి లభించినను ధనరాసు లపరిమితంబుగఁ జేకూరినను హర్షంబుననైనను భయంబుననైనను బోనాడంజాలను. కృష్ణా! ధృతరాష్ట్రునింట దుర్యోధను నాశ్రయించుటం జేసి పదుమూఁడువత్సరంబులు నిష్కంటకంబుగ రాజ్యభోగంబు లనుభవించితిని. నేను సూతులతోఁ గూడి యనేకంబు లగుయజ్ఞంబులు గావించియుంటిని. సూతులతోఁ గూడి యనేకంబు లగుకులధర్మంబులును వివాహంబులును గావించి యుంటిని. కృష్ణా! నన్నాలంబించియే దుర్యోధనుండు యుద్ధప్రయత్నంబును బాండవులతోడ విగ్రహంబును గావించుచున్నవాఁడు. సమరం

బున సవ్యసాచి నెదిరించి ద్వైరథం బగుయుద్ధంబు గావింప నన్ను సుయోధనుండు వరించియున్నవాఁడు. వధంబు బంధనంబు బ్రాపించెనేని భయమ్మున నేని లోభమ్మున నేనియు ధార్తరాష్ట్రునెడ నే ననృతంబు గావింపంజాలను. జనార్దనా! నే నిప్పుడు సవ్యసాచితో ద్వంద్వయుద్ధంబు గావింపకుందు నేని నాకును ధనంజయునకు నిర్వురకునుగూడ గొప్పయప కీర్తి వాటిల్లును. మధుసూదనా! నీవు నిస్సంశయంబుగఁ బాండవులకు హితం బుపదేశింపుము. నీకు వశు లగుటచే బాండవు లెల్లకార్యంబు లును సాధింప సమర్థులు. దీనికి సంశయంబు లేదు. కృష్ణా! నీ వీవిషయం బున మంత్రనిశ్చయంబు గావింపుము. యాదవనందనా! ఇదియెల్ల నీ ప్రస్తుతకాలంబునకు హితంబని తలంచుచున్నాఁడను. ధర్మాత్ముండు సంయ తేంద్రియుండు నగుధర్మనందనుండు నన్నుఁ గుంతీదేవికి దొలుతటిపుత్త్రు నిగా నెఱింగెనే నాతండు రాజ్యంబు గ్రహింపనొల్లఁడు. ఒకప్పుడు నే నాప్ఫీతంబగు మహారాజ్యంబెల్లఁ బడసితినేనియు నదియెల్ల సుయోధను నకే యొసంగెదను. ధర్మాత్ముం డగుయుధిష్ఠిరుండే శాశ్వతంబుగ నీపృథి వికి రాజగుఁగాక. ఎవ్వనికి హృషీకేశుండు నేతయు ధనంజయుండు యోధయునై వెలుంగుచున్నవారో వానికే భూమియు రాజ్యంబును జెల్లును. మహాబలుండగు భీమసేనుండును నకులసహదేవులును ద్రౌపదేయు లును పాంచాలుం డగు ధృష్టద్యుమ్నుండును మహారథుం డగుసాత్య కియు నుత్తమౌజుండు యుధామన్యుండును సత్యధర్ముండును సోమ కాత్మజుండును చైద్యుండును జేకితానుండును నపరాజితుం డగుశిఖం డియు ఇంద్రగోపకవర్ణులును కేకయులు సోదరులును ఇంద్రాయుధసవర్ణుం డగుకుంతిభోజుండును భీమసేనునకు మాతులుం డగు శ్యేనజిత్తుండును విరాటునాత్మజుండు శంఖుండును నెల్లసిద్ధులకు నిధి వగునీవును ధర్మ నందనునకు వశులై యున్నవారలు. కృష్ణా! అత్యధికం బగు రాజసంగ్ర హంబు ధర్మనందనుం డొనరించియున్నవాఁడు. సర్వరాజులచే బ్రఖ్యా తంబై దీప్తంబైన యీరాజ్యంబెల్ల ధర్మనందనునకు బ్రాప్తంబైయు న్నది. వార్ష్ణేయా! దుర్యోధనునకు శస్త్రయజ్ఞం బవశ్యంబునుగా నున్న యది. ఈయజ్ఞంబును నెఱుంగంగలవాఁడవు నీవ కాఁదగుదువు. కృష్ణా! ఈయజ్ఞంబున నీవ యధ్వర్యుండ వగుదువు. కపిధ్వజంబున సన్నద్ధం

డైన బీభత్సుండు హోతయు గాండీవంబు స్రుక్కును మహాయోధుల యొక్క వీర్యం బాజ్యంబును నైంద్రంబు పాశుపతంబు బ్రాహ్మంబు స్థూణాకర్ణంబు ననుసవ్యసాచిచే బ్రయోగింపంబడునస్త్రంబులు మంత్రంబులును గాఁగలవు. సుభద్రాతనయుం డగునభిమన్యుం డెల్లవిధముఁలఁ దండ్రి ననుసరించినవాఁడు. వాఁడు పరాక్రమంబున దండ్రికంటెను నధికుండగును. ఆయాగంబున గీతంబు స్తోత్రంబును లెస్సగా నగును. మహాబలుం డగుభీమసేనుం డాక్రతువున నుద్గాతయు బ్రస్తోతయు నగును. ఆనరపుంగవుం డగువృకోదరుండు రణాంగణంబున భీషణంబు లగు సింహనాదంబులు గావించుచు గజసైన్యంబుల వినాశంబు గావించును. ధర్మాత్ముండును శాశ్వతుం డగురాజునైన యుధిష్ఠిరుండే జపహోమ సంయుక్తుండై బ్రహ్మత్వమును గావించును. మధుసూదనా! శంఖధ్వనులును మదగజనిస్వనంబులును భేరీనినదంబులును సింహనాదంబులు నాయజ్ఞంబున సుబ్రహ్మణ్యంబు గాదగును. మాద్రీనందనులు యశస్వులు నగునకులసహదేవులు మహాబలపరాక్రమోపేతులు శామిత్రంబుసు మైత్రావరుణానేథ్రంబులు నగుదురు. కల్మాషదండంబులు విమలంబులు నగురథంబులపంక్తులు యూపంబులై చెల్లును. కర్ణినాలీకనారాచంబులు, వత్సదంతోపబృంహణంబులు, తోమరంబులు, సోమకలశంబులు, పవిత్రంబు లగుధనువులు, ఖడ్గంబులును గపాలంబులగును. శిరంబులు పురోడాశంబగును. కృష్ణా! ఆయజ్ఞంబున రుధిరంబు హవిస్సు కాదగును. శక్తులు విమలంబు లగుగదలును, నిధ్మంబులును బరిధులు నగును. ద్రోణునిశిష్యులును, శారద్వతుం డగుకృపునిశిష్యులును సదస్యులగుదురు. గాండీవధన్వనిచే బ్రయుక్తంబు లగుసాయకంబులు పరిస్తోమంబులగును. మహారథు లగుద్రోణుండు ద్రోణాత్మజుండు మొదలగుయోధులు ప్రయోగించుబాణపరంపరలుకూడ బరిస్తోమంబగును. సాత్యకి ప్రతిప్రస్థానికం బనుకర్మంబు గావించును. ఈయజ్ఞంబున ధార్తరాష్ట్రుండు దీక్షితుండై యున్నవాఁడు. మహాసేన దీక్షితునిపత్నియగును. మహాబలుం డగు ఘటోత్కచుం డీయాగంబున శామిత్రంబు గావించును. మహాత్మా! అతిరాత్రం బను నీవితతం బగుయాగంబున సర్వంబు సుసంపన్నంబు గాఁగలదు. వైతానికం బగుకర్మముఖంబున నగ్నివలన జనించినవాఁడగుటం జేసి ధృష్టద్యుమ్నుం డీయాగంబున దక్షిణ కాఁదగును. మధు

సూదనా! నాటిసభయందు దుర్యోధనునకుఁ బ్రియంబు లగు ననుతలం పున బాండవులను మిక్కిలి పరుషంబులాడియుంటినని మిగులఁ బశ్చాత్తాప మొందుచున్నవాఁడను. కృష్ణా! సవ్యసాచిచే నిహతుండనైన నన్ను నీ వెప్పు డాలోకింతు వప్పుడు ఈయాగంబునకు పునశ్చితి కాఁగలదు. మహానాదంబుగావించెడి దుశ్శాసనుని రుధిరంబు వృకోదరుండు త్రాగునంత నీయాగంబునకు సూయంబుగాఁగలదు. పాంచాలరాజ తనయు లగుధృష్టద్యుమ్నుండును, శిఖండియు నెప్పుడు ద్రోణభీష్ముల నేలంగూల్తు రప్పుడు యజ్ఞంబున కవసానంబగును. మహాబలుం డగు భీమసేనుం డెప్పుడు దుర్యోధనుం బరిమార్చునో యంతతో నీయజ్ఞంబు సమాప్తంబగును. ధృతరాష్ట్రునికోడండ్రును, పౌత్రభార్యలును, హత నాథులును, నష్టపుత్రులును, హతేశ్వరులునై గాంధారితోడంగూడి శునకగృధ్రకురరవ్యాకులం బగురణభూమియందు మహారోదనం బాచ రించుట యీయజ్ఞంబున నవభృథంబగును. క్షత్రియాగ్రణీ! విద్యా వద్ధులు, వయోవృద్ధులు నగుమహాక్షత్రియు లెల్లరును నీవు కారణం బుగ వ్యర్థం బగుమరణంబు నొందకుందురుగాక. సమృద్ధం బగు నక్షత్ర మండలంబెల్ల శస్త్రంబున నిధనంబు ప్రాపించునుగాక. ముల్లోకంబు లకును, బుణ్యతమంబగు కురుక్షేత్రంబున నక్షత్రమండలంబెల్ల నుత్తమ లోకంబు లందనిమ్ము. పుండరీకాక్షా! ఈవిషయంబున నీకిష్టం బగు కార్యం బాచరింపుము. ఎట్లయినను నీసకలం బగు రాజమండలంబును స్వర్గంబునొందునట్లు గావింపుము. జనార్దనా! కులగిరులు, నదులు, సాగ రంబులు నెంతకాలంబు నిలిచియుండు నంతకాలంబు నీకీర్తి లోకంబు లందు విరాజిల్లును. బ్రాహ్మణులెల్లరును మహాభారతసమరంబు నుపన్య సించుచుందురు. క్షత్రియులసమాగమములందు క్షత్రియుల కిదియశోధ నంబై యుండును. మనము గావించినమంత్రంబు నొరుల కెఱుకరానీక కౌంతేయుని యుద్ధసన్నద్ధుని గావించి తోడ్కొనిరమ్ము.

## కృష్ణుఁడు కర్ణునితో యుద్ధసన్నాహంబు గావింపు మనుట

పరవీరప్రాణహరణచణుం డగునారాయణుండు కర్ణుం డట్లుపలికిన పలుకు లాలించి చిఱునగవు మొగంబునం దోప నతని కిట్లనియె. కర్ణా! నేనొసంగుపృథివిని నీవక్కఱ లేదని తిరస్కరించుచున్నవాఁడవు. నీకు

రాజ్యాలంభనలాభంబు లేదుకాబోలును. పాండవుల కెల్లవిధంబులను జయమ్ము ధ్రువమై యున్నది. దీని కేసంశయంబును, లేశంబును లేదు. పాండునందననిజయధ్వజంబు విరాజిల్లుచున్నది. మహోన్నతం బగు నా ధ్వజాగ్రంబున వానరాధీశ్వరుం డుగ్రంబుగ వెలుంగుచున్నవాఁడు. మయునిచే దివ్యం బగుమాయ యారథంబున నిర్మింపంబడినది. సముచ్ఛ్రితంబులు, నింద్రకేతుప్రకాశంబులు నగుధ్వజంబు లారథంబున విలసిల్లుచున్నవి. దివ్యంబులును, భయంకరాకారంబులు నగు భూతంబులు జయావహంబులై యాతేరం బొడచూపుచున్నవి. యోజనమాత్రపరిమితం బగు నారథంబు శైలంబులందును, వనస్పతులందును నిరోధంబులేకుండును. కర్ణా! పావకతుల్యప్రకాశం బగుధనంజయునిరథం బూచ్ఛ్రితంబై వెలుంగుచున్నయది. సంగ్రామరంగంబున శ్వేతాశ్వుండును కృష్ణసారథియునై యైంద్రాస్త్రంబు ప్రయోగించు ధనంజయుని నన్ను నిరువుర నెప్పు డాలోకింతువో యెప్పుడు పిడుగుపడిన బెడిదంపుచప్పుడుంబోని గాండీవజ్యానినాదం బెప్పు డాలింతువో యప్పుడు కృతంబుగాని త్రేతకాని ద్వాపరంబుగాని కాకుండును. కుంతీసుతాగ్రజుండు జపహోమసమాసక్తుండు నగుయుధిష్ఠిరుండు తనసైన్యంబునకు రక్షణంబుగావించుచు నాదిత్యుం డునుంబోలె దుర్ధర్షుండై శాత్రవబలంబుల మాడ్చునప్పుడు కృతంబును ద్రేతయు ద్వాపరంబును గాఁజాలదు. సంగ్రామంబున మహాబలుం డగు భీమసేనుండు దుశ్శాసనునిరుధిరంబు పానంబుగావించి నృత్యంబొనర్చుచు ప్రభిన్నం బగు మాతంగంబుతెఱంగున బ్రతియోధులగజంబులఁ గూల్చుచుఁ జెలరేఁగునపుడు కృతంబును ద్రేతయు ద్వాపరంబును గాఁజాలదు. యుద్ధసన్నద్ధులైవచ్చిన ద్రోణుండు, శాంతనవుండు, కృపుండు, సుయోధనుండు, సైంధవుం డగుజయద్రథుండును సవ్యసాచిచే నివారింపఁబడుట నాలోకించితివే నప్పుడు కృతంబును ద్రేతయు ద్వాపరంబును గాఁజాలదు. మహాబలశాలు రగు మాద్రీనందనులు ప్రగాఢం బగు శస్త్రసంపాతంబున బరవీరరథంబులం జదుపుచు ధార్తరాష్ట్రులసేనానికాయంబులను మదగజంబులమాడ్కి రూపుమాపుచు నిజృంభించుట నెప్పుడు చూచెద వప్పుడు కృతత్రేతాద్వాపరంబులం దొక్కటియును గానేరదు. కర్ణా! నీ విక్కడనుండి యరిగినతరువాత

ద్రోణునకును, భీష్మునకును, గృపునకును నావచనంబులుగా నిట్లు చెప్పుము. ఈమాసంబు మిగుల సౌమ్యంబై యున్నది. జంతుగ్రాస యోగ్యంబు లగుతృణంబులును నింధనంబులును సులభంబులై యున్నవి. వనంబులు సర్వౌషధులచే స్నిగ్ధంబులై ప్రకాశించుచున్నవి. ఫలంబు లధికంబుగ లభించును. మక్షికంబు లల్పంబులుగా నున్నవి. జలంబు బురదలేక రుచిమంతంబై యున్నది. ఈమాసం బత్యుష్ణంబును నతిశిశిరంబునుగాక సుఖంబుగ నున్నది. నేఁటి కేడవదినంబున నమావాస్య యగును. ఆయమావాస్య కింద్రుండు దేవతయని యార్యు లందురు. నాఁడు సంగ్రామం బారంభించుట కెల్లవిధంబుల యుక్తంబై యుండును. కావున మీ రెల్లరును నాటికి యుద్ధసన్నాహంబులు గావింపుండని పల్కుము. మఱియు యుద్ధోత్సాహంబున నేతెంచి యున్న రాజలోకం బునకెల్ల నావచనంబులుగా మీ కభిమతం బగుదానినెల్ల నేను దప్పక కావింతును. దుర్యోధనవశానుగు లగు రాజులును రాజపుత్త్రులును శస్త్రంబులచే నిధనంబు బ్రాపించి యుత్తమంబు లగులోకంబుల నొందుదురని చెప్పుము. నీవును సర్వసన్నాహంబుల యుద్ధాయత్తుండ వగుమని వచించె.

## కర్ణుండు యుద్ధనిమిత్తంబు లెఱింగించుట

కేశవుం డట్లుపలికినహితంబు శుభంబు నగువచనం బాకర్ణించి యావచనంబుల నెంతయు మెచ్చి కర్ణుండు మధుసూదనున కిట్లనియె. మాధవా! నీవెల్లయర్థంబులు బాగుగ నెఱింగినవాఁడవయ్యు నన్ను మోహితుఁగావింప దలంచెదవేల? ఇప్పు డీపృథివి కెల్ల వినాశంబు సముపస్థితంబై యున్నది. అది యెట్లును జరుగక తప్పదు. ఐనను దానికి శకునియు నేనును దుశ్శాసనుండును ధృతరాష్ట్రనందనుం డగుదుర్యోధనుండును నిమిత్తమాత్రులమై యుంటిమి. కృష్ణా! నిస్సంశయంబుగ నిది మహాయుద్ధంబు సముపస్థితంబై యున్నది. పాండవులకును గౌరవులకును బ్రవర్తించు నీమహాహవంబున రుధిరంబు కర్దమంబువోలె బ్రసరించును. దుర్యోధనవశవర్తు లగురాజులును రాజపుత్త్రులును శస్త్రనిధనంబొంది యమసదనంబున కేఁగుదురు. మధుసూదనా! ఘోరంబు లగు స్వప్నంబులు ఘోరంబు లగునిమిత్తంబులు మహాదారుణంబు లగునుత్పా

తంబులును వివిధంబులయి రోమహర్షణంబులై ధార్తరాష్ట్రునకుఁ బరాజయంబును యుధిష్ఠిరునకు విజయంబును సూచించుచున్నవి. ప్రాజాపత్యం బగునక్షత్రంబును దీప్తంబును మహాద్యుతిమతంబు నగుశనైశ్చరగ్రహంబు పీడించుచుండుటచేఁ బ్రజాపీడనం బవశ్యము కాక తీఱదు. అంగారకుండు జ్యేష్ఠానక్షత్రంబునందు వక్రించి మైత్రంబును సంగమించుచందంబున ననూరాధను బ్రార్థించుచున్నాఁడు. కృష్ణా! కౌరవులకు నిక్కంబుగ మహాభయం బుపస్థితంబై యున్నది. వృష్ణినందనా! విశేషించి చిత్రానక్షత్రమును గ్రహము పీడించుచున్నయది. చంద్రునందు నల్లనిమచ్చ యగపడుచున్నది. రాహువు సూర్యుని గ్రసింప సమీపించుచున్నవాఁడు. నిర్ఘాతంబులు నుల్కలును భూమిని గింప మొందింప దివంబుననుండి యుల్కలు రాలుచున్నవి. మాతంగము లన్నియు దుఃఖించుచున్నవి. తురంగంబులు కన్నీ రొలుకుచున్నవి. అయ్యవి పానీయంబునందును ఘాసంబునందును నాశ లేకుండ నున్నవి. ఇట్టి దుర్నిమిత్తంబులు ప్రాదుర్భవించునపుడు భయంబు సంభవించునని యార్యులు వక్కాణింతురు. మహాబాహూ! ఈ దుర్నిమిత్తంబులందు మహాప్రాణనాశంబు కాకతప్పదు. తురంగంబులు దంతావళంబులుగూడ నల్పంబు భుజించినను విణ్మాత్రంబు లధికంబులుగా నగపడుచున్నవి. ఈ దుర్నిమిత్తంబు లెల్ల దుర్యోధనుని సైన్యంబులం దధికంబులై చూపట్టుటం జేసి యాతనికిఁ బరాభవంబు తప్పక సంభవించును. ఈనిమిత్తంబులు పరాజయంబునకు సూచనంబు లని పెద్ద లందురు. కృష్ణా! పాండవులవాహనంబు లెల్ల ప్రహృష్టంబులై యున్నవనియుఁ జూచినవారు చెప్పుచున్నవారు. పాండవులకు మృగంబు లెల్ల బ్రదక్షిణంబులై జయంబు సూచించుచున్నయవి. ధార్తరాష్ట్రుల కన్నియో యపసవ్యంబులై యున్నవి. ధార్తరాష్ట్రునిసైన్యంబులందు నశరీరివాక్యంబులు భయంకరంబులుగ వినంబడుచుఁ బరాభవంబుఁ దెలుపుచున్నవి. పుణ్యశకునంబు లగుమయూరంబులును హంసంబులు సారసంబులు చాతకంబులును జకోరంబులును బాండవుల ననుగమించుచున్నవి. గృధ్రంబులు, బకంబులు, కాకంబులు, శ్యేనంబులు, కంకంబులు, యాతుధానులు, వృకంబులు, మక్షికాసంఘాతంబులును కౌరవుల ననుగమించుచున్నవి. దుర్యోధనుసైన్యంబులందు భేరులు మ్రోఁగ

కుండనున్నవి. పాండవులపటహంబు లన్ననో యనాహతంబులయ్యుఁ దమంత నవియే మ్రోఁగుచున్నవి. ధార్తరాష్ట్రునిసైన్యంబులందుఁ గూపంబులందు గోవృషంబులనాదంబుఁబోలు నాదంబులు వినవచ్చుచున్నవి. ఇవియెల్ల నాతనికిఁ బరాభవలక్షణంబులై యున్నవి. దివంబునుండి మాంసశోణితవర్షంబు గురియుచున్నది. మఱియు నాకాశంబున గంధర్వనగరంబు సప్రాకారంబును సవప్రంబును పరిఖాయుతంబును చారుతోరణంబునై కనంబడుచున్నది. మింట నల్లనిపరివేషంబు సూర్యమండలంబు నావరించియున్నది. ఉదయాస్తమయంబులందు సంధ్యలు మహాభయంబును దెల్పుచున్నవి. గోమాయువు ఘోరంబుగ కూయుచున్నది. ఇవియెల్ల దుర్యోధనునకుఁ బరాభవలక్షణంబులై యున్నవి. ఏకపక్షంబులు నేకాక్షిమంతంబులు నేకపాదంబులు నగుపక్షులు ఘోరంబు లగుకూఁత లిడుచున్నవి. అది పరాభవంబునకు చిహ్నంబగును. నల్లనికంఠంబులు నెఱ్ఱనిపాదంబులునుం గలభయంకరంబు లగు విహంగంబులు సంధ్యాభిముఖంబులై యెగురుచున్నవి. సుయోధనుండు బ్రాహ్మణులను సుహృదులను ద్వేషించుచున్నవాఁడు. అదియ మొదటి పరాభవచిహ్నంబుగా నెఱుంగఁదగును. గురువులను భక్తియుక్తు లగు భృత్యులను ద్వేషించుట పరాభవంబునకు మొదటిలక్షణము. పూర్వదిక్కు లోహితాకారంబుగలదియు, దక్షిణపుదెస శస్త్రవర్ణంబుగలదియు, పశ్చిమాశ పచ్చికుండవలె ధూసరకాంతిగలదియు, నుత్తరకాష్ఠశంఖధవళదీధితియు నని, దిక్కులకాంతు లార్యులచే నిర్దేశింపఁబడియున్నవి. ఇపుడన్ననో ధార్తరాష్ట్రునకు దిక్కులన్నియుఁ బ్రదీప్తంబులైయే యగపడుచున్నవి. అట్టియుత్పాతం బగపడినపుడు మహాభయంబు సంభవింపక తప్పదు. నాకొక్కనాటిరే యొక్కస్వప్నంబు వచ్చినది. అందు సహస్రస్తంభపరిష్కృతం బగుప్రాసాదంబును యుధిష్ఠిరుండు నాతని యనుజులు నధిరోహించుచుండఁ గంటిని. పాండవులెల్లరును సుధావదాతంబు లగువసనంబులు దాల్చి తెల్లనియుష్ణీషంబులు ధరించి తెల్లని యాసనంబులం దాసీనులై యుండ నాలోకించితిని. ఈభూమియెల్ల రుధిరావిలంబై ప్రేవులచే నావరింపఁబడినదై నాకగపడియె. అమితౌజస్కుండగు యుధిష్ఠిరుండు ఎముకలప్రోవులందుఁ గూర్చుండి సహృష్టుండై సువర్ణపాత్రమ్మున ఘృతపాయసంబు భుజించుచుండ నాలోకించితిని.

మఱియు యుధిష్ఠిరుం డీభూమినెల్ల మ్రింగుచున్న ట్లగపడియె. వాసుదేవా! ధర్మనందనుండు నీచే నొసంగఁబడిన యీభూమినిఁ దప్పక యనుభవింపంగలఁడు. మహోన్నతం బగుపర్వతం బారోహించి గదాపాణియై వృకోదరుం డిలాతలంబును మ్రింగుచున్నట్లు గాంచితిని. ఆక్రూరకర్ముం డగు వృకోదరుండు మమ్ములనెల్ల నిరవశేషంబుగఁ బరిమార్పక మానఁడు. హృషీకేశ! ఏయెడ ధర్మంబు నిలిచియుండు నయ్యెడనే జయంబు నిక్కంబని నేను బాగుగ నెఱుంగుదును. ధనంజయుండు గాండీవంబు కేలంబూని నీతోఁగూడి తెల్లనేనుంగు నధిరోహించి పరమం బగు సిరిచే వెలుంగం గాంచితిని. కావున కృష్ణా! మీరలు దుర్యోధనపురోగములగు రాజులనెల్ల వధించితీఱుదురు. ఆవిషయంబున నాకు లేశంబును సంశయముఁ లేదు. నకులుండును, సహదేవుండును, సాత్యకియు తెల్లని కేయూరములు, కంఠాభరణములు ధరించి శుక్లమాల్యాంబరావృతులై యుత్తమం బగునందలం బెక్కినట్లు కాంచితిని. వారుముగ్గురును పాండురమ్ము లగు ఛత్రములు, వసనమ్ములు, తెల్లనితలపాగలుగలిగి వెలుంగుచు నగపడిరి. కావున నెట్లును బాండవులకు విజయంబు కాక తప్పదని నేను నిశ్చయించికొంటిని. ఇంకను ధార్తరాష్ట్రబలంబులు నాస్వప్నంబున గోచరించినతెఱం గాకర్ణింపుము. అశ్వత్థాముండు, కృపుండు, కృతవర్ముండును, నింక నితరు లగుపార్థివులును, రక్తాంబరంబులు, రక్తోష్ణీషంబులు ధరించిరి. మహారథులగుభీష్మద్రోణులు లొట్టియలంబూన్చిన యరదం బెక్కియుండిరి. నేనును ధార్తరాష్ట్రులును గూడ సుప్రరథారూఢులమై భీష్మద్రోణులఁగూడి యెల్లరమును దక్షిణదిశ కరిగినట్లు కంటిని గావున మేమెల్లరము నచిరం బగుకాలంబుననే యమసదనంబున కరుగనున్నారము. నేను నితరు లగురాజన్యులు నా సకలం బగుక్షత్రమండలమును గాండీవాగ్నిం బ్రవేశించి యమసదనంబున కరుగుదుము. దీని కిసుమంతయు నాయెద సంశయంబు లేదు. అని వచించుటయుఁ మాధవుండు,'కర్ణా! నిక్కంబుగ నీవసుంధరకెల్ల వినాశం బాసన్నమైయున్నది. నేను నుడివినవచనంబులు నీహృదయంబునకు రుచింపకుండుటచే నీభూమికి నాశ మాసన్నమైనదని తలంచుచున్నాఁడను. సమస్తంబు లగుభూతంబులకును వినాశకాలంబు సమీపించినపుడు దుర్నయంబు నయంబువోలె హృదయంబంటి విడువకుండు'

విధంబుల దూయమానంబుగా మంత్రంబులబలాబలంబును బ్రాహ్మణుని వాగ్బలంబు నెఱుంగఁగోరినదాననై స్త్రీస్వభావంబునను బాలస్వభావంబునను మఱలమఱలఁ జింతించుచు ధాత్రిచే విస్రబ్ధంబుగ గోపనము గావింపఁబడినదాననై సఖీజనపరివృతనై దోషంబుఁ బరిహరించుచు తండ్రిచరిత్రంబు మాయకుండ రక్షించుచు నాకు సుకృతం బెట్లగును? అపరాధంబుగలుగకుండు నుపాయం బేదియని చింతించి యాబ్రాహ్మణునకు నమస్కారం బాచరించి కౌతూహలంబున నట్లాచరించి బాలిశనైతిని. నేను గన్యగానుండియు మంత్రప్రభావంబున సూర్యభగవాను నాహ్వానము గావించితిని. ఆతనివలన నాకు గర్భంబయ్యె. నే నాకన్యాకాలమందు సంభవించినగర్భంబు పుత్రునివలె రక్షించితిని. నాతనయుం డగుకర్ణుండు నావచనంబును భ్రాతృహితంబు నెట్లు గావింపకుండును?' ఇట్లని యాలోచించి యుత్తమం బగు కార్యనిశ్చయంబుగావించి కార్యార్థమును నిర్ణయించికొని భాగీరథీతీరంబున కరిగె. అట్లరిగి తనతనయుండును దయాళువు సత్యసంగరుండు నగుకర్ణుని జపస్థానం బాలోకించెను. ప్రాఙ్ముఖుండు నూర్ధ్వబాహుండునై జపించుచున్నకర్ణుని వెనుకభాగంబున నాతనిజపావసానసమయంబు నాకాంక్షించుచుండెను. సూర్యతాపార్త యగునామె కర్ణుని యుత్తరవసనంబునందు గూర్చుండియుండెను. కౌరవునకుఁ బత్ని వృష్ణికులసంజాత శోషించుచున్నపద్మమాలంబోలి యుండెను. కర్ణుండును బృష్ఠతాపంబుగలుగువఱకును జపించి తిరిగి నియతవ్రతుండై కుంతి నాలోకించి యభివాదనం బాచరించి కృతాంజలియై యామెను సమీపించెను. మహాతేజశ్శాలి మానధనుండు ధర్మభృదగ్రగణ్యుండు నగు కర్ణుండు కుంతికి నమస్కరించి యామె కిట్లని విన్నవించె.

'దేవి యధిరథునకు రాధకు నాత్మజుండ నగుకర్ణుండ నేను నీకభివాదనంబు గావించుచున్నాఁడను. నీ వేప్రయోజనంబుద్దేశించి యిక్కడకే తెంచినదానవు? నావలన నీకేకార్యంబు గావలసియున్నది' యనుటయుఁ గుంతి యిట్లనియె. పుత్రా! నీవు కుంతి కడుపారఁగన్న కుమారుఁడవు. రాధ నిన్ను గన్నతల్లి గాదు. అధిరథుండు నీకు జనకుండునుగాఁడు. నీవు సూతకులంబున జన్మించినవాఁడవుగావు. నావచనంబు నమ్ముము. నేను గన్యాకాలంబున నిను గడుపారఁగాంచితిని. నాతనయులందఱిలోను నీవు దొలుచూలుగాఁ బుట్టినవాఁడవు. పుత్రా! కుంతిభోజునింట నేను గన్యగా

నున్నయెడ నీవు జనించితివి. లోకంబులకెల్లం బ్రకాశం బొసంగి నిరా కులంబులుగం జేయుదివాకరభగవానుండు నాయందు శస్త్రభృత్ప్రవరుండ వగునిన్ను నుత్పాదించె. పుత్రా! నీవు సహజకుండలంబులును సహజకవచంబునుగలిగి మహాశోభచే వెలుంగుచు దేవగర్భంబవై జనించితివి. నీవు నీయనుజుల నజ్ఞానవశంబున నెఱుంగక ధార్తరాష్ట్రునినిమిత్తంబునం బాపం బాచరింప నుండు టెంతయు నయుక్తంబు. నరులకు ధర్మ నిశ్చయంబుగావించుచో పితృదేవతలును నేకదర్శిని యగుమాతయు సంతోషించుటయే పరమం బగుధర్మఫలం బని యార్యు లందురు. తొల్లి యర్జునుండు భుజబలంబున నార్జించినరాజ్యలక్ష్మినెల్ల నసాధుచరితులగుకౌరవు లపహరించిరి. నీవు ధార్తరాష్ట్రులవలన మరల దానిని నాకర్షించి యుధిష్ఠిరునితోఁగూడ ననుభవింపుము. కౌరవులెల్లరు నిప్పుడు కర్ణార్జునులు ప్రీతితోఁగలిసికొనుట నాలోకింతురుగాక. మీ రిరువురును భ్రాతృప్రేమంబున నొండొరుల నాలింగనముగావించికొను టాలోకించి యసత్పురుషులు తమశిరంబులు వ్రేలవైతురుగాక. రాముండును జనార్దనుండు నెట్లు సౌభ్రాత్రంబున మెలంగుచున్నవారో యట్లే కర్ణార్జునులును మెలంగెదరుగాక. మీరిరువురును గలసియున్నచో నీ లోకంబున మీ కసాధ్య మేముండును? మహాధ్వరంబున వేదియందు వేల్పులతోఁగూడిన ప్రజాపతింబోలి నీవేవు రనుజన్ములతోఁగూడి సింహాసనాసీనుండవై మిగుల వెలిఁగెదవు. నీవు సకలంబు లగుగుణంబులతోడం గూడియున్నాఁడవు. శ్రేష్ఠు లగుబాండవులందు జ్యేష్ఠుండవై యున్నాఁడవు. నీకు సూతపుత్రుం డనువ్యవహారం బయుక్తంబు. వీర్యవదగ్రణీ! నీవు ముమ్మాటికిని పార్థుండవై యున్నవాఁడవు అని వచించెను.

### కర్ణుం డర్జునుం దక్క నితరపాండవుల వధింపనని ప్రతిజ్ఞ చేయుట

కుంతి యిట్లుపలికి యూరకున్నంత సూర్యమండలమునుండి పితృప్రేమపూర్ణంబుగ భాస్కరుండు వలికినదివ్యవాణి కర్ణునకు శ్రవణగోచరంబయ్యె. "కర్ణా! యీపృథ వచించినదెల్ల సత్యంబె కాని యిందా వంతయు ననృతంబు లేదు. నీవు నీమాతచెప్పినవాక్యంబు లాదరించి యట్లు చరింపుము. నీజనని చెప్పిన ట్లాచరించితివేని నీకెల్లశ్రేయంబులును సమకూడును." ఇట్లు జనకుం డగుభాస్కరునిచేతను జనని యగు

కుంతిచేతను బోధింపంబడిన సాధీరుండగుకర్ణునిమతి లేశంబేని చలింప దయ్యె. ఆతనిమనంబు సత్యధైర్యంబుల నాలంబించియుండె. కర్ణుండు కుంతికి మరల నమస్కరించి యిట్లనియె: క్షత్రియవనితామణీ! నీవు వచించినవచనము నేను నమ్మఁజాలను. నీనియోగం బాచరించుటయే నాకు ధర్మంబునకు మార్గంబగును. తల్లీ! నీవు నాయెడ మహాత్యయం బగుపాపంబు గావించితివి. నన్ను దిక్కులేనివానినిగా పాఱవైచిపోయి తివి. దానివలన నాకీర్తియు యశంబును వినాశంబొందినవి. నేను క్షత్రి యుండనై జనించియు క్షత్రియసత్కారంబు లొందనేరక నీనిమిత్తం బునఁ బాపం బనుభవించితిని. నీకంటెను బాపాత్ముం డగునేశాత్రవుం డేపాపంబు నాకుఁ గావింపంగలఁడు? నీవు సంస్కారకాలంబున నీదయ యెల్లఁ బోనాడి మిన్నకుండియు హీనసంస్కారములు హీనమర్యాదలు నొందిన నన్నిపు డిట్లుప్రేరించుచున్నదానవు? నీవు నాకు ముందు జనని గావింపఁదగుహితం బేదియుఁ గావించినదానవుగావు. ఇపుడు కేవలము నీహితంబుమాత్ర మభిలషించి నాకు బోధించుచున్నదానవు. కృష్ణు నితోఁగూడిన ధనంజయుని కీలోకంబున భయపడకుండఁ గలవాఁ డెవ్వఁడు? నేనిపుడు పార్థులకడ కేతెంచి వారితోఁగలిసి యుంటినేని లోకంబులెల్లను నేను భీతిచేఁ బాండవుల శరణొందితినని తలంచును. ఇంతకుమున్నెల్ల నేనన్నదమ్ములు లేనివాఁడనని యెల్లరు నెఱుంగుదురు. ఇపుడు యుద్ధమాసన్నంబైయున్నపుడు పాండవులు నాయనుజులని ప్రకటించి నేను బాండవులకడ కరిగితినేని రాజలోకంబెల్ల నన్నేమని యాడిపోయును? నేను ధార్తరాష్ట్రులచే సర్వకామంబులందును భాగంబు లనుభవించితిని. యథాసుఖంబుగ వారిచే నెల్లపూజలు వడ సితిని. వారు గావించినసత్కారంబెల్ల నెట్లు వ్యర్థంబు గావింపంగలను? నన్ను నిత్యము నాలంబించి పరులతో ధార్తరాష్ట్రులు వైరంబుఁ దెచ్చి కొనియున్నారు. వాసవుని వసువు లెట్లట్ల నన్ను వారు నమస్కరించు చుందురు. నాబలంబున శాత్రవుల నెదిరింప వారు నిశ్చయించియున్న వారు. అట్టిధార్తరాష్ట్రులమనోరథం బిప్పుడకాండంబుగ నేనెట్లు చ్ఛేదింపంగలను? వారు నేను ప్లవంబుగా దుస్తరంబగుసమరమహార్ణ వంబు నిస్తరింప నాశించియున్నవారు. అపారంబగునాహవసాగరంబునఁ బారంబు ప్రాప్తింప నాశించువారియాశాలతను నేనెట్లు త్రెంచివేయఁ

గలను? ధార్తరాష్ట్రుల నాశ్రయించి జీవించువారెల్లరకును నిపుడను కూలంబగుసమయం బేతెంచియున్నది. నేను నాప్రాణంబులైనను సరకు సేయక వారిఋణము తీర్పవలసియున్నది. బాగుగఁ బోషింపఁబడి యెల్ల కార్యంబులందును గృతార్థులై ప్రత్యుపకారకాల మాసన్నమగునపుడు చేసినమేలు తలంపక యేపాత్ములు వికారమొందుదురో యట్టిస్థైర్యశూన్యులు రాజద్రోహులు భర్తృపిండాపహారులు నగుదురు. అట్టి నీచుల కీలోకంబున గాని పరలోకంబునఁగాని సుఖంబు దుర్లభంబైయుండును. జననీ! ధృతరాష్ట్రతనయులకొఱకై నీతనయులతో నాశక్తి యెల్ల వినియోగించి ప్రాణమున్నంతవఱకు యుద్ధంబుగావించెదను. నీవు తల్లివికదా! నీకుఁ బ్రియంబగుననుతలంపున నే ననృతంబు పలుకనోపను. నేనెల్లభంగుల యుద్ధంబుగావించి యానృశంస్యంబును సత్పురుషాచరితంబగువృత్తంబును రక్షించికొనియెదను. నీవచనం బత్యర్థకరంబే యైనను నీవచనంబు నేఁ గావింపనొల్లను. అయినను నీవు భీతచిత్తవై పుత్రత్రాణపరాయణవై నాకడ కేతెంచితివి కావున నీసంరంభంబు మోఘంబుగావింపను. వధ్యులు విషహ్యులు నగునీతనయుల నెల్ల నేసంహరింపందలంపను. ఒక్కయర్జునుని విడిచి మిగిలిన యుధిష్ఠిరభీమనకులసహదేవుల వధింపక విడిచెదను. యుధిష్ఠిరునిబలమునందెల్ల నాకర్జునునితోడనే యుద్ధంబుగాఁగలదు. ఒక్కయర్జునుని వధించితినేని నాయస్త్రవిద్యకును బలపరాక్రమంబులకును నుచితంబగుఫలంబు లభింపంగలదు. ఒకప్పుడు నేనే సవ్యసాచిచే వధింపంబడితినేనియు నాకు దుర్లభంబగుయశంబు చేకూరును. దేవీ! కర్ణుండు మరణించిన నర్జునునితోఁగూడి యేగురును, నర్జునుండు మరణించినఁ గర్ణునితోఁగూడి యేవురుగాని నీకుఁ దనయు లేవురుందురే కాని యాఱుగురుతనయు లెన్నండు నుండరు. నీకైదుగురుతనయు లెప్పుడు నశింపకయే యుందురు. కావున నీవు యథాసుఖంబుగ నుండుమని వచించె. అంత నాపలుకు లాలించి కుంతి దుఃఖంబున వేపమానాంగయై ధైర్యాతిశయంబున నకంపనుండగుకర్ణు నాలింగనంబుగావించుకొని యిట్లనియె. పుత్రా! ఇది యిట్లు కావలసియుండుట విధివిలాసంబే. కౌరవులకెల్ల వినాశంబు రాకతీఱదు. కర్ణా! నీవు పలికినమాటలాలించిన దైవంబు బలవత్తరం

బని తోఁచుచున్నయది. నీవు నలువురుతమ్ములకు నభయదానంబుగావిం చితివికదా? దానిని విస్మరింపకుము. నీకనామయంబును శుభంబునగుఁ గాక యని దీవించినంతఁ గర్ణుండు మరల కుంతీదేవిపాదంబులకుఁ బ్రణామం బాచరించి తనగృహంబున కరిగె. కుంతియు నాతనివీడి విచారంబున దనమందిరంబునకుం జనియె.

## కృష్ణుండు కౌరవులనిశ్చయము పాండవులకుఁ జెల్పుట

అట్లు కృష్ణుండు హాస్తినపురంబు వెలువడి బయలుదేఱి పవన మనోజవం బగునరదంబున నుపప్లవ్యంబున కేతెంచి పాండవులకుఁ గౌరవ సభయందలివృత్తాంతమెల్ల నెఱింగించెను. పెద్దకాలంబు పాండవులతో సంభాషణం బాచరించి మరలమరల మంత్రంబుగావించి విశ్రమించు టకై జనార్దనుండు తనమందిరంబున కరిగె. సూర్యుం డస్తగిరికరిగినంత విరాటప్రముఖులగురాజన్యుల విడిచి పాండవులు తమతమగృహంబుల కుం జనిరి. వారలెల్లరును సంధ్యాకాలకృత్యంబులెల్ల నిర్వర్తించిన యనంతరము కృష్ణునే మనంబున ధ్యానించుచున్నవారగుటం జేసి యాతనిని మరల రావించి మరల సమాలోచనంబు గావించిరి. అపుడు ధర్మనందనుండు వాసుదేవునితో జనార్దనా! నీవు హాస్తినపురంబునకేఁగి కౌరవసభయందు దుర్యోధనున కేమి వచించితి వద్దాని నిప్పుడు మా కెఱింగింపవే యని యడుగుటయు జనార్దనుండు రాజా! నేను హాస్తిన పురంబున కరిగి ధృతరాష్ట్రనందనునితో తథ్యంబులు పథ్యంబులు నగు పెక్కుహితంబులు వచించితిని. ఎన్ని చెప్పినను దురాత్ముం డగుసుయోధ నుండు నామాటలు గ్రహింపఁడయ్యెనని వచించె. అదివిని యుధిష్ఠి రుండు మాధవా! సుయోధనుం డట్లు దుర్మార్గంబు ననుగమించినపుడు కురువృద్ధుం డగుపితామహుండును, భరద్వాజాత్మజుం డగు ద్రోణా చార్యుండును, వానిపితరు లగుగాంధారీధృతరాష్ట్రులును, ధర్మవిదులకుఁ బ్రవరుండును మాకుఁ బిన్నతండ్రియు నగువిదురుండును, నాసభయందు సమావేశమైయున్న యితరనరపాలకులును దుర్మార్గుండగు నాదుర్యో ధనున కేమని హిత ముపదేశించి రది యెల్ల నెఱింగింపుము. గోవింద! కురుముఖ్యు లిరువురు వచించినవాక్యంబు నీవిదివఱకే యెఱింగించియుం టివి. కామలోభాభిభూతుండు మందుండు ప్రాజ్ఞమానియు నగుధార్త

రాష్ట్రుని యప్రియవచనంబు నెఱింగించితివి. అయిన నావాక్యంబు నామనంబున నుండదు. తక్కినవారివచనంబులుమాత్రము నేను విన దలంచుచున్నవాఁడను. మాధవా! కాలం బతిక్రమింపకుండ నుచిత కార్యంబు లాచరింపవలయును. గోవింద! మాకు గతివి నాథుండవు గురుండవు నీవకాని నీకంటె నితరుం డెవ్వండును మా కాప్తుండు లేఁడని వచించె.

అదివిని వాసుదేవుం డిట్లని చెప్పందొడంగె. రాజేంద్ర! కురు సభాంతరంబున నే నాసుయోధనునకుఁ దెలిపినవచనంబులు నీకెఱింగింతు నాలింపుము. నేను వాని కీవాక్యంబు లెఱింగించినంత దురాత్ముండగు దుర్యోధనుండు బిట్టు నగియెను. అదిచూచి మిగుల క్రుద్ధుండై శాంతనవుం డిట్లనియె. దుర్యోధనా! కులరక్షణార్థంబై నేను వచించువాక్యములు బాగుగ నెఱుంగుము. దాని నాలించి నీకులంబున కేదిహితం బగు నద్దాని నాచరింపుము. నాతండ్రి యగుశంతనురాజేంద్రుండు లోకంబులందెల్లఁ బ్రసిద్ధుండుకదా? వానికి నేనొక్కరుండనుమాత్రమే తనయుండను జనించియుంటిని. ఆరాజేంద్రునకు వేఱొక్కతనయుండు గూడ జనించిన బాగుగనుండు ననుతలంపు వొడమెను. పండితు లొక్కపుత్రుఁడుమాత్రము గలజనకు నపుత్రుండనియేకదా వ్యవహరింతురు? కులోచ్ఛేదంబు గాకుండను యశంబు విస్తరించులాగునను మఱియొక్కపుత్త్రునిం బడయ నాతని కభిలాషంబు వొడమె. ఆమహాత్ముని యభిమతం బెఱింగి నేను గాళి యనునామాంతరముగలసత్యవతిని తల్లినిగాఁ గోరి నాతండ్రి యభిమతంబు దీర్చుటకును గులంబు నుద్ధరించుటకును దుష్కరం బగుప్రతిజ్ఞ గావించియుంటిని. దానం జేసియే నేను రాజ్యంబుపాలింపక విడుచుటయు నూర్ధ్వరేతస్కుండనై యుండుటయు సంభవించినవని నీవ యెఱుంగుదువు. నేను నాప్రతిజ్ఞ నెఱవేర్చుచు ప్రతీతుండనై యిట్లు నివసించియున్నవాఁడను. ఆసత్యవతి యందుఁ గురుకులోద్వహుండును మహాబాహుండును ధర్మాత్ముండును నగువిచిత్రవీర్యుండు నాయనుజుం డుద్భవించె. అంతం గొంత కాలంబునకు నాజనకుండు స్వర్గంబున కేఁగ నేను విచిత్రవీర్యుని రాజ్యంబున నభిషిక్తుంగావించి రాజగు నాతనికి భృత్యుండను నాజ్ఞాకరుండనునై వానికనుకూలవతులగుభార్యలఁ దోడితెచ్చితిని. అతనికై భార్యలం గొని

వచ్చునపు డెన్నియో రాజసంఘంబుల జయించితినని నీవును బలుమాఱు
వినియుందువు. అనంతరం బస్త్రధరుం డగుపరశురామునితో ద్వంద్వ
యుద్ధ మాచరించితిని. విచిత్రవీర్యుండు పరశురామునకు భయమందిన
యీనగరవాసులచే విప్రవాసితుండయ్యె. ఆతండు భార్యలం దతివ్యా
సక్తుండగుటచే రాజయక్ష్మపీడితుండై కాలగతినొందెను. అప్పుడే
రాజ్యం బరాజకంబై యుండ సురేశ్వరుండు వర్షింపండయ్యె. అప్పుడు
ప్రజలెల్లరును క్షుద్భయపీడితులై నాకడ కరుదెంచి యిట్లనిరి. రాజా!
ప్రజలెల్లరును క్షయంబొందుచున్నవారు. మమ్మెల్లర రక్షించుపొంటె నీ
వీరాజ్యంబునకు రాజ వగుము. మాకు సంభవించునీతిబాధలం దొలం
గింపుము. శంతనునికులంబు నిలుపుము. నీప్రజలెల్లరును మహాదారు
ణంబు లగువ్యాధులచేఁ బీడింపఁబడుచున్నవారు. ప్రజలలోఁ బెక్కురు
నశించిరి. కొలఁదిమందిమాత్రమే మిగిలియున్నవారు. వీరలనైన నీవు
రక్షింపందగును. వ్యాధులనెల్లఁ ద్రోలి ధర్మంబున బ్రజలఁ బాలింపుము.
నీవు జీవించియుండఁగనే యీరాష్ట్రం బిట్లు వినాశ మొందం దగదనిరి.
ప్రజ లిట్లు మొఱలిడుచున్నను నామనంబు క్షుబ్ధంబుగాలేదు. నాకావిం
చినప్రతిజ్ఞను స్మరించియు సద్వృత్తం బాలోచించియు వారలవాక్యంబు
నే నాదరింపనైతిని. అపుడు పౌరులును నామాత యగుకాళియు
భృత్యులు పురోహితులు నాచార్యులు బహుశ్రుతు లగుబ్రాహ్మణోత్త
ములును నత్యధికముగ సంతాపంబందుచు నన్ను రాజ వగుమని మిగుల
నిర్బంధించిరి. వార లిట్లనిరి. ప్రతీపమహారాజుచే రక్షింపంబడినరాష్ట్రం
బెల్ల నిప్పుడు నీవలన నశింపనున్నయది. నీవు మాకెల్లరకును హితం
బాచరింప రాజ్యంబు గ్రహింపుమని వారు వచింప నేను కృతాంజలినై
మాతల్లి కిట్లు విన్నవించితిని. తల్లీ! కౌరవవంశంబున శంతనునకు తన
యుండనై జన్మించిన నేను నాపూనినప్రతిన యసత్యంబు గావింప
నోపను. విశేషించియు నాప్రతిజ్ఞ నీకొఱకై కదా కావించితి. పుత్ర
వత్సలా! నేను నీకెప్పుడును దాసుండను భృత్యుండను నైయుంటిని.
అట్టి నన్ను నీవిట్టి యకృత్యంబున నియోగింపంజనదని యామె నొప్పించి
వ్యాసుని నాయనుజభార్యలందు సంతానం బుత్పాదింపుమని ప్రార్థించితిని.
నేను నాజననితోఁగూడి యామహర్షినిఁ బ్రసన్నుంగావించి సంతానము
నకై యాచించితిని. ఆమహర్షిప్రవరుండు మాకోరినయట్లు యను

గ్రహించె. ఆతండు ముప్పురతనయుల నుత్పాదించె. అంధుండు నంగ హీనుండు నగుటం జేసి నీజనకుం డీధృతరాష్ట్రుండు రాజ్యార్హుండు గాఁడయ్యె. ఆకారణంబున గనిష్ఠుండయ్యు మహాత్ముండు లోకవిఖ్యాతుండు నగుపాండువు రాజయ్యెను. ఆపాండురాజే యీరాజ్యంబున కధీశ్వరుండు. పాండవులాతనికిం దనయులు. కావున వారలు తండ్రిదాయాదవ్యంబు హరింప నర్హులై యున్నవారు. సుయోధనా! నీవు కలహంబు గావింపకుము. వారలకు రాజ్యంబున సగపాలొసంగుము. నేను జీవించియుండ నన్నుఁగాదని యెవ్వం డీరాజ్యంబు పాలింపం దలంచును? నావచనంబు నవమానపఱుపకుము. నేను మీకెల్లరకును శమంబు గోరుచున్నవాఁడను. పుత్రా! నాకు నీయందును, వారలయందును భేదంబు లేశంబును లేదు. ఇయ్యది నీజనకునకును, గాంధారికిని, విదురునకును నభిమతంబగునది. వృద్ధులవచనంబు లాదరింపుము. నావచనంబుల ననుమానింపకుము. నిన్నును, బృథివిని, సర్వంబును నశింపనీక రక్షింపుమని వచించె.

భీష్ముం డిట్లు పలకినయనంతరం బాసుయోధనునకు ద్రోణుం డిట్లనియె: సుయోధనా! ఈరాజులెల్ల రాలించుచుండ నీతో నేఁజెప్పు మాటల నాదరింపుము. ప్రతీపునికుమారుఁడు శంతనుం డెట్లు కులం బుద్ధరించెనో? యాతనితనయుం డగుదేవవ్రతుండు దృఢప్రతిజ్ఞుఁడై యెట్లు కుల ముద్ధరించెనో, యట్ల సత్యసంధుండు, జితేంద్రియుండు నగుపాండునరపాలుండు కుల ముద్ధరించి మించెను. సువ్రతుండు, సుసమాహితుండు నగునాతం డీకురుదేశంబులకెల్ల రాజై వెలసెను. ఆతఁడు జ్యేష్ఠుం డగు ధృతరాష్ట్రునకును, గనిష్ఠుం డగు విదురునకును రాజ్యంబు న్యాసంబుగా నొసంగెను. ఆతండు నీజనకుని సింహాసనమందు నిలిపి తాను భార్యలిరువురతో వనంబున కరిగెను. విదురుండు నీతండ్రికి నమ్రుండై యుపాసనము గావించుచున్నవాఁడు. ఆతండు ప్రేష్యుండువోలె వాలవ్యజనంబు వీచుచు నీజనకునకుఁ బరిచర్యలు సలుపుచున్నవాఁడు. ఆకారణమున ప్రజలెల్లరఁ బొండురాజును సేవించునట్ల నీతండ్రిని గూడ జనాధినాథుగా సేవించుచున్నవారు. ఆపాండునరపాలుండు ధృతరాష్ట్రునకును, విదురునకును రాజ్య మప్పగించి యీయిలాతలం బెల్ల సంచరించె. కోశసంరక్షణంబునను, దానంబులను భృత్యులకు

వేతనంబులిచ్చి పోషించుటయందును, సత్యసంగరుం డగు విదురుండు నిత్యయత్తుండై యున్నవాఁడు. మహాతేజశ్శాలియుఁ, బరపురంజయుండు నగుభీష్ముండు సంధివిగ్రహంబులను, రాజులసంవాహనక్రియలను జూచు చుండెను. మహాబలుం డగుధృతరాష్ట్రుఁడు సింహాసనాసీనుండై విదురునిచే నిత్యము సేవింపఁబడుచుఁ బ్రజాపాలనంబు నెఱపుచున్నవాఁడు. అట్టిసత్కులమున జనించిన నీవు కులభేదం బెట్లు గావింపంగలవు? జనాధిపా! నీసోదరులతోఁగూడి రాజ్యభోగంబులెల్ల ననుభవింపుము. నేను గార్పణ్యంబునఁగాని, యర్థాశచేఁగాని యన్యాయ్యం బెన్నండును వచింపను. ఈరాజ్యం బిచ్చుటకు భీష్ముం డర్హుండుగాని నీవెంతమాత్రము నర్హుండవుగావు. రాజా! నేను నీవలన జీవనోపాయం బొందఁగోరు వాఁడనుగాను. భీష్మం డెక్కడనుండిన ద్రోణుం డక్కడనే యుండును. నీవు భీష్మునివచనంబు లాదరించి యాతండు పంచినట్లు గావింపుము. అరికర్శనా! పాండవులకు రాజ్యంబున నర్ధభాగం బిమ్ము. నేను మీకును వారలకునుగూడ సమంబుగనే గురుత్వంబు నెఱపియుంటిని. నాకశ్వత్థామ యెట్లు ప్రీతిపాత్రుఁడో యట్లే శ్వేతవాహనుం డగు నర్జునుండును బ్రీతిపాత్రంబై యున్నవాఁడు. పెక్కుమాటలాడనేల! ధర్మంబేపక్షంబుననుండు నాపక్షంబ విజయంబందుట నిక్కువమని వచించె.

ఇట్లు ద్రోణుండు వచించినయనంతరంబు సత్యసంగరుం డగువిదురుఁడు శాంతనవుఁవానన మాలోకించి యిట్లనియె. దేవవ్రతా! నేను వచించువచనంబు శ్రద్ధాళుండవై యాలింపుము. ప్రనష్టం బగు నీకురు కులంబును నీవు మరల నుద్ధరించితివి. అట్లయ్యు నేనెంతగ నేడ్చుచున్నను నావాక్యం బుపేక్షించుచున్నవాఁడవు. ఈకులంబునఁ గులపాంసనుం డగుదుర్యోధనుండన నెవ్వఁడు? నీవు లోభాభిభూతుం డగువానిమతి ననుసరించి చరించెదవేల? వాఁడనార్యుండు, నకృతజ్ఞుండు, లోభాకృష్టచిత్తుండునై ధర్మార్థదర్శి యగు తండ్రియానతి మీఱుచున్నవాఁడు. ఈకౌరవులెల్లరు దుర్యోధనునిమిత్తంబున నశింతురు. మహారాజా! వారలెల్ల నశింపకుండ నెట్లు చేయఁదగునో యట్లు గావింపుము. నన్నును ధృతరాష్ట్రునిగూడఁ బూర్వమే నీవు చిత్రకారుండు బొమ్మల నిలిపినట్ల చేతనులుగా నిలిపినావు. మహాత్మ! ప్రజాపతి తాన ప్రజలనెల్లసృజించి తాన వారల సంహరించునట్లు నీవు నిలిపినకులంబు నీవ నశింపనీక నీవు

చూచుచుండఁగనే యీకులంబు క్షీణింపకుండఁజేయుము. ఒకప్పుడు వినాశకాలంబు సమీపించి నీకు మతిచెడియుండెనేని నాతోడను, ధృతరాష్ట్రునితోడనుంగూడి యడవుల కరుగుము. అట్లు కాదంటివే నతిదుర్బుద్ధి యగు నీదుర్యోధను బద్ధుంగావించి కారాగారంబునం బడఁద్రోసి పాండవు లభిరక్షించుచుండ నీరాజ్యంబెల్లఁ బాలింపుము. రాజపుంగవా! ప్రసన్నుండవగుము. మహావినాశంబు సమీపించుచున్నయది. అందుఁ బాండవులు, కౌరవులు, నింక నితరు లగురాజులునుగూడ నశింతురు. అనిపలికి దీనమానసుండై రానున్నవినాశమును జింతించుచు మాటిమాటికి వెచ్చనూర్చుచు నూరకుండెను.

అనంతరంబు సుబలనందన ధృతరాష్ట్రునిపట్టమహిషి గాంధారి కులనాశంబునకు భీతినొంది పాపమతియు, నృశంసుండును నగుసుయోధనునితో రాజులెల్ల రాకర్ణించుచుండ ధర్మార్థయుక్తంబుగ నిట్లు వచించె. ఈరాజసభయందున్న రాజన్యులెల్లరును బ్రహ్మర్షులును పాపాత్ముండ వగు నీవును, నీమంత్రులు, భృత్యులు నాచరించినపాపంబెల్ల నాలింతురుగాక. నే నాపాపంబులెల్లఁ దెలిపెద. కౌరవులరాజ్యంబెల్లఁ గ్రమప్రాప్తంబై యనురూపభోజ్యంబై యున్నది. ఇది మాకులధర్మంబు. పుత్రా! నీవు పాపబద్ధుండవు, నతినృశంసకర్ముండవు నై, కౌరవరాజ్యంబు నన్యాయంబుగ నశింపఁజేయుచున్నవాఁడవు. ధృతరాష్ట్రుండు రాజ్యంబునకెల్ల నధినాథుండై యున్నవాఁడు. విదురుం డాతని యనుజన్ముండు. వీరల నిద్దఱ నతిక్రమించి మోహావశుండవై నీవెట్లు రాచఱిక మాశించుచున్నాఁడవు? మహానుభావు లగుధృతరాష్ట్రుండును, విదురుండునుగూడ భీష్ముండున్నంతకాలము పరాధీనులే యగుదురు. ఈనదీతనయుండు ధర్మకాముండై రాజ్యాశ విడిచినవాఁడు. అప్రధృష్యంబగు నీరాజ్యంబెల్లఁ బాండునరపాలునిది. దానిని బొంద నాతనియాత్మజులే యర్హులగుదురుగాని యితరు లెంతమాత్రము నర్హులు గారు. ఈసమస్తరాజ్యంబును బాండవులకుఁ బైతామహంబగునది. అది వారి పుత్రులను, బౌత్రులను ననుగమించును. కురుముఖ్యుండు, సత్యసంధుండు, మహావిద్వాంసుండు నగుదేవవ్రతుం డెట్లానతిచ్చె నట్లు మనమెల్లరము కాదనక గావింపందగును. మహావ్రతునియనుజ్ఞచే నీజనకుండు నీవిదురుండు నెట్లు వచింతు రట్లు కావించుట మనకు శ్రేయంబు.

కావున నీవు నీసుహృదు లొనఁగిన యీవాక్యంబు గాదనకుము. వారు నియోగించునట్లు కావింపుము. ధర్మంబు పురస్కరించికొని పెద్ద కాలంబు రాజ్యసుఖంబు లనుభవింపుచు న్యాయాగతమయిన యీకురు రాజ్యంబునెల్ల ధర్మనందనుండగు యుధిష్ఠిరుండు పాలించుఁగాక. ఆతనికి ధృతరాష్ట్రుండును, శాంతనవుండును బ్రోత్సాహంబు గూర్చుచుందురు గాక.

అనిపలికినంత జనేశ్వరుండు రాజులెల్లరు నాకర్ణించుచుండ ధృత రాష్ట్రుండు దుర్యోధనున కిట్లనియె: పుత్రా! నిన్నుద్దేశించి నేను పలుకు వచనంబులు సావధానుఁడవై యాలింపుము. నాయందుఁ బితృగౌరవము నీకుఁ గలదేని నాచెప్పినరీతిని బ్రవర్తింపుము. పుత్రా! ప్రజాపతియగు సోముండు తొలుత నీకురువంశవర్ధనుండై యుండె. సోముని కాఱవ తరమువాఁడు నహుషున కాత్మజుండు యయాతినరపాలకుండు. ఆతనికి రాజర్షిసత్తము లగునేవురుతనయులు జనించిరి. వారలలో మహాతేజుం డగుయదుండు జ్యేష్ఠుండు; మనవంశంబునకుఁ బూర్వుం డగు పూరుండా యేవురలోఁ గనిష్ఠుండు. ఆతండు వృషపర్వునకు దుహిత యగుశర్మిష్ఠ వలన జనించుటంజేసి వృషపర్వునకు దౌహిత్రుండయ్యె. యదుండు దేవయానివలన జనిచుటంజేసి శుక్రునకు దౌహిత్రుండయ్యె. ఆ యదుండు యాదవులకెల్ల వంశకర్తయై పరఁగె. బలవంతుఁడు వీర్యసమ్మ తుఁడు నగునాయదుండు, దర్పపూర్ణుండు, మందబుద్ధియునై క్షత్రంబు నెల్ల నవమానించె. బలదర్పవిమోహితుండై తండ్రిశాసనంబున నిలిచిన వాఁడుగాఁడు. అపరాజితుండగునాతండు తనజనకుని సోదరులను నవమా నించెను. ఆకాలంబున నీచతురంత యగుపృథివియందు యదునకు సరి యగుబలవంతు లెవ్వరును లేకుండిరి. ఆతండు సమస్తరాజులను దనకు వశులుగాఁ గావించికొని యీహాస్తినపురంబున నివసించెను. నహుషాత్మ జుండును, యదునకుఁ దండ్రియు నగుయయాతి యదువునెడ మిగులఁ గ్రుద్ధుండై వానిని శపించెను. మఱియు వానిని రాజ్యమునుండి తొలఁ గించెను. ఆయదువు ననుసరించిన వానిసోదరులనుగూడ యయాతి శపించి రాజ్యానర్హులుగా నొనరించెను. చిన్నవాఁడైనను దనకు వశంవదుండై చరించుచున్న పూరునకా రాజ్య మొసంగెను. జ్యేష్ఠుండైనను గర్వితుం డగువాఁడు రాజ్యం బొందనేరఁడు. వృద్ధుల సేవించువారు పిన్నలైనను

రాజ్యంబు నొందుదురు. ఆక్రమంబుననే ప్రతీపుం డనురాజు త్రిలోక
విశ్రుతుండు నాతండ్రికిం బితామహుండు విలసిల్లెను. సర్వధర్మజ్ఞుం డగు
నాపార్థివాగ్రణి ధర్మంబు విడువక రాజ్యంబు పాలించుచున్నెడ దేవ
కల్పులు, మహాయశస్వులు నగు ముగ్గురుతనయు లుద్భవించిరి. అందు
జ్యేష్ఠుండు దేవాపి, ఆతనితరువాతివాఁడు బాహ్లీకుండు, మూఁడవ
వాఁడు శంతనుండును నాఁ బ్రసిద్ధులైరి. ఆశంతనుండు నాకుఁ బితా
మహుండు. మహాతేజశ్శాలియు రాజసత్తముండు నగు దేవాపి దైవ
దోషంబున జర్మరోగంబుగలవాఁడయ్యె. ఆతండు ధార్మికుండు సత్య
వచనుండు పితృశుశ్రూషానిరతుండు పౌరులకు జానపదులకును బరమ
సమ్మతుండు సాధుసత్కృతుండునై యొప్పెను. దేవాపి ప్రజలలో బాలు
రకు వృద్ధులకుంగూడఁ బ్రియుండై యుండె. మఱియు వదాన్యుండు సత్య
సంధుండు సర్వభూతహితాభిరతుండునై జనకునియొక్కయు బ్రాహ్మ
ణులయొక్కయు నాజ్ఞల నాదరించి వారి ననుసరించి చరించువాఁడు.
ఆతండు తనయనుజు లగు బాహ్లీకునకును శంతనునకునుగూడ నత్యధిక
ప్రియుండై వెలసె. ఆమహాత్ములు ముగ్గురుసోదరులసౌభ్రాత్ర మత్యు
త్తమమయ్యె. ఇట్లు కాలంబు కొంత చనినపిదప వృద్ధుం డగు ప్రతీపుండు
దేవాపికి శాస్త్రచోదితమార్గంబున రాజ్యాభిషేకంబు గావింపందలంచి
వలయుసంభారంబులెల్ల నేకరింపందొడంగె. సకలంబు లగుమంగళంబు
లును గావించెను. అంత బ్రాహ్మణులును బౌరజానపదవృద్ధులును రాజు
కడ కేతెంచి దేవాపికి రాజ్యాభిషేకంబు గావింపవలదని వారించిరి.
అదిచూచి ధర్మాత్ముండగు ప్రతీపుండు దేవాపిరాజ్యాభిషేకంబు నివృత్తం
బగుట కశ్రుకంఠుండై యెంతయు శోకించెను. వదాన్యుండు ధర్మా
త్ముండు సత్యవాది ప్రజల కతిప్రీతిపాత్రంబు నగు దేవాపి చర్మరోగ
గ్రస్తుండగుటచే రాజ్యమొందకపోయెను. దేవతలు హీనాంగుఁ డగు
రాజు నభినందింపరని తెలిపి బ్రాహ్మణులు దేవాపికిఁ బట్టాభిషేకంబు
గావింపకుండ నిషేధించిరి. అదికారణంబుగఁ బుత్త్రశోకాతురుండై
ప్రవ్యథితాంగుండై కొంతకాలంబున కాప్రతీపనరపాలుండు మృతినొం
దెను. తండ్రి కాలధర్మమొందినపిదప దేవాపి వనంబుల కరిగి తపం బొన
రించెను. బాహ్లీకుండు రాజ్యసంపదలెల్ల విసర్జించి మాతులకులంబున
కరిగెను. ఆతండు తండ్రి జీవించియున్నపుడే జనకుని సోదరులను వీడి

పరమసంపన్నం బగు మాతుల కులంబున కరిగె. ప్రతీపుండు మృతినొందుటయు దేవాపి వనసంశ్రితుండగుటయుఁ గారణంబులుగా బాహ్లికుని యనుమతింబడసి కనిష్ఠుండై నను శంతనుండు రాజ్యంబున నభిషిక్తుండయ్యెను. ఆతండు మహామహిమంబున ధర్మంబున బ్రజలఁబాలించి దివంబునకుం జనియె. నేనును హీనాంగుండ నగుటంజేసి రాజ్యంబున కనర్హుండనైతిని. మతిమంతుండు మహాప్రాజ్ఞుండు నగుపాండుఁడు పృథివికి రాజయ్యెను. నేను జ్యేష్ఠుండ నయ్యు రాజ్యార్హుండను గానైతిని; పిన్నవాఁడయ్యుఁ బాండురాజు సింహాసన మలంకరించెను. ఆపాండునిమరణానంతర మీరాజ్యం బాతనితనయులకు వశముగావలసియుండెను. వత్సా! రాజ్యంబునకు నేనే యభాగినై యుండ నీవెట్లు రాజ్యంబున శాశించెదవు? నీవు రాజతనయుండవును గావు. స్వామివిని గావు. నీవు కేవలము పరధనము లపహరించుటకే ప్రయత్నించుచున్నవాఁడవు. మహాత్ముండగుయుధిష్ఠిరుండు వాస్తవంబుగ రాజునకుఁ దనయుండు. ఈరాజ్యంబెల్ల నాతనికి న్యాయాగత మగునది. ఈకౌరవకులంబునకెల్ల నాతండ నిక్కంబుగ భర్త. ఆమహానుభావుండే యీరాజ్యంబునకెల్ల శాసింపఁదగువాఁడు. ఆతండు సత్యసంధుండు, అప్రమత్తుండు, శాస్త్రనిరతుండు, బంధుజనంబునకు సాధువు, ప్రజలకుఁ బ్రియుఁడు, మిత్రులయెడ దయాళుండు, జితేంద్రియుండు, సాధుజనరక్షకుండునై విలసిల్లుచున్నవాఁడు. క్షమ, దయ, తితిక్ష, దమము, ఋజువృత్తి, సత్యవ్రతంబు, శాస్త్రపరిజ్ఞానంబు, నప్రమాదంబు, భూతదయాళుత్వము, అనుశాసనంబునను రాజగుణంబులెల్లను యుధిష్ఠిరునందు నిండియున్నవి. నీవు రాజపుత్త్రుండవా కావైతివి, నీవృత్తమా యనార్యవృత్తము. నీవు లుబ్ధుండవు, నెల్లపుడును బాపబుద్ధివియునై యున్నాఁడవు. నీవు బంధువులకెప్పుడును పాపంబు లాచరించుచున్నవాఁడవు. పరులకుఁ గులక్రమాగతం బగు నీరాజ్యం బపహరించుటకు నీవు దుర్వినీతుండవై ప్రయత్నించుచున్నవాఁడవు. ఇంకనైనను నీవజ్ఞానంబు విడిచి పాండవులకు రాజ్యంబు సగపాలిమ్ము. వాహనంబులందును బరిచ్ఛదంబులందును సగపాలు పాండవులకిమ్ము. వారికీయఁగా మిగిలినసగభాగము నీకు నీయనుజులకు భృత్యామాత్యులకును జాలియుండు నని వచించెను.

ఇట్లు ద్రోణుండును, భీష్ముండును, విదురుండును, గాంధారియు, ధృతరాష్ట్రుండును నెన్ని చెప్పినను నాలింపక మందబుద్ధి యగు నాసుయోధనుండు వారివచనంబు లెల్ల నిరాకరించెను. ఆమందుండు వారలనెల్ల నవమానించి క్రోధసంరక్తలోచనుండై యాసనంబువీడి లేచెను. ఆతండు సభ విడిచినంతన సమస్తరాజులును జీవితంబులం దాశలు పరిత్యజించి వాని ననుసరించి వెడలిరి. ఆసుయోధనుండు నష్టచేతను లగు నాధరానాథులనెల్ల నిపుడ పుష్యయోగంబు, ఇప్పుడ మీరెల్లరును గురుక్షేత్రంబునకు నరుగుఁడని మాటిమాటికి నాజ్ఞాపించెను. అంత నారాజులెల్లరును సేనలతోఁగూడి భీష్ముని సర్వసేనాధిపతిం గావించి కురుక్షేత్రంబునకు వెడలిరి. కాలచోదితు లగువా రెల్లరును శాంతనవునిఁ బురస్కరించుకొని హర్షపరవశులై యుప్పొంగుచున్నవారు. కౌరవులబలంబెల్లఁ బదునొకండక్షౌహిణు లయియున్నది. ఆసైన్యమునకెల్ల నగ్రంబున తాలకేతుండగుభీష్ముండు వెలుంగుచున్నవాఁడు. రాజా! ఈసమయంబున నేది యుచితంబగు నద్దానిని నీవును గావింపుము. ద్రోణుఁడు, భీష్ముఁడు, విదురుఁడు, గాంధారి, ధృతరాష్ట్రుండు నాయెదుర నేమి వచించినది యెల్ల నీకెఱింగించితి. నేను సౌభ్రాత్రంబు నాశించి తొలుత సామంబు ప్రయోగించితిని. ఈవంశంబునకును బ్రజలకును వృద్ధి నాశించి నేను సామవచనంబు లధికముగ నాడితిని. నాసామోపాయంబు గ్రహింపని యంతట భేదంబు ప్రయోగించితిని. దేవమానుషసంహితంబులగుకర్మంబులఁ దెలిపితిని. ఆసుయోధనుండు నాసామవచనంబు లంగీకరింపకున్నంత నెల్లపార్థివులకును భేదంబు గల్పించితిని. అద్భుతంబులు, ఘోరంబులు, దారుణంబులు, అమానుషంబులు నగుకర్మంబులం జూపితిని. ఆరాజులకెల్ల నిర్భర్త్సనంబు గావించితిని. సుయోధనుని తృణీకరించితి. రాధేయుని భయపఱిచితిని. సౌబలు నత్యధికముగ నిందించితిని. ధార్తరాష్ట్రులకెల్ల ద్యూతంబు గారణంబుగఁ బెక్కువిధముల నింద నాపాదించితిని. ఆరాజులనెల్ల వాక్యంబులచేతను మంత్రంబునను భేదించి మరల సామం బాలంబించి రాజ్యప్రదానంబు నర్థించితిని. కురువంశంబున భేదంబు గలుగరాదను నుద్దేశంబునను గార్యయోగం బట్లుండుటను బాండవులెల్లరును శూరులై యున్నను ధృతరాష్ట్రునకును భీష్మునకును, విదురునకును, నధశ్చరులై యుందురని వచించితిని. నీవు

వారలకు రాజ్యమిమ్ము. ఈధృతరాష్ట్రుండు గాంగేయుండు విదురుండు
నెట్లు వచించి రట్లు గావింపుము. వారి కేవురకేను గ్రామంబులుమాత్ర
మొసంగి మిగిలినరాజ్యంబు సర్వంబు నీవ యనుభవింపుము. ఆపాండవు
లవశ్యమును నీతండ్రిచే భరింపఁదగువారు. వారల విడుచుట న్యాయంబు
గాదని యెంతచెప్పినను వినక యాదురాత్ముండు పాలీయ నంగీకరింపం
డయ్యె. అట్లు కౌరవులు దుష్టులై యున్నయెడ వారలయెడ దండంబు
దప్ప నితరోపాయంబు గానరాకున్నయది. రాజులెల్ల రింతకుమున్న
కురుక్షేత్రంబునకు బయలుదేఱి వినాశంబున కెదురుచూచుచున్నవారు.
ధర్మనందనా! కురుసభయందు జరగినవృత్తాంతంబెల్ల నీకెఱింగించితిని.
వారలు యుద్ధంబునంగాని సామంబున రాజ్యం బొసంగరనుట నిశ్చ
యము. వారలెల్లరును మరణం బాసన్నంబగుట వినాశంబునకుఁ గారణం
బగుచున్నవారు.

### పాండవులు ధృష్టద్యుమ్నుని సేనానిగా నియమించుట

ఇట్లు జనార్దనుండు పలికినవచనంబు లాలించి ధర్మనందనుం డగు
యుధిష్ఠిరుండు కేశవునియెదుటఁ దనసహోదరుల కిట్లనియె. మీరలెల్ల
రును గురుసభయందు జరగినవృత్తాంతంబెల్ల వింటిరికదా? కేశవుం డా
సభయందుఁ బలికినవచనంబులు నాలించియుంటిరి. కావున నిపుడు
మనము సేనావిభాగంబు గావింపవలయును. మనవిజయంబు నాకాం
క్షించుచు మనకు సాయమొనరింపవచ్చియున్న సైన్యంబు లేడక్షౌహి
ణులుగలవు. ఆయక్షౌహిణుల కేడింటికి నేడుగురు నాయకు లుండఁదగు
దురు. వారినామంబు లాలింపుఁడు. విరాటుండు, ద్రుపదుండు, ధృష్ట
ద్యుమ్నుండు, శిఖండి, సాత్యకి, చేకితానుండు, భీమసేనుండు. నీయేడు
గురు నేడక్షౌహిణులకు నాయకులుగా నుందురు. వీరలెల్లరును సమరం
బున బ్రాణంబులనేని విడువంగలసాహసికులు. వేదవేత్తలు, శూరులు,
సుచరితవ్రతులు, హ్రీమంతులు, నీతిమంతులు, యుద్ధవిశారదులు, ఇష్వస్త్ర
కుశలులు, సర్వాస్త్రయోధులు నగువీర లాసేనలఁ బ్రవర్తింపఁజేయుచుం
దురుగాక. ఈయేడుసేనలకును నధినాయకుం డొక్కరుం డుండవల
యును. అతఁడు శరార్చిఃపావకుం డనంబరగు భీష్మునిఢాకకుం దాళఁగల
వాఁడై యుండందగును. సహదేవా! అట్టివాఁ డెవ్వఁడో? ఎవ్వఁ డీసేనల

కెల్ల నేకనాయకుఁడు గానర్హుండో నీబుద్ధికిఁ దోఁచినతెఱంగు నీవెఱిం
గింపు మనుటయు సహదేవుం డిట్లనియె. రాజా! ఈవిరాటుండు
మనకు చుట్టంబును, మనతోడ సమానసుఖదుఃఖము లనుభవించువాఁడు
నై యున్నవాఁడు. మన మాతని నాశ్రయించియే మనపాలు చేకొనం
దలంచుచున్నవారము. మత్స్యదేశాధీశుండు, మహాబలపరాక్రమో
పేతుండు, కృతాస్త్రుండు, యుద్ధదుర్మదుండు నగునీతండు సంగ్రామం
బున భీష్ముని నింకనుంగలమహారథులనెల్ల సహింపంగలఁడని వచించె.
అట్లు సహదేవుఁడు పలికినయనంతరము నకులుండు వయస్సునను, శాస్త్రం
బునను, ధైర్యంబునను, గులంబునను, జన్మంబునను నీద్రుపదుం డుత్త
మత్వంబున విరాజిల్లుచున్నవాఁడు. హ్రీమంతుండు, బలాన్వితుండు,
శ్రీమంతుండు, శాస్త్రవిశారదుండు నగునీతండు భరద్వాజునివలన నెల్ల
యస్త్రంబుల నెఱింగియున్నవాఁడు. దుర్ధర్షుండు, సత్యసంగరుండు నగు
నీతండు నిత్యంబు ద్రోణునితోడను, భీష్మునితోడను స్పర్ధగొనియుండును.
పార్థివులకెల్ల ముఖ్యుం డగునీతం డెల్లరాజులకును వాహినీపతియై
యుండఁదగువాఁడు. శతశాఖం బగు మహాద్రుమంబువోలెఁ బుత్రుల
తోడను, బౌత్రులతోడను బరివృతుండై యున్నవాఁడు. ఈతండు
భార్యతోఁగూడి ఘోరం బగుతపం బాచరించెను. సమితిశోభనుం డగు
నీతండు రోషంబున ద్రోణుని జంపుటకై యెన్నియేనితపంబు లాచరిం
చినవాఁడు. ఈపార్థివపుంగవుం డెల్లపుడును మనలను దండ్రివలె నాద
రించుచున్నవాఁడు. మనకు శ్వశురుండు. అట్టిద్రుపదుం డీసేనాగ్రంబు
నాకర్షించుఁగాక. ఆతండు యుద్ధోత్సాహంబున వచ్చినద్రోణభీష్ముల నివా
రింపంగలం డని నేనెంచుచున్నవాఁడను. మఱియు నాతండు దివ్యాస్త్రం
బులనెల్లఁ జక్క నెఱింగినవాఁడు. అంగిరసునకుఁ బరమమిత్రుం డని నకు
లుండు వచించుటయు నింద్రనందనుండు తనయభిమతం బిట్లెఱింగించె.
ఎవ్వండు తపఃప్రభావంబునను, ఋషులసంతోషమునను, నగ్నిజ్వాలల
వంటివర్ణంబును, మహాభుజంబులునుగలిగి ధనుర్ధరుండును, కవచధారి
యునై ఖడ్గంబు కేలంబూని దివ్యంబు లగుహయంబులంబూన్చిన మహా
రథం బధిరోహించి యగ్నికుండమువలన నుద్భవించిన దివ్యపురుషుండో;
ఎవ్వండు రథఘోషంబున మహామేఘంబువోలె గర్జించునో; యెవ్వండు
సింహసంహననుండు, సింహతుల్యపరాక్రముండు, సింహోరస్కుండు,

సింహభుజుండు, సింహవక్షుస్కుండు, సింహగర్జనుండు, సింహస్కంధుండు, మహాబలుండు, మహాద్యుతిమంతుండునై వెలుంగుచుండునో; సుభ్రువుండు, సుదంష్ట్రుండు, సుహానుండు, సుముఖుండు, అకృశుండు, సుజత్రుండు, సువిశాలాక్షుండు, సుపాదుండు, సుప్రతిష్ఠితుండునై విరాజిల్లుచున్నవాఁడో; మఱియుఁ బ్రభిన్నంబగు మత్తగజంబువోలె సకలశస్త్రంబులకు నభేద్యుండునై విలసిల్లువాఁడో; యెవ్వఁడు జితేంద్రియుండును, సత్యవాదియునై ద్రోణుని సంహరింప నుద్భవించియున్నవాఁడో యట్టిధృష్టద్యుమ్నుండు భీష్మునిసాయకంబుల సహించు నని నేను దలంచుచున్నవాఁడను. భీష్మునిసాయకంబులు వజ్రాశనిసమస్పర్శంబులు, దీప్తాస్యంబులు, మహోరగంబులువోలె భయంకరంబులు, వేగంబున యమదూతలకు సరియగునవి, నిపాతంబున నగ్నికి సాటియగునవి. వానిని సమరంబున నోర్చి యింతకుమున్ను జీవించినవాఁ డొక్కజామదగ్న్యుండు దక్క నింకొక్కరుండు లేఁడు. వజ్రనిష్పేషంబువోలె దారుణంబు లగు నాబాణంబుల సహింపంగలపురుషుం డెవ్వండును నాకగపడకున్నవాఁడు. ఒక్కధృష్టద్యుమ్నుండుమాత్రము శాంతనవు నెదిరించి నిలువంగలఁ డని నేను దలంచుచున్నవాఁడను. క్షిప్రహస్తుండు చిత్రయోధనుండు నగునాతండు సేనాపతిగా నుండందగును. అభేద్యకవచంబుగల యాతండు మాతంగములందు యూథపంబువోలె సైన్యంబులందు విరాజిల్లంగలఁడు. కావున ధృష్టద్యుమ్నుం డెల్లభంగుల సేనాధిపతిగా నుండఁదగువాఁ డని వచించుటయు నర్జునునిమాటలకుఁ బిదప భీమసేనుం డిట్లనియె. ద్రుపదునియాత్మజుం డగుశిఖండి భీష్మునివధించుటకే యుద్భవించెనని సిద్ధులును, మహర్షులును జెప్పుచుండ నే నాకర్ణించియుంటిని. ఆతండు సంగ్రామమధ్యంబున దివ్యాస్త్రంబులఁ బ్రయోగించునపుడు మహాత్ముం డగుపరశురాముండువోలె చూపఱకు భయంకరుండై యుండును. శిఖండి నెదిరించి పోరంగలపురుషుని నే నెందు నాలోకింపను. సమరసన్నద్ధుండై రథంబు నారోహించి శస్త్రప్రయోగంబు గావించుభీష్ముని ద్వంద్వయుద్ధంబున నెదిరించి వధింపంగలవీరుం డీశిఖండి తక్క నిం కెవ్వండును గానరాఁడు. కావున శిఖండి సేనానాయకుండగుట నాకు సమ్మతం బనియె.

అది విని ధర్మనందనుం డిట్లనియె. ఈజగంబులన్నిటి సారంబు నసారంబు నీకేశవుం డెఱుంగును. ఈతండ యెల్లరబలాబలంబులు నెఱుంగును. ధర్మాత్ముండగువాసు దేవుండు వీరలందఱమతంబులు నెఱుంగును. కృష్ణుం డెవ్వనిఁ బేర్కొనునో వాఁడే సేనాపతియగుఁగాక యని నాతలంపు. కృతాస్త్రుండుకానీ, యకృతాస్త్రుండుకానీ, వృద్ధుండుకానీ, బాలుండుగానీ, తరుణవయస్కుండుగానీ కృష్ణుం డెవ్వని నంగీకరించునో వానినే మనసేనలకు నాయకుని గావింపందగును. ఈకేశవుండే మనవిజయంబునకు మూలము. అపజయంబునకైన నీతండ మూలము. ఈవాసుదేవునంద ప్రాణంబులు, రాజ్యంబు, భావాభావంబులు, సుఖ దుఃఖంబులు నాయత్తంబై యున్నవి. ఈతండే ధాతయు, విధాతయు నైయున్నాఁడు. ఈతనియందే సిద్ధి ప్రతిష్ఠితంబై యున్నది. కావున గృష్ణుఁ డెవ్వనిఁ బేర్కొనునో వాఁడే సేనాపతియగుఁగాక. కావున గృష్ణుండుకూడ తనయభిప్రాయం బెఱింగించుఁగాక. ఇప్పని నిశాసమయంబున ప్రవర్తించుచున్నది. మనము కృష్ణునకు వశవర్తులమై సేనానాయకు నొక్కని స్వీకరించి రాత్రిశేషంబు కడచి చన్నంతన రథాంగణంబునకు వెడలుదము. మనశస్త్రంబుల కధివాసనంబుంగావించి కౌతుక మంగళంబులెల్లఁ గావింత మని వచించుటయు నది విని కృష్ణుం డిట్లనియె. మహారాజ! మీరు పేర్కొనినవారే నాకు నభిమతమైనవారు. విక్రాంత యోధులగువారే సేనానాయకులు గాఁదగినవారు. వీరలెల్లరును నీశాత్రవుల బాధించుటకు సమర్థులే. వీరలు మహాహవంబున నమరేంద్రునకేని భయంబు గలిగింతురు. లుబ్ధులు పాపచిత్తులు నగుధార్తరాష్ట్రులన వీరి కెంతటివారు? నేనుగూడ నీకు ప్రియంబగు ననుతలంపున మహాహవము విషయమై చాలఁ బ్రయత్నముగావించితిని. ఎట్లయినను శమంబు గలుగ వలయునని యత్నించితిని. మనము ధర్మమునకు ఋణవిముక్తులము. మనల నెవ్వరును నింక నిందింపంజాలరు. వివేకరహితుండగు దుర్యోధనుండు దనను గృతార్థునిఁగాను, బలస్థునిఁగాను దలంచుకొనుచున్న వాఁడు. సేన బాగుగ యోజింపంబడుఁగాక. కౌరవులు నసాధ్యులే యని నాయూహము. ధార్తరాష్ట్రు లీధనంజయుని చూచినంతన సమర భూముని నిలువఁజాలరు. క్రుద్ధుండగుభీమసేనుని, యమసమానులగుకవలవారిని, యుయుధానుని, ధృష్టద్యుమ్నుని, నభిమన్యుని, ద్రౌపదేయు

## పాండవులు శిబిరనిర్మాణంబు గావించుట

అంత నక్కురుక్షేత్రంబున ధర్మనందనుండు సమంబును స్నిగ్ధంబును సమృద్ధతృణకాష్ఠజలంబు నగు నొక్కరమణీయప్రదేశంబున సేనానివేశంబు గావించె. శ్మశానంబులు దేవతాలయంబులు మహర్షుల యాశ్రమంబులు పుణ్యతీర్థంబులును సమీపంబున లేక యూషరంబు గాక మధురంబై శుచియుఁ బుణ్యంబు నగు నా ప్రదేశంబు సేనానివేశనంబున కెంతయు యుక్తంబై యొప్పె. పిదప గొంతవడి విశ్రమించి గుఱ్ఱంబుల నేదదేర్చి యనంతరము వందలు వేలుగా నరపతులెల్ల వెంట రా రథం బారోహించి యటనట గుంపులుగాఁ జేరియున్న ధార్తరాష్ట్రసైనికులనెల్ల దూరంబుగాఁ దోలుచు పార్థకేశవులతో నా ప్రదేశంబుఁ జుట్టివచ్చెను. పృషతాత్మజుం డగు ధృష్టద్యుమ్నుండును, రథోదారుండగు సాత్యకియు, వీరోద్యగ్రుం డగు యుయుధానుండును, శిబిరంబుల కనువగు ప్రదేశంబులఁ గొలిచిరి. బురదయు ఱాలును లేక శుచియగుజలము గలదియు మంచి రేవులు గలదియుఁ బుణ్యతమంబు నగు హిరణ్వతీనదీతీరంబున శిబిరంబుల నిర్మించిరి. కేశవుం డయ్యెడ మహాగంభీరంబగు పరిఖ త్రవ్వించెను. ఆయగడ్తను శాత్రవులు పూడ్చివేయకుండఁ గాచుటకై యటఁ గొంతబలంబు నియమించె. పాండవుల కెట్టిశిబిరంబులు నిర్మింపఁబడినవో యట్టిశిబిరంబులనే యితరరాజులకుం గూడ వాసుదేవుండు నిర్మింపం జేసె. మహాపటిష్ఠంబు లగు కాష్ఠంబులును దురాధర్షతరంబులును, భక్ష్యభోజ్యాన్నపానాదిసమృద్ధంబులును, మహార్హమణిగణఖచితంబులు నగు శిబిరంబులు రాజు లందఱకు వేలువేలుగ నిర్మింపంబడి యొప్పె. ఆశిబిరంబులు మహీతలంబున కవతరించిన దేవతావిమానంబులంబోలి ప్రకాశించె. ఆస్కంధావారంబున దత్తవేతనులై ప్రాజ్ఞు లగు శిల్పులు వేలకొలందిగ నుండిరి. శాస్త్రవిశారదులగు వైద్యులు సర్వోపకరణంబులతోడ నుండిరి. ధనుస్సులు కవచంబులు శస్త్రంబులు తేనె, నేయి, సర్జరసంబు సికతంబులు మొదలగు నుపకరణంబులు పర్వతంబు లంత లేసి రాసులుగా నుంపఁబడియెను. జలం బయ్యెడ సమృద్ధంబుగ నుండె. అశ్వగజగ్రాసంబులును సుసంపన్నంబులై యొప్పె. అందందు నుముకతో నిండిన నెగళ్లయందు నిప్పురగుల్కొలుపఁబడియుండె. యుధిష్ఠి

రుండు ప్రతిశిబిరంబునకు నేఁగి యందలివస్తుసంగ్రహమును వీక్షించుచు సంచరించె. మహాయంత్రంబులును నారాచంబులును తోమరంబులు పరశ్వధంబులు ధనుఃకాండంబులు కవచంబులు బాణపూర్ణంబులగుతూణీరంబులును, పరగజంబులకు స్పర్శమాత్రంబున ముల్లుగ్రుచ్చుకొనినచందంబున వేదనగలిగించుకవచంబులచే నాచ్ఛాదింపఁబడిన మహాదంతావళంబులును, నాసైన్యంబునందు లెక్కకు మిక్కిలియై యుండె. సహస్రంబులును శతసహస్రంబులు నగుబరగజంబుల డీకొని యశ్రమంబున నిర్జింపంగలమదగజంబు లాస్కంధావారంబున నసంఖ్యంబుగ విలసిల్లె. పాండవు లక్కడ విడిసియున్నారన్నవార్త నెఱింగి వారికి మిత్రు లగు రాజులు బలంబులతోడను వాహన[illegible]తోడనుగూడి యేతెంచిరి. బ్రహ్మచర్యవ్రతాచరితులు, సోమపానపవిత్రులు, భూరిదక్షిణాదాతలు నగుమహారాజు లనేకులు పాండవులవిజయంబు గోరుచు వచ్చి పాండవస్కంధావారంబులం బ్రవేశించిరి.

## దుర్యోధనుండు సమరసన్నాహంబుఁగావింప నసుజ్ఞయిచ్చుట

వాసుదేవుండు హాస్తినపురంబునుండి వచ్చినయనంతరంబ దుర్యోధనుండు కర్ణుని, దుశ్శాసనుని, శకునిని బిలిచి వారల కిట్లనియె. వాసుదేవుండు మనకడకు వచ్చి వచ్చినపని నెఱవేరకయే పాండవులకడ కరిగినవాఁడు. కోపావిష్టుం డగు నాకృష్ణుండు పాండవుల కధికంబుగ రోషంబు కలిగింపకమానఁడు. పాండవులతో నేను విగ్రహంబు గావించుట వాసుదేవున కిష్టంబై యున్నది. భీమసేనుండు నర్జునుండును వాసుదేవునిమతము ననుసరించి చరించువారు. అజాతశత్రుండన్ననో భీమసేనునకు మిక్కిలి వశమయియున్నవాఁడు. మఱియు నాతనికి నాతని యనుజులకు నే ననేకవిధంబుల నికారంబు గావించియున్నవాఁడను విరాటుండును, ద్రుపదుండునుగూడ నాతో నింతకుమున్న వైరంబు గలిగి యున్నవారు. వారిరువురును వాసుదేవునిమతం బనుసరించి సేనానాయకులై యున్నవారు. కావున మనకుఁ దుములంబును రోమహర్షణంబు నగుయుద్ధం బవశ్యముగాఁగలదు. కావున మీరలెల్లరును దండ్రపోనాడి సాంగ్రామికంబులగుసర్వప్రయత్నంబులును గావింపుఁడు. కురుక్షేత్రము నందు మనకెల్లరకును శిబిరంబులు నిర్మింపుఁడు. మనకుఁ జాలునంతటి

విశాలావకాశంబులు గలవియు, శాత్రవులకు వశపఱుచుకొన శక్యము గానివియు, సమీపంబున సమృద్ధంబుగ జలంబులు కాష్ఠంబులుగలవియు నగునట్లు నూఱులు వేలుగా శిబిరంబులు నిర్మింపుఁడు. ఆహారపదార్థములు తెచ్చుమార్గంబులను శాత్రవులు విచ్ఛేదము గావింపకుండ రక్షణంబు గావింపుఁడు. వివిధాయుధంబులు నెల్లశిబిరంబులందుఁ బూర్ణంబుగ నుంపుఁడు. పతాకలు ధ్వజంబులును నసంఖ్యాకంబుగ నిలిపియుంచుఁడు. మన నగరబహిఃప్రదేశమునుండి శిబిరంబులదనుక మార్గంబు ముల్లుపల్లు లేకుండ సమంబుగఁ గావింపుఁడు. [illegible]కడ కురుక్షేత్రంబునకుఁ బ్రయాణం బని సేనలకెల్లఁ జాటఁబంపుఁడ[illegible] యానతిచ్చె.

అట్లు దుర్యోధను [illegible]పంప నాతనియానతిం గొని శకునికర్ణ దుశ్శాసనులు మహాప్రయత్నంబున సాంగ్రామికసన్నాహంబులెల్లఁగావించిరి. మహానుభావు లగుమహీపాలురకెల్ల నివాసయోగ్యంబు లగుశిబిరంబులు శతసహస్రసంఖ్యాకంబులుగా నిర్మించిరి. రాజశాసనం బాలించి సమస్తమహీనాథులు నాసనంబులు విడిచి లేచి పరిఘసంకాశంబు లగు బాహుదండంబులు మెల్ల మెల్లన నాస్ఫాలనంబు గావించిరి. కాంచనాంగదభూషితంబులు చందనాగరుదీప్తంబులు నగుభుజంబులఁ దడవుకొనుచు బుండరీకసన్నిభంబు లగుకరంబులతోఁ దలపాగలు చుట్టుకొనుచు పరిధానంబులు నుత్తరీయంబులు దృఢంబుగ బంధించుచు వారలెల్లరును సమరాలంకారంబులు గావించికొనిరి. రథసారథులు రథంబులను, హయశిక్షకులు తురంగంబులను, గజరక్షకు లగుమావటీలు మత్తమాతంగంబులను సన్నద్ధంబులు గావింపం దొడంగిరి. కాంచనవిచిత్రంబు లగు కవచంబులును వివిధంబు లగుశస్త్రంబులును దాల్చి పదాతులు యుద్ధసన్నద్ధులైరి. అప్పుడు ధృతరాష్ట్రునగరంబెల్ల సంప్రహృష్టనరావృతంబై సమాకులంబై యుత్సవంబువోలెఁ గన్పట్టెను. జనౌఘంబు లావర్తంబులు రథంబు లేనుంగులు గుఱ్ఱంబులు మహామీనంబులు, శంఖదుందుభిధ్వానంబులు నిర్ఘోషంబులు, కోశసంచయం బనర్ఘరత్నంబులు, చిత్రంబు లగుకవచంబులు తరంగంబులు, శస్త్రంబులు, నిర్మలఫేనపుంజంబులు, ప్రాసాదమాలిక అంతరపర్వతంబులు, రథ్యాపణంబులు మహాహ్రదంబులు, యోధులు చంద్రోదయంబునై కురురాజసమరసన్నద్ధవాహిని పర్వంబున నింగికిం బొంగువాహినీశ్వరు ననుకరించి వెలింగె.

## పాండవులు యుద్ధంబుసేయ నిశ్చయించుట

అంతనక్కడ ధర్మనందనుండు వాసుదేవుండు తెలిపిన సుయోధనువచనంబులను స్మరించికొని వాసుదేవున కిట్లనియె. వాసుదేవా! మందుం డగుసుయోధనుండు కులవినాశహేతు వగుయుద్ధంబున కెట్లు సమ్మతించెను? ఇట్టివిషమం బగుసమయం బాసన్నంబై యుండ మన మిప్పు డేమిచేసిన నుచితంబగును? మన మెట్లు వర్తించిన మన స్వధర్మంబునకు భంగంబు గలుగకుండును? కృష్ణా! నీవు కర్ణశకునిదుర్యోధనుల యభిమతంబులును నాయనుజులమతంబు నామతంబునుగూడ లెస్సగ నెఱింగి యున్నవాఁడవుకదా? విదురుండును భీష్ముండును పలికినవాక్యంబులుకూడ నీ వాలించియుంటివి మాజనని యగుకుంతీదేవిప్రజ్ఞకూడ నీవు తెలిసి యుంటివి. వీరలెల్లరయభిమతంబులతోడను మనకు ప్రయోజనంబు లేదు. వీనినెల్ల మించి మనమీసమయంబున నేకార్యంబుగావించిన నుచితం బగునో నీవ బాగుగ నాలోచించి నిస్సంశయంబుగ నిర్ధారణము గావింపుము. మాకందఱమతంబులకంటె నీవాక్యంబె పరమప్రమాణంబై యుండును. కావున నీయభిమతం బెఱింగింపు మనుటయు నావచనంబు లాలించి మేఘదుందుభినిర్ఘోషంబుల ననుకరించుగంభీరస్వరంబున మధుసూదనుండు ధర్మార్థసహితంబును మహార్థవంతంబు నగువాక్యం బిట్లు వచించె. ధర్మనందనా! నేనాకౌరవ్యునికి ధర్మార్థసహితంబు లగువచనంబుల నెన్నియే నుడివితిని. కాని మందుండగు నాతండు వానిని గ్రహింప నొల్లండయ్యె. నికృతిప్రజ్ఞుండు దుర్మేధావియు నగువాఁడు శాంతనవుండు, విదురుండు, నేను వచించినపలుకులు వేనిని నాదరింపక యన్నింటిని దిరస్కరించినవాఁడు. వాఁడు కామంబునుగాని, యశంబునుగాని యభిలషింపకున్నవాఁడు. ఆదురాత్ముండు కర్ణు నాలంబించి సర్వంబును జయించినట్లు తలంచుచున్నవాఁడు. ఆనీచుండు నావాక్యంబుల నాదరింపకుండుటయకాక నన్ను బంధించుటకునై తము ప్రయత్నించెను. ఆ పాపనిశ్చయుం డాకామంబు బ్రాపింపలేకపోయెను. భీష్ముండుగాని ద్రోణుండుగాని వానికిఁ దగునట్లు హితముపదేశింపలేరైరి. ఒక్కవిదురుండుతక్కఁ దక్కంగలవారెల్లరును వానినే యనుసరించి చరించుచున్నవారు. శకునియు, కర్ణుండును, దుశ్శాసనుండును, నాదురాత్మునితో

నీయెడఁ బ్రతికూలంబు లగువచనంబులు పలికి వానిబుద్ధిని గర్శ్మలంబు గావించిరి. అమర్షణుండును, మూఢుండును, నగుసాసుయోధనుండు ని న్నుద్దేశించి వచించిన దుర్వాక్యంబులెల్ల సానుపూర్వికంబుగ నే వచింప నేల? సంక్షేపంబుగ వచింతు వినుము. ఆదురాత్ముం డెల్లభంగుల నీయెడ నయుక్తుండై వర్తించుచున్నవాఁడు. సమస్తరాజులందును నీసైనికు లెల్లరయందునుంగూడ నగపడనియశుభంబు పాపంబును దురాత్ముండగు సాసుయోధనునందుఁ గలవు. మన మెన్నండును రాజ్యభాగంబునొంద కయె సంధికావించుకొనఁజాలముకదా? అట్టియెడ ననంతరకార్యంబు యుద్ధంబుదక్క వేఱొండేదియుఁ గాన రాదని వచించె. ఆవాసుదేవుని వచనంబు లాకర్ణించి రాజులెల్లరు నేమియుఁ బలుకక తూష్ణీంభావం బున ధర్మనందనునిముఖ మాలోకించుచుండిరి. ఆరాజులయభిప్రాయం బెఱింగి భీమార్జుననకులసహదేవులతోఁగూడ సేనలకు యోగం బాజ్ఞా పించె. అప్పుడు పాండవులసైన్యంబులెల్లఁ గిలకిలారావంబులు గావించె. యోగం బాజ్ఞాపించినంతన సైనికులెల్లరును బ్రహర్షంబునొందిరి. చంపఁ గూడనిబంధువులఁ జంపవలసివచ్చుట స్మరించి ధర్మనందనుండు వృకోద రుని ధనంజయుని నాలోకించి యిట్లనియె. ఏకులనాశంబుగాకుండ నుండ వలయు ననుతలంపున వనవాసంబును నజ్ఞాతవాసంబు నాచరించి యనేక దుఃఖంబు లనుభవించియుంటిమో యాకులక్షయరూపం బగు ననర్థంబు మనప్రయత్నంబువలననే యిపు డాసన్నంబై యున్నది. ఏకులరక్షణంబు నకై మనము యత్నించితిమో యది యెంత ప్రయత్నించినను లభించి నదిగాదు. మనము ప్రయత్నం బాచరింపకున్నను మనకు యుద్ధంబు సంభవించినది. చంపఁగూడనిబంధువులతో సంగ్రామంబు గావించు టెట్లు? గురువులను వృద్ధులను జంపిన మనకు విజయ మెట్లు లభించును? అనిపలికి నంతన ధనంజయుండు ధర్మనందనున కిట్లనియెః రాజా! వాసుదేవుండు వచించినవాక్యంబులు నీవు మఱచితివా? మధుసూదనుండు, కుంతీ దేవియు, విదురుండును పలికినపలుకులెల్ల నొడివియుండెనే వానినెల్ల నీ వాకర్ణించియే యుంటివే! కుంతియు విదురుండు నొకప్పుడే నధర్మంబు వలుక రని నానిశ్చయంబు. మన మిప్పుడు యుద్ధంబుగావింపక మఱలుట యుక్తంబు గానేరదు. కావున మనమెల్లవిధములయుద్ధంబుగావించుటయ యుచితం బగు నని వచింప వాసుదేవుం డామాటలు విని "ఔనౌనిదియ

నిశ్చయం"బని వచించె. అంత సకలసైనికులును, సమస్త పార్థివులును, పాండవులును యుద్ధంబునకు దృఢసంకల్పంబు గావించికొన్నవారై యారాత్రి సుఖంబుగఁ గడపిరి.

## దుర్యోధనుండు సేనావిభాగంబు గావించుట

ఆరాత్రి కడచినంతన యక్కడ దుర్యోధనుండును దనకు సహాయంబులుగా నేతెంచియున్న పదునొకండక్షౌహిణులసైన్యంబులకు విభాగం బొనరించెను. నరులు, హస్తులు, రథంబులు, తురంగంబులు ననునాల్గువిధంబు లగుబలంబులందు నుత్తమంబు లనియు, మధ్యమంబు లనియు, దుర్బలంబు లనియు మూఁడుతెఱంగుల నేర్పరించెను. అందు సారతరం బగుబలంబు సేనకు మొనటను మధ్యబలం బగుబలంబు సేనామధ్యంబునను, దుర్బలం బగుసేనను వెనుకను నుండ నియమించెను. అంత నాసైన్యంబునం దెందుఁ జూచినను యుద్ధోత్సాహంబు మిన్నుముట్టె. యుద్ధంబునం దేదేనొక్కరథంబు నవయవంబు విఱిగినపుడు దానిని యథాపూర్వంబుగ మరల నిర్మించుటకై రథాధోభాగంబున బంధింపఁబడుదారువు లనుకర్షంబు లనంబడును. అట్టి యనుకర్షంబు లనేకశతశహస్రంబులు సంగ్రహింపంబడియె. రథంబులందు బాణంబుల నిలువ యుంచు నమ్ములపొదులు తూణీరంబు లనంబడును. అట్టి తూణీరంబులు ప్రతిరథంబునందును నాయత్తపఱుపఁబడియె. రథంబులవరూథంబులును, తోమరంబులును పదిలంబు గావింపంబడియె. ఉపాసంగంబులు, శక్తులు, నిషంగంబులు, హర్షులు, ధ్వజంబులు, పతాకలు, శరాసనంబులు, విచిత్రంబు లగురజ్జువులు, పాశంబులు, పరిచ్ఛదంబులు, కచగ్రహావిక్షేపంబులు, తైలగుడవాలుకలు, ఆశీవిషఘటంబులు, సర్జరససహితపాంసువులు, ఘంటాఫలకంబులు, అయోగుడజలోపలంబులు, శాలభిందిఫాలంబులు, మధూచ్ఛిష్టముద్గరంబులు, కాండదండకంబులు, సీరవిషతోమరంబులు, సూర్పపిటకలు, దాత్రాంకుశతోమరంబులు, కీలకవచంబులు, వాణీవృక్షాదనంబులు, వ్యాఘ్రచర్మపరివారంబులు, ద్వీపిచర్మావరణంబులు, శృంగంబులు, ప్రాసంబులు, కుఠారంబులు, కుద్దాలంబులు, తైలంబులు, క్షౌమంబులు, ఘృతంబులు, వివిధాయుధంబులును గ్రహించి యాసైనికులు రుక్మజాలప్రతిచ్ఛన్నులును, నానామణిగణవిభూషితులు

నై వెలింగిరి. శరీరసౌష్ఠవంబుగల యాచిత్రానీకంబులెల్లఁ బ్రజ్వలించు ననలంబులమాడ్కి విరాజిల్లుచుండె. కవచధారులు, శూరులు, శస్త్రనిశ్చయవేదులు, సత్కులసంజాతులు, నశ్వలక్షణవిజ్ఞాతలు నగువారు రథసారథ్యంబున నియోగింపంబడిరి. బద్ధారిష్టంబులు, బద్ధకక్షంబులు, బద్ధధ్వజపతాకాభిశోభితంబులు, బద్ధాభరణనిర్వ్యూహంబులు, బద్ధచర్మాసిపట్టిసంబులు నైనరథంబుల కన్నింటికిని నాల్గేసిగుఱ్ఱంబులం బూన్చిరి. ఆసైన్యంబునం గలగుఱ్ఱంబులెల్ల నుత్తమలక్షణోపేతంబులై యుండె. రథంబులన్నింటను బ్రాసంబులును, ఋష్టికంబులును, సజ్జంబులు గావింపం బడియుండె. ప్రతిరథంబునను నూరేసివిండ్లు సిద్ధపఱుపంబడియె. ధుర్యంబులగుహయంబులం దొక్కరుండును, పార్ష్ణిభాగంబునను, సారథ్యంబున నిర్వురును, రథికశ్రేష్ఠు లిర్వురును, రథియు హయవిదుండు నిర్వురును, నిల్చెడుగు రేనియోధు లొక్కొక్కరథంబున నుండిరి. దృఢగుప్తంబు లగునగరంబులువోలె శిబిరంబులు శాత్రవులకు దురాధర్షంబులై యొప్పె. ఎందుఁ జూచినను హేమమాలావిచిత్రంబు లగుమహారథంబులు వేలకొలందిగ నగపడుచుండెను. రథంబు లెట్లట్ల మహాగజంబులును, బద్ధకక్షంబులు, విభూషితంబులునై సప్తపురుషాభిరక్షితంబులై రత్నవంతంబు లగుమహాపర్వతంబులంబోలి విలసిల్లె. అంకుశధారు లిరువురును, నుత్తమధనుర్ధరు లిరువురును, అసిప్రవరధారు లిరువురును, శక్తిపినాకంబులు ధరించినవాఁ డొక్కరుండునుగాఁ బ్రతిగజేంద్రంబునందు నధిరోహించియుండిరి. కౌరవ్యుని యాబలంబెల్ల నుత్తమగజంబులచే సమాకీర్ణంబును నాయుధకోశంబులచేఁ బూర్ణంబునై యొప్పెను. ఆముక్తకవచయుక్తంబులును, పతాకాసహితంబులును, సకలాలంకారభూషితంబులును, నుత్తమసాద్యధిష్ఠితంబులు నగునుత్తమాశ్వంబు లెయ్యెడఁజూచినను నయుతంబులకొలందిగ వెలుంగుచుండెను. అసంగ్రాహులు, హేమాలంకారవిభూషితులు, మహాబలవంతులు నగుయోధు లొక్కొక్కతురంగసాదివశంబున వేవురువంతున నుండిరి. నానారూపవికారవంతులును, నానాకవచశస్త్రధారులును, హేమమాలాలంకృతులు నగుపదాతులకు లెక్కలేకుండెను. ఒక్కొకరథంబునకుఁ బదుపు రేసిగజయోధులును, నొక్కొక్కమదగజంబునకుఁ బదుపు రేసితురంగసాదులును, నొక్కొకతురంగంబునకుఁ బదుగు రేసికాలి

బంట్లును బాదరక్షకులుగా నిర్ణయింపంబడిరి. మఱియు వేఱొక్కరీతిని నొక్కొక్కరథంబున కేఁబదియేనుంగులును నొక్కొక్కతురంగంబునకు నూరుగుఱ్ఱంబులును నొక్కొక్కగుఱ్ఱంబునకు నేడుగురేసిభిన్నసంధానకారు లగుపురుషులును నియమితులై యుండిరి. ఏఁబదియేనుంగులు నేఁబదిరథంబులు నొక్కసేన యనంబడును. పదిసేన లొక్కపృతన యనం బరఁగును. పదిపృతన లొక్కవాహిని యగును. ఒకసేనయు, నొక్కపృతనయు, నొక్కవాహినియు, నొక్కధ్వజినియు, నొక్కచమువునుంగలసి యొక్కయక్షౌహిణి యనంబడును. దానికి వరూథిని యనియు వ్యవహారంబుగలదు. ధైర్యశాలి యగుసుయోధనుం డిట్టిపదునొకండక్షౌహిణుల బలంబు సంగ్రహించి యుద్ధప్రయత్నం బొనరింపంబోఁడంగె. పాండవుల కేడక్షౌహిణులబలంబుమాత్రమే యుండెను. ఏఁబదియేవురుయోధు లొక్కపత్తినాఁబడును. దీనికి సేనాముఖంబనియు నామాంతరము గలదు. అట్టి సేనాముఖంబులు మూఁడయ్యెనే నొక్కగుల్మం బనంబరఁగును. అట్టిగుల్మంబులు మూఁడొక్కగణం బనంబడును. అట్టిగణంబు లాసుయోధనుబలంబులం దయుతంబులు నియుతంబులునుం గలవు. దుర్యోధనుని సైనికులెల్లరును నాయుధంబుల ధరించి యుద్ధోత్సాహంబునఁ జెలఁరేగుచున్నవారు. ఆసైన్యంబులెల్ల నాలోకించి దుర్యోధనుండు శూరులు బుద్ధిమంతులు నగువారల సేనాపతులఁగావించెను. పదునొకండక్షౌహిణులకును వేర్వేఱుగాఁ బదునొకండ్రు సేనాపతుల నియమించె. కృపుని ద్రోణుని శల్యుని సైంధవుం డగుజయద్రథుని కాంభోజాధినాథుం డగు సుదక్షిణుని కృతవర్మని ద్రోణనందనుం డగునశ్వత్థాముని నంగాధీశ్వరుం డగుకర్ణుని భూరిశ్రవసుని సౌబలుం డగుశకునిని మహాబలుం డగుబాహ్లికునిని బదునొకండక్షౌహిణులకును నాయకులుగా నొనరించి దినదినంబు ప్రతిసమయమందును వారలకుఁ బ్రత్యక్షంబునను బరోక్షంబునను వివిధంబు లగుపూజలఁ గావించుచుండె. అట్లు నియమింపఁబడిన యాసేనానాయకులు నితరసైనికులును రాజులు నెల్లరు నెల్లభంగుల సుయోధనునకుఁ బ్రియంబుగావింప దృఢనిశ్చయులై యొసంగిరి.

**భీష్ముండు సర్వసేనాధిపత్యం బంగీకరించుట**

అనంతరంబు సుయోధనుండు గంగాతనూజుం డగుభీష్ము నాలోకించి ప్రాంజలియై రాజులెల్ల రాలోకించుచుండ నిట్లనియె. మహాత్మా!

మహావిపులం బగుసైన్యంబయ్యును సమర్థుం డగునాయకుండు లేనిచో యుద్ధం బాసన్నంబయినయెడ చీమలపుట్టవోలె చెదరిపోవును. ఎన్నండు నిరుపురబుద్ధి యేకప్రకారంబున నుండదు. బలనాయకులకుఁ బరస్పరంబు శౌర్యస్పర్థలుకూడ సంభవించును. తొల్లి మహాతేజస్వులగు హైహాయ పార్థివులపై బ్రాహ్మణులు కుశధ్వజంబులనెత్తి యుద్ధంబునకు వెడలిరి. అప్పు డాబ్రాహ్మణునివెంట వైశ్యులును శూద్రులునుగూడ యుద్ధోత్సాహంబున వెడలిరి. ఒక్కవైపున మూఁడువర్ణంబులు నొక్కవైపున క్షత్రియవర్ణం బొక్కటియు నిలిచి యుద్ధంబునకు సన్నద్ధంబులయ్యె. మూఁడు వర్ణంబులుగలబలం బధికంబయ్యు నైకమత్యంబు లేమిం జేసియు బహునాయకం బగుటయు మాటిమాటికి భంగంబునొందుచుండె. క్షత్రియ బలంబన్ననో యెప్పుడును జయంబందుచునే యుండెను. అప్పు డది గని బ్రాహ్మణు లట్లు బహుళం బగుబలం బపజయంబందుటకును స్వల్పంబగు బలంబు జయంబుగాంచుటకును హేతు వేమని యడిగిరి. ధర్మజ్ఞులగు క్షత్రియు లాబ్రాహ్మణులతో మేమెల్లరమును యుద్ధంబున మహాబుద్ధిశాలియగు నొక్కవీరునివచనంబునఁ బ్రవర్తింతుము. మీర లన్ననో యెవ్వరు వారిబుద్ధినే యనుసరించి చరింతురుగాని యెల్లరు నేకవాక్యంబునఁ జరింపరు. కావున మీ కపజయంబును మాకు విజయంబును లభించుచున్నదని చెప్పిరి. అది విని యాబ్రాహ్మణు లెల్లరును నీతికుశలుండగు నొక్కబ్రాహ్మణోత్తముని సేనాపతిని గావించి యుద్ధంబున హైహాయులఁ బరాజితులం గావించి విజయంబందిరి. ఇట్లే శూరుండును నీతికుశలుండును హితాకాంక్షియు నకల్మషుండును నగుపురుషు నెవ్వరు సేనాపతిం గావించుకొందురో వారు శత్రువిజయంబు గాంతురు. నీవు నీతియందు శుక్రునకు సమానుండవు. మాహితం బభిలషించువాఁడవు. ధర్మనిరతుండవు. అసంహార్యుండవు. కావున నీవు నాసర్వసేనలకు నధిపతి వగుము. రశ్మివంతుల కాదిత్యుండు, వీరుత్తులకు సుధాంశుండు, యక్షులకుఁ గుబేరుండు, దేవతలకు వాసవుండు, పర్వతంబులకు మేరువు, విహంగములకు గరుడండు, దేవసైన్యంబులకుఁ గుమారుండు, వసువులకువీతిహోత్రుండు నెట్లట్లు నీవును నాసైన్యంబులకెల్ల నధీశ్వరుండ వగుము. శతక్రతుండు దివౌకసులఁ బాలించురీతి నీవు మమ్మెల్లరఁ గాచుచుండ మేము త్రిదశుల కైన నప్రధృష్యులమై వెలుంగంగలము. దేవతానీకంబుల కగ్రంబునఁ

గుమారుండు వెడలినట్లు నీవును నాసైన్యంబుల కగ్రగామివై వెడలు దువుగాక. వృషభంబును ధేనువు లనుసరించి వచ్చుచందంబున మేమెల్ల రమును నిన్ననుసరించి వత్తుమని వచించెను.

ఆవచనంబు లాలించి శాంతనవుండు సుయోధనున కిట్లనియె. వత్సా! నీవు చెప్పినదెల్ల నిక్కంబ. మీరు నాకెట్లు హితులో పాండవులును నాకు హితులే యైయున్నవారు. కావున మీయిరువురకును నేను శ్రేయం బుపదేశింపవలయును. నేనింతకుమున్ను గావించినప్రతిజ్ఞ ననుసరించి నీకై యుద్ధం బొనరింపవలయును. నాతో సమానంబుగఁ బ్రతియుద్ధంబు గావించువాని నీభూతలంబున నెందునుం గానను. కుంతీపుత్త్రుండును నరవ్యాఘ్రంబు నగునర్జునుం డొక్కరుండుమాత్రము నాతోడఁ బోరంగలయోధుండు. మహాబాహుండగు నాధనంజయుం డనేకంబు లగుదివ్యాస్త్రంబు లెఱింగియున్నవాఁడు. ఆయర్జునుం డెప్పుడును విస్పష్టంబుగ నాకు గోచరుండై యుద్ధంబు గావింపకుండును. ఆతం డట్లు ప్రత్యక్షంబుగ నగపడి యుద్ధంబు గావించుచో నేనును వాఁడును దివ్యాస్త్రప్రయోగంబునం జేసి ససురాసురరాక్షసంబగు నీజగంబెల్ల నొక్కక్షణంబున నిర్మానుష్యంబు గావింతుము. రాజా! పాండునందనుల నేనెప్పుడును వధింపఁదగదుకదా? కావున వారలవిడిచి మిగిలినయోధుల నయుతంబు లయుతంబులుగా వధింతును. సమాగమంబునకుఁ బూర్వమే నన్ను వారు వధింపకుందురేని నేను వారల కీవిధంబున నిధనంబుగావింతును. ఈసమయంబునకు నీవంగీకరించితేని నేను నీకుసేనాపతి నగుదును. మఱియు నొక్కసమయంబునుం గలదు. అది యేదంటివే నాలింపుము. తొలుత కర్ణుండైన యుద్ధ మొనర్పవలయును; లేక నేనైనఁ దొలుత యుద్ధంబుగావింపవలయును. ఆకర్ణుండు నాతోడ నెప్పుడును మత్సరించుచుండునుగావున మేమిరువురము నేకకాలంబున యుద్ధంబు గావింపకుండవలయును. నీవు దీని కంగీకరించితేని నేను దప్పక సేనాధిపత్యంబున కంగీకరింతు నని వచించె. ఆమాట లాలించి సూతనందనుండు రాజా! గాంగేయుండు జీవించియున్నంతవఱకు నేను యుద్ధంబు గావింపకుందును. భీష్ముండు నిహతుం డైనపిదప గాండీవధన్వితో యుద్ధంబు గావింతు నని పలికెను. అంత దుర్యోధనుండు బ్రాహ్మణులకు భూరిదక్షిణలొసంగి శాంతనవునకు సర్వసైన్యాధిపత్యంబున నభిషేకం బాచరించె. ఆసమయంబున

రాజశాసనంబున వాదకులు భేరీమృదంగపణవాదివాద్యంబుల మ్రోగించిరి. వివిధసింహనాదంబులును వాహనంబులనిస్వనంబులును భూమిని గంపింపంజేయుపిడుగులంబోలు మదగజఘీంకారంబులును సర్వయోధుల మనంబులు దూలునట్లు విజృంభించె. ఆకాశంబుననుండి యశరీరివాక్యంబులు వినవయ్యె. నింగిపలన నుల్కలు రాలె. మేఘంబు లేకున్నను రుధిరకర్దమంబగు వర్షంబుగురిసె. భయంబు సూచించుచు నశివంబులగు శివారుతంబులు చెలరేగె. ఆదుర్యోధనుండు గాంగేయుని సేనానాయకపదంబున నభిషేకం బాచరించుసమయంబున భృశదారుణంబులగు నీదుర్నిమిత్తంబులెల్లం బొడసూపె. అనంతరము సుయోధనుండు బ్రాహ్మణులకు గోభూహిరణ్యదానంబులు భూరిదక్షిణలు నొసంగి పుణ్యాహవాచనంబు గావించి పరబలార్దనుండగుభీష్ముని సేనాపతిం గావించి బ్రాహ్మణులజయాశీర్వాదంబులు చెలంగుచుండ సకలసైనికపరివృతుండై యాపగానందనునిఁ బురస్కరించికొని తనసహోదరులతోఁగూడి మహాస్కంధావారంబుతోఁగూడఁ గురుక్షేత్రంబున కరిగె. కర్ణసహితుండై కురుక్షేత్రంబు ప్రవేశించి మధురానూషరంబు సమృద్ధతృణకాష్ఠంబు సమస్థలంబు నగు నొక్కరమ్యప్రదేశంబున శిబిరంబుల నిర్మించె. హాస్తినపురంబు ననుకరించి యాశిబిరసన్నివేశంబు మిగుల రమణీయంబై యొప్పె.

యుధిష్ఠిరుండు ధృష్టద్యుమ్నుని సర్వసేనానిగా నభిషేకించుట

సకలధనుర్ధరుల కగ్రగణ్యుండును, భారతులకుఁ బితామహుండును, సర్వమహీపాలురకు ధ్వజప్రాయుండును, బుద్ధి నింద్రాచార్యునకు సమానుండును, క్షమాగుణంబున భూమి నతిక్రమించువాఁడును, గాంభీర్యంబున సముద్రంబులంబోలువాఁడును, స్థైర్యంబున హిమవంతు ననుకరించువాఁడును, ఔదార్యంబునఁ బ్రజాపతిసదృశుండును, తేజంబున భాస్కరోపముండును, మహేంద్రుండువోలె శాత్రవవిధ్వంసనుండును, సుభీమంబగు రణాంగణంబున దీక్షితుండు నగు శాంతనవుండు కౌరవసర్వసైన్యాధిపత్యంబున నభిషిక్తుండగుట విని యాపద్ధర్మార్థకుశలుం డగుయుధిష్ఠిరుండు తనయనుజన్ములను వాసుదేవుని నాలోకించి వారల కిట్లనియె. సైన్యంబులెల్లఁ బర్యాక్రాంతంబులై యున్నవి. మీరలెల్లరును దంశితులై మహాప్రయత్నంబున నుండుఁడు. మీకెల్లరకును దొలుదొల్తఁ

పితామహునితోడన యుద్ధంబు గాఁగలదు. కావున మనసేన లేడింటికి
నేడుగురు సేనానాయకుల నాలోచింపుఁడు. అనినంత కృష్ణుండు ధర్మ
నందనా! ఈసమయంబున నెట్లు వచించిన యుక్తంబగునో యట్లే నీవు
మహార్థయుక్తంబు లగుమాట లాడితివి. నీవు చేయనున్న పనులు నాకభి
మతంబులై యున్నవి. నీసేనలకు నాయకుల నియమింపం దగు ననియె.
అప్పుడు పాంచాలనాథుం డగుద్రుపదునిని, మత్స్యనాథుండగు విరాటుని,
శినిపుంగవుండగుసాత్యకిని, పాంచాలరాజనందనుండగు శిఖండిని, మగ
ధాధినాథుం డగుసహదేవుని పాంచాలరాజనందనుం డగు ధృష్టద్యు
మ్నుని, ధృష్టకేతుని రావించి మహాభాగులు మహావీరులు యుద్ధాభి
కాంక్షులు నగు నీయేడుగురను సేనానాయకులనుగా విధివిధానంబున
నభిషేకించె. సర్వసైన్యములకు నధిపతిగా ధృష్టద్యుమ్నున కభిషేకంబు
గావించె. ఆతండు ప్రజ్వలించుచున్నయనలంబువలె ద్రోణుని సంహరిం
చుటకై యుద్భవించియుండెనుగదా! సమస్తసేనాపతులకును నధిపతిగా
నర్జునుని నిర్ణయించెను. అర్జునునకుఁగూడ నాయకుండుగను నాతనిరథం
బునకు సారథిగాను మహాత్ముం డగుజనార్దనుని నభిషేకించెను.

## బలదేవుండు తీర్థయాత్ర కరుగుట

అట్లాయుద్ధంబు సమీపించినదని యెఱింగి బలదేవుండు పాండ
వులకడ కేతెంచెను. అక్రూరుండు సాంబుండు గదుం డుద్ధవుండు రౌక్మి
ణేయుండు నాహుకనందనుండు చారుదేష్ణుండు మొదలగుమహాబల
శాలురగు యాదవవీరు లాతని వెన్నంటి పాండవులకడ కేతెంచిరి. నీల
కౌశేయవసనుండును కైలాసశిఖరసచ్ఛాయతనుచ్ఛాయుండును సింహ
సుందరగమనుండును గించిదారక్తలోచనుండును నగుబలదేవు నాలో
కించి ధర్మనందనుండును గేశవుండును వృకోదరుండు నర్జునుండు నింక
నక్కడగలరాజలోకంబెల్ల నాసనంబులనుండి లేచి యాతనికి యథా
ర్హంబుగఁ బూజ లొనరించిరి. ధర్మనందనుం డాతనికి గరస్పర్శం బాచ
రించె. వాసుదేవుండు మొదలగువారెల్లరు నాతని కభివాదనంబులు
గావించిరి. హలాయుధుండు వృద్ధు లగువిరాటద్రుపదుల కభివాదనం
బాచరించి యుధిష్ఠిరునితోడ నాసనంబున నాసీనుండయ్యె. ఆరాజులెల్ల
రును దమతమయాసనంబులం దుపవిష్టులైనపిదప బలదేవుండు వాసు

దేవు నాలోకించి యిట్లనియె. మహారౌద్రంబును దారుణంబు నగు పురుషనాశము కాఁగలదు. భూమండలమునకు దైవవశంబున వచ్చిన యీక్షయము నతిక్రమింపఁదరంబుగాదు. కావున నీయుద్ధంబు నిస్తరించి యక్షతగాత్రులు నారోగ్యవంతులు నగుమిమ్ములను మీమిత్రులను జూడఁగలనని యాశించుచున్నాఁడను. ఈకూడినరాజమండలంబెల్ల కాలపక్వంబై యున్నదనుటకు సంశయములేదు. మాంసశోణితకర్దమంబగు మహావిమర్దంబు గానున్నది. నేను బెక్కుమాఱులు వాసుదేవునితో రహస్యంబుగ మధుసూదనా! మనచుట్టంబులందఱియందును సమానవర్తనుండవగుము. మనకుఁ బాండవు లెట్టి సంబంధులో యట్లే దుర్యోధనాదులును సంబంధులైయున్నవారు. ఆతనికిని సాహాయ్యం బొనరింపుము. అనిచెప్పియుంటిని. ధర్మనందనా! నీయందు బద్ధానురాగుండై కేశవుండు నావచనము గావింపఁడయ్యె. ఈతండు సర్వభావంబులందును ధనంజయునందు లీనంబైయున్నవాఁడు. పాండవులకు విజయంబు నిశ్చయంబుగ లభించునని నేను దలంచుచున్నాఁడను. వాసుదేవుండట్లేకదా కావింప నభినివేశంబు గలిగియున్నవాఁడు. కృష్ణుండు లేకుండ నీలోకం బాలోకింప నేనుత్సహింపను. కావున నేను గేశవుఁడు గావించునెల్ల కార్యంబు ననువర్తించుచుందును. భీమదుర్యోధను లిరువురును నాకుఁ బ్రియతములగుశిష్యులు. వీరలగు వీరిరువురును నావలనఁ గదాయుద్ధవిశారదులై యొసంగిరి. నేను వీరిరువురియెడ సమానంబగు స్నేహంబు గలిగియున్నవాఁడను. కావున నేను నగరజనపదంబుల నివసింపక సరస్వతీనదీపరిసరంబులం గలపుణ్యతీర్థంబుల సేవింప నరిగెదను. కౌరవులు నశించుచుండ నే నాలోకింపంజాలను. అని పచించి పాండవులను దక్కుంగలరాజుల నామంత్రణంబు గావించి తన్ననుగమించువాసుదేవునిఁ బాండవులను దక్కుంగలరాజులను మరలించి తీర్థయాత్రానిరతుండై వెడలి చనియె.

## రుక్మి పాండవులకడ కేతెంచి నిరాకృతుండగుట

ఆసమయంబున భీష్మకుం డనుహిరణ్యరోముం డనునరపాలునకుఁ దనూజాతుండు రుక్మి యనువాఁడు పాండవులకడ కేతెంచెను. రుక్మి తండ్రియగుహిరణ్యలోముండు మహేంద్రునకు నెచ్చెలికాఁడు. ఆకూటి

దేశంబుల కధీశ్వరుండు, భోజకులసంజాతుండు, అతియశోవంతుండు, దక్షిణాపథంబున కధిపతియునై మహాప్రఖ్యాతిం గాంచి యిలాతలంబు పాలించె. రుక్మియు గంధమాదనపర్వతంబున నివసించువాఁడును గింపురుషప్రవరుండును నగుచొక్కమహానుభావునివలన చతుష్పాదంబులుగల ధనుర్వేదము సమగ్రంబుగ నధ్యయనం బొనర్చె. మఱియు నారుక్మి గాండీవంబునకు సమానతేజస్కం బగుమాహేంద్రం బగు ధనుశ్శ్రేష్ఠంబుఁ బరిగ్రహించె. అధనువు శార్ఙ్గంబుతో సమానసారంబుగల యది. దివియందు చరించుదేవతలకు దారుణం బగుగాండివంబును మాహేంద్రం బగువిజయంబును వైష్ణవం బగుశార్ఙ్గంబును మూఁడుధనువులు నుత్తమోత్తమంబులై పరంగె. దివ్యంబు తేజోమయంబు పరభయావహంబు నగుశార్ఙ్గంబు కృష్ణుండు ధరించె. గాండివంబు పాకశాసనాత్మజుం డగుధనంజయుండు ఖాండవదహనసమయంబున నగ్నిదేవునివలనఁ బడసె. మహాతేజశ్శాలియగురుక్మి ద్రుముం డనుకింపురుషప్రవరునివలన విజయం బనుధనువు పరిగ్రహించె. మురాసురుని పాశంబుల ఛేదించి బలంబున మురునిఁ బరిమార్చి భూమిపుత్త్రుం డగునరకుని నిర్జించి మణికుండలంబులును బహువేలబాలారత్నంబులను వివిధంబులగురత్నంబులును నుత్తమంబగుశార్ఙ్గంబును హృషీకేశుండు బరిగ్రహించె. రుక్మివిజయంబును కేలం గీలించి జగంబు భయమందు చుండఁ బాండవులకడ కరుదెంచె. తొల్లి రుక్మిణీస్వయంవరంబున రుక్మి బాహుబలగర్వితుండై వాసుదేవుండు రుక్మిణి నపహరించుటకు సహింపక జనార్దనునివధింపక తిరిగి రానని ప్రతిజ్ఞ గావించి కృష్ణుని వెన్నంటి చతురంగపూర్ణంబగు మహాసేనతోఁ గృష్ణునిం దాక పరాజితుండై కుండినంబున కరిగె. ఆరుక్మి కృష్ణునిచే నెచ్చోటఁ బరాజయంబందె నచ్చట భోజకటం బనునగరంబు నరనాగాశ్వరథసంకులంబై మహావైభవంబున విలసిల్లుచున్నయది. అభోజాధీశ్వరుం డగురుక్మి మహాబలిష్ఠం బగు సైన్యం బొక్కయక్షౌహిణిని దోడుకొని పాండవులకడ కరుదెంచె. కవచంబును దనుత్రాణశిరస్త్రాణంబులును ధరించి ధనుర్ధరుండై యాదిత్యవర్ణంబగు మహారథం బధిరోహించి పాండవానీకంబునఁ బ్రవేశించిన

యాతని రాక యెఱింగి కృష్ణునికిఁ బ్రీతిహేతువగు ననుతలంపున యుధి ష్ఠిరుం డాతని కెదురేగి తోడ్కొనివచ్చి యర్ఘ్యపాద్యాదివిధులం బూజించె. ఆరుక్మినరపాలుండును బాండవులచే నెల్లసత్కారంబులుం బడసి సైన్యములతోఁగూడి కొంతతడవు విశ్రమించి వీరలయెల్లర మధ్యంబునను ధనంజయున కిట్లనియె. పాండవోత్తమా! నీ కీయుద్ధం బున భయంబుగలదేని నేను సహాయుండనై యుండుదును. యుద్ధమున నీశాత్రవులు సహింపఁజాలనంతసాహాయ్య మొనరింతును. విక్రమంబున నాకు సమానుం డగుపురుషుండు లేఁడు. నీవు నాకేభాగంబు నొసంగెద వాసేనాభాగంబు నిశ్శేషంబుగఁ బరిమార్చెదను. కృపద్రోణులుగాని కర్ణభీష్ములుగాని యెవ్వారెవ్వారు వచ్చినను వారలనెల్ల నే నొక్కరుండన వధించి నీకు భూమినెల్ల నొసంగెదను. ఈరాజులెల్లర నిక్కడన యుండ నిమ్ము. అని యిట్లు ధర్మనందనుండును గేశవుండును నితరులగురాజులు నాకర్ణింప నారుక్మి పలుకుటయు నర్జునుం డెల్లరమొగంబులు దిలకించి చిఱునవ్వునవ్వుచు వాని కిట్లనియె. వీరవరేణ్యా! కౌరవులు ఘోష యాత్ర కరుదెంచి గంధర్వులచే బద్ధులైనప్పుడు వారిని విడిపింప గంధర్వులతోడ యుద్ధం బొనర్చినపుడు నాకు సహాయుం డెవ్వఁడయ్యెను? అట్లు దేవదానవసంకులంబును బ్రతిభయంబు నగుమహాయుద్ధంబు ఖాండవదహనసమయంబున బ్రవర్తిల్లినపుడు నే నెవ్వరిసాహాయ్యంబున సురాసురుల జయించితిని? నివాతకవచులును కాలకేయులు ననుదాన వులతో యుద్ధంబు గావించి వారలసంహరించునెడ నాకు సహాయు లెవ్వ రైరి? మఱియు విరాటనగరంబునఁ గౌరవబలంబు లన్నింటితోడం బోరునెడ నాకు సహాయు లెవ్వరైరి? నేను రణాజిరంబున రుద్రుని శక్రునిఁ గుబేరుని యముని వరుణునిఁ బావకునిఁ గృపుని ద్రోణుని మాధ వుని మనంబున. బూజించి తేజోమయంబు దివ్యంబునగు గాండివంబు కేలం ధరించి అక్షయ్యబాణసంయుక్తుండనై దివ్యాస్త్రపరిబృంహితుండ నై యుద్ధ శాత్రవులనెల్లఁ బరాజితులం గావించెద. కౌరవకులంబున జనిం చినవాఁడు విశేషించి పాండునరపాలునకు నందనుండు నగు నాయట్టి వాఁడు యశోహారంబును బిడుగుకంటె బెడిదంబు నగు "భీతుండ నైతి" ననువచనం బెట్లు పలుకును? మహాత్మా! నాకు భయ మించుకంతయు లేదు. నాకు సహాయులతోఁ బ్రయోజనంబును

లేదు. నీవు నీయిచ్చవచ్చినతెఱంగున నిచ్చవచ్చినచోటికి కరు
గుము. లేదా నీకిచ్చయుండెనే నిక్కడన యుండి నాయుద్ధ
చాతురి నాలోకింపుచుండుమని వచించె. ధీమంతుం డగువిజయుని
మాట లాలించి సాగరసన్నిభంబగు తనసేనల మరలించికొని దుర్యో
ధనుకడ కరిగి యాతనితోడఁ గూడ నిట్లే వచింప నాతండును రుక్మిని
నిరాకరించె. వార్ష్ణేయుండగు బలదేవుండును భీష్మకాత్మజుం డగు
రుక్మియు నిరువురుమాత్రమే యాయుద్ధంబునం బ్రవేశింపక తొలంగి
యుండిరి. తక్కినభూమింగలరాజులెల్లరు నిరుపక్షంబులందును జేరియుం
డిరి. అట్లు బలదేవుండు తీర్థయాత్ర కరుగుటయు రుక్మి నిజపురంబునకు
నరుగుటయు ననంతరంబు పాండవులు మరల సమావిష్టులై మంత్రంబు
గావించిరి. ధర్మనందనునియాసమితి తారకలతోడను జంద్రునితోడను
గూడిన యాకాశంబులోలె వెలుంగఁజొచ్చెను.

### సంజయుండు ధృతరాష్ట్రునకు శోకాపనోదనంబు గావించుట

అంత నక్కడ హాస్తినపురంబున ధృతరాష్ట్రుండు సైన్యంబులు
వ్యూహంబులువన్ని యుద్ధంబునకు సిద్ధంబై యున్నవని యెఱింగి సంజ
యుని రావించి వానితో సంజయా! కురుపాండవసేనాసన్నివేశంబు
లందు జరిగినవృత్తాంతమెల్ల నా కెఱింగింపుము. దైవంబ యన్నింటికం
టెను బరంబైనది. పౌరుషంబన్నదో నిరర్థకంబు. నేను క్షయోదయంబు
లగుయుద్ధదోషంబులు చక్క నెఱింగినవాఁడనయ్యు నికృతిప్రజ్ఞుండును
దుర్ద్యూతదేవనుండు నగుతనయుని మరలించుటకుఁగాని నాకు హితం
బగుకార్యంబు గావించుటకుఁగాని చాలనైతిని. సంజయా! నాబుద్ధి
దోషంబులను దర్శించుచునే యుండును. అయినను దుర్యోధనుఁడు
సమీపించినతోడనే యది మరల మఱలిపోవుచుండును. కావున నేది
కానున్నదో యది కాక తప్పదు. రణంబున శరీరత్యాగంబుగావించుట
క్షత్రియుల కుత్తమధర్మంబుకదా? యని పలికె. అదివిని సంజయుం డిట్లు
నియె. మహారాజా! యీదోషంబెల్ల నీయంద నిలిచియున్నది. నీయంద
ప్రతిష్ఠితమైయున్న యీదోషంబు దుర్యోధనునెడ నారోపింపకుము.
నేను జెప్పినదెల్ల నిశ్శేషంబుగ నాకర్ణింపుము. ఎవ్వఁడు తనదుశ్చరిత్రం
బున నశుభంబునొందునో యానరుండు తా నాచరించినపాపఫలంబునం

జేసి కాలంబునుగాని దేవతలఁగాని పొందనేరఁడు. మహారాజా! ఎవ్వఁడు మనుష్యులందు నింద్యంబులగు కర్మంబులెల్ల నాచరించునో వాఁడు నిందితంబు లాచరించుటం జేసి సర్వలోకంబునకును వధ్యుం డగును. అధిద్యూతంబున నమాత్యులతోఁగూడి పాండవులు నీమొగంబు చూచి నిన్నుఁ బ్రతీక్షించియు ననేకంబు లగు నికారంబు లనుభవించియుండిరి. హయంబులకును, గజంబులకును, మహాతేజోవంతు లగు రాజులకును, సమరంబున మహావైశసంబు ప్రవర్తించినది. నే నద్దానినెల్లఁ జెప్పెద నాలింపుము. నీవు స్థిరుండవై సర్వలోకక్షయోదయం బగుయుద్ధంబున నేది యెట్లు జరిగినదో వినుము. దానిని విని నీవు లేశమాత్రంబేని విమనస్కుండవు గాకుము. శోకించుటవలన ఫల మింతయుఁ జేకుఱదుకదా? శుభకర్మంబునకుఁగాని పాపకర్మంబునకుఁగాని మనుజుఁ డెన్నండును గర్త గానేరఁడు. పురుషుం డెప్పుడు నస్వతంత్రుఁడై యే యుండును. దారుయంత్రంబుచేఁ బనిచేయించునట్లు పురుషునిచేఁ గూడ దైవంబ సకల కార్యంబులు చేయించుచుండును. కొందఱు దైవనిర్దేశ మందురు. కొందఱు యదృచ్ఛాపతితమందురు. మఱికొందఱు పూర్వాచరితకర్మఫలం బందురు. ఈమూఁడువిధంబులును లోకంబున గోచరంబు లగుచున్నవి. కావున నీ వనర్థంబు ప్రాపించినను దుఃఖాకులుండవుగాక స్థైర్యం బవలంబించి యుండుమని వచించెను.

### దుర్యోధనుండు పాండవులకడ కులూకుని దూతగాఁ బంపుట

మహాత్ము లగుపాండవు లట్లు హిరణ్వతీనదీతీరంబున నివిష్టులై యుండఁ గౌరవులును యథావిధిగ సేనానివేశంబు గావించిరి. దుర్యోధనుం డట్లు బలంబులెల్ల విడియించి రాజులకెల్లరకు సన్మానంబు లాచరించి గుల్మంబుల నేర్పఱించెను. యోధులకు నారక్షవిధి నిర్వర్తించెను. అనంతరంబ కర్ణుని, దుశ్శాసనుని, శకునిని రావించి వారితో సమాలోచనంబు గావించె. వారలతో బాగుగ నాలోచించి రహస్యంబున నులూకుని రావించి వానితో నిట్లనియె. ఉలూకా! నీవు సోమకులకడకును బాండవులకడకును నరుగుము. నీవు వెడలి యక్కడ వాసుదేవుం డాకర్ణింప నావచనంబుగా వారలకి ట్లెఱింగింపుము. బహువర్షంబుల నుండియు నాలోచింపఁబడుచున్న లోకభయంకరం బగుకౌరవపాండవ

యుద్ధము సంప్రాప్తంబైనది. సంజయుండు మిక్కిలిగఁ బ్రశంసించుచు వాసుదేవసహాయులరై నీవును నీయనుజులును వచించిన యాత్మశ్లాఘా వచనంబు లప్పుడు కౌరవులమధ్య నెఱింగించియుండె. దాని కిదే తగిన సమయ మరుదెంచినది. నీవు ప్రతిజ్ఞ నెట్లు గావించితివో యట్లే వెను దీయక కార్యంబుఁగూడఁ గావింపుము. అని పలికి కుంతీసుతాగ్రజునితో మరల నావచనంబుగా నిట్లాడుము. నీవు నీతనయులు సోమకులు కేక యులు మొదలగువారెల్లరతోడఁగూడి ధార్మికుండవయ్యు నిట్లధర్మం బాచరింప నేల తలంచితివి? నృశంసునివలె నీజగంబెల్ల నశింప నాశించిన నీవు తప్పక పతితుండ వగుదువని నేను దలంచుచున్నవాఁడను. తొల్లి ప్రహ్లాదునిరాజ్యంబెల్ల దేవత లపహరింప బ్రహ్లాదుండు దేవతల నుద్దే శించి సురలారా! ధర్మచిహ్నంబులగుదర్భ పవిత్రాదులధరించియుఁ బ్రచ్ఛ న్నంబుగఁ బాపంబు లాచరించుట బైడాలవ్రతమని ప్రాజ్ఞు లందురని వచించెను. మఱియు నొక్కసమయంబున నారదుండు మాజకున కెఱింగించిన మార్జారాఖ్యానంబు నీ కెఱింగించెద నాలింపుము. నీవు నిక్కంబుగ నీయాఖ్యానంబున కుదాహరణంబ వగుచున్నాఁడవు. గంగా తీరంబున దుష్టబుద్ధిగల యొక్కమార్జాలంబు కర్మంబులేవియుఁ గావింప నసమర్థంబై యెల్లజంతువులు విశ్వసించుటకై మనశ్శుద్ధి గావించికొని బాహువు లూర్ధ్వంబుగఁ జాచి ధర్మం బాచరించుచున్నదాన నని జంతువు లకుఁ దెల్పుచుండెను. అట్లు పెద్దకాలంబు చలుప నండజంబులెల్ల దాని దంభాచరణంబు నిక్కంబని నమ్మి యామార్జారంబుకడ కరుదెంచి దాని ధర్మబుద్ధికిని దపోనిరతికిని బహువిధంబులం బ్రశంసించుచుండెడివి. పక్షి భోజనంబగు నాబిడాలం బట్లు పక్షులు దన్నుఁ బూజించుచుండఁ దన కార్యంబులును దనచర్యకుఁ దగుఫలంబును సిద్ధించెనని దలంచెను. అట్లు కొంతకాలంబు కడచి చన్నయనంతర మాదేశంబునకు మూషికంబులు వెడలి ధర్మాత్ముండువోలె వ్రతంబు లాచరించుచు డాంభికంబగు కార్యంబులఁగావించునాపిల్లిని జూచెను. చూచి యవియెల్లను "మనము బహుమిత్రులము. ఈమార్జారంబు మనకు మేనమామ యగును. ఈ పిల్లి మనల నెల్లర రక్షించుఁగాక." యని వృద్ధంబులు శిశువులు నగు మూషికంబులెల్ల నిశ్చయించుకొని యామార్జారంబుకడ కరిగి విధివిధా నంబునం బూజించి "మామా నీయనుగ్రహంబు ప్రాపించి యథాసుఖం

ద్రోణునివలనను నస్త్రంబులగడించితివి. నీతో సమానం బగుజన్మగల వాఁడును సమానబలముగలవాఁడు నగువాసుదేవు నాశ్రయించితివి. కావున నీవు ధర్మాభిరతుండ వైతివేని క్షత్రధర్మంబున వెనుదీయక యుద్ధం బొనరింపుమని వచింపుము.

మఱియు వాసుదేవునిసమీపించి యాతనితో నిట్లనుము. మాధవా! నీవు నీనిమిత్తంబును బాండవులనిమిత్తంబును యత్నుండవై నన్నెదిరించి పోరొనరింపుము. నీవు సభామధ్యంబున మాయచే నేరూపం బొందియుంటివో యారూపంబుననే యర్జునునితోడంగూడి నాయెదుటికి రమ్ము. ఇంద్రజాలంబును, మాయలును గావించి కపటాత్ములు శస్త్రధారులకుఁ గోపము గల్పింతురేకాని భయము గొల్పఁజాలరు. మేమును మాయ లాచరింపంగలము. మేమును మాయచే స్వర్గంబునకు నంతరిక్షంబునకు నెగురంగలము. రసాతలంబునఁ బ్రవేశింపంగలము. స్వర్గంబున కరుగంగలము. మాశరీరంబులం దనేకంబు లగురూపంబులఁ జూపఁగలము. భయప్రదర్శనాదికార్యంబులవలన మానుషంబులగుకార్యములు సిద్ధింపనేరవు. విధాతమనంబుననే భూతంబులనెల్ల వశముగావించుకొనుచున్నవాఁడు. ధార్తరాష్ట్రులను సమరంబున వధించి యుత్తమం బగురాజ్యంబు పాండవుల కొసంగెద నని నీవు వచించియుంటివి. నీవు వచించినదెల్ల సంజయుండు నాకుఁ దెలిపియున్నాఁడు మద్ద్వితీయుండగు సవ్యసాచితో మీరలు వైరంబుగావించితిరని నుడివియుంటివి. కావున నీవు సత్యవచనుండవై పాండవులనిమిత్తంబై పరాక్రమించి ప్రయత్నుండవై యుద్ధ మాచరింపుము. నీపౌరుషం బాలోకింతుముగాక. ఎవ్వఁడు శాత్రవు నాసాదించి శుద్ధంబగుపౌరుషం బాలంబించి శాత్రవులకు శోకంబుగల్గించునో వానిజీవితంబు జీవితం బనంబరగును. కృష్ణా! కారణంబులేకయే నీకు లోకంబున మహాయశంబు లభించినది. మీసంబులుగలిగిన పండులుగలరని మేమిప్పు డెఱుంగఁగల్గితిమి. నన్నుఁబోలు రాజన్యుఁడు నీయట్టివానియెడఁ బరాక్రమించుట యనుచితంబగును. విశేషించియు గంసునకు భృత్యుండవగు నీయందు సమరసన్నాహంబు గావించుట యసమంజసంబే యగును. అని మధుసూదనునితోఁ బల్కి యనంతరంబ మీసములు గడ్డములు లేక బాలుండై యున్న యాతిండిపోతు జ్ఞానశూన్యుండు నగు వృకోదరునితో

నామాటల నిట్లు తెలుపుము. మఱియు భీమసేనునకు నిట్లు చెప్పుము. మహాబలుఁడవగు భీమసేనా! నీ వింతకుమున్ను విరాట నగరంబున వంటలవాఁడవై కాలముగడపితివి. వల్లవుం డనుపేర బిలువం బడితివి. అవియెల్ల నాపౌరుషంబునఁజేసి నవికదా? నీ వప్పుడు సభామధ్యం బునఁ గావించిన ప్రతిజ్ఞ నసత్యముగావింపకుము. ఇదె సమరంబు సంభ వించినది. నీకు శక్యంబగునేని దుశ్శాసనునిరుధిరంబు త్రావుము. ధార్త రాష్ట్రులనెల్ల రణంబున వధింతునని నీవు బహువారంబులు దంభంబులు పల్కితివే! ఇదే నీమాటలు చెల్లింప ననువగుకాల మాసన్నంబై యున్న యది. నీవు భక్ష్యంబులందును, భోజ్యంబులందును, పేయంబులందును ముందు జెప్పంబడఁదగువాఁడవు. యుద్ధ మెక్కడ? భోజనం బెక్కడ? నీవు పురుషుండ వేయైతివే నిదె యుద్ధంబు గావింపుము, సమరాంగణం బున నాచే నిహతుండవై గద నాలింగనం బొనర్చికొని పండుకొనియె దవు. నీ వాసభామధ్యంబున బలికినపలుకులెల్ల వృథాగర్జితంబులు. అని పలికి యులూకా! నకులునకు నావచనంబులుగా నిట్లనుము. నకులా! నీవు స్థిరుండవై యుద్ధం బొనరించి నీపౌరుషంబు చూపుము. నీకు యుధిష్ఠిరునెడంగల యనురాగంబును, నాయెడంగలద్వేషంబును, ద్రౌపది యనుభవించిన క్లేశంబులును మఱచిపోక స్మరించికొనుము. అనిచెప్పిన తరువాత సహదేవుని కిట్లు వచింపుము. సమరంబున నతిప్రయత్నంబు గావింపుము. నీ వనుభవించినక్లేశంబుల స్మరణంబునకుఁ దెచ్చికొని శక్తి కలదేని పోరొనరింపుము. అని పలికి విరాటద్రుపదు లిరువురతోడను నావచనంబు లిట్లు తెలుపుము. ఈప్రజలు సృష్టింపఁబడిననాటనుండియు నేకాలంబునను మహాగుణవంతులగుభృత్యులైనను భర్తలను నిర్మాయి కంబుగ సంతోషపఱిచినవారుగారు. అట్లే రాజులును, భృత్యులను బ్రియపఱిచినవారును గారు. మీకిరువురకును ధృతరాష్ట్రుఁడు దగిన రాజును గాఁడని మీరు తలంచుచున్నవారు. కావున మీ రెల్లరు నేకమై యారాజును వధించుటకును, నన్నుఁ బరిమార్చుటకును మీమీహితం బులు సంపాదించికొనుటకును, బాండవులకుఁ బ్రియమాచరించుటకును యుద్ధంబుగావింపుఁడు. అనిపలికి పాంచాలుం డగుధృష్టద్యుమ్నున కిట్ల నుము. ఇదె నీకనుకూలమైన సమయంబు సమీపించినది. నాకును నిన్నెదిరించుకుతూహలంబుగలదు గావున దానిని దీర్చికొనుటకు నిదియ తగినయదనై యున్నది. నీవీసమయంబు పోనాడక విని యోగించు

## ఉలూకుఁడు పాండవులకు దుర్యోధనుసందేశం బెఱింగించుట

అప్పు డులూకుండు త్వరితగమనంబున బాండవసేనానివేశంబున కరుగుదెంచి రాజులెల్లరతోడంగూడియున్న యుధిష్ఠిరు నాలోకించి రాజా! నీవు దూతవాక్యంబు లెఱుంగుదువు. నేను దుర్యోధనుండు వచించినవాక్యంబులనే పలికెదను. వాని విని నీవు కోపింపవలదనియెను. అదివిని యుధిష్ఠిరుండు ఉలూకా! నీకు భయంబు లేశంబును లేదు. విగతజ్వరుండవై లుబ్ధుండు దీర్ఘదృష్టిశూన్యుండు నగు ధార్తరాష్ట్రుం డేది వచించె దానినెల్ల వచింపు మనియెను. అనంతరంబు మహాద్యుతి మంతులగుపాండవులు, మహాత్ములగుసృంజయులు,మత్స్యులు, కృష్ణుండు, ద్రుపదుండు, నాతనితనయులును, విరాటుండు నింక నక్కడం గలరాజు లెల్లరును నాకర్ణించుచుండ నులూకుం డిట్లని వచించె. ధర్మనందనా! సుయోధనుండు నీకుఁ దెలుపుమని యిట్లు నుడివెను. నీవు ద్యూతంబునం బరాజితుండవైతివి. పాంచాలిసభకుఁ గొనితేఁబడినది. పౌరుషంబుగల మానవుం డెవ్వండైనను నమర్షంబునసహింప శక్యంబగును. ఇల్లువెడలి వనంబున బండ్రెండుసంవత్సరంబులు ప్రవ్రజనము గావించితివి. ఒక్క సంవత్సరంబు విరాటునకు దాస్యంబు నెఱపుచుఁ గడపితివి. రాజ్యహరణంబును, వనవాసంబును, ద్రౌపది పరాభవంబును దలంచికొని యమర్షం బూని పురుషుండవై నిలువుము. అశక్తుండయ్యు భీమసేనుండు దుశ్శాసనునిరుధిరంబు ద్రావెదనని పంతంబులాడె. శక్యమగునే నట్లుగావించుఁ గాక. అకర్దమంబగుకురుక్షేత్రంబున సమాగతులమైయుంటిమి. అశ్వనీరాజనాదికంబును శస్త్రదేవతాహ్వానాదికంబు నగులోహాభిహారంబు నిర్వర్తింపఁబడియె. మార్గంబులు నిమ్నోన్నతంబులుగాక సమంబులై యున్నవి. నీతురంగంబులన్నియు బాగుగ బలసియున్నవి. నీకుఁ బౌరుషం బుండెనేని తేపకడ యుద్ధంబునకు సన్నద్ధుండవగుము. సంయుగంబున భీష్ముని నెదిరింపకయే వృథా వికత్థనము లేటికి? పంగుండు గంధమాదన పర్వతం బారోహింపఁ బ్రతినబూనినట్లు మీ ప్రతిజ్ఞ లెల్లఁ బరిహాసంబు జనింపఁజేయుచున్నయవి. నీవు వ్యర్థంబుగ నాత్మబలశ్లాఘనంబుగావించు కొనుచున్నాఁడవు. దానిని విడిచి పురుషుండవై నిలుము. దుర్ధర్షుం డగు సూతపుత్రుని బలవంతులలో నుత్తముఁ డగుశల్యుని మహాబలుం డగు

ద్రోణుని సమరంబున జయింపకయే రాజ్యంబున కెట్లాశపడుచున్నాఁడవు? ఆచార్యుండు సాంగంబు లగునాల్గువేదంబులయు ధనుర్వేదంబుయొక్కయుఁ బారంబు ధరించినవాఁడు. అట్టిద్రోణుని జయించెదనని తలంచుటనీతలం పసత్యంబే యగును. ఎప్పుడును మేరుపర్వతంబు గాలికి కదలుట విని యెఱుంగము. అనిలంబు మేరుగిరిని సమూలంబుగఁ బెఱికెనను, మహీతలంబున నంతరిక్షంబు పడునేనియు, కాలచక్రంబు పరివర్తనం బొందెనేనియు, నీవు పలికినవాక్యంబులు సత్యంబులగును. జీవితమం దాశగలపురుషుం డెవ్వఁడు శత్రుమర్దనుం డగుద్రోణుని సమీపించి గజంబులు, రథంబులు, తురంగంబులు మొదలగువానితో మరలి యరోగుండై గృహంబున కరుగంగలండు? భూమియందు నివసించు మనుజుఁ డెవ్వండేనీద్రోణభీష్ములు వధింప నిశ్చయింప జీవంబులతో మరలి యింటి కరుగఁగలఁడా? నూతనుండు మండూకంబువోలె నీ వీ రాజసైన్యంబు నెఱుంగఁ జాలకున్నాఁడవు కావలయును. ఇక్కడఁ గూడియున్న రాజసైన్యంబు దేవసైన్యంబున కీడగునది. త్రిదశులు స్వర్గంబు గాచుచందంబున నరపాలకు లీసైన్యంబు నభిరక్షించుచున్నవారు. ప్రాచ్యులు, ప్రతీచ్యులు, దాక్షిణాత్యులు, నుత్తరాహులు, కాంభోజులు, శకులు, ఖశులు, సాల్వులు, మత్స్యులు, కురుదేశ్యులు, మధ్యదేశ్యులు, మ్లేచ్ఛులు, పుళిందులు, ద్రావిడులాంధ్రులు, కాంచీదేశ్యులు, నగు రాజన్యులును, యోధులు నిండు బలసియున్నవారు. నానాజనౌఘంబు యుద్ధసంప్రవృద్ధంబు గాంగం బగువేగంబువోలె దుస్సహంబు నగు నీసైన్యంబు దేఱిపాఱచూడనైన నీశుఁ డవంబు గాకుండును. నాగబలంబునకు మధ్యంబున నిలిచిన నన్ను నెదిరించి పోరుటకుఁ దలంచుట నీమందబుద్ధిచేతనేకదా? అని యిట్లు వచించి ధనంజయు దిక్కు మొగంబై యాయులూకుం డిట్లనియె. అర్జునా! ప్రగల్భంబులు పలుకకుండ యుద్ధంబుగావింపుము. ఊరక కత్థనంబుగావించుటవలన ఫలమేమి? యుద్ధసిద్ధి బలపరాక్రమంబులవలన జేకూఱును గాని వృథాప్రగల్భంబులవలన సిద్ధింపనేరదు. కేవలము కత్థనంబువలననే విజయంబు సిద్ధించునేని లోకంబున నెల్లరకును విజయంబు సులభంబే యగును. ఈలోకంబున కత్థనంబున సమర్థుండుగానివాఁ డెవ్వండుండును? నీసహాయుం డగు వాసుదేవు నెఱుంగుదును. తాలమాత్రప్రమాణం బగునీగాండీవంబు

గూడ నెఱుంగుదును. నీకు సరియగుయోద్ధుండు లేఁడనియు నెఱుంగుదును. ఇన్నియు నెఱింగియుండియే యీరాజ్యంబు నేను ధరించియున్నవాఁడను. మానుషుండు కేవలము పరాక్రమంబువలన రాజ్యంబు పొందనేరఁడు. దైవంబ వాని కనుకూలంబులు, ప్రతికూలంబులును దన యిచ్ఛవలనఁ గల్పించుచుండును. నీవు గోలుమని యేడ్చుచుండఁ బదుమూఁడేఁడులు నిర్వక్రపరాక్రమంబున నీయిలయేలితిని. నిన్ను నీబాంధవులనెల్లరను వధించి యింకను జిరకాలంబు భూమి పాలింతును. నీవు దాసపణంబులచేఁ బరాజితుండవైనయెడ నీగాండివం బెందుండెను? ఫాల్గునా! భీమసేనునిబలమెల్ల నప్పు డెట్లు రూపఱియెను? గదాపాణి యగుభీమునివలనఁగాని గాండివధారియగు ధనంజయునివలనఁగాని యప్పుడు మీకు మోక్షంబు గలుగలేదు. అనిందిత యగుద్రుపదరాజనందన వలన మీరు విముక్తుల రైతిరి. పృషతాత్మజ యగు నాద్రౌపదియే కదా మీదాస్యంబుపాపి మిమ్ముల విడచిపుచ్చెను. మహాదురవస్థలకు లోనయి దాసకర్మంబున నవస్థితులై యున్నమిమ్ములను నేను షండతిలలని యప్పుడన్న వాక్యంబు సత్యంబేకాని యసత్యంబుగాదు. పార్థుండు విరాటనగరంబున నారీజనోచితం బగు వేణిని ధరించెను. కాదేని భీమసేనుండు విరాటునివంటయింట బానిసీఁడై మిగుల శ్రమంబందియుండెను. కౌంతేయా! యిది యెల్ల నాపౌరుషంబని యెఱుంగవా? క్షత్రియులు క్షత్రియుల కెల్లప్పుడు నిట్టిదండంబ గావించుచుందురు. వేణి ఘటించి షండవేషుండవై కన్యల కాటపాటలు నేర్పితివికదా? ఫాల్గునా! వాసుదేవునకుఁగాని, నీకుఁగాని భయమంది రాజ్యం బిచ్చువాఁడను గాను. నీకుఁ బౌరుషంబుకలదేని కేశవునితోడంగూడి యుద్ధంబుగావింపుము. మాయలుగాని, యింద్రజాలంబులుగాని, బిభీషికలుగాని యుద్ధంబున శస్త్రంబు ధరించియున్ననాకుఁ బ్రతిగర్జితంబులు గాఁజాలవు. వేవురువాసుదేవులైనను, నూర్వురు ధనంజయులైనను నమోఘబాణుండ నగు నేను సమీపించినంతన కలనువీడి పరువెత్తకమానరు. భీష్మునితో సంయుగంబాచరించువాఁడు శిరంబునఁ గిరీంద్రము బగులవ్రేయనోపును. మహాగాధంబయి దుస్తరం బగు నీపురుషోదధిని బాహువులచే నిస్తరింపనోపును. శారద్వతుండు మహామీనంబును, వివింశతి మహోరగంబును, బృహద్బలంబులు మహావీచీమాలికలును, సోమదత్తి తిమింగిలంబును, భీష్ముండ

పర్యంతమగుమహావేగంబును, ద్రోణుండు దురాసదంబగుగ్రాహంబును, కర్ణుండు మహాఝషంబును, శల్యుండు దుస్తరావర్తంబును, కాంభోజుండు బడబాముఖంబును, దుశ్శాసనుండు ప్రవాహపూరంబును, శలశల్యులు మహామత్స్యంబులును, సుషేణుండు నాగంబును, చిత్రాయుధుండును నక్రంబులును, జయద్రథుండు మహాద్రియు, పురుమిత్రుండు గాధంబును, దుర్మర్షణుం డుదకంబును, శకుని ప్రపాతంబును, శస్త్రంబులోఘంబునునై యక్షయ్యంబు నతిప్రవృద్ధంబు నగు నీపురుషసాగరంబు ప్రవేశించి సర్వబాంధవులు నశించినపిదప శ్రమంబున నష్టచేతనుండవై నప్పుడు నీమనంబునఁ బరితాపంబు జనించును. అప్పుడ నీమనంబు దుర్లభం బగుమహీపాలనమువలన నివృత్తంబగును. తపంబాచరింపనివానికి స్వర్గంబు దుర్లభం బగుచందంబున నీకు రాజ్యంబు దుర్లభంబని యెఱుంగుము. నీవు లేనిపోనియాశల వీడి శాంతినొందుము.

### భీమాదులు దుర్యోధనునకుఁ బ్రతిసందేశ మంపుట

ఉలూకుం డర్జునుంగూర్చి పలికినవాక్యంబులు క్రుద్ధం బగు కాలసర్పంబును శలాకచేఁ బొడిచినవడువున నసహ్యవేదనంబునాపాదించుడు, నాసభయెల్లఁ గ్రోధావేశపరవశంబయ్యె. పాండవులు దుర్యోధను విచేష్టితంబులచేఁ దొలుతటినుండియుఁ జాలఁ గోపించియుండిరి. ఇపుడు కైతవునిచే ధర్షితులై యాసనంబులనుండి లేచి బాహువులఁ బ్రసారించిరి. క్రుద్ధంబులగు మహానాగంబులువోలె నొండొరుల నాలోకించిరి. భీమసేనుండు రోషపరవశుండై యాశీవిషంబువోలె బుసకొట్టుచు నెత్తునైననేత్రంబులచేఁ గేశవు నాలోకించెను. భీమసేనుం డిట్లు మిగులఁ గోపించ్చి యార్తుండగుట యాలోకించి చిఱునవ్వుతో నులూకు నాలోకించి శకునినందనా! నీవు వేగఁబ యిక్కడనుండి సుయోధనుపాలి కరుగుము. మఱియు వానితో "నీవచనంబు లాలించితిమి. వానియర్థంబు గ్రహించితిమి. నీయభిమతం బెట్లట్లజరగును. నీవు సంశయమందక త్రేపకడ నారబ్ధముగానున్న మహాహవంబున కాయత్తుండవై యుండు"మని వచింపుము. అనిపలికి మహాప్రాజ్ఞుండగు యుధిష్ఠిరునాననం బాలోకించె. సృంజయు లెల్లరును, యశోవంతుండగుకృష్ణుండును, సపుత్రుం డగుద్రుపదుండును, విరాటుండు నాతనితనయులును, సమస్తరాజులు నాకర్ణించుచుండ

నారాజమధ్యంబున సులూకుండాడినమాటల కర్జునుం డత్యంతక్రోధ పరవశుండయ్యె. పాపంబు దారుణంబు నగునులూకునివాక్య మాలించి ధనంజయుండు మిగుల క్షోభమంది లలాటంబును హస్తంబులచే మర్దించికొనెను. పార్థుం డట్లు కుపితుం డగుటయుఁ బాండవు లెల్లరును క్రుద్ధులగుటయు నాలోకించి, యక్కడఁగూడియున్న రాజు లెల్లరు క్రోధంబులచేఁ బ్రజ్వలించిరి. ధృష్టద్యుమ్నుండు, శిఖండి, సాత్యకి, కేకయు, లేవురుసోదరులు, ఘటోత్కచుండు, ద్రౌపదేయులు, నభి మన్యుండు, ధృష్టకేతుండును, నాసనంబులవీడి లేచి క్రోధసంరక్తలోచ నులై రక్తచందనలిప్తంబు లగు భుజంబు లాస్ఫాలనంబు గావించిరి. కోపాటోపంబున వా రెల్లరును దంతములు పటపటగొఱికిరి. ఆసమయం బున వృకోదరుండు క్రోధతామ్రాక్షుండై యాసనంబునుండి లేచి దంత ములు పటపటగొఱుకుచు చేతితోఁ జేతిని బీడించుచు నాశకునితన యున కిట్లనియె. మూర్ఖా! అశక్తులగువారిని బ్రోత్సాహపఱచినరీతిని నీవాడినమాటలెల్ల నే నాలించితిని. దుర్యోధనుండు చెప్పినమాట లెల్ల నీవు చెప్పితివికదా? ఇపుడు నేను నుడువువచనంబు లాలించి యా సుయోధనునితోఁ జెప్పుము. సమస్తరాజులును సూతసూనుండు నాకర్ణించుచుండ మందుం డగునాసుయోధనునకు నావాక్యంబు లిట్లు తెలుపుము. దురాచారపరాయణా! మేము మాయగ్రజునిప్రీతికై నీవొనరించినక్లేశంబులెల్ల ననుభవించియుంటిమేకాని యశక్తులమై యను భవించి యూరకున్నవారముగాము.కులక్షేమంబు నాకాంక్షించువాఁడై శమంబునకై ధర్మనందనుండు హృషీకేశుని కౌరవులపాలి కంపియున్న వాఁడు. కాలచోదితుండవై యమసదనంబు కరుగనున్న నీకు మాశాంతి ప్రియత్వమెల్ల నశక్తత్వమువోలెఁ గన్పట్టుచుండెఁగావలయును! నీవు సర్వసన్నాహంబులు గావించికొని మాతో యుద్ధంబు గావించుటకు సిద్ధమైయుండుము. ఎల్లి తప్పక యుద్ధంబు ప్రవర్తించును. నేను నిన్ను నీయనుజులను బరిమార్తునని ప్రతిజ్ఞగావించియుండుట నిక్కము. పాపా! నాప్రతిజ్ఞ తప్పక నెఱవేఱితీఱును.దానికి లేశంబేని సంశయంబందకుము. వరుణాలయుంబగుసాగరం బాకస్మికంబుగ వేల నతిక్రమించెనేనియుఁ గులపర్వతంబు లకారణంబ విశీర్ణంబులయ్యెనేనియు నగుఁగాక. నేనాడిన మాట యెన్నండు నసత్యంబుగానేరదు. యముండు కుబేరుండు రుద్రుం

డును నీకు సహాయులై వచ్చినను, బాండవులు ప్రతిజ్ఞ చేసినట్లు తప్పక కావింతురు. నేను దప్పక దుశ్శాసనుని రుధిరంబు పానంబు సేయుచున్నాఁడను. మఱియు నాసమయంబున సంరంభవశుండై యేక్షత్త్రియుండైనను భీష్ముని బురస్కరించికొని యుద్ధునకఱతెంచినను వానిని విడువక యమసదనంబున కనిచెదను. నే నీక్షత్త్రియసభయం దాడినమాటలెల్ల నసత్యంబు లెప్పు డగు నపుడు తనుత్యాగంబు గావించికొందును. కావున నీవింక నిశ్చయంబుగ మరణకృతవ్యవసాయుఁడవై యుండుము. అని వచించినపిమ్మట సహదేవుం డులూకు నాలోకించి క్రోధసంరక్తలోచనుండై యిట్లనియె. ఓరీ! నీవు శౌండీరుండవు శూరవేషప్రచ్ఛన్నుండవు నగుపాపిష్ఠుండవై యున్నవాఁడవు. దురాత్మా! నీతండ్రితో నేను జెప్పం దగువచనముల నాలింపుము. నీచా! నీకు ధృతరాష్ట్రునితోడి సంబంధమే లేకుండునేని మాకులంబున కెప్పుడును భేదము సంభవించెడిది కాదు. నీవు లోకవినాశంబుకొఱకును ధృతరాష్ట్రకులవిచ్ఛేదంబునకు నుద్భవించిన వైరపురుషుండవై యున్నాఁడవు పాపాత్మా! నీవలన నీకులంబెల్ల నశింపక తప్పదు. ఉలూకాధమా! నీతండ్రి జనించినది మొదలుగ మాకహితంబులు నృశంసంబులు నాచరించుచునే యున్నవాఁడు. పాపపురుషా! ఆవైరానుషంగమునకు దుష్ప్రాపంబగునంతం బిదె యాసన్నమైయున్నది. ఆదుష్టుం డగుశకుని చూచుచుండ వానికన్నుల యెదుట నిన్నుఁ దొలుత వధించి యనంతర మెల్లధనుర్ధరులు నాలోకించుచుండ నీతండ్రిని సంహరింతును. అని వచింప ధనంజయుం డాభీమసహదేవులవచనంబు లాలించి చిఱునవ్వునవ్వుచు భీమసేనునితో, “అన్నా! గృహములందు సుఖించుచునుండ లేక నీతో నేదురాత్ములు వైరంబు గల్పించికొనిరో వారాత్మనాశంబునకు నిరాఘాట మగు మార్గంబేర్పఱిచికొనిరనుట నిక్కువము. అయినను నీయులూకుని పరుషంబు లాడంజనదు. వీఁడు దూతగావచ్చి యాసుయోధనుం డాడినమాటలు చెప్పినాఁడే కాని వాఁడు మన కేమియు నపకార మిప్పుడు గావింపలేదు. కావున వాఁడు గావించినయపరాధ మేమియు లేదు. అనిపలికి భీమసేనసహదేవుల శాంతులం జేసి ధృష్టద్యుమ్నప్రభృతిమహావీరుల నాలోకించి యిట్లనియె. మిత్త్రులారా! పాపిష్ఠుం డగుధార్తరాష్ట్రుం డాడినమాటలీయులూకుఁడు సెప్ప మీరలెల్లరు నాలించియుంటిరి కదా? వాసుదేవుని

నన్నుఁ గావించినకుత్సనం బాలించినంతన మీరెల్లరును మాకు హిత
మాచరించుతలంపున నధికసంరంభం బొందితిరి. వాసుదేవుని ప్రభా
వంబునను మీయెల్లరప్రయత్నమునను సమస్తంబగు క్షత్రియానీకంబును
నేనొక్కఁడ చీరికింగొనను. మీరందఱు ననుమతింతురే నీయులూకునకుఁ
బ్రతివచనంబు సెప్పెద. దానిని వీఁడు సుయోధనున కెఱింగించును. వీఁ
డిప్పు డీవచనంబుల నెఱింగించినపిదప తెల్లవాఱి సూర్యుఁ డుదయగిరి
నారోహించినంతన యాదురాత్ముం డగుధార్తరాష్ట్రునకు గాండీవంబు
తోడఁ బ్రతివచనంబులు తెలిపెదను. కేవలము మాటకు మాటపలుకు
వారు క్లీబు లనంబడుదురుకదా? అని ధనంజయుండు పలికినంత నాధను
ర్ధరులెల్లరును విస్మయావిష్టచిత్తులై యాతనివాక్యోపచారంబు నెంతయుఁ
గొండాడిరి. అర్జునుండు నట్లు రాజులనందఱ ననునయించి ధర్మజు నను
మతంబు నందుటకై మహారాజ! నీకు బహుకాలశుశ్రూష గావించుటం
జేసి కలిగినసంస్కారమున నాసుయోధనునకుఁ బ్రతిసందేశంబు నేన
వచింతును. ఆత్మావమానంబు గావించుకొనువాఁ డెన్నండును బార్థివోత్త
ముండు గానేరఁడు. సామపూర్వంబు నూర్జితోత్తరంబు నగువచనం
బీయులూకునకుఁ జెప్పెదనని వచించి బుస్సకొట్టుభుజంగంబువోలె నిట్టూ
ర్పునిగుడఁ బెదవులు వడంక జనార్దనుని దనసోదరులను వీక్షించి యులూ
కున కిట్లని వచించె. ఉలూకా! నీవు సత్వరంబుగ నిక్కడనుండి సుయో
ధనుకడ కరుగుము. కృతఘ్నుండు వైరపురుషుండు దుర్మతి కులపాంస
నుండు నగుసుయోధనునకు నామాట లిట్లెఱింగింపుము. పాపాచారా!
దురాత్మా! దుర్యోధనా! నీవు నిత్యంబును బాండవులయెడ ద్రోహం
బాచరించుచున్నాఁడవు. పాపాత్మా! తనబలంబునఁ బరాక్రమించి శాత్ర
వులయుద్ధంబున నాహ్వానముగావించుటయు భయములేక వాక్యములం
బూరించుటయును క్షత్రియలక్షణంబులై యొప్పును. పాపిష్ఠుండ వగు నీవు
క్షత్రియుండవే నైతివేని మమ్ముల యుద్ధంబున నాకారించి మాన్యులను
నమాన్యులనుముందిడుకొని యుద్ధంబునకువచ్చుట వీరధర్మంబుగానేరదు.
యుద్ధంబున కసమర్థులను బూజ్యులను నీచులను ముందిడుకొనివచ్చుట
భీరులక్షణంబై యుండును. కౌరవకులాధమా! ఆత్మవీర్యంబును ధైర్యం
బునాశ్రయించి పార్థులను బోరికిఁజీరితివేని నీవు నిక్కంబుగ క్షత్రియుం
డవగుదువు. పరులవీర్యం బాలంబనంబుగాఁగొని పరుల యుద్ధంబునకుఁ

బిల్చుచు దా నేపనియుఁ జేయజాలనివాఁడే నపుంసకుఁ డనంబడును.
నీవు పరులవీర్యంబున నిన్ను గొప్పగాఁదలంచుకొనుచున్నవాఁడవు. ఇట్టి
శక్తిహీనుండవయ్యు మాకడ నిట్లు ప్రగల్భములాడ నేల? అని వచించి
నంత వాసుదేవుండు నులూకునితో 'నోరి! యాదురాత్ముండగు సుయో
ధనునకు నావచనంబులు తప్పక యిట్లు తెలుపుము. దుర్మతీ! రేపకడ
నీపాటివేళకు నీవన్నివిషయంబులు నెఱుంగంగల్గుదువు. నీవు పౌరుషం
బాలంబించి నిలువుము. మూఢా! నీవు జనార్దనుం డాయోధనం బాచ
రింపం డని తలంచుచున్నాఁడవు కాఁబోలును? పాండవులు సారథ్యంబు
మాత్రమే నన్నర్థించిరను కారణంబున నీవుభయపడకున్నాఁడవు కావల
యును! నీవట్లాలోచించిన జఘన్యకాలమయినను నదియట్లు జరుగ
నేఱదు. నేను క్రోధంబున సర్వపార్థివులను హుతాశనుండు తృణముల
దహించుమాడ్కి నిర్దహించెదను. మహాత్ముండగు యుధిష్ఠిరునియోగం
బునను ఫాల్గునిప్రార్థనంబునను విజితాత్ముండగు సవ్యసాచి యుద్ధం
బొనరించునపు డాతనికి సారథ్యంబు గావించెదను. ఎల్లి సూర్యోద
యావసరంబున నీవు మూఁడులోకంబులలో నెందరిగినను భూమితలం
బును ప్రవేశించినను నీ వెక్కడకేఁగిన నక్కడక్కడ నర్జునరథం బాలో
కింతువు. నీవు భీమసేనునివచనంబులు సత్యంబు గావని తలంచుచున్నాఁ
డవు కాఁబోలును? అట్లు తలంపకుము. దుశ్శాసనునినెత్తు రిప్పుడ భీమ
సేనుండు త్రావెనని నిశ్చయించికొనుము. ప్రతికూలభాషి వగు నిన్ను
పార్థుండుగాని ధర్మనందనుండుగాని భీముండుగాని నకులసహదేవులు
గాని యిక్కడఁజేరియున్న రాజలోకంబునం దొక్కరుండుగాని క్షమించి
విడుచువారు కారు.' అని పలికెను.

పాండవులు శిబిరరాజులును వేర్వేఱుగా దుర్యోధనునకుఁ బ్రతిసందేశ మంపుట

మఱియును ధనంజయుం డాదుర్యోధనుం డాడంబించినవచనం
బులఁ దలంచికొని యతిరక్తంబు లగునేత్రంబులతోఁ గితవాత్మజుం డగు
నులూకు నాలోకించెను. మహాయశుండగు గుడాకేశుండు కేశవునీక్షించి
విపులం బగు తనభుజం బాస్ఫాలనంబు గావించి వానితో 'నులూకా!
యిదే నావచనం బాసుయోధనున కెఱింగింపుమని యిట్లు పలుకం
దొడంగె. స్వవీర్యం బాశ్రయించి పరుల యుద్ధంబునకుఁ బిలిచి శాత్ర

విప్రియం బాచరించిన యాకౌరవునితో "నీవు వచించినమాట లాలించితిమి. వానియర్థంబు గ్రహించితిమి. నీయభిమతం బెట్లుండె నట్లే సర్వంబు ప్రవర్తించు"నని వచింపుమని పలికినపిమ్మట భీమసేనుం డులూకున కిట్లనియె. ఉలూకా! పాపాత్ముండును, దుర్మతి, శఠుండును, నికృతిపరాయణుండును, దురాచారుండు నగుసుయోధనునకు నావాక్యంబు లిట్లు తెలుపుము. సుయోధనా! నీవు గ్రద్దలయుదరంబున వసించినను సరియే లేక హాస్తినపురంబున వసించినను సరియే. నరాధమా! నాఁడు సభామధ్యంబున నేను బ్రతిజ్ఞయొనరించినదెల్ల సత్యంబుగఁ గావింతును. సత్యంబున శపథంబుగావించుచున్నాఁడను. మహాహవంబున దుశ్శాసను వధించి వానిరుధిరంబు పానంబొనర్చెదను. నీసోదరులనెల్ల వధించి నీయూరువులవిఱిచి ధార్తరాష్ట్రులకెల్ల నే నపమృత్యువనయ్యెదను. రాజపుత్త్రులకెల్ల నిస్సంశయంబుగ మృత్యువగుదు. నాయొనర్చినకర్మంబున నే మీకు సంతోషం బాపాదింతును. మఱియు నావచనం బిదె యాకర్ణింపుము. సుయోధనా! నిన్ను వధించి నీయనుజులనెల్లఁ బరిమార్చి ధర్మరా జాలోకించుచుండ నీశిరంబు పాదంబునం దాఁచెద. ఎల్లి యుద్ధంబున కాయత్తుండవై యుండు మని వచించె. అటుపిమ్మట నకులుం డులూకా! యాదుర్యోధనునితో నావచనంబులుగా సుయోధనా! నీవు పంచినసందేశ మాలించితిని. దాని కుచితం బగురీతి నెల్లపనులును గావించెదనని చెప్పు మని వచించెను. తరువాత సహదేవుం డులూకా! సుయోధనునకు నా వచనంబు లిట్లు తెలుపుము. సుయోధనా! నీమతి యెట్లుండునో యట్లే సర్వంబును జరుగును. నీవు జ్ఞాతిబంధుపుత్త్రాదులతోఁగూడ శోకింతువు. ఈ యాక్లేశంబెల్ల నీవు సంతోషముతో నీకృత్యముగా పొగడుకొనుచున్నాఁడవు. కావున దానికిఁ దప్పక ఫల మనుభవింతువు, అని వచించె. పిదప విరాటుండును ద్రుపదుండు నులూకా! మామాటలుగా నా సుయోధనున కిట్లనుము. సుయోధనా! మేము సత్పురుషునకు దాసభావం బాచరింతుము. మేము దాసులమో, యదాసులమో నీవు మా పౌరుషం బాలోకించి నిర్ణయించికొందువుగాక యని పల్కుమనిరి. అనంతరము శిఖండి శకునినందనా! పాపకార్యాభిరతుం డగు నారాజునకు నావచనంబు లిట్లు తెలుపుము. రాజా! సమరంబున దారుణంబగు ధర్మంబు గావించున న్నాలోకింతువుగాక. ఎవని నాశ్రయించి నీకు

సమరవిజయంబు లభింపుమని యాశించుచున్నాఁడవో యట్టి నీపితా
మహుఁడు శాంతనవునిరథంబునుండి క్రిందికిఁబడఁద్రోసెదను. మహాత్ముం
డగువిధాత భీష్ముని వధించుటకే నన్ను సృజించినవాఁడు. సర్వధనుర్ధరు
లును జూచుచుండ నేను భీష్ము నెల్లవిధంబుల సంహరించెద నని వచించె.
పదంపడి ధృష్టద్యుమ్నుండును గితవాత్మజుం డగునులూకున కిట్లనియె.
శకుని తనయా! రాజనందనుం డగుసుయోధనునకు నావాక్యంబు లిట్లు
తెలుపుము. నేను సగణుండు సబాంధవుండు నగుద్రోణుని బరిమార్చె
దను. ఇతరుల కెవ్వరికిని జేయఁ దరంబుగాని రణకర్మంబు నేను గావించు
నెడ నీ వాలోకింతువుగాక యనియె. అనంతరము ధర్మనందనుండు
కరుణార్ద్రహృదయుండై యులూకా! యాసుయోధనునితో "నే నెన్నం
డును జ్ఞాతివధంబు గోరననియు దుర్బుద్ధి వగు నీదోషంబుననే యీసర్వ
వ్యసనము లాసన్నంబైనవనియుఁ జెప్పుము. పూర్వులెల్లరును జరించిన
మహాకార్యంబులు నే నవశ్యంబు గావింపక తీఱదుకదా!" అని వచించి
మఱియుఁ గితవాత్మజా! నీవు త్వరితంబుగ సుయోధనునికడ కరుగుము.
నీవియ్యెడన యుండఁదలంచితే నిక్కడన యుండుము. మే మెల్లరము
నీకు బంధువులమేకదా? నీకిక్కడ నొక్కభయంబును గలుగక సుఖంబు
లభించునని వచించె. అట్లు ధర్మనందనుండు పలికినయనంతర ములూ
కుండు ధర్మనందనుకడ సెలవంది తక్కుంగలవారలనెల్ల వయస్సననుస
రించి యథోచితంబుగ నామంత్రణంబుగావించి సుయోధనునికడకుం
జనియె. వాఁడు పాండవులశిబిరంబునుండివచ్చి యమర్షణుం డగుదుర్యో
ధనునిం గని వానితో నర్జునుండు చెప్పినప్రతిసందేశ మెల్లఁ దెలిపెను.
మఱియు వాసుదేవుండు, భీమసేనుండు, ధర్మనందనుండు, నకులుండు,
విరాటుండు, ద్రుపదుండు, సహదేవుండు, ధృష్టద్యుమ్నుండు, శిఖం
డియు వచించినవాక్యంబులెల్లం జెప్పినవి చెప్పినట్లు తెలిపెను. దుర్యో
ధనుం డాకైతవ్యునివచనంబు లాలించి దుశ్శాసనుని, శకునిని, గర్ణుని
జూచి వారలతో మనబలంబులను మిత్రబలంబులనుగూడ సూర్యుం
డుదయాద్రిం బొడచూపకయమున్న యెల్లరును యుద్ధసన్నద్ధులై
యుండుఁడని చాటింపుఁడు. అనివచింపఁగర్ణుండు దూతలసేనాయోగంబు
గావింపఁ జాటింబంచె. కర్ణసమాధిష్టు లగుదూతలు, త్వరితగమనంబు
లగునరవంబులు, సుష్ట్రంబులు, వేసరంబులును నధిరోహించియుఁ, గాలి

నడకఁ బరువులిడియుఁ, దురంగంబు లధిరోహించియు, సకలంబు లగుసేన లందును సంచరించి సూర్యోదయంబునకుఁ బూర్వమే యోగంబుగావింప వలయునని రాజని యోగంబును గర్ణాజ్ఞయు నెఱింగించిరి.

## పాండవులు యుద్ధసన్నాహంబు గావించుట

ఉలూకునికిఁ బ్రతిసందేశముచెప్పి వానిం బంచినపిదప ధర్మనంద నుండు ధృష్టద్యుమ్నపురస్సరం బగుసేనను యుద్ధభూమికిఁ దరలించెను. మహాబలిష్ఠు లగుపదాతులును, బర్వతోపమంబు లగుకుంజరంబులును, మహావిశాలంబులు దృఢంబులు నగురథంబులు, పవనజవనంబు లగు తురంగంబులును గలిగి, భయంకరము నకంప్యము పృథివీవిస్తారము సాగరగంభీరము నగుచతుర్విధబలంబులను యుద్ధభూమికి వెడలుచుండ, నాసేనల కన్నిటికిని మహాధనుర్ధరుం డగుపాంచాల రాజాత్మజుండు ధృష్ట ద్యుమ్నుండు యుద్ధదుర్మదుండై, ద్రోణసంహారాభిలాషియై ముందునడ చుచు ననీకంబుల నడపించెను. మఱియు నాతండు బలంబు నుత్సా హంబు ననుసరించి రథికుల కిట్లాజ్ఞాపించె. సూతనందనునికొఱకు ధనం జయుని, దుర్యోధనునకు వృకోదరుని, ధృష్టకేతుని శల్యునకు, కృపున కుత్తమౌజుని, నకులు నశ్వత్థామకు, శైబ్యుని గృతవర్మనకు, సైంధవు నకు వార్ష్ణేయుం డగుయుయుధానుని, బ్రతియోధులుగా నియ మించె. మఱియు శిఖండిని శాంతనవునకును, సహదేవుని శకునికిని, జేకి తానుని శలునకును, ద్రౌపదీతనుభవు లేవురను ద్రిగర్తులకును, నభి మన్యుని వృషసేనునకును, దక్కుంగలరాజులకును బ్రతిరథులుగానుండ నాజ్ఞాపించె. అభిమన్యుండు పార్థునికంటెను నాహవంబున నధికుండని యాతండు తలంచెను. ఇట్లు తనయోధులకెల్లఁ గౌరవయోధులనుభాగం బులుగ విభజించి జ్వాలావర్ణుం డగు తాను ద్రోణుని దనవంతుగా నెఱిం గించెను. మహేష్వాసుండు సేనాపతుల కధిపతియు నగుధృష్టద్యుమ్నుఁ డు బుద్ధిబలంబున విధివిధానంబున సేనలనెల్ల వ్యూహంబులుగాఁ బన్ని యుద్ధంబున కెదురుచూచుచుండె. పాండునందనులకు జయం బాకాం క్షించుచు నాబలంబులెల్ల యథోద్దిష్టంబుగ యోగంబునొంది యుద్ధ కాంక్షచేఁ బ్రకాశించుచుండె.

భీష్ముండు కౌరవబలంబున రథాతిరథులం జెప్పుట

అంత నక్కడ హస్తిపురంబున ధృతరాష్ట్రుండు ధనంజయుండు భీష్ముని వధింపఁ బ్రతిన గావించె నని విని భయాకులుండై సంజయు రావించి వాని కిట్లనియె. సంజయా! ఫాల్గునుండు శాంతనవు వధింప శపథంబు గావించినపిదప మందులగు నాతనయు లేమి గావించిరో తెల్పుము. పాండవమధ్యముండు సామాన్యుండు గాఁడు. వాఁడు చెప్పి నంతయుఁ జేయంగలధీరుండు. దృఢధన్వి యగుపార్థుండు వాసుదేవసహాయుండై శాంతనవుని వధించుట నిక్కము. అపరిమితప్రజ్ఞుం డగుశాంతనవుండు పార్థునిప్రతిజ్ఞ నాలించి యేమనియెను? మహాధనుర్ధరుండు యోధాగ్రగణ్యుండు మహాబుద్ధిపరాక్రమాభిరాముండు కౌరవధురంధరుండు నగుభీష్ముండు తనవధశపథము నాకర్ణించి యేమి గావించెనో యెఱింగింపు మనవుడు, సంజయుండు, కురువృద్ధుం డగుభీష్ముండు వచించిన దెల్ల నాంబికేయున కిట్లని తెలిపెను. అప్పుడు సేనాధిపత్యంబున నభిషిక్తుండై గాంగేయుండు శక్తిధరుండు దేవసేనానియు నగుకుమారునకు నమస్కారం బొనరించి దుర్యోధనునకుఁ బ్రహర్షం బాపాదించుచు నిట్లనియె. వత్సా! సుయోధనా! నేనిప్పుడు నీసేనల కెల్ల నధినాయకుండ నగుదును. దీనికి సంశయమందకుము. నేను సేనాకర్మంబునందును వివిధంబు లగువ్యూహంబులందును, భృత్యు లగువారిచేతను, గానివారి చేతను దత్తదుచితంబులగుకర్మంబులు చేయించుటకును లెస్సగ నెఱింగినవాఁడను. యాత్రాయానంబందును, యుద్ధంబందును, బ్రశమనమందును బృహస్పతి యెంతటి నేర్పరియో నేను నంతటి నేర్పుకలవాఁడను. దైవమానుషగాంధర్వంబు లగువ్యూహంబులుపన్నుటకును నాకత్యధికంబగు పాండిత్యముకలదు. ఆవ్యూహంబులం బన్ని పాండవులను మోహపరవశులం గావింతును. నీమనంబునం గల జ్వరంబువీడి నిశ్చింతుండవై యుండుము. నేను శాస్త్రచోదితప్రకారంబున నీసేనల రక్షణంబు గావించుచుఁ బగరకు భయంబు గొల్పురీతి నాహవంబు గావింతును. నీవింక భయమందకు మనుటయు సుయోధనుండు గంగాతనూభవా! నాకు దేవతలందును, దానవులందు, నసురులందును భయంబు లేశం బైనను లేదు. నే నొక్కరుండనై యున్నపుడేని దేవాసురు లెల్లరు నొక్క

టిగా నెత్తివచ్చినను భీతిల్లువాఁడనుగాను. దుర్ధర్షుండవగు నీవు సేనా నాయకత్వమువహించియుండ పురుషవ్యాఘ్రంబగు ద్రోణుండు యోధుం డైయుండ నాకు భయంపడఁ గారణమేమి? పురుషశ్రేష్ఠులగు మీరిరు వురు నాపక్షంబుననుండ నాకు విజయంబేకాదు; దేవరాజ్యమైనను దుర్లభంబు గాఁజాలదు. ఐనను మనబలంబునను బరబలంబునను గల రథులను నతిరథులను పరిగణింప వినఁ గుతూహలినై యున్నవాఁడను. నీవు పరులబలంబును మనబలంబును బాగుగ నెఱింగినవాఁడవుకదా? కావున నీవు వివరించిచెప్ప నీరాజులతోఁగూడ నాలకింప నాకుఁ గౌతు కంబయ్యెడిఁ గావున వచింపవే యని యడిగెను. ఆమాటలాలించి భీష్ముండు దుర్యోధనున కిట్లనియె. గాంధారీనందనా! రణంబున సంఖ్య నాలింపుము. స్వబలంబునను బాండవబలంబునను గలరథాతిరథుల వివ రింతు నాకర్ణింపుము. నీసేనలయందు బహుసహస్రసంఖ్యాకులును ప్రయుతార్బుదసంఖ్యాకులును రథికులు గలరు. వారలనెల్ల వివరింప శక్యంబుగాదు. ఐనను ముఖ్యులగువారి నెఱింగింతు నాలింపుము. నీ సహోదరులెల్లరతోఁగూడ నీవు ప్రప్రథమంబున రథోదారుండవై యున్నవాఁడవు. దుశ్శాసనుండాదిగాఁగల్గునీసహోదరులు నూర్వురును శస్త్రవిద్యయం దాఱితేఱినవారు. ఛేద్యంబులందును వారలకెల్లనైపుణి యతమాత్రంబు గలదు. రథోపస్థంబునందు గజస్కంధంబునందు గదా పాశాసిచర్మాద్యాయుధంబులందును మీరెల్లరును విశారదులరై యున్న వారు. మీరెల్లరును సంయంతలును, ప్రహంతలును, కృతాస్త్రులును, భారసహులునునై వెలుంగుచున్నారు. ధనుర్విద్యయందు ద్రోణునకును, కృపునకును శిష్యులరై మిగులఁ బ్రఖ్యాతిం గాంచియున్నవారలరు. నీయనుజులెల్లరును రణాంగణంబున యుద్ధదుర్మదులగుపాంచాలురను సంహరింతురు. మహామనస్కులగు నీయనుజులు పాండవులయెడ నత్యం తము కిల్బిషం బూనియున్నవారు. నీకును నీయనుజన్ములకు ననంతర మున సేనల కధిపతి నగునే నున్నాఁడను. ధనంజయుని ధిక్కరించి శాత్రవులఁ బరిమార్చెదను. నేను నాగుణంబులఁ జెప్పికొనఁజాలను. నా సామర్థ్యమెల్ల నీ వెఱుంగుదువుకదా? భోజకులమూర్ధన్యుండు శస్త్ర భృదగ్రగణ్యుండు నగుకృతవర్మం డతిరథుండు. ఆతండు యుద్ధంబున నిస్సంశయంబుగ నీకర్థసిద్ధి కావింపంగలఁడు. ఆతనిని శస్త్రవేదు లెవ్వ

రును ధర్షింపంజాలరు. దృఢాయుధుండు దురాపాతియు నగుకృత వర్ముండు మహేంద్రుండు దానవుల వధించుమాడ్కి నీశాత్రవులనెల్ల సంహరించును. మహేష్వాసుండు, మద్ర దేశాధీశ్వరుండు, శల్యుండు నతిరథుండని నేనెంచుచున్నవాఁడను. ఆతండు ప్రతియుద్ధంబునను వాసు దేవునితో మిగుల స్పర్ధగొనుచుండువాఁడు. రాజసత్తముం డగు శల్యుండు తన చెల్లెలికొడుకులగు నకులసహదేవుల విడిచి మిగిలినమహా రథులగుపాండవులతో సైతము పోరొనరించును. ఈతండు సముద్ర తరంగములంబోలు బాణపరంపరలచే శాత్రవుల ముంచెత్తును. భూరి శ్రవసుండు కృతాస్త్రుండును నీకు హితుండగు మిత్రుండునై యున్న వాఁడు. మహేష్వాసుండు సోమదత్తాత్మజుండు నగుభూరిశ్రవసుండు రథయూథపయూథపుండై వెలుంగుచున్నవాఁడు. ఆతండు శాత్రవు లకు మహాబలనాశనంబు గావించును. మహారాజ! సింధురాజు ద్విగుణ రథుండని నేనెంచుచున్నాఁడను. రథసత్తముం డగునాతండు సమరంబున విక్రమించి యుద్ధంబొనరించును. ద్రౌపదీహరణసమయంబునఁ బాండవు లచేఁ బరిక్లేశం బనుభవించియున్నవాఁడు. ఆపరిక్లేశంబును స్మరించుకొని యీతండు ప్రాణంబులం బాశయును లేకుండఁ బెనంగును. ద్రౌపదీహర ణావసరంబున బాండవులచేఁ బరాభూతుండై యీతండు ఘోరంబగు తపంబుగావించి యాహవంబునఁ బాండవుల నిలువరించుటకు వరంబు సైతము పొందియున్నవాఁడు. రథశార్దూలం బగునీసైంధవుం డాపరా భవంబు తలంచికొని దుస్త్యజంబులగుప్రాణంబులనేని వీడి పాండవులతో ఘోరంబుగఁ బోరంగలవాఁడు.

రాజా! కాంభోజుండగుసుదక్షిణుం డేకగుణరథికుండై యొప్పు చున్నవాఁడు. ఆతండు నీయర్థసిద్ధి నాకాంక్షించుచు సమరంబునఁ బరు లతోఁ బోరంగలవాఁడు. నీనిమిత్తమై యుద్ధంబుగావించు నీరథసింహుని పరాక్రమంబు సురేంద్రునిపరాక్రమంబుంబోలె కౌరవుల విస్మయావిష్టు లం గావించును. తీక్ష్ణంబగువేగంబునఁ బ్రహారంబుగావించు నీతనిబాణం బులు పరులరథవంశంబున శలభంబులువోలె నెడతెఱపి లేక పడుచుం డును. మహిష్మతీనివాసి యగు నీలుండు నీలకవచుండుగూడ రథుండై వెలుంగుచున్నవాఁడు. ఆతండును బరులరథబృందమ్ముతో నియుద్ధంబు గావించును. ఈతండు మున్ను సహదేవునితో వైరంబొందియున్న

వాఁడు గావున నీనిమిత్తంబు పాండవులతోఁ బోరనున్నవాఁడు. అవంతి దేశాధీశు లగువిందానువిందు లన్నదమ్ములు రథసత్తములు. వీరలుసమరం బునఁ బ్రోధియు దృఢవీర్యపరాక్రమంబునుగలవారై ప్రఖ్యాతినొంది యున్నవారు. గదలు, ప్రాసంబులు, ఖడ్గంబులు, నారాచంబులు, తోమరం బులు మొదలగునాయుధంబులం బ్రయోగించి యీపురుషశార్దూలంబులు రిపుసైన్యములనెల్ల భస్మంబుగావింతురు. మహారాజ! యుద్ధాభికాము లగువీరిరువురును యూథపంబులంబోలి సమరాంగణంబున విహరించుచుఁ గృతాంతులో యనుభయం బాపాదింతురు. రాజా! త్రిగర్తదేశాధి పతు లేవురుసోదరులు రథోదారులని నేనెఱుంగుదును. వారలు విరాట నగరంబున నాసమయంబునఁ బార్థులతో వైరంబుగావించియున్నవారు. సముద్ధతతరంగంబులుగల గంగానదిని మహామకరంబులు కలంచు తెఱం గున వీరలు సమరంబున బార్థవాహినికి విక్షోభముగావింతురు. ఈ యేవురు రథులకును సత్యరథుండు మొగంబై యున్నవాఁడు. మున్ను దిగ్విజయంబు గావించునెడఁ బాండునందనుం డగుబీభత్సుండు వీరికిఁ గావించినపరాభవంబును స్మరించినవారై వీరలు పాండవులతోఁ బ్రాణం బులం దాశవీడి యుద్ధంబుగావింతురు. వారలు పార్థులమహారథుల నెదు ర్కొని యుత్తములగుక్షత్రియులనెల్లఁ బరిమార్పంగలరు. నీపుత్రుండు లక్ష్మణుండును దుశ్శాసనతనయుండు నిర్భీరును బురుషశార్దూలంబులై యున్నవారు. వీరలు యుద్ధంబున బలాయనం బెఱుంగరు. తరుణులు, సుకుమారులు, వేగవంతులునగు నీరాజపుత్రు లిరువురును యుద్ధవిశేషం బుల బాగుగ నెఱింగినవారు. సర్వవిషయంబులందును బ్రణేతలై యొప్పు చున్నవారు. వారిరువురును రథసత్తములని నాయభిప్రాయము. క్షత్ర ధర్మనిరతులగు వీరిరువురును సమరంబున నత్యధికం బగుకర్మంబు గావిం తురు. మహారాజా! దండధారుండును నేకరథుండై యున్నవాఁడు. తన సైన్యంబులతో నీనిమిత్తంబునఁ బాండవబలంబులతోఁ బెనంగనున్న వాఁడు. కౌసల్యుం డగుబృహద్బలుండు నేకరథుండై యొప్పుచున్న వాఁడు. మహావేగపరాక్రమంబుగల యీరథసత్తముండు సమరం బున మహాకర్మంబుగావించును. ఉగ్రాయుధుండును మహేష్వాసుండు నగునీతండు తనబంధువులకు ముదంబుగూర్చుచు ధార్తరాష్ట్రహితాభి రతుండై సంగ్రామంబున నసాధారణం బగుకర్మంబు గావించును

రాజా! శారద్వతుండగు కృపుండు రథయూథపయూథపుండు. ప్రియం బులగు ప్రాణంబులనేని లక్ష్యము సేయక యీతండు నీశాత్రవులనెల్ల దహించును. గౌతమగోత్రజాతుండు మహర్షిపుంగవుం డాచార్యుండు నగు శరద్వతునకు శరస్తంబమువలనఁ గార్తికేయుంబోలి యీకృపుం డుదయించి మించినవాఁడు. రాజా! ఈతండు వివిధాయుధంబులు కార్ము కంబులుగల బహుసైన్యంబుల నగ్నివలె నిర్దహించుచు నాహవభూమిని జరింపఁగలఁడు. నరాధిపా! నీమేనమామ శకుని యేకరథుండు. ఈతండు పాండవులతో విరోధంబు గావించియున్నవాఁడు. గావున నిస్సంశయ ముగ వారలతో యుద్ధంబు గావించును. ఈతండు యుద్ధంబుగావించు నెడ నీతనిసైన్యంబు దురాధర్షంబును వివిధాయుధభూయిష్ఠంబును వాయువేగసమానజవసంపన్నంబునై వెలుంగును. ద్రోణపుత్రుం డగు నశ్వత్థామ మహాధనుర్ధరులనెల్ల మీఱియున్నవాఁడు. ఈతండు సమరం బున జిత్రయుద్ధంబు గావించును. దృఢాస్త్రుం డగునాచార్యనందనుండు మహారథుండు. ధనంజయుండు గాండీవంబునం బూన్చియేసిన శరం బులవోలె నశ్వత్థామబాణంబులునై తము నొక్కదాని నొకటికలసియే యెగయుచుండును. రథసత్తముం డగు నీవీరుని వివరించి చెప్పుటకు నాకు శక్తిచాలదు. ఈమహారథుండు తలంచెనేని మూఁడులోకంబులు గూడ దహింపఁగలఁడు. ఈతండు మహాతపంబుగావించి క్రోధంబును దేజంబును భరించినాఁడు. ఉదారబుద్ధి యగు నీతనికి ద్రోణుండు దివ్యా స్త్రంబు లనుగ్రహించియున్నవాఁడు. ఈతనియెడ నొక్కదోషంబు గలదుకాని యాదోషంబె లేకున్న నీతం డతిరథుండని నాతలంపు. ఈతనికిఁ బ్రాణంబులందుఁ బ్రీతి మెండు. ఈద్విజుం డెప్పుడు నాయుష్కా ముండై యుండును. ఈతనికి జోడగుయోధుం డీరెండుసేనలందును లేఁడు. ఈతఁ డొక్కరథంబునన దేవసైన్యములఁగూడ వధింపంజాలిన బలశాలి. శరీరదార్ఢ్యంబుగల యీతండు తలఘోషంబునఁ బర్వతంబుల నేని బగులనేయంగలఁడు. అసంఖ్యేయగుణుండు ప్రహాంతదారుణద్యుతి మంతుండు నగు నీతండు దండపాణి యగుయముండువోలెఁ బగఱ కసహ్యుండై చరించును. సింహగ్రీవుండు మహాద్యుతిమంతుండు యుగాంతాగ్నిసమానక్రోధుండు నగునీవీరుండు భారతయుద్ధంబు బృష్ఠ భాగంబును శాంతినొందించును. ఈతనిజనకుండు ద్రోణుండు వృద్ధుం

డయ్యును దరుణవయస్కుల కెక్కుడైనవాఁడు. ఆతండు యుద్ధంబున మహాకర్మంబు గావించుననుటలో నా కింతయు సంశయము లేదు. ఈతని యస్త్రంబుల వేగం బను వాయువువలన బ్రేరితంబైన వహ్ని సైన్యంబులను గక్షంబులను, నింధనంబులను, నాహుతిగాఁగొని పాండునందనుల సైన్యంబుల నెల్ల భస్మీకరించును. ఈనరపుంగవుండు రథయూథపయూథంబులకు యూథనాథుండు. భరద్వాజాత్మజుండగు నీతండు నీహితంబు పొంటెః దీవ్రంబగుకర్మంబు గావింపంగలఁడు. స్థవిరుం డగునీయాచార్యుండు మూర్ధాభిషిక్తుల కెల్లను ధనుర్విద్యాగురుండై యున్నవాఁడు. ఈతండు సృంజయుల కంతంబు గావింపక విడువఁడు. ఈతనికి ధనంజయుఁ డత్యంత ప్రీతిపాత్రంబై వెలసినవాఁడు. గుణవినిర్మితంబు నతిదీప్తంబు నగు నాచార్యత్వంబును దలంచుచు నీమహాధనుర్ధరుండు అక్లిష్టకారి యగుధనంజయు నెన్నఁడును వధింపందలంపఁడు. ఈవీరుండు సంతతము పార్థునిగుణవిస్తరంబుల మెచ్చుచుండును. ఈభారద్వాజుం డాధనంజయునిఁ దనపుత్రునికంటె నధికునిగా నెన్నుచుండును. ఈమహానుభావుండు దేవగంధర్వమానుషు లేకీభవించి వచ్చినను దివ్యాస్త్రంబులచే వారలనెల్ల నిరవశేషంబుగ సంహరించును. రాజా! రాజశార్దూలంబగు కౌరవుండును రథసత్తముండని యెఱుంగుము. పరవీరఘాతుకుండగు నీతండు మహాబలిష్ఠంబగు తనసైన్యంబుచే శాత్రవసైన్యంబులఁ దపింపం జేయుచు నగ్ని తృణంబుల దహించుచందంబున బాంచాలసైన్యంబుల దహించును. రాజపుత్రుండు బృహద్బలుండు నగుసత్యశ్రవసుండును రథుండు. ఈతండు నీశాత్రవులబలంబులందు కాలునివలెఁ జరించును. విచిత్రకవచాయుధంబులుగల యీతనియోధులెల్లరును నీశత్రువులం బరిమార్తురు. కర్ణపుత్రుం డగువృషసేనుండు మహారథుండు. బలవంతుల కగ్రగణ్యుండగు నాతండు నీశత్రుబలంబుల సంహరించును. రాజా! జలసంధుండు రథసత్తముండు. పరవిదారణపరాయణుండగు నామాగధుండు సమరంబున బ్రాణంబులేని విడిచి నీశాత్రవులఁ బరిమార్ప నుత్సాహము పూనియున్నవాఁడు ఈతండు గజాధిరూఢుండైయేనియు రథాధిరూఢుండైయేనియు శత్రుసైన్యముల క్షయమొందించుచు నీకు హితం బాచరించును. రథుండగు నీమహాబాహుండు నీకై ప్రాణంబులనేని విడువ వెనుదీయఁడు. ఈతండు విక్రాంతయోధియుఁ జిత్రయోధియునై

భయం బన నెట్టిదో యెఱుంగక సమరభువి నీశాత్రవుల నెదిరించి పోరం గలఁడు. రాజా! బాహ్లీకుండు అతిరథుండు; సమరంబుల మరలువాఁడు గాఁడు. ఈశూరుండు యుద్ధంబునసాక్షాత్తుగ యమునకు సరియగువాఁడు. ఈతండెన్నండును యుద్ధంబున వెనుదిరుగువాఁడు కాఁడు.ఆతండు యుద్ధంబులందు శాత్రవుల నశ్రమంబునన సంహరించును. మహారాజా! నీసేనానాయకుం డగుసత్యవంతుండు మహారథుండు. రణంబుల నీతం డద్భుత కర్మంబు లాచరించి పరరథులకు బాధ నాపాదించును. ఇతనియుద్ధంబు జూచిన వ్యథ యెన్నండును గలుగదు. రథపథంబుననున్న శత్రుల నీక్షించి యీతండు గర్జించుచు నుఱుకును. ఈతండు జలంబులందును విక్రమింపంగలఁడు. నీకొఱకై యీతండు మహాహవంబున సత్పురుషోచితం బగువీరకర్మంబు గావించును. రాజా! రాక్షసేంద్రుం డగునలంబుసుండు మహారథుండు. క్రూరకర్ముండగు నీతండు పూర్వవైరం బనుస్మరించుచు శాత్రవుల సంహరించును. ఈతండు రాక్షససైన్యంబులకెల్ల రథసత్తముండు. దృఢవైరుండగు నీతండు సమరంబున మాయావియై చరించును. ప్రాగ్జ్యోతిషాధినాథుం డగుభగదత్తుండు మిగులఁ బ్రతాపవతుండు. గజారోహణంబునను రథారోహణంబునునుగూడ నీతండు శ్రేష్ఠుండు. తొల్లి గాండీవి యీతనితో యుద్ధంబు గావించియుండె. వారలిరువురును జయంబుగోరి బహుదివసంబులు పోరొనర్చిరి. అప్పుడీతఁడు సవ్యసాచిని సమ్మానించి యాతనితో సఖ్యంబు నెఱపినవాఁడు. ఐరావతారూఢుం డగుదేవేంద్రునింబోలి యీతండు గజస్కంధారూఢుండై నీశాత్రవులతో యుద్ధంబుగావించును.

**భీష్ముండు కర్ణు నర్ధరథునిగాఁ దెలుపఁ గర్ణుండు భీష్ము నధిక్షేపించుట**

రాజా! అచలుండు వృషకుండు ననుసోదరు లిరువురును శత్రు దురాధర్షులు రథులై యున్నవారు. వారు నీశాత్రవుల విధ్వంసంబుగావింతురు. బలవంతులు, దృఢక్రోధులు, గాంధారముఖ్యులుఁ, దరుణులు నగువీరలు నీహితం బాచరించుపొంటెఁ దమప్రాణంబు లేని విడువ సిద్ధపడి యున్నవారు. నీకు దయితుండగు నెచ్చెలి, రణకర్కశుండు, నిన్నుఁబాండవులతోడియుద్ధంబునకు మాటిమాటికిఁ బ్రోత్సాహపఱుచువాఁడు, ఆత్మశ్లాఘాపరాయణుఁడు, నీచుండు నగు కర్ణుండు నీకు మంత్రియు, బంధు

వును నేతయు నై యున్నవాఁడు. వీఁడు మానవంతుఁడును, నత్యంత గర్వోచ్ఛ్రితుండు నై యుండును. వీఁడు యుద్ధంబున రథుండును గాఁడు, అతిరథుండును గాఁడు. వీఁడు సహజంబగుకవచంబు గోల్పోయి విచేతనుండై యున్నవాఁడు. సహజంబులు దివ్యంబులు నగుకుండలంబులుకూడ వీఁడు గోల్పోయియున్నవాఁడు. వీఁడు సతతంబును ఘృణాపరుండు. పరశురామునిశాపంబునను, బ్రాహ్మణునిభాషణంబునను గరణంబులు గోల్పోవుటను వీ: డర్ధరథుండని నాతలంపు. వీఁడు ఫల్గును నెదిరించునెడ మరల జీవంబులతో విడువంబడఁడు. అని వచింప నామాట లాలించి ద్రోణుండు శాంతనవా! నీవాడినమాటలెల్ల యథార్థంబులే యై యున్నవి. వీనియం దసత్యము లేశంబేని లేదు. వీఁడు ప్రతియుద్ధము నందును దొలుత నత్యభిమానంబొందుటయుఁ దరువాత విముఖుండగుటయుఁగూడ గలదు. వీఁడు ఘృణాత్ముండగుటయు, ప్రమాదపరవశుం డగుటయుఁ గారణంబులుగ నేనును వీని నర్ధరథునిగానే తలంచుచున్నానని వచించె. ఇట్లు వీరిరువురు పలికినపలుకు లాలించి రాధేయుండు క్రోధంబునఁ గన్నులెఱ్ఱగాఁజేసి శాంతనవుని కశాఘాతంబులంబోని వాక్యంబులచే నొప్పించుచు నిట్లనియె. పితామహా! నిరపరాధుండనగు నన్నుఁ బ్రతిపదంబునందును ద్వేషంబున నిట్లేల వాక్యములచేఁ గ్రుచ్చుచున్నవాఁడవు? దుర్యోధనునినిమిత్తంబుననే నవియెల్ల సహించుచున్నవాఁడను. నీవు నన్నుఁగాపురుషుండువోలె మందునిగాఁ దలంచుచున్నాఁడవు. నీవు నామతంబున నర్ధరథుండవై యున్నవాఁడవు. దీనికి సంశయము లేదు. నాకేకాదీజగంబు సమస్తంబునకుంగూడ నీవర్ధరథుండవై యే తోఁచుచున్నాఁడవు. నేను పల్కినవచనంబు లసత్యంబులుగాక వాస్తవంబులై యున్నవి. నీవు నిత్యంబును గౌరవులకు శాత్రవుండవై యే మెలంగుచున్నాఁడవు. ఐనను నీస్థితిని రాజెఱుంగంజాలకున్నవాఁడు. సమానులు నుదారకర్ములు గలరాజులం దెవఁ డిట్లు తేజోవధంబు గావించి యుద్ధంబున భేదంబుగల్పింప సాహసించును? నీవుమాత్ర ముచితానుచితంబు లెఱుంగక గుణవిద్వేషంబున నపరాగంబు గావింపఁ దలంచుచున్నవాఁడవు. జీవించినయేండ్లవలనఁగాని పలితంబులైన శిరోజంబుల వలనఁగాని, ప్రభూతంబులగుధనంబువలనఁగాని, సమృద్ధమగు బంధుగణంబువలనఁగాని క్షత్రియుల మహారథత్వమును నిర్ణయించుటకు

శక్యంబుగాదు. క్షత్రంబు బలజ్యేష్ఠంబనియు, బ్రాహ్మణులు మంత్రజ్యేష్ఠు
లనియు, వైశ్యులు ధనజ్యేష్ఠులనియు, శూద్రులు వయోజ్యేష్ఠులనియు
నార్యులందురు. కామద్వేషసమాయుక్తుండవగు నీవు మోహపరవశుం
డవై నీయిచ్చవచ్చినతెఱంగున రథాతిరథనిశ్చయంబు గావించుచున్న
వాఁడవు. అనిపలికి సుయోధను నాలోకించి యాతని కిట్లనియె. సుయో
ధనా! నీవు బాగుగ నాలోచించికొనుము. నీకు నెప్పుడును గిల్బిషంబులే
యాచరించుదుష్టభావుం డీభీష్ముని విడువుము. వీనివలన మనసైన్యంబు
లందు భేదంబు జనించును. ఛిన్నంబయినసేనను మరలఁగూడఁదీయుటకుఁ
దరంబుగాకుండును. మూలబలంబులందు భేదంబు జనించినను సంధింప
వశముగాదనుచో నానాదేశంబులనుండివచ్చియున్న నానావిధానీకంబు
లందు భేదంబువొడమెనే నెట్లు సంధింపనగును? భారతాగ్రణీ! ఈ
యోధులకెల్లరకును యుద్ధంబునద్వైధం బుప్పతిల్లినచో మనకత్యధికం
బుగ తేజోవధంబుగావించును. రథుల లెక్కపెట్టుటయెక్కడ? అల్ప
బుద్ధియగుభీష్ముం డెక్కడ? నేనొక్కరుండన పాండవులసైన్యంబులనెల్ల
మరలింతును. పాండవులును బాంచాలురును శార్దూలంబుదరి కేఁగిన
వృషభంబులువోలె నమోఘశరలాఘవుండ నగునన్ను సమీపించినం
తన నలుదెసలకుఁ బరువులెత్తుదురు. యుద్ధంబు విమర్దంబు మంత్రంబు
మంచిమాటలు నెక్కడ? కాలము చెల్లినవాఁడు మందాత్ముండు కాల
చోదితుండు నగుభీష్ముం డెక్కడ? ఈతం డేకాకియై నిత్యంబు నీజగం
బంతటితోడను స్పర్ధవహించుచున్నవాఁడు. పనికిమాలినయాలోచనంబు
గల యీతం డితరు నెవ్వనిని గౌరవింప సహింపఁడు. వృద్ధులవచనంబు
లాలింపవలయునని శాస్త్రంబులందు విధికలదుకాని యతివృద్ధులగువారి
వచనంబు లెన్నండు నాదరింపరాదు. అతివృద్ధులు మరల బాల్యమందిన
వారలుకదా? నేనొక్కరుండ నీపాండవులసైన్యంబులనెల్లఁ బరిమార్చె
దను. రాజశార్దూల! నేను యుద్ధంబొనరించి శత్రువుల సంహరించినను
నాయశంబెల్ల శాంతనవునకే లభించును. నరాధిపా! నీచే నీభీష్ముండు
సేనాధిపతిగా నభిషేకింపంబడినవాఁడుకదా? యుద్ధంబులందు యోధులు
గావించినవిక్రమంబువలన జనించుయశంబు సేనాపతికే లభించునుగాని
యోధులకు లభింపదుకదా? కావున సేనాపతియగు నీభీష్ముండు జీవించి
యుండునంతవఱకును నేను యుద్ధంబుగావింపను. ఈతండు వధంబందిన

యనంతరము నే నామహారథులెల్లరతోడను సంగ్రామంబుగావింతును.
అనివచించుటయు శాంతనవుండు, వత్సా! సుయోధనా! సాగరోపమం
బగు నీయుద్ధభారంబెల్ల నాయందు మోపంబడినది. అనేకవర్షంబుల
నుండియుఁ జింతింపంబడిన యీధార్తరాష్ట్రులయుద్ధం బిపు డాసన్నంబై
యున్నది. ఆకాలంబు సమీపించి ఒడలు పులకరింపంజేయుసంగ్రామం
బాసన్నంబైయున్నయెడ నేను బరస్పరభేదంబు గావించు టుచితంబుగా
దని యెంచి క్షమించితినికావునఁ గర్ణా! నీవింకను జీవించియున్నాఁడవు.
నేను ముదుసలినయ్యు నిప్పుడు విక్రమించి శిశుండవగు నీయుద్ధశ్రద్ధను
జీవితాశను దునుమాడఁగలను. జామదగ్న్యుండగు రాముండు ప్రయో
గించినమహాస్త్రంబులు సైతము నాకు లేశమాత్రంబేని వ్యథగలిగింపఁ
జాలకుండె. అట్టియెడ నీవు నాకుఁ గావించున దేమికలదు? సత్పురుషు
లెన్నండును దమసామర్థ్యంబు తాము ప్రశంసించుకొనకుందురు. హీన
కులపాంసనా! నేను సత్యంబు వచించుచున్నాఁడనేకాని యాత్మశ్లాఘంబు
గావించుకొనలేదు. నేను కాశిరాజస్వయంవరంబున నేకరథారూఢుం
డనై యక్కడఁ గూడియున్నసమస్తక్షత్రియబృందంబును నిర్జించి బలా
తిశయంబునఁ గాశిరాజదుహితలం గొనివచ్చితిని. ఆయుద్ధంబున నేతా
దృశంబులు నితోధికంబులు నగుసేనాసహస్రంబుల నొక్కరుండఁ బరా
జయం బొందించితిని. వైరపురుషుండవగునిన్ను జేరందీయుటచేఁ గౌర
వులకు మహావ్యసనంబు సంభవించియున్నది. దానిని బోనాడ నీవు పురు
షుండవైతేని యత్నంబుగావింపుము. నీవు సంతతము నెవ్వనితో స్పర్ధ
వహించియుందువో యట్టిపార్థునితో యుద్ధం బొనరింపుము. ఈయుద్ధం
బువలన వినిర్ముక్తుండవగునిన్ను నే నాలోకింతునుగాక. యని వచించు
టయు ధార్తరాష్ట్రుం డాసమయంబున గాంగేయా! నన్నుఁ జూచి
కొనుము. ఇప్పుడు మహాకష్టకార్యం బాసన్నంబైయున్నది. నీవు నేకాగ్ర
చిత్తుండవై నాకు నిశ్శ్రేయసంబగు తెఱంగు చింతింపుము. మీరిరువురును
గూడ మహాకర్మంబులు గావింపంగలవారే యైయున్నవారు. మనబలంబు
లందున్నరథాతిరథుల నెఱింగించితివి. ఇంకఁ బరబలంబులందున్నరథాతి
రథుల నెఱింగింపుము. శాత్రవులబలాబలంబు లెఱుంగఁదలంచుచున్నాఁ
డను. ఎల్లి ప్రభాతంబునంగాని రాత్రియందుఁగాని యుద్ధంబు ప్రవ
ర్తింపనున్నదని వచించెను.

—భీష్ముండు పాండవబలంబులందు రథాతిరథుల నెఱింగించుట—

అంత భీష్ముండు రాజా! మనబలంబునం గలరథుల నతిరథుల నర్ధరథుల నెఱింగించితినిక దా? ఇంకం బాండవబలంబులందున్న రథాతిరథుల నెఱింగింతు నాలింపుమని యిట్లు చెప్పందొడంగె. రాజా! నీకుం గౌతూహలంబుండెనే నీరాజన్యులతోంగూడం బాండవబలంబునందలి రథాతిరథుల నాలింపుము. రాజగుపాండవాగ్రజుండు రథోదారుండు. ఆతండు సమరంబులం దగ్నివలె విచ్చలవిడి సంచరించును. భీమసేనుం డష్టగుణసమ్మితుం డగురథుండని యెఱుంగుము. గదచేగాని బాణంబుల చేగాని కావించుయుద్ధంబులం దాతనికి సాటియగువా రెవ్వరును లేరు. వాడు మహామానవంతుండు. పదివేలయేనుంగులబలంబువాడు. అమానుష తేజస్సంపన్నుండునై వెలుంగుచున్నవాడు. కావున వాడు రథులకంటె నెనిమిదిరెట్లధికబలసంపన్నుండని యెఱుంగునది. పురుష పుంగవులగుమాద్రీనందను లిరువురును రథికులు. వారిరువురును రూపంబునను దేజంబునను నాశ్వినేయులకు సమానులగువారు. వీరలెల్లరును జమూముఖంబునం బ్రవేశించి పూర్వ మనుభవించినక్లేశంబుల స్మరించికొని ప్రళయకాలరుద్రునివలె దారుణంబగుకర్మంబు గావింతురు. దానికి లేశంబును సంశయింపంబనిలేదు. మహాత్ములగువారెల్లరు సుద్ధతంబులగుసాలస్తంభంబులువోలె నున్నతులై యితరులకంటెం బ్రాదేశ మాత్రంబు వారెల్లరు నున్నతులు. వారిలో జన్మక్రమంబు ననుసరించి చిన్నవానికంటెం బెద్దవాడు ప్రాదేశమాత్రాధికోన్నతుండునై యుండును. మహాబలులగు నాపాండునందను లెల్లర యవయవంబులును సింహావయవంబులుంబోలె దృఢంబులై యున్నవి. వారెల్లరును బ్రహ్మచర్యంబు శాస్త్రవిహితంబగుమార్గంబున జరించినవారు. వారెల్లరును దపశ్శాలురు. శ్రీమంతులగు నాపురుషవ్యాఘ్రములు మదోత్కటంబులగువ్యాఘ్రింబులంబోలి వెలుంగుచున్నవారు. వారలెల్లరును నమానుషంబులగు జవంబు ప్రహారంబు సమ్మర్దంబునుంగలవారు. భరతర్షభా! వారలెల్లరును దిగ్విజయసమయమున రాజులనెల్లర జయించియున్నవారు. ఎట్టిపురుషులైనను నితరుల వారలయాయుధంబులను గదలను శరంబులను సహింపనోపరు, ఇతరులు వారు ధరించువిండ్ల నెక్కిడుటకేని నోపరు. ఇతరు

లెవ్వరును మహాభారంబులగు వారలగదల నెత్తుటకుంగాని వారు ప్రయో గించుశరంబుల నెగుచుటకుంగాని వారిజవం బనుకరించుటకుంగాని వారి వలెలక్ష్యభేదనంబు గావించుటకుంగాని భేదించుటకుంగాని సమర్థులుగాం జాలరు. వారు బాలురై యున్నపుడే వారలచే మీరలెల్లరును భంగపడి యుంటిరికాదే? బలోత్కటు లగువార లీసైన్యంబు ప్రవేశించినంతన యెల్లయోధులను విధ్వంసముగావింతురు. వారలతో నీవు యుద్ధంబున సమాగమం బొందకుము. వార లొక్కండొక్కండే యుద్ధంబున నీ మహీపతులనెల్లర సంహరింతురు. రాజేంద్రా! రాజసూయంబునం బ్రవ ర్తించినవిధంబెల్ల నీకంటితో నీ వాలోకించితివేకదా? ద్రౌపదికిం గావిం చినపరాభవంబును, ద్యూతసమయంబున నాడినపరుషవచనంబులును స్మరించి, వారలు సంగ్రామరంగంబున రుద్రునివలెం జరింతురు. లోహి తాక్షుండగు గుడాకేశుండు నారాయణుని సహాయునిగా గ్రహించును. ఈరెండుసైన్యంబులందును వాని కీడగురథుండు లేడు. దేవతలందును బన్నగులందును యక్షులందును గంధర్వులందును రాక్షసులందునుగూడ నింతకుమున్నుగాని యిపుడుగాని వానికి సమానుండగువీరుం డుదయింప లేడు. మనుజులలో నట్టివీరుండు లేడని వేఱ చెప్పనేల! ముల్లోకంబు లందును భూతభవిష్యద్వర్తమానంబులందు వానికి సాటియగురథోత్త ముని నేను గనివిని యెఱుంగను. మహారాజ! పార్థునిరథంబు దివ్యాశ్వ సమాయుక్తంబై వెలుంగును. ఆతనికి వాసుదేవుండు సారథ్యంబు నెఱప నున్నవాఁడు. యోధుండన్ననో ధనంజయుండు. దివ్యంబగుగాండీవము నాతనికి ధనువు. అశ్వంబులన్ననో దివ్యంబులును వాయుసమానవేగంబు లునై యొప్పారును. కవచంబు దివ్యంబు నభేద్యంబునై యొసంగుచున్నయది. వానితూణీరంబు లక్షయ్యంబులు; అస్త్రగ్రామంబులన్ననో మాహేం ద్రము రౌద్రము కౌబేరము యామ్యంబు వారుణంబు మొదలగునవి దివ్యంబులై యున్నయవి. వానికడ సుగ్రప్రదర్శనంబు లగుగద లనే కంబులు గలవు. మఱియు వజ్రంబు మొదలగునానావిధాయుధంబు లును వానియెడం గలవు. హిరణ్యపురనివాసులగు ననేకసహస్ర సంఖ్యాకులు దానవు లొక్కనిచే నిర్జింపఁబడిరి కదా! వానికి సరి యగురథుం డెవ్వం డుండును? బలవంతుండును సత్యవిక్రముండు నగు నాధనంజయుండు సంరంభంబున నీసేననెల్ల సంహరించి తనసేన కిసు

మంతయేని బాధకలుగనీయక రక్షించుకొనును. నేనుగాని ద్రోణా
చార్యుండుగాని వాని నెదిరించి యుద్ధంబు గావింపంగలము. మా
యిరువురుదక్క మూఁడవవాఁ డాతని నెదిరింపంజాలఁడు. ఘర్మాంత
మందు మహావాతసమీరితంబగు జీమూతంబుచందంబున శరవర్షంబు
గురియించు నాతని నెదిరింపంగలధీరుం డీరెండుసేనలం దొక్కరుం
డును గానరాఁడు. కుంతీసుతమధ్యముండు సమాయుక్తుండును
వాసుదేవసహాయుండునునై యుండుటయేకాక యాతండు తరుణ
వయస్కుండును నేర్పరియునై జ్వలించుచున్నవాఁడు. మేమిరువుర
మన్ననో ముదిసినవారము శరీరపాటవము తరిగినవారమునై యున్న
వారము. ఇట్లు భీష్ముండు వచించినంతన యావాక్యంబు లాలిం
చినరాజన్యు లెల్లరభుజంబులును మనంబులతోఁగూడ వడంక నారంభిం
చెను. పాండవేయులు కావించినపరాక్రమంబులు ప్రత్యక్షంబుగ నాలో
కించుచున్నట్లు వారలెల్లరును భయవిహ్వలురైరి.

ఆసమయంబున శాంతనవుండు మరల నిట్లనియె. మహారాజ !
ద్రౌపదీనందను లేవురును మహారథులు. విరాటనందనుండగును త్తరుండు
రథోదారుండని నాతలంపు. మహాబాహుండగునభిమన్యుండు రథయూథ
పయూథపుండు. సమరంబున సౌభద్రుండు పార్థునకును వాసుదేవున
కును సమానుఁడగువాఁడు. ఆతండు మహాస్త్రప్రయోగంబున లాఘవం
బును జిత్రయుద్ధంబును గలవాఁడు. మహామనస్వి. దృఢవ్రతుండు. తన
జనకుం డనుభవించినపరిక్లేశంబు స్మరించి విక్రమింపఁగలఁడు. మాధ
వుండగుశూరుండు సాత్యకియు రథయూథపయూథపుండై యున్న
వాఁడు. ఈతండు వృష్ణిప్రవీరులలో నత్యమర్షణుండు. భయమెఱుంగని
వాఁడు. రాజా! ఉత్తమౌజుండుకూడ సాత్యకివలె రథోదారుండయి
యున్నవాఁడు. మఱియు యుధామన్యుండును రథోదారుండనియే
నేఁదలంచుచున్నాఁడను. వీరలకందఱకు ననేకశతసహస్రాయుతంబులు
రథంబులు మత్తగజంబు లుత్తమాశ్వంబులును బదాతిప్రవరులును
గలరు. వీరెల్లరును దమతమసైన్యంబులతోఁగూడి పాండవులకుఁబ్రియం
బాచరించుటకై తమశరీరంబులనేని విడచుటకు సిద్ధముగా నున్నవారు.
వీరలెల్లరును బాండవులతోఁగూడి యగ్నివలెను మారుతంబుఁబోలె నీ
సైన్యములందు విజృంభింపఁ బరస్పరాహ్వాన మాచరించుకొనుచున్న

వారు. నృపాలా! అజేయులు వృద్ధులు పురుషవరేణ్యులు నగు విరాట ద్రుపదులు మహారథులై పరంగుదురు. వారిరువురును వృద్ధులైయున్నను క్షత్రధర్మపరాయణు లగుటంజేసి వీరమార్గంబుననుండి శక్తికొలందిగ యుద్ధం బాచరింపనున్నవారు. మఱియు పాండవులతోడంగల చుట్టఱికంబునను వీర్యబలాన్వితులగుటను స్నేహంబును వీర్యంబును ప్రకటింపనిది తగినయది నగుటను వెనుదీయక తరుణవయస్కులనుమీఱి యుద్ధం బాచరింతురు. రాజా! నరులెల్లరును గారణము ననుసరించి శూరులు కాని భీరులుకాని యగుదురు. విరాటద్రుపదులిరువురు నొక్కమార్గంబున నున్నవారు. దృఢధనుర్ధరులగు వీరిరువురును ప్రాణంబులవిడిచియేని పాండవులయర్థంబుల సంఘటింతురు. ఒక్కొక్క యక్షౌహిణిసైన్యంబుతోఁగూడిన యామహావీరులిరువురును చుట్టఱికంపుస్నేహంబును బ్రకటించుచు సమరంబున దారుణం బగుకర్మంబు గావింతురు.

రాజా! పాంచాల రాజనందనుండు శిఖండి పాండవబలంబులందు రథముఖ్యుండని యెఱుంగుము. ఈతండు నీసేనలందు మొదటనున్న సంస్థానమును నాశముగావించుచును, దనయశంబు ప్రకటముగావించుచును, మహాహవంబు గావించును. వీనికి పంచాలములును ప్రభద్రకములును నగుబహుళంబు లగుసేనలు కలవు. కావున నాతండు రథవంశంబున మహాకర్మ కావించును. ద్రోణశిష్యుండును మహారథప్రముఖుండును పాండవుల సర్వసేనానాయకుండు నగుధృష్టద్యుమ్నుం డతిరథుండనంబడును. యుగాంతసమయంబునఁ బినాకంబు కేలంబూని ప్రజాసంహారంబు గావించుపురాంతకుండువోలె నీధృష్టద్యుమ్నుండు శాత్రవులఁ దునుముచు మహాయుద్ధంబు గావింపంగలఁడు. రణప్రియులెల్లరును సాగరసన్నిభం బగు నీతనిరథసైన్యంబు దేవసైన్యంబుంబోలె యుండునని చెప్పుచుందురు. ధృష్టద్యుమ్నునితనయుండు క్షత్రధర్మంబున బాలుండగుటచే నధికంబుగ శస్త్రపాటవంబు లేనివాఁడగుటంజేసి యర్ధరథుండగునని నాతలంపు. చేదిదేశాధీశుఁడు శిశుపాలతనూభవుఁడు నగు ధృష్టకేతుండు మహారథుండు. ఆతఁడు పాండవులకు సంబంధియైకూడ నున్నవాఁడు. శూరుం డగు నీచేదిపతి నీతనయునితోఁగూడి మహారథులాచరింపంగలమహాకర్మంబు గావించును. పరపురంజయుఁడు క్షత్రధర్మాభినిరతుఁడు నగుక్షత్రదేవుఁడు పాండవబలంబులందు రథోత్త

ముండై పరంగును. జయంతుండును అమితౌజస్కుండును సత్యజిత్తుం డును ననుమహాత్ములు పాంచాలవీరులు మువ్వురును మహారథులై యున్న వారు. వత్సా! వీరెల్లరును సంరంభంబొందినకుంజరంబులంబోలి యుద్ధమున మహాకర్మంబులు గావింతురు. అజుండును భోజుండును మహా పరాక్రమవంతులు. పాండవులకై ప్రాణంబులైన వీడ నుత్సహించుచున్న వారు. పాండవబలంబులందు వీరు మహారథులు. బలవంతులు శూరులు నగువీరు తమసామర్థ్యమెల్లఁ బ్రకటించి బలంబులం బరిమార్తురు. శీఘ్రాస్త్రులు చిత్రయోధులు యుద్ధనిపుణులు దృఢధనుర్ధరులు నగువీరు కావించువిక్రమం బమేయంబై యుండును. మరియు కేకయాధిపతు లేవురుసోదరులు రథోదారులన నొప్పుదురు. యుద్ధదుర్మదులు సర్వలోక హితధ్వజులు మహాపరాక్రమంబు మెఱయ మనబలంబు నుఱుమాడుదురు. కాశికుండు సుకుమారుండు నీలుండు సూర్యదత్తుండు నపరుండు శంఖుండు మదిరాశ్వుండు ననువీరులెల్లరును రథోదారులై యున్న వారు. వీరెల్లరును నాహవలక్షణాభిజ్ఞులును సర్వాస్త్రవేదులునునై యొసంగుచున్నవారు. మహారాజ! వార్ధక్షేమి మహారథుండని నేనెన్నుచున్నవాఁడను. చిత్రాయుధుండను నరపాలుండు రథసత్తముండు. ఆతండు సంగ్రామంబున మధ్యందినమార్తాండబింబంబు ననుకరించి వెలుంగును. ఆతండు సవ్యసాచి కెంతయు భక్తియుక్తుండు. మఱియు చేకితానుండును సత్యధృతియు మహారథులన నొప్పుదురు. వీరిరువురును రథోదారులని నేను దలంచెదను. మఱియు వ్యాఘ్రదత్తుండును జంద్ర సేనుండు ననురాజన్యు లిరువురును మహారథులు రథోదారులునై యొసంగుచున్నారన సంశయము లేదు. మఱియు సేనాబిందుండను క్రోధహంత యనుగూడ రథోదారులై యొప్పుదురు; మరియు నాక్రోధహంత బల పరాక్రమములందు వాసుదేవునకును భీమసేనునకును సాటి యగువాఁడు. ఆతండు తనవీర్యవిక్రమంబులం బ్రకటించి నీసేనలతో యుద్ధం బొనర్పనున్నవాఁడు. నన్నును ద్రోణుని గృపుని నీవె ట్లధికులుగాఁ దలంచుచున్నవాఁడవో యాతనిఁగూడ నట్లె యధికునిగాఁ దలంపందగును. కాశ్యుండు పరమశీఘ్రాస్త్రుండును శ్లాఘనీయపరాక్రముండునై ఏకగుణరథుం డగును. ఐనను నీతండు యుద్ధంబున విక్రమంబు ప్రకటించుచో నష్టగుణరథుండై వెలుంగును. ద్రుపదుని తనయుండును

చరుఁడుండును సమరశ్లాఘనుండు నగుసత్యజిత్తుండు ధృష్టద్యుమ్నునితో సమానుఁడై యతిరథత్వంబు వడసె. ఈతండు పాండవులకుఁ గీర్తి కాముఁడై పరమాద్భుతం బగుకర్మంబు గావించును. మఱియుఁ బాండవుల కత్యంతహితుం డగుపాండ్యభూమీశ్వరుండును మహావీర్యుండును శూరుండునై మహారథుండన నొప్పుచున్నవాఁడు. శ్రేణిమంతుండును వసుధానుండును పరపురంజయులై యతిరథులుగా నెన్నందగుదురు.

మహారాజా! పాండవబలంబులందు రోచమానుండను భూమీశుండును మహారథుండై నెగడుచున్నవాఁడు శత్రుజేతయు మహాబలుండును భీమసేనునకు మాతులుండును నగుకుంతిభోజుండు అతిరథుం డనంబరగును. మహాధనుర్ధరుం డగు నీలుండు యుద్ధనిపుణుండును చిత్రయోధియుఁ బరమశక్తియుక్తుండును నై వెలుంగుచున్నవాఁడు. ఆతండు దేవేంద్రుండు దానవులతోఁ బోరుకరణి నత్యధిక విక్రమంబు మెఱయ నీసేనలతోఁ బోరొనరించును. ఈతని యోధులెల్లరును సర్వయుద్ధవిశారదులై యున్నవారు. ఆకుంతిభోజుండు తనమేనయల్లుం డగుపాండవులకు హితం బాచరించువాఁడై సంగరంబున నతిమానుషం బగుకర్మంబు గావించును. మహారాజా! భీమసేననందనుండు హిడింబికాత్మజుండు రాక్షసాధీశ్వరుండు నగు ఘటోత్కచుండు బహుమాయావియు నతిలోకపరాక్రమోపపన్నుండు నగుట రథయూథపయూథపుం డనం జెల్లును. సమరప్రియుం డగువాఁ డనేక మాయలఁ బ్రకటించి మహాహవం బొనరించును. ఇతనికి పరివర్తులును వీరులు నగుపెక్కండ్రురక్కసులు సచివులుగలరు. వారలెల్లరును పాండవులబలంబులంగూడి మనబలంబులతో యుద్ధంబుగావింప నున్నవారు. మఱియు వీరుగాక యింకను నానాజనపదంబుల కధీశ్వరులగు పెక్కండ్రు రాజపుంగవులు వాసుదేవుండు మొదలగువారు పాండవులయర్థంబు సమకూర్చుటకై పాండవబలంబులందుఁ గూడి యున్నవారు. రాజా! ఈ రాజులు పాండవబలంబులందుఁ బ్రధానపురుషులై యున్నవారు. వీరలెల్లరును దురాధర్షంబు లగుపాండవసైన్యంబుల యుద్ధంబులందు నడపింతురు. ఆసైన్యంబులకెల్ల కిరీటి నాయకుండై దేవసేనలకెల్లను బాలకుం డగువాసవు ననుకరించి వెలుంగును. రాజా! మాయావిదులు జయాకాంక్షులు నగువారలతోఁ బోరి నేను జయంబునైన బొందెదను. లేదా

నిధనంబైన నొందెదను. చక్రంబుధరించిన వాసుదేవుఁడు గాండీవంబు కేలంబూనిన ధనంజయుఁడుసంధ్యాగతులగుచంద్రసూర్యులంబోలి సంగరంబున కరుదెంతురు. మఱియుఁ బాండునందనునిసైన్యంబునం గల రథోదారులను వారిసైన్యంబులనుగూడ నేను యుద్ధంబున నెదిరించి నిలుపంగలను. రాజా! పాండవసైన్యంబులం గలరథులు నతిరథులు నర్ధరథులును నీకుఁ దెలుపంబడిరి. నే నర్జునుని వాసుదేవుని నింకను బ్రధానులగు యోధులను గూడ సమరంబున నావరింతును. పాంచాలరాజనందనుం డగుశిఖండి శస్త్రంబూని యుద్ధమున కరుదెంచుచో నేను వానిని మాత్రము వధింపంజాలను. వానిని వధింపకుండుటకుఁగారణ మీలోకు లెల్లరు నెఱుంగుదురు. మాజనకునకుఁ బ్రియం బాచరించువాఁడనై ప్రాప్తం బగురాజ్యంబు పరిత్యజించి బ్రహ్మచర్యవ్రతం బాచరించుచున్నవాఁడనై, నేను చిత్రాంగదుని కౌరవరాజ్యంబున నభిషిక్తుంగావించి విచిత్రవీర్యునికి యౌవరాజ్యంబున నభిషేకంబు కావించితిని. నేను దేవవ్రతుండ ననువిఖ్యాతిని సకలరాజులందును బ్రకటించి స్త్రీనిఁగాని, పూర్వము స్త్రీయై యుండి యిపుడు పురుషుఁడుగా నున్న మనుజునిఁగాని వధింపనని ప్రతిజ్ఞగావించితిని. నాప్రతిజ్ఞ తప్పక పాలించితిని. రాజా! యాశిఖండి తొలుత స్త్రీయై జన్మించినవాఁడు. వాఁడు కొంతకాలము కన్యాత్వంబున నుండి తరువాత పుంస్త్వమొందినవాఁడు. కావున వానితో నేను యుద్ధంబు సేయనొల్లను. కుంతీతనయులు నాకు మనుమలు నగుపాండవు లేవురమాత్రము విడిచి మిగిలినవారిలో నెవ్వానిని నేఁదలపడియెద వానినెల్ల యమసదనంబున కనిచెదనని వచించెను.

## భీష్ముఁడు శిఖండి పూర్వజన్మచరిత్రం బెఱింగించుట

అప్పుడు రారాజు 'భరతాగ్రణీ! సమరంబులం దాతతాయి యగు శిఖండి ధనుర్బాణంబులు ధరించి యుద్ధంబున కేతేర నీవు వాని నేల వధింపవు? నీవు మున్ను సోమకులతోడంగూడ పాంచాలురనెల్ల సంహరింతునని వచించియుంటివికదా? మఱల నిప్పుడు శిఖండిని వధింపనందు వేల? దానికిఁ గారణం బెఱుంగందలంతును; వచింపవే' యని దుర్యోధనుం డడుగుటయు గంగానందనుం డాతని కిట్లని చెప్పందొడంగె. దుర్యోధనా! నే నేకారణంబున నాశిఖండిని సమరంబున నెదిరింపనో

యాకథ నీరాజులెల్లరతోఁగూడి యాలింపుము. వత్సా! మజ్జనకుండు మహాత్ముం డగుశంతనుమహారాజు పెద్దకాలంబు భువినేలి లోకవిఖ్యాత చరిత్రుండై కాలధర్మంబునొందెను. అప్పుడు నేను జిత్రాంగదుని మహారాజుగాను విచిత్రవీర్యుని యువరాజుగాను నభిషేకంబు గావించితిని. అంతం గొంతకాలంబునకుఁ జిత్రాంగదుఁడు కాలధర్మం బొందుటయు మాజనని సత్యవతీదేవియనుమతంబడసి యథావిధిగ విచిత్రవీర్యుని మహారాజ్యంబున నభిషిక్తుంగావించి నేను నాతని కనుచరుండనై రాజ్యంబు నిర్వహించుచుంటిని. ఆతండు ధర్మంబు ననుసరించి నాకంటెఁ గొండుకవాఁడేయైనను బ్రతిజ్ఞారక్షణపరాయణుండ నగునాచే రాజ్యంబున నభిషిక్తుండయ్యు నా ప్రాపు నాశించియేయుండెను. ఆతనికి వివాహయోగ్యం బగుప్రాయంబు రాఁగానే యనురూపంబగుకులంబున నుద్భవించినకన్యం గొనినచ్చి వివాహంబుగావింప నిశ్చయించితిని. ఆసమయంబునఁ గాశిరాజుతనయులు ముప్పురు సాటిలేనిరూపసంపద గలబాలికలు వివాహంబునిమిత్తంబుగ స్వయంవరంబు నాశించియున్నవారని వింటిని. అంబ అంబిక అంబాలిక యనునాముప్పురుకన్యకలను బరిగ్రహింప నిలాతలంబునం గలరాజులెల్లరును గాశిరాజుచే నాహ్వానింపంబడిరి. ఆకన్యలు ముప్పురయందు నంబ ప్రాయంబునఁ బెద్దది. అంబిక రెండవది. కడగొట్టుబాలిక అంబాలిక. నేను సైన్యంబేమియుఁ దోడుకొనక యొంటిపాటున నేకరథంబుననే కాశిరాజనగరంబున కేఁగి మహార్హాభరణభూషితలు నప్రతిమరూపలావణ్యసంపన్నలు నగునాముప్పురుకన్యకలం గాంచితిని. స్వయంవరార్థమై యాహుతులగు నాపార్థివులెల్లరనుగూడ నాలోకించితిని. అప్పుడు నేనారాజపుంగవులనెల్లరను సమరంబునకాహ్వానంబుగావించి యాముప్పురుకన్యకలను నారథంబున నెక్కించికొంటిని. ఆకన్యలు వీర్యశుల్కలని విని వారల నారథంబున నిడికొని యక్కడ కేతెంచియున్న రాజులకెల్ల "రాజులారా! ఇదే నేను శంతనునరపాలునితనయుండను భీష్ముండను. ఈముప్పురు కన్యలను నేను గొనిపోవుచున్నాఁడను. మీకు శక్తికలదేని విడిపించికొనుఁడు. మీరెల్లరు నూఱక చూచుచుండ మిమ్ములనెల్ల ననాదరించి యీకన్యలం గొనిపోవుచున్నాఁడను" అని యెలుగెత్తి పలుమాఱులు వారలకెల్ల వినంబడురీతిని బలికితిని. అప్పు డారాజులెల్లరును మహాక్రోధంబునొందిన

వారలై యాయుధంబులు సజ్జంబులుగావించికొని సారథులకు రథంబు లాయత్తంబులుగావింప నానతిడిరి. ఆసమయంబున రథికులు మహారథా రూఢులై, గజయోధులు గజారూఢులయ్యు, నశ్వారేవంతులుత్తమతురం గంబు లధిరోహించియు నాయుధంబులనెత్తికొని నాపైకెత్తివచ్చిరి. అపుడు సకలనరపాలకులును రథబృందంబులచే నన్ను నలువలంకులం జుట్టిముట్టిరి. నే నారాజులనెల్లరను శరవర్షంబున ముంచి వారలనెల్లఁ బరాజితులంగావించితిని. దేవేంద్రుఁడు దానవుల సంహరించినచందం బున నేనును దీప్తంబు లగుశరసహస్రంబునేసి వారలధ్వజంబుల నేలం గూల్చియు శతాంగంబుల వికలాంగంబులుగావించియు మాతంగంబుల నుత్తమాంగంబులు చదిపియు హయంబుల నుగ్గునూచంబుగావించియు వారలనెల్ల భగ్నరణోత్సాహులంగావించితిని. వారలెల్లరును నాలాఘ వంబును దమతమసైన్యంబులకు వాటిల్లినభంగంబు నాలోకించి సమ రంబువిడిచి పాఱిరి. అంత నే నట్లా రాజులనెల్లర జయించి యాకన్య లందోడ్కొని హస్తినపురంబున కేతెంచి విచిత్రవీర్యునకు భార్యలుగా నాకన్యలం దెచ్చితినని సత్యవతి కెఱింగించితిని.

అంబ సాళ్వపతికిఁ దన్నొసంగుమని భీష్ముని బ్రార్థించుట

అనంతరము నేను వీరమాతయు దాసేయియు నగునామాత సత్యవతికడ కరిగి యామెపాదంబుల కెఱఁగి "తల్లీ! వీరు మువ్వురును గాశిరాజకన్యకలు. వీరల స్వయంవరంబున సకలరాజలోకంబును నిర్జించి వీర్యశుల్క లగువీరల విచిత్రవీర్యునకు భార్యలుగాఁ గొనివచ్చితి" నని పలికితిని. అదివిని సత్యవతి నన్ను శిరంబుమూర్కొని యానందబాష్పం బులు నయనంబులనిండ హర్షపరవశయై "పుత్ర ! దైవంబు కరుణపెంపున నీవు విజయంబు గాంచితివి. ఎప్పుడును నీకు వేల్పు లిట్టివిజయంబు లను గ్రహింతురుగాక" యని దీవించెను. అనంతరము సత్యవతి యనుమతిం బడసి యాకన్యలకు వివాహంబుగావింప నిశ్చయించినంతఁ గాశిరాజ పుత్రికలందుఁ బెద్దదియగునంబ నన్నాలోకించి లజ్జావనతవదనయై యిట్లు వచించె. 'భీష్మ! నీవు సకలశాస్త్రంబులును జదివినవాఁడవు. నీవెఱుంగని ధర్మంబులు లేవు. ధర్మ్యంబగు నాప్రార్థనం బాలించి నాకోర్కి నెఱవేర్తువు గాక. నేను సాళ్వపతిని మున్న పతిగా మనంబున వరించియుంటిని.

వున విసర్జించె. ఆకన్యక యెన్నిశపథంబులు గావించినను, నెన్ని ప్రార్థనంబులు గావించినను సాళ్వుండు సమ్మతుఁడయ్యె. అప్పు డాకాశిరాజాగ్రపుత్రి మన్యుపరవశయై కన్నీరుమున్నీరై పాలు శోకగద్గదస్వరంబున సాళ్వాధిపతీ! భక్తురాలను, నిరపరాధను, నిర్దోషను నగునన్ను నీవు పరిత్యజించుచున్నవాఁడవు. నీచేఁ బరిత్యక్తనై నే నేయే తావుల కరిగెదనో యాయా తావులందెల్ల నాకు సత్పురుషులు రక్షకులయ్యెదరుగాక యనిపలికి కరుణదోప విలపింపందొడంగెను. అంత సాళ్వుండు బాలికా! నీవు నీయిచ్చవచ్చినత్రోవం జనుము. వ్యర్థంబుగ నన్ను నిర్బంధింపకుము. సుశ్రోణీ! నీవు భీష్మునిపరిగ్రహంబవై యున్నదానవు. భీష్ముని పేరు వినినంతన భయంబున నాయొడలు వడంకుచుండును. ఎట్లును నిన్ను గ్రహింపఁజాలను. నీయిచ్చవచ్చినకడకు నీవరుగుమని దూరదృష్టిరహితుం డగు సాళ్వుం డాకన్యను నిరాకరించె. అంత చేయునది లేక యాకన్య దీనయై కురరివలె రోదనంబుగావించుచు నగరంబు వెలువడి వచ్చెను. ఆబాలిక నగరంబు వెలువడివచ్చుచుఁ దనదీనావస్థ కెంతయుఁ జింతించుచు నిట్టు లనుకొనియెను. ఈపృథివీతలంబెల్లఁ గలయ వెదకినను నాతో సరి యగువిషమంబుపాలయినవనిత వేఱొకతె కానరాదు. నేను బంధువులనెల్ల విడచి సాళ్వునికడకు రాఁగా వాఁడు నన్ను నిరాకరించెను. నే నెట్లును మరల హస్తినపురంబున కరుగంజాలను. సాల్వునికారణంబుగా నెఱింగించి భీష్మునియనుజ్ఞనొంది హస్తిపురమువీడి వచ్చి మరల నెట్లాపురంబున కరుగఁగలను? నేను దెలివితక్కువగాఁ గావించికొన్న యపరాధమునకు నన్ను నేనే నిందించికొనవలసియుండును. లేదా బలాత్కారముగ నన్యాయ త్తచిత్త నగునన్నుఁ దీసికొనిపోయిన భీష్ముని నిందింతును. లేక మూఢుండై నాకు స్వయంవరంబుగావించిన నాజనకుని నిందింతునా? ఈదోషం బెల్లవిధంబుల నేనే కావించుకొనియుంటిని. అప్పుడు దారుణసంగ్రామ మారంభమయినపుడ నేను భీష్మునకు నామనోరథం బెఱింగించి యారథంబువిడిచి సాళ్వునికడ కరిగినచో నాతం డిట్లు నిరాకరించువాఁడు గాఁడు. అట్లు కావింపమి నాకు నేన యపరాధంబు గావించికొంటిని. భీష్ముండు దురాత్ముండై నాకపకృతి కావించినవాఁడు. వానికంటెనుగూడ మూఢుం డగునాతండ్రియే వీర్యశుల్కయని నన్నుఁ బ్రకటించి పణ్యస్త్రీనివోలె నన్ను స్వయంపరంబున నుంచి నా

కీర్తిజనిశోకం బాపాదించినవాఁడు. నాతండ్రియు, భీష్ముండు, నేను,
సాళ్వరాజు, బ్రహ్మదేవుండు నెల్లరమును గలిసియే నాజీవితమునకు నాశ
కారణము లైతిమి. ఎల్లరును గావించినదుర్నీతిభావంబున నేనిప్పు డీయాప
దకుఁ బాల్పడితిని. మానవుం డెప్పుడును దాను గావించిన భాగధేయం
బుల ననుభవించును. నాకిపుడు సంభవించిన యీయాపదకు శంతను
పుత్త్రుం డగుభీష్ముండే ముఖ్యుండై యున్నవాఁడు. భీష్మునకే తగినప్రతీ
కారంబు గావింపవలయునని నాకు బాగుగఁ దోఁచుచున్నయది. తపం
బునఁగాని యుద్ధంబునఁగాని భీష్మునకుఁ దగినశాస్తి కావించుటయే యుక్త
మంబు. యుద్ధంబున భీష్మునిజయింప నుత్సహించురా జెవ్వఁడు కలఁడు?
అని యిట్టు లాయంబ బహువిధంబుల నాలోచించి భీష్మునికిఁ బ్రతిక్రియ
గావింప నిశ్చయించి నగరంబు వెలువడివచ్చి పురంబు వీడి యరణ్యము
లకుంజని యటఁ బుణ్యంబు లగుమున్యాశ్రమంబులకేఁగి యారాత్రి పరమ
శాంతు లగుతపస్వులనడుమ విశ్రమించెను. ఆయాశ్రమంబున వసించు
నాతాపసులకుఁ దనశోచనీయం బగునవస్థ లెల్ల నెఱింగించె. తనతండ్రి
స్వయంవరంబు చాటించుటయు, భీష్ముండు రాజులనెల్లఁ జయించి తన్నుఁ
గొనిపోవుటయుఁ, దాను భీష్ము ననుమతిఁ బడసి సాల్వునికడ కరుగుటయు,
నాతఁడు దన్నుఁ బరిత్యజించుటయుఁ జెప్ప విని యక్కడనుండు తాపసు
లలో వృద్ధుండును శాస్త్రంబులందు నారణ్యకంబులందు నాచార్యుం
డును దపోరాశియు నగు శైఖావత్యుం డగుమునిపుంగవుం డాదుఃఖ
పరాయణయై వెచ్చనూర్చుచున్నయంబ కిట్లనియె. బాలా! నీయవస్థ
మిగుల శోచనీయమైయున్నది? ఇట్టిదురవస్థ ననుభవించు నీకుఁ దాప
సులే యుపకారంబుగావింపఁగలరు? మహాభాగా! యీయాశ్రమవాసు
లగుమహాత్ములెల్లరును నిత్యతపోయుక్తులై యున్నవారు. వారు నీకుఁ
గావింపం గలయుపకారమేది? అని యడిగెను. అంత నాయంబుజాక్షి
చేతులుజోడించి శిరంబునఁగదించి మునివరా! మీరెల్లరును నాయెడ
దయనుంపందగును. నేను బ్రవ్రాజ్యంబు స్వీకరించి దుశ్చరం బగుతపంబు
కావింప నెంచుచున్నదానను. నేను మూఢనై పూర్వజన్మంబునం గావిం
చినదుష్కృతంబులఫలంబే యిప్పు డీరీతిని నే ననుభవింపవలసివచ్చెను.
ఎల్లవిధంబుల మరల బంధుజనులకడ కేఁగుటకు నాకంగీకారము లేదు.
నేను బ్రత్యాఖ్యాతనై యానందముం బాసితిని. సాల్వుండు నన్ను నిరా

కరించుటం జేసి నాకు జీవితాశయే నశించినది. మీరలు నాయం దను
గ్రహించి నాకుఁ దపోవ్రతం బుపదేశింపఁ బ్రార్థించుచున్నదానను. దేవ
సంకాశు లగు మీర లుపదేశించినమార్గంబున దపం బాచరించి నిశ్శ్రేయ
సంబు ప్రాపింతు. మీరు నాయెడ దయజూపుఁడని పరిపరివిధంబులఁ
బ్రార్థించె. ఆబాల కావించినదీనాలాపంబు లాలించి దయార్ద్రహృద
యుండై శైఖావత్యుం డాపెను దృష్టాంతాగమహేతువు లనేకంబులం
జూపి యూఱడించెను.

### అంబ హోత్రవాహనుని దర్శించుట

అనంతరం బయ్యాశ్రమంబున వసించుతాపసులెల్లరును నాకన్యకు
వలసినయుపకారం బాచరించువారై యేమిపనిసేసిన నిప్పుడు సుఖం
బీకన్యకుఁ జేకురునో యని చింతింపందొడంగిరి. అందుఁ గొందఱుముని
పుంగవు లాకన్యను దండ్రిగృహంబునకుఁ గొనిపోయివిడచు టుచితం
బనిరి. మఱికొందఱు నానిమిత్తంబున నాకన్య కిట్టిపాట్లు సంభవించెనని
తలంచి నన్ను నిందింపసాగిరి. మఱికొందఱు తాపసాగ్రణు లాకన్యను
సాళ్వపతికడకుఁ దీసికొని వెడలి యాతని నొప్పించి యాకన్య నాతనికి
నప్పగించుట యుక్తంబని వచించిరి. ఇతరులు కొంద ఱింతకుమున్న
సాళ్వుం డాకన్యను నిరాకరించెఁ గావున మరల నాతని ననునయించుట
వలన ఫలముండదని నిషేధించిరి. ఈరీతి నాతాపసులెల్లరు నొక్క
కార్యంబు నిశ్చయింపంజాలక యీకన్యతో బాలా! నీప్రయోజనంబు
మిగుల విషమంబై యున్నది. ఇందుఁ దాపసుల మగు మేము గావింపంగల
కార్య మేమి కలదు? బాలా! మాహితవచనంబు లాలించి నీవాదరిం
పుము. నీ వెంతమాత్రంబును బ్రవ్రజింపంజనదు. నీవిక్కడనుండి నీ
తండ్రికడ కరుగుము. నీకు శుభంబు లభించును. ఇపుడు కావింప దగు
కార్యం బాతండే కావించును. నీవు నీతండ్రిమందిరంబున సర్వగుణా
న్వితవై నివసింపంగలవు. వనితకుఁ జనకునికంటె నుత్తమంబు భద్రంబు
నగుగతి వేఱొండు లేదు. నారీమణికి భర్తయుఁ దండ్రియు నిరువురే
గతులై యున్నవారు. సమావస్థయందున్న స్త్రీకిఁ బతి గతియగును.
విషమావస్థయం దున్ననారికి జనకుండే రక్షకుండు. ప్రవ్రజ్యమన్ననో
మిగులఁ గష్టతరం బగునది. విశేషించి యత్యంతసుకుమారి వగు

నీవు ప్రవ్రజ్య నాచరించుట దుఃఖతరం బైయుండును. నీవు రాజపుత్రివి. ప్రకృతిచే మిగుల సుకుమారశరీరవు. అట్టి నీవు సన్న్యసింప నెంచుట బహుదోషావహంబగును. ఆశ్రమంబున వసించునపుడు కలుగు కష్టములు తండ్రియింటనున్నపుడు సంభవింపనేరవు. కావున నీవు నీపితృగేహంబున కరుగుమని వచించిరి. మఱికొందఱు తాపసులు బాలా! నీవీ నిర్జనంబు గహనంబు నగువనంబుననున్నచో ననేకు లగురాజులు నీరూపలావణ్యాదిగుణంబు లెఱింగియున్నవారు. కావున బలాత్కరించియేని వారు నిన్నుఁ గొనిపోవందలంతురు గావున నీవిటనుండుట సకలానర్థంబులకును మూలంబగును. నీవిచ్చటువీడి నీపితృగృహంబున కరుగుమనిరి. అంత నాబాలిక యాతాపసులకెల్ల పునఃప్రణామం బాచరించి వారలతో నిట్లనియె. తాపసప్రవరులారా! నాజనకునిభవనంబునకుఁ గాశినగరంబునకుఁ దిరిగి నే నరుగంజాలను. నేనక్కడికరుగుచో బాంధవులెల్లరు నన్నవమానింతురు. నేను బాల్యంబున నాతండ్రియింట నత్యంతము బంధువులప్రీతిగౌరవంబులకుఁ బాత్రంబనై వసించియుంటిని. కావున నిపుడు నాబంధువర్గంబుచే నవమానము లొందనోపను. ఇట్టి దుర్భరావస్థపాలయిన నేను నాజనకులమోముసైత మాలోకింపంజాలను. తాపసాగ్రణు లగు మీయెల్లరచే నభిరక్షింపంబడుచు నీయరణ్యానిని దపం బాచరించుటకే నేను నిశ్చయించితిని. ఆతపంబువలనఁ బరలోకమందేని నాకిట్టియాపదలు సంభవింపక సుఖంబు సంభవించును. తాపసాగ్రణులారా! నాకిపుడు ప్రాప్తించినదౌర్భాగ్యం బింకేలోకంబున నేజన్మంబునను సంభవింపకుండుటకే నేను దపంబుచేయ నిశ్చయించితిని. కావున మీరు కాదనక నాకుఁ దపోవ్రతం బుపదేశింపుఁడని ప్రార్థించెను. అట్లు లాతాపసులు పరస్పరసంభాషణంబు గావించుచున్న యవసరంబున నచ్చోటికి తపంబొనరించుచు మునివృత్తినున్న హోత్రవాహనుం డనురాజర్షి యేతెంచె. అంత నాతాపసులెల్లరును బూజలచేతను నాసనార్ఘ్యాదిసత్కారంబులచేతను నా రాజర్షికి బహుమానంబు లాచరించిరి. ఆతనికర్హంబగువిధంబున నెల్లపూజలును గావించి యాతండు సుఖోపవిష్టుండై యున్నంత నామునులు మరల నంబనుగూర్చి కావింపందగు కార్యమునే చింతింపం దొడంగిరి. ఆమునులు వివదించు కాశిరాజ

వృత్తాంతమును నంబవృత్తాంతము నాలించి యారాజర్షి మిగుల నుద్విగ్నమానసుండయ్యె. మహాత్ముం డగుహోత్రవాహనుండు తపంబు గావింతునని నిశ్చయంబుగ వచించునంబ నాలోకించి మిగుల జాలి నొంది యొడలు కంపమొంద నాసనంబునుండి లేచి యాకన్యకను గౌఁగిలించికొని మూర్ధాఘ్రాణమొనరించి తనయంకంబున నుంచికొని వత్సా! నేను నీకు మాతామహుండనని యాబాల కెఱింగించి దానిని బెక్కువిధముల సమాశ్వాసించె. హోత్రవాహనుండు జరిగినవృత్తాంతం బడుగుటయు నంబ జరగినదెల్ల యథావృత్తంబుగ నాతనికిం దెలిపెను.అదివిని యారాజర్షి మిగుల శోకవిహ్వలుండై యుండి కొంతతడవునకుఁ దనమనంబున నొకకార్యనిశ్చయంబు గావించి వేపమానాంగుండగుచు మిక్కిలి దుఃఖార్త యగు నాబాల కిట్లనియె. భద్రా! నీవు నీ తండ్రియింటి కరుగుట యెల్లవిధంబుల ననుచితంబె యగును. కావున నీవక్కడ కరుగకుము. నేను నీజననికి జనకుండను. నేను నీకు సంప్రాప్తించిన యీదుఃఖంబెల్ల పోకార్చెదను. నీవు నాకడ నుండుము. బాలా! నీవు మిగుల శుష్కించిపోవుచున్న దానవు నీవింక నీతపంబునందలి యభిలాషము విసర్జింపుము. నావచనం బాదరించి జమదగ్నితనూభవుండు మహాతపస్వియు నగు రామునికడ కరుగుము. ఆతండు నీకుఁ గలిగిన యీమహాశోకంబును దుఃఖంబునుగూడఁ బోఁగొట్ట గలఁడు. నీవు వచించినవాక్యంబులాలించి నిన్నాదరింపఁడేని భీష్ము నాతండు సమరంబున సంహారించును. కాలాగ్నిసమానతేజశ్శాలి యగు నాతనికడకు నీవరుగుము. మహాతపస్వి యగునాతండు నీకు సంభవించిన విషమంబులం దొలంగించి సమం బగుమార్గంబున నిన్నుం బ్రతిష్ఠించునని వచింప నాకన్య మాటిమాటికిఁ గన్నీరు మున్నీరుగా స్రవింపఁ దనమాతామహుం డగుహోత్రవాహనునకు శిరంబున నభివాదంబుగావించి తాతా! నీయానతిమై నాపరశురామునికడకుఁ దప్పక యరిగెదను. కాని నే నాలోకవిశ్రుతుం డగుజామదగ్న్యు నెట్లు చూడంగలను? ఆతఁ డెయ్యెడనుండును? ఆతండు తీవ్రంబగు నాయీదుఃఖంబెట్లు మాన్పింపం గలఁడు ? ఆతఁడున్నయెడ కరుగుమార్గం బెఱింగింప వేఁడెదనని ప్రార్థించెను.

హోత్రవాహనుం డకృతవ్రణున కంబవృత్తాంత మెఱింగించుట

ఆమాటలాలించి హోత్రవాహనుండు కల్యాణీ! పరశురాము
నెఱుంగుతెఱం గెఱింగించెద నాకర్ణింపుమని యిట్లు వచించి, భద్రా!
మహాత్ముండగు జామదగ్న్యుం డుగ్రంబగు తపం బాచరించుచు మహేంద్ర
పర్వతంబున నిత్యంబు నివసించును. సత్యసంధుండు మహాబలుండు
నగు నాతఁడున్న మహావనంబున మహర్షులు వేదవేత్తలు గంధర్వులు నప్స
రసలును వసించియుందురు. నీ వాయెడకరిగి నావాక్యంబుగా నాతనికి
నీయవస్థ నెఱింగింపుము. తపోవృద్ధుండు దృఢవ్రతుండు నగు నాతనికి
శిరంబునఁ బ్రణామం బాచరించి నీ కెయ్యది యభీష్టం బగు నది విన్నవిం
పుము. నా పేరు విన్నంతన నా పరశురాముండు నీవర్థించినదెల్లఁ గావిం
చును. జమదగ్నినందనుండు వీరుండు సకలధనుర్ధరులకుఁ బ్రవరుండు
నగు రాముండు నాకు స్నేహితుండును బ్రీతియుక్తుం డగు సుహృదుం
డునై యున్నవాఁడు. కావున నీ వక్కడికేగిన నీకు శుభంబగునని వచించు
చున్నంతన, రామునకుఁ బ్రియానుచరుండగు నకృతవ్రణుం డను మహర్షి
యానెలవున కరుదెంచె. ఆతండు చనుదెంచినంతన నయ్యాశ్రమమం
దలి మును లెల్లరును సృంజయుం డగు హోత్రవాహనుండు నాసనంబులు
వీడి లేచి ప్రత్యుత్థానం బాచరించిరి. మఱియు నాయకృతవ్రణునకు
నర్ఘ్యపాద్యాదిసత్కారంబు లాచరించిన యనంతరం బెల్లరు నాతని నను
సరించి కూర్చుండిరి. అపుడు వారలెల్లరును మనోహరంబులు ధన్యం
బులు నిత్యంబులు ప్రీతియుక్తంబులునగు ననేకప్రసంగములు సంభా
షించుచున్నయెడ హోత్రవాహనుండు మహాత్ముండగు రాముని గుఱించి
యకృతవ్రణుని బ్రశ్నించె. మహర్షీ! ప్రతాపవంతుండు జమదగ్నినంద
నుండు నగు రాముం డిపు డెయ్యెడ నున్నవాఁడు? ఆతని నెట్లు చూడ
నగునని యడుగుటయు నాతండు రాజా! రాముం డెల్లపుడును నిన్నే
తలంచుచుండును. సృంజయుండగు హోత్రవాహనుం డను రాజర్షి నా
కత్యంతప్రియసఖుండు. ఆతనిని జూడ నాశించుచున్నాఁడనని యాతం
డెప్పుడును వచించుచుండును. ఆరాముండు రేపు ప్రభాతకాలంబున
నిక్కడికి రాఁగలండని నేను దలంచుచున్నవాఁడను. నిన్ను దర్శింపఁ
గాంక్షించి యియ్యెడ కాతం డరుదెంచిన యాతని నిచ్చట నీవు

చూడఁగలవు. రాజర్షి! ఈకన్య యేకారణంబున వనంబున కేతెంచి యున్నది? ఏరాజునకుఁ దనయ? నీ కీకన్యతోఁగల చుట్టఱిక మెట్టిది? ఈవిషయంబులు వినం దలంచితినిగావున వచింపుమని యడిగెను. అది విని హోత్రవాహనుండు మహర్షి! యీకన్య నాదౌహిత్రి. కాశి రాజునకు తనయ. ఈబాలికకును దీనిచెలియండ్రిద్దరకును గాశిరాజు స్వయంవరమహంబు గావించె. దీనిపేరు "అంబ;" దీనిచెలియం "డ్రంబిక, యంబాలిక" యనువారు. ఈకన్యల స్వయంవరవృత్తాంతం బెఱింగి కాశి నగరంబునకు నానాదేశాధీశ్వరులగునరనాథు లేతెంచిరి. ఈకన్యలు నిమిత్తంబుగ నాపురంబున గొప్పమహోత్సవంబు ప్రవర్తిల్లెను. ఆసమ యంబున మహావీర్యుండగుశాంతనవుండు భీష్ముండు సకలరాజలోకంబు నధిక్షేపించి యీముగ్గురుకన్యలను హరించె. ఎదిరించినరాజులనెల్ల జయించి హాస్తినపురంబున కీకన్యలఁ దోడ్కొనిచని సత్యవతిని నివేదించి తనభ్రాతయగు విచిత్రవీర్యున కీకన్యలుముగ్గురను వివాహంబుగావింప నాప్తజనంబుల కాజ్ఞాపించె. వైవాహికప్రయత్నం బాచరింపఁబడుట చూచి యీకన్య మంతనంబుననున్న గాంగేయునికడ కరిగి యాతని తో వీరాగ్రణీ! నేను మున్ను సాళ్వపతిని మనంబున భర్తగా వరి యించినదానను. అన్యచిత్త నగు నన్ను నీతమ్మున కిచ్చి వివాహంబు గావించు టనుచితంబు. నన్ను సాళ్వునికడ కంపుట ధర్మ్యంబని ప్రార్థించె. ఈకన్యవచనంబులాలించి భీష్ముండు మంత్రులతోడను దనజనని సత్యవతి తోడను నాలోచించి దీనికి సముచితపరివారం బొసంగి సాళ్వునికడకుఁ బంపివేసెను. అంతఁ బ్రముదితహృదయ యగు నీబాల సౌభపతి కరిగి యందు సాళ్వుని దర్శించి యాతనితో వీర! భీష్మునిచే విసర్జింపఁబడి నీపాలి కరుగుదెంచితిని; నన్ను ధర్మమార్గంబున బరిగ్రహింపుము. నిన్ను బూర్వ ముగుండియు నేను మనంబున వరించియున్నదాన నని వచించె. ఆమాట లాలించి సాళ్వుండు దీనిచారిత్రంబునకు శంకితుండై దీనిఁ బరిగ్రహిం పక తిరస్కరించె. అంత నుభయభ్రంశంబొంది యీపడుచు తపం బునం గృతనిశ్చయయై యీతపోవనంబు కేతెంచె. దానివంశకీర్తనం బాలించినంతన యీకన్యను నేనెఱింగితిని. ఈదుఃఖంబునకెల్ల భీష్ముండే కారణంబని యీకన్య తలంచుచున్నదని హోత్రవాహనుఁడు వచించి నంత నాయంబయు భగవంతుఁడా! నామాతామహుండు వచించిన

దెల్ల నిక్కంబ. నాజననికి సృంజయుం డగు నీహోత్రవాహనుండు శరీర కర్తయైయున్నవాఁడు. నేనిపు డుభయభ్రంశ మొంది నాజననునిగృహం బున కరుగ లజ్జించుచున్నదానను. అక్కడ కరిగిన నాకవమానంబును బ్రీడయు జనించును. మహాత్ముం డగు రాముండు నా కేది వచించునదియ కావింపఁదలంచితినని వచించె.

—— అకృతవ్రణుండు భీష్ము: డపకర్తయని నిర్ణయించుట ——

ఆమాటలాలించి యకృతవ్రణుండు బాలా ! నీకిరువురువలన దుఃఖంబు సంభవించియున్నది. నీవిరువురకును బ్రత్యపకారంబు గావిం పఁదలంచితివో లేక యిద్దరం దొక్కనికే కావింపఁదలంచితివో తత్త్వంబు నిశ్చయించి నాకెఱింగింపుము. సౌభపతి యగుసాళ్వుని నియోగింపుమందువేని మహాత్ముం డగు రాముండు నీహితం బాచరించు వాఁడై తప్పక యాతని నియోగించును. అట్లుకాక యాపగానందనుం డగుభీష్మునే రణంబున శిక్షింపుమందువే నామహాత్ముం డట్ల కావించును. సృంజయుం డగు నీహోత్రవాహనుండును నీవు నభ్యర్థించినయర్థంబు తప్పక యాతండు కావించితీఱును. నీవు మనంబున నెవ్వరిని శిక్షించుట యావశ్యకంబని నిశ్చయించితివో దాని నెఱింగింపుమనియె. ఈవిష యంబు మున్న యాలోచించి నిశ్చితం బగునేని రామునికడ నివేదించుట సుకరంబగునని వచించుటయు నంబయిట్లనియె. భగవంతుఁడా! భీష్ముండు నామానసాభిచింతితం బెఱుంగమిచే నన్నుం గొనిపోయినవాఁడు. నా మనంబు సాళ్వగతంబై యుండు టాశాంతనవుం డెఱుంగఁడు. కావున నిప్పు డెవ్వరు శిక్షార్హులో నీవ బాగుగ నాలోకించి నిశ్చయింపుము. భీష్మునియెడఁగాని సాళ్వునియెడఁగాని లేక వారిరువురయెడఁగాని ప్రతీ కారంబుగావింప నీవ నిశ్చయింపుము. నాదుఃఖంబునకు మూలంబెల్ల వాస్తవంబుగ నీ కెఱిఁగించియుంటినికదా ? దానికిఁ బ్రతివిధానము నీవ కావింప నర్హుండవు. అని ప్రార్థించినంత నకృతవ్రణుం డిట్లనియె. బాలా! నీవు ధర్మంబునెడ నాసక్తికలిగి వచించుటంతయు నుచితంబై యున్న యది. నాకుఁ దోఁచినయర్థంబు వచించెద నాలింపుము. ఆపగేయుండు నిన్ను హాస్తినపురంబునకుఁ గొనిపోయియుండఁడేని రాముని ప్రబోధనం బక్కఱలేకయ సాళ్వుండు నిన్ను శిరసావహించి గ్రహించును. భీష్ము

నిచే నీవు నిర్జింపఁబడి యాతనిచే హాస్తినపురంబునకుఁ గొనిపోఁబడి యుంటివి. ఆకారణంబున సాళ్వరాజునకు నీయెడ సంశయం బుదయించుట స్వాభావికంబై యుండును. భీష్ముండు పురుషమానియు జితకాశియునై యున్నవాఁడు. కావున భీష్మునెడన ప్రతీకారము గావించు టుచితంబని నాకుం దోఁచుచున్న దనియె. అదివిని యంబకూడ మహర్షిప్రవరా! నామనంబుననుగూడ నిట్టితలంపే కలదు. భీష్ముని రణంబున వధింపఁ జేయుటకే నేనెల్ల వేళలఁ జింతించుచుందును. భీష్ముని కాని సాళ్వరాజును గాని నీవెవ్వనిని దుష్టునిగా నిర్ణయింతువో వానిని శిక్షించి వానివలన సంభవించిన నాయీమహాదుఃఖంబు పనయింపుమని విన్నవించె.

పరశురాముం డంబయున్నయెడ కరుదెంచుట

వార లిట్లుమాటలాడుచుండంగనే యాదివసంబు గతించె. సుఖశీతోష్ణమారుతంబుగల రాత్రిగూడ వారికథ నాలోచించుచునే కడపిరి. మఱుచటిదినంబు ప్రభాతకాలంబుననే శిష్యపరివృతుండై జటాచీరధరుం డగు జమదగ్నినందనుండు తనతేజంబున నావనంబు వెలిఁగించుచు నయ్యెడ కరుదెంచె. ధనుష్పాణియు నదీనాత్ముండును, ఖడ్గధరుండును, పరశ్వధధారియు, విరజస్కుండును నగు రాముండు సృంజయునికడ కేతెంచినంత నాతాపసులెల్లరును హోత్రవాహనుండును బ్రత్యుత్థానాభివందనంబు లాచరించి ప్రాంజలులై యాకన్యతోడంగూడ నాతని కర్ఘ్యపాద్యాదివిధు లొనర్చి మధుపర్కం బొసంగి పూజించిరి. రాముండు వారిచే నర్చితుండై యథాన్యాయంబుగ నా మునులను రాజును గుశలసంప్రశ్నంబు గావించి వారితోఁగూడ సుచితాసనంబున నాసీనుండయ్యె. అపుడు జామదగ్న్యుండును హోత్రవాహనుండును బూర్వనిర్వృత్తంబు లగుకథలఁ బ్రసంగించుకొన్నతఱి హోత్రవాహనుండు భృగువంశవర్ధనుం డగురామునితో ననుకూలసమయంబున నిట్లు విన్నవించె. రామ! ఈకన్య నాదౌహిత్రి. కాశిరాజునకుఁ గూఁతురు. నీవలన నొక్కకార్యం బాశించి యీకన్య యిక్కడ నున్నది. దానిప్రార్థనం బాలించి దానివాంఛితంబు నెరవేర్పుమని ప్రార్థించెను. అంత జామదగ్న్యుం డాకన్య నాలోకించి నీయభీప్సితం బేదియో తెలుపుమనవుడు పావకుండువోలె వెలుంగుచున్న రాముని సమీపించి యాతనిచరణంబుల కభివాదనం బాచరించి ముకుళితకరకమల యై

యెదురనిలిచి బాష్పవ్యాకులలోచనయై రోదనం బాచరించుచు శరణ్యుం డగునాతనిని శరణంబు వేఁడెను. దానింజూచి రాముండు కరుణాకలిత హృదయుండై రాజపుత్రి! నీ వీస్వంజయున కెట్టిదానవో నాకు నట్టిదానవే! కావున వేఱుగా తలంపక నీమనోగతంబగు దుఃఖంబెల్ల నెఱింగింపుము. నీచెప్పినకార్యంబు తప్పక కావింతుననియె. అపు డంబ భగవంతుఁడా! నేనిపుడు మహావ్రతంబు శరణంబుగాఁ దలంచితిని. ఘోర శోకపంకార్ణవంబున మునింగియున్న నన్నుద్ధరింపుము. అని ప్రార్థించి నంత రాముం డాబాలికరూపంబును, నభినవం బగు తారుణ్యంబును, నుత్తమం బగుసౌకుమార్యంబును నాలోకించి చింతాకులితహృదయుం డయ్యె. భృగూద్వహుం డగునాతం డీబాలిక యేమి వచించునా? యని చిరకాలంబు చింతించె. అతండు పెద్దకాలం బామె వివక్షితంబు చింతించి కృపాభిపరిప్లుతుండై దానితో నీవాంఛితం బేదియో యెఱింగింపుమని వచించె. అంత జరిగినవృత్తాంతం బామూలాగ్రంబుగ నివేదింప నాకర్ణించి జామదగ్న్యుండు కర్తవ్యకార్యంబుల నిశ్చయించి దాని కిట్లనియె. రాజపుత్రీ! నిన్ను భీష్మునికడకుఁ బంపెదను. ఆతండు తప్పక నామాట యాదరించును. ఆతండు నావచనం బాచరింపండేని సామాత్యుం డగువానిని రణంబున నిర్దహించెదను. నీ మనంబు భీష్మునివలన నివృత్తంబై యుండెనేని వీరుం డగుసాళ్వపతినే యీవిషయంబున నియోగింతును. కావుని నీయభీష్టం బెఱింగింపుమన నాకన్య మహాత్మా! భీష్ముండు నామనంబు సాళ్వరాజగతం బని వినినంతన నన్ను విడిచిపుచ్చినవాఁడు. నేను సాళ్వరాజుకడ కేతెంచి యెంతయు దీనంబుగ వేఁడితిని. ఆతండు నాచారిత్రంబు శంకించి నన్నుఁ బరిగ్రహింపండయ్యె. కావున నీవృత్తాంతమెల్ల నీవు నీబుద్ధిచే నిశ్చయించి యిపుడు కావింపందగుకార్యంబు గావింపుము. నాయభిమతంబన్ననో యీవ్యసనంబునకెల్ల భీష్ముండె మూలంబని నేను దలంచుచున్నదానను. ఆతండు నన్నవశంగావించి బలాత్కారంబునం గొనిపోయినవాఁడు. కావున నాగాంగేయుని వధింపుము. ఆతనివలనన నాకీదుర్భరంబగు దుఃఖంబు సంభవించె. ఆతనివలనన యప్రియంబగునీయవస్థ ననుభవించుచున్నదానను. ఆభీష్ముండు లుబ్ధుండు నీచుండు జితకాశియునై చరించుచున్నవాఁడు. ఆకారణంబున నాతనియెడన ప్రతిక్రియ గావింపఁ

దగును. భీష్ముండు నన్ను బలాత్కారంబునం గొనిపోవుసమయంబుననే యాతని సంహారింపం జేయునిశ్చయంబు నాకు జనించె. ఇప్పటికిని నా కామం బట్లె నామనంబున బ్రవృద్ధంబగుచుండె. భృగుపుంగవా! ఆ భీష్ముని వధించి వృత్రునివధించిన శతక్రతునింబోలి కీర్తిగొంది నా కామం బీడేర్పు మని ప్రార్థించెను.

రాముండు భీష్మునికడ కరుగ నిశ్చయించుట

అంబ యట్లు భీష్ముని వధింపుమని ప్రేరించుటయు జామదగ్న్యుం డిట్లనియె. బాలా! నీవిట్లు రోదనం బాచరింపకుము. కాశిరాజపుత్త్రి! నేను నాయిచ్చవచ్చినట్లు శస్త్రంబు గ్రహింపఁజాలను. బ్రహ్మవేత్తల కాపదలు సంభవించినపుడు దానిని మార్చుటకుమాత్రమే నేను శస్త్రం బాలంబించెదను. దానిని విడిచి యింక నేదేని నీకుఁ బ్రియం బాచరించె దను. నాకు సాళ్వుండును భీష్ముండునుగూడ వశవర్తులై యున్నవారు. కావున నీకార్య మెల్లభంగులను గావింతును. నీవు శోకింపకుము. బ్రాహ్మణులు నియోగించిననే కాని శస్త్రంబు పరిగ్రహింప నని నేను సమ యంబు గావించియుంటిననియె. అదివిని యంబ మహాత్మా! నాదుఃఖం బేయుపాయంబుననైన నీవు తొలఁగింపవలయునుకదా! నాదుఃఖంబున కెల్ల భీష్ముండే కారణంబై యున్నవాఁడు కావున వాని నచిరకాలమ్మునన వధించి నాశోకంబు మాన్పుమనియె. అంత రాముండు పరవర్ణినీ! శిరంబున నభివాదనం బాచరింప నర్హుండై నను భీష్ముండు నావచనంబున నీపాదంబులంబడి యనునయించును. కావున వానిని వధింపనేల యని యడిగెను. అంబ మహానుభావా! నీవు నాకుఁ బ్రియం బాచరింపన తలం చితివేని యసురునివలె గర్జించు నాభీష్ముని రణంబున సంహారింపుము. ఇదియ నాకుత్తమంబగును. నీవు కావించిన ప్రతిజ్ఞ సత్యంబగునట్లు నెఱ వేర్పుమనియె. ఇట్లు రాముండు నంబయు సంవాదంబు గావించుచుండ నక్కడిఋషులలోఁ బరమధార్మికుండగు నొకఋషి రామున కిట్లనియె. మహాబాహూ! శరణాగతయగు నీకన్య నెట్టులును విసుపందగదు. భీష్ముఁడు రణంబున కాహూతుండై యుద్ధంబునం బరాజయంబంది "నీచే జయింపఁబడినవాఁడ" ననినను లేక నీచెప్పినకార్యం బన్యథాకరిం పక కావించినను నీకన్యకుఁ బ్రియంబగును. దానివలన నీకన్యకార్యంబు

నీవు కావించినవాఁడ వగుదువు. నీప్రతిజ్ఞకూడ సత్యంబై ప్రతిష్ఠితంబై
యొప్పును. రామ! తొల్లి నీ వుర్వింగలసమస్తపార్థివులను వధించి బ్రాహ్మ
ణుల కొక్కప్రతిజ్ఞ గావించియుంటివికదా? బ్రాహ్మణుండు కానీ క్షత్రి
యుండేని వైశ్యుండేని శూద్రుండైనను బ్రహ్మద్వేషంబుగావించుచో
వానిని దప్పక వధింతును. మఱియు నేను జీవించియుండునంతకును
శరణం బపేక్షించి నాశరణంబున కేతెంచినవారి నెన్నిసంకటములం
దును బరిత్యజింపను. పృథివింగలరాజలోకంబు నెల్ల సమాగతంబై యుండ
దానినెల్ల నెవ్వఁడు జయించునో యట్టిదృప్తాత్ముని సంహరింతునని
నీవ మున్ను బ్రాహ్మణులయెదుట శపథంబు గావించియుంటివి కాదే? కురు
కులోద్వహుం డగుభీష్ముం డీకన్యాస్వయంవరమున నేకత్ర సమాగతం
బగు రాజబృందంబెల్లఁ బరాజయంబందించి విజయమందియున్న వాఁడు.
భృగునందనా! అట్టి భీష్మునితో నీవు యుద్ధంబు తప్పక కావింపఁదగును.
అనినంత జామదగ్న్యుండు మునీంద్రా! నేను బూర్వము కావించిన
ప్రతిజ్ఞ స్మరించుచున్నవాఁడను. సామంబునన యీకార్యంబు చక్కఁ
బఱుచుటకై ప్రయత్నింతును. బ్రాహ్మణోత్తమా! యీకాశికన్యా మనో
గతం బగుకార్యంబు మిగుల దుష్కరంబగునది. నేను స్వయముగనే
యీకన్యను దోడ్కొని యాభీష్ముఁ డున్నయెడ కరిగెదను. భీష్ముండు
నావచనంబు లాదరించి దీనిని బరిగ్రహించెనా యల్పాయాసంబునన
కార్యంబు నెఱవేఱును. రణశ్లాఘి యగునాతఁడు నామాట లాదరింపక
దీని పరిగ్రహింపఁడే నాతని నప్పుడ రణంబున వధింతునని నిశ్చయించి
నాఁడ. నేనువిడిచినబాణంబులు శరీరధారులశరీరంబుల దూసిపాఱుటయ
కాని యెప్పుడును శరీరములందు సక్తంబులై యుండవని తొల్లి జరిగిన
క్షత్రియసంగరంబున మీకెల్లరకును విదితంబయ్యెఁగదా? యనియె. అని
యిట్లు వచించి బ్రహ్మవాదు లగు నామును లెల్లరతోడంగూడ భీష్ముని
కడ కరుగుటకుఁ బ్రయాణముహూర్తంబు నిశ్చయించెను. ఆమును
లును రాముండు నారాత్రి యాయాశ్రమంబున నశ్రమంబున నుండి
మఱునాఁ డుదయకాలంబున లేచి హోమంబులు నిర్వర్తించి జపంబులు
జపించి నావధం బాచరింపఁదలంచి ప్రయాణమైరి. ఆబ్రాహ్మణోత్తము
లెల్లరతోడనుగూడి రాముండు కురుక్షేత్రంబున కేతెంచెను. మహాత్ము

లగు నాతాపసు లెల్లరును ఆ మునిం బరివారించి సరస్వతీతీరంబున విడిసి
యుండిరి.

### భీష్ముండు పరశురామునిమాట నిరాకరించుట

సుయోధనా! ఆజామదగ్న్యుం డట్లు తాపసులతోడం బరి
వృతుండై యంబతోఁగూడఁ గురుక్షేత్రంబున విడిసియుండి మూఁడవ
దినంబునఁ దాను కురుక్షేత్రంబున నుంటి ననియుఁ దనకుఁ బ్రియమాచ
రింపుమనియు నాకు సందేశ మంపెను. నేనును మహాబలుండు మహాతప
స్వియు నగునాతనిరాక వినినంతన ప్రీతచిత్తుండనై తేజోనిధి యగు
నాతనికడ కరిగితిని. గోవును ముందిడుకొని బ్రాహ్మణపరివృతుండనై
దేవకల్పు లగుఋత్విజులును బురోహితులును వెంటరా నే నాతనిని
దర్శించుట కరిగితిని. తన్ను దర్శింపవచ్చిన నన్నుఁ జూచి ప్రతాపవంతుం
డగు నాజామదగ్న్యుండు నాయొనర్చినపూజ నెల్ల గ్రహించిన పిదప
నిట్లనియె. భీష్మ! నీవు కామరహితుండవయ్యు నీకాశిరాజదుహిత నప్పు
డట్లేల కొనిపోయితివి? కొనిపోయినవాఁడవు దీని నీయింట నుంచక
మరల నేల విడచితివి? నీవలన యశస్విని యగు నీకన్య ధర్మభ్రంశమంది
యున్నదికదా? నీచే పరామృష్టురాలగు నీకన్యను గ్రహించువాఁ
డెవ్వాఁడుండును? నీవు కొనిపోయితి వను కారణంబున సాళ్వుండు దీనిని
బరిగ్రహింపక నిరాకరించినవాఁడు. కావున నానియోగంబు మన్నించి
యీకన్నియను నీవ పరిగ్రహింపుము. రాజపుత్రి యగు నీకన్య స్వధర్మంబు
పొందుఁగాక. నీవు రాజవై యుండియు రాజపుత్రి కిట్టి యవమానము
కావించుట యుచితంబుగాదు. కావునఁ దప్పక దీనిని బరిగ్రహింపు
మనియె. అపుడు కోపంబున విమనస్కుండై యున్న యారాము నాలో
కించి నేనిట్లంటిని. బ్రహ్మర్షిపుంగవా! నే నీకన్యను నాయనుజున కెబ్బంగి నే
నీయనోపను. ఈకన్నియ తనంత తాన మున్ను నేను సాళ్వునకు
భార్యనని వచించియుండె. అదివిని నేను దానియభిమతంబు పాలించి
విసర్జింప నిది సాల్వనగరంబునకుం జనియె. భయంబుననేని క్రోధం
బుననేని ధనలోభంబుననేని కామాయత్తతచేతనేని నేను క్షత్రియ
వ్రతమును విడువంజాలను. నే నిదియ పరమవ్రతంబుగా నాచరించు
చున్నాఁడను. కావున నే నీకన్యను గ్రహింపంజాలనంటిని. అపుడు

రాముండు క్రోధపర్యాకులాత్ముండై 'ఓయీ! నేను వచించిన యీ కార్యంబు గావింపవేని నిన్నును నీమంత్రులను సంహరింతు' నని మరల మరల వచించెను. నేను నిష్టంబులు ధర్మంబులు నగువాక్యంబులచే భృగువంశవర్ధనుండగు నాతని నెన్నిభంగులనో శాంతింపుమని ప్రార్థించితిని. ఐన నాతండు శాంతింపఁడయ్యె. అప్పుడు నేను మరల నాబ్రాహ్మణప్రవరునకు సాష్టాంగనమస్కారంబొనరించి యిట్లంటిని. మహాత్మా! నీవు నన్ను మాటిమాటికిని యుద్ధంబునకు రమ్మనుచుండుటకుఁ గారణమేమి? మహాబాహూ! బాలుండనగు నాకు నీవ చతుర్విధంబులగునిష్వస్త్రంబుల నుపదేశించుటంజేసి నేను నీకు శిష్యుఁడనై యుంటినిగదా? అట్టి నాతో యుద్ధంబొనర్ప యత్నించుట పాడియగునా? యని యంటిని. అంత నాతండు క్రోధరక్తనయనుండై భీష్మా! నన్ను గురుండనని వచించుచుఁగూడ నాని దేశం బనుసరించి యీకన్యను గ్రహింపకున్నాఁడవు. మహామతీ! నాకుఁ బ్రియం బొనరించునుద్దేశమున నేని కాశిరాజదుహితయగు నీకన్యను గ్రహింపుము. నీవు దీనిని గ్రహింపవైతేని నాహృదయంబునకు శాంతి చేకూరదు. మహాబాహూ! దీనిని బరిగ్రహింపుము; నీకులంబును రక్షించుకొనుము. నీచే భ్రష్టురాలగు దీని కెందును భర్త లభింపకున్నాఁడు. కావున నీవే దీనిని గ్రహించి దీనిధర్మంబు కాపాడుమని వచించె. అట్లు వచించుచున్న పరపురంజయుండగు రామునకు నే నిట్లంటిని. బ్రహ్మర్షిసత్తమా! నే నీకన్యను మరల గ్రహించుటెన్నండును జరుగఁబోదు. నీవీవిషయంబున శ్రమంపడిన ఫలమేమి? నీయందు నాకుం గలపురాతనంబగు గురుభావంబనుసరించి నిన్నుఁ బ్రార్థించుచున్నాఁడను. నన్ననుగ్రహింపుము. నే నీకన్యను మున్ను పరిత్యజించియుంటిని. మరల నిపుడు గ్రహింపంజాలను. పరాసక్తయగుయువతిని పాము నింటనుంచికొన్నవడువున నెవ్వఁడింటనుంచుకొనఁగలఁడు? మహాత్యయంబులగుస్త్రీలదోషంబు లెఱింగియు నెవ్వఁడిట్టికార్యంబు గావించును? మహావ్రతా! నేను సురేశ్వరునకేని భయపడి ధర్మంబు విడుచువాఁడనుగాను. కావున నెల్లవిధంబులఁ బ్రసన్నుండవై నన్ననుగ్రహింపుము. లేదా, నీకిచ్ఛవచ్చినకార్యం బాచరింపుము. విశుద్ధాత్మా! పురాణంబునందు మరుత్తునిచే గీతంబగు నొక్కశ్లోకంబు కలదు. గురుండయ్యును నవలేపవశుండై కార్యాకార్యంబు లెఱుంగక యుత్పథప్రతి

పన్నుండయ్యేనేని వానిని బరిత్యజింపం దగునని యాగీతంబువలన విది
తం బగుచున్నది. నీవు గురుండవుకదా యని తలంచి నే నెంతయు నిన్ను
సమ్మానించితిని. నీవన్ననో గురువు శిష్యునియెడ నెట్లు ప్రవర్తింపవల
యునో యావిధి నెఱుంగవు; కావున నీతో నవశ్యము సంగరంబు
గావింతును. నేను గురుని సమరంబున వధింపను. విశేషించి బ్రాహ్మ
ణుని వధింపను. తపోవృద్ధుం డగువానిని మఱియు విశేషించి పరిమార్ప
కుందును. నీవు గురుండవు, బ్రాహ్మణుండవు, తపోవృద్ధుండవు నగుటం
జేసి యింతదనుక క్షమించియుంటిని. బ్రాహ్మణుండైనను క్రోధవశుండై
ధనువున బాణంబు సంధించి యుద్ధంబున నపలాయనుండై నిలిచియుం
డునో యట్టివానిని సమరంబున సంహరించునెడల బ్రహ్మహత్య సంభ
వింపదని ధర్మశాస్త్రంబులు వాకొనుచున్నయవి. తపోధనాగ్రణీ! నీవు
క్షత్రియధర్మమందు నభిరతుండ వగుటచే క్షత్రియుండ వైతివి. ఎవ్వం
డెధర్మంబునం బ్రవర్తించు వాని నాధర్మంబునన ప్రవర్తింపం జేయుచో
రాజున కధర్మము కాని శ్రేయోహాని కాని సంభవింపకుండును. అర్థమం
దును ధర్మమందును దేశకాలంబు లెఱింగినవాం డర్థసంశయంబు సంభ
వించునెడ సంశయింపంజనదు. సంశయములేని మానవునకు శ్రేయంబు
లభించును. నీవు సంశయితం బగునర్థమందైనను న్యాయం బనుసరించి
ప్రవర్తించుట యుచితము కావున రామా! నీతోంగూడి మహాహవం
బునం బోరొనరించెద. నాబాహువీర్యంబు నతిమానుషం బగుపరాక్ర
మంబున నీ వాలోకింతువుగాక. నే నెన్నిభంగుల నాలోచించియు
నవశ్యకర్తవ్యమని యేది నిశ్చయించితినో దాని నాచరించెద. విప్రో
త్తమా! కురుక్షేత్రంబున నీతో సంగరం బాచరించెద. మహాద్యుతీ!
మనకు సంభవింపనున్న ద్వంద్వయుద్ధంబునకు సన్నద్ధుండవై యుండుము.
ఆయుద్ధంబున నాచే శరశతంబులచే నిహతుండవై శస్త్రపూతుండవై
నీవు తపంబున నిర్జించినలోకము లధిగమింతువుగాక. గావున నిపుడు
విడిచి కరుగుము. రణప్రియంబగు కురుక్షేత్రంబునకు మరలవమ్ము. తపో
ధనాగ్రణీ! నీతో యుద్ధం బాచరించువాండనై నేను నక్కడి కేతెంచు
వాండను. మహాత్మా! మున్ను నీ వాస్థలంబుననకదా పితరులకు వైరి
రాజరక్తంబులతోం దర్పణంబు లాచరించియుంటివి? భార్గవ! నేనుగూడ
నిన్ను వధించి నాపితరులకు శౌచంబు గావించువాండను. యుద్ధదుర్

దుండ వగు నీ వక్కడకుఁ ద్వరితంబుగ రమ్ము. పూర్వకాలంబునుండియు నీశరీరంబంటియున్న బ్రాహ్మణబ్రువత్వదర్పంబు నెడలింతును. రామ! నీవు "నేనొక్కరుండన లోకంబునంగలక్షత్రియులనెల్లజయించితిని. భీష్మ నీవు క్షత్రియుండవైనను నావంటివాఁడవై జనింపవైతివి. "యని గర్వోద్రేకంబున చిరకాలమునకు మున్ను నాకడ నాత్మశ్లాఘనంబు గావించికొని యుంటివి. ఆశ్లాఘనంబు కేవలము కాపురుషలక్షణంబై యున్నయది. తేజస్సులన్నియు నుండ నీతేజంబు తృణాగ్నివోలె వెలింగినది. నీకుం గలయుద్ధజనితదర్పంబును యుద్ధకామంబునుగూడ సడలించు భీష్ముండ నని నన్నెఱుంగుము. యుద్ధంబున నీకుం గలగర్వంబెల్ల బోఁగొట్టె దను. సంశయింపక త్వరితంబుగఁ గురుక్షేత్రంబున కేతెమ్మని వచించితి. నాపలుకులాలించి వెడనవ్వునవ్వుచు జామదగ్న్యుండు భీష్మ! చిరకాలంబు నకు నాతోఁగూడ నీవు సంగరంబుగావింపఁదలంచుచున్నాఁడవు. కౌరవ్య! ఇదె యిప్పుడ కురుక్షేత్రంబున కేతెంచుచున్నవాఁడను. నీచెప్పిన చొప్పునఁ దప్పక నేను యుద్ధసన్నద్ధుండనై వచ్చెదను. నీవును దప్పక రమ్ము. అక్కట నాశరంబులచే నిహతుండవై గృధ్రకంకంబుల కశనం బవై పడియున్ననిన్ను నీజనని సురాపగామణి దర్శించుఁగాక. సిద్ధచారిణ సేవిత యగు నాదేవి కృపణుండ వగు నీవు నాచే నిహతుండ వగుట యాఁలోకించి మిగుల శోకించుఁగాక. మందుండవు యుద్ధకాముకుండవు నాతురుండవు నగునిన్నుఁగన్నయాఁజననికి రోదనంబుగాక మరేమి కలుగును? కౌరవ్య! నీకుం గలయుద్ధపరికరంబులు రథంబులు మొదలగు సకలసేనలం దోడ్కొనిరమ్ము పొమ్మని వచించినంతనే నాతనికి శిరంబునం బ్రణామం బాచరించి తప్పక నీచెప్పినచొప్పునఁ గావింతు నని పలికితిని.

### భీష్మజామదగ్న్యులయుద్ధము

జామదగ్న్యుండు నన్నామంత్రించి యుద్ధంబున బద్ధాదరుండై కురుక్షేత్రంబున కరిగెను. నేనును నగరంబు ప్రవేశించి సత్యవతి కీవార్త నెఱింగించితిని. నామాత సత్యవతియు నన్నెంతయు నభినందించి స్వస్త్యయనంబులుగావించి విజయంబు గలుగ దీవించెను. అనంతరము నేను బ్రాహ్మణులచే స్వస్తిపుణ్యాహంబులు సదివించి రజతవినిర్మితంబును భాండురాశ్వయుక్తంబును సూపస్కరంబు స్వధిష్ఠానంబు వ్యాఘ్రచర్మ

పరివారణంబు మహాశస్త్రోపపన్నంబు సర్వోపకరణసంపన్నంబు నగునర దంబును సత్కులీనుండు హయలక్షణాభిజ్ఞుండు యుద్ధకోవిదుండు నగు సూతుం డాయత్తంబుగావించి తెచ్చుడుం బాండురం బగుకవచంబు దాల్చి దృఢంబుబలిష్ఠంబు నగు కార్ముకంబుఁ బరిగ్రహించి శిరంబున వెల్లని గొడుగువిరాజిల్ల పాండురవ్యజనంబులతో వందిమాగధులు వీచికొలువ శుక్లవసనంబులు శుక్లవిభూషణంబులును ధరించి బ్రాహ్మణులును వంది మాగధులును జయాశీర్వాదంబులు వచించుచుండ హాస్తినపురంబు వెలువడి రణక్షేత్రం బగుకురుక్షేత్రంబునకు వెడలితిని. పరమవినతుం డగుసూతునిచేఁ బ్రచోదితంబులై సాహయంబులు మనోమారుతముల వేగంబుమీఱు వేగంబున నన్ను గురుక్షేత్రంబునకుఁ గొనిపోయినవి. నేనక్కడ కరుగునరికి భృగువంశవర్ధనుం డగు రాముండును యుద్ధోత్సా హియై కురుక్షేత్రంబున కేతెంచియుండెను. నేను రాము నాలోకించి నంతన యుత్తమం బగుశంఖంబు పూరించితిని. ఆకురుక్షేత్రంబున బ్రాహ్మణప్రవరులును దాపసులును రణాలోకనకుతూహలావిష్టులై బలసి యుండిరి. దేవతలు గణంబులును గొలువ దేవేంద్రుండు సమరవీక్షణ తత్పరుండై నిలిచియుండె. మింట విమానంబులు గ్రాలుచుండె. అంత రిక్షంబువలన దివ్యంబులగుమాల్యంబులు వర్షింపంబడియె. దివ్యంబు లగు వాదిత్రంబులును మేఘంబులును మహాధ్వానంబులు గావింపందొడంగె. అప్పుడు రామునను సరించి యేతెంచినతాపసప్రవరులెల్లరును యుద్ధప్రేక్ష కులై యొక్కచో నిలిచియుండిరి.

ఆసమయంబున సర్వభూతహితాభిరత యగు గంగానది స్వస్వరూ పంబున నాకడ కేతెంచి యిట్లనియె. కురుకులోద్వహా! ఏల నీవిట్టియకా ర్యంబు కావింప సమకట్టితివి? నే నాజామదగ్న్యునికడ కరిగి యాతని యాచించి శాంతుంగావింతును. నీశిష్యుం డగుభీష్మునితో యుద్ధం బాచ రించుట తగదనియు నాతనికి బోధింతును. పుత్రా! నీవు విప్రప్రవరుం డగునాతనితో నిట్టి నిర్బంధముగావింపకుము. నీవెట్లును జామదగ్న్య నితో సమరంబుగావింపందగదని నన్ను మందలించెను. క్షత్రియహంత యు హరతుల్యపరాక్రముండునగు నాతనిని నీవు బాగుగ నెఱుంగవా? ఆతనిపరాక్రమంబు నీ కవిదితమా? యని నన్నుఁ బెక్కువిధముల భర్త్సించెను. అప్పుడు నేను గంగాదేవి కభివాదనం బాచరించి చేతులు

జోడించి యిట్లని యామెకు విన్నవించితిని. జననీ! కాశీరాజపుత్రికల స్వయంవరంబునం బ్రవర్తిల్లినవిషయంబులెల్ల నీవెఱింగియే యుంటివి. రాముండును నిక్కడ కేతెంచి నన్ను నిర్బంధించుటయు నే నాతనిని దొలుత నెట్లు సామంబున బ్రార్థించినదియు నీకు నవిదితంబుగానేరదు. కాశిరాజాత్మజపూర్వచరిత్రముకూడ నీవెఱింగినదియ. కావున నకార ణంబుగ నన్నేల నిందించెదవు? నాయెడ నొక్కదోషంబున్న నన్ను నిందింపుమని యంటిని. ఆమాట లాలించి జాహ్నవి నాహితంబుగోరి రామునికడ కరిగి యెన్నిభంగులనో ప్రార్థించి క్షమింపుమని బోధించెను. ఆరాముం డామహానదీవాక్యంబు లాదరింపక నేను వచించినవాక్యము నిరాదరించి నాకామంబు నెరవేర్పమిచే నేను భీష్మునితో యుద్ధంబు గావింపఁదలంచినాఁడ. నీకు భీష్మునెడ వాత్సల్యంబుగలదేని వానిని మంద లించి నాకామంబు వానిచేఁ గావింపించి వానిని ముందుగ యుద్ధంబు వలన మరలింపుము. అంతియకాక నన్నెంత ప్రార్థించినను నేను సమరంబు మాననని బదులువల్కుటయు నామందాకిని సుతస్నేహంబున మరల నాకడ కరుగుదెంచి నన్నెంతయు మందలించెను. నేను గ్రోధపర్యాకు లేతుండనై యామెవచనంబు లాదరింపనైతిని. ఇంతలోనే ధర్మాత్ముండు భృగుశ్రేష్ఠుండు మహాతపస్వి ద్విజసత్తముండు నగుజామదగ్న్యుండు యుద్ధసన్నద్ధుండై యేతెంచి నన్నాహ్వానించెను.

## భీష్ముండును రాముండును ద్వంద్వయుద్ధం బొనరించుట

అంత నేను యుద్ధభూమి కరిగి యక్కడనున్నదురాధర్షుని రాము నాలోకించి నమస్కరించి యాతనితో మహాత్మా! నేను రథంబున నున్న వాఁడను. నీవు భూమిపై నిలిచియున్నవాఁడవు. నీవు భూమిపై నిలిచి యుండ నేను రథం బారోహించియుండుట యుచితంబుగాదు నీవును స్యందనం బధిరోహించి కవచంబు తొడుగుము. అప్పుడు నీతోడ యుద్ధంబు గావింప నాకుత్సాహం బతిశయించునని విన్నవించితిని. అతండు నాపలుకు లాలించి భీష్మా! నాకు మేదినియే యరదంబు వేదం బులు వినీతంబు లగు సదశ్వంబులుంబోలె నన్నుపచరించును. వాయుదే వుండు సూతుండువోలె నారథచోదనంబు గావించును. వేదమాత లగు సావిత్రీగాయత్రీసరస్వతులు కవచంబువోలె నాశరీరత్రాణంబు గావిం

తురు. ఇట్టి పరికరంబులతో సన్నాహంబు మెఱయ నేను సమరంబుగావిం చెద నని పలికి సత్యవిక్రముం డగు రాముండు శరవ్రాతంబున నన్నెల్లెడల ముంచెను. ఆ సమయంబున సేనాజామదగ్న్యవీక్షించునరికి వాతండు దివ్యం బగు రథంబు మధ్యంబున మధ్యందినమార్తాండబింబంబుడంబున వెలుంగుచుండె. ఆరథంబున సర్వాయుధప్రవరంబులును సన్నద్ధంబులై యద్భుతంబుగఁ జూపట్టెను. నగరంబువలె విస్తీర్ణం బగు నాయరదంబు జామదగ్న్యునిమనంబున వినిర్మింపంబడినది. దివ్యంబు లగుతురంగంబు లారథంబు వహించుచుండెను. సర్వావయవంబులందును గాంచనంబున విభూషితంబగునాస్యందనంబున సోమార్కకృతలక్షణం బగు మహాకవచంబు దొడిగి ధనుర్ధరుండును బద్ధతూణీరుండు నాబద్ధగోధాంగుళిత్రాణుండునై రాముండు పరభయంకరుండై వెలుంగుచుండె. యుద్ధాయత్తుం డగునాతనికి నకృతవ్రణుండు సారథ్యంబు నెఱపుచుండె. అకృతవ్రణుండు వేదంబులెల్లఁ జక్క నెఱింగినవాఁడు. భార్గవున కత్యంతదయితుం డగు నెచ్చెలికాఁడు. అకృతవ్రణుండు రథంబు కడపుచుండ భార్గవుండు మాటిమాటికిని నన్ను సమరంబున కాహ్వానించుచు నాహృదయంబునకుం బ్రహర్షం బాపాదించుచుండె. ప్రళయకాలాదిత్యుండు వోలె దుర్నిరీక్ష్యుండై యనాధృష్యుండును క్షత్రియాంతకరుండునై యున్న రాము నొక్కనిని నేనొక్కరుండన యెదిరించి నిలిచితిని. నేను మూఁడుబాణపాతంబులదూరం బెడగలుగ రథం బవతరించి ధనువు రథంబున నుంచి కాలినడకతో ద్విజసత్తముండగు నారాముని గౌరవించుచు నాతనికడ కరిగి విధివిధానంబున నభివాదనం బాచరించి యుత్తమం బగువాక్యం బిట్లంటిని. రామా! నీవు నాకు సమానుండవైనను నధికుండవైనను నీతో యుద్ధంబుగావింప నున్నాఁడను. ధర్మశీలుండవును గురుండవు నగు నీకిదె నమస్కారం బాచరించుచున్నాఁడను. నాకు సమరంబున విజయం బాశీర్వదింపుము. అని నేను వినయంబునఁ బలుక నామహామహుండు ప్రహృష్టాంతరంగుండై యిట్లనియె. కురుకులాగ్రణీ! నీవచించినదియెల్ల నిక్కువంబ. భూతికాముం డగువాఁడిప్పుడు నీవాచరించినసముదాచారం బాచరింపవలయును. విశిష్టులతో యుద్ధంబొనర్చువారల కిది సనాతనం బగుధర్మంబె యొప్పుచున్నది. నీవిట్లు పదాతివై వచ్చి నమస్కరింపకుంటివేని నిన్ను శపించియుందును.

కౌరవేశ్వరా! ధైర్యంబాలంబించి యత్నుండవై పోరొనర్పుము. నీకు జయంబుమాత్రము నేనాశీర్వదింపఁజాలను. నిన్నుఁ బరాజయించుటకై కదా నేనిక్కడ సన్నద్ధుండనై యున్నవాఁడను. నీవు నిరథంబుకడ కరిగి ధర్మంబున యుద్ధం బొనర్పుము. నీచరితంబున నాకెంతయుఁ బ్రీతి జనించెనని పలికెను. అనంతరంబు నే నామహాత్మునకు నమస్కరించి సత్వరుండనై రథం బారోహించి హేమపరిష్కృతం బగు శంఖంబొత్తి మహాధ్వానంబు గావించితిని. అంతట నాకు నామహాత్మునకును బరస్పర జిగీషాప్రవృత్తం బగు మహాహవంబు బహుదినంబులు ప్రవృత్తంబయ్యె. జామదగ్న్యుం డారణంబున గంకపత్రవిభూషితంబులు నతపర్వంబులు నగునూటయఱువదిబాణంబుల నన్నుఁ దొలుత నేసెను. ఆబాణంబులచే నాగుఱ్ఱంబులు నాల్గును నాసూతుండు నేనును గప్పంబడియుంటిమి. అప్పుడు నేను దేవతలకును, బ్రాహ్మణులకును నమస్కారంబులు మనంబున నాచరించి చిఱునగవుతో నాతని కిట్లంటిని. మహాత్మా! నీవు మర్యాద నతిక్రమించి చరించు చున్నను నేను నీయెడం గలయాచార్యత్వము నెంతయు మన్నించితి. బ్రాహ్మణోత్తమా! ధర్మసంగ్రహంబున నాకుం గల సంపదను నీవు మరల నాలింపుము. నీశరీరంబున వేదంబు లున్నయవి. నీకు జన్మంబునన మహాధికంబగు బ్రాహ్మణ్యంబు సిద్ధించె. నీవు సుఘోరం బగుమహాతపం బాచరించితివి. నే నావేద బ్రాహ్మణతపంబులను బ్రహరించువాఁడను గాను. నీవు సమాశ్రయించిన క్షత్రధర్మంబును మాత్రము నేను బ్రహరింతును. జన్మంబున బ్రాహ్మణుండవయినను శస్త్రధారణంబున క్షత్రియుండగుదు. నాధనువుయొక్కవీర్యంబును నా బలంబు నిపు డాలోకింపుము. ఇదె! నీకార్ముకంబు నిశితంబు లగుభల్లంబుల ఛేదించెదను. అని పలికి నతపర్వంబు సునిశితంబు నగునొక్క భల్లంబు వింటసంధించి యాతనిధనువుకోటిని ఛేదించి యిలాతలంబునం బడ నేసితిని. మఱియు సన్నతపర్వంబు లగు కంకపత్రంబులు నూఱుల కొలదిగఁ బఱపి జామదగ్న్యునియరదంబు నావరించితిని. నాయేగసిన శరపరంపర లాతనికాయంబున నాటి వాయుసమీరితంబులై నెత్తురులు గ్రక్కుచుఁ బుసకొట్టుసర్పంబులవలె సంచరించినవి. నెత్తుట నంగంబు లెల్ల మునుంగ నాతండును క్షతంబులవలన శోణితంబు గ్రక్కుచు ధాతురసంబుల స్రవించు మేరుపర్వతంబుపోల్కిఁ జూపట్టె. వసంత ర్తువునందు

విశేషంబుగ వికసించి యెఱ్ఱనిపూగుత్తులతో నశోకద్రుమం బెట్లు విలసిల్లు నట్లు యప్పుడారాముండు విభాసిల్లె. ప్రఫుల్లంబగుకింశుకద్రుమంబు చందంబున నొడల నెత్తురుధారలొలుక నప్పుహానీయుండు వేఱొక్క శరాసనంబుపాదించి క్రోధపరవశుండై హేమపుంఖంబు లగు సునితశర శతంబుల నాపై వర్షించె. రౌద్రంబులు సర్పానిలవిషోపమంబులు నగు నానారాచంబులు నాశరీరంబుతాఁకి యనేకభంగుల మర్మంబుల భేదించె. నేనంత నవష్టంభంబుమెఱయ క్రుద్ధుండనై రాముని శతసంఖ్యాకంబు లగుశరంబుల నేసితిని. అగ్న్యర్కసంకాశంబులు నాశీవిషోపమంబులు నగు నిశితశరపరంపరలచేఁ దాడితుండయి యామహాత్ముండు సొమ్మసిల్లి మందచేతస్కుండువోలె నిశ్చేష్టుండయ్యె. అపుడు నేను గృపావిష్టుండనై శోకవ్యాకులం బగుహృదయం బవష్టంభించి యుద్ధంబును క్షత్రధర్మంబులను బెక్కుభంగుల నిందించితిని. అయ్యయో! నేను క్షత్రధర్మం బాలంబించి సుఘోరం బగుపాపకార్యంబు గావించితి. బ్రాహ్మణుండు విశేషించి గురుండు తపోనిధియు నగు నీమహాత్ముని శరంబులచే బాధించితినని నన్ను నేను నిందించికొని తరువాత నాతని నేయక మిన్నకుంటిని. అంతట పగలెల్ల జగంబులకు తాపం బాపాదించిన సహస్రాంశుఁడ స్తగిరిశిఖరం బవతరించుటయు నాటికిసమరంబు విరమింపం బడియె.

## రామశాంతనవుల ద్వితీయ యుద్ధము

అపుడు చికిత్సకుండగు నాసూతుండు నాశరీరంబుననుండియు నశ్వంబుల శరీరంబులనుండియు శల్యంబులఁ బెరికివేసి గాయంబుల కౌషధంబు లుపయోగించె. గుఱ్ఱంబులను ద్రోమి కడిగి నీరుపట్టి వాని విహ్వలభావం బపనయించినయనంతరంబు ప్రభాతంబగుడు దివాకరుం డుదయగిరిశిఖరారూఢుం డయినంతన మఱల యుద్ధంబు సమారబ్ధం బయ్యె. నేను వేగంబుగ యుద్ధభూమి కేతెంచి స్యందనంబున దంశితుండనై యుండ నాలోకించి రాముండును దనరథం బత్యంతము సజ్జంబుగావించి ప్రతాపంబున వెలుంగుచు కలని కేతెంచె. ఆమహాభాగుం డేతెంచినంతన నేను ధనుశ్శ్రేష్ఠంబు రథంబున నుంచి రథం బవతరించి యాతనికడ కరిగి యభివాదనం బాచరించి మరల నారథం

బధిరోహించి యాతనియెదుట నీతభయుండనై యుద్ధోత్సాహంబున
నిలిచి యుంటిని మఱియు నేను తీక్ష్ణాగ్రంబు లగుశరంబుల పుంఖాను
పుంఖంబులుగఁ బ్రయోగించి యాతనిపై శరవర్షంబు నిగుడింప నతం
డును నాపై శరవర్షంబు గురిసెను. జామదగ్న్యుండు క్రుద్ధుండై సుతేజి
తంబులు సుఘోరంబులు నై దీప్తాస్యంబు లగు నాశీవిషంబులువోలె
వెలుంగునుపాశంబులు నాపై నేసె. నేను నిశితంబులగుభల్లంబులు
నాతండుపఱపిన బాణంబుల నెల్ల నంతరిక్షమునంద శతసహస్రశకలంబులు
గావించితిని. అంత జామదగ్న్యుండు దివ్యంబు లగునస్త్రంబుల నాపైఁ
బ్రయోగింప నేను వానినెల్ల మధ్యేమార్గంబున బ్రత్యాహతంబులు
గావించితిని. అధికం బగుకర్మంబు గావించుతలంపున నేను దివ్యాస్త్రం
బులచే రాముని దివ్యాస్త్రంబులనెల్ల నిహతంబులు గావించితిని. ఇట్ల
స్త్రంబు లస్త్రంబులచేఁ బ్రతిహతంబులగునెడ నంతరిక్షంబున మహానా
దం బావిర్భవించె నేను వాయవ్యాస్త్రంబు రామునిపైఁ బ్రయోగింప
నాతండు వానిని గుహ్యకాస్త్రంబున బ్రతిషేధించె. నేనాగ్నేయాస్త్రం
బమ్మహాత్మునిపైఁ బ్రయోగింప నాదివ్యాస్త్రవిదుండు దానిని వారుణా
స్త్రంబున నివారించె. రాముండు నాపై ననేకదివ్యాస్త్రంబులు ప్రయో
గింప నేను వానినెల్ల నివారించితిని. రాముండును నేఁ బ్రయోగించిన
దివ్యాస్త్రంబులనెల్ల బ్రతిషేధించె. మఱియు నాతండు నాకు దక్షిణం
బుగఁ దిరిగివచ్చి మహాఘోరంబు నశనిసన్నిభంబు నగుశరంబున నా
వక్షంబు నాటనేసె. ఆప్రహారంబున నేను చైతన్యం బుడిగి రథంబునం
గూలితిని. అట్లు రథంబునం గూలి నిస్సంజ్ఞుండనై యున్న నన్ను
సూతుండు త్వరితుండై కలను దొలంగించి దూరంబుగఁ గొనిపోయెను.
రామబాణార్దితుండనై యధికగ్లాని ననుభవించుచు నిస్సంజ్ఞుండనై
యున్న నన్నాలోకించి రామునియనుచరు లగు తాపసులును నకృత
వ్రణుండును గాశిరాజాత్మజయును నత్యధికసంతోషావేశంబున నేక
లిడిరి. ఆనవ్వాడిచే లబ్ధసంజ్ఞుండనై నాసూతునితో సూతా! రాముని
కెదురుగ రథంబు పఱపుము. నే వేదన వాసి స్వస్థుండనై యున్నవాఁడ
నని నియోగించితిని. పరమశోభితంబు లగుహయంబులచే సూతుండు
నారథంబు రామునికెదురుగపఱపి నిలిపెను. అంత నేనధికసంరంభంబంది
రాముని జయింపవలయుననుతలంపున బాణవర్షంబులచే రాముని ముంచి

వేసితిని. నాజిహ్మగంబులు తన్ను సమీపింపకుండ మార్గమధ్యంబున రాముండు వానినెల్లం దుత్తుములుగావించె. నే నేసిన యొక్కొక్క బాణంబు నాతండు మూఁడేసిబాణంబుల భేదించుటయు నక్కడితాపసు లెల్లరు రామునిశరలాఘవం బెంతయుం గొనియాడిరి. నాబాణంబులెల్ల రామబాణవిచ్ఛిన్నంబులై శతసహస్రశకలంబులై నేలంబడియె. అంతట నేను మరల సుభద్రంబు కులసమ్మతంబు నగు నారాచంబున రాము నేసితిని. జామదగ్న్యుని వధించుతలంపున నే నేసినబాణంబు రామునివక్షంబున గాఢంబుం నాటుటయు నాతండు మూర్ఛితుండై నేలంబడియె. రాముం డట్లు నేల కొఱగినంత నక్కడివారలెల్లరును హాహాకారంబులు గావించిరి. సూర్యుండు గగనంబుననుండి యిలాతలంబునం బడునప్పు డెట్లు జగం బాకులం బగునట్ల యాసమయంబున లోకంబెల్ల నాకులం బయ్యె. అప్పు డాతపోధనులెల్లరును, నంబయును సముద్విగ్నమానసులై రామునికడకుఁ బరువెత్తివచ్చిరి. నేనును శోకాకులుండనై త్వరితంబుగ నాతనికడ కరిగి శీతలం బగుజలం బాసేచనంబుగావించి మందమారుతంబున వీచి యుపచరించితిని. ఆతపోధనులెల్లరు నతనిని జయాశీర్వాదంబులచే నాశ్వాసంబొనర్చిరి. అంత నించుక తెలివొంది యాజామదగ్న్యుండు విహ్వలంబుగ భీష్మా! నిలునిలువు. ఇదె యీబాణంబున నీవు నిహతుండవయితివని పలికి మహాక్రోధంబున ప్రళయానలసన్నిభం బగుకలంబుంబు శరాసనంబున సంధించి నన్ను సవ్యపార్శ్వంబునఁ బ్రహరించెను. ఆయేటువడి నేనును మూర్ఛితుండనై వాత్యాఘూర్ణితం బగు ద్రుమంబువోలె రథంబునం బడియుండ రాముండు శీఘ్రాస్త్రంబున నా హయంబులం బరిమార్చి లోమకృంతనంబు లగుబాణంబులచే నన్నునోనేసెను. అపుడు నేనను శీఘ్రాస్త్రంబు మెఱయ రామునిబాణంబుల నెల్ల నడుమన దునిమితిని. నేనును రాముండును బ్రయోగించినశరంబులు మధ్యమార్గంబున మింట నొండొంటి దాఁకి కదలక మెదలక యాకాశం బావరించియుండెను. మాయిరువురిశరజాలంబులచే నంతరిక్షం బావృతంబగుట సూర్యుండు వెలుంగఁడయ్యె. గాలియు మేఘరుద్ధంబైన మాడ్కి వీవకుండె. కొంతవడికి వాయువేగంబునను సూర్యకిరణంబుల వేఁడిమిని మే మేసినయభిఘాతంబుల ప్రభావంబునను నాబాణంబులవలన నగ్ని జనించె. అంతరిక్షమం దావిర్భవించినయగ్నిచేఁ దీప్తంబులై యా

శరంబులెల్ల నేలంగూలి భస్మీభూతంబులయ్యె. అంత రాముండు మిగుల క్రుద్ధుండై పందలు వేలు ప్రయుతంబులు నర్బుదంబులు న్యర్బుదంబులు నయుతంబులు ఖర్వంబులు విఖర్వంబులు నగుశరంబులు నాపై నతితీవ్రగతిం బఱపె. నేను వానినెల్ల నాశీవిషసమానంబు లగు నారాచంబులచే ఛిన్నభిన్నంబులఁ గావించి మధ్యమార్గంబున మొదలునఱకినతరువులం బోలెఁ బడఁద్రోసితిని. ఇట్లు మహాఘోరాహవంబు ప్రవర్తించుచున్నంత దివాకరుం డపరగిరిశిఖరంబున కరిగినంత సంధ్యాకాలంబున మరల యుద్ధంబు విరమింపంబడియె.

### భీష్మపరశురాముల మూఁడవయుద్ధము

మఱునాఁటిప్రభాతంబున మఱల రామునకును నాకును దారుణంబు రోమహర్షణంబు నగుయుద్ధంబు ప్రవృత్తంబయ్యె. అప్పుడు దివ్యాస్త్రవిదుం డగు నాశూరుండు దివ్యంబు లగు ననేకాస్త్రంబుల దినదినంబునుం బ్రయోగించుచుండెను. నేను వాని బ్రతిఘాతార్హంబు లగుదివ్యాస్త్రంబులచే రామప్రయుక్తాస్త్రంబులెల్ల నివారించితిని. దుస్త్యజంబు లగుప్రాణంబులందలి యాశ కూడ దూరీకరించి నే నాతనియస్త్రంబులనెల్ల విహతంబులుగావింప నామహాతేజస్కుండును బ్రాణంబులం దాశవీడియే సుదుష్కరం బగుతుములసమరంబు గావించె. ఆతనియస్త్రంబులెల్ల నాయస్త్రంబులచేఁ బ్రతిహతంబులగుడు మహాత్ముం డగుజామదగ్న్యుండు కాలోత్సృష్టంబు సందీప్తాగ్రంబు ప్రదీప్తోల్కాసంకాశంబు లయకాలార్కసన్నిభంబు నగు మహాశక్తిని నాపైఁ బ్రయోగించె. ఆశక్తియుఁ దేజంబున లోకంబెల్ల వ్యాపించి నాపై కరుదెంచుట చూచి వాడి యగుమూఁడమ్ములు వింటఁ దొడిగి దానిని వ్రక్కలుగావించితిని. ఆశక్తి నాచేఁ బ్రహతంబై నడుమకు మూఁడుతునుకలై నేలం బడియె. అది యట్లు ఛిన్నంబై పడుటయు నారాముండు క్రోధదీప్తుండై మరల నొక్కపరి పండ్రెండుశక్తులం బఱపె. రాజా! తేజస్విత్వంబునను లాఘవంబుపెంపునను నాపండ్రెండుశక్తులరూపంబు వర్ణింపందరంబు గాకుండె. నే శక్తుల నాలోకించి విహ్వలుండ నయ్యు లోకసంక్షయావసరంబున నుదయించుద్వాదశాదిత్యులంబోలు నాశక్తుల నానారూపంబులుగ వానిని తీవ్రం బగుబాణజాలంబున నానాదిక్కులకుం జెదరనేసి

పండ్రెండుమహాబాణంబులు వింట సంధించి యాశక్తులఁ దుత్తుమురు గావించితిని. అంత నవియు నిహతంబులగుడు జామదగ్న్యుండు హేమదండంబులు విచిత్రంబులు కాంచనపట్టనద్ధంబులు జ్వలన్మహోల్కాభంబులు నగుశక్తుల నసంఖ్యంబుగఁ బ్రయోగించె. నేను నవ్యాకులుండనై చర్మంబున వానినెల్ల నివారించి సునిశితం బగు నిస్త్రింశంబున వానినెల్ల నఱకి నేలరాల్చితిని మఱియు దివ్యంబులగుబాణంబులు కార్ముకంబున సంధించి జామదగ్న్యుని దివ్యాశ్వంబులను సూతుని నేసితిని. పన్నగంబులంబోలు రూపంబులు గల నాబాణంబులచేఁ దనశక్తులెల్ల విహతంబులగుట నాలోకించి జమదగ్నినందనుండు క్రోధావిష్టుండై హైహయాధీశ్వరప్రమాథి యగు నాతండు దివ్యంబులగునస్త్రంబులం బ్రయోగించె. ఆయస్త్రంబులవలన నారాచంబులు శలభంబులుంబోలె వినిస్సృతంబులై యుగ్రంబులై నాహయంబులను సారథిని నన్నుంగూడ ఘోరంబుగ నాటెను. నారథంబు రాముని నారాచంబులచే నెల్లయెడల నాచితంబయ్యె. సారథియు హయంబులును శరీరంబులం దణుమాత్రమే నవకాశంబులేక బాణవిద్ధులైరి. నారథంబు నొగలును చక్రంబులును నక్షంబును నాతనిబాణంబులచే నికృత్తంబులై రథంబు విఱిగిపడియె. నేనును ఆబాణవర్షంబు కొంత శాంతించినపిదపఁ గురుం డగునాతనిపై బాణంబులచేఁ బ్రతివర్షంబు గురియించితిని. ఆబ్రహ్మరాశియగుమహాత్ముండు నాచే మార్గణంబులచే విక్షతుండై నెత్తుటిధారలొలుకఁ బూచిన పలాశంబువోలె నావర్షకాలంబున ధాతురసంబు ప్రవహించుగిరివరంబు పోల్కిని గనుపట్టెను. రాముం డెపుడు బాణజాలాభితప్తుండయ్యె నపుడ నేను గాఢంబుగ సంవిద్ధుండనైతిని. అంతఁ బరమవారాశియం దజ్జబాంధవుండు గ్రుంగుటయు నాటికి యుద్ధంబు చాలింపంబడియె.

### రామభీష్ముల నాలవనాఁటి సమరము

రాజా! నాలవనాఁటిప్రభాతంబును సూర్యుండు విమలతేజంబున నుదయగిరి శిఖరచూడాచుంబియైనంత మరల రామునితో నాకు మహాదారుణం బగుయుద్ధంబు సంప్రాప్తంబయ్యె. ఆదినమునఁ బ్రహారవంతుల కగ్రగణ్యుండగు రాముండు రథంబున నతిత్వరితంబుగఁ బరిభ్రమించుచు నాపై నపరిమేయం బగు శరవర్షంబు గురిసెను. అచలంబున వర్షించు

మహామేఘంబువడువున నాతండేయు బాణపరంపరల సహింపనోపక నాసూతుండు రథంబువిడిచి పాఱి నాకపారం బగువిషాదంబు గలిగించెను. నాసూతుండు మహాభయావిష్టుండై యిలాతలంబునకు డిగ నుఱికి యక్కడ శరాఘాతంబులవలన మూర్ఛితుండయ్యె. ఆతం డట్లు కొంతవడి మూర్ఛితుండై రామబాణప్రహారంబులకుం దాళంజాలక విగతాసుండయ్యె. అంత నొక్కముహూర్తకాలము నేనును మహాభయాకులుండనై యుంటిని. సూతుండు నిహతుం డైనంత నేను మనంబు పరాకుననుండి చింతించుచున్నయెడ మృత్యుసన్నిభంబు లగు బాణంబుల నాపై రాముండు ప్రయోగించె. సూతవ్యసనంబున వ్యాకులుండగునన్ను జమదగ్నినందనుండు కార్ముకం బాకర్ణాంతము పూరించి బలిష్ఠం బగు నొక్కబాణంబున నేసె. రుధిరాశనం బగునాశరంబు నాభుజాంతరంబునం గాడిపాఱి నాతోఁగూడ నిలాతలంబునం బడియె. అంత నేను హతుండ నైతినని తలంచి పరశురాముండు హర్షపరవశంబున నుచ్చస్వరంబున గేకలిడియె. నేనట్లు పడినంత రాముండు నాతనియనుచరు లగు తాపసులును కాశిరాజకన్యయు ముదితహృదయులై మేఘగంభీరనిర్ఘోషంబుల ననుకరించుచు మహారావంబులుగావించిరి. నాపార్శ్వంబుననుండి యుద్ధంబు చూచువారై వచ్చియున్న కౌరవులు పరమం బగునార్తింబొంది దీనస్వరంబుల రోదనంబులు గావింపందొడంగిరి. నేనట్లు నేలంబడుచు నెనమండ్రుబ్రాహ్మణోత్తముల సూర్యహుతాశనాభులఁ బొడఁగాంచితిని ఆబ్రాహ్మణు లెనమండ్రును నన్ను దమబాహుదండంబులచేఁ బట్టుకొని నన్ను బరివారించి యాజిమధ్యంబున నిలిచియుండిరి. ఆవిప్రులచే మధ్యభాగంబున ధరింపఁబడినవాఁడనగుట నే నిలాతలంబునఁ బడనైతిని. ఆత్మబాంధవులంబోలు నావిప్రపుంగవు లంతరిక్షంబునన నన్నుఁ దమ బాహుదండంబులచే ధరించియుండిరి. నేను వెచ్చనూర్చుచుండ వారు నాపైఁ జల్లనిజలకణంబులుచల్లి సేదదేర్చి నన్నుఁబట్టుకొని నాతో "భయపడకుము. నీకు శుభంబుగలుగు"నని వచించిరి. అప్పు డాద్విజపుంగవుల వచనంబులచే నత్యంతము తృప్తిఁబొంది నారథంబుననున్న నాజనని మందాకినీనదినిం గాంచితిని. ఆమహానది నాహయంబులం బాఱనీక పట్టియుండె, అయ్యెడ నేను ద్వరితంబుగ నరిగి నాజననిపాదంబులఁ బరిగ్రహించి యక్కడ సాన్నిధ్యంబుగావించియున్న పితృదేవతలకు

నభివాదనం బాచరించి రథం బారోహించితి. ఆగంగాదేవి నన్ను నారథంబును దురంగంబులను బరికరంబులను రక్షించియుండె. నేను సమాశ్వస్తుండనై యంజలిఘటించి నాజనని విసర్జించితిని. అంత నేన పవనజవనంబులగు నాతురంగంబుల నియమించుచు జామదగ్న్యునితో యుద్ధం బాచరించితిని. భరతపుంగవా! అపుడు నేను మహాబలంబు మహావేగంబు హృదయచ్ఛిదంబు నగుమహాశరంబు బాణాసనమునం గూర్చి రామునిపైఁ బఱపితిని. ఆనారాచంబునఁ దాడితుండై రాముండు మోహమంది చేతిధనువు జాఱవిడచి భూమిపై మోకాళుల మ్రగ్గం బడియె. అట్లు రాముం డిలాతలంబున బడినంత జలదంబులు రుధిరంబు వర్షించుచు మింట నావరించె. అనేకంబులగునుల్కలు మింటినుండి రాలం దొడంగె. పెక్కుభంగుల నిర్ఘాతంబులు చెలంగె. సచరాచరం బగుజగంబు కంపించె. మహాదీప్తుండగుసూర్యుని పర్వంబు లేకయ స్వర్భానుండు పట్టె. పరుషంబు లగువాతంబులు వీవం దొడంగె. భూమి చలించె. గృధ్రకంకబలాకాది విహంగంబులు హృష్టంబులై యెగురం దొడంగెను. గోమాయువు దివాకరుని కభిముఖంబై భైరవంబుగ నార్చె. అతి దుస్సహస్వనంబులై భేరు లొకరు మ్రోగింపక వానియంత నవియ మ్రోగె. ఇట్టి ఘోరంబు మహాభయంకరంబు నగునుత్పాతజాతం బావిర్భవించె. అట్లు విసంజ్ఞుండై కొంతవడి ధరణీతలంబునంబడియుండి రైణుకేయుండు లేచి నా కెదురుగ నిల్చి క్రోధఘూర్ణితనేత్రుండై తాళసన్నిభం బగు మహాధనువు గ్రహించి మహాతాళసన్నిభం బగు శరంబు సంధించుచున్నంత నక్కడ నున్నమహర్షు లెల్లరును రాముని మరలించిరి. క్రోధావిష్టుండయ్యు రేణుకాత్మజుండు కృపాయుక్తు లగు తాపసులచే నివారితుండై కాలానలోపమం బగు నాశరం బుపసంహరించెను. ఆసమయంబున పాంసుపుంజావగూఢుండై యపరసాగరంబున స్నానంబుసేయ నరుగుమాడ్కి భానుండు చరమదిశావలగ్నుండగుటయు సుఖశీతమారుతం బగునిశ ప్రవర్తించె. అంత నాఁటికి మాయుద్ధంబు విరమింపఁబడియె. మరలఁ బ్రభాతంబునఁ యుద్ధం బారంభింపంబడియె. రాజా! ఈరీతిగా దినం బెల్ల యుద్ధంబుగావించుటయు రాత్రులందు సమరంబు మానుటయుఁ గావించుచుండ నిరువదిమూఁడుదినంబులు సుఘోరం బగు పోరు నాకును జమదగ్నినందనునకుం బ్రవర్తిల్లె.

### వసువులు భీష్మునకు స్వప్నంబున దైర్యంబు గఱపుట

రాజా! అంత నిఱువదిమూఁడవనాఁటి రేయి నిశీథసమయంబున నేను శయనంబుననుండి బ్రాహ్మణులకును, దేవతలకును బితరులకును, నక్తంచరంబు లగు భూతంబులకును, రాజర్షులకును నమస్కారంబు లొనర్చి మనంబున నిట్లు చింతించితిని. "కటకటా! నాకు జమదగ్ని నందనునితోఁ బరమదారుణంబగుయుద్ధంబు సంభవించి యున్నది. నేఁటి కిఱువదిమూఁడుదివసంబు లతిక్రమించినను సమరంబు తుదముట్టదయ్యె. మహావీర్యుండు మహాబలుండు విప్రప్రవరుండు నగు జామదగ్న్యుని రణంబున జయింపంజాలకున్నాఁడను. జామదగ్న్యుండు నాచే జయింపంబడునే నీరాత్రి దైవతంబులు ప్రసన్నంబులై నాకు గోచరంబు లగుఁగాక." అని యాలోచించి నిద్రించినంతన మున్ను నేను రామశరార్దితుండనై యిలాతలంబునం బడుచుండ నన్ను బాహుదండంబులచే ధరించి సమాశ్వాసించినవిప్రోత్తము లెనమండ్రును నాకు స్వప్నంబునఁ బ్రత్యక్షంబై నన్నుఁ బరివారించి యమృతోపమానంబు లగువచనంబుల నిట్లని వచించిరి. గాంగేయా! లెమ్ము లెమ్ము. నీవు భయమందకుము. నీ కేబాధలు లేకుండ మేము నిన్ను రక్షింతుము. నీవు మాకు శరీరంబవై యున్నాఁడవు. జమదగ్నిసూనుండగు రాముండు నిన్నెట్లును రణంబున జయింపంజాలఁడు. నీవ సమరంబున నాతనిని బరాజితుం గావింతువు. ఇదియే పరమభాస్వరం బగునస్త్రంబు. నీకు జ్ఞాపకంబు సేయుచున్నవారము. పూర్వదేహంబున నీకీయస్త్రంబు విదితంబై యుండెను. ప్రాజాపత్యంబు విశ్వకృతంబు నగు ప్రస్వాపనం బనునస్త్రంబు ననుస్మరింపుము. దీనిని రాముండుగాని పృథివీతలంబునంగల యితరపురుషుం డెవ్వండుకాని యెఱుంగఁడు. దానిని స్మరించి ధనువున యోజింపుము. నీవు స్మరించినమాత్రంబున నాయస్త్రంబు నీకు సన్నిధి గావించును. దానిచే మహావీర్యవంతు లగువారలనెల్ల శాసింపంగలవు. కౌరవ! ఆ యస్త్రంబున రాముండు క్షయంబొందఁడు. ఆతండు నిద్రాసంయోగంబు మాత్ర మందును. నీబాణంబున బలంబున బీడితుండై యాతఁ డొడలెఱుంగక నిద్రించును. అనంతరం బాతనిఁ బరాజయించి యస్త్రం బుపసంహరించి నీవ యాతని మేల్కొల్పుదువుగాక. కావున నీవాయస్త్రం

బనుస్మరించి విజయంబు గనుము. కౌరవ్య! ప్రభాతంబున యుద్ధంబు సమారబ్ధంబయినంతన నీవు మాచెప్పినరీతిని గావింపుము. ప్రసుప్తుండును మృతుండును సమానులే యని లోకం బంగీకరించును. అంతియ కాని రాముం డెన్నండును మృతిఁబొందఁదగఁడు. కావున నాతనియందీప్రస్వాపనంబ ప్రయోగించి విజయంబు వడయుము. అని పలికి సమానరూపతారుణ్యాకారశోభితులును భాసురమూర్తులు నగు బ్రాహ్మణులంతర్ధానంబొందిరి.

### రామభీష్ముల యిరువదినాలవనాఁటియుద్ధము

ఆరాత్రి గతించి ప్రభాతంబగుటయు. నేను మేల్కాంచి రాత్రి కలిగినస్వప్నంబు తలంచికొని యుత్తమం బగుహర్షంబు నొందితిని. ఆదినంబున నుభయంబునన యుద్ధంబు మరలఁ బ్రవృత్తంబయ్యె. తుములంబును సర్వభూతభయంకరంబును రోమహర్షణంబు నగు నాసమరంబున భార్గవుండు నాపై బాణవర్షంబు గురియించె. మహాతపస్వి యగు నామహావీరుండు తొలుతటిదినంబున నాకావించినవిక్రమంబునకుం గోపించి నాపై నింద్రాశనిసమస్పర్శంబును యమదండసమప్రభంబును నాలుకలు గ్రోయునగ్నివలె దేదీప్యమానంబును నగుశక్తినిం బ్రయోగించె. భరతపుంగవా! ఆశక్తి దుర్నిరీక్ష్యంబై వచ్చి నాజత్రుదేశంబున నాటెను. ఆప్రహారంబువలన గిరివరంబు గైరికధాతురసంబు స్రవించు మాడ్కి నేను నెత్తురొలికితిని. నేనును క్రోధపర్యాకులుండనై మృత్యుసంకాశంబు నాశీవిషోపమానంబు నగుశరంబు రామునిపై నేసితిని. ఆవీరుం డాశరవరంబున లలాటంబున విద్ధుండై శృంగంబుతోఁగూడిన పర్వతంబుమాడ్కి వెలింగె. అంత నాతండు ద్విగుణీకృతక్రోధుండై ఘోరంబు శత్రునిబర్హణంబును గాలాంతకోపమంబు నగుబాణంబు సంధించి నాపై నేసెను. బుసకొట్టువ్యాళంబుభంగి మహోగ్రం బగు నాశరంబు నాయురంబున గాఢంబుగ నాటుటయు నేను రుధిరావిలుండనై నేలకొరగితిని. అట్లు కొంతవడి నిశ్చేష్టుండనై యుండి తెలిసి యశనివలె జ్వలించుమహాశక్తి నాతనిపైఁ బఱపితిని. ఆశక్తియు ద్విజముఖ్యుం డగు నాతనిభుజాంతరంబున నాటెనంత రాముండు విహ్వలుండయ్యె. అతండు మిగుల వడంకెను. అప్పు డాతనిచెలికాఁడు విప్ర

త్తముం డకృతవ్రణుండు రాముని గాఢంబుగఁ బరిష్వజించికొని శుభంబు లగువచనంబుల నేద దేర్చెను. అట్లు సమాశ్వాసమొంది రాముండు మహాక్రోధంబున నన్ను సంహరించుతలంపునఁ బరమంబు మహోప్రతంబు నగుబ్రహ్మాస్త్రంబు శరాసనంబున సంధించి యేసె. నేను నాయస్త్రంబు ప్రతిహతింబుగావించుతలంపున బ్రహ్మాస్త్రంబు ప్రయోగించితిని. ఆ యస్త్రంబులు రెండును యుగాంతాగ్నిసన్నిభంబులై వెలుంగుచు మార్గ మధ్యంబున నొండొంటిందాఁకి నన్నును రాముని సమీపింపంజాలక యంతరిక్షంబున వెలుంగుచుండె. ఆయస్త్రంబులు రెండు నట్లు వెలుంగు చుండ జగంబులెల్లఁ గేవలతేజోమయంబులై చూపట్టె. సకలభూతం బులు నాయస్త్రంబులం గాంచి భయత్రస్తంబులయ్యె. అస్త్రతేజోనిపీడి తులై దేవతలు దానవులు యక్షులు గంధర్వగరుడకిన్నరకింపురుషులు బ్రహ్మర్షులు రాజర్షులును మహాసంతాపంబొందిరి. పృథివీతలంబు పర్వత వననదీనదసముద్రంబులతోఁ గూడఁ గంపించె. భూతంబులెల్ల మితిలేని సంతాపమొంది యత్యధికంబుగ విషణ్ణంబులయ్యె. దశదిశలును బొగ లెగయించుచుండె. నభంబు ప్రజ్వలించె. ఆకాశచారు లెల్లరు నాకాశ మున నిలువంజాలరైరి. దేవాసురరాక్షసులతోడం గూడినలోకంబెల్ల హాహాకారంబులు గావించుచుండ, అదియ ప్రస్వాపనాస్త్రంబు ప్రయో గింపందగునదనని తలంచి, బ్రహ్మవాదు లగువిప్రులవచనంబు లనుసరించి యాయస్త్రంబును స్మరించినంత నాయస్త్రంబు నామనంబున ప్రతిభాసితం బయ్యె.

రామశాంతరవకరుద్ధోపసంహారము

నేనట్లు ప్రస్వాపనాస్త్రంబు ప్రయోగింపందలంచినంతన యంత రిక్షంబున హాలహాలాశబ్దంబు ప్రాదుర్భవించె ఆకసంబునుండి భీష్మ! ప్రస్వా పాస్త్రంబు ప్రయోగింపవలదు వలదుడుగు మనుశబ్దంబులు మిన్నుముట్టె. నేనా రామునియం దాయస్త్రంబు ప్రయోగింప బాణంబున సంధించియే యుంటిని. నేను వింటసంధించి రామునిపై నేయునంతలో నాకట్టెదుట నారదుండు ప్రత్యక్షంబై కౌరవ్య! వీరె యంతరిక్షంబున దేవగణం బులు నిలిచియున్నవారు. ప్రస్వాపంబు ప్రయోగింపవలదని వారెల్ల రును నిన్ను నివారించుచున్నవారు. రాముండధికతపస్వి. బ్రహ్మణ్యుండు

బ్రాహ్మణుండు విశేషించి నీకాచార్యుండునై యున్నవాఁడు. అట్టిమహాత్మునకు నీ వెన్నండు నేవిధంబునను నవమానంబు గావింపంజనదు. అనునంతన బ్రహ్మాదులగు నాబ్రాహ్మణు లెనమండ్రును దివిష్ఠులై నాకు సన్నిధి నేసిరి. వారును జెలునగవు మొగంబుల నంకురింప మెల్లన, భరతశ్రేష్ఠా! నారదుం డెట్లు వచించె నట్లు గావింపుము. ఆప్రస్వాపనమహాస్త్రంబుపసంహరింపుము. నీవిట్లు గావించుట లోకంబులకెల్ల పరమహితం బని వచించిరి. నేను నారదుండు నావిప్రులును వచించినవచనంబు లాలించి ప్రస్వాపనంబు నుపసంహరించితిని. రాముండును యథాశాస్త్రంబుగ బ్రహ్మాస్త్రంబు ప్రయోగించియు నయ్యది నాయస్త్రంబుచే ప్రతిషిద్ధంబై యకించిత్కరం బగుటయు నాతండు తనబ్రహ్మాస్త్రం బుపసంహరించికొనియె. మఱియు నాయస్త్రంబున దనయస్త్రంబు వినివర్తితం బగుటచూచి రోషావిష్టుండై తొందరపాటుతో మందబుద్ధినగు నేను భీష్మునిచే నిర్జింపం బడితి ననియె. అపుడు జామదగ్న్యునికడ కాతనిపితామహుండును బ్రపితామహుండును జనకుండు నేతెంచి యాతనిబరివారించి సాంత్వపూర్వంబున నాతని కిట్టులనిరి. వత్సా! మరల నింక నెన్నండు నిట్టి సాహసంబు గావింపకుఁడు. నీశిష్యుండును విశేషించి క్షత్రియుండు నగుభీష్మునితో నింక నెన్నండును యుద్ధంబు గావింపందలంపకుము. భృగునందనా! యుద్ధంబు క్షత్రియునకుఁ బరమధర్మంబై యొప్పును. స్వాధ్యాయంబును వ్రతాచరణంబును బ్రాహ్మణున కుత్తమధనంబులు. తొల్లి మే మొక్కనిమిత్తంబున నీయర్థంబు నీకు తెలిపియేయుంటిమి. ఐనను నీవుమాచెప్పిన చొప్పున గావింపవైతివి. అత్యుగ్రం బగుశస్త్రధారణంబు నీవు మానవైతివి. వత్సా! భీష్మునితోడిసమరం బింతకుఁ బర్యాప్తంబైనది. నీవింక వియుర్ధంబు విరమించి నీయిచ్ఛవచ్చిన తెఱంగున నరుగుము. నీవు కార్ముకంబు ధరించుటయుఁ బర్యాప్తంబైనది. దుర్ధర్ష! యింక నీధనువు విసర్జించి తపంబుగావింపుము. శంతనునందనుం డగుభీష్ముని దేవతలెల్లరును మరలింప నాతండు మరలియున్నవాఁడు. రణంబు విరమింపుమని దేవతలెల్లరు నాతనికి బోధించి ప్రసన్నునిం గావించిరి. దేవతలెల్లరును నీగురువగు రామునితో యుద్ధంబొనర్పఁజెల్లదని పెక్కుభంగుల నన్ను వారించిరి. నీవు రాముని రణంబున జయించుట న్యాయ్యంబు గాదనిరి. గాంగేయా! బ్రాహ్మణుం డగురామునకు యుద్ధంబున

మానంబు నిలుపుమని వేడిరి. వారివచనంబులవలన నాతండు సమర వ్యాపారంబు విరమించియున్నవాఁడు. మేము నీకు గురువులము కావున నిన్ను నివారించువారము. పుత్ర! భీష్ముండు వసువులలో నొక్కరుండు కాని కేవల మానవుండు కాఁడు. అదృష్టవశంబున నాతనిచే జిక్కి నీవు జీవించియుంటివి. గంగాశంతనులకు జనించిన యీభీష్ముండు వసువైయున్నవాఁడు. అట్టివానిని నీవెట్లు జయింపంగల్గుదువు? భార్గవా! ఇంక యుద్ధకథ విడిచి మరలుము. పురందరసముండును బలవంతుండు నగుపాండునందనుండర్జునుండు కాలంబాసన్నంబగుడు భీష్మునకు మృత్యువుగా విధాతచే నిర్దేశింపంబడినవాఁడు. కావున నీవు మావచనంబు లాదరించి యుద్ధంబు విరమింపుమని పలికిరి. పితరు లిట్లు వచించుటయు రాముండు వారల కిట్లనియె. పూజ్యులారా! నేనెన్నండును యుద్ధంబు విడిచి మరలనని వ్రతం బూనియుంటిని. ముందుగా నాపగానందనుండు యుద్ధంబువలన మరలుఁగాక. ఆతం డుపష్టంభంబున నిలిచియుండునంత వఱకు నేనెట్లు నీయుద్ధంబు విడుతుననిరియె. అంత ఋచీకప్రముఖు లగు జామదగ్న్యుని పితరులును దక్కుం గలమునులును నారదునితోఁడం గూడి నాకడ కరుదెంచి నాతోఁడ నిట్లనిరి. నాజనని యగుభాగీరథియు రణమధ్యంబుననున్న నాకడ కేతెంచె. నేను నట్లె బాణంబు ధరించి శరాసనంబున శరంబు సంధించి యట్ల యుంటిని. అట్టి నాకడకు వార లెల్లరును వచ్చి, వత్సా! రణంబు విరమింపుము. బ్రాహ్మణునకు సమ్మానం బాచరింపుము. అని వారు పలికినంతన నేనును క్షత్రధర్మం బపేక్షించి వారితో పూజ్యులారా! నేను యుద్ధంబునకు విముఖుండనై శరంబులచే బృష్ఠంబున దాడితుండ నగుచు నెన్నండును నరుగ నని నాకు వ్రతంబుగలదు. భయంబుననేని, లోభంబుననేని, యర్థకామంబుననైని, కార్పణ్యంబుననేని శాశ్వతం బగుక్షత్రధర్మంబు నేను విడువంజాలను. ఇది నామతి నిశ్చయం బని యెఱుంగుఁడని వచించితిని. అంత నాదివ్యమునులును నాజననిభాగీరథియు రణమధ్యంబున కరిగిరి. నేను శరశరాసనంబులధరించి యుద్ధంబొనర్పదృఢనిశ్చయుండనై యకంప్యుండనై యట్ల నిలిచియుంటిని. వారలందరు నపుడు రామునికడకరిగి యాతనితో నిట్లని పలికిరి. భార్గవా! విపులహృదయంబు నవనీతంబువోలె మృదులాతిమృదులంబై యొప్పునుగదా! కావున విప్రుండవగు నీవు శాంతింపుము. ద్విజోత్త

ముండవగు రామ! నీవీయుద్ధం బుడుగుము. నీచే భీష్ముండును నాతనిచే నీవునుంగూడ వధ్యులవుగారు. కావున మీరిరువురును రణంబు విరమింపుం డని వారలెల్ల రణాంగణంబు ప్రతిరోధించి భృగునందనునిచే శస్త్ర న్యాసంబు గావింపించిరి. అనంతరం బా బ్రహ్మవాదు లెనమండ్రు నెని మిదిగ్రహంబులతో ప్రజ్వలించుచు నాకడకు మరల నేతెంచి ప్రణయ యుక్తంబుగ నాకిట్లు వచించిరి. మహాబాహూ! నీవింక సమరంబు విడు వుము. నీవు గురుండగు రామునికడ కరిగి యాతని సంభావింపుము. అని వారు పలికినంత నేనును రాముండు సమరంబుచాలించు టాలో కించి సుహృద్వాక్యంబు లాదరించి లోకంబులకు హితంబు సేయం దలం పుగొని యాబ్రాహ్మణోత్తములవచనంబు గ్రహించితిని. అత్యంతవిక్ష తుండనగు నేను రామునికడ కరిగి యాతనిపాదముల కభివాదనం బాచరించితిని. రాముండును చిఱునవ్వు మొగంబున మొలకలెత్త నాతో నిట్లనియె. వత్సా! నీతో సమానుం డగుక్షత్రియుం డీపృథివీ తలంబున లేడు. ఈయుద్ధంబున నీయెడ నేనెంతయు సంతుష్టుండ నైతిని. నీవు నీయిచ్చవచ్చిన తెఱంగున నరుగుము. అని వచించి నేను జూచుచుండఁగనే యాకాశిరాజదుహితనుబిలచి మహాత్ములగునామహర్ష లెల్లరమధ్యంబున దీనం బగువచనంబున దాని కిట్లనియె.

### అంబ ఘోరతపంబొనర్చి నదియై ప్రవహించుట

భామినీ! నేను బరమం బగుపౌరుషం బాలంబించి శక్తికొలఁదిగ యుద్ధంబుగావించుట యెల్లలోకంబులకును ప్రత్యక్షవిషయంబకదా? ఉత్తమంబు లగుదివ్యాస్త్రంబులఁ బ్రయోగించియు నీభీష్ముని జయించు టకు నేను సమర్థుండఁగానైతిని. నాకుంగలపరమం బగుశక్తి యిదియ. ఇదియ నాపరమబలంబు. భద్రా! యింక నీవు నీయిచ్చవచ్చిన తెఱువునం జనుము. ఇంక నీకు నేను గావింపవలయునర్థం బేమికలదు? నీవు భీష్ముని కడ కరిగి యాతనినే శరణుపొందుము. ఆతనికంటె నీకు వేఱుగతి కానరాదు. భీష్ముండు మహాస్త్రంబులఁ బ్రయోగించి నన్ను నిర్జించిన వాఁడు. అని పలికి మహామనస్వి యగురాముండు దీర్ఘంబగునిట్టూర్పు విడిచి మిన్నకుండెను. అపు డాకన్యక భృగునందనున కిట్లనియె. భగ వంతుండా! నీవు వచించినదెల్ల నిక్కంబ. ఉదారధీమంతుండగు నీ

శాంతనవుండు దేవతలకును నజేయుండు. శక్తిననుసరించియు యుత్సాహంబు పాటించియు నాకార్యంబునకై నీవు ప్రయత్నించితివి. అయినను దుదకు భీష్ముని జయింపఁ దరంబుగాదయ్యె. నే నీభీష్ము నెవ్వండును శరణుపొందను. సమరంబున భీష్ము నెక్కడకరిగి వధింప గల్గుదునో యక్కడకే నేనే నరిగెదను, అని వచించి రోషపర్యాకులాక్షియై యాకన్య తపశ్చరణంబున ధృతసంకల్పయై నావధోపాయంబు చింతించుచు వెడలి పోయెను. అనంతరం బాపరశురాముండు నన్నుఁ బామంత్రించి యామునులెల్లరతోడంగూడి మహేంద్రగిరీంద్రంబున కరిగె. పిదప నేను బ్రాహ్మణులు స్తుతించి యాశీర్వదించుచుండ రథం బారోహించి నగరంబునకేతెంచి మాత యగు సత్యవతి కీయుదంత మెల్ల నెఱింగించితిని. నేను జెప్పినదెల్ల నాకర్ణించి యాసత్యవతి నన్ను మిగుల గారవించె. నేను నాకన్య దినదినంబు నేయేకార్యంబు లాచరించునో యెక్కడ కరుగునో యేమేమివచించునో యేయేచేష్టలు కావించునో యరసి తెలుపఁ గొందఱుపురుషుల నియమించితిని. నాచే నియుక్తు లగుపురుషులు నాకుఁ బ్రియహితంబు లాచరింప సమకట్టినవారై యాకన్యావృత్తాంత మెప్పటి కప్పుడ నాకుఁ దెలుపుచుండిరి. ఆకన్య యెప్పుడు తపంబునకు నిశ్చయించి వెడలెనో యప్పుడ వ్యథితుండనై దీనుండుబోలె గతసత్త్వుండనుంబోలె నుంటిని. క్షత్త్రియుం డెవ్వండును నన్ను యుద్ధంబున వీర్యంబున జయింపలేదు. తపంబున సంశ్రితవ్రతుండు బ్రహ్మవిదుండు నగు రాముఁడు మాత్రము నాతో సమంబుగ నధికంబుగ గూడ సమరంబు గావించి యున్నవాఁడు. రాజా! నే నీవృత్తాంతంబెల్ల నారదునకును, వ్యాసులకును నివేదింప వారలిరువురును నన్నుద్దేశించి, భీష్మ! కాశిరాజతనయను ద్దేశించి నీవింతగ విషాదమనుభవింపవలసినపనిలేదు. దైవంబును బౌరుషంబున నెవ్వండును మరలింపంజాలఁడుకదా యని సమాశ్వాసవచనంబులు వచించిరి.

వత్స! ఆకన్య యట్లు యమునాతీరంబున నున్న ఋష్యాశ్రమంబుల కరిగె. యట ఘోరంబుగ తపంబొనరించెను. ఆహారంబు వర్జించి శరీరంబు కృశింపంజేసి రూక్షయు, జటిలయు, మలపంకధారిణియునై యాఱుమాసంబులు వాయుమాత్రాహారయై స్థాణుభూతయయి తపం బాచరించె. యమునాజలంబులందు నాకంఠప్రవిష్టయై నిరాహారంబుగ

నొక్కసంవత్సరం బుపవాసం బొనరించెను. సాగ్రం బగుసంవత్సరం బుపవసించి యంతంబున వృక్షంబువలన శీర్ణంబయిన యొక్కపర్ణంబు మాత్రము భక్షించి మరల నొక్కసంవత్సరంబు తీవ్రకోపంబున బాదాంగుష్ఠంబున నిలిచి ఘోరంబుగఁ దపంబొనరించె. ఈచందంబున నాకన్య పండ్రెండువత్సరంబులు భూమ్యంతరిక్షంబులఁ దపింపఁజేయుచు దుశ్చరంబగుతపంబు గావించె. బంధువు లెందరెన్నిభంగులనివారించినను నాకన్య తపంబు విడువదయ్యె. అంతఁ గొంతకాలంబున కాకాశిరాజ దుహిత సిద్ధచారణసేవితంబును బరమపవిత్రంబు నగు వత్సభూమి కరిగి పుణ్యశీలురు, మహాత్ములు నగుతాపసులయాశ్రమంబుల కరిగి యచ్చ టచ్చటఁ బుణ్యంబు లగుతీర్థంబులందు రాత్రింబవలు స్నానం బాచరిం చుచుఁ దనయిచ్ఛవచ్చినచందంబున సంచరించుచుండె. మహారాజ! నందాశ్రమంబు చ్యవనాశ్రమంబు బ్రహ్మస్థానంబు ప్రయాగంబు దేవ యజనంబు దేవారణ్యంబులు భోగవతి రామహ్రదంబు పైలగర్గాశ్ర మంబు మొదలగుపుణ్యాశ్రమంబులఁ జరించుచుఁ బుణ్యతీర్థంబులందు స్నానంబు లాచరించె. దుష్కరం బగువ్రతం బాశ్రయించి జలంబున గ్రుంకులిడు నాకన్యం గాంచి నాజనని యగుభాగీరథి యాకన్యతో భద్రా! నీవేప్రయోజనం బుద్దేశించి యిట్లు క్లేశంబు లనుభవించు చున్నదానవో వచింపుమని పలికెను. ఆవచనంబు లాలించి యాకన్య నా జనని కిట్లని ప్రతివచనం బొసంగె. చారులోచనా! లోకైకధనుర్ధ రుండని ప్రఖ్యాతిఁగన్న పరశురాముండు నానిమిత్తంబుగ భీష్మునితో సమరంబుగావించి యాతనిచేఁ బరాజితుండైనవాఁడు. అట్టియెడ దురా ధర్షుం డగు నాశాంతనవు నేపురుషుండు జయింప నుత్సహించును? నేన యాభీష్ముని స్వయముగ సంహరింపందలంచి దారుణంబగుతపంబుగావించు చున్నదానను నే నాభీష్ము నెట్లు వధింపఁగల్గుదునో యట్లు వ్రతంబూని యీయిలాతలంబెల్లఁ గ్రుమ్మరుచున్నదానను. ఇదియ నాకావించిన వ్రతంబులకు ఫలంబు. ఈవరంబు నాకొసంగుమని ప్రాంజలియై ప్రార్థిం చెను. ఆమాటలాలించి గంగాదేవి, కల్యాణీ! నీవు స్త్రీజనవిరుద్ధంబుగ కుటిలగామినివై చరించుచున్నదానవు. అనవద్యాంగి! యబల వగు నీ కీకామం బెవ్విధంబునను లభింపదు. కాశిరాజసుతా! నీవు భీష్ముని సంహరింపం దలంచి వ్రతంబుగావించుచున్నదానవుకదా? నీ వీవ్రతం

బాచరించుచునే శరీరంబు విడిచితివేని కుటిలంబు శుభంబు నగునదివై జన్మింతువు. దుస్తీర్థయు వర్షకాలమాత్రపూర్ణయు నగునదివై నీవవత రింతువు. ఒక్కనాలుగుమాసంబులుమాత్రము నీయందుజలంబు పూర్ణం బుగానుండును. మిగిలినయెనిమిదిమాసంబులందు నీయునికి నెవ్వరునెఱుం గంజాలకుందురు. నీయందు భయంకరంబులగు మొసళులుండి సర్వభూతం బులకును భయంబుత్పాదించును. అని యిట్లు కాశికన్యకు వచించి మందా కిని మరలి చనియె. నాజనని యాశ్చర్యావిష్టురాలై చనినయనంతరం బాకన్య యొకపు డెనిమిదినెలలకు నొకప్పుడు పదిమాసంబులకును నుదకపారణంబుగాపించి తపంబాచరించెడి. ఒకప్పు డాయుదకంబునేని ద్రావకయే తపంబాచరించెను. ఇట్లాకన్య పావనతీర్థలోభంబున నావత్స దేశంబెల్లెడలఁ జరించుచు నొకానొకసమయంబున బుణ్యతీర్థాభిలాషచేఁ బరువెత్తుచు మార్గంబునఁ బడిపోయి మత్స్యభూమియందు శరీరంబు సగ భాగంబు విడిచెను. అవిశీర్ణమైపడిన దేహార్ధభాగంబు వత్సభూములం దంబయని పేరుగలదియై ప్రవర్తించి యిప్పుడు మహాకీర్తినొందుచుండె. ఆ యంబానది వర్షకాలంబున బహూదకయు దుస్తరయుఁ గుటిలయు మహాగ్రాహావలియునై ప్రవహించుచుండును. మహాతపం బాచరించిన యాకన్య దేహార్ధంబున నదియు దేహార్ధంబున కన్యయునై విల సిల్లెను.

→ అంబ యగ్నిప్రవేశంబు గావించుట ←

తపంబున దృఢనిశ్చయు లగుతాపసులెల్లరు నాకన్య నాలోకించి దానిని మఱలించువారై యేకార్యంబునకై యిట్లు క్లేశంబు లనుభవిం చుచు చరించుచున్నదానవని యడిగిరి. ఆకన్యయుఁ దపోవృద్ధు లగు ఋషుల కిట్లని బదులుసెప్పెను. మహాత్ములారా! భీష్ముండు నాకు నికా రంబుగావించినాఁడు. నన్ను నిరాకరించి పతిధర్మంబువలన నన్నుఁ బాపి నాఁడు. నే నాభీష్ముని వధించుటకై యే తపంబొనరించుచున్నదానను. ఉత్తమలోకప్రాప్తికై నేను దపంబు సేయలేదు. భీష్ముని వధించి యనం తరము శాంతి నధిగమింపవలయునని నానిశ్చయంబు. అతనివలననే యీ దుఃఖవసతి నధిగమించితిని. నేను బతిలోకంబున కెడసియుంటిని. నేను స్త్రీనిగాని పురుషుండనుగాని కాకున్నాను, తపోధనులారా! యుద్ధం

బున గాంగేయుని సంహరింపకయే మరలఁజాలను. ఇప్పుడు నేను జెప్పిన
యదియ నామనంబునంగలసంకల్పము. స్త్రీజన్మంబునందు నాకెంతయు
నేవగింత జనించినది. పురుషజన్మంబున నాదరంబు జనించినది. నేనెట్లైనను
భీష్మునకుఁ బ్రతిక్రియ గావింపం దలంచియున్నదానను. నన్ను మీరు
నివారింపవలదు. అనిపలికి మరల ఘోరం బగుతపం బొనరించె. అంత
గొంతకాలంబునకుఁ జరాచరగురుండు కరుణాకరుండు నగుశంకరుం
డాకన్యతపంబునకు మెచ్చి శూలపాణియు నుమార్ధదేహుండును నై
తపస్విజనంబులమధ్యంబుననున్న యాకన్యకు సాక్షాత్కరించె. ఎదుటఁ
బ్రత్యక్షంబైయున్న యుమానాథునకు సాష్టాంగదండప్రణామంబు
లాచరించి కరయుగంబు మొగిడ్చి శిరంబున ఘటించి వినయవినమితోత్త
మాంగియై నిలిచియున్న యాకన్యకు శివుండు ప్రసన్నుండై బాలా! నీ
కోరినవరం బొసంగెద వేఁడుమనుటయు నది దేవా! నీవు నాయెడం
బ్రసన్నుండవైతేని, భీష్ముని జయించున ట్లనుగ్రహింపవే యని ప్రార్థించు
టయు నమ్మహాదేవుం డట నీచే భీష్ముండు పరాజితుం డగునని వచించె.
అంత నంబ "దేవాదిదేవా! నే నాఁడుదానను. విశేషించి యబలను
గదా? నేను భీష్ము నెట్లు జయింపంగల్గుదునని యడిగెను. మఱియు
దేవా స్త్రీభావంబునం జేసి నామనం బత్యధికశాంతంబైయున్నయది.
నీవన్ననో యుద్ధంబున వీరాధివీరుం డగు శాంతనవుని జయించునట్లు
వరం బొసంగితివి. ఈ రెండర్థంబులును బరస్పరవిరుద్ధంబులైయున్నవి. ఇవి
యెట్లు పొసంగును! అని సంశయించుచున్నదానను. మఱియు దేవా!
నీవొసంగినవరం బసత్యంబుగాకుండునట్లును భీష్ముని నేను దప్పక పరా
జయించునట్లును వర మనుగ్రహింపవే యని వేఁడుటయు నాకన్యకు
వృషధ్వజుం డిట్లనియె. భద్రా! నేనానతిచ్చినవాక్యంబు సత్యంబై చెల్లునే
కాని యెన్నండు నసత్యంబు గానేరదు. నీవు తప్పక భీష్ముని యుద్ధం
బున వధించెదవు. నీకుఁ బురుషత్వంబును చేకూరును. దేహాంతరం
బొందినయనంతరంబుకూడ నిదియెల్ల స్మరించుచునే యుందువు. ద్రుప
దునికులంబున మహారథుండవై జనింపంగలవు. శీఘ్రాస్త్రుండవును, చిత్ర
యోధియు నగుదువు కల్యాణీ! నేను జెప్పినదెల్లఁ జెప్పినట్లు జరిగి
తీఱును. నీవు తొలుత కన్యవై జనించి యనంతరము కొంతకాలంబు
నకుఁ బుంస్త్వమ్ము నొందుదువని వచించి వృషధ్వజుం డగు మహాదేవుం

డానును లెల్ల నాలోకించుచుండ నక్కడనఁ దిరోహితుండయ్యె. ఆ
కన్యయు నామునులెల్లఁగను నాలోకించుచుండ నావనంబుననుండి కాష్ఠంబు
లేఱితెచ్చి విశాలంబగుచితిఁనేర్పఱిచి యందగ్నిరగుల్కొలిపి ప్రజ్వలించు
చున్నహుతాశనునకుఁ బ్రదక్షిణనమస్కారంబు లాచరించి రోషదీప్తం
బగుమనంబుతో యమునానది కభిముఖంబుగ భీష్మునివధించుటకై నే
ననలంబుఁ బ్రవేశించుచున్నదానననివచించి యగ్నిం బ్రవేశించె.

### అంబ ద్రుపదునింట శిఖండి యను పేర జనించుట

అని యిట్లు భీష్ముండు వచించినంతన సుయోధనుండు పితా
మహా! శిఖండి తొలుతఁ గన్యయై జనించి యనంతరంబు పురుషుం
డెట్లయ్యె? నావృత్తాంతం బెఱింగింపుమని యడుగుటయు నాతం డిట్లు
వచింపందొడంగె. వత్సా! ఆద్రుపదునకుఁ బ్రియతమ యగుభార్య పట్ట
మహిషి పుత్రరహితయై యుండెను. ఈసమయంబున ద్రుపదమహీజాని
సంతానార్థియై శంకరునిగూర్చి ఘోరంబగుతపం బొనర్చి యమ్మహాదేవునిఁ
బ్రసన్నునింగావించుకొనియె. ఆద్రుపదుండును నావలన నపజయంబంది
నాయెడఁ గోపించినవాఁడై నన్ను వధించుటకై మహాదేవ నాకు కన్య
గాకుండఁ బురుషుఁడే జన్మించుఁగాక యని ప్రార్థించుచుఁ దపం బొనరించె.
మహాదేవుండు ప్రసన్నుండై సాక్షాత్కరించి వరంబు వేఁడుమనుటయు
నాతండు దేవా! భీష్ముని వధించుపాంటెఁ బుత్రు నభిలషింతునని ప్రార్థిం
చెను. అంత శంకరుండు రాజా! నీకు స్త్రీపురుషుఁడు జనించును. నీవింకఁ
బ్రీతుండవై తపంబు చాలించి యింటికరుగుము. నామాట యన్యవిధం
బున గానోపదనియె. ఆద్రుపదుండు నగరంబున కరిగి భార్యతో దేవీ!
మహాయత్నం బొనరించి శంకరుప్రసాదంబు వడసితిని. తొలుత మనకు
కన్యజనించి యనంతరము పురుషుండగునని యాదేవదేవుం డానతిచ్చిన
వాఁడు. నేను మఱిమఱి ప్రార్థింప నాతండు తనవాక్యం బన్యథాకరింప
వలనుగాదని పలికెను. ఆతనివచనం బెన్నండు నసత్యంబు గాదుకదా!
అది యట్లేజరిగితీఱునని వచించె. ఆమాటలాలించి యారాజపత్నియు
సంతసించి నియతయై దైవంబునారాధించుచు ఋతుకాలంబునఁ బ్రయ
తురాలై ద్రుపదునివలన గర్భంబు నొందె. రాజీవలోచన యగునాద్రుపద
మహిషి గర్భవతియైనంతన ద్రుపదుండు పుత్రస్నేహంబున నాభార్య

నతిప్రయత్నంబున నుపచరించెను. అపుత్త్రుండనని శోకించు ద్రుపదుని మహిషి నవమాసంబులు గడచి చన దశమమాసంబున శుభదినంబున శుభసమయంబున నత్యుత్తమరూపవతి యగు కన్నియం గనియె. ఆ రాజేంద్రుండు తనకుఁ బుత్త్రుండు జనించెనని యెల్లయెడలఁ బ్రకటించెను. మఱియు నాతండు తనకూఁతును బ్రచ్ఛన్నవృత్తిమై నునిచి యొరుల కెఱుకపడనీకుండఁ బుత్త్రున కాచరించువడువున జాతకర్మాది సంస్కారంబులెల్ల నిర్వర్తించె. ద్రుపదునిపత్నియు మంత్రరక్షణంబు నతిప్రయత్నంబునం గావించుచుఁ దనకు జనించినశిశువు పురుషుండే యని యెల్లరకు వచించుచుండెడిది. ద్రుపదుండు నచ్యుతతేజుం డగు మహాదేవుఁ డానతిచ్చినవచనంబునమ్మి పుత్త్రుండనియె యాకన్యను వ్యవహరించుచుండెను. ఆశిశువునకుఁ బురుషున కాచరింపం దగు జాతకర్మాది సంస్కారంబులెల్లఁ గావించి శిఖండియని నామకరణంబుగావించెను. ఈ వాస్తవం బితరు లెవ్వరు నెఱుంగంజాలకుండిరి. నేను జారముఖంబునను నారదునివచనంబువలనను నెఱుంగంగల్గితిని. మహాదేవునివచనంబుల వలనను నంబకావించినతపంబుననుంగూడ నే నీయాథార్థ్య మెఱుంగం గల్గితిని.

## హిరణ్యవర్మ ద్రుపదునికి సందేశ మంపుట

ద్రుపదుండు మహాప్రయత్నంబున దనకూఁతునకు చిత్రరచనమ్మం నందును, శిల్పంబులందును గౌశలంబు నాపాదించెను. పురుషవేషంబుననున్న యాకన్యను ద్రోణునికడ కంపి యిష్వస్త్రంబునందు నేర్పు చేకూర్చెను. ఇట్లు కాలంబు జరుగుచుండ శిఖండితల్లి ద్రుపదునితో శిఖండి కొక్క యనురూపగుణగణాలంకార యగు కన్యను గొనివచ్చి వివాహంబు గావింపం బ్రేరించెను. అంత ద్రుపదుం డాకన్య సంప్రాప్తయౌవన యగుట నాలోకించి దానిశరీరంబు యౌవనోద్భవంబు లగు స్త్రీలక్షణంబు లాలోకించి యాకన్య యింకను స్త్రీగానే యున్నది కాని పురుషత్వ మొందలేదని నిశ్చయించి భార్యతోఁగూడ నిట్లు వితర్కించెను. నాకూఁతురు నాకు శోకంబు వృద్ధినొందించుచు యౌవనం బధిగమించుచున్నది. శూలపాణి యానతిచ్చినవచనంబున నేను దీనిని స్త్రీ యని తెలియనీయక మరుగుపఱిచితిని. ఇది యింకను స్త్రీయై యే యున్నది

కాని పురుషుండుగా మాఱలేదు. ఇప్పుడు చేయఁదగుకార్య మేదియని యాతండు భార్య నడిగెను. అంత నాతనిభార్య మహారాజా! శూలపాణి యానతిచ్చినవచనం బెన్నండును ననృతంబు గానేరదు. త్రైలోక్యకర్త యగుశంకరుం డెన్నండు ననృతంబు వచింపండు. రాజా! నీకిష్టంబగునేని నేను వచించినవాక్యం బాలింపుము. నాచెప్పినమాటలు బాగుగ నాలోచించి నీకెట్లుతోఁచు నట్లు గావింపుము. మన మిపుడు ప్రయత్నించి దీనికి వివాహంబు గావింతము. ఆ పార్వతీపతివచనంబు సత్యంబ యగునని నాకు దృఢం బగువిశ్వాసంబు గలదు. కావున మనము చేయంగలకార్యములన్నియుఁ గావింతమని వచించె. ద్రుపదుండును భార్యచెప్పినవచనంబు లంగీకరించి దశార్ణాధిపతితనయను గోడలుగా వరించె. అనంతరంబు ద్రుపదుండు సకలరాజులకును దశార్ణాధీశునికులగోత్రంబులును వంశచరిత్రంబు నెఱింగించి యాతని తనయను శిఖండికి భార్యగా వరించెను. దశార్ణదేశంబులందు హిరణ్యరోముం డనురాజు మహాబలపరివృతుండును మహాసేనుండునునై దుర్జయుండు దురాధర్షుండునై యిలాతలం బేలుచుంచెను. ఆహిరణ్యరోముండును ద్రుపదునితోడి చుట్టఱికంబున కెంతయు సంతసించి శిఖండిని యనువేరుగల తనకూఁతును శిఖండి కొసంగి యథావైభవంబుగఁ బరిణయంబుగావించెను. అంతం గొంతకాలంబునకు దశార్ణాధిపతితనయ శిఖండిని సంప్రాప్తయౌవనయై వెలింగెను. శిఖండియు వివాహంబు నిర్వర్తించి కాంపిల్యనగరంబున కేతెంచి పురుషుండువోలెఁ జరించుచుండెను. శిఖండిని గొంతకాలంబునకుఁ దనమగఁడు పురుషుండు గాఁడనియు స్త్రీయనియు నెఱింగితనచెలికత్తెలకును దాదులకును వ్రీడాభరంబున నెఱింగించెను. అంత దశార్ణదేశంబునుండి వచ్చినదాదులామాటవిని మిగుల వ్యథనొంది యావృత్తాంతమెల్ల రహస్యంబుగ దశార్ణాధీశునకుఁ దెలియఁబంచిరి. ఆకాంచనరోముండు ద్రుపదుండు గావించినవిప్రలంభం బెఱింగినంతన మిగులఁ గుపితుండై మహాక్రోధపరవశుండయ్యెను. శిఖండియు స్త్రీత్వంబు మరుగుపఱచిపురుషుండువోలె ముదితహృదయుండై రాజకులంబున జరింపంబొడంగెను. దశార్ణపతి హిరణ్యవర్ముండు తనయల్లునివృత్తాంతంబు విని క్రోధపర్యాకులుండై ద్రుపదునికడకు దూతం బంచెను. కాంచనవర్మునిదూత ద్రుపదుని

సమీపించి ఏకాంతంబుగ నతని కిట్లనియె. రాజా! దశార్ణరాజు నీ
కిట్లు వచింపుమని నన్నంపినవాఁడు. ఆతనిసందేశం బాలింపుము. నీచే
మారాజన్యుఁ డెంతయు విప్రలంభంబునొందె. రాజా! నీవు నన్నెల్లవిధ
ముల నవమానించితివి. నీయాలోచనంబు దుర్మంత్రితంబై చూపట్టెను.
మోహంబునం జేసి నాకన్యను నీకన్యను భార్యను గావించితివి. దుర్మతీ
నీవు కావించినవంచనంబున కిప్పుడు ఫల మనుభవింపుము. ఇదే నేను
నిన్ను నీబాంధవులను మంత్రులనుగూడ సంహరించి కోపంబు వాపి
కొననున్నాఁడను. అని దాశార్ణునివచనంబు లాదూత ద్రుపదున కెఱిం
గించె.

### ద్రుపదుండు హిరణ్యవర్మకుఁ బ్రతిసందేశ మంపుట

హిరణ్యవర్మునిదూత ద్రుపదున కిట్లు వచించినంతన రాజగృహీ
తుం డగు చోరునిముఖంబువలన మాట వెలువడనిరీతిని ద్రుపదునినోటి
వెంట మాటగాదయ్యెను. ఆతండు మధురభాషులగుదూతలచే దశార్ణ
పతికి నిన్ను నేను వంచింపలేదను సందేశ మంపి యతనికోపంబు నివా
రింప మహాప్రయత్నం బాచరించెను. ఆదశార్ణపతి పాంచాలరాజతనయ
కాని పాంచాలుఁడు గాఁడని నిశ్చయంబుగ నెఱింగి త్వరితుండై ద్రుప
దుని పైకెత్తిరా నిశ్చయించెను. మఱియు నాతం డమితౌజస్కులగు
మిత్రులకెల్లరకును తనతనయకుఁ గావించిన విప్రలంభమును దెలియం
బంచెను. అనంతరంబు బలసన్నాహంబు గావించి ద్రుపదునిపై కభియా
నంబుగావింప నిశ్చయించెను. దశార్ణాధిపుండు పాంచాలునివిషయం
బున దనమంత్రులతోఁగూడ సమాలోచనంబుగావించెను. అయ్యవసరం
బున నక్కడఁ జేరిన మహాత్ములగు రాజులెల్లరు నిట్లు నిశ్చయించిరి. రాజా
పాంచాలరాజునకు నిక్కంబుగ కన్యయే జనించి దాని నాతండు పురు
షుండుగ వ్యవహరించి నీతనయను వంచించుటయే నిక్కమేని మేమా
ద్రుపదుని నిగళబద్ధుని గావించి తెత్తుము. పాంచాలదేశంబులకు మఱి
యొకని రాజుగా నియమించి శిఖండినితోఁగూడ నాతని నాతనిబాంధవు
లను వధింతము. అని నిశ్చయించినంతన హిరణ్యవర్ముండు మరలఁ ద్వరి
తంబుగ దూత నొక్కనిని ద్రుపదునికడకుఁ బంపెను. ఆదూత వచ్చి
దాశార్ణుండు నిన్ను-వధింప నెత్తివచ్చియున్నవాఁడు. నీవు స్థిరుండవై

యుద్ధంబుగావింప సన్నద్ధుండవై యుండుమని చెప్పినంతన మిగుల భయ మందియుఁ దెచ్చికోలుధైర్యంబున నాదూతల నెట్లో పంపివైచెను. ఆ ద్రుపదుండు ప్రకృతిచే మహాభీతచిత్తుండు. అందును విశేషించి యప రాధంబు గావించియున్నవాఁ డగుటం జేసి భార్యకడకు రహస్యంబున నేతెంచి దాని కిట్లనియె. ప్రియా! హిరణ్యవర్మండు మహాకోపంబున నాపై నెత్తివచ్చుచున్నవాఁడు. ఆతండు కొనివచ్చుసైన్యం బసంఖ్యా కంబై యున్నది. మనమిప్పు డీకన్యనుగూర్చి యేమి కావింపంగలము? నీతనయుం డగుశిఖండిని వారు కన్యయని యనుమానించిరి. ఆతండు నేను కన్యనే పురుషుండని ప్రకటించి తన్ను వంచించితి ననుకోపంబున వచ్చుచున్నవాఁడు. సుశ్రోణి! వాస్తవం బేదియో యిప్పుడు తప్పక యెఱింగింపుము. నీవలన దత్త్వంబు తెలిసి యేది యుచితంబగు నా కార్యం బాచరింతును. నేనును నీబాల శిఖండిని యని సంశయమంది యుంటిని. రాజ్ఞీ! నీవుకూడ మహాక్లేశంబు నొందియున్నదానవు. సర్వ విమోహకంబు తత్త్వంబుదెలిపినఁగాని కానేరదుకావున నీవు యథార్థంబు వచింపుము. నీవు సత్యంబు వచించినంతన యీసమయంబునకుం దగిన ప్రతిక్రియ గావింతును. అని భార్య నడిగి పిదప శిఖండితో "శిఖండినీ! నీవు భయమందకుము. నీవు తత్త్వం బెఱింగించితివేని దానికిఁ దగుసం విధానం బాచరింతును. వరారోహా! నేను గృపాళుండనగుటచే పుత్ర ధర్మంబున వంచితుండనైతిని. నేను నామహీపతిని వంచించితిని. మహా భాగురాలా! నీవు సత్యంబు వచింపుము. నీమాటవిని యుచితంబగు సంవిధానంబు గావింతునని పలికెను. ఆనరేంద్రుండు తెలిసియుండియు నెఱుంగనివానింబోలె పరుల నమ్మించుటకై యిట్లడుగ నాతనిభార్య యిట్లని చెప్పందొడంగెను.

అనంతరము శిఖండిజనని ద్రుపదున కిట్లనియె. మహారాజ! ఈ శిఖండి కన్యయేకాని పురుషుండు గాదు. నాకుఁ బుత్రుండు కలుగమిచే సపత్నులభయంబువలనఁ గన్యజనించినను నేను గుమారుఁ డుదయించె నని నివేదించితిని. నరశ్రేష్ఠా! నాయందు నీకుంగలప్రీతిచే వాని నించు కంతయేని సంశయింపక నీవు నమ్మితివి. కన్యకుఁ బుత్రున కావలసినట్లు

సంస్కారంబులెల్ల నాచరించితివి. దానికి దశార్ణాధిపతికుమారికను భార్యగాఁ జేసితివి. మహాదేవునివచనంబులు సత్యంబు లగునని తలంచి యీకన్య తప్పక పురుషుం డగు ననువిశ్వాసంబున నిట్లాచరించితినని వచించెను. ద్రుపదుం డీమాటలెల్ల నాలించి మంత్రవిదుల కిదియెల్ల నెఱింగించి వారలతో సమాలోచనంబు గావించి ప్రజల రక్షించుటకు వలయుకార్యంబులెల్లఁ గావించెను. దాశార్ణకునితోడిసంబంధంబును నాతని దాను వంచించుటయు నెల్లయు బాగుగఁ జింతించి నొక్కవినిశ్చయంబు గావించెను. ఆతనినగరంబు స్వభావంబుననే గుప్తం బగునది. ఐన నాపత్కాలం బాసన్నం బగుటచే మఱియు నగరంబున కధికరక్షణంబు గావించెను. ఆతండు భార్యతోఁగూడఁ బరమం బగు నార్తినొందెను. ఆతండు తనవియ్యంబగుదశార్ణపతితోడి విగ్రహంబున కెంతయు దుఃఖించుచు నావిగ్రహంబు కాకుండఁ దొలంగుటకై దేవతల నర్చించెను. దేవపరుండై దేవతల నర్చించుచున్న యాతని నాలోకించి యాతనిభార్య యిట్లనియె. మహారాజ! సత్పురుషు లెప్పుడును దేవతాప్రతిపత్తిని బహుమానింతురు. దుఃఖార్ణవంబున మునింగినవారికి దేవతలకంటె నితరం బగుగతి యేది కలదు? ఆ కారణంబున గురుల నర్చింపుము. భూరిదక్షిణ లొసంగి సమస్తదేవతలకుఁ బూజలుగావింపుము. అగ్నులందు హోమంబులుగావింపుఁడు. ఇట్లు కావించినఁ బ్రీతులగు దేవతలు దశార్ణనరపాలుని తోడి విగ్రహంబు నివారింతురు. దానివలన యుద్ధంబు గావింపకయె కాంచనవర్ముండు మరలిపోవును. ప్రభూ! దేవతల యనుగ్రహంబువలన నెల్లశుభంబులు లభించును. నీవును నీమంత్రులు నీపురంబునకు వినాశంబుసంభవింపకుండ నిశ్చయించినకార్యం బిట్లు కావింపుము. దైవంబు మానుషప్రయత్నంబుతోఁ గూడెనే నత్యధికంబుగ సిద్ధించును. దైవపౌరుషంబులకుఁ బరస్పరవిరోధంబు సంభవించెనేని సిద్ధికలుగదు. కావున నగరంబున బ్రయత్నపూర్వకంబుగ రక్షావిధానం బాచరించి దైవంబుల నర్చింపుము. అని వచించెను. ఇట్లు వారిరువురును శోకపరాయణులై సంభాషించుకొనుచుండ శిఖండిని యదివిని లజ్జావనతాననయై తనమనంబున నిట్లు చింతించెను. అయ్యో! నావలనఁగదా వీరలిరువురు నిట్లు శోకాకులులై యున్నవారు! నేను వీరిదుఃఖంబు లాలోకింపం జాలను. నే నిప్పుడ ప్రాణత్యాగంబు గావించికొనియెదనని నిశ్చయించి

శోకపరాయణురాలై గృహంబు విడిచి గహనం బగువనంబున కరిగెను. అకన్యక యరిగినవనంబు స్థూణాకర్ణుం డనుమహాసంపన్నుం డగు యక్షుండు పాలించుచుండును. ఆస్థూణాకర్ణునివలనిభయంబున నావనంబున కెవ్వరు నెప్పుడు నరుగరు. ఆయరణ్యమందు స్థూణునిభవనంబు సుధామృత్తికలేపనంబును లాజోల్లాసితధూపాఢ్యంబును మహోన్నతప్రాకారతోరణాభిరామంబునునై విలసిల్లుచుండెను. ద్రుపదనందన యగు శిఖండిని యావనంబు ప్రవేశించి బహుదినంబులు నిరాహారయై శరీరంబు శుష్కంబు గావించుచుండెను. అంతఁ గొన్నిదినంబుల కొక్కనాఁ డాస్థూణుం డాకన్య నాలోకించి మృదుశీలుండై, బాలా! నీ వేకారణంబున నీ ట్లుపవాసంబు లాచరించుచున్నదానవు? నీకు హితంబగున దేదియో వచింపుము. దాని నచిరంబునన కావింతునని పలికెను. ఓయీ! నాహితంబాచరింప నీకు శక్యంబుగాదని పెక్కుమారులు శిఖండిని వచించెను. గుహ్యకుండు తప్పక శీఘ్రకాలంబునన కావింతునని యనియె. బాలా! నేను ధనేశ్వరుని యనుచరుండను. రాజపుత్రీ! నీకిష్టం బగువరం బొసంగెదను. అదేయంబైనను దప్పక యిచ్చెదను. నీయభిమతం బేదియో శీఘ్రంబుగ వచింపుమని గుహ్యకుండనియెను. అంత శిఖండిని యథాతథంబుగ వృత్తాంతమెల్ల నాస్థూణునకు నివేదించి, యక్షాగ్రణీ! నాతండ్రి పుత్రులులేనికారణంబున నచిరంబున నశింపనున్నవాఁడు. దశార్ణాధిపతి సక్రోధుండై యాతనిపై కెత్తివచ్చుచున్నవాఁడు. ఆ కాంచనవర్ముండు మహోత్సాహుండు మహాబలుండు నగుట నాజనకుని దప్పక సంహరించును. నీవు దయాళుండవై నాజనకుని రక్షింపుము. నాజననిని నన్నుఁ గూడఁ గావుము. నీవు నాదుఃఖం బపనయింతునని ప్రతిజ్ఞ గావించితివి కదా? యక్షా! నీప్రసాదంబున నేను బురుషుండ నయ్యెదను. మహాబలసంపన్నుం డగు హేమవర్ముండు మాపురంబు సమీపింపకమున్న నన్ననుగ్రహింపు మని ప్రార్థించెను.

శిఖండి యిట్లు ప్రార్థించినంతన యక్షుండు దైవబలప్రచోదితుండై మనంబున గొంతవడిఁ జింతించి యిట్లనియె. కౌరవ! ఈజరిగినయర్థంబెల్ల నాదుఃఖంబునకై యట్లు దైవవిహితంబు లైనదికదా! భద్రా! తప్పక నీకోరికి నెఱవేర్తును ఐనను నాకావించుసమయం బాలింపుము. కొంతకాలముమాత్రమే నాపురుషలక్షణంబులు నీకొసంగెదను. నీ

కార్యంబు తుదముట్టినవెనుక నీవు తప్పక వచ్చి నాపుంస్త్వమ్ము నా కిచ్చి
వేయుము. నీ వట్లిత్తు నని సత్యంబు వలికితివేని తప్పక యిప్పుడ యొసం
గెద. నేను విహాయసచరుండను గామచారుండనునై యున్నవాఁడను.
నాసంకల్ప మన్యథా కానోపదు. నాయనుగ్రహంబునఁబురంబును బాంధ
వులను గాపాడుకొనుము. నీ దగుస్త్రీలక్షణంబు నేను ధరించెదను. నీవు
నాకు సత్యంబు ప్రతిజ్ఞ కావించితివే నిదియే నీకుఁ బ్రియంబుగాపింతునని
వచించె. ఆమాటలాలించి శిఖండి భగవంతుఁడా! నీ పుంలింగమును
మరల నీకుఁ దప్పక యర్పింతును. కొంచెముకాలముమాత్రమే నాస్త్రీ
లక్షణంబులు నీవుధరింపుము. దశార్ణప్రభుం డగు హేమవర్మ తనపురంబున
కరిగినంతన నే నెప్పటియట్ల కన్యనై యుండుదును. నీవును బురుషుండవై
యుండుదువు కాక యని పలికెను. ఇట్లు వా రిరువురు నొక్కనిశ్చయంబు
గావించుకొన్నంత నొండొరులలింగంబుల పరివర్తనంబు గావించుకొనిరి.
స్థూణాకర్ణుఁడు స్త్రీరూపంబును ధరించెను. శిఖండి యక్షుని పుంస్త్వ
మును గ్రహించి మహాశోభతో వెలుంగంజొచ్చెను. అనంతరము పురుష
చిహ్నంబులంది శిఖండి పరమహర్షంబు చెలంగ నగరంబున కేతెంచి
తండ్రినికటంబున కేతెంచెను. ఆతండు ద్రుపదునికి నమస్కరించి యా
వృత్తాంత మెఱింగించుటయు ద్రుపదుండును నాతనిభార్యయు నత్యధిక
ముదంబునొందిరి. ద్రుపదుండును నాతనిభార్యయు నాసమయంబున మహే
శ్వరునివచనంబుల స్మరించుకొని యాదేవదేవుని మనంబులం దెంతయుఁ
గొనియాడిరి. అంత ద్రుపదుండును దశార్ణాధీశునకు, రాజా! నాతన
యుండు పురుషుండేకాని స్త్రీకాదు. నీవు బాగుగ నమ్ముమని సందేశ
మంపెను. ఈమాటలాలించి దశార్ణాధీశుండును దుఃఖశోకసమన్వితుండై
త్వరితంబుగఁ గాంపిల్యంబున కేతెంచి బ్రహ్మవేదియగు నొక్కబ్రాహ్మణుని
ద్రుపదునికడకు దూతగాఁ బంచెను. ఆబ్రాహ్మణుండును ద్రుపదునికడ
కేతెంచి రాజా! హేమవర్ముండు తనవచనంబులుగా నీకిట్లు వచింపుమని
నన్నంపినవాఁడు, రాజాధమా! నీవు నీకన్యకై నాకన్యను భార్యగా
వరించి నన్ను మోసపుచ్చితివి. నీవు కావించినయవలేపంబున కిప్పుడ
ఫలం బాలోకింతువుగాక. అని వచించుటయు ద్రుపదుం డావచ్చిన
బ్రాహ్మణునకు గోవు నర్ఘ్యము నర్పించి యథావిధిగఁ బూజించెను. ఆ
బ్రాహ్మణుండు డాపూజ నంగీకరింపక నిరాకరించెను. ఆతం డట్లు పూజ

నిరాకరించి దశార్ణాధిపతి వచించినసందేశము మంత్రిమధ్యంబున వచిం
చుటయు ద్రుపదుండు ప్రణయానతుండై "బ్రాహ్మణోత్తమా! నీవు
మాసంబంధివచనంబులు వలికితివికదా? దీనికిఁ బ్రతిసందేశము దూత
ముఖంబున బంపెదను" అని వచించి యాబ్రాహ్మణునిఁబంపి వేదపారగుం
డగుబ్రాహ్మణప్రవరుని హిరణ్యవర్మని నికటంబునకు దూతగాఁ బంచెను.
ద్రుపదునిచేఁ బంపంబడినబ్రాహ్మణుండు దశార్ణపతికడ కేఁగి ద్రుపదుండు
వచించినమాటలెల్ల నెఱింగించె. రాజా! నీవు తప్పక నానగరంబునకు
విచ్చేయుము. శిఖండి నాకు సూనుఁడే కాని కన్యగాఁడు. ఎవ్వరో దుష్టులు
శిఖండి కన్యయని నీకసత్యవచనంబులు తెల్పిరి. ఆమిథ్యావాదంబు విశ్వ
సింపంజనదు. కావున నీవు నిర్విశంకుండవై నగరంబునకు రమ్మని ద్రుపదు
వచనంబు లాబ్రాహ్మణుఁ డెఱింగించెను. ఆబ్రాహ్మణుం డట్లు వచింప దశా
ర్ణపతి ద్రుపదునివాక్యంబులు బాగుగ విమర్శించి వరిష్ఠలును జారు
రూపలు నగుయువతులను శిఖండియాథాతథ్య మెఱుంగ నియమించెను.
ఆస్త్రీలెల్లను శిఖండి ననేకవిధంబుల బరీక్షించి యాథార్థ్యం బెఱింగి
సంతసంబున దమరాజునకు శిఖండి పురుషుండే యని యెఱింగించిరి. ఆ
మాటలాలించి హిరణ్యవర్ముండు మిగుల నానందమంది ద్రుపదునింటి
కేతెంచి యానందంబున నాతనిసత్కారంబులు పరిగ్రహించెను. మఱియు
నాతండు ముదితహృదయుండై శిఖండికి నమితం బగుధనంబును దురంగ
మాతంగశతాంగంబులను బాడిమొదవులను వేలకొలందిగ నొసంగెను.
మఱియు నప్రతిమరూపలావణ్యాస్పద లగు దాసీజనంబుల వేవుర నొసం
గెను. ఆతండు ద్రుపదునిచే మహావైభవంబునం బూజితుండై తనతనయ
కావించిన యవివేకంబునకు దానిని నిర్భర్త్సించి ద్రుపదునెడను శిఖండి
యెడను మిగులఁ బ్రీతుండై యాతండు తనపురంబునకుఁ దానరిగెను.
దశార్ణపతి మరలఁ దనగృహంబున కరిగినంతన శిఖండి మిగుల నానంద
మున నోలలాడెను.

### కుబేరుండు స్థూణాకర్ణునకు శాపం బిచ్చుట

ఇదియట్లుండ నక్కడ నొక్కనాఁడు కుబేరుండు విమానారూ
ఢుండై యెల్లయెడ సంచరించుచు స్థూణుండున్న వనంబున కరుగుదెంచి
స్థూణునిమందిరంబున కుపరిభాగంబున విమానంబునిలిపి విశేషాలంకృతం

బగు స్థూణునిగృహం బాలోకించెను. విచిత్రమాల్యగుణాభిరామంబు లాజగంధాధివాసితంబు వితానవితతంబు ధూపధూపితంబు ధ్వజపతాకాలంకృతంబు భక్ష్యపేయాదిసమృద్ధంబు హిమధూమాధివాసితంబు మణిరత్న సువర్ణాలంకృతంబు నానాకుసుమగంధాఢ్యంబు సువర్ణమాలాప్రకీర్ణంబు సుగంధిసలిలసంసిక్తంబు నయి నేత్రానందసంధాయకంబై యున్న యాస్థూణునిమందిరం బాలోకించి తనతోఁగూడ వచ్చియున్న యక్షుల నాలోకించి యిట్లనియె. అమితవిక్రముం డగు నీస్థూణుని యాశ్రమం బెంతయు రమణీయంబై యొప్పుచుండెను. మందబుద్ధి యగు నాస్థూణుం డిపుడు నాకడకు రాకున్నాఁ డేల? నే నిక్కడ కేతెంచుట యెఱింగియు నామందుండు నాకడకు రాకుండుటం జేసి యాదురాత్మునకు మహాదండంబు గావింపవలసియున్న దని నే నెంచుచున్నవాఁడనని పలికెను. ఆమాటలాలించి యక్షులు ముకుళితకరకమలులై వినయంబున దేవా! ద్రుపదుండను రాజునకు శిఖండిని యనుకన్య జనించెను. దానికొక్క కారణంబున నీస్థూణుండు తనపుంస్త్వంబిచ్చి దానిస్త్రీత్వంబు తాను ధరించియున్నవాఁడు. ఇప్పుడు వాఁడు స్త్రీరూపంబున స్త్రీయై గృహము నందున్నవాఁడు. కావున నాతండు లజ్జాభరంబున మీసన్నిధికి రానోపండయ్యెను. నీవు యథార్థం బెఱింగి యేది యుచితంబని తోఁచిన దానిని గావింపుమని వచించిరి. అదివిని కుబేరుం డాస్థూణుని కొనితెండు. వానికి నిగ్రహం బవశ్యముగావింతునని మరలమరల ననియెను. అట్లు యక్షాధిపాజ్ఞప్తులై యక్షులు స్థూణుకడ కరిగి యాతని కీవృత్తంబెల్ల నెఱింగించి కుబేరుసన్నిధికిం గొనివచ్చిరి. ఆస్థూణుండును వనితారూపంబున సిగ్గుపడుచుఁ గుబేరునిసమీపించి నమస్కారం బాచరించి యెదుర వ్రీడావనతాననుండై నిలువంబడియెను. దాని నాలోకించి యక్షాధిపుం డత్యంతక్రుద్ధుండై శపించెను. గుహ్యకులారా! యీపాపుండు స్థూణున కిట్లే స్త్రీత్వంబుండునుగాక. అని వచించి స్థూణునుద్దేశించి పాపకర్మా! నీవు మంచిచెడుగు లాలోచింపక పరులకు నీపుంస్త్వ మొసంగి వారల స్త్రీత్వంబు గైకొంటివి. లోకంబున నెవ్వరు నెందును గావింపనిపాపంబు నీవు గావించుటంజేసి నీకిట్లు స్త్రీత్వంబనుభావ్యం బగునుగాక. నీచే బురుషలక్షణంబు పరిగ్రహించినయాకన్య పురుషుండై చరించునుగాక యని వచించెను. అంత నక్కడియక్షులెల్లరును స్థూణునియెడఁ దయ

గలిగి శాపంబునకంతంబు నిర్దేశింపుమని కుబేరుని బహువిధంబులఁ బ్రార్థించిరి. అంత ధనేశ్వరుండు స్థూణునిశాపంబున కంతంబుగావించుతలంపున దన్ను బలసి కొలిచియున్న యక్షులనెల్లర నాలోకించి వారల కిట్లనియె. యక్షులారా! శిఖండి నిహతుండైనపిదప నీస్థూణుండు దన తొంటిపురుషరూపంబు నొందును. అంతదనుక నీతం డిట్ల స్త్రీయై చరించును. అని శాపావసానంబు నిర్దేశించెను. ఇట్లు వచించి యధిపుండు నిమేషాంత చారు లగు నాయక్షులచేఁ బరివృతుండై యథేచ్ఛను విమానారూఢుండై చనియెను. స్థూణుం డట్లు శాపంబొంది యావనంబుననే నివసించియుండెను. అంత గొన్నిదినంబులకు శిఖండి స్థూణునియాశ్రమంబున కేతెంచి వానిని గాంచి నమస్కరించి, భగవంతుఁడా! యిదే నీయానతి మెయి నిట్లువచ్చియున్నాను. మునుపటిరీతిని నీవు నీపుంస్త్వంబు గైకొని నాస్త్రీలక్షణంబులు నాకొసంగుమని వచించెను. అపుడు స్థూణుండు శిఖండీ నీవు పలికినచందమున మాటతప్పక వచ్చితివని నేను మిగుల సంతసించితిని. నీయెడఁ బ్రీతుండనై నీకు నాపుంస్త్వం బిచ్చితిని. దానిఁ గైకొని నీవరుగుమని పలికి తాను కుబేరునికడ కరుగుటయు నాతండు శాపశాపాంతముల వచించుటయు సవిస్తరంబుగ శిఖండి కెఱింగించెను. ఆతం డిట్లు వచించెను. రాజపుత్రా! నీకారణంబున నేను యక్షాధీశునిచే శప్తుండనైతిని. నీవు నీయిచ్చవచ్చినతెఱంగునం జని లోకంబులందు సుఖంబుగఁ జరింపుము. ఇయ్యది పూర్వజన్మమునం దాచరించిన కర్మంబులకు ఫలంబై యుండనోపును. దీని ననుభవింపకయుండ నెంతటివానికిని దరంబుగాదు. కాకున్న నీవిక్కడకు రానేల? నీవు వెడలునంతన వైశ్రవణుం డాసమయంబుననే రానేల? నాపురాకృతకర్మపరిపాకంబున నిట్టిఫలంబు సంభవించెను. కావున నీవు సంతోషంబున నీ నగరంబున కరుగుమని వచించెను. ఇట్లు స్థూణయక్షుండు వచింప నాతని కభివాదనం బాచరించి శిఖండి ప్రహృష్టచిత్తుండై నగరంబున కేతెంచి వివిధంబు లగుగంధమాల్యంబులచే దేవతలను ధనకనకవస్తువాహనాదులచే భూసురులను బూజించెను. శిఖండి యట్లు సిద్ధార్థుండగుట ద్రుపదుండు నాతనిబంధుజనంబులు నత్యంతహర్షంబు నొందిరి. ద్రుపదుండు తొలుత కన్యగా జన్మించి యనంతరము పురుషుండుగా మాఱినశిఖండిని ధృష్టద్యుమ్నుని ద్రోణునకు శిష్యులుగా నర్పించెను. వారిరువు

రును మీతోడంగూడియే మహాత్ముం డగుద్రోణునివలన ధనుర్వేదంబు నాల్గుపాదంబులు నధ్యయనంబొనర్చిరి. ఈశిఖండిచరిత్రంబెల్లఁ జారులు నాకు జరిగినది జరిగినట్లు నివేదించియుండిరి. నేను జడులు బధిరులు నంధులు మొదలగువికలాంగుల యాకారంబులతో చారులను ద్రుపదు పాలికిం బంచితిని. వారును రహస్యవిషయంబులుగూడ గ్రహించి నాకు నివేదించియుండిరి. మహారాజ! ఈశిఖండి యిప్పుడు నేచెప్పినరీతిని పూర్వము స్త్రీయు నిపుడు పురుషుండునై యున్నవాఁడు. కాశిరాజున్యుని జ్యేష్ఠపుత్రిక అంబ యనిపేరఁ బ్రఖ్యాతిఁగాంచినది ద్రుపదునింట శిఖండియై యవతరించెను. ఈతండు యుద్ధాచరణంబునకు ధనుర్ధరుండై వచ్చెనేని నేనొక్కనిముసంబే నాతని నాలోకింపను. ఆతనిఁ బ్రహరింపను. స్త్రీని పూర్వము స్త్రీయై యున్నవానిని స్త్రీనామంబు ధరించినవానిని స్త్రీస్వరూపంబున జరించువానిని బ్రహరింప నను నావ్రతంబు లోకంబులందుఁ బ్రఖ్యాతంబై యుండెను. అట్టిస్త్రీధర్ములపై నేనెన్నండును బాణంబు విడువను. ఈవ్రతంబు కారణంబుగ రాజా! నేను శిఖండిని వధింపనని యంటిని. వత్సా! శిఖండిపుట్టుక వాస్తవంబుగ నేనెఱింగియున్నవాఁడను. కావున నాతఁ డెంతయాతతాయి నైయున్నను నాతని సమరంబునఁ బొలియింపను. భీష్ముండు స్త్రీని వధించినచో సజ్జనులు గర్హింతురు. ఆకారణంబున నేను శిఖండిని వధింపంజాలనని వచించెను. దుర్యోధనుండును శాంతనవుండు వచించినదియెల్ల బాగుగ నాలోచించి మహావ్రతపరాయణుం డగు దేవవ్రతుం డిట్లు శిఖండిని సంహారింపకుండుట యుచితంబే యని తలంచెను.

## సుయోధనుండు సపక్షవీరులబలం బెఱుంగుట

ఆరాత్రి కడచినయనంతరంబు ప్రభాతకాలంబున సకలరాజలోకం బాలోకించుచుండ సుయోధనుండు పితామహున కిట్లనియె. మహానుభావా! ఈయుద్యతం బగుధర్మనందనునిసైన్యం బాలోకించుచున్నాఁడవుకదా? ప్రభూ! తనరథనాగాశ్వంబును మహారథసమాకులంబు మహేష్వాసులు మహాబలపరాక్రమసంపన్నులు నగుభీమాది మహావీరులచే నభిరక్షితంబు ధృష్టద్యుమ్నపరిపాలితంబు ననాధృష్యంబు నవార్యంబు మహాసాగరగంభీరంబు దేవతలకు నక్షోభ్యంబు నగు

నీపాండవసేనాసాగరంబును నీ వెంతకాలంబునకు క్షీణింపం జేయఁగలవు? మహాధనుర్ధరుండగు నాచార్యుండు, మహాబలుండగుకృపుండు, సమర శ్లాఘి యగుకర్ణుండు, ద్విజసత్తముండగు నశ్వత్థామయును నెంతెంత కాలంబున కీబలంబు పరిమార్పంగలరు? మీరెల్లరును దివ్యాస్త్రవేదు లరు. ఈయర్థంబు నే నెఱుంగంగోరితిని. దీని విన నాకధికంబుగఁ గుతూ హాలం బగుచున్నది. కావున నీ వెఱింగింతువుకాక యని యడిగెను. ఆమాట యాలించి యాపగానందనుండు సుయోధనున కిట్లనియె. మహా బాహూ! అమిత్రులబలాబలంబు లెఱుంగంగోరు టెంతయు సముచి తంబై యొప్పును. రాజా! నాకు సమరంబునంగలశక్తి నాలింపుము. నా శస్త్రవీర్యంబును భుజబలంబును దెల్పుదును. ఇతరుండు ఋజుమార్గం బున యుద్ధంబుగావించునపుడు తానును ఋజుమార్గంబున యుద్ధం బాచరించుటయు ఇతరుండు మాయాయుద్ధం బొనర్చుచోఁ దానును మాయాయుద్ధం బొనర్పందగుననియు ధర్మవేత్తలందురు. మహాభాగ! పాండవులసైన్యంబెల్ల భాగంబులుగ విభాగించి పదివేవురుయోధులును వేవురురథికులును నొక్కభాగంబుగా నొక్కదివసంబున మధ్యాహ్నా మునకు మున్న వధించుచుందును. ఇట్లు విభాగంబుగావించి దినదిన మును గొంతగొంతగా వధించుచుఁ గాలక్రమంబున సైన్యంబెల్ల సంహా రింతును. శతసహస్రమారణక్షమంబు లగుదివ్యాస్త్రంబులం బ్రయోగిం చితినేని నే నీసైన్యంబెల్ల నొక్కమాసంబునఁ బరిమార్పంగలనని వచిం చెను. అంత భీష్మువచనం బాలించి సుయోధనుండు ద్రోణుదిక్కు మొగం బై యాతనిం గని "ఆచార్య! ఈపాండునందనులసైన్యంబుల నీవెంత కాలంబున సంహారింపంగలవని యడిగెను. అది విని ద్రోణుండు చిరు నవ్వు నవ్వుచు "రాజా! నేను ముదుసలినై యుంటిని. నాబలంబును, చేష్టలును మందంబులయ్యె. భీష్మునివలెనే నేను నొక్కమాసంబున నీ సైన్యంబునెల్ల శస్త్రాగ్నిచే నిర్దహింపంగలను ఇదియ నాపరమశక్తి. ఇదియ నాపరమం బగుబలంబు." అనినంత శారద్వతుం డగుకృపుండు రెండుమాసముల కాబలంబులెల్ల వధింతు ననియె. ద్రోణాత్మజుండు దశరాత్రంబుల కాబలంబులెల్ల సంహరింతు ననియె. మహాస్త్రవిదుండగు కర్ణుం డేనురాత్రుల కాబలంబుల సంహరింతునని వచించెను. ఆకర్ణుని వాక్య మాలించి మందాకినీనందనుండు బిగ్గఱగా నవ్వి యిట్లనియె.

రణంబున ధనుర్ధరుండును, వాసుదేవసహాయుండును నై పార్థుండు రా కున్నంతదాక నీ విట్లు ప్రగల్భంబులు నాత్మశ్లాఘనంబులును గావించు చునే యుండువు. అంతవఱకు నీవింతియ కా దింతకధికంబులగు కార్యం బులుగూడం గావింతు వని వచించెను.

## అర్జునుండు తనబలం బెఱింగించుట

అంత నక్కడం గౌంతేయుండు తనతమ్ముల నల్వురను బిలిచి రహ స్యంబుగ వారల కిట్లు పలికెను. నేను ధార్తరాష్ట్రునిసైన్యంబుల నన్వే షింపం బంచినచారు లేతెంచి నాకు విశేషంబు లెఱింగించిరి. పోయిన రాత్రి దుర్యోధనుండు గంగానందనుని నీ వెంతకాలంబున పాండవ సైన్యంబులం బరిమార్తు వని యడిగెనఁట! ఆశాంతనవుండు దురాత్ముం డగుసుయోధనున కొక్కమాసంబున నెల్లసైన్యంబులు వధింతునని ప్రతిజ్ఞ గావించెనఁట. ద్రోణుండు నొక్కమాసంబున వధింతు ననియె నఁట. గౌతముండు రెండుమాసంబుల కని వచించెను. ద్రోణాత్మజుండు దశరాత్రంబుల నిశ్శేషంబు గావింతు ననియెనఁట. దివ్యాస్త్రవిదుం డగు కర్ణుం డేనుదివసంబులకు ససైన్యుల మగుమనల నెల్లర వధింతు ననియె నఁట. కావున ధనంజయా! నేనును నీవెంతకాలంబునకు మనశాత్రవుల సంహరింపంగల్గుదువో తెలియఁగోరెద నని వచించుటయు నాధనంజ యుండు వాసుదేవు నాలోకించి యిట్లనియె. మహారాజా! మనసైన్యం బునం గలమహాత్ములెల్లరును కృతాస్త్రులును జిత్రయోధులు నై యున్న వారు. వీ రాసైన్యంబులనెల్లం బరిమార్పక విడువరు. నీమనస్తాపంబు శమించుఁగాక. నావచనంబులు సత్యంబు లని నమ్ముము. నే నొక్క రుండ నేకరథంబున వాసుదేవసహాయుండనై దేవతాసహాదులతోం గూడ నీమూఁడులోకంబులును భూతభవద్భవ్యంబులు నొక్కనిమేషాం తరంబున వధింపంగల నని నానిశ్చయంబు. మాయాకిరాతరూపంబున నాతో ద్వంద్వయుద్ధంబు గావించి నాయెడం బ్రసన్నుండై మహాదేవుం డొసంగినమహాస్త్రంబు నాపాలంగలదుకదా? పశుపతి యుగాంతము నందు సర్వభూతంబుల సంహరించునపు డాయస్త్రంబు ప్రయోగించును. అట్టి పాశుపతమహాస్త్రంబు నాకుం గలదు. గాంగేయుండును ద్రోణుం డును ద్రోణాత్మజుండును గృపుండునుగూడ నయ్యస్త్రం బెఱుంగరు.

సూతనందనుం డది యెఱుంగఁడని చెప్పనేల? ఐనను రణంబున దివ్యాస్త్రంబులచే నొక్కొక్కనివధించుట యుక్తంబుగాదు. మనము ఋజుయుద్ధంబునన శాత్రవులఁ బరాజయింతము. పురుషవ్యాఘ్రా! ఈనీసహాయులగురాజన్యు లెల్లరును దివ్యాస్త్రవిదులు, యుద్ధాభికాంక్షులు, వేదాంతావభృథస్నాతులు, అపరాజితులునై వెలుంగువారు. వీరెల్లరును దేవతలసైన్యంబులనే నశ్రమంబున వధింతురు. శిఖండి యుయుధానుండు ధృష్టద్యుమ్నుండు భీమసేనుండు కవలు యుధామన్యుం డుత్తమౌజుండు విరాటద్రుపదులను మహాబాహుం డగుశంఖుండును మహాబలుం డగుఘటోత్కచుండును నాతనితనయుం డంజనపర్వుండును మహాబాహుం డగుసాత్యకియు రణకోవిదుండు బలవంతుండు నగునభిమన్యుండును ద్రౌపదేయులేవురును నీయంతట నీవును నీత్రైలోక్యంబు నొక్కసారిగా నుత్పాదనం బాచరింప నర్హులరై యున్నవారలు. కౌరవాగ్రణీ! నీవు కోపంబున గన్నులెఱ్ఱచేసి యేపురుషు నాలోకింతు వాతం డింక లేఁడనియే నెఱుంగుదునని వచించెను.

### దుర్యోధనుండు బలప్రత్యవేక్షణంబు గావించుట

అనంతరంబు ప్రభాతకాలంబున దుర్యోధనప్రచోదితులై కౌరవసైన్యంబునం గలరాజులెల్లరును పాండవుల కభిముఖంబుగ నడచిరి. వారెల్లరును స్నానంబు లాచరించి శుక్లవసనంబులును తెల్లనిపూలదండలును ధరించి శస్త్రంబులు ధనువులు ధరించి స్వస్తివాచనంబులుగావించి యగ్నులందు హోమంబులు గావించిరి. వారెల్లరును వేదవేదులును శూరులును సుచరితవ్రతులును సర్వకామకారులును నాహవలక్షణులునై యొసంగిరి. వారెల్లరును నాహవంబునఁ బరుల జయింపందలంచినవారు. ఎల్లరు నేకాగ్రబుద్ధులుగలవారు. వార లొండొరులయెడ ననురాగశ్రద్ధలుగలవారై యొప్పిరి. అవంతీశ్వరు లగువిందానువిందులు కైకయులు బాహ్లికులు గలసి రాజులెల్లరును ద్రోణుని ముందిడుకొని బయలుదేఱిరి. అశ్వత్థాముండు శాంతనవుండు సైంధవుం డగుజయద్రథుండు ససైన్యు లగుదాక్షిణాత్యులు పార్వతీయనృపాలురు గాంధారరాజు శకుని ప్రాచ్యు లుదీచ్యులు శకులు కిరాతులు యవనులు శిబియోధులు వసాతులు మొదలగురాజులెల్లరును తమతమబలంబులతో

గూడి మహారథులఁ బరివారించి నడచిరి. ఆమహారథు లెల్లరును వరుసాత
నడచిరి. కృతవర్మయును త్రిగర్తాధిపుండును సమస్తబలంబులతోఁ
గూడి నడచిరి. తనయనుజులచేఁ బరివేష్టితుండై దుర్యోధనుండును
శలుండును భూరిశ్రవుండును శల్యుండును గౌసల్యుండు బృహద్రథుండు
మొదలగువారెల్లరును ధార్తరాష్ట్రుని గుంపుగొని యోధుని వెనుక
నడచిరి. ఆమహారథులెల్లరును యథాన్యాయంబుగ నరిగి యొండొరు
లంగూడికొని కురుక్షేత్రంబు సగభాగంబున విడిసిరి. దుర్యోధనుం
డయ్యెడ గొప్పశిబిరంబుగావించి దానిని హాస్తినపురంబునుంబోలె నలం
కృతంబు గావించెను. నగరవాసిజనంబులు మిగుల నేర్పుగలవారైన నా
శిబిరం బాలోకించి పురంబో శిబిరంబో నిస్సంశయంబుగ నిర్ణయింప
జాలకుండిరి. అట్టులే రాజులందఱకును వందలు వేలుసుగా దుర్గంబుల
బహురమ్యంబు లగువానిని నిర్మింపించెను. పంచయోజనపరిమితం బగు
భూభాగంబును రణాంగణంబుగ నిర్దేశించి దానిని విడిచి చుట్టును సేన
లన్నియు విడిసియుండెను. అక్కడ నాపృథివీపాలకులెల్లరును బలంబు
ననుసరించి తమకుఁదమకుచితంబులగు ద్రవ్యవంతంబులగు శిబిరంబులం
బ్రవేశించిరి. దుర్యోధనుండు ఆశిబిరంబులందు రాజులకును వారిభృత్యు
లకును వాహనంబులకును నరనాగాశ్వమనుష్యులకును శిల్పోపజీవుల
కును ప్రేక్షకజనంబులకును నెల్లరకును నుత్తమంబు లగునన్నపానంబుల
నియమించి యెల్లరకును దృప్తిగావించెను.

## పాండవసైన్యంబులు యుద్ధభూమి కరుగుట

అక్కడఁ బాండవానీకంబులందుఁ గౌంతేయాగ్రజుండు ధృష్ట
ద్యుమ్నప్రముఖులను యుద్ధభూమికరుగఁ బ్రచోదనంబు గావించెను.
చేదికాశికరూషదేశంబుల కధీశుండు దృఢవిక్రముండు నమిత్రఘ్నుండు
సేనానాయకుండు నగుధృష్టకేతుని కాదేశించెను. విరాటుండు ద్రుప
దుండు యుయుధానుండు శిఖండి పాంచాలురు మహాధనుర్ధరులు నగు
యుధామన్యుం డుత్తమౌజుండు మొదలగుసేనానాయకులకు యుద్ధ
భూమి కరుగ నాదేశించెను. ఆశూరులు చిత్రకవచంబులు తప్తకాంచన
కుండలంబులు ధరించి నేయివోసిన బ్రజ్వలించునగ్నులమాడ్కి వెలుం
గుచుండిరి. ఆమహాధనుర్ధరు లెల్లరును ప్రజ్వలించుచున్న గ్రహంబుల

మాత్మీయ పురస్సరీయుస్త్వలై యుండిరి. అప్పుడు యుధిష్ఠిరుండు యథాయోగంబుగ నాసైన్యంబుల నెల్లఁ బూజించి వానికి బ్రహూణంబున కాన తిచ్చెను. సుజీవము నాతండా సైన్యంబులకును వాహ్యంబులకును గజంబులకును మనుష్యులకును నుత్తమంబు లగు భోజనంబు లేర్పఱించెను. అభిమన్యుండును ద్రౌపదేయులును ధృష్టద్యుమ్నునితోఁ గూడి సేనయెల్లె డలఁ బరిక్షించుచుండ నాజ్ఞాపించెను. భీముని యుయుధానుని ధనంజయుని రెండవబలస్కంధంబుగాఁ బంచెను. రథగజాదులందు సామగ్రి లెక్కించువారలును, నటు నిటు పరువు లెత్తువారలును, నొండొరుల నాహ్వానంబొనరించువారును నగునాయోధుల కలకలారావంబు మిన్నుముట్టెను. అనంతరంబు తాను విరాటద్రుపదులతోడను నితరులగుమహీపాలురతోడను గూడి యుద్ధంబునకు నడచెను. భయంకరు లగుధనుర్ధరులతోనిండి ధృష్టద్యుమ్న పాలితయగునాసేన వర్షకాలంబున బూర్ణంబై స్థిమితం బగుగంగాప్రవాహంబు ననుకరించెను. అనంతరము మరల ధార్తరాష్ట్రులకు మోహంబుగలుగుచందంబున సైన్యయోగంబు గావించెను. మహేష్వాసులగుద్రౌపదేయులనునభిమన్యుని నకులసహదేవులను భద్రకులెల్లరను పదివేలగుఱ్ఱంబులను రెండువేలయేనుంగులను పది వేవురుపదాతులను నేనూఱురథంబులను భీమసేనున కొసంగి యాతనిని మొదటిబలంబుగాఁ బంచెను. మధ్యమంబున విరాటుని జయత్సేనుని మహారథులగు యుయుధానోత్తమౌజస్కులను వీర్యవంతులు మహాత్ములుగదా కార్ముకధారులు నగు వాసుదేవధనంజయులును వెడలిరి. కృతాస్త్రులును నతిసంరబ్ధులు నగునరు లుత్తమంబులగు తురంగంబులారోహించి యిరువదివేలును నైదువేలయేనుంగులును నైదువేలరథంబులును కార్ముకాసిగదాధరులగు పదివేలపదాతులును వాసుదేవధనంజయులఁ బరివారించి వెడలిరి. ఏసైన్యంబున యుధిష్ఠిరుండుండెనో యా సైన్యంబున ననేకరాజన్యులుండిరి. వేయియేనుంగులు పదివేలతురంగంబులు వేయిరథంబులు పదివేవురుపదాతులును తనసైన్యంబుతోఁ గూడి చేకితానుండును చేదినాథుం డగుధృష్టకేతుండును బయలుదేఱిరి. మహాధానుష్కుండు వృష్ణిప్రవరుండు నగుసాత్యకి నూఱువేలరథంబులతోఁ గూడి వెడలెను. క్షత్రఘ్నుండు క్షత్రదేవుండును రథారూఢులై సాత్యకినిఁ బృష్ఠభాగంబునఁ బాలించుచు నాతనివెనుక వెడలిరి. శకటంబు

లాపణంబులు వేశంబులు యానంబులు యుగ్యంబులు నావెనుక వెడలెను. అక్కడ వేయిమదగజంబులును పదివేలతురంగంబులును నల్పబలం బగుసైన్యంబును కోశసంచయంబును వాహంబులును కోష్ఠాగారంబులును గజసైన్యంబున రక్షించుచు మెల్లఁగా యుధిష్ఠిరుండు నడచెను. ఆయుధిష్ఠిరు ననుసరించి సత్యధృతియు యుద్ధదుర్మదుండగు సౌచిత్తియు శ్రేణిమంతుండును వసుధానుండును నిరువదివేలరథంబులును పదికోటులశ్వంబులును నిరువదివేలమదగజంబులును మఱియు ఈషద్దంతంబులు ప్రహారులు కులీనంబులు భిన్నకరటంబులు నగునట్టి పదివేలయేనుంగులును దోడ్కొని నడచిరి. యుధిష్ఠిరునిసేనాసప్తకంబునంగల మహాగజంబులన్నియును వర్షించుచున్న జీమూతంబులువోలె గండంబులనుండి మదధారలొలుకుచుండెను. ఆయేనుంగులన్నియు నడచుచున్నమహాపర్వతంబులంబోలి యుధిష్ఠిరుని వెనుకభాగంబున నడచె. ఆకుంతీపుత్త్రుం డిట్టిభీమంబగు బలంబుంగొని ధార్తరాష్ట్రుండగుసుయోధనునిపై కెత్తినడచెను. మఱియు నాతనివెనుక వేలు పదివేలు నసంఖ్యాకులు నగుపదాతియోధులు మహానాదంబు లొనరించుచు నాతనిసేనలన్నింటను నిండి నడచిరి. ఆసేనలందు వేలకొలందిగ భేరులును పదివేలశంఖంబులును హర్షాకులు లగునరులు మ్రోగింపందొడంగిరి. అని యిట్లు వైశంపాయనమునీంద్రుండు జనమేజయున కెఱింగించెను.

ఉద్యోగపర్వము సమాప్తము



చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము—1949.